

కవిచక్రవర్తి కంబకవి

శ్రీరామ.

# విజ్ఞప్తి.

ప్రథమ సంపుటము ముద్రణ మంత శ్రమ యొసఁగలేదు. కాలము సుభిక్షమై జనుల హృదయములు విశాలములై యుండెను. మిత్రుల సాయమున నది సులభముగ నెఱవేఱెను. తరువాతి కాలము తాఱుమాఱైనది. వానలు లేవు. బావులును త్రవ్వ కొలఁదిని చిత్రముగా మఱిమఱి నీరడుగంటుచుండెను. చిత్తూరుజిల్లా ప్రజలు పొంద రాని హృదయ విదారక దశను పొందిరి. తినఁగూడు త్రాగనీరు కఱవయ్యె. పల్లెటూళ్లలో ముప్పాతిక మువ్వీసము జనము గంజికేంద్రములవలన ప్రాణములు నిలుపుకొనఁగలిగెను. ఇట్టి స్థితిలో ద్వితీయ సంపుటము ముద్రణము తలపెట్టుటయు నపచారమగునని యూరకుండితి. ఇట్లుండ, ఎన్నఁడో కోరియుండిన కాగితములు కలకత్తానుండి వచ్చి దిగినవి. పైస చేతలేని యేను వేయిమున్నూట యేఁబదిరూపికలెటనుండి తేత్తు? వలదని వదలుట యెట్లు? అని డోలాందోళిత మనస్కుఁడనై యుండ నా ప్రాఁతశిష్యుఁడును గురుభక్తి యుక్తుఁడును ఆప్తుఁడునై యున్న శ్రీ L. G. వెంకటమునినాయఁడు తన కెన్నియో చిక్కులుండినను ధైర్యవాక్కులాడి ధనసాహాయ్యముచేసి కాగితములను దించుకొనెను.

అట్టియెడ నెల్లూరఁ బ్రతి వత్సరము జరపు తిక్కన వర్ధంతికి శ్రీ శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు నన్ను (7—3—53) పిలిపించి నూటపదునాఱు లొసఁగి సమ్మానించిరి. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు మఱునాఁడు కంబరామాయణము నందలి కొన్ని ఘట్టములు చదువఁగోరిరి. విన్నవారందఱు సంతసించి రెండవభాగముకూడ త్వరలో అచ్చగుట మేలని యభిప్రాయము లొసంగిరి. అచ్చటి న్యాయవాదులును నరసులు నగు శ్రీ ఎం. సుబ్బరావుగారు (బి. ఏ., బి. ఎల్., అడ్వొకేటు) ఇట్టి సద్గ్రంథముల కెన్నింటికో సాయపడిన శ్రీ తి. రామిరెడ్డిగారే దీనికిని పూనుకొనఁగలరని యాశించుచుంటిమనిరి. దానికి శ్రీ రెడ్డిగారొక చిఱునవ్వు కటాక్షించిరి. అది అంగీకార సూచకమో మఱియేమో అప్పటి నామంద బుద్ధికందలేదు.

ఇయ్యది జరగిన మఱి పదిదినములలో మదరాసున, కారైకుడివాసులు కంబ కవిభక్తులు నగు శ్రీ. సా. గణేశన్‌గారు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని సందించు తఱిఁ దామేఁటేఁట నడపుచున్న కంబన్ తిరునాళ్లకు ఆహ్వానింపఁగా [illegible]

శ్రీరామ.

# కంబరామాయణము.

(ఆంధ్రానువాదము.)

---

## ద్వితీయ సంపుటము

(సుందర, యుద్ధకాండములు)


గ్రంథకర్త:

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి


---


చిత్తూరు

శ్రీ విక్టోరియా జూబిలి ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1953

మూల్యము 12-8-0.

కంబె కంబరామాయణము నాంధ్రీకరించియున్న మా శ్రీరాములురెడ్డిగారిని పిలుచుట అన్నివిధముల ప్రయోజనకరము కదా ?' యనుచు నాతఁ డపరిమిత మోద మంది నాఁడే పెద్దయుత్తర మొండు వ్రాయుచు తంతులపై నన్నువారి తిరునాళ్లకు పిలిపించి యతిథి సత్కారములతోడ నామహాసభలో (28—3—53) 'మహా దాతలు' 'కుబేరులు' అని విఖ్యాతి గడించిన శ్రీ డాక్టరు అళగప్పసెట్టిగారి హస్తముల మీఁదుగా నాకొక్క కనకాంబర మొసఁగి సత్కరించె. ఆసభకు దక్షిణ దేశమందంతట నుండియు మహానాయకులు పండితులు కవులు నాలుగైదు వందలకు పైఁగా వచ్చియుండిరి. ఆ యందఱితో నాకు పరిచయ భాగ్యము లభించినది. వేలకొలఁది నిండిన ఆ సభ జరగిన నాలుగు దినములు నన్ను స్వర్గ సభావాసు ననిపించినవి.

ఇంతటి సన్మానమునకు కారకులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారే కద! యని వారికొక కృతజ్ఞతా లేఖ వ్రాయుచు కంబరామాయణము ద్వితీయ సంపుట ముద్రణ మొండు రెండు వారములలో నారంభింప యత్నించుచున్నాఁడనని సూచించితి. ఆయుత్తరమును వారి మామగారగు శ్రీ తి. రామిరెడ్డిగారు తిలకించి రెండువేల రూపికలు (Draft) పంపుచు 'దీని నుంచుకొని ముద్రణ మారంభింపుఁడు. కొఱవడినది మరల నంపెద' మని వ్రాసిన లేకను గాంచి యాశ్చర్యచకితుఁడనై 'లోకము కోరకున్నను ఉపకరించుచుండుట ఘనుల లక్షణము కదా!' యని నన్ను నేన సమాధాన పఱచుకొని యీ ముద్రణము వ్యయశ్రమము నుంతేని లేక నెఱవేర్పఁగలిగితి. కారైక్కుడి సమ్మాన వృత్తాంతము అన్ని ఆంగ్ల పత్రికలును ఛాయాచిత్రములతోడ అన్ని అఱవ పత్రికలును వెల్లడించినవి. అది కాంచి 'తిరువాన్కూరు రెడ్డియార్' ఐక్య సంఘమువారు నా పరిశ్రమము శ్లాఘించుచు నూటయొక్క రూపికలు కానుకగా నంపిరి. అంతకు మున్నె నే చెన్నరాష్ట్ర ప్రధానామాత్యులుగా నుండిన మాననీయులు శ్రీ ఓమందూరు పెద రామస్వామి రెడ్డిగారొక నూటపదునాఱు రూపాయ లంపిరి. ప్రథమ సంపుట ముద్రణానంతరము నూట పదునాఱులు పంపిన రాజపోషకులు.

శ్రీమతి ఇనుగుర్తి జానకమ్మగారు, పరమేశ్వర మంగళము.

శ్రీ T. N. విశ్వనాథరెడ్డిగారు, (M. P.) మదనపల్లె.

ఏఁబది రూపికలంపిన పోషకులు.

శ్రీ L. G. వెంకటమునినాయఁడుగారు, చిత్తూరు.

,, G. బాలగురప్పనాయఁడుగారు, చిత్తూరు.

,, D. రామలింగారెడ్డిగారు, విజయకుమార ఆయిల్ మిల్స్, తిరుత్తని.



విద్యాతోషకులు

శ్రీ శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు

నెల్లూరు.

ఇరువది యైదు రూపికలంపిన ప్రోత్సాహకులు.

శ్రీ క. సుబ్రహ్మణ్యపిళ్లగారు, పట్రపల్లి.
,, క. నాగరత్నపిళ్లగారు, పట్రపల్లి.
,, క. నాగరత్నపిళ్లగారు, పుత్తూరు.
,, పెద్దబ్బనాయఁడుగారు, మోదుగలపల్లి.
,, S. నరసింహారెడ్డిగారు, సంతపల్లి.
,, మణియం శ్రీరాములురెడ్డిగారు, పుణ్యసముద్రం.
,, క. సుబ్రహ్మణ్యపిళ్లగారు, పుణ్యసముద్రం.
,, వెంకటసామిరెడ్డిగారు, ద్వారకాపురం.
,, దొరసామిరెడ్డిగారు, ద్వారకాపురం.
,, అగరం రఘునాథరెడ్డిగారు, అగరంపల్లి.
,, ఎ. కృష్ణమనాయఁడుగారు, అగరంపల్లి.
,, గాం. గోవిందశెట్టిగారు, కాణిపాకు.
,, క. సుబ్రహ్మణ్యపిళ్లగారు, కాణిపాకు.
,, జి. శ్రీనివాసులునాయఁడుగారు, కాకర్లవారిపల్లి.
,, జి. నల్లచెంగమనాయఁడుగారు, కాకర్లవారిపల్లి.
శ్రీ గ. చిన్నయ్యనాయఁడుగారు, తిమ్మోజిపల్లి, (కాణిపాకు).
,, మణియం. నారాయణసామిరెడ్డిగారు, చినకాంపల్లి.
,, కరింరెడ్డిగారు, చినకాంపల్లి.
,, రా. చంద్రయ్యనాయఁడుగారు, మారేడుపల్లి.
,, మొ. చిన్నచిన్నమరెడ్డిగారు, పుత్తూరు.
,, మణియం. మొ. జయరామరెడ్డిగారు, పుత్తూరు.
,, నడిపి. కృష్ణారెడ్డిగారు, పుత్తూరు.
,, కరణం. గంగాధరపిళ్లగారు, రేగల్లు.
,, చ. చెంగమనాయఁడుగారు, గారంపల్లి.

ఏఁబది రూపికలంపిన పోషకులు

శ్రీ ఎల్లత్రేపల్లి. దొరసామిరెడ్డిగారు, చినకాంపల్లి.
,, P. మునిరెడ్డిగారు, పులికల్లు.
,, K. మణ్ణిగంగారు, బెంగళూరు.

శ్రీ C. రాజగోపాలపిళ్లగారు, మైనూరు.

„ దేవరాజులురెడ్డిగారు, వెణ్ణంపల్లి మిట్టూరు.

„ D. కృష్ణమూర్తిరావుగారు, బి. ఏ. బి. ఎల్. అడ్వొకేటు, చిత్తూరు.

ఇరువదియైదు రూపికలంపిన ప్రోత్సాహకులు.

శ్రీ టి. నరసింహారెడ్డి, మట్టిపాడు, వాయల్పాడు తాలూకా

„ టి. సి. మల్‌రెడ్డి, మట్టిపాడు, „

శ్రీ శేషయ్యనాయఁడుగారు, మండీ, చిత్తూరు.

„ P. తులసిరెడ్డిగారు, వెణ్ణంపల్లి మిట్టూరు.

„ మణియం తిరుమలప్పనాయఁడుగారు, వద్రాంపల్లి.

„ R. శంకరరావుగారు, బి ఏ. బి. ఎల్. అడ్వొకేటు, చిత్తూరు.

„ G. శ్రీరామరెడ్డిగారు, చింతపర్తి.

„ P. రామనాథరెడ్డిగారు, సింహరాజపురము, రామకృష్ణరాజుపేట.

శ్రీ అప్పిరెడ్డిగారు, నాగేంద్రపురము.

„ నటకల రామనాథంశెట్టిగారు, జవిళి వ్యాపారులు, చిత్తూరు.

„ T. K. T. వీరాచారిగారు, బి. ఏ. బి. ఎల్. అడ్వొకేటు, చిత్తూరు.

„ K. సదాశివశెట్టిగారు, జవిళి, చిత్తూరు.

„ బీరం రామారెడ్డిగారు, పర్లపాడు.

„ గోవిందరాజులునాయఁడుగారు, సంతపేట, చిత్తూరు.

„ వాటంబాటి వెంకటరమణయ్యశెట్టిగారు, చిత్తూరు.

„ అ. చిన్నసామినాయఁడుగారు, పరమేశ్వరమంగలము.

„ K. చిరంజీవులుగారు, కాగితములవ్యాపారి, 4. బందరువీథి, మదరాసు.

„ G. రఘునాథరెడ్డిగారు, గుండ్లపల్లి.

„ G. V. గోవిందసామినాయఁడుగారు, Mg. Agent, S. V. Mills Ltd., ఉడుమలపేట, కోయంబుత్తూరుజిల్లా.

„ N. రామచంద్రశెట్టిగారు, జవిళివ్యాపారులు, చిత్తూరు

„ మిట్టా కృష్ణయ్యశెట్టిగారు, బి. ఎ., అండు బ్రదర్సు, చిత్తూరు.

వీరి యపారాదరమును శ్లాఘించుచు వీరి కీర్త్యభివృద్ధి కాయురారోగ్య భాగ్యాదికములొసంగుఁ గాత మని శ్రీరామచంద్రుని ప్రార్థించుచున్నాఁడను.

మదీయ హితైషులు ఆప్తబంధువులునగు శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు నన్నత్యంత ప్రేమతో మైసూరికిఁ బిలిపించికొని కంబరామాయణము నకు పీఠిక వ్రాసియిచ్చిరి. వారు రెండవ భాగ ముద్రణ ప్రతిని చూడకయే పరమ పద మలంకరించినందులకు మిక్కిలి చింత గలిగెను. కాలము నడ్డుకొన నెవరి వశము? వారి యాత్మ పరమ పదమున నున్నతశాంతి సౌఖ్యమునందుఁ గాతమనుట కంటె చేయఁగల దేమి కలదు?

మహాభారతమును భాసమహాకవి నాటకములను అధ్యాత్మ రామాయణమును కంబకవి చక్కఁగా ననుసరించెననుటకుఁ గొన్ని యుదాహరణములు కలవు.

భగదత్తుని ఏనుఁగునుచూచి యుద్ధకాండమున ఉన్మత్తుని ఏనుఁగును పిశాచుని గుఱ్ఱమును కల్పించె ననఁదగియున్నది. భాసుని అభిషేకనాటకమున నొకచో వాలి సముద్రమును మథించెనని కలదు. కంబకవి వాలి పౌరుషము నభివర్ణించు పట్టులందా విషయము నుటంకించి యున్నాఁడు.

పటలములకడ వ్రాయఁబడిన యంకె లా పటలము నందున్న అఱవ పద్యముల సంఖ్యలు.

ప్రథమ సంపుట మందొండు రెండు మార్పులు కావింపఁబడినవి. అవి, ౨౧ పుట ౧౭౨ పద్యమున మొదటి రెండవ పాదములు.

> అధికమై యుప్పొంగు ♦ నర్థి పాథోరాశి
> నీవియఁగ తెప్పచే ♦ నీఁదినాఁడు
> జ్ఞానార్ణవంబు ననంఖ్యాక సద్గ్రంథ
> తతియను నౌకచే ♦ దాఁటినాఁడు

అనియు, 333 పుట, ౬౩౧ పద్యము మొదటిపాదమును

> నరవిన్నమ్మది నూరకుండఁ జనదో ♦ సాధింపఁగా రానిచో

అనియు, నాల్గవపాదమును

> కృశించి కందితిలలో నీర్ష్యాళువుల్ గెల్తురే?

అనియు మార్చుకొననగును.

# ప్రథమ సంపుటమందే మఱికొన్ని అచ్చు తప్పులు, నాతప్పులును.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| (9) (దక్షిణ) | 7 | రాలు | రాల్చు |
| (14) ,, | 22 | లక్షణమమ | లక్షణమను |
| (16) ,, | 8 | సంచెమా | సంచెపా |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౦౩ | ౨ | దరుణి | దరుణీ |
| ౧౨౮ | ౫ | డాల్చివ | డాల్చిన |
| ౧౩౦ | ౧౧ | సరో | సరో |
| ౧౪౧ | ౫ | శిర్వ | శిర్ష |
| ౨౯౬ | ౧౨ | బల్కుచుఁ | బల్కుచు |
| ౩౦౬ | ౧౯ | ద్ర | ద |
| ౩౨౮ | ౧ | బాగుగా | బాగుగ |
| ౩౫౧ | ౨౪ | ససమా | సమా |
| ౩౬౬ | ౭ | డెలియం | డెలియఁ |
| ౩౭౪ | ౩ | లందుడి | లందుండి |
| ౩౭౯ | ౨౨ | మింగ్ర | గ్రమింగ |
| ౩౮౦ | ౨౩ | మరణింస | మరణింప |
| ౩౯౮ | ౨ | కందోయియుఁ | నేత్రద్వయిఁ |

## శుద్ధాశుద్ధ పత్రికలో మఱికొన్ని

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| xvii | ౨౯ | శారదా | భారతీ |
| xviii | ౨౧ | మాంధ్ర | ఆంధ్ర |
| ౬౪ | ౭ | చెడ | బెడ |
| ౭౯ | ౨౧ | కశశ | కతన |
| ౭౯ | ౨౭ | వచ్చిస | వచ్చిన |
| ౮౯ | ౨౮ | సత్త్వాడై | సత్త్వాలై |
| ౧౦౪ | ౩౨ | పఁగా | ప గా |
| ౧౧౪ | ౨ | లఘిం | లంఘిం |
| ౧౧౮ | ౨౧ | మలయు | మలయ |
| ౧౨౫ | ౧౪ | నమ్మాన్య | సమ్మాన్య |
| ౧౭౭ | ౨౯ | తోరఁపు | తోరపుఁ |
| ౨౦౬ | ౧౧ | దుష్కృథా | దుష్కృథా |
| ౨౧౦ | ౭ | చనుడెం | చనుదెం |
| ౨౧౩ | ౨ | నంసారి | సంసారి |
| ౩౦౩ | ౧౯ | యిద్ర | యింద్ర |
| ౩౨౬ | ౨౪ | దోరంవు | దోరంపు |
| ౩౯౯ | ౨ | పోయఁగి | పోయు కి |
| ౪౧౭ | ౭ | యువయం | యువయువం |
| ౪౫౪ | ౩౦ | ఖగేద్ర | ఖగేంద్ర |
| ౪౬౨ | ౨౭ | విభుండు | మృగేంద్ర! నీవు |
| | | తామరణమం | మృతినం |

## ౨౪౬ పుటలో క్రింది పద్యమిట్లు మార్చుకొనునది.

చ॥ అని మఱిచేరఁదీసి ప్రియ • మారఁగ బిగ్గఁ గవుంగిలించి మైఁ
బుణుకుచుఁ దేపతేపలుగ • బొంగెడు బ్రాఁతిని బాష్పపూర్ణ వీ
క్షణములఁ జూచిచూచి పెలు • చం దగ నేఁటికి సోదరత్వ మి
ట్లని పనవంగఁ దమ్ముఁడడ • లాఁపఁగనేరక వ్రాలె నన్నపై. ౧౨౩౫

పండిత శ్రేష్ఠుల యభిప్రాయములు తెప్పించి ముద్రించు కోరిక నాకు లేదు. అట్లయ్యు నొండు రెండు తప్పని సరిగ వేయవలసివచ్చె. నాకెల్ల విధముల నిట్లు తోడుపాటు చూపి గౌరవించి ప్రోత్సహించిన పూజ్యులకు నా హృదయపూర్వక కృతజ్ఞతాభి వందనము లర్పించుచున్నాఁడ. వారికి జగద్రక్షకుఁడగు శ్రీరామ చంద్రమూర్తి ఇతోధిక చిరాయురున్నతు లొసఁగుఁగాత.

ఇట్లు

సుధీ విధేయుఁడు,

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి.





డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి గారు.

శ్రీరామ.

# పీఠిక.

జాతిచేత తెనుఁగువారును అఱవవారును ఒక్కరయని శాస్త్రజ్ఞుల సిద్ధాంతము. వీరిరువురకును ఎన్నియో తరముల క్రిందట సామాన్యమైన తెగ ఒక్కటి యుండెడిది. ఆయాదిమకాలములో దానిపేరేద్దియో అది యెంత విస్తీర్ణముగ మన దేశమందు వ్యాపించియుండెనో నిర్ధారణముగ నిప్పు డెఱుంగఁజాలము. సింధునదీ తీరమున మూడునాలుగువేల యేండ్ల క్రిందట ప్రసిద్ధిగ నుండినట్లు మొహెంజో దారో ఇత్యాదిస్థలముల నిప్పుడు బహిరంగ పఱుపఁబడిన పురాతనవస్తు సామగ్రులు ఇత్యాది చిహ్నములచే ఇది దేశమంతట వ్యాపించియుండిన జాతియని యేర్పడియెడిని. దాక్షిణాత్యము మాత్రము కాదు. ఈ జనము నిప్పటివారు ద్రావిడులని పేర్కొనుచున్నారు. ఈ మహా వృక్షముయొక్క శాఖలో అనేకములు. ఎన్నియని, ఎంతదూరము ఎన్ని దిక్కుల వ్యాపించినవని, యిప్పుడు నిర్ధారణచేయ వీలులేదు. అయిన, ఒక్కటి మాత్రము నిస్సంశయముగ నిజము. అనఁగా తెనుగువారు అఱవవారు నీశాఖలోని వారని.

ఇట్లు జాతిచేత అఱవవారితో ఐక్యము నెక్కువచెందిన వారయ్యును ఆంధ్రులకు విద్యాది నాగరకతా సంపర్కము ఆర్యులతోనే యధికము. ఆర్యుల అమోఘమైన నాగరకతను గుఱించి విస్తరించి యిటఁ జెప్పవలయుట అనావశ్యకము. వారిభాష, వారివేదములు, ఉపనిషత్తులు, భారత రామాయణాది వీరకావ్యములు, భాసకాళిదాస భవభూతి శూద్రకాది మహాకవుల నాటకములు, వారిసంఘ నిర్మాణము, ధర్మశాస్త్రములు మనదేశము నందితర నాగరకతల నంతర్ధానమందునట్లు నిజప్రకాశప్రభావములచే చేసినవి. ఇందున ఆశ్చర్యముగాని విషాదముగాని మనము చెందఁబనిలేదు. సంస్కృత భాషామాహాత్మ్యము దానియందుద్భవించిన మాగధి మొదలగు భాషల మహనీయత లోకమంతయు నాకర్షించియున్నది. ఆర్యులయు వారియందుండి యుద్భవించి నూతన మార్గముల లోకప్రసిద్ధిని వ్యాప్తిని చెందిన బౌద్ధులయు జైనులయు వాఙ్మయము, నాగరకత, వర్ణము మతము మొదలైన భేదములచే అన్యజాతులనఁబడు పాశ్చాత్యులలో సైతము గౌరవాదరణములకు పాత్రములై యున్నవి. ఇంక సమీపస్థులమైన మనవిషయము చెప్పనేల? ఆర్యులలో

సాయుజ్యమందిన జాతులలో ఆంధ్రులొక్కరు. మన దేశములో ఒక్క తమిళులు మాత్రమే తమ విశిష్టతను సంపూర్ణముగా కోలుపోక ఇంకను నిలుపుకొనియున్నారు.

ఆంధ్ర వాఙ్మయములోని రచనలలో ముక్కాలు మువ్వీసము సంస్కృతానుకరణములు, అనువాదములు. భారతము భాగవతము ప్రబంధము లనఁబడు మనువసుచరిత్రాదులు ఇతి వృత్తమునందు సంస్కృతము ననుకరణములు. స్వతంత్రించి వ్రాయఁబడిన గ్రంథములు మనలో చాల తక్కువ. ఒక్క గ్రంథములే కావు. తత్త్వములును ఆధ్యాత్మికాది విచారములును స్వాయంభవములైనవి లేవు. ఈ మాటకు అపవర్గములైనవారు నాకుఁదెలిసి యిరువురు మాత్రమే. వేమన్న, పింగళి సూరనార్యుఁడు. అనగా వేమనపద్యములు, కళాపూర్ణోదయము తప్ప తక్కిన మన కృతులన్నియు ప్రతిబింబములు ప్రతిధ్వనులే. వేఱుకావు.

తమిళులు తమ విశిష్టతను అనేకవిధముల నమోఘముగఁ బ్రదర్శించి యున్నారు. కావ్యసృష్టిలో వారు అద్వితీయులైన ప్రతిభావంతులు. తత్త్వశాస్త్రమున శైవసిద్ధాంతమును ప్రతిష్ఠించిన ఆధ్యాత్మిక ప్రభావులు. నీతి బోధనమందు శ్రీవల్లువరు వ్రాసిన కుఱళను గ్రంథమునకు మించినది ప్రపంచమున నెద్దియు లేదని చెప్పవచ్చును. పైవీనికి నిదర్శనముగా కొన్నింటిని స్థాలీపులాక న్యాయముగా పేర్కొనియెదను.

కావ్యములలో శిలప్పదికారము, మణిమేఖల అను వీనికి మించినవి ఉండుట అరిది. తెనుఁగున వానికి సమానమైనవియు లేవు. శతాంశమైనను పోలునవి లేవని మొగమోటము లేక పలికినను సత్యవికల్పము కలుగనేరదు. శైవ సిద్ధాంత గ్రంథములలో ముఖ్యములైనవి తేవారములు. నేను చిత్తూరు హైస్కూలులో చదువుచున్నప్పుడు శ్రీరంగసామప్ప అను తమిళ విద్వాంసుని మొట్టమొదటి ద్రావిడోపాధ్యాయునిగా నియమించిరి. వారికి మాతండ్రిగారు కట్టమంచిలో మాయిండ్లలో నొకదాని నివాసమున కిచ్చిరి. బాడుగ పుచ్చుకొనలేదు గాని వారివల్ల మాకుఁ గలిగిన ప్రయోజన మింతింత యని చెప్పఁజాలము. వారు తేవారములు, శ్రీ ఆండాళమ్మ పాశురములు, పెరియ పురాణము మొదలగు గ్రంథములనుండి అప్పుడప్పుడు మాకు చదివి వినిపించెడు వారు. అదియ మొట్టమొదట నాకు తమిళుల విశిష్టతమ ఔన్నత్యమును గుర్తించుటకుఁ గలిగిన అవకాశము. పిమ్మట కనకసభాపతిచే వ్రాయఁబడిన వేయేండ్లక్రిందటి తమిళుల చరిత్రము, కృష్ణస్వామయ్యంగారు, మాధవయ్య, దీక్షితులు మొదలగువారు పరివర్తించి తెలిపిన మణిమేఖల, శిలప్పదికారము మున్నగు గ్రంథములవలన తమిళుల భావగాంభీర్యమును కొంతకు కొంత తెలిసికొనువాఁడనైతిని. తంజావూరు పుస్తక భాండాగారములోనున్న ముద్దుపళనిచే తెనిఁగింపఁబడిన ఆండాళమ్మ పాశురములను కొన్నిటిని చదివి ఆనంద తన్మయత్వము

చెంది ఆపాశురములన్నింటిని తెనిఁగింపవలయునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని ప్రార్థింపఁగా వారు అట్లే యొనర్చి ఆంధ్రులకు మహోపకారముతో మహానంద సిద్ధిని గలిగించిరి.

ఆంధ్రుల చరిత్రములను విమర్శించి చూచినచో ఒక్కవైపరీత్యము గోచరింపకపోదు. సంస్కృతమునుండి ఆర్యమత గ్రంథములను కావ్యములను నాటకములను అట్లు తెనిఁగించినవారు ద్రావిడ వాఙ్మయమునేల మనకు ప్రదర్శింపక పోయిరో కారణము మృగ్యము. సంస్కృతమునుండి తెనిఁగించుటే కాదు. తెనిఁగించిన వానిన పునః పునః తెనిఁగించుట. రామాయణమునకు శాకుంతలమునకు తర్జుమాలెన్నియున్నవో యోచింపుఁడు. ఇంకను ఎన్నికానున్నవో! అఱవమునుండి ఏల యారీతిని తుదకు ఆ జగన్మోహన మూర్తియైన మణిమేఖలనైన తెనిఁగించి ప్రత్యక్షపఱుపక పోయిరో! రుచిలేకయా? స్మర్శలేక పోవుటచేతనా?

సంస్కృతమునుండి అట్లాంధ్రీకరించిన వారు పాళీ మున్నగు ప్రాకృతములనుండి బౌద్ధమత గ్రంథములను తెనిఁగింపరైరి. తుదకు కాళిదాసునకు మార్గదర్శకుఁడైన అశ్వఘోషుని బుద్ధచరిత్రమును గూడ మనవారికి తెనుఁగుచేసి తెలుపరైరి. కారణమేమియై యుండవచ్చును ఇట్టి నిరోధములకు?

నాకుంజూడ మతభేదమని తోఁచెడిని. ఇది తప్పుగాదు. దోషముగాదు. పాపమునుగాదు. మఱి సహజమును. ఒకేవిధముగఁ జూచిన సద్ధర్మము నైనయది. హిందువులలో దృష్టిని బట్టి మతమేర్పడుటకంటె మతమును బట్టి దృష్టిపోవుట ఎక్కువగ వ్యాప్తము. మతమును బట్టి దృష్టిపోవుట మనలోను అందఱిలోను ఎక్కువ అలవాటు. దృష్టినిబట్టి మతము పోవుట తక్కువ. మొత్తము మీఁద ఆంధ్ర వాఙ్మయము మంత్రము లట్లు బ్రాహ్మణాధీనము. అందు వలననేగదా వీరశైవ కవులైన నన్నెచోడుఁడు పాల్కురికి సోమనాథుఁడు మొదలగువారికి మనయందు వ్యాప్తి లేకపోవుట. ఇటువంటిదే యేమో ద్రావిడ వాఙ్మయమును మనము అస్పృశ్యమని తలంపక పోయినను స్పృశింపకుండుటకు హేతువు. హేతువెట్లున్ననేమి? మనకుఁ గలిగిన విఫలత్వము చాల విషాదకరము. తమిళులనుండి అన్నదమ్ములట్లు మనము హక్కుమై దాయభాగముగ ననుభవింప వలసిన శైవ సిద్ధాంతము ఆళ్వారుల చరిత్రములు పెద్దపురాణము ఇత్యాది జ్ఞానభక్తిరసములను పోఁగొట్టుకొంటిమి. మఱియు వీనికంటె ముఖ్యమైనది ఆనందము. అనగా సాహిత్యానందము. ఆ యానందము నమేయముగఁ బ్రసాదింపఁగల మణిమేఖలాది మహోత్కృష్ట సాహిత్యానందము ననుభవింప నేరమైతిమి. ఇయ్యది మన దురదృష్టము. తమిళులియ్యకపోవుటచేఁగాదు. మనము గ్రహింపక పోవుటచే.

సాహిత్యమునందు తెనుఁగుభాష ఇతర భాషలతోఁ బోల్చి చూచిన యెడల చాల వెనుకఁబడినదని చెప్పక తప్పదు. ఈ లోటు సంగీతమునందు నష్టపరిహారము సంపూర్ణముగా చెందియున్నది. భాషావేత్తల నిర్ణయ ప్రకారము సంగీతమునకు ప్రశస్తముగ ఎత్తిన భాషలు రెండే. అందొక్కటి తెనుఁగు. రెండవది ఇటాలియన్. ఈ ఫలసిద్ధికి హేతువులు నాలుగు.

మొదటిది మనయందు సరళము లెక్కువగ నుండుట. రెండవది అచ్చు లెక్కువగా నుండుట. మూడవది సంస్కృతమునకు నించుమించు సమానముగా ఏవో కొన్ని అపురూపములగు స్వరములకుఁ దక్కఁ దక్కిన స్వరముల కన్నింటికిని విస్పష్టముగ సూచింపఁగల సంజ్ఞలుండుట. సంజ్ఞాపరిచ్ఛేదమునందు సంస్కృతమునకు రెండవది తెనుఁగు. అఱవ మధ్వానము. నాల్గవది గురులఘువులకుండు భేదమును వ్రాయునప్పుడే విదితపఱచుట. ఇంగ్లీషునందు చెప్పి నేర్చుకొనవలయునేగాని చూచి యుచ్చరించుట అసాధ్యము. ఈ నాలుగు హేతువులవలనఁ గలిగిన ఫలము శ్రవణానందము. దానినుండి కలుగునట్టిది ప్రాణసుఖము.

తమిళ గ్రంథములు తెనిఁగించి మన విద్యావికాసమునకు దోహద మొనర్చిన వారిలో కాలక్రమమునుబట్టి చూచిన ఈ కంబరామాయణము ననువదించిన నామిత్రులు బంధువులునైన పూతలపట్టు శ్రీ రాములురెడ్డి ప్రథముఁడు కాఁడు. పూర్వులున్నారు. అనఁగా ఇందు సంతతి పారంపర్యము కలదని కాదు నా యభిప్రాయము. కొన్ని యేండ్ల క్రిందటను విశాల దృష్టి విశాల హృదయముగల ఆంధ్రులు కొందఱు తమిళ భాషావిశారదులు కొద్ది తమిళ గ్రంథములు తెనుఁగునకు పరివర్తించి ప్రకటించియున్నారు. మనదోషమో దురదృష్టమో వానికి మనయందు అర్హతకొలఁది ప్రాధాన్యము ప్రాబల్యము కుదురలేదు. ఇఁకముందైన మనము సంస్కృతముతోఁగూడ తమిళమును ఆక్రమించుకొని భాషా పరాక్రమశక్తిని ప్రకటింతుముగాక.

ఇఁక ప్రకృతమునకు వత్తము. పూతలపట్టు శ్రీ రాములురెడ్డిలోని విశిష్టత యేమన, ఒకటి వీరనేక ద్రవిడ గ్రంథములను తెనిఁగించియుండుట. వీరికి అఱవముతోడి సంధి బహుళము. వీరాంధ్రులకు మనఃపుష్టికై యొసఁగిన అఱవ నైవేద్యము లివ్వి.

1. శ్రీ వల్లువరుగారి 'కుఱల్' అను నీతిబోధక గ్రంథములలో లోకఖ్యాతి గడించి ప్రాథమిక వర్గమునకుఁ జెందిన మహోత్కృష్ట సద్బోధక కావ్యము.

2. నాలడియార్ (చతుష్పది) అను పేరెన్నిక గన్న కుఱళును బోలిన నీతిమాల. ఇది వ్రాతలోనున్నది కాని యింకను అచ్చుపడ లేదు.

3. సన్మతి (సన్మార్గప్రబోధిని) ముఖ్యముగా బాలకుల కత్యంతోపయుక్తమైన పాఠ్యగ్రంథము.

4. కొన్రైవేందర్. ఇందలి యితిహాస మేమన శివుఁడు తన జటాజూటమున చాల ప్రీతితో ధరించుకొను పూలఁట యివ్వి! విషయము నీతిబోధ. ఈ అఱవ వారికి, మనకు శృంగారమెట్లో, నీతిబోధ అట్లున్నదని తోఁచెడిని. దౌర్భాగ్యులు! లోక సుఖమునందు మనకుండుఆసక్తిలేనివారు. పరధ్యానము లోకధ్యానము ఎక్కువ. ఇదే కారణమేమో కొంతవఱకు వారు పొరుగువారైన ఆంధ్రులచే జయింపఁబడుటకును మనవారు తంజావూరు మధుర మొదలగు స్థలములందు వారినేలియుండుటకును.

5. కంబరామాయణము. ఈ మహోన్నత గ్రంథము నఱవమున రచించిన కవి కంబుఁడు. ఈయన వ్రాసిన గ్రంథము విషయమునందు లోకారాధ్యము. శైలియందు లోకానందము. అట్లుండియు శ్రీరంగములోని వైష్ణవోత్తములు దీని నంగీకరించుటకు సమ్మతింపలేదఁట! అప్పుడు వారిదాక్షిణ్యము సంపాదింపఁ గొన్ని వైష్ణవ గ్రంథము లితఁడు వ్రాసెనఁట! దానిపై వారు దీని నంగీకరించి కంబుని గారవించిరని జనవదంతి. ఇది ఎంతమాత్రము నిజమో చెప్పలేను. ఇట్టి కతలు అనేకుల గుఱించికట్టుట మన ఆగమ సంప్రదాయము. సూత్ర మొకట్టి; మెడలు మెండు.

చిత్తూరుజిల్లాయందు కంబరామాయణము సామెత కెక్కినది. "ఏమిరా! కంబరామాయణము మాట్లాడుచున్నావు" అని పరిహాసము చేసినచో దానియర్థమిది. విపరీతములైన దీర్ఘవర్ణనలు చేయుచున్నావేల? అందును అసంబద్ధములు కథాప్రవాహమున కడ్డులైనవానిని. అనఁగా కంబమహాకవి కొన్ని కొన్నిచోట్ల విషయమునకంటె వర్ణనకే యెక్కువ ప్రాధాన్యమిచ్చినట్లు తోఁపఁజేయు ఘట్టములు మితము మీఱియున్నవని ఆరోపణ. ఇదియెంతమాత్రము విమర్శకులు సమర్థింతురో చెప్పలేను. నాకును ఈయారోపణలో కొంతసత్యమున్నట్లు తోఁచెడిని. ఇది నా పొరపాటు కావచ్చును. నా విభ్రాంతి కాఁబోలు! తమిళులకేమో ప్రతి పద్యము ప్రతివాక్యము ఆనందమొసఁగుట నేను ప్రత్యక్షముగఁ జూచియున్నాను. నేను క్రిస్టియన్ కాలేజిలో చదువునప్పుడు రెండవ స్టూడెంటు హాస్టలులో నానివాసము. నాసహవాసులలో ననేకులు ద్రావిడులు. అందొక్కరుఁడు కంబరామాయణ పారాయణ పరాయణుఁడు. నాకర్థముకాదు వదలిపెట్టుమని బతిమాలినను విడువక 'మీ తెనుఁగునకు మించినది మా అఱవము' అని నాకు నిరూపించుటకై బలాత్కరించి కంబరామాయణము చదివి ఇంగ్లీషున వివరించెడివాఁడు. ఆవర్ణనా ఘట్టములు నాకెంతవిసుగో వానికంత సుఖము మహానందము. "లోకోభిన్నరుచిః భిన్నభావః"

కంబుఁడు వ్రాసినది అఱవలకు. ఆంధ్రులకుఁగాదు. వారికి సంపూర్ణముగ నచ్చినప్పుడు మనకేమి హక్కున్నది ఆక్షేపించుటకు ? తమిళుల కంబరామాయణ మనఁగా సాహిత్యచక్రవర్తిత్వమునంది కిరీటము దాల్చిన మహత్తు.

శ్రీ రాములురెడ్డి పరివర్తనము సంస్కృతమునుండి కావింపఁబడు పరివర్తనముకంటె చాల కష్టమైనది. సంస్కృతమునకు తెనుఁగు పురాకృతముతో పరిసమాన మనదఁగు సమీప సంబంధముగల భాష. జాతిచే మనము ద్రావిడుల మయ్యును విద్యాది సంపర్కములచే అఱవలకంటె ఆర్యులకు సమీపస్థులము. కొన్ని గీతములు అక్కరలు సీసములు తక్కఁదక్కిన మనఛందస్సులన్నియు తత్సమములు. ఇఁక భాషయన్ననో అమేయముగా సంస్కృత ప్రతి బింబము. సంస్కృత వృత్తములును, అందలి పదములను మార్పులేకయు కొంత మార్పుచేసియు మన సాహిత్యమునందు కవులు ప్రవేశ పెట్టుట సులభమైనపని. 'గమికర్మీకృతనైక నీవృతుఁడనై' ఇందు 'డనై' మాత్రమేగదా తెనుఁగు !

"అశ్రాంత శ్రుతి పాఠపూత రసనా విర్భూత భూరి స్తవా
జిహ్మ బ్రహ్మముఖౌఘవిఘ్నిత నవస్వర్గక్రియా కేళినా"

అను దానిని,

వేదాభ్యాస విశేషపూత రసనా విర్భూత భూరి స్తవా
సాద బ్రహ్మ ముఖౌఘ విఘ్నిత నవ స్వర్గక్రియా కేళిచే

అని తెనిఁగించుటలో కవిచేసినది యతి ప్రాసముల కొఱకైన యలంతి మార్పే గదా !

ఆదిని తెనుఁగునకును అఱవమునకును సన్నిహిత సంబంధమెక్కువగ నుండి యుండక తప్పదు. కాలక్రమమున మనజీవితముతో సాహిత్యమును ఉత్తర వాహినిగా మాఱినది. దక్షిణవాహినిగను ఉండి యుండిన రెండు విధములను లాభము చెందిన వారమై యుందుము. గతమునకు వగవనేల ? అటుకాకపోయె. అఱవములో ఛందఃపద్ధతి భిన్నము. వారి సాహిత్యములోని భావయు ప్రకృతి ప్రత్యయ సంబంధములును వేఱు. అట్లే ఎరవలి తెచ్చి పెట్టుకొనుటకు సాధ్యము కాదు. మనస్త్రీల కమ్మలు మలయాళస్త్రీల చెవులకువలె! ఇక్కడ నిజమైన పరివర్తన క్రియ ఆవశ్యకము. అట్లట్లే మార్పులేక వినియోగింపఁజాలము. కాఁబట్టి ఇది నిజమైన భాషాంతరీకరణము. సుగమమైనపని కాదు, దుర్గమము దుస్తరము.

ఇట్టి యీ క్లిష్టకళను ఎంత చక్కగా అనాయాసమని తోఁపించునట్లు శ్రీరాములురెడ్డి చేసియున్నాఁడు! అది ఉభయ భాషావేత్తలకుఁగాక యితరులకు సంపూర్ణముగా విదితము కాదు.

సాహిత్యములోను సంగీతమునందుంబలె మనకు వలసిన పరమార్థము సౌఖ్యము, ఆనందము. యాథార్థ్యమంతగఁగాదు. ఈ తత్త్వము ప్రకారము చూచిన యెడల మా శ్రీరాములురెడ్డి కంబరామాయణము స్వతంత్రముగ రచించిన కృతి యట్లు ఐక్యమును వహించి ఏకధారగాఁ బ్రవహించి పాఠకులకు సంతతాహ్లాదకారి యై యున్నది. కంబుని స్మరణలేకయే దీనిని చదివి ఆనందింపవచ్చును. బింబమునకు ప్రతి బింబమాయను విచారణ కవకాశమీయనట్టి ఆనందకరమైన కళ. దీనిని చదివి నవుడు చూచినవుడు హృదయమిందే నిమగ్నమై లీనమై యుండుటయ దీని మాహాత్మ్యము. ఇదియే కవితా కళయొక్క సిద్ధియు పరిపూర్ణత్వమును.

శ్రీరాముఁడు సేతువును గట్టి లంకకు మనకు యాన సౌకర్యము గల్పించి నాఁడు గాని యది సంహారక్రియకై. ఈ శ్రీరాముఁడు ఈ భాషాసేతువును గట్టి తమిళులకు మనకు పరస్పర విద్యాజ్ఞాన వికాసములకై సౌకర్యము గల్గించి యున్నాఁడు. ఆ సేతువును సముద్రము ముంచి మ్రింగివైచినది. ఈ వాఙ్మయ సేతువు ఆచంద్రార్కము శాశ్వతముగ నిలిచి అఱవలకు నాంధ్రులకు నాగరకతా సాంగత్యము ను పెంపొందింపఁగలదు.

పద్మప్రభాస,
చిత్తూరు,
2—2—1951.

ఇట్లు,
క. రామలింగారెడ్డి



శ్రీరస్తు.

# ఉదార ప్రశంస.

సీ॥ భువినెఱ జాణల ♦ పుట్టినిల్లనుపేరు
పొందిన నెల్లూరు ♦ పుట్టినిల్లు
సార్థకాఖ్యంబయి ♦ సౌధరాజంబు 'సు
దర్శన మహా' లనఁ ♦ దనరుచుండు
పారాయణము సదా ♦ భారతమ్ము గురుండు
తెలుఁగు తామరచూలి ♦ తిక్కయజ్వ
ప్రతి వత్సరము తిక్క ♦ వర్ధంతి పండిత
సమ్మాన కార్యముల్ ♦ సమ్మతములు
తే॥ ఎంతటి కృతార్థజీవి మ ♦ రెంత సుకృతి
తిక్కవర వంశవన లస ♦ ద్వీథి మొలచి
పండ్లతో నిండి పొలుపారు ♦ పారిజాత
వృక్షమయ్యారె శ్రీ రామ ♦ నృపవరుండు.

సీ॥ కరముల వేఁడిమిఁ ♦ గడఁకఁజూపి ధరణి
యలయఁ దపింపఁజే ♦ యని యినుండు
ఇంద్రు వాకిట నిల్చి ♦ యిచ్చమైఁ గొలువంగ
నిచ్చగింపని ధనా ♦ ధీశ్వరుండు
అలఘు జీవనదాన ♦ మమరంగఁ జేయుచో
నదరి గర్జిల్లని ♦ యట్టి ఘనుఁడు
కలఁకయు హెచ్చుత ♦ గ్గులు ప్రదోషమున ను
దయము గాంచని కువ ♦ లయ హితుండు
తే॥ కావ్య చాతుర్య విముఖత ♦ గనని బుధుఁడు
ఆకులత నొందని గుణర ♦ త్నాకరుండు
విషమదృష్టి యొప్పని రాజ ♦ విమలమౌళి
ప్రథితయశుఁడు తిక్కవరపు ♦ రామవిభుఁడు.

సీ॥ అతఁడు కవిస్తుత్యుఁ ♦ డితఁడు కవిస్తుత్యుఁ
డన్నవైన లోకహి ♦ తానురక్తి

నతఁడు భాస్వద్వంశ్యుఁ ♦ డితఁడు భాస్వద్వంశ్యుఁ
డరుదైన విభవ జ ♦ న్మాదికముల
నతఁడు వర్ధిత ధర్ముఁ ♦ డితఁడు వర్ధితధర్ముఁ
డతిశయ సాధు హి ♦ తాదరముల
నతఁడు ఖండిత ఖరుం♦డితఁడు ఖండిత ఖరుం
డక్షిపర్వాదికా♦పేక్షగతులఁ

తే॥ గాన శ్రీరామ విభుఁడె యీ ♦ కలియుగమున
రామ విభుఁడయి నెల్లూరఁ ♦ బ్రభవమంది
యుండఁగాఁబోలు లేకున్న ♦ నుర్విఁగలదె?
యిట్టి గుణము లిట్టి కలిమి ♦ యిట్టి యీవి. 3

సీ॥ గర్వంబునకు మూల♦కారణంబులు దండి
గానున్న గర్వ సం ♦ గతుఁడుగాఁడు
విషయ భోగంబులు ♦ వివిధంబులుగ నున్న
నింద్రియ లోలత ♦ నెనయఁబోఁడు
భవ్యవై భవములు ♦ బహుళంబుగా నున్న
దాంభికవృత్తులఁ ♦ దలఁపు గొనఁడు
పనులు సొంతంబులు ♦ పైపయి నలమిన
విద్యావినోదముల్ ♦ విడువఁబోఁడు

తే॥ జీవితంబు తెనుఁగు ♦ సేవకై యందును
తిక్కయజ్వ పూజ ♦ తివిరి సేయ
నర్పణంబు సేసి ♦ నట్టి గుణాఢ్యుండు
ప్రథిత తిక్కవరపు ♦ రామనృపతి. ౪

సీ॥ కోరి యర్థించినఁ ♦ గూర్మి మాటలతోడ
వినుగెత్తు దాఁకఁ ద్రి ♦ ప్పించువారు
రమ్మని పల్కి గృ ♦ హమ్మున నుండక
కనుచాటగుచుఁ దప్పి ♦ కొనెడివారు
తమ పని నెఱవేఱు ♦ దనుక నాసానలఁ
గొనరి యావల రొప్పి ♦ కసరు వారు
పేరచ్చు పడఁగోరి ♦ పేరాసతో వచ్చి
యిచ్చెదనని వెన్క ♦ నీనివారు

తే॥ కలుగు నీ కలికాలానఁ ♦ గవుల కష్ట
మరసి వేఁడకున్నను తఱి ♦ యెఱిఁగి యొసఁగు
రసిక దాతలు భూమి నా ♦ రసిన దొరకు
టరిది తిక్కవరాన్వయ ♦ వర సదృశులు.

సీ॥ పార్టీలు బలియ టీ ♦ పార్టీలు పెట్టింప
వేలకొలఁది కర్చు ♦ పెట్టువారు
గౌరవ పదవుల ♦ కై ప్రాఁకు లాడుచు
నప్పుచేసి వ్యయింప ♦ నడరువారు
తమ వారు పస్తులఁ ♦ దాఱంగఁ బర దేశ
ములకు సాయపడంగ ♦ మొనయువారు
తన కుటుంబము దిద్దు ♦ కొన లేక యున్నను
దేశంబు దిద్దంగఁ ♦ దివురు వారు

తే॥ కలుగు నీ కలికాలానఁ ♦ గవుల కష్ట
మెఱిఁగి భాషోద్ధరణ మెవ్వ ♦ రింతురయ్య?
కృతయుగం బిప్పుడే యుద ♦ యింపఁబోలు
ఘనుఁడవై యుంటి కవి చాత ♦ కముల కీవు.

సీ॥ కాల మెయ్యెన్ని వం ♦ కరలఁ బోయినఁ గాని
ధర్మమార్గంబును ♦ తలఁచువారు
నీచులకే మేల్మి ♦ నెగడుచుండినఁ గాని
తప్పు త్రోవలఁబోక ♦ తలఁగువారు
సుస్థిర ధర్మంబు ♦ నుడిసి నల్లగపడ
నుడియుదంచు దృఢత ♦ నడచువారు
అల్ప సుఖంబుల ♦ కాసించి శాశ్వత
విజ్ఞాన సుఖముల ♦ విడనివారు

తే॥ కలరు కోటి కొక్కరు ♦ కలికాలమందు
కోరకున్నను తఱిఁగాంచి ♦ కోరి సాయ
పడెడి పుణ్యులు కలరె యీ ♦ పుడమియందు
వెలయు తిక్కవరవు రాము ♦ విభు సదృశులు.

ఉ॥ శ్రీయును దాతృతం బెలఁగు ♦ శిష్టుఁడు నే రచియించు కంబ రా
మాయణ పూర్వభాగమును ♦ మక్కువతోఁ బఠియించి నిత్య ధ

ద్రాయత బుద్ధి తిక్కన జ ♦ యంతికి నన్ బిలిపించి సత్కృతుల్
హాయిగఁజల్పి ద్రౌపది గు♦ణావలి వీనుల విందుగా విన్. ౯

చ॥ విని కడు మోదమంది పెను ♦ వేడుక నా మఱునాఁడు నిల్పి కం
బని కవితావిశేషములఁ♦బ్రాఁతిగ నెమ్మది నాలకించి ప్రే
మను మఱి సాగనంపి యొక ♦ మాటయుఁ జెప్పక పంపె వెన్క డ
బ్బును ఘను నీవి యెప్పుడును ♦ మున్న యెఱుంగఁగ రాద యేరికిన్, ౧౦

తే॥ అచ్చువేయఁబూనుట తాన♦యరసి రెండు
వేల రూపిక లంపుచు ♦ పిదపఁ గడమ
పడున దనిపెద ననుచుఁ బ్రే ♦ ముడిని తెలిపె
సరయుఁ గృష్ణత్వముం గూడ ♦ నెఱుకపడఁగ. ౧౧

ఉ॥ భూమిజ భోగ భాగ్యములఁ♦బొందిన రాముఁడు తన్నుపోలు నీ
రామవిభుం డితోధిక త ♦ రస్ఫుట సౌఖ్యములుం జిరాయువుల్
శ్రీమహిళా సరస్వతుల ♦ సేవయు శాశ్వత కీర్తి రాజతే
జో మహిమంబు లెచ్చిరిలఁ ♦ జూచుత మెప్డుఁ గటాక్ష దృష్టులన్. ౧౨



ఓం.

శ్రీరామచంద్రాయ నమః

శ్రీ కంబరామాయణాంధ్రీ కర్త్రభినందనము.

శ్రీ కవిచక్రవర్తి, శతావధాని, విద్వాన్, దోమా వేంకటస్వామి గుప్తగారు.

శా॥ శ్రీమత్పూతలపట్టు వంశమునకున్ ♦ శీతాంశు బింబంబు శ్రీ
రాముల్ రెడ్డి మహానుభూతి మెయి ది ♦ గ్రంగద్యశోవైభవ
ప్రామాణ్యంబుగ ద్రావిడోక్తిఁగల స ♦ ద్గ్రంథంబు శ్రీకంబు శ్రీ
రామోదార కథన్ యథార్థగతి నాం♦ధ్రంబున్ రహిం దెల్పి యీ
భూమిన్ సర్వదిగంత కీర్తిగనఁగాఁ ♦ బొందెన్ సుపాత్రత్వమున్.

తే॥ కంబరామాయణంబనఁ♦గాఁదుది మొద, లుండనట్టి "బాతాఖాని"♦కొనరుపేరు
గాథలోక్తిగాఁ దెలుఁగునఁ♦గలదునాను, డియలనుడిలోని నిజము క♦డింది తేట
తెల్లముగఁ దెలియంజేసి♦యెల్లలిఁ గవి, చక్రవర్తి కంబరు ద్రావి♦డ క్రమమున
వెలిఁగె నలవాఙ్మయ విధులఁ♦దెలుఁగువారి, కింతొతివిరి పూతలపట్టు♦హృద్యవంశ
రాజమూర్తి శ్రీరాములఁ♦రడ్డి సుకవి,మాళి ద్రమిళాంధ్ర వాఙ్మయ♦మహితుఁడయ్యె
శారదా తదధీశులా♦భవ్యమూర్తి, నెల్లవితముల సరసి ర♦క్షింత్రు గాత.

మ॥ అల మాఘుండు వణిక్కుఁడయ్యు బహు తం ♦ త్రానీకముం బూని య
య్యలఘుం డగ్రజుఁడంచు నగ్రజులు వ్రా ♦ యంబొల్చు నందందు శ్రీ
లలియా చూడికొడుత్త దేవికత య ♦ ల్సానయ్య నిర్మించి రా
యల పేరుంచె నటందు రమ్మోయిన యే ♦ యెన్నో దినాల్వోవఁ బూ
తల ప్రెడ్డి ధరామరుండనియొ ఏ ♦ ధాత్రీ సురుండో యొన
ర్చి లసద్దక్షిణఁ గొంచు రెడ్డికృతిగా ♦ శ్రీరామగాథాది ని
య్యల రాజిల్లఁగఁ జేసె నంద్రో? కవి శా ♦ లాత్యద్భుతంబెట్లొకో?.

చ॥ తెలిసిన వార మేముగద ♦ తీర్పుగఁ జిత్తురునందు నోలి నీ
వొలయఁగఁ బండితుండవయి ♦ యుండిన స్కూలు చెలంగు నీకు న
త్యలఘుతరాపదల్ గొలిపి ♦ నట్టి రెనంగుదు రివ్వియెల్ల సా
క్షులు నిరతంబునై భవ ద ♦ కుంఠిత కీర్తిని జాటునయ్య పూ
తలపటు వంశ వారినిధి ♦ ధన్యమణి ప్రభ! సత్కవీశ్వరా!

చ॥ అఱవల కాంధ్రమందుఁ గత ♦ మబ్బని వైరముఁ జేసి యాంధ్రమం
దొరసినపాటఁ బాడమని ♦ యొక్కరెవల్లొ వచింత్రుగాత నీ
తెఱుఁగున నాంధ్రవుం జవిని ♦ దీర్చి యొసంగిన మేటి కెంతయుం
"గరకుడి" యందు గారవ మ ♦ ఖండముగా నొనరించి ఆంధ్ర వ
స్తు రుచిర భక్తిఁ జూపి రిది ♦ చొక్కము నీవల త్యాగరాజు వి
ద్వరు నటు ద్రావి డాంధ్ర జన ♦ వర్గము లాదరముల్ వహింప సు
స్థిరతర కీర్తినొందితివి ♦ చెన్నుగఁ బూతలపట్టు వంశజా!

శ్లో॥ శ్రీరామ సూరీశ్వర మౌళిరత్నం, పాయాత్సదా పూతలపట్టు వంశ్యం
నానా మహాగ్రంథ నిబంధనాఢ్యం, శ్రీరామ మాంధ్ర ద్రమిళోక్తి విజ్ఞమ్.

బెజవాడ,
12—6—53.

దోమా వేంకటస్వామిగుప్త.



అఱవము, తెనుగు, మలయాళము, కన్నడములందు పండితులై వెలసి
మదరాసు యూనివర్సిటీ ద్రావిడోపన్యాసకులుగా నుండిన
శ్రీ. వే. వేంకటరాజులురెడ్డిగారు ఇట్లు వ్రాసిరి.

మహాకవివర్యులు శ్రీరాములురెడ్డిగారి దివ్యసమ్ముఖమునకు నమస్కార పూర్వకముగాఁజేయు విజ్ఞాపనము. తాము పరమ కృపతోఁ బంపిన కంబ రామాయణము చేరినది. తమ రామాయణము అఱవ కంబరామాయణము కంటె మిక్కిలి మనోహరముగా నున్నది. సరళమైన శైలియును ప్రసాద గుణమును మీగ్రంథమందు విశేషముగానున్నది. విహారపటలమున మూఁడవ పద్యమందు 'కాంతలార' మున్నగు సంబోధనములు మూలముకంటె మిక్కిలి మనోరమ్యములుగా నున్నవి. మూలగ్రంథముననున్న యభిప్రాయముల నెంత మాత్రమును విడువక యీలాగున పరివర్తనము చేసినవారు నేనెఱిఁగినవఱకు వేఱెవరును లేరు. "முல்லையைக் குறிஞ்சியாக்கி" అనెడి పద్యము మాత్రము తెలుఁగున నిట్టి భూ విభాగములు లేనందువలన మూలగ్రంథాభిప్రాయమునకు సరిగాలేదు, కొన్ని స్థలములందు మూలముకంటె లెస్సగా నున్నది.

ఆంధ్రులును ద్రావిడులును దేవర వారిని కొనియాడవలయును. అట్లు చేయని యెడల వారు తమ కర్తవ్యమును చేయఁదప్పిన వారగుదురు. తామొనర్చి యున్న మహత్తరమైన కార్యము నెప్పుడైన నెఱిఁగి కొనియాడఁగలరు.

నమస్కారములు.

మదరాసు,
7—9—52.

దాసుఁడు
వే. వెంకటరాజులు.



కర్నూలు ఉస్మానియా కళాశాల యందలి
హిందీ తెలుఁగు ఉపన్యాసకులు
జనాబ్ షేక్ దావూద్‌సాహెబుగారు ఇట్లు వ్రాసిరి.

# నివేదన.

---

తమిళ దిగంతములను దన మాధురీ విలసనముచేఁ దన్మయత్వమున ముంచి, యచటి మానవులను భక్తి భాజనులఁ గావించి, ఆత్మోల్బణ రస ప్రవిష్టతచేఁ బరిసర ప్రాంత రస పిపాసుల మనస్సులందు కాంక్షా పల్లవములను జేకత్తించి యువ్విళులూరఁ జేయుచున్న యీ కంబరామాయణ మను కావేరీ స్రవంతికిఁ గాల్వలు దీర్చి మనయాంధ్ర పండిత దివ్యకర్షకుఁడు ఎడతెగని కృషితో నిజవాఙ్మయ క్షేత్రమునకుఁ బాఱించి యద్భుతమగు నొక యధునాతన కావ్యసస్యమును పండించినాఁడు. సోదర మానవులకు దాని రుచిఁజూప సమారాధన గావింప మహత్తర యత్నము గావించు శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు భావివర్తమాన లోకమునఁ బసిఁడి పూలతో నభిమాన గంధముతోఁ బ్రఖ్యాతియనెడు ధూప దీపములతో సౌహార్ద మనెడు నైవేద్యముతో నారాధింపఁదగిన ప్రణయ స్వరూపులు.

అయ్యది కావేరీతోయము. నవరస పరిపూర్ణ కుల్యలతో మన క్షేత్రమునకుఁ బ్రవహించి యెఱుఁగదు. మన యుర్వరయాంధ్ర క్షేత్రము. అట్లయ్యు నయ్యది భాషా భావరూపమున గీర్వాణమును, శబ్ద ధ్వని రూపమున ద్రావిడమును, సంగీతాది స్వరవిశిష్టతా రూపమున నన్యదేశ పదార్థములను సేకరించుకొన్నది. మొత్తముగఁ గాని యఖండ రూపముగఁగాని యనువదించుకొనలేదు అన్యభాషా కావ్యములను. ఇది తనలోనికిఁ గేవల సంస్కృతమునుండియే కావ్యాది శాస్త్రముల గ్రహింప నను వదింప ననుకరింపఁగడఁగినది. గీర్వాణమునకు నాంధ్రమునకు వాసనా ప్రాబల్యమున నవినాభావ సంబంధ మున్నది. దీన నేమున్నను అది మాతృభాషా సంస్కృతియే యగును. ఇంచుమించు తెనుఁగున సంస్కృతమందు లేని క్రొత్తది కానరాదు. అట్లేదేనియున్న రామరాజ భూషణుని కవితా సాధనమే; కథగాదు.

ద్రవిడభాషలలో ముఖ్యముగఁ దమిళమున కొక ప్రత్యేకత యున్నది. గీర్వాణ భాషా గంధము నది తనకుఁ బట్టించుకొనక అభినవాభిజాత్యముతోఁ

బురాతనాత్మాభిమానముతో సముచిత స్వతంత్ర ప్రతిభతోఁ దన సంస్కారమును విలక్షణముగ నెలకొల్పినదిట్టి. ప్రకృత మాంధ్ర వాఙ్మయము అన్య సంస్కృతుల నవగాహన మొనర్చుకొనుటకు వివిధ భాషలనుండి జాతీయములను నానుడులను లోకోక్తులను సామెతలను న్యాయములను గేయములను అనివార్యములగు శబ్ద జాలములను సంగ్రహించుకొని శ్రావ్యసౌభాగ్య సంగీత ధ్వని సౌకుమార్యముల నన్నింటిని ప్రోగొనర్చికొని "ఎల్ల బాసలందు ఎఱుఁగవే బాసాడి-దేశ భాషలందు తెలుఁగు లెస్స" అని తన సహజ గర్వమును విశిష్ట దర్పమును దశ దిశల నెఱపి పలుకుం దీయందనమున, నుచ్చారణ పటుత్వమున, గమన గాంభీర్యమున, శైలీ సౌలభ్యమున, శ్రుతి మాధుర్యమున, సర్వజన శ్లాఘాపాత్రతచే నెఱ జాణయై మనల నానందాబ్ధి నోలలాడించినది. శ్రీరాములురెడ్డిగారీ యుభయ భిన్న సంస్కృతులకు సమన్వయమును సాధించి, ద్రావిడ సంపత్తిని పరిసర ప్రాంతీయు లనుభవించు స్వత్వము గలదని నిరూపింప భగీరథ ప్రయత్నమొనర్చి నేటికి అనువాద రూపమున మనభాగమును మనకుఁ బంచిపెట్టి - తామాంధ్రజాతి సంస్కృతికి దోహద మొనర్చిరి. అక్కటతన నిత్యగౌరవమును, భావ్యున్నత స్థానము నలంకరించిరి. ఏతన్మాహాత్మ్య కృషియందు సఫలతను భజించిన యీ రామచంద్రునకుఁ గావ్య జగద్యాత్రికులగు రస పిపాసువులు, ముఖ్యముగఁ బశ్చిమాంధ్రులు ముత్యాల నివాళు లర్పింపకున్న కృతఘ్నులగుదురు. తమ ప్రాంతీయ పురాతన గౌరవమును గోల్పోదురు. అన్యభాషల నున్న యీ యభినవ సారస్వతమును దాని విలక్షణ వైభవమును దమ సాహితీ భండారమునఁ జేర్చుకొన్ననాఁడే గదా మానవ విజ్ఞాన సంపత్తి పెరిఁగి - సంకుచితతా దైన్యమును గోలుపోయి - మనోబలమును ప్రబల మొనర్చుకొను చేతనతా కిరణముల స్పర్శ నందఁగలదు.

సంస్కృతానువాదములు నేఁటిదనుక నధ్యయన మొనర్చుచున్న రసిక సమాజము మాతృకకున్న గౌరవము తెనుఁగున కొనఁగునది కాదు. భాషా సంస్కృతుల విషయమున తల్లి బిడ్డలుగ నున్న యీ యనువాద మాతృకలకే యంతటి విభిన్నత లున్నచో నిఁకఁ దన ప్రత్యేకతనే నిలఁబెట్టుకొన నుబలాట పడు నట్టి తమిళ భాషనుండి తెలుఁగునకు దిగు సీకృతి తీరుతీయములు చెప్పవలయునా? హాస్యాస్పదము సుమా. అని ప్రప్రథమమున నేనీ గ్రంథనామమును విన్నతోడనే యూహాకల్పన మొనర్చితిని. అయ్యది బహుశః మానవ మనో దౌర్బల్యము కావచ్చును. కాని సంప్రదాయముగా వచ్చు నాయాచారమును దాని కలవాటు పడిన నేను కాదనఁ గలనా! కవినైనను కాదనఁ గలఁడా! ఇంటఁ బుట్టినది. కాని యీ సతత ప్రథకు అపవాదము కూర్చినవారీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు మాత్రమె. దువ్వూరి రామిరెడ్డిగారు సైత మసదృశ ప్రతిభతోఁ బారసీక కావ్యము

ననువదించిరి గాని యది త్రిశతికి మించని కావ్యము పానశాల; వీరొక మహాకావ్యమునే యనువదించి యసమ ప్రతిభ చూపిరి.

సర్వసాధారణముగ గీర్వాణవాఙ్మయ మనెడు మున్నీటినుండి యనువాద కుల్యలద్వారా ఆంధ్ర కేదారములకు రసములను పారించునపుడు అనివార్యముగ యతిప్రాస విశ్రాంతులనెడు మునుములలో విపరీతమగు (ధరణి - వారిరి - సలలిత - అరయఁగ - సరవి - విలసిల్లు - ఇల - కడఁక - పృథివి - ధరాతలము - సరస) వ్యర్థపదములను దుబ్బుగడ్డి పెరిగి కావ్య సస్యశోభకు వీలగునంత నష్టమునుగూర్చి యానందమను పంటను చెడఁగొట్టెడిది. ఈ కృషికుఁడు గడిదేరి, యనుభవమును సంపాదించి, నన్నబోలు కృషికులనే యనంతముగా నిర్మింపఁగన్న మేధాబలసంపన్నుఁడు గాన మెలఁకువతో నాకలుపు మొలకలనే పెరుఁగనీయక, పాదములను మునుములను చెదరనీయక, వ్యాకరణచ్ఛందోమార్గ సాధన విశేషముల కాపువెట్టి యఖండమగు రామాయణ రాజనములను చక్కఁగఁ బండించినాఁడు. మచ్చునకని పరికించినను ఈ కాఁపు కళ్ళమునందూఁక గన్పట్టదు. ఇంతటి జాగరూకతకుఁ గారణమేమాయని గాఢముగ నాలోచించితిని. ఆచంద్రతారార్కము నిలుచునట్టి మహాకావ్య సృష్టియం దలఁతి యలంతి దోసము లుంట గని రసిక పాఠకలోకము తన్ను మధుర హాస్యము పాల్గావించునని యెఱింగిరి. కావున వీరు ప్రతిభా పారంగతులు.

శ్రీ రాములురెడ్డి శిష్యకోటియె వ్యాకరణచ్ఛందోలంకారములకుఁ జక్కని వ్యాఖ్యానములు రచించి సమర్థులని ప్రసిద్ధివహించియుండ నిఁక వీరి పాండిత్యమును గూర్చి వేఱుగా నడుగనేల? ఇదియొక యధునాతన తపస్సు. నూతనకృషి. ప్రాచీన సంస్కారము - సాంప్రదాయిక వ్యుత్పత్తి - మానసిక ప్రతిభ - కాకున్నచో నిక్కాలమున నింతటి యఖండ గ్రంథము సిద్ధమై యాంధ్రజన సమక్షమునకు వచ్చుట సామాన్యముగాదు. నేఁటిదనుక నింతటి పెద్దపని నెవరును ఈ రూపమునఁ దలపెట్టలేదు. ఇఁకఁ గవిత్వమునుగూర్చి కొంత చర్చింప వలసియున్నది.

అనువాదముల కవిత సలక్షణముగనుండునుగాని చెవికి నింపు గూర్పదు. శాస్త్రములను పట్టించియుందురుగాని మనసునకుఁ బట్టదు. అర్థవల్లి భావతాత్పర్య సౌరభ్యములు రాజమార్గమున వ్యాపింపవు. చదువుచున్న వికారమేదో మనోవీథిం బ్రవేశించినట్లుండును. ఇది కొందఱియనువాదములలోని విలక్షణత. ఇక్కారణముననే యనువాదమును పరిత్యజించి కొంద ఱనుకరణముం బూనిరి. ఏమయినను బిఱ్ఱుగ నీలుగుకొని మూన్నాళ్ళనాఁడు చచ్చిన పీనుఁగువలె నీరసమై నిర్జీవమై భీభత్సశోభతోఁ

ప్రత్యక్షమగుట మనము చూచినది. కొన్ని యెడల యనువాదకుఁడు దిగివచ్చునంత వఱకు దాని యర్థము తెమలదు.

ప్రకృత కంబరామాయణ కవిత ధారాపాతము నిర్దుష్టము. దానికంటె సారళ్యమెక్కువ. అంతకంటె రసస్ఫోరకతలో సహృదయానంద ప్రదము. అర్థగాంభీర్య సహితయయ్యు మధుర మధురస స్రవంతిక - పండితుల కలభ్యమగు విశిష్టశైలి యిక్కవి కయాచితముగ నలవడినది. ఇది సంపాద్యముకాదు. సంస్కారజన్యము. అట నట తమంతట తాము దొరలిన శబ్దాలంకారములు - రసము కొఱకై అప్రయత్నముగఁ గుదిరిన తెలుగు నుడికారములు, ప్రతిభాసాధ్యములగు గీర్వాణ సమస్తపద గర్జనలు - వింతవింత కూర్పులు ప్రమదావన సౌభాగ్యముం జాటుచున్నవి.

ఇస్లామీయుఁడనగుట నాకుఁ గథయందును రామాయణ కావ్యమునందును విశ్వాసముగల్గి గాదుకాని అనువాదముపట్ల నుభయ సంస్కృతుల సమన్వయముపట్ల నిక్కవి యెంతటి కృషిసల్పి వ్యుత్పత్తి ప్రతిభలను చాటినాఁడాయని గట్టిగఁ బరికించితిని. హనుమంతునియెదుట కుప్పిగంతులు సాగవనుకొంటిని. ఎచ్చటను జాతీయతను జాఱనీయక సంస్కృతిని మాఱనీయక యధునాతనయుగమునకొక నూతనాదర్శముం జూప నీ గ్రంథము ననువదించినాఁడు. ఈ కవి యసమాన ప్రతిభ దాఁగియుండి యొక్కమాఱు వెలి కుబికినది. కావుననే మా యాంధ్ర సారస్వతము చిరకాలమునుండి మనోలోకము మథనపడుచున్న కొఱంత దీర్చుకొన్నది.

తెలుఁగున వివిధ రామాయణములు పుట్టినవి. భాస్కర - రంగనాథ రామాయణములుతప్ప మిగిలినవి చర్విత చర్వణములు. పౌనరుక్త్యములు. పిష్టపేషణ సదృశములు-ఒకే ప్రవాహమునుండి యిన్ని కాల్వలు, పిల్లకాల్వలు, గుంటలు, ప్రత్యేకతయంబని లేదు అనుట నా మనోభిప్రాయము. కాని తరములనుండి కొనియాడఁబడుచున్న యీ తమిళ కంబరామాయణము మహిమాకందళము, బీజాక్షర ఘటితము, ఆంధ్రులకొక ప్రత్యేక సౌభాగ్యమును సమకూర్చినది. ప్రస్తుత యుగ సారస్వతమున వాంఛనీయరసవృష్టి. దీన నామహాకవికావ్యరసాస్వాదన కుతూహలురు మిక్కిలి యానందించి తత్సాహిత్యగత వైశిష్ట్యమును గ్రహించి రసాదిక మార్దవ ప్రకృతుల నవలోకించి హర్షించి గర్వింపఁగలరు. ఇది యావశ్యకకృషి - అన్యభాషా సహజ సంస్కారమును మన సాంప్రదాయిక సంస్కృతితో సరిపోల్చిచూచి యాచితిని గొని యనౌచితిని దిగవిడిచి, దానిని మనదానినిగఁజేసికొన్న యప్పుడేగదా జాతికి జాతీయవిజ్ఞానము పెరుఁగును. అభినవ భావసౌరభము గుబాళించును. అన్య భాషావిశిష్టత సాకారతను భజించి మనవాఙ్మయ మందిరమున శోభించును. అట్టిదే

యారాధ్యము. ఇంతటి విశ్వగౌరవ ప్రయత్నమున సఫలుఁడగు నిక్కవికి నేను హస్తములు మోడ్తును.

ద్రుత ప్రకృతిక విషయమునఁ గవిగారి నిర్ణయము శాస్త్ర సహజము. అజంతమగుతఱి దానికి ద్రుతత్వనామముండిన నుండుంగాక. దానిమీఁది పరుషములు సరళములగుట వింతగనేయున్నది. భాష్యకారులుసైత మీవిషయమున నిదమిత్థ మని నిర్ణయముచూపమి ప్రాచీనతా విస్మృతియనక తప్పదు. నేనీ విషయమున శ్రీరాములురెడ్డిగారితో మనస్ఫూర్తిగ నేకీభవించుచున్నాను. వారి యభిప్రాయము నావ్యాద్గత ధ్వనియే.

అనన్యసామాన్య ప్రతిభతో నిరంతర నిష్ఠాపూర్వక కృషితో నిర్నిద్ర ప్రవచన సౌభాగ్యముతో నీకావ్యము ననువదించి యాంధ్రుల మన్ననల గ్రహించు శ్రీయుత - పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారు నేఁటియుగమున నద్వితీయులు. ఆకాశ గంగ వడువున ఘుమంఘుమ ధ్వనులతో నాంధ్రభూమికి దుముకుచున్న వీరి కవితలో ధారావాహికయేగాక శాస్త్రమర్యాదలు సంస్కృతి భూషలు సంస్కృత మర్యాదలు త్రిలిఙ్గ పద వివేక విశేషములు తఱచు తమ యునికిని ప్రతిబింబింపఁ జేయుచు నాకర్షించుచున్నవి. ఈ కవిగారి సిద్ధహస్తతకు నోపికకు మనోవైశాల్య విజ్ఞానములకు వేయిమార్లు నేను కృతజ్ఞత లర్పింతును.

ఇట్లు,

షేక్. దావూద్ సాహెబ్

హింందీ, & తెలుఁగుపండితుఁడు

ఉస్మానియా కళాశాల

కర్నూలు.





1. డాక్టరు అళగప్పశెట్టిగారు — సమావేశపతి.
2. పూతలపట్టు శ్రీరాములురెడ్డి — ఆంధ్ర కంబరామాయణ కర్త.
3. కున్రక్కుడి స్వాములవారు — సన్మాన సభాధ్యక్షులు.
4. సా. గణేశన్‌గారు — కంబకవి వర్ధంతి కార్యనిర్వాహకులు.

శ్రీ

# విషయసూచిక.

## సుందరకాండము.


| | | |
|---|---|---|
| ౧. సముద్ర లంఘన పటలము. | | ౧ |
| కడలినుండి మైనాకుఁడు లేచుట | ... | ౫ |
| సురస హనుమంతు నడ్డగించుట | ... | ౭ |
| అంగారధార హనుమంతుని మ్రింగుట | ... | ౮ |
| ఆంజనేయుండు ప్రవాళంగిరిం జేరి లంకను గాంచుట | ... | ౯ |
| ౨. పురాన్వేషణ పటలము. | ... | ౧౦ |
| సూర్యాస్తమయము | ... | ౧౪ |
| చంద్రోదయము | ... | ౧౫ |
| హనుమ లంకా ప్రాకారమును సమీపించుట | ... | ౧౬ |
| లంకాధిదేవత హనుమంతు నడ్డగించుట | ... | ౧౭ |
| హనుమ లంకను నిగ్రహించి లోని కరుగుట | ... | ౧౮ |
| స్త్రీల సమూహములో హనుమ సీత నన్వేషించుట | ... | ౧౯ |
| హనుమ కుంభకర్ణుని గాంచుట | ... | ౨౧ |
| హనుమ ఇంద్రజిత్తు గృహమును గాంచుట | ... | ౨౨ |
| అంతర్మందిర పరిఖ నాంజనేయుండు దాఁటుట | ... | ౨౩ |
| నిద్రితులగు రక్కసుల హనుమ గాంచుట | ... | ౨౪ |
| హనుమ రావణుని మేడఁ జేరుట | ... | ౨౫ |
| హనుమంతుండు విద్యాధరాంగనలఁ గాంచుట | ... | ౨౭ |
| ,, మందోదరిని గని సీతయని భ్రమయుట | ... | ౨౮ |
| ,, రావణుని గాంచుట | ... | ౨౯ |
| ,, రావణుని చంపఁ జెంచుట | ... | ౩౦ |
| ,, సీతం గానమికి చింతిల్లుట | .... | ౩౧ |
| ౩. సీతా సందర్శన పటలము. | ... | ౩౨ |
| సీత స్థితి | ... | ,, |

| | | |
|---|---|---|
| సీత రాముని దలంచి పరితపించుట | ... | ౩౩ |
| రాక్షస స్త్రీలు నిద్రింపఁగా సీత త్రిజటతోఁ దన నిర్వేదముఁ దెలుపుట | | ౩౪ |
| త్రిజట సీత కూఱట కఱపుట | ... | ౩౫ |
| ,, తన స్వప్నమును సీతకుఁ దెలుపుట | ... | ౩౬ |
| హనుమ సీతను గాంచి యుత్సాహవంతుఁ డగుట | ... | ౩౭ |
| ౪. నిందన పటలము. | ... | ౩౮ |
| రావణుఁడు సీతను బతిమాలుట | ... | ౪౧ |
| సీత రావణుని కటూక్తు లాడుట | .... | ౪౨ |
| ౫. స్వరూప సందర్శన పటలము. | ... | ౪౭ |
| హనుమ శ్రీరాముని రూప మభివర్ణించుట | ... | ౫౧ |
| సీత యుంగరముం గని యానందించుట | ... | ౫౩ |
| హనుమ స్వస్వరూపముం జూపుట | ... | ౫౭ |
| ౬. చూడామణి పటలము. | ... | ౫౯ |
| సీత రామునకు పంపు సందేశము | ... | ౬౨ |
| హనుమంతుడు సీతకు ధైర్యవాక్యము లాడుట | ... | ౬౩ |
| సీత ఆనవాళ్లు తెలుపుట | ... | ౬౭ |
| ౭. వన భంగ పటలము. | ... | ౬౮ |
| ౮. కింకర వధ పటలము. | ... | ౭౪ |
| ౯. జంబుమాలి వధ పటలము. | ... | ౮౦ |
| ౧౦. సేనాపతి పంచక వధ పటలము. | ... | ౮౫ |
| ౧౧. అక్ష వధ పటలము. | ... | ౯౦ |
| ౧౨. పాశ పటలము. | ... | ౯౫ |
| హనుమంతుఁడు బ్రహ్మాస్త్రముచేఁ గట్టువడుట | ... | ౧౦౦ |
| ౧౩. పాశ ముక్తి పటలము. | ... | ౧౦౧ |
| హనుమంతుడు రావణునకు నీతి గఱపుట | ... | ౧౦౭ |
| ౧౪. లంకా దహన పటలము. | ... | ౧౧౪ |
| ౧౫. శ్రీ పాద వందన పటలము. | ... | ౧౧౯ |
| వానరులు మధువనమును పాడుసేయుట | ... | ౧౨౦ |
| మారుతి శ్రీరామునకు సీతా వృత్తాంతము తెలుపుట | ... | ౧౨౩ |

## యుద్ధ కాండము :: పూర్వ భాగము.


౧. సముద్ర దర్శన పటలము. ... ౧౨౯

౨. రావణ మంత్ర పటలము. ... ౧౩౦

కుంభకర్ణుఁడు హితము పలుకుట ... ౧౩౪

ఇంద్రజిత్తుని ప్రతాపోక్తులు ... ౧౩౫

విభీషణ నీతి ... ౧౩౬

౩. హిరణ్యకశిపు వధ పటలము. ... ౧౪౧

తండ్రి ప్రహ్లాదుని వివిధోపాయముల శిక్షించుట ... ౧౪౭

నృసింహమూర్త్యావిర్భావము ... ౧౫౧

౪. విభీషణ శరణాగతి పటలము. ... ౧౫౫

సుగ్రీవాదులు తమతమ యభిప్రాయములఁ దెలుపుట .... ౧౬౦

హనుమంతుఁడు తనయుద్దేశమును దెలుపుట ... ౧౬౨

శ్రీరాము నభిప్రాయము ... ౧౬౩

శ్రీరాముఁడు విభీషణుని కభయ మొసఁగుట ... ౧౬౬

౫. లంకా వృత్తాంత పటలము. ... ౧౬౯

౬. వరుణ ప్రార్థన పటలము. ... ౧౭౪

వరుణుఁడు రాముఁజేరి శరణు వేఁడుట ... ౧౭౯

౭. సేతు బంధన పటలము. ... ౧౮౧

౮. చార శ్రవణ పటలము. ... ౧౮౬

రావణుఁడు రహస్యమందిరముచేరి యాలోచించుట ... ౧౯౦

౯. లంకా దర్శన పటలము. ... ౧౯౨

రాముఁడు సువేలాద్రి శిఖరముఁ జేరుట ... ౧౯౫

రాముఁడు లంకానగర సౌందర్యము లక్ష్మణునకుఁ దెలుపుట ... „

౧౦. వానర సైన్యదర్శన పటలము. ... ౧౯౭

౧౧. మకుట భంగ పటలము. ... ౧౯౯

శ్రీరాముని చింత ... ౨౦౧

౧౨. వ్యూహ నిర్మాణ పటలము. ... ౨౦౪

౧౩. అంగద దౌత్య పటలము. ... ౨౦౭

౧౪. ప్రథమ యుద్ధ పటలము. ... ౨౧౨
సుగ్రీవుఁడు వజ్రముష్టిం జంపుట ... ౨౧౫
తూరుపు వాకిటి యుద్ధము ... ౨౧౬
ప్రహస్తుని యుద్ధము ... ౨౧౭
రావణుఁడు రణమున కేగుట ... ౨౧౮
రాముఁడు రణసన్నద్ధుఁ డగుట ... ౨౧౯
లక్ష్మణ యుద్ధము ... ౨౨౨
హనుమ ద్రావణ ముష్టి యుద్ధము ... ౨౨౪
రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట ... ౨౨౮
రామ రావణ ప్రథమ యుద్ధము ... ,,
౧౫. కుంభకర్ణ వధ పటలము. ... ౨౩౨
రావణుఁడు మాల్యవంతునకు రాముని పరాక్రమాదులు తెలుపుట ... ౨౩౩
కుంభకర్ణుని మేలుకొలుపుట ... ౨౩౬
రావణునకుఁ గుంభకర్ణుఁడు హిత ముపదేశించుట ... ౨౩౮
విభీషణుఁడు రామునకుఁ గుంభకర్ణు నెఱిఁగించుట ... ౨౪౧
విభీషణ కుంభకర్ణుల సంభాషణము ... ౨౪౨
కుంభకర్ణుని యుద్ధము ... ౨౪౬
లక్ష్మణ కుంభకర్ణుల సమరము ... ౨౫౦
సుగ్రీవ కుంభకర్ణుల యుద్ధము ... ౨౫౪
రాముఁడు కుంభకర్ణుని గూల్చుట ... ౨౫౭
౧౬. మాయా జనక పటలము. ... ౨౬౨
సీత రావణు దూషించుట ... ౨౬౪
సీత మాయాజనకుం బదరుట ... ౨౭౦
రావణుఁడు కుంభకర్ణ మృతికై విలపించుట ... ౨౭౧
౧౭. అతికాయ వధ పటలము. ... ౨౭౩
దేవాంతకుండు హనుమంతునిచేఁ గూలుట ... ౨౮౨
అతికాయుఁడు లక్ష్మణుచేఁ గూలుట ... ౨౮౩
నరాంతకుఁ డంగదుచేఁ జచ్చుట ... ౨౮౬
ఉన్మత్తుఁడు నీలునిచేఁ గూలుట ... ,,
బలమత్తుఁడు ఋషభునిచేఁ జచ్చుట ... ౨౮౮
సుగ్రీవుఁడు కుంభుని చంపుట ... ,,

నికుంభుని హనుమంతుఁడు కూల్చుట ... ౨౮౯
ధాన్యమాలిని రావణు నిష్ఠురోక్తులాడుట ... ౨౯౦
౧౮. నాగపాశ పటలము. ... ౨౯౨
ఇంద్రజితుఁడు శపథవాక్యములాడుట ... ౨౯౩
వానర సేనానాయకుల సమరము ... ౨౯౬
ఇంద్రజిత్తు వానరులపైఁ గవిసి మసఁగుట ... ౨౯౮
ఇంద్రజి ల్లక్ష్మణ యుద్ధము ... ౩౦౦
ఇంద్రజిత్తు నాగపాశముచే లక్ష్మణాదుల బంధించుట ... ౩౦౮
విభీషణుఁడు లక్ష్మణు నవస్థం గని దురపిల్లుట ... ౩౦౯
గరుడుఁడు రాఁగా నాగపాశము వీడుట ... ౩౧౨

## యుద్ధ కాండము :: ఉత్తర భాగము.

౧౯. సేనానాయక వధ పటలము. ... ౩౧౯
రావణుఁ డింద్రజితుని చక్రరక్షకుల ముక్కులు గోయ నాజ్ఞాపించుట ,,
ధూమ్రాక్షుండు హనుమంతునిచేఁ గూలుట ... ౩౨౪
మహాపార్శ్వుఁ డంగదునిచేఁ జచ్చుట ... ,,
నీల మాల్యవంతుల యుద్ధము ... ౩౨౫
ఋషభ వజ్రదంష్ట్రుల సమరము ... ,,
పిశాచుని యుద్ధము ... ౩౨౬
౨౦. మకరాక్ష వధ పటలము. ... ౩౨౬
మకరాక్షుఁడు రామునితోఁ బోరి మడియుట ... ౩౨౭
రక్తాక్షుఁడు శంఖుఁడు నల పనసులచే నంతమొందుట ... ౩౨౯
౨౧. బ్రహ్మాస్త్ర పటలము. ... ౩౩౦
తన సైన్యముపాటు నింద్రజితుండు కాంచుట ... ౩౩౨
హనుమని సింహనాదము ... ౩౩౩
లక్ష్మణుఁడు రాము ననుజ్ఞం గొని యింద్రజితునితోఁ బోరుట ... ౩౩౪
మహోదరుని యుద్ధము ... ౩౩౭
ఆంజనేయుండు కుంభకర్ణుని వజ్రదండమ్ముం గొని దైత్యుల నణఁచుమాడుట ౩౩౯
హనుమంతుఁ డకంపనుం జంపుట ... ౩౪౦
మారుతి లక్ష్మణుని వెదకుచుఁ బోవుట ... ౩౪౧

ఇంద్రజిత్తు లక్ష్మణాదులపై బ్రహ్మాస్త్ర మేయుట ... ౩౪౪
శ్రీరాముఁడు మరలివచ్చి పాలికలనిం గాంచుట ... ౩౪౫
శ్రీరాముఁడు లక్ష్మణుంగని పరితపించుట ... ౩౪౬
వేలుపుల విలాపము ... ౩౪౮
౨౨. మూర్ఛిత రామ లక్ష్మణ సందర్శన పటలము. ... ౩౪౯
త్రిజట సీత నూఱడించుట ... ౩౫౨
౨౩. సంజీవన శైల పటలము. ... ౩౫౩
ఆంజనేయుండు సంజీవనిం దేఁబోవుట ... ౩౫౬
జాంబవ ద్విభీషణులఁ గాంచి రాముఁడు పరితపించుట ... ౩౫౯
జాంబవంతుఁడు రాముని తేర్చుట ... ౩౬౦
౨౪. హాలాపాన నటన పటలము. ... ౩౬౩
౨౫. మాయా సీతా పటలము. ... ౩౬౪
వానరులు లంకం గాల్చుట ... ౩౬౬
ఇంద్రజిత్తు మాయాసీత తల దఱుఁగుట ... ౩౬౮
ఇంద్రజి త్తయోధ్య కేగెనని విని రాముఁడు చింతించుట ... ౩౭౧
విభీషణుఁడు తుమ్మెదయై జానకిం గాంచి వచ్చుట ... ౩౭౩
౨౬. నికుంభిలా యాగ పటలము. ... ౩౭౪
హనుమంతుఁ డింద్రజితు నుపాలంభించుట ... ౩౭౯
మేఘనాదుఁడు హనుమనికిం బ్రత్యుత్తర మిచ్చుట ... ౩౮౦
ఇంద్రజి ల్లక్ష్మణ యుద్ధము ... ౩౮౨
మేఘనాదుఁడు విభీషణుని నిందించుట ... ౩౮౮
౨౭. ఇంద్రజి ద్వధ పటలము. ... ౩౯౦
౨౮. రావణ శోక పటలము. ... ౩౯౮
౨౯. సేనా సందర్శన పటలము. ... ౪౦౩
మాల్యవంతుఁడు సేనాపతులకు రామ విక్రమాదులు తెలుపుట ... ౪౦౭
౩౦. మూలబల వధ పటలము. ... ౪౦౯
వేలుపు లసుర బలముఁ గాంచి శంకించుట ... ౪౧౦
వానరులు మూలబలముఁ గాంచి పాఱుట ... ౪౧౧
శ్రీరాముఁడు రాక్షసబలము నఱుమాడుట ... ౪౧౬
వహ్ని దానవసేనలఁ బ్రోత్సహించుట ... ౪౨౧

రాముఁడు గాంధర్వాస్త్రము సంధించి విడుచుట ... ౪౨౫

౩౧. రావణ శక్తి పటలము. ... ౪౩౦

రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట ... ౪౩౨

౩౨. వానర రణరంగ దర్శన పటలము. ... ౪౩౪

౩౩. రావణ రణరంగ దర్శన పటలము. ... ౪౩౭

౩౪. రావణ రథారోహణ పటలము. ... ౪౪౦

౩౫. రామ రథారోహణ పటలము. ... ౪౪౨

౩౬. రావణ వధ పటలము. ... ౪౪౪

రామునిచే మహోదరుఁడు కూలుట ... ౪౪౫

రామ రావణ సమరము ... ౪౪౭

రాముఁడు రావణుని తలలఁ దెగ నేయుట ... ౪౫౫

రావణుఁడు మూర్ఛిల్లుట ... ౪౫౬

రాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుఁ గూల్చుట ... ౪౫౮

రాముఁడు రావణుని వీఁపునందలి గాయములఁ గాంచి శంకించుట ౪౫౯

విభీషణుని చింత ... ౪౬౦

మందోదరి విలాపము ... ౪౬౨

౩౭. శ్రీరామ నివర్తన పటలము. ... ౪౬౪

హనుమంతుఁడు సీతకు రామ విజయము తెలుపుట ... ౪౬౫

అప్సరసలు సీత నలంకరించుట ... ౪౬౭

శ్రీరాముఁడు సీతను కఠినోక్తు లాడుట ... ౪౭౦

సీత అగ్నిం జొచ్చుట ... ౪౭౨

రాముని పురుషోత్తమత్వమును నలువ వెల్లడించుట ... ౪౭౪

శంకరుఁడు దశరథు నటకుఁ బిలిపించుట ... ౪౭౬

వేలుపులు రాముని కోరిక లొసఁగుట ... ౪౭౭

సీతారామలక్ష్మణులు పుష్పకము నధిరోహించుట ... ౪౭౯

రాముఁడు సీతకు త్రోవలోని చిత్రములఁ జూపుట ... ౪౮౦

భరద్వాజుఁడు శ్రీరామాదులకు విందు పెట్టుట ... ౪౮౨

భరతుఁడు రాముని రాకకుఁ బరితపించుట ... ౪౮౪

కౌసల్య భరతు సమాధానపఱుచుట ... ౪౮౫

| | | |
|---|---|---|
| హనుమంతుఁడు భరతుని చేరుట | ... | ౪౮౭ |
| భరతుఁడు రాముని రాక విని యానందించుట | ... | ,, |
| భరతున కాంజనేయుఁడు రాము నుదంతము తెల్పుట | ... | ౪౮౯ |
| గుహుఁడు రాముని కానవచ్చుట | ... | ౪౯౩ |
| భరతుఁడు శ్రీరామాదులం గాంచుట | ... | ౪౯౪ |
| ౩౮. శ్రీరామ పట్టాభిషేక పటలము. | ... | ౪౯౬ |
| సుగ్రీవాదులు నగరునందలి చిత్ర దృశ్యములఁ గాంచుట | ... | ౪౯౯ |
| రాముఁడు పట్టాభిషిక్తుఁ డగుట | ... | ౫౦౧ |
| ౩౯. వీడుకోలు పటలము. | ... | ౫౦౨ |




శ్రీరస్తు.

# కంబ రామాయణము.

## సుందరకాండము.

—: ౧ సముద్ర లంఘన పటలము :— (౯౭)

మ॥ క్రలఁకం జీఁకటి రజ్జువే భుజగమై ♦ కన్పట్టు చందాన నీ
యిల మాయం జనియించు మోహ నిచయం ♦ బీగున్ సమస్తంబు నే
విలసత్తేజముఁ గన్న నట్టి పరుఁడే ♦ విల్లంది లంకాపురిన్
గలనన్ గెల్పు వహించె నంద్రు విబుధుల్ ♦ గణ్య ప్రమాణంబులన్ ౧

ఉ॥ అత్తఱి వీరరత్నము మ ♦ హాబలపుత్రుఁడు దేవలోకమున్
జిత్తము రంజిలంగఁ దన ♦ చేరువఁ గాంచి యిదేమి లంకయా?
మత్తిలినాఁడనే? యనుచు ♦ మాన్యులు వొందెడు నాకమిద్ది రా
జోత్తము దేవి యింధరయ ♦ నుండద యంచు మరల్చె భావమున్. ౨

శా॥ లంకాద్వీప వనంబులున్ గనక ♦ మాలా విస్ఫురద్ద్వారముల్
హాంకంబౌ మణిసౌధవీథులును పెం ♦ పుం గాంచు దుర్గంబులున్
శంకాతంకము లేక గాంచుచు జగ ♦ త్సందోహముల్ దిక్కులున్
సంకోచించి వడంక బాహువుల నా ♦ స్ఫాలించె క్ష్వేడించుచున్. ౩

మ॥ విమలాత్ముం డట నూది త్రొక్క గిరియున్ ♦ వేక్రుంగి గర్భంబు చీ
లి మహిన్ వ్రాలిన ప్రేవులంబలె గుహా ♦ లిన్ దుర్విష జ్వాలికా
సముదగ్ర స్ఫుట దంష్ట్రికా భయద దు ♦ ష్ట వ్యాళ సంఘంబు క్ష్వే
ళములం గ్రక్కుచు దొర్లుచున్ వెలువడెన్ ♦ లావేది దుర్భిక్షమై. ౪

ఉ॥ నెమ్మదిఁ గందరంబులను ♦ నిద్ర యొనర్చు మృగేంద్రపాళి ర
క్తమ్ములు గ్రక్కుచచ్చుటనె ♦ క్రందడఁగ న్నశియించెఁ బక్షి సం
ఘమ్ములు సాగరంపు లయ ♦ కాల విఘోషము సిగ్గిలంగ శ
బ్దమ్ము లొనర్చుచుం బఱచె ♦ భానుని కాంతి మఱుంగుపుచ్చుచున్.

చ॥ కరిణులు తోఁకలన్ ముడిచి ♦ గాత్రములన్ గుదియించి కర్ణముల్
పరపగు వెన్నుదాఁక వడిఁ ♦ ప్రాణభయంబునఁ గంపమంద త
మ్మొరయుచు వెంటనంటఁ గరి ♦ యూథము తొండము తోడఁ బాదపో
త్కరములఁ గెల్లగించికొని ♦ దవ్వుల కేగెను గీఁకవెట్టుచున్. ౬

తే॥ అమ్మహేంద్రాన మించునా♦నతిశయిల్లు, కొమ్ములుం బొడిగా మిడు♦గుఱులు చెదర
కెన్ను లగలంగ బెబ్బులుల్♦బెదరి పాఱె, కనులు విప్పని కొదమలఁ♦గవ్వికొనుచు

ఉ॥ భూధరరాజ మప్డు తన ♦ పొల్పు చెడంగ వడంకి క్రుంగ వి
ద్యాధరులెల్లఁ గేల నడి ♦ దంబులతోడను డాళ్లతోడ భూ
మీధరమందునుండి వడి ♦ మీఁదికి లేచుట చూడ నొప్పె నా
యోధనమందు కాలి యడు ♦ వుజ్జగిలం బయికేగు వైఖరిన్ ౮

చ॥ శరదము లర్కచంద్రు లుడు ♦ సంతతి నిల్కడ దప్పఁ గ్రుంగి యు
ర్వర నిగఁబడ్డ పర్వతము ♦ వాఁడి నఖంబులు లావు బాహువుల్
మురువుగ నొప్ప వాయుజుఁడు♦మూఁపునఁ గంబమువోలె నుండఁగా
శరధి మునుంగు నోడయను ♦ జానునఁ దోఁచెను చూడ్కి కబ్బమై. ౯

ఉ॥ గైరిక మింగిలీకమును ♦ గంధము పుష్పాడి చెందిరంబు నిం
డారఁగఁ బూసికొంచు నచ ♦ లావగ లెల్ల ధరిత్రిపై వడిం
గాఱుట చూడ నొప్పె గిరి ♦ గర్భము వ్రీలఁగఁ ద్రొక్క రక్తముల్
ధారణిఁ జింది వెల్లువయి ♦ తర్లిన విన్నను వొంది యత్తఱిన్. ౧౦

చ॥ శరనిధిఁ ద్రచ్చు మందరము ♦ చాడ్పున నగ్గిరి రాజ మప్డు ది
ద్దిరఁ దిరుగంగ నందలి య ♦ తిప్రవరుల్ తపముల్ ముగించి చె
చ్చెర విలయంబొకో యనుచుఁ ♦ జింత వహించుచు దేహబంధముల్
విడియక మున్నె తామెగిరి ♦ వెళ్లిరి మోక్షము చేరు వైఖరిన్. ౧౧

ఉ॥ భానుని పోలు కాంతిగల ♦ పర్వత ముబ్బి పటాలుమంచు బీఁ
టూనఁగ సుందరుల్ వడఁకి ♦ యెక్కుటఁ గౌఁగిలిఁ జేర ఖేచరుల్
మానుగ వెండికొండ దశ ♦ మస్తకుఁ డెత్తుడు నల్లలాడ శ
ర్వాణి పరిష్వజింపఁ గను ♦ పట్టిన శంభుని పోలి రయ్యెడన్. ౧౨

చ॥ ఒడలిని చేరు మాధవక ♦ మోరిమితోఁ దెలివిన్ వదల్పఁ గిం
కడరిన వేల్పు టింతులు భ ♦ యంపడి యల్కల వీడి యూఱటం
బడసి నిజేశులం గలిసి ♦ పైకి వడిం జనుచుండి విస్మృతిన్
విడిచిన కీరపోతములఁ ♦ బిల్చుచు సంకట మంది రత్తఱిన్. ౧౩

తే॥ నాకులును తాపసులుఁ దక్క♦లోకపతులు, జ్ఞానులును వచ్చి వరుసగై♦పూని నిలిచి
పూవులం జల్లి పావనీ! పోయిరమ్మ, యనుడు హనుమయు వేగిర♦మందె నెడఁద.

మ॥ విజయప్రాభవశీల! శైలనిభహం ♦ వీరా! ఘనుంగైన కుం
భజుఁడే త్రావిన వారిరాశి యన నే ♦ మాత్రంబు నాకిద్ది య
క్కజమే దాఁటఁగ నంచు నెంచుచు నల - వ్యస్మార్తిమై దాఁటి భూ
మిజ నాలంకను కాంచి రమ్మనుచుఁ ద - న్మిత్రుల్ ప్రశంసింపఁగన్. ౧౪

ఉ॥ పావని తాల్చినట్టి ఘన ♦ బంధుర రూపము లంక దాఁటనే ?
యావలి కేని పోవఁ దగి ♦ నట్టిది యంచు మహాద్భుతంబునన్
దేవత లెల్లఁ జూడఁ గపి ♦ ధీరుఁడు మున్నుగ వంగి పాదముల్
లావున నూని త్రొక్కి విపు ♦ లన్ దిగఁబాఱె మహేంద్ర మయ్యెడన్.

ఉ॥ వాలము పైకి నెత్తి బలు ♦ పాదములం గుదియించి నక్షముం
బోలఁగఁ గ్రుంచి యంసములు ♦ పొంగఁగఁ గంఠము వంచి బాహువుల్
వాలిక ముందు చాఁచి తల ♦ బ్రహ్మపదంబును ముట్టఁ బెంచి నే
త్రాలల లంకపై నిగుడ ♦ దర్పముతో వెస దాఁటె మింటికిన్. ౧౮

తే॥ హనుమ యారీతి నెగయంగ♦నతనితోడ, విభుని కార్యంబుకై పోవు♦విధము దోఁపఁ
దరువులును పెనుశిలలును♦ద్విరదములును,తక్కు ఘన వస్తువులు వియ♦త్స్థలికినెగసె.

ఉ॥ మారుతవేగుఁడైన హను - మంతుఁడు నింగికి నట్లు దాఁటగా
బోరున వెంటలేచు విట ♦ పుల్ పెనుగుండ్లును తక్కు ప్రాణులున్
వారక దక్షిణం బరిగి ♦ వైశమ లంకను చేరు శక్తి పెం
పారమిఁ ద్రోవఁబడ్డ క్రియ ♦ నంబుధిలోఁ బడియెన్ గుభాలునన్. ౧౯

చ॥ గగనమునన్ వడిం బఱచు ♦ గాడుపు పట్టి మహాశుగోద్ధతిన్
మృగములు మ్రాఁకులున్ లతలు ♦ మిక్కిలి సంద్రము పొంగునట్లుగా
దిగఁబడి యెల్లెడం బరవి ♦ ధీరుఁడు రాముఁడు కిన్క నూను ముం
దుగనె పయోధి యందయిన ♦ తోరపు సేతువు వోలె నేర్పడెన్. ౨౦

చ॥ ఉరవడిచేత భేదిలె మ ♦ హోదధి క్రిందటి నాగలోకముల్
విరివిగఁ గానవయ్యె మణి ♦ బృందము కన్నుల మిట్టి పాటుగా
మెఱసెఁ దదున్నతిం గని స ♦ మీరణ పుత్త్రకుఁ డేను నాగరా
డ్వరభువనంబు గాంచఁ దగు ♦ భాగ్యము గాంచితి నంచు మోదిలెన్.

ఉ॥ ఱెక్కలతో మహార్ణవము ♦ వ్రీలఁగ నేగి సురామృతంబు పే
రుక్కునఁ దెచ్చినట్టి విహ ♦ గోత్తము సత్త్వము నెల్లవేళలన్
మిక్కిలి పల్కుచుండెడు స ♦ మీరణ భోజులు వెండి తార్క్ష్యుఁడే
యిక్కడ కేగుదెంచె నని ♦ యెక్కువ భీతిలి పాఱి రెల్లెడన్. ౨౨

మ॥ లయకాలానలుపోల్కి నేగు కపిజా ♦ ల వ్యాఘ్రము వేగోన్నతిన్
సయిఁపన్ లేక చలించి తూలు తిమి మ ♦ త్స్య గ్రాహ పాఠీన సం
చయముల్ తెట్టెలు దేల నంబుధి మహా ♦ సంక్షోభముం బొందఁ ద
ద్రయ వీచీ నికరంబు మున్నుగనె మో ♦ దం జొచ్చె లంకాపురిన్.

చ॥ సకల చరాచరంబుల ద ♦ శల్ వచియింపఁగ నేల ? దిక్కరుల్
కకపికలయ్యెఁ బంతమున ♦ గాడుపు మేరువు నూఁపువేళ నా

సికరము పెల్లగిల్లి కడు ♦ శీఘ్రగతిన్ జలరాశిమీఁదఁ గం
దుకగతిఁ జిమ్మినం జరుగు ♦ తోయము దోఁచెఁ గపీంద్రుఁ డేగుచోన్.

ఉ॥ మండలధార నేగు వెలి ♦ మావుపయిం జను వజ్రి కంటికి
న్నిండుగ భారమై పరఁగు ♦ నెవ్వడిఁ గొండలు వారిరాశి భూ
మండల మొక్కయంజగొను ♦ మాత్రముగాఁ గనుపట్టుచుండ బ్ర
హ్మాండముల్లెల్ల నొక్కటగు ♦ నట్లుగ నేగెను పుష్పకంబు నాన్. ౨౯

తే॥ వేల్పులు నుతింప మునులు దీ♦వింప జనులు, మ్రొక్క మారుతి పగమది♦మును కొనంగ
దానవుని కసిదీఱ మ♦ర్దనము సేయ, శివుని విడి చను కైలాస♦శిఖరిఁ బోలె.

తే॥ బ్రహ్మకంటె విజ్ఞాని యా♦బ్రహ్మచారి, ధర్మవర్తనుఁ డేగుచోఁ♦దడవునుండి
యెడసియున్న త్రికూటమున్♦కొడుకుఁజూడ, మేరు వాశుగగతి నేగు♦తీరుదోఁచె.

చ॥ పలపల బ్రుంగఁదారకలు ♦ స్వర్గము క్రుంగఁ బయోధి పొంగ ది
క్కులు వడి ద్రుంగఁ బెన్గహలు ♦ కొండలు పాదగలంగ మేరువున్
వెలవెల చెంగ రాఘవుని ♦ విశ్రుత సాయక మట్లు లేగు క
ర్వలి కొడుకొప్పెఁ గల్పమునఁ ♦ బర్వు ప్రచండ సమీరణుం డనన్.

తే॥ పంక్తికంఠుఁ డింద్రియములఁ♦బదిలపఱచి, తివిరిచేయు తపంబు పూ♦ర్తిగ నశించె
ననెడు సూచన నుత్తర♦మున జనించి,దక్షిణము వోవు భాను చం♦ద్రమ్ము దోఁచె.

తే॥ క్రూరులు వసించు లంకను♦చేర జంకి, యితర పురముల నుండంగ♦నిచ్చ లేక
రాము శరణంబు నొంది మ♦రల వసింప, నరుగు ధర్మునాజ్ఞాచక్ర♦మనఁగ నొప్పె.

తే॥ ఒడలికాంతి పెంజీఁకటి♦నెడలఁ దోలఁ, గనకగిరి సిగ్గిలంగ నా♦కసము నంటు
దీర్ఘభుజుఁ డంతవేళ ను♦దీచి దిశను, వికటముగఁ బుట్టి వచ్చెడు♦విధుని పోలె.

తే॥ వెన్ను నాజ్ఞచే లావు చూ♦పింపఁ గోరి, గిరులు వెన్నంట మొగుళులు♦కెరలి తూల
జలధులు గలంగ దైత్యుల♦తెలివి చెడఁగ, వడిగ నెగసెడు గరుడుని♦పగిదిఁదోఁచె

చ॥ సురుచిర పుణ్యు లొందుటకు - సూటిగఁ బేర్పుగ నొప్ప, నొక్కటే
చరణమునన్ ముకుందుఁడు వ ♦ శంపడఁ గొల్చిన లోకజాలముల్
బెరయుచు దాఁటి యెల్లరును ♦ బెగ్గడిలంగ మరుత్సుతుండు తా
నురవడిఁ గాలపాశమన ♦ నొప్పిన వాలునఁ గొల్చె నత్తఱిన్. ౩౩

ఉ॥ క్ష్వేళితముం బొనర్చి వడిఁ ♦ గ్రీడగ నంబుధి దాఁటు వీరు లాం
గూలము చూడ నొప్పె శ్రుతి ♦ గోచరు రాము దయాబలంబుచేఁ
జాలిన యాంజనేయుఁడను ♦ చక్కటిఁ దోడుగఁ గొంచు గర్వదై
త్యాలికి జంకి వెంటఁ జను ♦ నంతకు పాశముఁ బోలి యయ్యెడన్. ౩౪

తే॥ శౌరి యాజ్ఞచే గరుడుండు ♦ చేరినంత, కనకగిరిఁ జుట్టి గట్టిగాఁ ♦ గవ్వికొన్న

చిలువఱేఁడు చలించి కుండలము వీడి, యవలి కేఁగు బాగున నొప్పె ననుమ వాలు.

క॥ హనుమఁడు వెడలెడు వేగం, బునఁ బుట్టిన గాలివీవఁ బోలుపఱి యొండొం
టిని తాఁకి విఱిగి పడి జడ, ధిని మునిఁగె విమాన చయము దివ్యులు బెగడన్.

క॥ వడి నేగు మారుతిం గని, చిడిముడి పడి విబుధు లితని చింతన మేదో ?
బెడిదులు గల పురిదాఁక నె, నడచునొ కడచునొ యటంచు నడిఁకి రెడఁదలన్.

తే॥ హనుమ మేని వాయువున దిశాంతములకు, నడరు కడలి యుఁగలగుండు వడి చెడంగఁ
బొడవువని గ్రంథములఁ జెప్పఁబడుచునుండు, తిమి తిమింగిలములు చచ్చి తెప్ప దేలె.

తే॥ అసదృశాత్ముఁ డల్లేగు చో నలవు వేగ, మొసఁగు నిశ్చల దీర్ఘ బాహువులు రామ
లక్ష్మణులు కరుణాళువు లెక్కడఁక ముందు, పోవు పోలిక గనిపించె పోలుపు మీఱ

—: కడలినుండి మైనాకుఁడు లేచుట :—

తే॥ మదకరీంద్రముఁ బోలిన మారుతి యటుఁ, బవనువలె నేగ మైనాక పర్వతంబు
నడుమ లేచెను కలశాబ్ధి నడుమ నుండి, త్రచ్ఛుతఱి లేచు నైరావతంబు కరణి.

తే॥ వేయి బంగరు శిఖరముల్ ♦ వెలయ నతము, పాఱు సెలయేళ్లు తెలి వల్లె ♦ వాటుగాఁగ
నసుర బాధల నడఁగింప ♦ నబ్ధి నిద్ర, వీడి వెసలేచి వచ్చిన ♦ వెన్నుఁ డనఁగ ౪౧

చ॥ నెఱిఁ జదువంగ లేక విన-నేరక యింద్రియలోలుఁ డైన వే
దుఱు మెడ నిక్కకై వడిని - తోరపు భారముచేఁ బయోనిధిన్
విఱిగి మునుంగుచుండు తఱి - వెన్నుఁడు కచ్ఛపమై వహింపఁగా
నురవడిఁ బైకి లేచిన మ-హోన్నత మందర శైల వైఖరిన్ ౪౨

తే॥ నెగయ ననువుగా ఱెక్కలు-నెగడు చుండఁ, గ్రమ కాంతితో గంభీర ♦ కంధిఁ జీల్చి
కొనుచుఁ జని సుధ నాగుల ♦ కొనర నిచ్చి, లేచునట్టి సుపర్ణుని ♦ లీల యనఁగ.

తే॥ మొదలు తుది యెఱుంగఁగ రాక ♦ మొనయు విష్ణు, కరుణ చేఁదొల్త జలమందు ♦ గలిగి సకల
జగములను సృష్టి సేయంగఁ-జాలినట్టి, యజుని కన్నట్టి యాహిర ♦ ణ్యాండ మనఁగ

తే॥ తన్నమును నీటఁ గాంచిన ♦ తండ్రిఁ గనక, సత్కృతులఁ జేయలేనని ♦ స్రష్ట తలఁచి
యందు మునిఁగి మహాతపం ♦ బాచరించి, పూర్తి గావించికొని లేచు-పోలుపు దోఁప

ఉ॥ తానిడుమాల లెక్కడని ♦ తప్పున కోర్వఁగ లేని మాని కో
పానఁ బయోనిధిం బడిన ♦ భాగ్యము లెల్లను వెండి యీయ శ్రీ
శానుఁడు పూనునాఁడు కెల ♦ సంబున దివ్యులు దైత్యులున్ వడిన్
జానుగఁ జిల్కఁ బాల్కడలిఁ ♦ జయ్యనఁ దోఁచిన చంద్రుఁడో యనన్.

సీ॥ ఒకవంక నెఱువు వే ♦ ఱొకవంక నలుపునౌ, ఘన శరీరచ్ఛాయ ♦ గడలు కొనఁగ
పవడంపుఁ దీవల ♦ పఱపు గాత్రములోడ, కమనీయ ఘనశిఖ ♦ రములు వెలయ

గుహల నక్రములు మే♦ల్కొని నిశ్వసింపంగ, ముత్తెంపుఁ బుర్వులు♦ మొనసి మొరయ
పటిక బండల మీఁది ♦ పండు వజ్రాక్షికములు, తివిరి చందురు డాలు♦దీలు సేయ
తే॥ రత్నరాశి వెలుఁగు శిఖ♦రములు హస్తముల విధంబునఁ గానరా♦జలధి మునిఁగి
మణుల ముత్తెముల్ చేవారి♦కొనుచుఁ బైకి, లేచి వచ్చెడు మానిసి♦లీలఁ దోఁప.
తే॥ సౌధములమీఁద వెలయు ధ్వ♦జంబులట్లు, నిర్ఝరశ్రేణి తెల్లనై ♦ నెఱసి పఱవఁ
బనిగ వనధివలన వెలి♦వడిన కతనఁ, ద్రుళ్లి దోనలలోఁ బెను మీలు♦త్రొక్కటపడ.
తే॥ శత్రుషట్కంబు ముప్పగ♦సమయఁజేయు, జ్ఞాన మొప్పార శంకలు♦మానువారి
కరణి సర్పముల్ గుహలలోఁ గష్టమొంది, బయల నప్పు డూర్చుచు హాయి♦వడసి నిలువ.

చ॥ అతులిత ధీరుఁడౌ హనుమ♦యద్దముపై నొక యుద్దిగింజ యొ
క్కతడవ దోర్గులోపల న ♦ కాశమునన్ గగనంబు నంటి ది
క్తతులకుఁ బర్వి నిల్చిన యు ♦ దగ్ర మహీధ్రము నక్కజంబుతోఁ
గొతుకుచుఁ గాంచి యేమిది యొ♦కో యని యించుక చర్చ సేయుచున్.

ఉ॥ ఇయ్యది వార్ధినుండి పయి♦కెక్కి నిలంబడెఁ గారణంబు లే
కియ్యెడఁ బాద మూన్చుటయు-నెగ్గగు నంచెద నిశ్చయించి దా
నయ్యవనీధరం బెగసి-యవ్వల డొల్లఁగ ఱొమ్ముతో వెసన్
ద్రయ్యఁగఁ దాఁకి యవ్వల ది♦వంబును దాఁకఁగ దాఁటె మింటికిన్. ౫౧

తే॥ జలధినుండి లేచిన గిరి-వరుఁడు తలరి, యురలి చలియించి చింతించి మరల లేచి
మనుజరూపంబుతో నిల్చి మానసీయ! విన్నపం బొండు వినుమని - వినిచె నిట్లు.

సీ॥ పగవాఁడనుచు మది భావింప వలదయ్య, తొల్లి కొండలు ఱెక్కలుల్ల సిల్ల
భువనంబులకుఁ గీడు పొనరించుచుండ నింద్రుఁడు వాని ఱెక్కలు తుంట్లుగాఁగఁ
ద్రెంచిన తఱి వాయు దేవుండు ప్రేమతో, నీచోట నను చేర్చి కాచినాఁడు
మిత్రపుత్త్రుఁడవను మేల్మి ప్రేరేఁప నా, వలన వేఱగు మేలు కలదె యనుచు
తే॥ నరసి యిట వచ్చినాఁడ మహాత్మ! నీవు, రమ్యకాంచనమయ శిఖరంబులందు
కొంత విశ్రాంతి గొని పొమ్ము-కూర్మి మీఱ, నేను ధన్యుఁడ నౌదు నీ హితమువలన.
తే॥ నీతినిధి రామునాజ్ఞఁ బూనిన కపీంద్రుఁ, డమరులు సుఖింప జానకి నరయ వచ్చె
మంచియదను నీ భాగ్యము మ్రోఁగె ననుచు, వాహినీపతి సెలవిచ్చి పంపినాఁడు.
తే॥ తల్లికంటె మేలని నన్ను దలఁచి యిందు, కొంత శ్రమ దీర్చికొని విందు గొందుగాక
యింటి కేగుదెంచినపుడె హితుల సత్క, రింపకున్న వేఱొండేది యింపు నింపు.
క॥ అను నాతని నయ వాక్కుల, విని పావని యితఁడు హితుఁడు విమలుఁ డనుచు న
మ్మనమునఁ దలఁచి స్మితుండయి, తను చూడఁగ నెదుట నిలిచి తద్గిరివరుతో.

చ॥ శ్రమ మొక యింత లేదు రఘు ♦ రామ పదాంబుజ చింతనంబుచే

నమల మనస్క! నాయకుని యానతి నాదగు కోర్కె తృప్తిగా
నమరక మున్నె యోగిరము నాడటఁ గైకొనఁజాల నీదు ప్రే
మమె నను తృప్తుఁ జేసె వినుమాన్యత నన్నియుఁ గొన్న యట్లెకా?

ఉ॥ వేఁడకమున్నె పిల్చి యిడు - వీరుల, వేఁడిన నిచ్చువారలన్
బోఁడిమి సంస్తుతింప నిడు - పూరుషులందు గుణంబె ముఖ్య మీ
పాడగు దేహమం దిడెడు - పాటికి నెమ్మికకంటె నున్నదే?
ఊడిగ ముందునేమి మఱి - యుర్విని మక్కువకంటె హెచ్చుగన్? ౫౯

తే॥ వడిగ నేగి త్రికూటాద్రి పైని లంకఁ, జేరి యేలిక పని పూర్తిచెందునేని
మరలి వచ్చుచో నీ విందుపెరిమఁ గొందు, ననుచు సత్యప్రతిజ్ఞఁ డాహనుమ వెడలె.

చ॥ గగనమునందు ప్రొద్దు నెద గందును రిక్కలు స్వర్విమానముల్
మొగుళులు నొక్కచోఁ గలిసి ముద్దగఁ జేరఁగ నయ్యె వేఱు వే
ఱుగఁ గల వస్తుజాలములు ఉవ్వన వీచెడు గాలిచేత నొ
క్క గమిగఁ జేరు నప్పగిది గాడుపుపట్టి గమించు నుర్విడిన్. ౬౦

చ॥ జడనిధి నుద్ధతిం జను ప్రజాహితు వేగముఁ గాంచి భాస్కరుం
డడుగిడ లేని శైశవము నందె మదీయ రథంబు మీఁదికిన్
దుడుకున దూఁకె నేరి పయి దూఁకఁగ నిప్పుడు నిశ్చయించె నీ
జడియని దిట్టయంచు మది జంకు వహించుచు నుండెనయ్యెడన్. ౬౧

ఉ॥ కత్తినిపోలు వాఁడి పలుకాంతి నభోమణిచెంత వెల్గఁ బై
కెత్తిన తోఁకతోడ విరియించిన మేను నభంబుఁ గప్పఁగా
నత్తఱి రాహుఁబోలె నతఁ డడ్డునఁ జీఁకటి పైని కాంతి రే
కొత్త మహోపరాగ దిన మో యన నొప్పె జగంబు చూడఁగన్.

## —: సురస హనుమ నడ్డగించుట :—

తే॥ ముజ్జగంబుల కష్టంబులుజ్జగింప, సమ్మతించి వచ్చిన కపిచంద్రు సత్త్వ
మెంత కొలఁదిదో యెఱిఁగి రమ్మీ యనంగ, సురల యనుమతి నెదుటికి సురస వచ్చె.

తే॥ బాకి నోరు రక్కసి రూపు పడసి వచ్చి, కాల భీకర మూర్తి శాఖామృగంబ!
నాకు నామిషంబై వచ్చినాఁడ వింక, నిచటి కేగెద వని యెట్టయెదుట నిలిచె.

క॥ అడరుచు మండెడు నాఁకలి, నడఁపగ మత్కుటిల దంష్ట్రికా కీర్ణంబై
బెడిదమగు కడుపుఁ జొరుమా, విడివడ నొక త్రోవ లేదు వినుమా యనుడున్.

తే॥ ఆఁడుదాన వాఁకలి బాధ నలసి తీవు, దేవదేవు నాజ్ఞను తీర్చి తిరిగివచ్చి
నీకు నాహుతి యయ్యెద నిజము విడువు, మనుచు మారుతి నవ్వి నయంత నామె.

మ॥ భువనంబుల్ గనుఁగొంచు నుండఁగనె నీ ♦ పొంగార్చి భక్షించెదం
జవు లూఱంగ నటంచుఁ బల్కెఁ గపి వం ♦ శ శ్రేష్ఠుఁ డుద్దండుఁడై
నవుచున్ నీ యుదరంబు చొచ్చెదను వి ♦ న్నాణంబుమై నీవు జా
ణవ యేనిన్ గ్రసియించుమా యనుడుఁ గి ♦ న్కం బొంది యన్నారియున్.

సీ॥ పెక్కండములఁ బట్టి ♦ పుక్కిలి గొనఁజాలు, విరివియౌ వదనంబు ♦ విరిసి నిలువ
నదిగని యప్పౌరుఁ ♦ డన్ని దిశలఁ బర్వ, నామె నోరే చిన్న ♦ దనఁగఁ బెరిఁగె
సురసయు మఱిమఱి ♦ విరియుచు నుండ నా,తఁడు తటాలున సూక్ష్మ ♦ తనుఁడు గాఁగఁ
గుదిసి కడుపుఁ జొచ్చి ♦ కుఱుచ యాపిరి విడు,నంతలోఁ గుప్పించి ♦ యవల దాఁటె
తే॥ వేలుపులు మెచ్చి కురిసిరి ♦ విరుల వాన, కార్యదీక్ష ననుమ వో ♦ వఁగడఁగ నామె
స్వస్వరూపంబుతో మెచ్చి ♦ చనవుతోడ, ముచ్చటించి దీవన లిచ్చి ♦ పుచ్చె నతని.

క॥ పాడిరి పాటలు కిన్నరు, లాడిరి రంభాదు లుబ్బి ♦ యభినయములతోఁ
గూడిరి పొగడుచు విబుధులు, వీడిరి దీవించి మునులు ♦ వేదోక్తులతో. ౬౯

క॥ మందార కుసుమ వాసన, చిందించుచు వీచె గాలి ♦ చెమ్మట వీడన్
జందముగా విద్యాధర, సుందరులును వాదనమునఁ ♦ జొక్కించి రొగిన్. ౭౦

—: అంగారధార హనుమంతుని మ్రింగుట :—

సీ॥ హాలాహలముఁబోలు ♦ నంగారధారయున్, రక్కసి యొక జల ♦ రాశి ముంప
వేఱొక్క జలరాశి ♦ విరిసిన తెఱఁగున, లేచి యెవ్వరు నను ♦ లీల దాఁటు
వారంచు గర్జించి ♦ పాదాంగదమ్ములు, మున్నీరు పొంగిన ♦ మొగిని మొరయ
వేదవేద్యుని త్రోవ ♦ వెదకి యుదధినుండి, పొడచూపు మధుకైట ♦ భులను పోలి
తే॥ క్రొన్నెల బెడంగు చిందించు ♦ కోఱలొప్పు, నభవు చందాన గజచర్మ ♦ మమరఁగప్పి
బ్రహ్మగోళంబునకుఁ జను ♦ ద్వారమనఁగఁ, దెఱపి వదనంబు విప్పి యా ♦ తెఱవ నిలిచె.

తే॥ జలధి పాదముల్ గడుగ శీ ♦ ర్షంబు మింటి, సోఁడుముట్టంగఁ బెరిఁగిన ♦ చొప్పు గాంచి
యధిక మేధావి మారుతి ♦ యాత్మఁ దలఁచె, దయయు ధర్మంబు మ్రింగిన ♦ దైత్య యనుచు
ఆ॥ దాని నోటఁ జొరక ♦ తప్పించుకొని పోవు, దారి గనక చింతఁ ♦ దవిలి తేఱి
గుహనుపోలు కడుపుఁ ♦ గ్రొచ్చి యవ్వలి కేగు, టుచితమంచుఁ దలఁచి ♦ యొయ్యఁ బలికె

శా॥ ఛాయా గ్రాహక శక్తి నొందిన గతిన్ ♦ సాధించుచున్నావు న
న్నియా చందములన్ గ్రహించియు బలం ♦ బింతేఁ గనన్‌లేవు నో
రే యాకాశముఁ బోలఁ గప్పికొని దా ♦ రిం బట్టి బంధించి తి
ట్లే యేరీతిఁ జరింతు వెవ్వతెవు నీ ♦ వెందుండు తెల్పంగదే?

చ॥ అనవుడు దైత్య యిట్లనియె ♦ నాఁడుది యన్న తలంపు వీడు డా
సిన యవి జీవముల్ గొనుచుఁ ♦ జెల్లఁగఁ జాలవు కాలుఁడైన నేఁ

దినఁ దలకొన్న ప్రాణులను ♦ తేఁకువతో విడిపింపలేఁ డహో
వనచర! నీవనంగ నొక ♦ పాటియె నాకని నోరు విప్పుచున్. ౭౫

చ॥ గుటుకున మ్రింగ మారుతియుఁ ♦ గోరికతోడనె దైత్యగర్భముం
దటుకునఁ జేరి వేలుపులు ♦ ధర్మువు చాలఁ దపించుచుండఁగాఁ
బుటుకున వెల్వడెన్ నృహరి ♦ భూరి భయంకర మూర్తి పోలికన్
బటుకున దాని గర్భమును ♦ వ్రచ్చిన చేతుల నాంత్రరాజితో. ౭౬

చ॥ మదవతియైన దైత్య యటు ♦ మానెను ఱొలుచుఁ బ్రేవులెల్లఁ ద
త్పదములఁ జేతులం బెనఁగఁ ♦ బావని మింటికి నెక్కె ముండ్లతోఁ
బొదలు పొద ల్గలట్టి గుహఁ ♦ బూనికఁ జొచ్చి మహోరగంబులన్
బొదివి వడిం బయల్పడిన ♦ ప్రోద్ధత వత్సుని తార్క్ష్యుకై వడిన్. ౭౭

తే॥ ప్రేవులంగొని వైళంబ♦వింటి కెగురు, హనుమ ఘన చిరంజీవుల-యందు మేటి
వాలపాశమ్ము తోడ నం-బరమునందు, దిరుగు గాలిపడగఁ బోలి♦ తేజరిల్లె. ౭౮

క॥ దురపిల్లిరి దైతేయులు, సురలు ప్రహర్షించి యార్చి ♦ సొటసొట విరులం
గురిసి రజుఁడు మెచ్చెను శం, కరుఁ డచ్చెరువందె మునులు ♦ గని రగ్గలికన్.

తే॥ చెడుగు నోటిని కడుపును ♦ చీల్చివైచె, దనుజ గూలె నభంబున♦హనుమ యేగె
మేరువును మీఱి పెరుఁగు సా♦మీరి వడియు, నెడఁద వడికంటె హెచ్చని♦నుడివె రవియు

తే॥ కవుల యూహలమించి యీ♦కడలియొప్పె,విఘ్నములవెన్ని యొదవిన♦వీఁగఁ కేగఁ
జేరుదును లంక, చేరిన♦సిద్ధి యొదవు, ననుచు మారుతి చింతించె♦మనమునందు.

చ॥ తిరమగు ధర్మముం గొనక ♦ తెక్కలి దైత్యులు చేయు పాపముల్
భరమయి లోకముల్ బహుళ ♦ బాధల నొందుచునుండెఁ దీఱు చొ
ప్పరయగ వేఱు లేదు నక ♦ లాపదలం దొలఁగించు లోక నుం
దరుఁడగు రామచంద్రు శుభ ♦ తారక నామము దక్క నీ భువిన్.

—: ఆంజనేయుఁడు ప్రవాళగిరిం జేరి లంకనుగాంచుట :—

ఉ॥ ఊటలు పాఱు తేనియల ♦ నొప్పగు కల్పక వాటి దేవతా
వాటము డాసి మింటఁ జను ♦ వాయుతనూజుఁడు ధర్మకూటమా
కోటలు పేటలుం గనక ♦ కోరిక లంకకు నేగ కివ్వలన్
దోఁటలు దోర్వ్యాలున్ విరిసి ♦ తోఁచు ప్రవాళగిరిన్ వెసన్ దిగెన్.

ఉ॥ అంబర వీథినుండి వడి ♦ నాశుగ మాసుఁడు డిగ్గ నగ్గిరీం
ద్రంబు చలించి పట్టుడిగి ♦ తద్దయు నుఱ్ఱుటలూఁగె వస్తు జా
లంబులు నిండఁగల్గి విపు ♦ లంబగు నబ్ధిని గాలివాన చై
దంబున వస్తువుల్ దొరలఁ ♦ దాళక యూఁగెడి నావ కై వడిన్.

చ॥ ఇల యడుగున్న యంతకు వ ♦ హించి పునాదిని మేలి పై జగం
బులవఱకుం బెరింగిన య ♦ భూత విచిత్రిత లంక ముందటన్
గల గిరిమీఁద నిల్చి యటఁ ♦ గన్నుల మేరకుఁ దేఱి చూచె స్వ
ర్గలన ముఖంబుఁ గాంచు ముకు ♦ రంబన నొప్పిన యమ్మహాపురిన్.

చ॥ ప్రియముగఁ గాంచి ముక్కుపయి ♦ వ్రేలిడి యింద్ర పురంబు దీనికొ
ప్పయినది యంచుఁ బల్క మతి ♦ హైన్యము చెల్వు జగంబు లెల్ల వే
జయము గడించి యెల్ల సుఖ ♦ సంపదలం గొని యేలునట్టి దు
ర్జయుఁడగు రావణుం డిచట ♦ రాజిలుచుండఁగఁ దీక్ష్ణభావుఁడై. ౧౬

చ॥ అమరపురంబు భోగముల ♦ కాలయమంట యథార్థవార్త కా
దమరిక నెల్ల భోగము ల ♦ నంతములై తమ కోరినంత దూ
రము తగనొందుచున్ నిలువ ♦ రంబయి వేసరకుండు టెందు గం
దుమొ యదియే దివంబగు శ్రు♦తుల్ వచియించెడు నర్థ మద్దియే. ౧౭

చ॥ పఱపగు లంక రెండయిదు ♦ వందల యోజన విస్తృతంబుచే
నుఱవగునందు రెందు భువ ♦ నోన్నత వస్తువులెల్లనుండుఁ గీ
లెఱిఁగిన సూక్ష్మబుద్ధులు న ♦ హీనతఁ గాంచఁగఁ గోరినంత పె
ద్దఱికము నొందునే కనులు ? ♦ దందడి వింతలు మేర నొందునే ? ౧౮

## —: ౨. పురాన్వేషణ పటలము :— (౨౩౪)

చ॥ మొగుళుల దాఁటి చంద్రముని ♦ ముట్టెడు మేడలు పైఁడి మేడలో ?
సొగసగు రత్నసౌధములొ? ♦ చూడఁగఁ జాలని మించు తివ్వెలో ?
తొగల విరోధి దీధితుల ♦ తో ఘటియించినవో ? మఱేవియో ?
తగ నెఱుఁగంగఁజాలని వి ♦ ధంబున నున్నవి నా యెడందకున్. ౧౯

క॥ అమరావతి మేడలతో, నమరిన దిందొక్క భాగ♦మనఁదగి మిగులం
గొమరారు సౌధములు మల, యమారుతము వచ్చు మాడ్కి♦నడరుచునుండెన్.

ఉ॥ తీయని పల్కులం జెలఁగు ♦ దివ్య మృగాక్షులు మించు తీఁగలన్
బాయక పట్టి పట్టి యొక ♦ పాటిగఁ జేఁపురు గట్టె మేడలన్
మాయఁగఁ జేయు గందవొడి ♦ మాటికిఁ జిమ్మి తొలంచి స్వర్ణదీ
తోయము ముంచి తెచ్చి యటఁ ♦ దోఁగఁ గలాఁపి విదుల్తురెప్పుడున్.

ఉ॥ నృత్యముఁ వేళఁ దాళము గ ♦ ణించెడు గజ్జెలచేత లక్కచే
స్తుత్యములైన కాళ్ల సొగ ♦ సుం గొను వ్రేళ్లు ప్రవాళకాంతులన్
నిత్యము వీవ నెఱ్ఱనయి ♦ నీరదముల్ తమ దేహ సామ్య సాం
గత్యము వీడి యాచెటుల కై శిక ♦ సామ్యము నొందు నయ్యెడన్. ౨౦

ఉ॥ కస్తురి తావి వీచు నవ ♦ కల్ప పరీమళ పుష్పగుచ్ఛ వి
స్రస్త మరంద మాని భ్రమ ♦ రంబు లతృప్తిని పొంది వేగ వి
న్యస్త వినూతన ప్రియము ♦ లై సురలోకము లీలఁ జేరుచుం
నిస్తుల చంద్రశాలలను ♦ నెమ్మదిమై విహరించుచుండెడిన్. ౯౩

చ॥ నిరుపమ మాధురిం జెలఁగు ♦ నీటు మృదూక్తులు కీర శాబకో
త్కరములకున్ నయంబున ము ♦ దంబున నేర్పుచునుండు కాంతలన్
విరివిగ రత్న దీధితులు ♦ విచ్చిన కుడ్యములందు దోఁచు నా
తరుణుల నీడలం దెలిసి ♦ తథ్యముగా వచియింప శక్యమే? ౯౪

ఉ॥ డంబుగ నింద్రుఁ డుండఁగ నె ♦ డంబుగఁ గట్టిన వైజయంత సౌ
ధంబును పోలు నియ్యవస ♦ థంబు లనంగ గొఱయే యగుం జుమీ
యింబుగ నావచస్సు సరి ♦ యే యన దైత్యుల భోగ భాగ్య సం
ఘంబుల కొక్క మేరయును ♦ కల్గును పోలికయుం బొసంగెడిన్. ౯౫

తే॥ ఎట్టి మేటి రత్నములైన ♦ నీడ్యమైన, కౌస్తుభంబునకున్ సాటి ♦ గాంచనిక్రియ
విశ్వకర్మఁడే స్వయముగా ♦ వేడ్కతోడఁ, దీర్చి కట్టు సౌధములకు ♦ దీటు నున్నె?

తే॥ ఎల్లప్రాణులు చొచ్చి ల ♦ యింపఁ దగిన, భువననాయకు నుదరంబుఁ ♦ బోలు లంక
అర్క తేజులు దక్క న ♦ జాండమందు, తనరు వారులెల్ల నిందున్న ♦ వనఁగఁ దగును.

తే॥ తరువు లెల్లను కల్పక ♦ తరువులె యగు, మేడలెల్లను బంగరు ♦ మేడలె యగు
దాసదాసీ గణంబు త్రి ♦ దశ గణంబ; పరుల కరుదిద్ది బహు తపః ♦ ఫలమ యగును.

చ॥ దురమున నోడఁగాఁ దొలఁగఁ ♦ ద్రోయుటచే దవుదవ్వు దిక్కులం
జరుగుచు నిల్చినట్టి వగు ♦ సామజముల్ తగ నైదు హస్తముల్
పరఁగు వినాయకుండును వి ♦ భావసుఁ డెక్కెడు నొంటికంటి పె
న్నరదము నన్న యివ్వి పుర ♦ మందునఁ జేరనివై యెడంపడున్. ౯౬

తే॥ అమరవరులం దెవండు లం ♦ కాధిపునకు, సేవసేయక తప్పిన ♦ శీవి కాఁడు
ముగురు మూర్తుల మించియు ♦ నెగడు నితఁడు, చేయు తప మెట్టిపాటిదో ♦ చెప్పవశమె?

తే॥ ద్విరదముల ఘీంకృతులు దుందు ♦ భి స్వనములు, శరధి ఘోషంబు మార్కొని ♦ మొరయుచుండు
మధురవాణుల నూపుర ♦ మంద్ర విరవ, మన్ని రవముల నడఁగించి ♦ యడరుచుండు.

తే॥ రత్నమయు రథశాలలు ♦ రవియు బిడియు, మొందు కాంతులతో వెల్గు ♦ చుంటచేత
దీనిముందర మేటియౌ ♦ త్రిదివ జగము, నరకలోకంబువలెనె గా ♦ నంగఁబడును.

ఉ॥ అందముఁ ద్రావు చందమున ♦ నారసి యట్టె గుటుక్కుమంచు మ్రిం
గం దమి గొల్పు నంగమునఁ ♦ గ్రాలెడు నిప్పొరి నిండుకాంతు లిం
పొందఁగ వీచు ద్వేవగుణ ♦ భూషలు దైత్యులు మేనిరంగు నీఁ

గం దరినేగు చందురుఁడు ♦ కందును నీఁగఁ బయోధి పైఁడిగాన్. ౧౦౩

చ॥ నగర నిశాంతకాంతి కిర ♦ ణంబులు చీఁకటి మ్రింగుచేఁతకున్
జగములనిండు సంధ్య తమ ♦ సం బడఁగించు దినేశు చేఁతకున్
దగ నుపమింపరా దటులు ♦ తప్పి వచించుట న్యూనతన్ గనున్
దొగల విరోధి ముందఱ మి ♦ ణుంగుఱు లట్టుల నుంకు నిద్యోదన్.

తే॥ గందమును తేనె కస్తూరి ♦ కల్పతరుల, క్రొవ్విరులు కరిమదమును♦కూడి పాఱి
కడలిఁ గలియుటచే నందు♦గలుగు మీాలు, పరవు కాచు వాసన వీడి♦పరిమళించు.

క॥ పొగడుదమ విశ్వకర్మను, బొగడుదమా పంక్తి కంఠు♦పూజ్య తపంబున్
బొగడుదమ యజుని వరములఁ, బొగడ వలంతులమె బ్రమయు♦ములుచల మెదియున్.

చ॥ అడవులు తోఁటలున్ మణుల♦హాటకమందు ఖచించి చిత్రకా
రుఁడు తగ నిల్ప నయ్యవి యు ♦ రుస్థితిఁ బూవులు పండులిచ్చు గా
రడము క్రియన్ విచిత్రగతి ♦ రంజిలు నిచ్చటి సోయగంబు వెం
గడమగుఁగాక పొందుటయుఁ ♦ గల్గునె స్వర్గము నీ ధరిత్రియున్.

తే॥ అవని జలమగ్ని గాలియు♦నాకసంబు, తమ మహోన్నతిచే గొప్ప♦తనము గనవు
గోపు రౌన్నత్యమును కనఁ♦గొనియెనేని, పొన్నుమల యెంత లజ్జించి♦వుల్ల సిలునొ?

చ॥ తిరమగు వప్ర కుడ్యముల ♦ దీధితులే మిఱుమిట్లు గొల్పఁగాఁ
దరణి కనుంగవ న్మొగిచి ♦ తద్దయు సిగ్గిలి యుప్పరంబుపై
నరుగమి నేరకే జనము ♦ లందురు క్రూరగుణుండు పంక్తికం
ధరుఁ డలుకన్ సహించునని ♦ దద్దఱి పోవఁడ యన్న యూహమై.

తే॥ జన్మవైరులై సత మెగ్గు ♦ నలుపువారు, నిర్జరులెయంచు వారల ♦ నిలువరింప
దానవేంద్రుఁడు కట్టించె ♦ దారికడ్డు, గోడయన నొప్పుచున్నది ♦ కోట పొడవు.

ఉ॥ పోవదు కోటదాఁటి జగ ♦ ముం జడిపించెడు చుట్టుగాలియున్
బోవవు భాను దీధితులు ♦ పోవదు కాలుని దార్ఢ్యబుద్ధియున్
బోవదు ధర్మదేవతయు ♦ భూజనులిచ్చెడు యాగభుక్తి కా
పోవక వేచు వేలుపులు ♦ పోవుదురంటయు వ్యర్థవాక్కగున్. ౧౧౧

చ॥ అసదృశ భంగ సంగత మ ♦ హాంబుధి మధ్యమునందునిల్చి యా
కస మొరయంగ మేర యిడఁ ♦ గానక యున్నతమై పెఱింగి యొ
ప్పెనఁగు విమాన సుందరత ♦ హెచ్చిన లంక సనాతనుండు నా
భి సరసిజంబునుండి తగ ♦ వీడిన యండముఁబోలి వెల్గెడున్. ౧౧౨

క॥ పాడెదు వారలు పెక్కుం, డ్రాడెదు వా రంతకంటె ♦ నధికులు చెలఁగన్
వీడిన వేల్పుల నాటక, మాడించుచు వేడ్క గనుదు ♦ రచ్చటి యసురల్.

ఉ॥ హార్వ్యగా నటింతు రచట ♦ నమరకాంత లెప్పుడు గం
ధర్వవనిత లంతకంటెఁ ♦ దరముగా నటింత్రు పై
మర్వ్యగా నటింత్రు దైత్య ♦ ముగ్ధలందు వారలన్
బర్వి చూచువారు తక్కు ♦ పడఁతులెల్ల వేడుకన్. ౧౧౪

చ॥ నవనిధు లెప్పుడు న్నిలిచి ♦ నాఁడెపు భూషణ వస్త్రమాల్య సాం
కవ మృగనాభికాదుల ర ♦ కంబుగ నిచ్చుచు నాడిగీంద్ర కం
దువము వహించి కొల్చునసఁ ♦ ద్రొక్కట నొందు నుతింప నాల్కయున్
దవిలి తలంపఁగా మదికిఁ ♦ దట్టము పూనిన దోసమే యగున్. ౧౧౫

చ॥ తలఁచిన యట్లు నల్వయు ము ♦ దంబున నమ్ముఖమందు నిల్చి తా
నలచిన రీతిఁ బద్ధతులు ♦ పాటిగఁ దెల్పుచునుండ, వేలుపుల్
తెలచి నుతించు మేరువునఁ ♦ దేర్చిన మిన్నుల వారి తెచ్చి తా
మలచిన యట్లు చల్లి పురి ♦ మానుగ శిల్పి ఘటించె నాఁడగున్. ౧౧౬

తే॥ వాద్య గంభీర రవముల♦వార్ధిరావ మడఁగెఁ బరమేష్ఠి తన కేలఁ ♦ దడవఁదగిన
పొడవు శిఖర సౌధంబులఁ♦బోలఁతు లెగచు, నగును పొగచేత మొగిళుల♦పొగరు లడఁగె

చ॥ స్ఫటికశిలామయంబులగు ♦ సౌధములందును కల్పకాది రా
డ్విటపులు గల్గు తోఁటలను ♦ వేఱగు తక్కిన చోటులందు ను
త్కటముగఁ గల్గువాని భ్రమ ♦ దప్రద మత్తత నాడువారె గా
కెటనెటఁ గానరారు మది ♦ నించుక చింత గలార లొక్కరున్. ౧౧౭

చ॥ అసురమృగాక్షులం గలిసి ♦ యవ్వనులందు విహారలీలలన్
విసువక సల్పుచున్ మధువు ♦ వేడుకఁ ద్రావుచుఁ బాడుచుండ సం
తసమున విన్చి మోవిగొని ♦ తన్పుచు సొక్కుచుఁ గిన్కనూనియు
న్న సకులు తేఱ ద్రొక్కి దయ ♦ నల్వఁగ గాంచెదు వారలే చుమీ.

తే॥ స్తనగిరులపై నివ్రాయు చి♦త్రంబులంట, నలుపు మేనుల నలముచుఁ♦ బొలయువారు
అలుగు పడఁతుల పారాణి♦యంటియున్న, కేశములను రాక్షసవరుల్ ♦కెఱుకువారు.

తే॥ చిన్ని పెదవుల విద్రుమ ♦ శ్రేణిఁబోలె, వాడి చూపుల గములఁగ♦ల్వలనుపోలె
వదన వితతిచేఁ జెందమ్మి వనముఁ బోలెఁ♦జెలువుమీఱినయాలంక♦చెలులవలన

చ॥ అతిశయ చిత్రమయ్యె ద్రుహి ♦ ణాండము మొత్తము నేఁటిదాఁక నొ
క్కతలమె భారమెల్లఁ బడి ♦ క్రందుగఁ ద్రొక్కఁగఁ జీలకుండ, నే
వితథముగా శ్రమించి మితి ♦ వెట్టుట యెట్లగు? నెల్లప్రాణు లీ
దితిజుల సంచయంబు గణు ♦ తింపఁగ నల్గకుఁ జాల వెన్నఁడున్. ౧౨౧

సీ॥ ఒడలిచే నున్నతి ♦ నొందినవారుపీ, ర్యంబున మితిమీఱి ♦ యలరువారు
జగము లయమునకు ♦ సంసిద్ధులగువారు, వరబలంబున సాటి ♦ వడనివారు

మాయావృతైన దై ♦ తేయులు వసియించు, లంకకు మేర ప ♦ ల్కంగవశమె ?
కాళ్ళల మణివీర ♦ కటకాంగదంబులు, హస్తంబులందు క్రూ ♦ రాయుధములు
తే॥ కనుల నెఱ్ఱఁదనంబును ♦ కలుగకుండు, వారలే లేరు; వారలఁ ♦ బదరి యెదలఁ
దలల లత్తుక దగులంగఁ ♦ దన్నకుండు, మత్తకాశినుల్ దొరకరు ♦ మందునకును.
సీ॥ ఆసక్తిమైఁ దేఁటు ♦ లలమ నొప్పెడు నవి, యొడలి నీచడరంగ ♦ వెడలునవియు
వెల్లదంతంబులు ♦ నల్లని మేనులు, నెఱ్ఱని శిరములు ♦ నెసఁగునవియు
మత్తిల్లి కొండల ♦ మాడ్కి నుండునవైన, వేదండ తండముల్ ♦ వీఁక తోడఁ
దేనియ గాఱ వ ♦ ర్ధిల్లిన యెఱ్ఱని, వెండ్రుకల్ గల దైత్య ♦ వితతిఁబోలు ;
తే॥ స్త్రీలుపురుషులు విసుగుచేఁ♦జెదరవీచు,హారములు కుండలములుమా♦ల్యమ్ములెల్లఁ
గరుల మదజలమును తురఁ♦గముల నురుగు, నదులగుచుఁ గొనిపోవఁగ♦నుదధి నడఁగు
తే॥ మధువు సేవించి మొగమున♦మందహాస,మమర నసుర కాంతలు వాచి♦కాంగికములు
గతులు దప్పక చూప దే♦వతల సతులు, సిగ్గుపడి మదిసోల వీ♦క్షించుచుండ్రు
తే॥ నాశపఱచు టటుండనీ♦నగచరేంద్ర, బలము లిట వచ్చుటయు నల♦వడునుగాక
భూరి భీకర దైతేయ ♦ వీరరక్ష, యడరు నిప్పీట వారడు ♦ గిడఁగ వశమె?
చ॥ మరలి దినాధినాథ కుల ♦ మండనుతో వివరించుచో ధను
ర్ధరులబలంబె యన్నిట వ ♦ రంబగునందునో ? ఖడ్గి వారమే
యురవగునందునో? బరచి ♦ యొప్పిన సేనయె దొడ్డదందునో ?
బిరుదు వజీర్ల కూట మది ♦ పెద్దది యందునో ? యేమి యందునో !

—: సూర్యాస్తమయము :—

తే॥ లంకఁ గూఱిచి యిట్లు ద♦లంచి హనుమ, మత్తు లిచటికి వచ్చిన♦ వత్తు రనుచు
మేను గ్రుంగించికొని గిరి♦మీఁదనుండె, భానుఁడును గ్రుంకె నప్పుడు♦పశ్చిమాబ్ధి
సీ॥ మనసు పోయిన పోక♦లను పోయి జనుల హిం, సించి విత్తమ్మునా♦ర్జించువాఁడు
తలఁపు విచక్షణ ♦ త్వము వివేచనము మా, నినవాఁడు సూక్తుల ♦ విననివాఁడు
కాఁగల చెడుగు లె♦క్కగొనని వాఁడు వా, స్తవహీనుఁడగు నొక్క♦జనుని కలుచ
విరిసిన పోల్కి ♦ నసురకూటములమాడ్కి, ఋషులు వేలిమి నుండి ♦ రేఁచి పంపు
తే॥ కుంభి చర్మంబుఁ ద్రిపురాంత♦కుండు తీసి, లోకముల కొక హావడి♦లేక సేయఁ
గప్పియుంచిన కైవడి♦నొప్పి యంధ, కార మబ్జాండ కుహరంబుఁ ♦ గమ్మిరించె.
తే॥ చిరముగా వేయి నోళులఁ♦జిలువ తేఁడు, విడుచు విషము జగంబులఁ♦గడి గొనంగ
నెగడి తనవంటి నిప్పుతోఁ♦బొగలతోడ, నెదురులేకే చెనన నొప్పె♦నిరుల గములు.
తే॥ సముదుదారుఁడో రవికుల♦స్వామి దేవి, మాననీయ క్షోత్రడి యగు♦జానకిఁ గొని
దోర్బలుఁడు రావణుఁడు కారఁ♦ద్రోచుకతనఁ, జెడ్డకీర్తి వ్యాపించెనాఁ♦జెలఁగెఁ దమము

తే॥ అట్లు చీఁకట్లు పరవ దై ♦ త్యాళి యెల్ల, మంచిపద్ధతిఁ బడసిన ♦ మంత్రబలము
వలన దశదిశల్ జరుగంగ ♦ వలఁతులయ్యెఁ, దమము విరిసిన వేళనే ♦ తరలినారు.

క॥ సహజక్రూరులు రాక్షసు, లహామహామిక నమర నగరి ♦ కరిగెడువారు
త్సహనమున విధుజగమునకు, సహః పతి తనూజు పురికి ♦ నరిగెడి వారల్.

క॥ సురరిపు సేవకు విద్యా, ధర పన్నగ యక్ష సిద్ధ ♦ తరుణులు బలు తోం
దరపడి మెఱుపుల గము లం, బరమున బఱ తెంచు లీల ♦ వచ్చిరి సొరిదిన్. ౧౩౪

క॥ సురనాగ యక్ష విద్యా, ధర కిన్నర భుజగ సిద్ధ ♦ దానవులు వడిన్
వరుసలుగా నేతెంచిరి, పురుహూత విరోధి సేవ ♦ పోఁడిమిఁ జేయన్. ౧౩౫

క॥ ప్రతిమలవలెఁ జేరిన దే, వత లింతగఁ దామసించి ♦ వచ్చితిమి కదే !
దితిజేశుఁడు కినియును యని, కొతుకుచుఁ బరుగిడిరి కొనిన ♦ కోలము లురలన్.

—: చంద్రోదయము :—

క॥ తనకం దగని యఘౌఘము, తనకి దహింపంగ నల్లఁ ♦ దనమును గొని మాఁ
డిన ధర్మబీజము హనుమ, యను వానను మొలచుపోల్కి ♦ నబ్జుఁడు పొడమెన్.

క॥ తోతెంచిన శశి రాముని, దూత యరుగుదెంచె దొసఁగు♦తొలఁగిన దంచున్
జేతము తనిసిన ప్రాగ్ది, క్స్త్రీతరుణీవదన మనఁగఁ ♦ జెలఁగెను రుచులన్. ౧౩౭

క॥ జలనిధి వీచులు వింజా, మరలవలెం జుట్టి పడఁగ ♦ మా వగకొలమే
పొలిసెనని లేచు నింద్రుని, వెలి గొడుగనఁ దూర్పుదెసను ♦ విధుఁ డుల్లసిలెన్.

తే॥ అంబరంబను వాఁడు హి♦మాంశుఁడనెడి, వెండికుండను గొని పాల♦వెల్లి ముంచి
తెచ్చి పోసెననఁగ జ్యోత్స్న♦దిశల వెలసెఁ, జుక్కలాపాల చుక్కల♦చొప్పు దోఁచె.

తే॥ గగనమనుసురభియుదయ♦నగమనియెడు, పొదుఁగునంజంద్రుఁడనుచనుల్♦వదలినట్టి
వెన్నెలను క్షీరధారలు♦వెలయ జ్యోత్స్న, తృశ్యమపుడు పాలంబోలి♦పృథివిఁబరవె.

తే॥ హనుమపై సురల్ చల్లిన♦యలరులెల్ల, రావణునకుఁ దలంకి ధా♦రణిని పడక
దాఁగకయు జోతిరూతముల్♦దాల్చిమింట, మెఱసెననఁజుక్కలెల్లెడ♦మీఱి వెలసె.

తే॥ మల్లికలమీఁద మధుపముల్♦మలయుచుండఁ, గౌముదీప్రకరంబు చీఁ♦కట్ల గములు
జన్మవైరంబుగొని పర♦స్పరము దాఁకి, పోరు సలిపెడు చందంబుఁ♦బోలియుండె.

తే॥ గ్రథిత రత్న ఖచిత వప్ర♦వలయితంబు, వీర రక్షితంబగు పుట♦భేదనమున
కొఱగఁ దెల్లనివలువ మూ♦యుటనుపోలి, హిమమయూఖుని కరము లె♦ల్లెడలఁబరవె.

ఉ॥ రామ ధనుర్విముక్త శర♦రాజమువోలె మరుత్సుతుండు శ్రీ
రామునిదూత నిర్భయత ♦ రావణ పాలిత లంకఁ జేర, నా
రామునికీర్తి కందకము ♦ రాజిలదాఁటి యుదగ్రసాల ము
ద్దామ నిరూఢి దాఁటె ననఁ♦దత్పురిఁ బర్వె నఖర్వ చంద్రికల్. ౧౪౫

తే॥ అంత హనుమంతుఁ డెంతయుఁ♦జింత నేసి, చొరఁగరాని యాలంకను♦జొరఁగ నొక్క
నిశ్చయం బొనరించి యా♦నెఱ్ఱిఁ జనంగ, నమరులు నుతింప నుద్యుక్తుఁ♦డయ్యె నపుడు.

—: హనుమ లంకాప్రాకారమును సమీపించుట :—

తే॥ కంధి సహజ సిద్ధమగు న♦గర్తగాఁగ, దివ్యలోకము లేడింటిఁ దీడి ♦ పెరిఁగి
విలయమందును చెడకుండు♦లలిఁదనర్చు, పెద్ద ప్రాకారమును సమీ♦పించి నిలిచె.

తే॥ నిలుకడగ మింట వెల్లు గా♦ములు దశాస్యు, నకు భయంపడి లంకపై ♦నడవవనుట
తగదు వ్రపంబు దాఁటున♦త్వంబు లేమిఁ, దొలఁగి చనుచున్న వని కపి♦తలఁచి మెచ్చె.

తే॥ పగ అసంఖ్యాకు లిటనిల్వఁ♦దగిన దనుట, యంతకాదిది బ్రహ్మాండ♦మంత వెలువు
నంతకంబెను పొడవునై ♦యడరుఁగోట, యహాహా! లంకేశ్వరుం డెంత♦యధికుఁడొర!

తే॥ సింగమును మదగజమును♦సిగ్గుపడఁగ, నెక్కటీఁ డయి నడచు క♦పీశ్వరుండు
అలవిలేని సేనలు గల్గి♦యముని నోటిఁ, బోలు గోపురద్వారంబు♦ముందు గాంచె.

తే॥ కనకగిరిఁ దెచ్చి తొలిచి మా♦ర్గంబుచేసి, నిలిపిరో? సురపురి కేగు నిచ్చెనయొకో?
సప్తలోకాశ్రయంబగు♦ స్తంభ మొక్కొ? కడలి నీర్వోవఁ గట్టిన♦కలుజొ? యేమొ?

తే॥ ఏడులోకంబు లొక్కటై♦యెదిరెనేని, సొరిదిగాఁ దక్క లోనికిఁ♦జొరఁగరాదు
అరుల వాడుక తెరువిది♦యందమన్న, సైన్య జలధి న ప్తక మిందు♦సాగునేమి?

తే॥ వీరవరులు మాయావులు♦ధీరగుణులు, కత్తులును కోఱ లిరుగడఁ♦గలయ మెఱయ
రెండు వందల వాహినుల్ ♦ప్రకేవలందు, గాచి నిల్చుట పావని♦గాంచె నెదుట.

తే॥ ముసల తోమర కుంత కా♦ర్ముక నిషంగ, వజ్ర దండ కులిశ చక్ర♦భల్ల భిండి
పాల కంటక ముద్గర ♦ శూల ఖడ్గ, ధారులగు క్రూర రాక్షస ♦ వీరవరులు.

తే॥ గుదియలును పాశములు బరి♦గోల లొడిసె, లలును తళ తళ మెఱయఁ జే♦తులధరించి
రక్తరోములు రోష సం♦యుక్తులగుచు, పూచినట్టి మోదుగులట్లు♦పొలిచినారు

తే॥ గణనకందని దివియల♦కాంతు లిరుల, మ్రింగ యముఁడును బెగ డొంది♦మిడుకునట్టి
గోపురద్వారమున వడి♦క్రుంగకడరు, జడధి వడువునఁ గల సైన్య♦చయముఁగనియె

తే॥ ఔర! కలకలమార నీ♦ద్వారమందు, చొరసమర్థుఁ డొక్కఁడు సురా♦సురులయందు
గలఁడె? కాకుత్స్థ వర్యుండు♦కపివరులును, పోరొనర్ప నేకై వడి♦ముగియు నొక్కొ!

తే॥ కడలిదాటు టరిదిగాదు ♦ కావలియను, కడలిదాఁటుటె యరిది నా ♦ కర్జమందు
పొరపడిన దుర్ఘటంబగుఁ♦బూర్తి నేయఁ, దడవుపట్టును నమర మే♦తొడరునేని.

ఉ॥ ద్వారమునంద వెళ్లెదు వి ♦ ధంబది దుస్తరమై బయల్వడుగ్
శూరులు చేసి యుంచు దరిఁ ♦ జొచ్చుట నాకెమికాదు గావునన్
సూర మయూఖముల్ చొరని ♦ చొప్పగు వప్రము దాఁటి యేగెదన్
ధీరత నంచు నా విమల♦ తేజుఁడు వోయె మఱొక్క ప్రక్కకున్. ౧౫౯

## —:లంకాధిదేవత హనుమంతు నడ్డగించుట:—

చ॥ చిరముగఁ గావలిం గలిగి ♦ చెన్నగు తత్పుర జీవితంబు నాఁ
డరుగుటచే బలిష్ఠుఁడగు ♦ వాయుగ సూనుని గాంచి సూర్య్య మే
దురముగ ద్రింగవచ్చెడు వి♦ధుంతుదుపోల్కిఁ బరాధిదైవ మ
ద్ధురగతి లంకపేరుగల ♦ తొయ్యలి నిల్చి యడల్చె నన్నిధిన్ ౧౬౦

సీ॥ భుజము లొక్కెనిమిది♦మోములు నాలుగు, నేడులోకంబుల ♦ కెగయుకాంతి
తిరుగుడు పన్నుగుడ్ల♦త్రిజగముల్ దాఁకిన, మొదలితోఁ గట్టి యం♦బుధిని గలుప
సత్త్వం బమర్ష మ♦క్షమమును బెడిదంపు, టలికిడి గలుగు పా♦దాంగదములు
చెంది పల్వూరు దవ్వు♦నం దోడువత్తురో, యని పాఱఁజూచుచు♦నరుగుదెంచి

తే॥ కారుమొగులునా గర్జించి♦ఖడ్గశూల, పాశకుంత గదాముల♦బట్టి మొగము
పొగలుగ్రక్కఁ గోఱలు పొడ♦వగుచు వెలుఁగ, జముఁడు దిగులూన నడ గొం♦
సరణి నొప్పి ౧౬౧

తే॥ పంచవన్నె వస్త్రంబు ధ♦రించి నాగ, భయదుఁడగు గరుడునివంటి♦పరువుతోడఁ
గ్రొన్నెలంబోలు పంకర♦కోఱలొప్పఁ, గడలి ముత్యాలహారముల్♦కాంతులీన.

తే॥ గండమలఁది తారస్థాయి♦కంఠరవము, పొసర భ్రమరముల్ గాంధార♦మునను పాడి
తనివినొందు మందారంపు♦దండ లడరు, ఘన కిరీటమ్ము శిరమునఁ♦గలదియగుచు.

తే॥ వనధివేష్టిత లంకను♦నెనరుతోడఁ, గాచు దేవత యొఱవోలెఁ♦గాచుకనులు
గలది భయదరావంబుతో♦నిలుసిలుమని, యదలుచుచువచ్చెఁ గపియు ర♦మ్మనియెఁ
ద్వరను. ౧౬౪

తే॥ వెడఁగుపని చేసితేల వి♦వేకహీన!, ప్రాణముల నొల్లవో? భయ♦పడవొ? చనవొ?
క్షుద్రమృగమవొ నీమీఁదఁ♦గోపమేల?, తొలఁగిపొమ్మని భర్జించి♦పలికె లంక.

తే॥ ఆసలేని యప్పావని ♦ రోస మడఁచి, నయవిధంబునఁ గార్యంబు ♦ నడపనెంచి
చూడఁగోరిన యీలంకఁ♦జూచునంత, నష్టమేమి నీకబ్బు న♦నంగ నదియు.
పొమ్మనంబోక వాదాడఁ♦బూని తేమి? యెవ్వఁడవు నీవు? లయరుద్రు♦నెనయువార
లేని రానోడుదురు కాంచ♦నిచ్ఛగించి, నంత నీకు రాఁదగినదే♦యనుచు నవ్వె.

ఉ॥ నవ్విన లంకఁగాంచి కపి ♦ నాథుఁడు నవ్వఁగ నోరి నవ్వెదే?
యెవ్వరు పంపవచ్చితి; వ ♦ హింపకు సాహస మింక జీవముల్
నొవ్వగ వీడెదేల? విడి ♦ నూల్కొను లాభమదేది? యింతకుం
జివ్వన బాఱకే నిలిచి ♦ చెంగఁగఁ జూచెదె? యంచు గర్జిలన్. ౧౬౫

ఉ॥ చూడకపోవఁగాఁగలనె? ♦ చూచెదఁగా కనువానిఁ గాంచి హా!
వీఁడొక కోఁతికాఁడు కడు ♦ వేటకాఁడియో? కపటాత్ముఁడో యగున్

వేఁడి గరంబు గ్రమ్మింగిన ఫ ♦ ణిప్రభు భూమణుఁబోలె సవ్వచు
న్నాఁడు జముండు నర్గని వ ♦ ణంకుఁ జలింపఁడు నిల్చె గుండునాన్.

ఉ॥ చంపెద వీని నేఁ డటులు ♦ చంపఁగఁ జాలనయేని లంకయే
సంపదతో నశించుటలు ♦ సత్యమ యంచెద నిశ్చయించి యో
తెంపరి! జాణవేనియు నె ♦ దిర్చి జయింపుము పోవువాఁడ వా
పెంపగుదారిఁ బోవకిటు ♦ భీతిని చోరుని రీతి డాసితే? ౧౬

—: హనుమ లంకను నిగ్రహించి లోని కరుగుట :—

మ॥ అనుచుం గోపము పొంగ శూలమొగి న ♦ త్యంతోద్ధతిన్వైచినన్
ఘన విద్యుల్లతనా మిడుంగుఱులు గ్ర ♦ క్కన్వచ్చు నద్దానిఁ బా
వని నర్పంబును పట్టి చీల్చు ఖగరా ♦ డ్వీర్యంబలెం ద్రుంచెఁ గ్ర
క్కున లంకాహృదయంబు ఝల్లనఁగ లే ♦ ఖుల్ మోదముం బొందఁగన్

తే॥ శూల మట్టులు నుగ్గయి ♦ క్షోణిఁ బడఁగ, నగ్నివలె మండి లంక ది ♦ వ్యాయుధముల
గొనుచుఁ బోరఁగఁ దొడఁగ నా ♦ హనుమ చూచి, నింద కెడమని విఱిచె నన్నింటి
గొనుచు

తే॥ కైదువులు లేని యాలంక ♦ కనలి యుఱిమి, నగము లచ్చనగాయల ♦ పగిది నాడు
కేలు పైకెత్తి ముష్టి వా ♦ తూలసుతుని, పొడువ నుంకించునంత నా ♦ తఁడును కినిసి

తే॥ చేతు లన్నింటి నొకచేతఁ ♦ జేర్చిపట్టి, వనిత యిది చంప నాఁడి ♦ వచ్చునంచుఁ
బిడికిటం బట్టి వక్షంబుఁ ♦ బొడువ లంక, పిడుగు వడ్డ నాగమువలెఁ ♦ బుడమిఁ గూలె

క॥ పడి బొళుకు బొళుకుమని వె, ల్వడ నెత్తురు గ్రక్కి నలువ ♦ వచన మెడందం
గడు తెలివి గూర్పఁ గరువలి, కొడుకున కాలంక మ్రొక్కి ♦ గురుతరభక్తిన్

తే॥ కమలజుని యాజ్ఞ నీలంక ♦ గాచు దానఁ, గాన నీరీతి నీపయిఁ ♦ గడఁగవలసెఁ
గరుణ మన్నింపు చంపకు ♦ కలదొకండు, విన్నవింపంగఁ దగు వా ర్త ♦ వినుతచరిత!

క॥ ఈపురము నెంతకాలము, కాపాడుదు నసఁగ నలువ ♦ కపి యొక్కఁడు ని
న్నేఁపుతఱి రమ్ము విడి లం, కాపురి కానాఁటినుండి ♦ క్షయమగు ననియెన్.

తే॥ బ్రహ్మయన్నట్లయయ్యె ధ ♦ ర్మము జయించుఁ, బాపము నశించుఁ ననుట న ♦
వ్యంపుఁబలుకె?
తలఁచినది యెల్లఁ గొనసాగుఁ ♦ దప్పదయ్య, యేగుమని మ్రొక్కి సెలవంది ♦ యేగె లంక.

ఉ॥ మారుతి నంతసించి బుజ ♦ మార్గమె ధన్యత గాంచునంచు సీ
తారమణీ హృదీశ పద ♦ తామరసంబు లెడంద నిల్పి ప్రా
కారము దాఁటి లోనెడమ ♦ కాలిడె మున్నుగ నిర్భయాత్ముఁడై
క్షీరపయోధిలోన నొక ♦ చేమిరి చుక్క ప్రవేశమందెనా. ౧౭

ఉ॥ అంబర చుంబితంబులగు ♦ హాటక మందిర పాళి రత్నసం
ఘంబుల కాంతి జాలములు ♦ గాఢ తమంబును పాఱఁదోలి రే
యింబవ లొక్కరీతి వహిం ♦ యించిన సొగసుగాంచి దిగ్భ్రమం
బుం బొరసెన్ మరుత్సుతుఁడు ♦ ప్రొద్దుదయించెనకాఁ దలంచుచున్.

చ॥ అరుదగు రత్నసౌధమయ ♦ మై యలరారిన యీపురమ్ము పె
న్నిరులను మ్రింగుచుండుట ది ♦ నేశుఁడు గాంచిన సిగ్గు నొందఁడే?
మెరమెరచెంది యీ ప్రహరి ♦ మీఁజఁగఁ జాలక తొంగి చూచి తా
నరిగెను పోలు నెందులకు ♦ నచ్చటికేనని యెంచి లజ్జమై ౧౮౧

ఉ॥ ఇందఱివారు కేలఁ జిరి ♦ యింతురు గావున నంతతంబు వె
ల్గొందు స్వభావముం గల న ♦ మున్నత మేరువువంటి సాలమం
దందములైన రత్ననిచ ♦ యంబులచేత వెలుంగు సౌధముల్
చెందిన లంక యెన్నఁడును ♦ చీఁకటు లేవొ యెఱుంగలేని దే. ౧౮౨

చ॥ అమృతము దేవతావళికి ♦ నర్మిలి నిచ్చిన మందరంబుఁబో
లి మనుకులాధినాథు నమ ♦ లీమన కీర్తిని పోలి వెల్గు కీ
శమణి యిటుల్ దలంచుచు వి ♦ శంకటవృత్తిని వీథులందు తా
గమనము సేత యొప్పదని ♦ కైకొనె నన్నువహూపు నత్తఱిన్. ౧౮౩

తే॥ స్యందనాశ్వగజాదిక♦శాలలందు, పసులకొట్టము లంగళ్ల♦వాడలందు
కడలిదాఁటిన కాళ్లతోఁ♦గడచి విరుల, వ్రాలు భ్రమరంబుపోలిక♦వ్రాలిచూచె.

మానిని॥ రిక్కలరోచులు రెక్కొను పెక్కగు♦రీతుల సన్మణి భిత్తికలున్
గ్రక్కిన కాంతులఁ గర్వలిబిడ్డఁడు ♦ కానఁగవచ్చుచుఁ గానకయున్
నక్కుచు నిక్కుచు నెజ్జిన తెల్లన ♦ నల్లనయై హృదయ స్థితుఁడౌ
నక్కఱివేలుపుఁబోలి వెలింగె న ♦ హా! సులభుండయి దుర్లభుఁడై.

—: స్త్రీల సమూహములో హనుమ సీత నన్వేషించుట :—

ఉ॥ కాంచెను వానరోత్తముఁడు ♦ కమ్మని తేనియగాఱు తోఁటలన్
మించులఁబోలు వేలుపుల ♦ మెత్తలు స్వర్నదినుండి నీరమున్
గొంచు వహించి తెచ్చి వడిఁ ♦ గుంకుమ పంకమువోవ నార్పఁగా
నంచలు కేకు లట్టులను ♦ రాంగన లంబువు లాడుచుండుటల్. ౧౮౬

తే॥ తపముచేఁగాక వేఱుప♦ద్ధతిని గాంచు, సత్ఫలములేమి దీనిచేఁ♦జాలె బమ్మ
చూడుఁ డాడించువారలు♦సురవనితలు, స్నానమాడువారలు దైత్య♦చంద్రముఖులు.

చ॥ క్రమగతిఁ దంత్రులం దిగిచి ♦ కమ్ర కరాంగుళి పల్లవాగ్రముల్
కమలఁగఁ దాళసంగతులఁ ♦ గాచుచు వీణలఁ బల్కరించు న

బ్జముఖుల పాటలన్ విని న ♦ భంబు రవంబని సంభ్రమించి సౌ
ధములపయిం దనర్చు జల ♦ దమ్ముల నోళులు మూయు తొత్తులన్.
ఉ॥ హర్మ్యగఁ గాంచువారు భ్రమ ♦ దాతి శయంబునఁ దాళమేయ గం
ధర్వవిలాసినుల్ జన ను ♦ తంబుగ నాట్యమునేయ దేవతా
పర్వమణి ప్రభన్ విరుల ♦ పందిరి నంచలతెక్కు పాన్పుపై
మూర్వఁగఁ బవ్వళించి కని ♦ మోదిలు పార్వణ చంద్రబింబలన్.
తే॥ స్ఫటిక వేదికలందు భా♦వములఁ దెలుప, వాలుగనులతో నేడఁ బాటు♦వలనఁ బెరుఁగు
కామసస్యంబునకు నీరు♦గట్టు కరణి, మధువు నానెడు దైతేయ♦మానినులను.
చ॥ కలువలఁబోలు నేత్రములు ♦ కాంతుల కన్నుల నైజసంపదన్
దెలుపఁగ నోష్ఠబింబములు ♦ తెల్లఁదనంబు భజింపఁ బ్రీతిమై
చెలువలు కాంతులం గలిసి ♦ చిందెడు ప్రేమముఁ బట్టి త్రావు జో
కలఁగొని మార్చిమార్చి చష♦కంబుల హాలలఁ ద్రావువారలన్. ౧౯౧
క॥ సురతరువు లొసఁగు లత్తుక, యరుణచరణములను తడవి ♦ యంజనమును సొం
పొరయఁ గనులనిడి కస్తురి, పరిమళములలంది నగలఁ ♦ బట్టిన వారిన్.
చ॥ పులులను పట్టి చీల్పఁగల ♦ పూరుషవర్యుల క్రొత్తనేరముల్
తలఁచుల యెడ్డనొంప నమృ ♦ తంబును పోలిననోట క్ష్వేడముల్
వెలువడ నూర్చి కౌనులు చ ♦ లింపఁగ నందెలు క్రందుసేయఁ గా
ళులఁ దలఁ దన్నునప్పుడు క ♦ లుక్కునఁ బుల్కల నొందు దైత్యులన్.
ఆ॥ కనులు కైవులనఁ♦గడు నరుణములుగా, మొగము వెల్లగాఁగ♦బొమలు ముడిచి
చెమటవాఱ మోము♦చెన్నద్దమునఁగని, ప్రియులకొఱకు వగచు♦బింబముఖుల.
తే॥ చెఱకుగానుగలందు కం♦దరములందు, విరులవనముల మ్లేచ్ఛుల♦వేశ్మములను
కల్లుపాకలఁ బాలేటఁ♦గాంచరాని, జోట్ల యధరామృతము నాని♦చొక్కువారి.
తే॥ మగలపై నల్గి కుచకుంకు♦మంబు చిటిలి, పెటుల విరిదమ్మిపై నోరు♦విడని మొగ్గ
పూచుకరణిఁ గేల్దామర♦మోముదమ్మి, నూని యూఁగుప్రాణములతో♦నుండువారి
తే॥ అల్కఁగొని సుమతల్పంబు♦లందు పొరలి, వలపుకాఁక రేఁపగఁ జూపు♦వాకిలిపయి
నుంచి దూతిక చిఱునవ్వు♦గాంచి యునుఱు, పడయు క్రియ లేచి తత్తఱ♦పడెడువారి
తే॥ పెక్కు వాద్యముల్ మొరయంగ♦వేల్పుచెలులు, భవ్యగీతముల్ పాడంగఁ♦బైఁటతోడ
రశన లింతజాఱఁగ నూపు♦రములు మ్రోయ, నింటివేల్పుల రహిఁ భజి♦యించుచెలుల.
ఉత్సాహ. కుండలములఁ దాఁకు కనులు ♦ కోడెకాండ్రఁ గ్రువ్వఁగా
మెండునగల కాంతు లిరుల ♦ మీఁట మేటి వాద్యముల్
నిండ నీరదములవెంట ♦ నెమ్మిగములపోల్కి వే
తండములుగ భవ్యవస్తు ♦ తతులు దెచ్చువారలన్. ౧౯౯

తే॥ పొలయలుక వీడి ప్రియులతోఁ♦గలయఁబూని, తెప్పలను నొఱలను దీసి♦కప్పుల నెడి
నేయిపూసి కాంతియు మాయ♦నెగడుకన్ను,లనెడి కత్తుల దూయుదై ♦ త్యాంగనలను
చ॥ కినుక వహించుచుం బ్రియులఁ ♦ గీటునఁబుచ్చి మనంబు తెల్వి త
క్కినయవి వారితోఁ జరుగఁ ♦ గీడ్వడి దూపిలి మించుకై పడిక్
దనువులు సంచలింపఁగ ము ♦ దంబతి యంచలఁబోలి మెల్లనం
జెనసి కవాటముల్ మొగుచు ♦ చిత్ర నిభాంగ వికాసినీ తతిన్. ౨౦౧
సీ॥ కిన్నరకామినుల్♦గీతముల్ పఠియింప, నాగకన్యకలు మం♦గళము చదువ
శారదాబ్దముల నే♦పారు సౌదామినీ, తతులన నొప్పి ము♦త్యాల శిబిక
లెక్కి చెల్వలు గొల్వ ♦ నింపుగా నూత్నగృ, హప్రవేశమ్ముల ♦ నందువారి
మంగళరవము చె ♦ లంగ సురాళి ను, తింప సన్మునులు దీ ♦ వింప మునుల
తే॥ తరుణు లారతులెత్త వి ♦ ద్యాధరాలి, విజయగీతము ల్పాడ స్వ ♦ స్వైశ్యలాడఁ
జుట్టపక్కాలతోడను♦సొంపుగాఁగఁ, గ్రొత్తపెండ్లిండ్లు నెఱవేర్చు♦కొనెడువారి.

—: హనుమ కుంభకర్ణుని గనుట :—

తే॥ యక్షరాక్షస నాగవి ♦ ద్యాధరాది, కాంతల కలంకులేని మొ ♦ గంబులెల్ల,
శంకదీఱఁ గాంచుచు నేగి♦శైలమట్లు, కలఁకలేక నిద్రిలు కుంభ♦కర్ణుఁగనియె.
సీ॥ పెనుపుగా నేడు యో ♦ జనముల విస్తీర్ణ, మై బిడౌజుని వైజ ♦ యంతమట్లు
తన్నరిన మంటపం♦బు నడుమ నొకతల్ప, మున నాగరాజన♦వనధి యునఁగ
నిరులకుప్పయనఁగ ♦ వెరవునఁ దలఁపంగఁ, గానికర్మంబులు ♦ కరువు గట్టి
పురుషస్వరూపంబుఁ ♦ బొందె ననఁగనొప్పి, కుంభకర్ణుండటఁ ♦ గూరుచుండ
ఆ॥ వనధి మునిఁగి లేచి ♦ తనకుఁ దగిన మూఁడు, వగల నడలతోడఁ♦బ్రసవరజము
పరవు కల్పవనిని ♦ పడిలేచివచ్చిన, మలయపవనుఁ డతనిఁ ♦ గలయ నొరయు.
తే॥ నాకినులు పాదసంవాహ♦నంబు సేయ, వారి పూర్ణేందుఁబోలిన♦వదనములను
గాంచి యచ్చటి చలువఱా♦ల్గరఁగిచెలుల, యొడలిపై నీటితుంపురు♦లురలిపడును.
ఉ॥ ఆతని నాసికాంతరము ♦ లందు బయల్పడి వచ్చు నమ్మహా
వాతము వాయుపుత్త్రకుని ♦ వాఁకిటికిం గొనిపోయి యంతటన్
లోఁతగు ముక్కులోపలికి ♦ లాంగఁగఁదీయఁగఁ బోవ రోయుచున్
జేతులు వీఁగ నూఁదికొని ♦ చెచ్చెర నాతఁడు దాఁటె నవ్వలన్ ౨౦౬
ఉ॥ ధూళిచయంబు పై దెనకుఁ ♦ దోడన లేవఁగ బైటికేగుచున్
దాళక వ్రటిలం దిరుగఁ ♦ దార్చెడు తోరపుటూర్పు లోకహృ
ద్వేళ నెనంగు మారుతము ♦ తేఁకువ నప్పటిదాఁక వీని హృ
ద్గోళమునందు నెక్కొనిన ♦ తోయము దోఁచుఁ దలంచి చూచినన్.

క॥ పగవాఁడని దోషాకరుఁ, దెగఁజీలిచి నోటఁగవ్వ ♦ తీరున దోగనై
పొగ లెగయు నూర్పుతోనవు, దగులని మొగమందు వజ్ర ♦ దంష్ట్రలు వెలయున్.
తే॥ మంత్ర బద్ధమైన భుజంగ♦మంబుఁబోలెఁ, గల్పవేళ నిరీక్షించు♦కంధిపోలె
నడుమ మెలఁకువలేని వి♦న్ననవు నిద్ర, గాంచుచున్నట్టి యాకుంభ♦కర్ణుఁగాంచి.
తే॥ అతఁడు లోకకంటకుఁడగు♦నసురవిభుఁడ, టంచు ముమ్మూర్తులందొకఁ♦డనఁగనొప్పు
నాంజనేయుండు కరుణామ♦యంబులైన, కనులనుండి రాలిచె వహ్ని♦కణము లప్పుడు
క॥ పదితల లిరువది చేతులు, పొదలవు రావణుఁడు కాఁడు♦పొరపాటున నే
బదరితి నని కోపాగ్నిని, వదలిచి చల్లార్చె జ్ఞాన♦వార్ధి జలముచే. ౨౧౧
మ॥ శ్రవణానందముగూర్చు రాఘవుని వి ♦ శ్వస్తుత్య సుశ్లోక మె
క్కువ వర్ధిల్లఁగఁ జేయు పావని జ్వల ♦ త్కోపంబు చల్లార్చి వీఁ
డెవఁడో నేమి యటంచు ముష్టిగొని మా ♦ యింపంగ లోనెంచి మ
క్కువ నిద్రించెడి నాయువున్నదని యా ♦ కూటంబు వీడెన్ వడిన్.
ఉ॥ రామునికీర్తి రూపముగ ♦ రాజిలు మారుతి పుష్ప వాటికల్
హేమ వినూత్న సౌధము ల ♦ హీన గృహంబులు పాకశాలలున్
రామల గాన నృత్యముల ♦ రంగగు సాలలు దేవళంబులున్
స్వామిహితాగ్రగణ్యుఁడు వె ♦ సన్ వెదకెన్ బహు సూక్ష్మబుద్ధిమై.
చ॥ మణిమయ చిత్రదేహళుల ♦ ప్రాఁగు గవాక్షముల్ సుమంబులన్
దృణములఁ బూలకాఁడలను ♦ తేఁకువ ధూమముపోల్కి వాయు వ
ట్లణఁగుచు సూక్ష్మరూపుఁడయి ♦ యంతట నిక్కుచు స్థూల రూపుఁడై
యణువున మేరువందు హరి ♦ యట్లు చొరంగ సమర్థుఁడై చనెన్.
చ॥ ఇదియది యంచు నెంచ కట ♦ నెల్ల తలంబుల కేగి శ్రద్ధమై
మదవతులన్ మనోజ్ఞ సుమ ♦ మాయుతలన్ బరికించి బుద్ధి సం
పదగల నాగ యక్ష సుర ♦ పార్థివ మాని జనార్థ్య జన్మమై
పొదలిన యవ్విభీషణుని ♦ పుణ్యగృహంబునఁ జొచ్చె నంతటన్. ౨౧౪
తే॥ స్ఫటిక వేదికన్ విరులచ♦ప్పరముక్రింద, గట్టివారిలోఁ దెలిచూపు♦గాంచఁదగని
దంచు నల్లనిరూపంబు♦నవధరించి, దాఁగి తిరుగు ధర్మంబు నాఁ♦దనరువాని.
తే॥ దాసి యతని సుశీలతఁ♦దన సుశీల, తను గ్రహించి నిష్కల్మషుఁ♦డనుచుఁ గినుక
నూన కనిల సూనుండు వే♦ఱొక్క ప్రక్కఁ, జొచ్చియొక కోటి మేడలఁ♦జూచెఁ ద్రుటిని.

—: హనుమ ఇంద్రజిత్తు గృహమును గాంచుట :—

తే॥ శశిముఖుల సుధాధరల న♦చ్చటులఁగాంచి, హృదయ వేగంబుశంకొ ముం♦
పరమపావని పావని♦జరగి జరగి, బలవిరోధి చెఱంబడ్డ♦తలము చేరె. [దేగుచుండు

తే॥ క్రూరదంష్ట్రులు సాయుధుల్♦క్రోధమూర్త్తు, లురు రణోత్సాహయుతులు లో♦కోక్తులు విడి
కథలఁ జెప్పికొనుచునుండు♦కావలీంద్రుఁ,డగ నసంఖ్యాకులగువారి♦దాఁటి చనియె.
మ॥ పొగయుం దూఱఁగలేని తానములకుం♦బోవంగఁ జాల్జాణఁ డా
శుగనూనుం డటఁగాంచె లీలఁ గరిభి♦త్స్వానుండు పంచాస్యముల్
నగ సంకాశ భుజార్గలీదశకముం ♦ మైదాఁచి యొప్పారు న
ప్పగిదిం జెన్నరు మేఘనాదు బహుళ ♦ స్వర్గాంగనా సంయుతుం.
చ॥ బిలమున నిద్రసెందు నతి ♦ భీషణ కేసరివంటి వీఁడు సోఁ
కుల రొండయుండు రావణుని ♦ కూరిమిపట్టియొ? శంభుసూనుఁడో?
తెలియఁగరాదు క్లేశమున ♦ దెవ్వరమా పెనుపోరు వీనితోఁ
గలుగఁగవచ్చు రేపు మన ♦ కార్ముకవీరుల కంచు నెంచుచుం. ౨౨౧
ఉ॥ ఇమ్మగవాని బానటగ ♦ నేత్రౌఅ నొందిన రావణుండు లో
కమ్ముల గెల్చెనంటయు నొ ♦కానొకచోద్యమె? శర్వ మాధవుల్
బమ్మయుఁదక్కఁ దక్కుజన♦పాళుల సీతని కీడుగల్గ నం
చిమ్మగఁ బల్కువాని వెడఁ♦గే యని చెప్పఁగవచ్చు గట్టిగం. ౨౨౨
క॥ అని ముక్కుమీఁద వ్రేలిడి, కొని కాలము నిచటఁగడపఁ♦గొఱలు ఫలంబే
మని హనుమఁ డాస్థలము విడి, చని నెనకెను వేలకొలఁది♦సౌధము లవలం.
సీ॥ అక్షకుమారుని♦హార్మ్యంబు పరికించి, యతికాయు భవనంబు♦నందు వెదకి
యోధవరుల సౌధ ♦ వీథు లన్వేషించి, మంత్రుల మేడల ♦ మలసి కాంచి
రాజబంధుల మంది ♦ రంబులు శోధించి, తక్కువారలయిండ్లు ♦ తరిచి చూచి
దానవనాథు నం ♦ తర్మందిరముగనఁ,దలపోసి మూఁడుకో ♦ టలకు\నడుమ
తే॥ నున్న పరిఖ వీక్షించి వా♦యుజుఁడు తాను, జలధిదాఁటిన యవమతి♦సైఁపకిట్లు
సప్తవారిధు లొక్కటై♦చలము మీఱి, వచ్చి చేరెనో యని యబ్ర♦పడియె లోన.

—: అంతర్మందిర పరిఖ నాంజనేయుఁడు దాఁటుట :—

చ॥ పొడవును గాతముం వెలుపు ♦ పొందిన కందక మిద్ది యంచనం
గడఁగుదు రేని పల్వురు యు ♦ గప్రళయంబు ఘటించుదాఁక నీ
పుడమిని మెల్లఁ గ్రొచ్చినను ♦ ప్రోవడి నేయఁగలేరు జేనికిం
బిడిసి పయోధు లేడిటులు ♦ జానుగ నూల్కొని నిల్చెఁ గావలెం.
తే॥ అంచితముగ రామునికీర్త్తి♦యలముచోట్ల, నెల్ల వ్యాపించి నాతఁడి♦కెన్ని దీని
జడధి దాఁటుటకంటె ని♦మ్మడుగు వడిని, దాఁటినను దాఁట రాదంచుఁ♦దలఁచె మదిని.
తే॥ నాల్గువగల యాగడపల♦వాణెముగను, పిఱువఁ దలలెత్తినట్లున్న♦యలల తోడి

నీరుగలిగి రావణునేన♦తీరుదాల్చు, నగడిత నుతింప వాక్కున♦కలవి యగునె?

తే॥ కరుల మదము హరుల నోటి♦నురుగువేల్పు, చెలుల కుంకుమపంకంబు♦పొలసుదిండ్ల
నకుల కస్తురి తేనెయుఁ ♦ జందనంబు, గందవొడిగల తావులు ♦ కడల వీచు.

తే॥ చక్ర బక హంస టిట్టిభ ♦ సారసములు, నీరుకోళ్లు నుల్లంకులు ♦ నారణములు
కలియఁబలికెడి పెలుచని ♦ కలకలంబు, వీనులకు నత మచ్చట ♦ వినఁగవచ్చు.

తే॥ కస్తురియు లత్తుకయుఁ దాపి♦గందమగురు, చేరుకతన మునింగెడి♦వారణముల
తోడి కలయిక తమిగొల్పు♦తోయమొదవఁ, బిడులకయ్యగడిత దూతి♦విధముదోఁచు.

ఉ॥ కమ్మని తావి తేనియ సు ♦ ఖమ్ముగ నిమ్ముగఁ గ్రమ్మ తమ్మిమొ
త్తమ్ములు నెమ్మొగమ్ముల ము♦దమ్ము సొలంగి మొగిడ్చి నెమ్మి సీ
తమ్మ ముఖమ్ము తీరున న♦యమ్ము సమమ్ము గణించుచుండు చెం
దమ్ములు రామతీరుఁగని ♦ తాముసు మోముల మోడ్చుకుందునే? ౨౩౧

తే॥ పటికఖండలు మరిచి సో ♦ పానములుగఁ, దీర్చఁ దీరమ్ము నీరమ్ము ♦ నేర్పరింప
రాకయుండెను; జడులు వి♦వేకులసభఁ, జేర సులభమ్ముగా వేఱు♦సేయనగునె?

తే॥ మీఁదగ్రిందను శక్ర నీ ♦ లాదికములు, వేఱువేఱు కాంతుల నీన ♦ క్షీరవారిఁ
దొట్టి పాథోనిధులు వాత ♦ ధూతగతుల, నొక్కటై తోఁచునై వడి ♦ నుల్లసిల్లె.

తే॥ అంతహనుమంతుఁడెంతయు♦సంతసమునఁ, దొలినముద్రంబుదాఁటిన♦తోయమున నె
ప్రహరి వెనుకఁబడంగ నా♦పరిఖ దాఁటి, యరిదిశాఁపగు నంతర్గృ♦హమ్ముచేరె.

—: నిద్రితులగు రక్కసుల హనుమ కాంచుట :—

క॥ యముఁడును దిగులునఁ బొఱ భ, యముఁ గొల్పు సురారివరుల♦కరయఁబడని తో
యమున న్నెమకెను మారుతి, తమి ద్వాదశ యోజనములు ♦ తనరిన వీథుల్.

క॥ అడఁగె మధుసేవనమ్ములు, మడఁగెఁ గడలి వగిది నడరు ♦ మాటల రవళుల్
ముడిఁగెను తూర్యత్రయరవ, ముడిగెను కార్మికుల చెయువు♦లొనరె నిదురయుఁగా

క॥ వారువములు గూరికెఁ గ్రొ, వారమ్ములఁ గాచువారి ♦ కటు ఘోషణముల్
మీఱెను కాంతలు కాంతులు, తోరపు బడలికను కూర్క♦దొడఁగి రవశతఁగా.

క॥ పొలయలుక విడిన పొలఁతులఁ, గలిసి యువకు లనఁగి పెనఁగి♦క్లమమగు నవలఁగా
గలయిక నలయిక వెలువడఁ, జెలువల తక్షముల ప్రాలి ♦ చెందిరి నిదురఁగా.

ఉ॥ ఇంపగు హాలఁ ద్రావి కయి ♦ పెక్కినవారును ధూప వాసనల్
నింపిన పూల సెజ్జలను ♦ నీటుగ ద్రుక్కడి కామ సౌఖ్యమున్
మంపు రసంబునాని తలి ♦ మంబులఁ దృప్తిని పొందువారు నై
పెంపులు దక్కి కూలఁబడి ♦ పెచ్చగు నిద్దురఁ బూని రత్తఱిన్. ౨౩౯

మత్త॥ త్రాగి యాడెడి పెక్కురీతుల ♦ దైత్యవర్యుల యాటలున్
మూఁగి పాడెడి హెచ్చుతీరుల ♦ ముద్దుగుల్కెడి పాటలున్
మ్రోఁగి కూడెడి వాద్యరావము ♦ మ్రొగ్గి తగ్గెను దీటులన్
వీఁగి వేఁడెడి కోడెకాండ్రుర ♦ వేడ్క క్రుంగెను మాటలన్.

మృగమదంబుచందనమును♦మేఁగియున్న, ఱొమ్ములందునమలయమా♦రుతముసోఁక
విరహిణుల ఖండితల కనుల్ ♦విడిచె జలము, మనసులెల్లఁ దాపంబుచే♦మాఁడి మ్రందె

ఉత్సా. వైరి క్రుంగినప్పు డడంచు ♦ వారిపోల్కి దివెల నా
ధారమైన నేయితగ్గు ♦ తఱిని తీర్చె వాయువుల్
వారిజాస్య లొడలికాంతి ♦ వార్ధిఁ గొలువఁ దివురకే
కోరి దెసలఁ గొలువఁబోయి ♦ కూల్చె నిరుల గుంపులన్. ౨౮౨

తే॥ నిత్యకర్మానుసారులై ♦నిర్మలులగు, జ్ఞానులును యోగులు సుషుప్తి♦నూనినారు
మదగజములు నిద్రించె ను♦న్మాదులెల్ల, గునికిరనఁ దక్కువారలఁ♦గొనర నేల ?

తే॥ ద్వంద్వములను నిర్జించిన ♦ దండిమగఁడు, రాజవీథిని చని దైత్య ♦ రాజ నగరి
చెంగలియగడ్తతోఁగోటఁ♦జెంగలించి, దాఁటి లోనికిఁ జనియె ను♦దాత్తదృష్టి.

—: హనుమ రావణుని మేడఁ జేరుట :—

సీ॥ సమరశీలుండగు ♦ సమరారి బంగారు, మేడ రాకాచంద్రు ♦ జాడనొప్ప
రెక్కలగములునాఁ ♦ గ్రిక్కిఱిసి వెలుంగు, నీరజాక్షులయిండ్లఁ ♦ దారసించి
కందునొందకయుండు ♦ కలువరాబింబంబు, డీలుపడఁగఁజాలు ♦ డాలునేలు
మోములతో యక్ష♦రామా లలామలు, వసియించు నొకవాడ♦వాంఛఁజేరి

తే॥ కాంతు లీనెడు వజ్రాల♦గడియలున్న, కడల నూలికంతెను గాలి♦కంటె సూక్ష్మ
రూపముధరించితూఱెమ♦రుత్కుమారుఁ, డానగొలుపు దుష్కర్మముల్♦గోసినతఁడు.

క॥ కొందఱు దశకంధరుపై, డెంద మునిచి మోమువంచి ♦ దిగులున నూర్పుల్
క్రందుగఁ బుచ్చుచు తెప్పల, చిందార్పక యుండి రచటఁ ♦ జిత్రములక్రియన్.

క॥ కొందఱు కలగనుకొఱకో, కందర్పున కడలియో యొ♦కం డదియేమో
కందుమనరాదు కనులన్, చెందమ్ములు ముడ్చి యుఱక♦చెలఁగిరి సెజ్జన్.

క॥ కొందఱు మరుశరముల పో, టొందిన కుచకుట్మలాంగు♦లూఁగెడి శ్వాసం
బంది వగచి చేయునదే, మందురు చిత్తరువు వ్రాయ♦నగునే యనుచున్.

క॥ కొందఱు కన్నీరొలుకుచు, సుందరు రమ్మనవు పోవు♦చొప్పరయవు నీ
కిందలి పని యేమని చెవి, విందుగఁ బలుకుదురు గోర♦పిట్టల తోడన్. ౨౮౯

క॥ కొందఱు మందానిలమునఁ, గంది వలుంద్రైన చమలఁ♦గని తమ పీడిం
పం దొడరు దనుజవరు భుజ, మందము నెదఁదలఁచితలఁచి♦యులయుదురు వగన్.

క॥ కొందఱు పెనుమానికములు, చిందిన నిచ్చలపు డాలు♦సెజ్జలఁ జొరఁ జా
లం దినములు నిర్విణ్ణత్, వందురి కనఁబడిరి సంజ♦వఱలు శశివలెన్. ౨౫౧

క॥ కొందఱు తమ భుజములవలెఁ, జందిలు మంచముల నిద్ర♦సెందెడుచో భీ
తిందార్చు వీణరవమను, పెందే లటఁ జెవులఁ గుట్ట♦బెగ్గిలు వారల్. ౨౫౨

క॥ కొందఱు కనకాద్రి ధనువు, నందగ్నిశరంబు గూర్చు♦నభవుని మల నె
త్తందనరు భుజము లలఁదిన, చందనము కుచంబులంటు♦చాఱలవారల్. ౨౫౩

క॥ కొందఱు జలధి యుబుక నా, నంద నటన సేయు భవు గు♦ణంబులఁ గైనా
రిం దంతిగ బహురాగము, లొందఁ బొగడువాని వినుతి♦యొనరుచు వారల్.

క॥ పలు తెఱఁగుల జక్కని లిటు, వెలయు వసతు లెల్లఁగాంచి♦వృక్షచర లస
త్తిలకము లంకానాథుని, కులపాలిక లున్నయిండ్లఁ♦గోరికఁ జేరెన్. ౨౫౫

చ॥ హరువుగఁ జీకటిన్ దఱిమి ♦ యాఱక వెల్గెడు కెంపు దీపముల్
మురువుగ నొప్పు నోవరుల ♦ ముగ్ధలు సల్పెడు నూడిగంబులన్
బరువుగ వీడఁగా నసుర ♦ పాటలగంధులు కాంతు మున్నగాఁ
దరువుగ నేగఁ దల్పములఁ ♦ దాఱి రెడందలతోఁ బెనంగుచున్.

తే॥ అగ్నికీలపై మృగనాభి♦యలఁదినట్టు, లలరు జడలలోఁ బొగవలె♦నళులు ముసరఁ
గ్రొవ్విరుల పానుపులను వై♦రులుగ నెంచి,పటిక బండల నారట♦పడెడువారు.

తే॥ తనువు మిన్నుగా ముత్యాల♦దండ ఋక్షు, ములుగ జడలు మోదుగురంగు♦
మొగులుగాఁగ
నడుము మెఱుముగాఁ గన్నలు♦జడిగ నొసలు,క్రొన్నెలగ సంజవిన్ననాఁ♦గొఱలువారు.

తే॥ పాడవుమేడల వెన్నెల♦ముంగిళులను, చేటికలఁ గూడి కన్నుల♦నీటుగ్రాల
నెఱికురులు వ్రీల రెక్కల♦నెఱిగఁగొనుచు, హావణిలంగ నచ్చనగాయ♦లాడువారు.

తే॥ దేవకాంతలు స్వర్నదిం♦దెచ్చినట్టి, జలము చల్లగాలేదని♦యలిగి మేడ
లలఁత నెక్కి మొగుళ్లను♦తొలిచి కాఱు, నంబువులయందు జలకంబు♦లాడువారు,

ఉ॥ శేష ఫణామణుల్ బలిమి ♦ జీవితనాథుఁడు తెచ్చియిచ్చె నం
తోష మెలర్ప మేమె తగు ♦ తోయులులంచు వచించుకొంచు వి
ద్వేషుల గెల్చి కైకొనిన ♦ దివ్య కిరీట లలంతికాది స
ద్భూషలఁ బన్నిదంబులిడి ♦ పోఁడిమి జూదము లాడువారలున్. ౨౬౧

చ॥ కుసుమ వనంబులం బసిఁడి ♦ కూటములందున ముత్తెపందిరిన్
బసగను సిద్ధకన్యకలు ♦ పాడ మృదంగము నాగకన్య లిం
పెసఁగ వహింప నప్సరస ♦ లీడ్యగతి న్నటియించుచుండ సం
తసమునఁ బూలపందిళులఁ ♦ దార్కొని వేడుక గాంచువారలున్.

చ॥ ఇనుప సలాకవోలె నెద ♦ కెక్కిన మోహ మలంగఁజేయఁ గ
న్గొన లల కొండవాఁగులను ♦ కోఁదగి నిద్రనుపీడ నింద్ల ప్రాం
గణముల వీణియల్ గొనుచుఁ ♦ గంఠముతోడ లయింపఁగా సుధా
కణములు చింద శ్రావ్యముగ ♦ గానము సేయుచునుండువారలున్.

తే॥ ఇంచు నఱచట్టవలువ చ♦లించి తొలఁగఁ, గుండలమ్ములు గదలికఁ♦గొరదు లీనఁ
గల్లుద్రావంగ నుడివడు♦కనులతోడ, మేనెఱుంగని నృత్యాల♦మెలయువారు.

తే॥ వినమువంటి మద్యము రక్త♦మెసఁగఁ ద్రావి, గుజరి పద్ధతిఁ గంఠంబు♦గూర్చి వదరి
ఝర్ఝరీ వాద్యసరణి హ♦స్తములు దట్టి, యందమే చెడ వెఱ్ఱిగా♦నాడువారు.

తే॥ పెరుఁగు రంగైన కల్లు త♦బ్బిబ్బు సేయ, బొబ్బలిడుచు నిట్టూర్పులు♦పుచ్చి కురులు
విరియ నొడలెల్ల వడఁకించి♦వేల్పుసోకె, ననుచు నిచ్చవచ్చిన యట్టు♦లఱచువారు.

తే॥ ఇట్టి పెక్కుతీరుల నొప్పు♦నిగురుఁబోండ్ల, యిండ్లు వీథులు గనిదాఁటి ♦ యేగి సిద్ధ
సాధ్యవనిత లున్నట్టి వే♦శ్మములఁ గడచి, చేరె విద్యాధరాంగనల్ ♦చెలఁగువాడ.

—: హనుమంతుఁడు విద్యాధరాంగనలఁ గాంచుట :—

సీ॥ చొఱమీనురూపొంది♦మెఱయు సీనకము ధ, రించిన సోఁకుల♦ తేఁడు రామి
కధిక మోహమున మ♦ధ్యాంబుకంబెను మనం, బులు చలింపఁగ జీవ♦ములును వాడ
గాయనుల్ దగ జంత్ర ♦ గాత్ర లయలుగల్పి, పాడిన గీతముల్ ♦ పాములట్లు
చెవిఁజొరఁ గలఁగిన ♦ చెలువలు కొందఱు; వాని కోపాగ్నికి ♦ వడఁకి సురలు

తే॥ మునులు బుధులును దిక్కేడి♦మొనసి యొర్వఁ, బగవహించి చంద్రుఁడు దైత్య♦వర్యునందు
ప్రేమగలవారనుచుఁ జాల♦వేఁడి వెలుఁగు, లీన నెడఁదలఁ దపియించు♦నిగురుఁబోండ్లు.

సీ॥ అల్పకాలము కల్ప ♦ మట్లుగ మదిదోఁప, నుడుకుచు మరుబారి ♦ కడలువారు
మును కౌఁగిలింగొన్న ♦ చనులపైఁ జందన, మంటిన యదిగని ♦ యలయువారు
చెక్కిళ్ల వ్రాసిన ♦ చిత్రముల్ ప్రాణంబు, లం జీల్చుచుండఁ గ ♦ లంగువారు
కన్నులెఱ్ఱగఁ జేసి ♦ కాంతు నింక నిటకు, రానిత్తుమే యని ♦ రగులువారు

తే॥ నైన విద్యాధరాంగన ♦ లలఁగుచున్న, వీథులంగని త్రిభువన ♦ వీరు మేడ
ప్రాలి చందురు నొప్పిన♦వదనమలరు, మయునికూఁతురు వసియించు♦మాళిగఁ గనె.

ఉ॥ కాంచి యొలర్చి కార్యమును ♦ కాఁదగుఁ బూఁటియిందు చిత్రమొ
క్కించుక కద్దు మత్ప్రభున ♦ కెక్కటి ప్రాణమయైన దేవి నిం
దుంచినవాఁడు రావణుఁడు ♦ ప్రోన్నతజాతి మహోశ్మసంతతిన్
మించిన కౌస్తుభంబువలె ♦ మేటి గృహంబిది యంచు నెంచుచున్ ౨౭౦

సీ॥ రంభాది జంభారి ♦ బంభర వేణులు, మృదులపాదముల మె ♦ ల్మెల్లనొత్త

మణిరాజ భూషలు ♦ ఫణిరాజయోషలు, వింజామరము లల్ల ♦ విసరుచుండఁ
గెంజికురసంబును ♦ చేదనిపించి గం, ధర్వసుందరులు గీ ♦ తములఁ బాడ
బంధములఁ నీఁగిన ♦ పావనులయ్యు ద, క్షుకావారి కినుకకు ♦ గుఱియరైనఁ
తే॥ బొందు టెగ్గొలగ్గో యని♦పొడము శంక, మలయపవనుండు చేటులు♦పిలువనేగి
యాజ్ఞగొని వచ్చుఁబోవుచు♦యాలపనీ, చనవెయైన సరుదు మీఱి♦చసరు బుధులు.

—: హనుమంతుఁడు మందోదరింగని సీతయని భ్రమయుట :—

చ॥ వెలిఁగెడు రత్నదీపికల♦వెల్గుచెడం దన మేనికాంతి ది
క్కులఁ జెరియింప స్త్రీలు చ♦కోరపయోధరఁగాంచి యా యన
ర్గళ చరణుండు సీతయని ♦ గట్టిగ శంక యొనర్చి పొంగు పే
రలుక శరీర జీవ హృద ♦ యంబుల మాడ్పఁగ నెంచె నీగతిన్. ౨౭౧
చ॥ ఎముక పయిన్ రహించు నొడ ♦ లెత్తు ఫలంబు వహింపనైతి నా
తమకటులుండనీ; స్వకుల ♦ ధర్మము ప్రేమలతన్ విదిర్చి న
ద్విమల పతీత్వ మగ్గిసెగఁ ♦ బ్రేల్చిన జానకి యీమె యన్నచో
నమరిన రామకీర్తి యమ ♦ రారులు లంకయు నేనుఁ గూలమే?
ఉ॥ ఆయమ సుందరాంగి మను ♦ జాధిపకన్యక, చెప్పఁ బూనుచో
నీయలివేణి యక్షిణియొ! యాసురియో!యగు మీననేత్ర లా
నాయకు మేనియందము మ ♦ నంబున నొక్కపరిన్ గణింపఁ బం
చాయుధుఁనైన లెక్కఁడుదు ♦ రా! మతిమాలి యిటుల్దలంచితిన్
చ॥ అమల పతీత్వలక్షణము ♦ లారయఁ గొండొక యున్న యీమె దే
హము యొక యంగదం బొదువ ♦ నందిక నున్నదియంచుఁ దెల్పెడిన్
సమయుత వేణి విడినది ♦ చొప్పుఱు పల్కులఁ గల్వరించు ని
య్యమపతి వేగ తీఱు క్షయ ♦ మందును లంకయు నిశ్చయంబుగన్
తే॥ అనుచు నూహించి నాపంది♦యంబు నింత, తోడశాంతిలఁగాకని♦తొలఁగిపోయి
చేయునచిన్నదనదగు♦మేడఁ జొచ్చె, నసుర యెత్తని గిరిఁబోలి♦యలరు ఘనుఁడు.
చ॥ పుడమి చలించె శైలములు ♦ బ్రుంగె హుండుక్కనుపోలు కౌను క్రై
వడి భుజములక్కనల్చ్వమలు ♦ పాటలగర్ధుల దక్షిణాంగముల్
వడఁకె దిశల్ వెడంకెఁ బొల ♦ వంబుగ మించులులేక పల్వలన్
బిడుగులు రాలె నూరక యె ♦ ఛేదిలె మంగళ పూర్ణకుంభముల్. ౨౭౭
ఉ॥ నాయతి కమ్మలారఁ గని ♦ మానసమందు దలంచి యితయున్
నీకయయ్యో విపురము ♦ నేగిక; నేకులమందు పుట్టి యె
వ్వారలున్ గడించిన యు ♦ ఖంబొ శుభంబొ ఫలింపకేగునే?
కారణము జనించినను ♦ కర్మముకంటె బలీయముండునే?

—: హనుమంతుఁడు రావణుని గాంచుట :—

చ॥ వినుతకలా విశారదుఁడు ♦ విశ్రుత ధర్మ కుశాగ్రబుద్ధి పా
వని యట సైన్యసంతతులు ♦ వాకిటఁ గావలిగాయ క్షీరవా
ర్ధిని పెరవార్ధి పైకొనిన ♦ రీతిని తెల్లని తల్పమందు వ
ల్లని జిగి నొప్పు రాక్షస ల ♦ లాముని రావణుఁ గాంచె నయ్యెడన్.

సీ॥ బాలసూర్యులు పూర్వ ♦ పర్వతాగ్రస్థులో, రాణఁ గిరీటముల్ ♦ రాజిలంగ
నొడలిపై వెలలేని♦తొడవులు లేయెండ, గాసి రేయిని పూర్తి♦గాఁగ గ్రమ్మఁగఁ
గనకకశిపుఁ జంపి♦కనకాద్రి గుహలోన, నిద్రించు బహుశీర్ష♦న్మహరి యనఁగ
భర్మమయ స్వర్గ ♦ వాసులో వేల్పుల, పడఁతులు పెక్కండ్రు ♦ బారుతీరి

తే॥ పొన్నుకాఁడల చామరాల్♦పొసఁగ వీవ, సుడియు లేగాలిచేఁ గల్ప♦సుమములందు
మధుకణంబులు పడ మేను♦మఱఁగి సీతఁ, దలఁచి నిట్టూర్చి కృశియించు♦దైత్యనాథు

ఉ॥ కంతుని క్రూర బాణములు ♦ కంతువిరోధి నగంబునెత్తు బా
హాంతర మందు గ్రుచ్చికొని ♦ యుర్వుల డుయ్యెటచేత మున్ను ది
గ్దంతుల దంతముల్ సమర ♦ ధారణి నాఁటఁగనైన యా వ్రణా
క్రాంత తదంతరంబుల ని♦ రంతరముగ్ రసి గాఱుచుండఁగన్.

చ॥ కలపపుఁ బూఁతపై మృదువు ♦ గాఁ బడు చల్లని గాలి దర్పకా
నలమును భగ్గ్రుమోలె జత ♦ నమ్మున ఘుమ్మని రెచ్చగొట్ట మై
థిలిపయి నంతరింద్రియ గ ♦ తి ప్రతిపత్తుల్లు పర్వవెట్టఁ బా
ములు విడిపోవు పుట్ట యనఁ♦బోలిన యుల్లము వట్టి పాడుగాన్. ౨౮౩

తే॥ ఉత్సుకత మీఱి పైపయి నుల్లసిల్ల, నాఁడు చేసిన యుగ్ర ర♦ణంబులందు
వారివారి గ్రావఁగ మితి♦మీఱి కాఱు, సురల కీర్తినాఁ గోఱల♦సొబగువాని.

తే॥ పూలపానుపు మాఁడి ని♦ప్పుకలు రాల, మయిని బొబ్బలయట్లు చె♦మ్మటలు గ్రమ్మఁ
దేనియలు గాఱు మాలలఁ♦దివురు తేంట్లు, కలఁగ నూర్పులు పుచ్చుచు♦ మలయువాని

తే॥ చక్రివలెఁ దనయెద సీతఁ♦జక్క నిలిపి, తలిమమునఁ గల్లకూఁరికి♦దవులువాని
నెలఁతపైఁ గల వలపను♦నీరుపోసి, యూరుపను సన్నెఁ బ్రాణముల్ ♦నూఱువాని.

తే॥ కలఁత మీఱుటచే రూపు♦గానరాఁగ, నవ్వు గంభీరముఖుని మ♦నంబువోంగఁ
జెలువ ముదమునఁ దన సెజ్జఁ♦జేరె ననుచుఁ, జెలఁగి యుబ్బి గగుర్పాటు♦చెందువాని.

తే॥ బర్హిసంఘమ్ము లొక్క ప♦ర్వతమునుండి, వేఱుకొండకు శ్రమ నేగు♦విధముదోఁపఁ
బొలఁతులు బలిష్ఠజయశీల♦భుజము నొత్తి, వేఱు భుజమున కేగు స♦వ్వితమువాని.

తే॥ కడలిపైఁ దోఁచు రవినాఁగఁ♦గాంతులొలుకు, మణిసరులు గ్రాల జగములు♦

తనియుగాము

హరిహరేంద్రుల చక్రశూ♦లాశనులను, వ్యర్థపఱచిన గురువక్షు♦మమరువాని.
సీ॥ మాలికాతళ్ళముల ♦ మలయు తుమ్మెదలు ది, క్కరుల మదంబుల ♦ నెరయు తేంట్లు
చెలరేఁగి లేచి ప్ర ♦ క్కలప్రక్కలం దాఁకి, రాజులఁబోలి ఘో♦రముగఁబోరఁ
గలపంబు సిందూర ♦ తిలకంబు లొండొండఁ, గదిసి నిమయవృత్తి ♦ గండరింప
నాశా గజేంద్ర దం ♦ తావళి నాఁటి త్రి, వ్విన వ్రణంబుల వక్షు ♦ మెనయువాని
తే॥ హస్తములఁగల భల్లముల్ ♦ వ్యర్థములని, తలఁకి పదముల వ్రాలు శా ♦ త్రవ కిరీట
ఘర్షణములచేఁ గాయలు♦గాచియున్న, చరణయుగళంబు వెలయు రా♦క్షసవరేణ్యు.
తే॥ వామనునికంటెఁ బిన్నయా♦వాయుసుతుఁడు, తలలు పదిచేతు లిరువది♦కలయఁజూచి
తెలియునంత మనస్సున♦తిక్రమించి, కనులు లోకముల్ దహియించు♦కరణి మెఱసె.

## —: హనుమ రావణుని చంప నెంచుట :—

ఉ॥ వీని భుజాబలంబు బరు ♦ వేయగునైన నొనర్చునేమి? యి
వ్వాని యశంబదేమి ఫల ♦ వంతమగున్? రఘురాము గేహినిన్
బూనికఁ దెచ్చు క్రొవ్వు తల♦బొమ్మికముల్ పడఁదన్ని త్రొక్కి నే
వీని వధింపనేసి తగు ♦ బీరపు బంటగుటెట్లు స్వామికిన్? ౨౯౧
ఉ॥ వేనము పైకేఁజూపి పని ♦ వేఱుగ నెంచుట భృత్యధర్మమే?
మోసముచేసి దేవిఁ గొని ♦ పోయిన చోరుఁడు నేను గాంచియున్
దోసముమీఱ జీవితము ♦ తోడ వసించుటె? వీనిఁ జంపి నా
రోసము దీఱ మాడ్తు నగ ♦ రున్ బయి మూఁడునదెల్ల మూఁడనీ.
చ॥ అని మది నుత్సహించి కన ♦ లారఁగఁ బండ్లను గీఁటి కేలు నె
ట్టన విదిలించికొంచు నక ♦ టా! రఘునాయకు నాజ్ఞలేదు నా
పని యటు డించి వేఱొకటి ♦ పట్టుట జ్ఞానుల రీతికాదు యో
చన యొనరింపఁ బెక్కు కలు ♦ షంబుల కియ్యది మూలమే యగున్.
చ॥ ఎఱిఁగి విసంబు ద్రావిన గి ♦ రీశుని పోలిన శక్తిగల్గు ధీ
వరు లెద నాత్మశక్తిఁ గని ♦ పర్వును గాచుకొనంగ నెంచి యే
ర్పఱుపక పూనువారె? బల ♦ వంతుఁడు నేర్పరి యయ్యు నాతఁడా
తెఱఁగున వేళవేచి వడిఁ ♦ దేఱెఁ బయోధి యడంగు చాడ్పునన్.
శా॥ ఆలంబుం బెడరేఁచు నీయలుక నా ♦ యందే యడంగాఱనీ
హా! లంకాధిపు నొక్కవానరము మా ♦ యం జేసె నన్నన్ జయ
శ్రీ లక్ష్మీవరు రాముకార్ముక కలా ♦ సీమాంత విద్వత్తకే
క్రాలు న్న్యూనత గాన నాకు నిది క ♦ ర్తవ్యంబు గాదెట్టులున్.
క॥ చెలులెవ్వరు సీతనితోఁ, గలిసి నిదురనేయువారు ♦ కారీతని మై

పాలము తపించెడి రాఘవు, కలికి సతీత్వదశ దీనఁ ♦ గనఁగనయ్యెన్. ౨౯౬

క॥ అని తలఁచి యింక నేఁ దడ, సిన ఫలితము లేదటంచుఁ ♦ జింత నవలికిం
జని యకటా! యిందెందును, జనకజఁ గననైతి ననుచు ♦ జాలిం బడియెన్.

—: హనుమ సీతం గానమికిఁ జింతిలుట :—

తే॥ క్రొత్తడి మహాభిజాత నీ ♦ క్రూర దైత్యుఁ, డొకటఁ ద్రుంచెనో భక్షించె♦నో యెఱుంగ
నేవిధమున నెఱుఁగలేని♦యేను పోయి, యేమి పలుకుదు? మఱియు నే♦యిందు తగవు

చ॥ కని యరుదెంచుఁ; గాదు మఱి ♦ కాంతనె తోఁగొని తెచ్చునంచుఁ దాఁ
గను లఱచేత నుంచుకొని ♦ కాచిన రాముని మోము నేవిధం
బునఁ గననేర్తుఁ? గార్య మిటు ♦ మూఁడెఁ గపీంద్రులు చావనున్న వే
ళనె మరణింప కిప్పుడిటు ♦ లంకను వ్యర్థుఁడనై మరింతునే?

చ॥ గడువు దినాలు మున్నె కడ ♦ గాంచెను జానకిఁ గాంచనైతి నే
మడిసియు నేమి? యంగద కు ♦ మారకుఁడాది కపీంద్రపాళి న
క్కడనె నిలుండటంచు బలు ♦ కాఱులు పల్కితిఁ జేయనైతి నా
పొడుపుడివోయెఁ బూర్వమునఁ ♦ బుణ్యమె చేయనొకో జగంబునన్?

తే॥ ఏడువందల యామడల్ ♦ గోడ గలుగు, లంకలోన నేఁగాంచని ♦ లవము లేదు
రాముదేవి మాత్రము గాంచ♦నోమనైతిఁ, గడలి దాఁటియు దాఁట నే♦యడలు కడలి.

తే॥ క్రూరుఁడగు రావణుని గట్టి♦కొట్టి నోళ్ల, నెత్తురులు గ్రక్క గ్రుద్ది కా♦న్పింపుమనుచు
జానకిని గాంతునా? లేక ♦ వానితోడ, లంకఁ జిచ్చిడి కరఁతునా ♦ లక్కపగిది.

చ॥ సురల నలంచి భూమిజను ♦ చూపుఁడి యన్నను దుష్ట భీతిచే
నురుఁగుచు సాహసింప రటు ♦ చూపరు తక్కిన వారలెట్లుఁ జె
ప్పరు మయిసోల నన్విడని ♦ ప్రాణములన్ భరియించి యిందు ధీ
విరహితుఁడైన యేను పృథి ♦ వీవరనందన నెట్లు కాంతునో? ౩౦౩

ఉ॥ లంక కులాధినాథుఁడటఁ ♦ గాంచుచునుంటిని రాముగేహినిన్
లంక నటంచుఁ బల్కె విధ ♦ లం బదియయ్యెను; లోనె దాఁచు నీ
లంకను వార్ధిఁగల్పి తగు ♦ లన్ వడిఁగట్టెదఁ గానకున్న నే
వంకనొ వాఁగునో వెదకు ♦ వాఁడ మెయిన్ భరియింప నేర్తునే? ౩౦౪

చ॥ ధరణిజ దొంగిలించి కొని ♦ దైత్యుఁడు పోవుటఁగాంచి రిమ్మహిన్
నరులు సురల్ నిజంబిది చె ♦ నంటిగఁ జావఁగనేల? తొల్త నీ
పురి మొదలంటఁ ద్రివ్వి పరి ♦ పూర్తిగ వారిధిఁ గల్పి రావణున్
గరములు మస్తకంబు లెడ ♦ గా నుఱుమాడెద నంత మాఁడెదన్.

చ॥ నవు గిజురంతయే నెడము ♦ నూకక నిండి స్వచిత్త కంజముం
దవిలిన రాముఁబోలి నిర ♦ త ప్రితిపత్తిని రోసినట్టి యా
పవనజుఁ డట్లు లోఁదలఁచి ♦ పైకటుచూచి శిలీముఖంబు లా
రవ మొనరించు నొక్క వని ♦ రాజిలఁ గాంచి రహించెఁ గాంచఁగన్.

## ౩. సీ తా సం ద ర్శ న ప ట ల ము. (౨౨)

### —: సీత స్థితి :—

ఉ॥ చూచితి నెల్లచోటులను ♦ చూడఁగ లేదిది యిందు నెమ్మదిం
జూచినఁ జింత దీఱునను ♦ చొప్పు మనంబు వచించు నియ్యెడన్
జూచినమీఁదఁ జూడఁదగు ♦ నూటియుఁ గర్జములేద యిప్పరిన్
మోచు త్రికూటముం బెఱికి ♦ మొత్తెద నంబుధి నేను సీగ్గెదన్. ౩౦౨

క॥ అని రామదూత వంజుళ, వనిఁ జేరెను సురలు విరుల ♦ వాన కురిసి మో
దన మొందిరి; రక్కసుచే, వనిత యచట నున్న తెఱఁగు ♦ పరికింత మిఁకన్.

తే॥ స్థూలమధ్యలు రాకాసి ♦ జోట్లు ఖడ్గ, హస్తలై జడిపింపంగ ♦ నశ్మమందు
తోఁచి యొండిన మందునాఁ♦దోఁచి సౌరు, చెడి నడుమువలె వాడి కృ♦శించి యుండె.

తే॥ నెమలి చాయయుఁ గలకంఠ♦మమరు సీత, నిద్రియని తెప్పమూయుట♦నీఁగి యొండ
మలయు దీపమువలె జిగి♦మాసి పులుల, మధ్యఁ దగులఁబొన్న కురంగి♦మాడ్కినుండె.

తే॥ పడుట యేడ్చుట వడఁకుట ♦ యుడుకుటయును
మలఁగుటయు లేచుటయు మది ♦ కలఁగుటయును
కుృంగుటయు సుృక్కి సోలు టా ♦ ర్చుటయు ఱోలు
టయును తక్క వేఱొక్కండు ♦ చెయిది లేదు.

తే॥ బిలమునుండి వెల్వడి కాలు♦వలుగఁ బాఱె, కుచగిరుల దాఁటి నేలను♦గుంటలు వడఁ
జాలుచాలుగఁ గురియు భూ♦జాతకనులు, వాన కనులంట సార్థక♦పడియె నచట.

తే॥ వృథివియందు వమంజస♦ప్రేమ గలుగు, దంపతీవియోగార్తి యే♦తనువుదాల్చె
నవఁగ నొప్పిన సీత నా♦ల్లని మొగుల్లఁ, గాటుకమగన్నఁ గనులబ్ధి♦గాఁగ నేడ్చు

చ॥ పవడముఁ బోలు హస్త పద ♦ పద్ధతినొప్పు పయోదవర్ణు రా
ఘవుని దలంచుచో వెడఁద ♦ కన్నులు రాల్చిన నీటఁదోఁగి య
వ్యవహిత దుఃఖతాపమున ♦ వచ్చిన యూర్పుల వేఁడి నెండు చ
వ్యవసిత రీతి నొప్పెఁ గమ ♦ లాప్త కులేంద్ర కళత్ర మయ్యెడన్. ౩౦౯

తే॥ చావ విధిదాఁటు టరదని♦జంకి వెగచి, కాంతుఁ డొల్లనఁ దనకుల♦గరిమనైనఁ
బ్రబ్బునైనను గనిందుఁ♦వచ్చు వచ్చు, ననుచు దిక్కులఁ గనుచుండు♦కనులతోడ.

తే॥ ఓర్పుగలదియై చంద్రము♦నోడిసి క్రింగి, వెలివఱచు రాహువుంబోలి♦పిడుచ గట్టి
యొక్కటైయున్న జడతోడఁ♦జిక్కిలిపయిఁ, జేయిచేర్చి విసుగులేని ♦ చింతతోఁ.

ఉ॥ మిక్కిలి ధూమమంటి కడు ♦ మేవిన పొల్పుగు నొంటిచీరతోఁ
జెక్కలువచ్చు హంసల పి ♦ ఱంది మునుంగని సన్న మేనితోఁ
జక్కెర వింటివాఁడు సుధఁ ♦ జక్కఁగ జేసిన ముద్దుబొమ్మ న
ల్పెక్కఁగ ధూమమంటిన ర ♦ హిం గనుపట్టెడి మేనిసౌరుతో  ౩౦౮

—: సీత రాముని దలంచి పరితపించుట :—

చ॥ మఱఁదియుఁ జూడఁడేమొ దశ ♦ మస్తకుఁ డీడకు నన్ను దెచ్చుటల్
పఱపగు నబ్ధిమధ్యమున ♦ భాసిలు లంక నెఱుంగరేమొకో?
యెఱిఁగియు వచ్చువెట్లనుచు ♦ నేడ్గడ సేయుట మానిరొక్కొ? యం
చొఱలుచుఁ గ్రుంగి క్రుంగి యెద ♦ నొందిన దుస్సహమైన బాధతో.

చ॥ జనకుని వంటి పక్షికుల ♦ చంద్రుఁడు వారలు కాంచునంతలో
నని మరణించెనొక్కొ? విజ ♦ న స్థలి నాగతి నెవ్వరెట్లు రా
మున కెఱిఁగించువారు? లిఁకఁ ♦ బొందుగ నీభవమందు రాఘవుల్
నను గనిపెట్టుటే యరిది ♦ నాదురవస్థితి యిట్లుఁ జెల్లునే?.

ఉ॥ దూఱితి లక్ష్మణాఖ్యు నట ♦ దోసము నాక తదుక్తి వించు నీ
వేఱిఁడి ఱాఁగయంచుఁ బఱి ♦ వీడునొ? నావిధి యెట్టులుండునో?
దూఱిన పాపకర్మ మిటు ♦ దుర్దశకుం గొని తెచ్చె వట్టి యీ
కోరిక లేల! యంచు నలఁ ♦ గుచ్ నలఁగుచ్ మలఁగుం గలంగుచున్  ౩౧౦

ఉ॥ వేళకు నెవ్వ రాతనికిఁ ♦ బ్రీతిగ లక్ష్మణుఁ డిచ్చు కందముల్
మూలములున్ ఫలంబులును ♦ ముందట నుంచెడువారు? విందుల
వ్వేళకు రాఁగ నెంత దుర ♦ పిల్లునొ? యంచుఁ దలంచి నేలపైఁ
గాలు కదల్పకుండిన సు ♦ కాసి వహించు దురంత తాపమున్.  ౩౧౧

ఉ॥ వంచకులున్ దురాత్ములును ♦ పాపులు దైత్యులు సీత నిన్నినా
ళ్లుంచరు నాఁడె చంపి తిని ♦ యుందురు కర్జ మిఁకేది? కానరా
దంచు మదాశ వీడనొకొ? స్వాన్వయ ధర్మమదైన యోర్పుఁ దా
నంచిత మంచుఁ బూనెనొ? క ♦ టా! యిఁక నేమని యందు దైవమా?

తే॥ కన్నతల్లులు తమ్ములు♦క్రమ్మఱిల్లి, వచ్చి తోడ్కొనిపోయిరో? ప్రతిన గడువు
కడవకుండఁగ నగరికే♦గఁడు నిజంబు, వనమునంద యుండు ననుచు♦వనటనొందు.

ఉ॥ వీరులు మున్ను పోరునకు ♦ వీఁకను వచ్చినరీతిఁ బిమ్మటన్
దారుటచేత నందు బెడి ♦ దంబగు సంగరమే ఘటించెనో?

యేరహి నెందు నాకొఱకు ♦ నెంత తపించుచునుండువారొ? యిం
దారటవొందు నాయెడఁద ♦ వ్యాధికి మందెది? యంచుఁ జింతిలున్.

తే॥ నీకు లేదు రాజ్యము తమ్ము♦నికె యటంచుఁ, గైక పల్క ముమ్మడుఁగు మొ♦గంబు వెలయు
పురుషసింహుని యప్పటి♦పొలుపు దలఁచి, తలఁచి మదిలోన మిక్కిలి♦తాపమొందు.

తే॥ అవని పూర్తిగ నేలుమా♦యన్న యపుడు, నడవులకు నేగుమాయని♦యన్న యపుడుఁ
జిత్రమున వికసించిన♦చెందొవవలె, వెలయు నెమ్మొగంబును మదిఁ♦దలఁచి తలరు.

తే॥ తాఁకియెత్తుటయే యొక♦తడవుగాఁగ, స్వర్నదీ జటాధరుఁడు హ♦స్తమున వంచు
మేటి మేర్వంశమగు విల్లు♦మిడిసి రెండు, తుండ్లు గాఁజేయు భుజముల♦దొడ్డఁదలఁచు.

తే॥ విబుధవైరులు పదునాల్గు♦వేలమంది, కవియ మూఁడుగడెలలోనఁ♦గలను ముగియ
రెండుకొనలును వంగు కో♦దండ గరిమఁ, బొగడి పొగడి దూపిల్లును♦వగలఁబొగలు.

తే॥ లోఁతునీట మందాకిని♦లోనఁ గలము, నడపు గోల యా గుహునకు♦నాయనుజుఁడు
నీకు ననుజుఁ డీ జానకి♦నీకు వదిన, యని వచించిన స్నేహకా♦ర్యంబుఁ దలఁచు.

తే॥ తండ్రి ప్రేమతోఁ దన్నిచ్చు♦తరుణమందు, తండ్రి చేనున్న తన కేల♦తండు గొనుట
దర్భవలెఁ బవిత్రంబైన♦దక్షిణ పద, మెత్తియుంచుట దలపోయుఁ♦జిత్తమందు.

తే॥ విరులసరులు తాల్పఁగఁదగు♦శిరమునందు, రత్నమకుటంబు గొనక వి♦రాగియగుచు
జడలు దాల్చు తమ్ముని గని♦జాలినొంది, పరితపించుట దలఁచి తాఁ♦బరితపించు.

తే॥ రాజ్యసంపద నీఁగి య♦రణ్యములకుఁ, దరలు నాఁడు యాచించిన♦ధరణిసురున
కాలమందల నొసఁగి పే♦రాసమేర, లేమిగని సుస్మితంబైన♦మోముఁ దలఁచు.

తే॥ నరవరుల గండ్రగొడ్డట♦నిరువదొక్క, తడవ తిరిగి వధించి ర♦క్తమునఁ దండ్రి
తర్పణము సేయు భార్గవు♦ధనువు తోడఁ, దపము బలమును గొను పెర్మిఁ♦దలఁచి తలరు.

తే॥ కాకమగు జయంతున కొక♦కన్ను వోవ, నలుఁగు నేయుట గాక కా♦కులకు నెల్ల
నొంటికన్నొసరించిన♦యుగ్ర జయము, శిరమునందాల్చి మించిన♦చింత సేయు.

తే॥ దుష్టుఁడగు విరాధుని పెను♦దోసములను, ద్రోచి ఘోరశాపమ్మును♦పాచినట్టి
ప్రాణనాథుని శ్రీరామ♦భద్రు భద్ర, గుణములఁ దలంచి యారీతిఁ♦గుములుచుండ.

—: రాక్షసస్త్రీలు నిద్రింప సీత త్రిజటతో నిర్వేదము దెలుపుట :—

తే॥ శీలవతి ప్రియవాక్య సం♦స్కృతియుఁ గలుగు, త్రిజట తక్కఁ దక్కిన దుష్ట♦దితిజకాంత
లర్ధరాత్రంబుగా నిద్ర♦యనెడి చొక్కు, నీరు ద్రావి మత్తిల్లిరి♦నేలఁబడిరి.

తే॥ అంతఁ దల్లికంటెను ప్రియు♦రాలిఁ ద్రిజటఁ, గాంచి నీవు పవిత్ర గు♦ణాంచితవును
చెలివిఁ గావునఁ జెప్పంగఁ♦దలఁతు నీకు, వినుమనుచు నిట్లుపలికె నా♦విమల చరిత.

తే॥ చెలియ! నాకును మేలొందు♦గలుగు నేమి? నాదు పాపంబు లింకను♦ మోఁదుచున్నె?
కనులు బొమలు మున్నగు నంగ♦కమ్ము లెడమ, ప్రక్కనదరె శుభంబేది♦వచ్చునాకు?
క॥ ప్రేమమయుఁడు కౌశికముని, తో మిథిలకు వచ్చునాఁడు♦తోడ్తో నేయే
నేమమున నెవ్వి యదరెనో, యామాడ్కిని నేఁడుగూడ♦నదరెడిఁ గంటే!
క॥ తెలుపఁగ మఱచితి నిదియును, చెలి వినుమా ధర్మమూర్తి ♦ జీవితనాథుం
డిలఁ దమ్ముఁ డొండవిడిచి వ, నుల కరిగిన నాఁడు వలను♦నొసలే యదరెన్
తే॥ గరళనిభుఁడు దశాస్యుండు♦కైతవమున, వనమునందు నాకగపడు♦దినమునందు
వలకెడనె యదరెను వాని♦ఫలము దెలిసె, నిప్పు డెడమవై పదరెడి♦నేమి కలదొ?

—: త్రిజట సీత కూఱట గఱపుట :—

క॥ అనుడుఁ ద్రిజట యిట్లను నో, దవ, విన శకునము నీకు మేలె♦వెలయించును నా
థుని చేరఁగలవు నిక్కము, వినుమా యని ప్రియముమీఱ♦విని చెన్ మఱియున్.
తే॥ పసిమి నీమేనుపొంద జీ♦వంబులిందఁ, బొన్నువన్నియ భ్రమర మిం♦పునను వచ్చి
యించురంగుల తేనియ♦నించుపాట, నీదు చెవినూఁదిపోయెఁ గాఁ♦చితివె మగువ?
తే॥ కాన దీని యోచింప నీ♦కాంతుఁ డంపు, దూతవచ్చుట నిక్కంబు♦దుర్జనులకుఁ
జెడుగు తొడరుట తప్పదు♦పుడమితనయ! మఱియు వినుమొక్క కలగంటి♦మంచిదద్ది.
తే॥ కలఁతచే నిద్రలేమిని♦ కలలురావు, నీకు; నేనొక కలగంటి ♦ నీరజాక్షి!
దుస్స్వభావమా నీపురిఁ♦దోఁచు కలలు, నిక్కలలు వినుమని పల్కె♦నిక్కువముగ.
తే॥ రావణుఁడుతలలను నూనె♦రాచికొనుచు, రాసభపిశాచములు లాగు♦రథముమీఁద
రక్తమాల్యాంబరములు గా♦త్రమున వెలుఁగ, జరిగె దక్షిణదిశకు ని♦శ్చయముగాఁగ.
క॥ తనయులు బంధులు తక్కిన, యనుచరులును దైత్యువెంట♦నరిగిరి మరలం
గనలేదు తిరిగివచ్చుట, జనకసుతా! భయము విడుము ♦జరగుట వింటే. 382
ఆ॥ అమిత శౌర్యవంతుఁ♦డగురావణుఁడు వేల్చు, హోమకుండవహ్ని♦లొకట నాఱె
రత్న దీప వితతి♦రాజిల్లు ప్రామేడ, పిడుగు పడుటకతన♦ప్రీలి కూలె. 383
ఆ॥ పిడులు మదముగార్చె♦భేరి వాయింపకే, పిడుగు పగిది మ్రోఁగె ♦నుడువు లురలె
మెఱుపుతోడి మొగులు♦మింటను లేకయే, పిడుగు లవనిఁబడియె♦బెడిదముగను.
తే॥ ఇరులు తొలఁగ నద్దమరేయి♦యినుని బింబ, మర్ధభాగంబు కాలిన♦యట్లుదోఁచె
బలియురగు వీరులు ధరించు♦ప్రసవమాలి,కలును మాంసంపుఁ గంపును♦వెలువరించె
తే॥ మఱియు లంకయుఁ గోటలు♦నెరిసె దిశలు, తెలియగంధర్వనగరంబు♦పొలిసె నిండ్లు
విఱిగె మంగళ కుంభముల్ ♦తఱిఁగెఁ గలిమి, గ్రింగెఁ జీఁకట్లు దివియలఁ♦గ్రుంగెఁ దెలివి
క॥ తోరణములు తుండ్లై పడె, వారణములు పండ్లురాల ♦ వసుధం గెడసెన్
పీరణములు ప్రీలెఁ గలి, ప్రేరణమున, గలశజలము ♦ విరిసెను కల్లై.

తే॥ కలువ జేనిఁజిల్చికొనిరి♦క్కలును వెలలె, వ్రాయరక్తముల్ గురిసెను♦మొగులుగములు
అసి గదాది సాధనము ల♦న్యోన్య తాడ, నముల భేదిలఁ బోరె ఘో♦రముగఁ దామె.
తే॥ ఐదువల సూత్రములు పరు♦లంటకుండఁ, దమకుఁ దామె తెగుచుఁ బయో♦ధర తటముల
దొరలె నిట్టిప్పు డేర్పడు♦దుర్నిమిత్త, ములు మహాద్భుతములు మఱి♦కలవు వినుము
తే॥ రాజు పట్టపుదేవి శి ♦ రోజ పాశ, మెడలిపడి కీలలంటిన ♦ వడిని కమరెఁ
జేటు నిక్కువమంచు నేఁజెప్పినట్టి, కారణము లివి వింటివే! నీరజాక్షి!

—: త్రిజట తన స్వప్నమును సీతకుఁ దెలుపుట :—

తే॥ నేఁడు గాంచితి నొకకల ♦ నియతి వినుము, జంటవీడని బహుబలి ♦ షంబులైన
సింగముల జత యనుపమ♦శిఖరిమీఁద, వ్యాఘ్రయూథంబుతోఁ గూడి♦శీఘ్రగతిని.
తే॥ అలవిలేనట్టి పెను మదా♦వళములుండు, వనము వేష్టించి నిలిచి పీ♦డనముచేసి
పీన్గుపెంటలఁ జేసె న♦వ్వేళ నందు, గల మయూర మెగిరిపోయెఁ♦గటకమునకు.

చ॥ వినుత సుభాషిణీ! వినుము ♦ వేయి దివెల్ వెలిఁగించినట్టి స
న్మణి దివియొక్క గరంబున న ♦ మర్చి యొకానొక సుందరాంగి రా
చనగరునుండి వెల్వడుచుఁ♦జక్క విభీషణు మేడఁజేరె నే
మనఁగల దింతయుక్క బహు శు♦భావళి నీకగునంచుఁ జాటెడిన్. 3౫౮

తే॥ అమ్మహాత్ము రాలట్లు హ♦ర్మ్యమునఁ జొచ్చు, నపుడె నను నిద్ర లేపితి♦వంతు గనదు
కలయనంగ జానకియును♦కరము మోడ్చి, కొఱఁతయును గాన నిద్రింపు♦కోమలి! యనె.

—: హనుమ సీతను గానవచ్చుట :—

తే॥ అట్టియెడ శ్రీరఘుప్రభుఁ♦డంపినట్టి, కోఁడెబోలిన మారుతి♦కుసుమ వనముఁ
జూచు చరుదెంచు నాతఁడ ♦ చ్చోటఁజేరి, ధారణీజాత యున్నట్టి ♦ తీరుగనియె
తే॥ దనుజకాంత లప్పుడు మేలు♦కనుచు నమ్మ! తృప్తి లేని యీనిద్ర బా♦ధించె మనసు
ననుచు శూలదండాసి కుం♦తాదులైన, కైదువులఁ దాల్చి గములయి♦కదిసినారు.
సీ॥ కడుపున నోళులు ♦ గలవారు నొసలిపైఁ, గన్నులు గలవారు ♦ కఱకుచూపు
గలవారు వండ్లసం ♦ దులఁ బిశాచములు నే, నికలు చొఁగంటులు ♦ నిద్రసేయఁ
దగు బిలంబులఁబోలు ♦ తలనోళ్లు గలవారు, పదిచేతు లొకతల ♦ వరఁగువారు
తల లిరువది హస్త ♦ ములు రెండు గలవారు, వికృత వేషిణులును ♦ భీకరాంగ
తే॥ లద్రులంబోలు చనులు వ్రే♦లాడువారు, శూల ఖడ్గ చక్రాంకుశ♦చ్ఛురిక లొప్ప
వినమెరూపుగాఁ గొనియున్న♦విధమువారు, భర్గుఁడును బెగ్గడిలఁదగు♦బలమువారు.
తే॥ తురగ గజ సింహ భల్లూక ♦ శరభ ఖడ్గ, మహిష శార్దూల శునక గో♦ మాయు కిటి పి
శాచ ముఖములవారుప్పృ♦ష్ఠమున నోరు, గలుగువారలు పొగనోరు♦గలుగువారు,

తే॥ డెందమున కందకుందు క ♦ డిందిజలము, నరసి లెక్కిడరాని దృ ♦ శ్యములు గలిగి
యింతులయ్యును మగఁటిమి ♦ నెనయువారు, తటుకునవ్వచ్చి మైథిలిఁ ♦ దఱిసినారు.
తే॥ అపుడు రామునిసతి పల్కు ♦ లడఁచి వారి, భీకరాస్యంబులం గని ♦ విహ్వలించె
రామదూత యున్నత కుజా ♦ గ్రంబు సేరి, వారి కలకల మాలించి ♦ పఱపెఁ గనుల.
క॥ రాకాసులు పలువురు ఘో, రాకారలు సాయుధలు మ ♦ హా రభసమునన్
మాకీలొని గుంపుగొను వా, రేకారణమో యనుచుఁ బ ♦ రీక్షించెఁ దగన్.

—: హనుమ సీతను గాంచి యుత్సాహవంతుఁ డగుట :—

ఉ॥ కారుమొగుల్గఁబోలు ఘన ♦ కాయుని యచ్యుతు పేరురంబునన్
జేరి మదీయభక్తికిని ♦ సేవధియై జగదేకమాతయై
శ్రీరమయైన జానకిని ♦ చిత్తము రంజిలఁ గాంచె రాక్షసీ
నీరదముం బెకల్చికొని ♦ నిక్కిన మైథిలియన్ శశిప్రభాదన్. ౩౬౨
ఉ॥ తాఁకఁగరాని రక్కసులు ♦ తార్కొని కావలికాయ నూష్మమున్
దాఁకిన వాడు పూలత వి ♦ ధంబగు నీమె సముద్రమంతలై
యాకులమందు కన్నుల బ ♦ యల్వడి నిండు తటాక మధ్యమం
దాఁక వహించు హంసిక్రియ ♦ నందుట మత్ప్రభు దేవియే యగున్.
ఉ॥ దమ్మము కూలలేదు వడిఁ ♦ దాఱి నశింపను నేను రోసి యి
య్యమ్మల దేవిఁగాంచితి వ ♦ హించితిఁ గీర్తి ముదంబు సర్వమున్
గ్రమ్మఱ నంచు వేడ్కయను ♦ కల్లు భజించి మదించి యాడి మో
దమ్మునఁ బాడి గంతులిడి ♦ దాఁటెను కొమ్మల నీవలావలన్. ౩౬౯
తే॥ లలి ననింద్యములగు రూప ♦ లక్షణములు, రాముఁడు వచించినట్టులీ ♦ రామ కమరె
నార! మాయావియైన ద ♦ శాననుండు, రాము జీవముల్ దాఁచిన ♦ రాణ యిదియో?
తే॥ మూఁడుజగముల ధర్మంబు ♦ మూలముట్టఁ, దోలఁచు పాపి రాఘవు జీవ ♦ ములనుడీయ
నెంచి చేసిన దుష్కృతి ♦ యిద్ది నిక్క, మీమె లక్ష్మియే రాముఁడు ♦ పేంద్రుఁడె యగు
చ॥ మసటు వహించు రత్నము క్ర ♦ మమ్మున నున్నది సూర్యకాంతులం
బసచెడు చంద్రుఁబోలినది ♦ మాసిన వేణియె దాల్చియున్న దీ
కుసుమ సుగంధి గౌరవము ♦ కోర్కియుఁ దత్కృతి రక్షణంబునం
దొసఁగొక యింతలేదు; భువిఁ ♦ దోరపు ధర్మము నాశమొందునే?
ఉ॥ శ్రీ రఘువర్యు దొడ్డవగు ♦ చేతులనో? పొగడంగఁదగ్గ యీ
వారిజగంధి సద్గుణ వి ♦ పాకమునో? ప్రభుయోగ్యసద్గుణో
దారు విదేహరాజు కుల ♦ ధన్యతనో? మఱి దేనినో? మనం
బార నుతించువాఁడ? నివి ♦ యన్నియు రూపయి యొప్పె నీమెయై.

చ. అమరులు నొక్కకావలము♦నందరు జ్ఞానులు పాపయుక్తులై
యమరరు ధర్మమున్ జగము ♦ నందు నశింపను మా ప్రభుండు లో
కమున నొనర్పఁదగ్గ యొక♦కార్యముగల్గునె? యన్నియున్ భువిన్
నమకుఱు సీతగల్గ మఱి ♦ నాదగు సేవయు ధన్యమేకదా? ౩౨౮

తే॥ దీటులేని యీదేవి స♦తీత్వమించు, కంత చెదరెన శ్రీరాము♦నలుక యనెడు
కడలి పొంగి కల్పాంతంబు♦ గానొనర్చు, ననుచు జడిసితి నీఁక లోక♦మమరుశాంతి.

చ॥ ఇలునడి యొంది శీలము మ ♦ హేడ్యతఁ బొంది మనోదృఢత్వముం
గలుగు తపంబు పేమి ని ♦ కంబుగ సన్నుతిసేయ శక్యమే?
యలఘన నగ్నినిల్చి విష ♦ యంబుల గెల్చి జలాదు లూడ్చియున్
జలుపు తపస్విలేని కుల ♦ సాధ్వుల ముందట నిల్చు వారలే?

చ॥ ఇలపయి నీశుభాంగి జని ♦ యించుటచేఁ దపమూనిపొందు స
త్కుల జననంబు స్త్రీపొడుపు ♦ తోరపు ధన్యత గాంచినట్లె చె
ల్వల ధనమైన లజ్జయుఁ ద ♦ పం బొనరించి పవిత్రయయ్యె నీ
లలి నిట నీమె సత్తప మె ♦ లర్చుట రాముఁకు నోచఁ డారయన్.

తే॥ రాక్షసులు నీతిమాలిన♦రాజసాత్మ, లీమె యొకతయే సాధ్వి మ ♦ తేరు లేరు
స్త్రీత్వమును తపం బేకాకి♦నీత్వ మిదియ; చెలువలకె ధర్మఫలమెల్లఁ♦ జెందుఁగాక!

ఉ॥ ధర్మమె కాచుచున్నదొ? య ♦ధార్మికుఁడైన దశాస్యుచేయు దు
ష్కర్మమె కాచుచున్నదియొ? ♦ కాక మహత్త్వ సతీత్వమే తగన్
శర్మ మొసంగునో? అరుదు! శక్యమె యీగతి నోర్వ నేరికిన్?
నిర్మల సీతి నీస్థితి గ ♦ ణింపఁగ సాధ్యమె నన్నుబోఁటికిన్? ౩౨౯

ఉ॥ నెట్టన దైత్యసంపద గ ♦ ణింతమ? నిర్జర సేవితంబ యా
నట్టిది; వారి దుష్కృతము ♦ లందమ? యిట్టివి! యిందు మానముం
దొట్టి వసించుటన్నఁ గడు ♦ దుర్భర; మిట్టుల నున్న యీమె కీ
పట్టున నేది కష్టమగుఁ? బాపము పుణ్యమునే జయించునే? ౩౩౦

తే॥ ఇట్లు పలువలు విధముల♦నెంచి వృక్ష, మధ్యమున గుబురగు చోట♦మఱుఁగునుండి
హనుమ కాంచుచునుండిన♦యంత నటకు, దానవేంద్రుండు వచ్చుట♦గాన నయ్యె.

## ౮. నిందన పటలము. (౩-౨)

సీ॥ కూటయుతోన్నత♦కుధరంబు లొకకొన్ని, చెలువార నొకచోటఁ♦జేరెననఁగ
వజ్రాల కుండలా♦వళి చలించుచు నుండు, వింశతి భుజములు ♦ విరిసి వెలుఁగ
సాగరోదయ భాను♦చందాన నొక్కొక్క, మకుటంబు లేయెండ♦మలసి కాయ
గంధ మాల్యాదిక♦క్రమ ఘుమం ఘుమల్, దిక్కరీంద్రంబుల ♦ ముక్కునింప

తే॥ ఖడ్గ మూర్వశి మోచి ప♦క్షమున రాఁగ, నడపము గొని మేనక♦యందియాయఁ
బాదుకలు తిలో త్తమ చేతఁ♦బట్టి తేఁగఁ, జుట్టి క్రేవల రంభాది♦సుదతు లరుగ
సీ॥ ఒడళులు వెలిఁజిమ్మ ♦ తొడవుల కాంతులు, చీఁకట్ల గుంపులఁ ♦ జెర్చి త్రిమ్మఁగ
నూపురములు కింకి♦ణులు మేఖలలు పెక్కు, పక్షుల కలకల♦ధ్వనుల నెనయ
తావి నూనియ కర♦దీవియల్ ధరియించి, వడి నసంఖ్యాకపా♦వనిత లరుగ
విఘ్నంబు గలుగఁ గో♦పించి నిద్రను మానె, నాకోపమెంత ద♦వ్వరుగునొక్కొ
తే॥ ధరణిజాత వనము దాఁక♦జరుగునొ ? మఱి, యెవరి మీఁదికి నేగునో♦యేమిగతియొ!
యనుచు ననిమేషనయనము♦లమరవరులు, మూసికొని చూచుచుండఁగ♦ముదముతోడ
సీ॥ నీల భూధర గళ♦న్నిర్ఝరంబునుపోలి, పట్టోత్తరీయంబు♦పరిఢవిల్ల
జలధిపై బాలభా♦స్కరకాంతి పరవిన, రహి హారరుచులు గా♦త్రమున వెలయ
కారుమబ్బులను వి♦దారించు కొనివచ్చు, నెఱిమించునాఁగ జ♦న్నిదము వెలుఁగ
హీరమాణిక్యకే ♦ యూర రోచులు గ్రహ, తారకౌఘంబులఁ ♦ దాఁకి పోర
తే॥ భర్మనూపురరుచులు భూ♦భాగమందు, పరవి పణిహారులట్లు ముం♦దరుగుచుండ
బంధు మందహాస జ్యోత్స్న♦పరిధి గట్టి, రాత్రులందును ముఖపద్మ♦రాజివిరియ.
సీ॥ ఒడలి వన్నెకు వేఱు♦పడి డాలు మీఱి మ, ధ్యమున నొప్పారు పీ♦తాంబరంబు
నల్లని పెనుగొండ ♦ నడుమఁబడిన ప్రొద్దు, పొడుపు నీరెండ నా ♦ నడరుచుండ
వ్రేళులందలి మించుఁ♦బోలు నుంగరముల, మణులవెల్గులు పూచు♦వనము నెనయ
కల్పాంతమున నిల్చు♦కనకాద్రిపైఁ బొల్చు, గ్రహముల హార తా♦రములు పోల
తే॥ మస్తకముల శీర్షకములు♦మలసి యుదయ, గిరిని పన్నిద్దఱినుల ని♦ద్దఱు తొలంగఁ
బదురు భాను లొక్కటఁదోఁచు♦పగిది వెలుఁగ, రావణుఁడువచ్చెలోకవి♦ద్రావణుండు.
సీ॥ కోఱలు విఱిగి కే♦కుల పాదములఁబోలెఁ, జందంబు చెడిన ది♦క్సామజములు
భువన భీకరుఁడయి♦పాలించిన కనక క, శిపుని వరంబుల♦చేవ చెఱుచు
నిశిత దంష్ట్రాభీల ♦ నృహరి పాదాంకముల్, తడవిన గజముల ♦ వడిని బెగడ
జక్కనుల్ నిద్దుర♦నమసిన రంభాది, గణికలును భుజంగ♦కన్యకలును
తే॥ సిద్ధ విద్యాధరాసుర ♦ స్త్రీలు వాలు, గంట్లు కువలయ నేత్రలు ♦ కంజముఖులు
కుంకుమాంకితోరస్కలు♦కోమలాంగు, లద్రిఁజుట్టిన నెమిళుల ♦ యట్లు మలయ.
సీ॥ సుషిర వాద్యంబుల ♦ సుస్వరంబుల తోడఁ, బొరలిక లేక సొం♦పుగ లయించు
చామల గాత్రముల్ ♦ శ్రావ్యంబు గాఁగఁ గి, న్నర గీతములు తాళ♦నాదములును
ఝల్లరుల్ మద్దెలల్ ♦ సొరుగా వినిపింపఁ, బాములు నమృతంబు♦బయలువఱుప
శృంగాటకములందు♦హేమ రత్న విభూష, లందాల్చు హారిణుల♦చందమందు
తే॥ హరిసుమధ్యలు చామర♦లాలవట్ట, ములను దాలిచి జీమూత♦ములనుగాంచి
ప్రీతి నటియించు నట్టువ ♦పిట్టల వలెఁ, దళుకు బెళుకులఁ జూపుచుఁ♦దరలి రాఁగ.

ఉ॥ వీణలు మీటి వైణికులు ♦ వీనుల విందొనరింపఁ బొందుగా
గాణలు (శావ్యరీతిఁ గల ♦ కంఠములం బలెఁ బాడఁగా సుప
ర్వాణులు మర్దళాదిక ర ♦ వమ్ములఁ గొల్పఁగ దేవతా పికీ
వాణులు శాస్త్రసమ్మతిని ♦ భావములం బ్రకటించి నర్తిలన్. ౩౮౭

ఉ॥ కాలిన పుంటిలో గొరక ♦ కట్టియ చొన్పిన మాడ్కి దర్పకుం
డోలిని తమ్మిగుమ్మితిక ♦ నొమ్మిక ఆొమ్మునఁ గ్రుమ్మఁ గౌముదీ
జాలము వేఁడిసేయ ఘన ♦ చందనశైల సమీరణుండు కుం
దాల మరందముల్ గరఁచు ♦ తామ్ర కణంబుల పోల్కి రాల్పగన్.

ఉ॥ తంతువుఁబోలు మధ్యములు ♦ తప్పక భేదిలునంచుఁ దోఁపఁగా
గంతులువైచి పైకుఱుకు ♦ గబ్బి చనుంగవ పైఁడి గిండ్లు నాఁ
జెంతన సేయఁగప్పి చెవిఁ ♦ జేరిన కన్నులుగల్గు స్త్రీల శ్రీ
మంతములౌ కటాక్షములు ♦ మాటికి ఆొమ్మున బావులం బడన్.

సీ॥ కల్పకంబులు నిధుల్ ♦ గంధ మాల్యాంబర, భూషణావళిఁగొని ♦ మొనసిరాఁగ
కలశాబ్ధి వీచికల్ ♦ కాటుక కొండపై, మలసిన వనఁగఁ జా ♦ మరలు బెరయ
కందుగానని నిండు ♦ చందురుఁ బోలిన, ధవళాత పత్రము ♦ ద్ధతిని వెలయ
నడుగు లిడెడు వేళఁ ♦ గడలి చుట్టిన త్రికూ, టస్థమా లంక గుం♦ట వడి యందు

తే॥ వీచికలు పాఱిదిక్కుల ♦ విరిసి పరవ, భుజగరాజును భారంబు ♦ మోవలేక
మెడను క్రుంచఁగ వారిధి♦ మేఖలయును, వెన్ను నెటుకున విఱిగి నో♦ర్విడిచి యఱవ.

ఉ॥ తాటక కంటె నిమ్మడుఁగు ♦ దార్ఢ్యముతోఁ గుధరంబునే నిరా
ఘాటముగా వహింపఁదగి ♦ గాజులు పూనిన కాంతలెట్టి జం
జాటము లేనివారు ఘన ♦ చక్రగదాసి శరాన సర్వలా
ఖేటక కుంతశూలములు ♦ కేల ధరించి బిరాన వెంటరాన్. ౩౯౧

చ॥ విరియు చివుళ్లు పూవులును ♦ వేళ్లును మొగ్గలు కాఁడ లాకులున్
హరువుగ నెల్ల యంగములు ♦ హైమములై విలసిల్లు వృక్ష సం
భరిత వనంబు మాఁడువహి ♦ శ్వాసము పుచ్చుచు సీతయున్న చో
టరసియు దోఁపు వోవు మణి ♦ నారయు పన్నగమట్లు రోయుచున్.

ఉ॥ వచ్చెడు దైత్యరాజుఁగని ♦ వాయుకుమారుఁడు చింతనేసి నేఁ
డిచ్చట వీనివంచనయు ♦ నిచ్చయుఁ జేష్టితముల్ బయల్పడున్
జెచ్చెర మీఁదఁ జేయఁదగు ♦ చెయ్దియు నేర్పడు నంచు రామ నా
మోచ్చరణంబు తోడనట ♦ నుండు ననోకహామందు డాఁకొనెన్. ౩౯౪

ఉ॥ అసురమృగాత్ములంత నెడ ♦ యం జన నన్నులలోన దీపమై
యొసఁగెడు రాముదేవి గల ♦ యిక్కకు నిర్జరవైరి చేరన

వ్వసుమతిపుత్త్రి జెగ్గడిలి ♦ వన్నెల చాఱలు చేవ కిన్క దీ
మస మెసలారు వేఁగిఁగని ♦ క్రమాలు మెకంబు వితాన బెగ్గిలెన్. ౩౯౫

తే॥ వడఁకి జీవముల్ చలియించు ♦ వనజనయన, మోహమునఁ గ్రుంగి తపియించు ♦ మూర్ఖ దైత్యు
ననుమ యొకసాక్షిగాఁ దన ♦ కనులఁగాంచి, చిత్తమొక్కనిల్కడలేక ♦ తత్తళించె.

ఉ॥ దేవికి భద్రముల్ సకల ♦ దేవత లిత్తురుగాత! వేదముల్
తావలమొంది వర్ధిలుత! ♦ ధర్మము నిశ్చల మందుఁగాత! శ్రే
యోవిభవంబు రామునకు ♦ నొందుతమంచనె నా దినేంద్ర దో
షావర నిత్యకీర్తి సువి ♦ చార గుణుం డనుమంతుఁ డత్తఱిన్.

—: రావణుఁడు సీతను బతిమాలుట :—

తే॥ విసము నమృతంబుగఁ దలంచి ♦ వేఁడువాఁడు, పంక్తికంఠుఁడు డాసి యో ♦ పద్మగంధి!
కోకిలా! యెప్డు నా యెడ ♦ గొప్పకరుణ, యమరుతువో వచింపుమ యని ♦ యణఁగిపలికె

తే॥ పురవిరోధిసన్నిధి నేని ♦ పరువు క్రుంచి, యించుకేని తగ్గని దిట్ట ♦ యెడఁద తలఁపు
బిడియమును తన్ను మిక్కిలి ♦ జడను పఱుప, జంకిజంకి యిట్లనియె నా ♦ జవ్వనికడ.

క॥ ఆకర్ణాయతలోచన!, వే కడచనె నిన్నినాళ్లు ♦ వెడలునొ మఱియున్
నీ కరుణ యిట్టులున్నది, నాకడ నీకేఁ గెడయు పిదప ♦ నన్నెనసెదవే?

క॥ వనితాతిలకమ! జగముల, మునుకొని వహియించు నాయ ♦ మోఘ శ్రీపా
లనమున నీకై కలిగిన, మనసిజు పోరొందు దక్క ♦ మఱి కొఱ గంటే! ౪౦౧

తే॥ హేమ పల్లవమా! కీర్తి ♦ యెసఁగు కలిమి, కోరకయు పేక్షచేసితి ♦ ఘోరవనుల
నీ మగండు చావకెడరు ♦ నీఁగి యేగి, పడయునది యల్పమనుజ సం ♦ పద యెకాదె!

తే॥ పెరిమతోఁ దపస్వులు శాస్త్ర ♦ విదులు పొందు, ఫలము నించుక నీమదిఁ ♦ దెలియనరయు
దేని నాయాజ్ఞ శిరసావ ♦ హించు సురలఁ ♦ జేరి వసియించు లేక దా! ♦ చిగురుఁబోఁడి.

తే॥ వస్తువులలోన మేలుగా ♦ వఱలు బిడ్డఁ, గోకిలరవంబు వీణను ♦ గోరువంక
నడఁచు మృదుభాషిణీ! నీకు ♦ వెడఁగు బ్రహ్మ, కరుణనడుముతో సృష్టింప ♦ మఱచెనెమొ!

చ॥ పరువము నాయువున్ మరలి ♦ వచ్చుట భిన్నఘటంబు నీరముల్
మరలి ఘటంబు నించునను ♦ మాటకు దీటగుఁ; గానఁగాచు చం
దిరిక వితంబునన్ వయసు ♦ తేరకుఁబోయిన సౌఖ్యమందు టె
క్కరణిని? దుఃఖమందె యిటు ♦ కంది కృశింతువె యోవివేకినీ! ౪౦౫

తే॥ తరుణి! బతిమాల నీమది ♦ కరఁగదేని, నిక్కవముగ నా జీవముల్ ♦ నిల్వ వవల
నీనహాజ శీల సౌందర్య ♦ నియతికిఁ దగు, సుందరుం డెవ్వఁడున్నాఁడు ♦ చూపుమబల!

తే॥ కలికితనము నందంబుఁ బ్రకల్పగుణము, మొదలుగాఁ గలవన్నియుఁ గుదిరియుండి
నేనదు నీవి రాక్షిస్యంబు జనకకులము, నందు నశియించు కారణ మరయరాదు.

చ॥ పలుక ఓ శుకంబ! నీవిభుని పట్టి వధించిన యప్పు డాత్రిమైఁ
బిలిచిన వానికూయివిని బిమ్మటితో విభుఁ జూచు కోరికన్
దలఁపున నుంచితే? పిలిచి దానము సేయఁ గులంబు గోత్రముం
బలుకుమ యన్న యట్లనుట భాగ్యమె యారయ నిన్ను బోటికిన్.

తే॥ నీవలన నాదు జీవముల్ పోవునేని, నాసమస్త నంపదలపై నాశమొందు
వచ్చివర్గిల్లె ననుకీర్తి వదలి చెఱిచె, ననెడి యపవాదు నొందదే యబ్జవదన!

తే॥ వేలుపులు వేల్పు పడఁతులు కేలుమోడ్చి, నీపదాబ్జముల్ భజియింప నేర్పుమీఱు
త్రిభువనప్రాజ్యరాజ్య ను శ్రీ లభింపఁ, గాలఁద్రోచెదు నీవంటి బేల గలదె?

తే॥ అపయశమునకు వెఱవని యసురవిభుఁడు, సకల జగతీజనముల నా జనులఁ గాఁగఁ
జేకొనిన నాదు సేవ నంగీకరింపు, మనుచుఁ గేల్మోడ్చి చాఁగిలి యువనిఁ బడియె.

చ॥ అనలమునందు గ్రాఁగిన శరాహతిఁబోలు కటూక్తు లేగు ముం
దునె చెవిమాఁడె డెందమును తోడనె మార్పడెఁ గన్నుదోయి న
ల్లను వెలిగ్రక్కె జీవముల లక్ష్యమొనర్చక మానినీ గుణం
బును తలమీఱు కక్కసపుఁ బోటగు మాటల సీత యిట్లనెన్.

—: సీత రావణుని కటూక్తులాడుట :—

మ॥ తృణమా! విందురె నీకటూక్తులు కుల స్త్రీ లెన్నఁడే నోర్పుమై
గుణమా! సాధ్వీతనంబు కంటె మృదువుల్ కొండల్ యథార్థంబు; దు
ర్గుణముల్ కీర్తిఁ దెచ్చునే? చదువుచేఁ గొన్నట్టి తెల్వింతయే?
క్షణసౌఖ్యంబునకై యశోగరిమ గం గం గల్పఁగా నెంతువే? ౪౧౩

మ॥ ములుచా! మేరువుఁ దొల్పఁగా గగనముల్ భూమిన్ విదారింపఁగాఁ
జలమారన్ బదునాల్గు లోకముల వం చాళించి కూల్పంగ న
జ్జలజాతాప్త కులేశు బాణములు పె ల్పంజాలు టూహించియున్
దల లొక్కుమ్మడిఁ ద్రుంగఁ జూచికొనదే దర్పోద్ధతిన్ బాలిశా! ౪౧౪

మ॥ అతి భీతింగద నాఁడు నీవు బలుమా యన్ జింక నంపించి నా
పతి లేనప్పుడు మాయవేషివయి బ ల్పచ్చెంబుతో దాఁగి వ
చ్చితి జీవింపఁ దలంచితేని విడుమా శ్రీరామచంద్రుండు దృ
గ్గతుండై నిల్చినఁ దేఱి చూడఁగలవే కష్టాత్మ! నీ చక్షువుల్ ౪౧౫

ఉ॥ నాఁడు ఖగేంద్రు చేతనె ఘ నంబగు మూర్ఛగడించినాఁడ వీ
నాఁడు మహాధనుర్ధరుఁ డ నల్ప పరాక్రమ లీలలం దగం

బోఁడిమిఁజూప నీదు కర♦మూర్ధము లొండఁగఁ గట్టు చిత్ర చి
త్రోడక లక్ష్యపాళులె య ♦ గుఁ నిజమన్య విధంబుఁ బోలునే? ౪౧౭
ఉ॥ పందవు నాఁడె యోడితివి ♦ పక్షికులేంద్రున కాల రుద్రుచే
నందిన చంద్రహాసమున ♦ నాతనిఁ జంపితి కాక యున్నచో
మ్రందవొ? జీవితంబున వ ♦ రంబులు కాలుని చేతకే చుమీ
కొందెదు రామబాణముల ♦ కుఁ గుఱిగాక మనంగఁ గూడనా?
తే॥ వరబలము సహాయ బలంబు♦వరబలంబు, నలువ వార్తలు రాముఁడు♦నారిఁగూర్చు
వఱకెకాని యావల ఫలిం ♦ పంగఁ గలవె?, భానునెదుటఁ జీకట్లును♦ప్రబలు నేమి?
శా॥ కైలాసంబుఁ గదల్చునాఁడు మృదుప ♦ త్కంజంబుచే నీ మిడిక్
ఖ్రీలం జేసిన శంకరుండు పురముల్ ♦ వేకాల్చు నారాచముఁ
లీలం గూర్చిన మేరు కార్ముకము ద్రి ♦ ంచెఁ రాఘవస్వామికిఁ
గేలం బట్టఁగ నిల్వ కప్పటి ధ్వనిఁ ♦ గించిజ్ఞ! యాలింపవో? ౪౧౯
శా॥ తారాద్రిం బెకలించి దిగ్గజములఁ ♦ దాటించి జంకించు నా
కౌరా! యెవ్వరు సాటివారలని వ్య ♦ ర్థాలాపముల్ సేయు నీ
వారామానుజుఁడుండు వేళ నట డా ♦ యం గొంకి డాఁకొంటి వి
స్రీ! రామాచరణంబులం బడెదవో ♦ సిగ్గింత లేకియ్యెడన్. ౪౨౦
ఉ॥ నీవు కలంగి దాఁగి మన ♦ నెక్కొను చోటిది యంచెఱిఁగి మ
జ్జీవవిభుండు వచ్చునెడఁ ♦ జెందిన కోపదవాగ్ని యిమ్మహా
రావముతోడి వారిధిఁ బు ♦ రంబు దహించి యడంగునో? దశ
గ్రీవ!జగంబులెల్ల నుడి ♦ కించిన జీవముతో నడంగునో? ౪౨౧
చ॥ చెడుగరులైన రక్కసుల ♦ జీవములం గొనియే యడంగునో?
దుడు కొకరుండు సేయ గుణ ♦ ధూర్వహు కోపముచే నజాండమే
చెడ నగు నేమొకోయనుచుఁ ♦ జిత్తమునన్ భయమందుచుంటి నా
యెడఁదకు ధర్మముల్ శశి ది ♦ నేశులు సాక్షులు సత్యమీ నుడుల్.
ఉ॥ అందము చెందు నీపుడమి ♦ యందలి జీవులు వేలుపుల్ భయం
బందఁ జరించు బాలిశ! దు ♦ రాత్మ! సమంచిత చేష్టవీడి యీ
దుందుడుకేల గొంటి వికఁ ♦ దోరుట నిక్క మజేశ విష్ణు సం
క్రందన సన్నిభుం డనియె ♦ రాఘవు నెంచెదు నీ మనంబునన్?
చ॥ ఇనకులు మానవుండనుచు ♦ నెంచెద వేని మహాబలిష్ఠు న
ర్జును నొకమానవుండె కద ♦ రూపడఁగించెను వానిచేవయున్
మనమున నెంతు కాదె? జన ♦ మాన్య చరిత్రుని రాము సత్త్వమున్
ఘనమగు దూరదృష్టి నెఱుఁ♦గందగు దీవును గర్వపర్వతా!

చ॥ పలువతనంబుచే ననము ♦ భాగ్యము గోల్పడనున్న మూఢ! వా
రలు నొకయిర్వురే యని ని ♦ రాకృతి సేయుదు వేని సర్వలో
కలయము వేళ నొక్కకఱ ♦ కంఠుఁడ కాఁడె సమాప్తి సేయు నా
పలుకులలో నిజమ్ము పిద ♦ పక్ బవరాన నెఱుంగఁగా నగుక్. ౮౨౭

తే॥ గుణకిణాంకిత భుజాలు స♦కుంఠితజయు,లగు హిరణ్యాక్షుఁడును హిర♦ణ్యకశిపుఁడును
పూజ్యపద్ధతుల్ వీడిక♦ప్పుడును పరుల, యాంద్రయెడ మేరదాఁటకే♦యరిగినారు.

చ॥ స్థిరులయి నిల్చువారలును♦చెట్టలుచేసి నశించువారలుక్
సురలొ? నిశాటులో? తెలియఁ ♦ జూడుము సర్వ జగంబు లోఁగి నా
కురవడి సేవనేయు మహి ♦ మోన్నతి నందితి నందువేని య
వ్వరువు తపఃఫలంబొ మఱి ♦ పాపఫలంబొ? తగక్ గ్రహింపుమా.

ఉ॥ భాగ్యము నీకొనంగిన క ♦ పర్దియు సంతతముక్ భరించు స
ద్భాగ్యము సుస్థిరంబగు త ♦ పః ఫలమందుట చేతఁగాదె? త
ద్భాగ్యము నీఁగఁగా సుతులు ♦ బంధుజనంబులతోడఁగూలు దౌ
ర్భాగ్యముఁ గోరి ధర్మమును ♦ పాడొనరించితి వేల దుర్మతీ! ౮౨౮

ఉ॥ వీర్యము సర్వదా జయము ♦ వీకునఁ గల్గిన వారలేని దు
ష్కార్యము సేయువారలును ♦ కారుణికత్వము వీడువారలై
శ్వర్యము వోవ నాశిలుట ♦ సత్యము; కామముఖారి వర్గ జి
ద్వీర్యులు గాక దుఃఖముల ♦ వీడినవారు మఱేరు? దానవా! ౮౨౯

సీ॥ రాముండు దండకా♦రణ్యంబు చేరుచో, ద్రవిడభాషకుఁ బ్రోది♦తనియఁజేయు
ముని మొదలగుమహా♦త్ములు వచ్చి దుష్టరా,క్షసులకృత్యములు దు♦స్సహము లయ్యెఁ
దపములు సాగవా♦దనుజులఁ బరిమార్చి, పాలింపు మమ్ము నీ♦వలన వారు
నీల్గుట నిక్క మ♦నిరి నేను వింటిని, తగినట్లె నీ యన♦త్కార్మ మహరె

తే॥ నీబలము జీవితంబును♦నియత బలము, నెఱిగఁ దెలిపిన పిదపనే ♦ నీచెలియలి
ముక్కుకోఁత నీ తమ్ములఁ♦జక్కడుచుట, రవ్వయేని యోచింపవో♦రాముబలిమి.

చ॥ ఎఱుకువలేని మూర్ఖ! నిను ♦ హేళనసేయుచు నీకరంబులక్
విఱిచి ముఖంబులక్ రుధిర ♦ భీషణ ధారలు గ్రక్కఁ గ్రుద్ది పైఁ
జెఱనిడు కార్తవీర్యుని వి ♦ శిష్ట భుజంబులఁ ద్రుంచు భార్గవుం
డుఱుకుచు వచ్చి రామునకు ♦ నోడుట నీవు వినంగ లేదొకో? ౮౩౦

సీ॥ కఱచి చంపెడు క్రూర♦కాలాహియైనను, మంత్రంబునకు లొంగి♦మడఁగియుండు
విదితగు నిది తగ♦దిది పోలు నిదికూడ, దని మందలించి స♦జ్జన పథంబు
కఱపెడు వారు నీ♦కడ నెవ్వరును లేర, యున్నట్టి వారొ నీ♦వన్నదెల్ల
సరియని హాహా టం♦వం స్తవనము నేయు, క్రించులై నిన్ను ము♦గించువారె

యింక నీకు ముగింపు గా♦కెవ్విధమున, ముగియు నదియునుకలదె ధ♦ర్మవు చెడంగఁ
గర్కశాత్మ! చెట్టుచెడెడు♦కాలమునకు, గుక్కమూతి పిందెలు పుట్టు♦కోపునిదియ.

మ॥ ధరణీజాత వచించు పాడి వినినఁ♦త న్నేత్రముల్ గ్రక్కె నె
త్తురులన్ మించులపోల్కి వెల్గె దశవ♦ క్త్రుం డన్ని యాస్యంబులన్
గిరులుం జూర్ణముగాఁగ గర్జిల వడం♦కెన్ భూమియుం గోపమా
స్మర విక్రాంతిని మీఱిపోయె వివరిం♦పన్ శక్యమే తత్స్థితిన్ ? ౭౩౩

చ॥ నెగసిన లజ్జయున్ దెసల♦ నెక్కొని కొల్చు భుజంబు లగ్నులన్
బొగలను గ్రక్కు కన్నులును♦ భూరిభయంకర రీతిఁ గ్రాల నీ
మగువను జీల్చి మ్రింగెద న♦మాంతముగా నని నీల్గి కోపమో
హగతులు పోరు సల్పఁ గది♦యం జనఁ బోవును పోవఁ డొక్కటన్.

తే॥ హనుమయప్పుడు మాస్వామి♦నినిదు రాగ్ర,హామునసీచుండు తాఁకుట♦కరుగుమున్నె
నలఁచి వీనిని చంపి య♦వ్వలఁ జరింపఁ, దగిన చందము చూచుకొం♦దమని తలఁచె.

ఉ॥ ఎక్కటియైన వీని తల♦లే డ్తెఱ గ్రక్కున నూడఁద్రుంచి వే
యిక్కడలిన్ మునుంగఁ బురి♦ నిట్టులె కాల నడంగఁ ద్రొక్కి యే
నొక్కెడ పూతశీలను ర♦ఘూత్తము దారను మోచికొంచుఁ బే
రుక్కునఁ బోవుటే యుఱవు♦నొప్పని చేతులు నల్చుచుండఁగన్.

క॥ అండమ్ముల నుద్దండతఁ, దుండములుగఁ జెండఁదగిన♦ధూర్తుని కోపం
బండజయాన పయింగల, మెండు వలపుచేటు పాఱ♦మెల్లన నాఱెన్. ౭౩౮

చ॥ వలఁచెద నంచు నల్గితిని♦ నల్పఁగఁజాలక యుంటిఁ దొయ్యలీ!
పలికితి కొన్నియయ్యవి ను♦బద్ధములే యగుఁగాక యిమ్మహిన్
చులుకనయంచు నొక్కటియుఁ♦ జూడఁగ జెప్పర మంచు నొక్కఁడుం
గలదె? జయంబు నోటమియుఁ♦ గ్రాలె విహార విలీలలై తగన్.

చ॥ ఒక పలుకాలకింపు మిట♦ నుగ్మలి! రాముని చంపి నిన్ను నే
నకుటిల లీలఁ దెచ్చిన ర♦యంబునఁ బ్రాణము వీడితేని యే
నకట! మరింతు నిక్కముగ♦ నట్లగుటం గికురించి తెచ్చితిన్
వికచ సరోజలోచన! భు♦వి న్నను దాఁకెదు వాఁడుఁ గల్గునే? ౭౩౯

మ॥ హరిణంబంచుఁ దలంచి యేగిన మను♦ష్య ప్రాకృతుల్ నన్ను తా
రరయంజొచ్చిర యేని యిచ్చటికి రా♦ నంకించి యుంకింప రా
నరులం గూరిచి కుందికుంది యెదురన్♦ లాభంబె? నా చేఁతకున్
సురలైనం బుయిలోటగాక తగదం♦చున్ వైరముం గొందురే?

చ॥ అగుదురుగాక నన్ను సమ♦రాంగణమందు జయించునట్టి రే
యగుదురుగాక నాశమును♦ నందని వారలమై త్రిమూర్తులున్

జగముల నేలు నింద్రుఁ డని ♦ శంబుడిగం బొనరింప నేనె ము
జ్జగములఁ గీర్తినించితి ని ♦ జంబుగ నెవ్వరి కిట్టు లబ్బెడిన్? ౨౨౧
సీ॥ అలికుల వేణిరో! యజహారి హరులయు, సురలయు బలములు ♦ స్రుక్కినట్లు
జగముల నిండిన♦జయము వ్యర్థంబుగ, నీకొఱకై యొక ♦ నింద నొంద
నిష్ఫల వ్రతముల ♦ నియతిఁ జేయుచునుండు, బలహీన నరులఁ జం ♦ పంగఁజాల
వారి నిచ్చటికి నే ♦ వారక రప్పించి, సేవలు గొందుఁ గాం ♦ చెదవు గాక
తే॥ అల్పగుణ మల్పకార్యంబు♦లల్పఫలము, గలుగు నల్పుల కడ నీకు♦గానఁబడిన
తెలివి బలము నా యెడఁజూడఁ♦దెలియ రాదొ?, వారినొక కేలఁగొని తెత్తుఁ♦గోరిచూడు
చ॥ కనిసిన పక్వజన్ములగుఁ ♦ గావుత నాకిటు నిన్నెనంగు మే
ల్పని దలఁపంగఁ జంపఁదగు ♦ వారె? విలాసిని! వారె నాశమే
మనమున నెంతువేని యది ♦ మానుగ నీకు శుభంబయేని నా
కనుమతి యిచ్చి చేసెద ర ♦ యంబున నయ్యది యెంత కార్యమో?
మ॥ అవురా! యింతగ వేఁడ నమ్మతిల వ ♦ ల్మాయుష్కరాలా! యయో
ధ్య విలాతిం భరతాదులం గెడపి క ♦ ల్పాంతాగ్ని నాఁ బేర్చి కా
ల్చి విదేహంబొగి నశ్రమంబున మృగా ♦ క్షీ! నీదుప్రాణంబులన్
జవులూరన్ వెడలించి మ్రింగఁదగు నా ♦సామర్థ్యముం గానవో? ౨౨౨
చ॥ అని నిలయాంతకాలు క్రియ ♦ నల్గి కరాచురి వంకఁజూచి నా
కును వశమందవేని యటఁ ♦ గొందును ప్రాణము రెండు నెల్లలో
ననువెరియో మనంబున న ♦ యంబునఁ జూడుము బుద్ధిమంతు లొ
ప్పిన నెఱిఁగాంచుమంచు జడి ♦ పించి తలంచిన యట్లదల్చుచున్. ౨౨౩
తే॥ దీనిఁ దర్జించి భర్జించి♦తెలియఁబలికి, వశపఱచి తేకయున్న మీ♦పాలి విషమ
యగుపునని గంటువడు మొగ♦మడర రక్క, సీంద్ర కనుర రాజు తెలియఁ♦జెప్పిమరలె.
తే॥ పంక్తిముఖుఁడేగ రావణువు♦వట్టి విడుచు, మందుదొరను వెన్వెంట నె♦మబ్బుగములు
క్రమ్మ క్రియ దైత్యకాంతలు♦క్రమ్మికాఱు, లన్ని విధములఁ దలఁచి న♦ట్లఱచినారు.
తే॥ ముందునిలిచి చత్తువులని♦ప్పకలురాలఁ, జఱచుఱం జూచి కుంతముల్ ♦శూలములను
చూపి చంపుఁడు చంపి న♦జ్జగను కొంది, యొల్చి తినుఁడని కొందఱ♦దల్చినారు.
సీ॥ నలువ మున్మఁడు లోక ♦ నాయకుఁడు సహస్ర, శాఖాన్వితంబగు ♦ సామవేద
పారగుఁడును మహా♦ప్రాజ్ఞుండు పాపముల్, తుదముట్టఁ ద్రోచిన♦దొడ్డవాఁడు
నీకేమి చెడుగు గా♦న్పించెనే రావణుఁ, డంచిత ప్రేమ చూ♦పించుచుండఁ
బోఁగాలమే యిట్లు♦వుండునఁ గోలఁ జొ, న్పించి నట్టులు ప్రలా♦పించి తీవు
తే॥ అతని కోపాన లోకంబు ♦ లంతరించు, నీవు నీవార లెల్లరు ♦ నీల్గునట్టి
చెడుగు తెచ్చుకొంటి విఁకేమి♦చెప్పఁగలదు? సుదతి! యని కొంద ఱాడిరి♦మృదులఫణితి

చ॥ మెలఁతరో! ఘట్టిపింటికిని ♦ మెట్టిఁ యింటికి సింగలంబునై
పలువ తనంబు మై నిటులు ♦ పాడొనరింపఁగఁ బూనితేల? సీ
కిలుగుట నిశ్చయంబు కల ♦ దెల్లను తేటపడంగ నింతగాఁ
బలికితి మిందుపై మనసు ♦ వచ్చిన రీతిఁ జరింపుమా యనన్. ౪౯౦

మ॥ వధియింపం గమకించు క్రూర దనుజ ♦ వ్యాపారముల్ దేవతా
మథనుం దానవ చక్రవర్తి నెదిరెన్ ♦ మర్దింపుఁడీ చంపుఁడీ
కథ లింకేలని దూఱు వాక్యములు ర ♦ క్షస్త్రీల యాకారముల్
విధిపోల్ దానవు నానతిం దలఁచి న ♦ వ్వోన్ సీత నిర్విణ్ణయై.

ఉ॥ అయ్యెడ డాయుచుం ద్రిజట ♦ యమ్మరో! స్వప్న ఫలంబు పూర్వమే
నెయ్యము మీఱఁ దెల్పితిని ♦ నీవిటు లంగద నొందితేని యో
తొయ్యలి! నిస్థిరత్వ మొక ♦ దోసము నొందెడి నూఱడిల్లు మం
చొయ్యనఁ బల్కునంతఁ దగ ♦ నుమ్మలికించుట మానె సీతయున్.

చ॥ ప్రభునకు జంకి యప్పగిదిఁ ♦ బల్కుచుఁ గ్రౌర్యమె రూపునొందె నా
రభనము నేయువారు వివ ♦ రంబుగ రాఘవపత్ని సీతకున్
శుభముల నొప్పుగాఁ ద్రిజట ♦ జోస్యమువోలె వచింపఁగాఁ గరం
బు భయము గొల్పుటన్ వదలి ♦ పూనిన కోపము మాని రంతటన్.

స్వరూప సందర్శన పటలము. (౧౧౭)

చ॥ అవనిజఁ గాంచదగ్గ సమ ♦ యం బిదె తర్జన భర్జనంబులన్
దవిలిన దైత్య కాంతలును ♦ దాయరు నిద్రకుఁ గోరినంతనే
యొవరును నిద్రవోరని క ♦ పీంద్రుఁడు మాయ ఘటించె దాన వృ
త్త్యవు తలదాఁకినట్లు మయి ♦ దుం గొని యెల్లరు వ్రాలి రయ్యెడన్.

చ॥ చిరము తపించుచున్ వనరు ♦ సీత యొకప్పుడు నిద్రవోని యా
సుర వనితాలి నిద్రిలుట ♦ చూచి మనోవ్యథ నోర్వలేనిదై
విరియు నుపాయమున్ దలఁచి ♦ వేకనఁ జాలనిదై భయంబుచే
విరవిరవోయి క్రుంగి రఘు ♦ వీరునిపైఁ గల ప్రేమఁ జింతిలున్. ౪౯౫

మ॥ మనమా! దుర్విధి రామచంద్రు నిటకున్ ♦ మన్నించి తోడ్తెచ్చునే?
ఘన కోదండ గుణారవంబు గురు ని ♦ ర్ఘాతంబు నా వచ్చునే?
తన కష్టేసి విమోచనంబు గలదే? తథ్యంబు వాక్రుచ్చుమా
యనుమానింపక చూడు నావలని భా ♦ గ్యాధిక్య మెట్లున్నదో?

సీ॥ వెడఁగు నిశాకరా! వెల్లని వెన్నెలా!, నన్నేల యుడికించి ♦ నలఁచువారు
తఱుఁగని రాతిరీ! తగ్గని చీఁకటీ!, నామీఁద నలుగుట ♦ న్యాయ మగునె?

పరితీవలార! చి ♦ చ్చుఱ వీచు వడగాలి, తోడుగా నీకిటఁ ♦ దొలుతురేల?
నీరదశ్యాముని ♦ తో రహిఁ విహరించు, మీకు నాస్థితి దెల్పు ♦ మేరగాదొ?

తే॥ ఎంచి రాఁడని యతని వేధించువారె?, ఆమహాత్ముఁడు రాకుండఁ♦డని యుదార
కరుణఁగూర్చి యేఁ బెక్కు దుః♦ఖముల కోర్చి, ప్రాణముల వీడకుంటి నీ♦వఱకుఁ దమిని.

సీ॥ వలదు వృత్తాకీర్ణ♦వనులకు రాఁ దలంప, కు కొన్ని నాళ్ళలో ♦ మరలి వత్తు
నిలుమంటి నిండిన ♦ నెనరిది యేని ని, న్నెడఁబాసి దిక్కులే♦కిట్టు లలయు
ప్రాణంబులను బాధ ♦ పఱచుచు నూరక, పేక్షించి యుండుట♦యాద్యగుణమె?
యింతేల నీతండ్రి ♦ చింతించి చింతించి, నీకొఱకయి మర ♦ ణించునట్లు

తే॥ లోకమెల్లను దుఃఖంబు ♦ లోన మునిఁగి, తుదిగనని త్రోవ విలపింపం ద్రోచి యేగి
కానఁ జేరు కట్టిఁడివి నరా ♦ గాతు వనుచు, విశ్వసించెదు నాకంటె♦వెడఁగు లెవరు?

ఉత్సా. మను నపేక్షగొన్న జీవ ♦ మా! వివేకమా! వెతన్
నను భజించి లజ్జలేక♦నలఁగుచున్నవారు నా
ధుని మొగంబు గాంచు దనుకఁ ♦ దొలఁగరేమి? నేను నిం
దను భరించి బ్రదుకు మీకుఁ ♦ దగవుగానె దోఁచెనే? ౪౫౯

తే॥ పలువిధంబులుగా నిట్లు♦పలవరించి, ప్రాణ మొక్కటి కలదేని♦బాము గలదు
దాని వీడిన నన్నియుఁ♦దలఁగఁగలవు, కీర్తియును నిల్చు ననుచుఁ బం♦కేజనయన.

తే॥ చూడఁగలమును నాసచే ♦నుసిఁగి యోర్చి, ప్రాణముల తీపి యెంచి కా♦పాడుచుంటిఁ
బలుదినంబు లిచ్చటఁ జెఱ♦పడ్డ నన్ను, ప్రేమఁ బావనుఁ డంగీక♦రించునేమి?

తే॥ పరులు వలచిన పిమ్మట♦బ్రతికియుండి, పలువిధంబుల ప్రల్లద♦ములను వినియు
బ్రతుకు నింతకాలంబు భా♦రముగఁ గడపు, కఠిన రాక్షసుల్ నాకంటెఁ♦గలరె యొరులు?

చ॥ జనముల నోళ్ళనుండి పలు ♦ చందన మొందిన నిందమోచి కుం
దొనరని యాభిజాత్య మెుఁగి ♦ యోరిమి లజ్జయు నార! యెంత సం
తనగఁ బొనంగి యున్నయవి! తక్కటి క్రొత్తడులందు నానలేక్
బెనిమిటి వీడి ప్రాణములఁ ♦ బ్రీతిని దాల్చిన వార లుందురే? ౪౬౩

మ॥ పరవేశ్మంబునఁ జేరుదాని మరలం ♦ బాటించి కైకొంట స
త్పురుషశ్రేష్ఠుల కర్హమే యనుచుఁ జే♦తో నాయకుం డిట్టు లో
వ్వరికించెం గద యాతఁ డాఱడి పడన్ ♦ బన్నంబులం బొంది దు
ర్భర జీవంబుల నేను నిల్పుకొను టే ♦ భాగ్యంబు గైకొంటకో? ౪౬౪

తే॥ ఎప్పుడు నిందలపాలైతి♦నప్పుడె జీవ, ములను విడువంగఁదగు నేను♦భువి జనములు
ప్రవ్వఁదిట్ట గౌరవమును♦పొలిసి పోవ, బ్రదికియుండుట స్వర్గంబు♦పడయుకొఱకె?

ఉ॥ ప్రేమము లేని వీరలఁ బ♦విత్ర చరిత్రుల రాఘవేంద్రులన్
భామిని గొప్ప ఆట్టు వడిఁ ♦ బొందినఁ బొందెదఁగాక దుస్తర

స్తోనములైన దుఃఖములఁ ♦ జూడని యున్నత సంశ్యయైై గుణ
స్తేమము నొందు నా వనట ♦ దీర్చు నదెవ్వరు నేనుగాకిలన్ ? ౪౬౬
క॥ కపట మృగము వెంబడిఁ బ్రా, ణపతిఁ దఱిమి మఱఁదిఁ దిట్టి♦నాన చెడఁగ నై
త్యు పురము చేరిన మనుగడ, విపులకు బరువగుచు వెతల♦వెత గాకున్నే ?
ఉ॥ వీరలు రామలక్ష్మణులు ♦ వీకున నింద తొలంగఁగోరి యా
ర్యేరము పూని గెల్చిన స ♦ రే మరణించిరయున్ సశో భువిన్
వేఁమినొంది యిల్వడిని ♦ వీసరచేసి మెలంగు నేను దు
ర్భారముగా వహించు నడి ♦ వాఁల నొందునె యెన్నఁడేనియున్ ?
తే॥ మానహాని గల్గెడుచోఁజ♦మరి మృగఁబు,వంటి గుణమబ్బు సత్ప్రతి♦వ్రతల యెకట
మగనిఁ బాసి మాయావుల♦నగరమందు, బ్రదికెనంచు జగము నవ్వ♦బ్రదుకఁదగునె.
మ॥ తత కల్యాణ గుణాలయుండు ఘనకో♦దండంబు చేనంది దై
త్యతతిన్ మూలముముట్టఁ ద్రుంచియును కా ♦ రాగారము_క్తన్ గలం
కిత నంటం దగదన్నచో నతని సం ♦ దేహంబు వాయంగ నే
గతి మద్భామణమా సతీత్వమును తా♦ర్కాణింతు నప్పట్టునన్ ? ౪౭౦
ఉ॥ కావునఁ జచ్చుటే తగిన ♦ కార్యము వేఱొక దారిలేదు నా
చావునకున్ నిరోధలగు ♦ చానలు మత్సుకృతంబుచేత ని
ద్రావతులైరి మంచితఱి ♦ దక్కిన దంచును మాధవీ లతా
ప్రావరణ స్థలంబునకు ♦ రామ కళత్రము పోయె మెల్లనన్. ౪౭౧
చ॥ హనుమయుఁ జూచె నామె హృద♦యంబు నెఱింగె భయంబు పైకొనన్
జెనకి నిరోధముం జలుపఁ ♦ జెందెను జంకు; జగన్నియంత రా
ముని వరవుండ సాహసము ♦ పూనకు మమ్మరో యంచు సీత వె
న్కనె చని యడ్డుగా నిలిచి ♦ కై ముకుళించి వచించె నివ్విధిన్. ౪౭౨
శా॥ అమ్మా ! రాముఁడు పంప వచ్చితి ననం ♦ ఖ్యాకుల్ కపుల్ నావలెన్
నెమ్మి న్నిన్ను గనంగఁ బెక్కెడలకున్ ♦ వే పోయియున్నారు లో
కమ్ముల్ రోసెదువారు పూర్వకృత భా ♦ గ్యప్రోన్నతింజేసి లం
కమ్మీపాదసరోజ దర్శనమునన్ ♦ గణ్యుండనైతిన్ ధరన్. ౪౭౩
శా॥ తల్లీ ! యిచ్చటి యిట్టి నీ యునికి చిం ♦ తా వ్యాకులుండైన శ్రీ
ఫుల్లాబ్జాక్షుఁ డెఱుంగఁడమ్మ ! నిజ వీరా ♦ భూలోక దైత్యాన్వయం
బెల్లం గూఁకటివేళ్లతోఁ దునిసి పో ♦ కీమాడ్కి నిల్చుండుటే
తెల్లంబై తగుసాక్ష్యమా మఱి నిబ ♦ ద్దింపంగ వేఱేలొకో ? ౪౭౪
శా॥ సందేహింపకుమా సతీతిలకమా ! ♦ సర్వేశ్వరుం డంపుచోఁ
జందంబారఁగ నమ్మఁ బంపిన యభి ♦ జ్ఞానంబు వార్తాళియుం

నందం బుల్లసిలంగ నున్నయవి పా ♦ టింపంగ హస్తామృతా
స్పందప్రక్రియఁ జెల్లఁజూఁ దెలియు నెం ♦ చం బోకు వేఱొండుగన్.

తే॥ ఇట్లు పలుకుచు వినతుండై ♦ యెదుట నిలువఁ, గరుణఁ గాంచి యాతండు రా♦క్ష సుఁడు గాఁడు
విజితవిషయుండు శుద్ధుండు♦వినయపరుఁడు, వాణి సంస్కృతమగు మహా♦ప్రాజ్ఞ వరుఁడు.

చ॥ దనుజుఁడె యైనఁగాక మతి ♦ దైవతమే యగుఁగాక కానిచో
వనచరుఁడైనఁగా కితని ♦ వల్ల నపాయమె వచ్చుఁగాక మే
లొనరుచుఁగాక నాపతి మ ♦ హోన్నత నామము నుచ్చరించి నా
మనము గరంచి జీవముల ♦ మన్చె శుభోదయ మున్నె యింతకున్ ?

చ॥ అని తలపోసి సీత కను ♦ లారఁగఁ గాంచి కృపన్ మనంబు పొం
దిన దితఁడెన్న వంచకుల ♦ తీరగు పల్కులవాఁడు కాఁడు భా
వనములతోడి వాక్యముల ♦ బాష్పము లుర్లఁ దపించుచున్నవాఁ
డని తలపోసి నీవెవఁడ ♦ వయ్య యెఱుంగ వచింపుమా యనెన్.

శా॥ దేవీవాక్యముతోడ హస్తములు నె ♦ త్తిందాల్చి శ్రీరామ భూ
దేవేంద్రుండు వనంబులో నిను మహా ♦ ర్తిన్ రోయుచున్ వచ్చి ఛా
యావామాపతిపట్టి వానరకులా ♦ ధ్యక్షుండు నిర్దోషి సు
గ్రీవాభిఖ్యునితో నొనర్చె దృఢమై ♦ త్రిన్ ఋశ్యమూకాద్రిపై. ౪౭౯

ఉ॥ ఆతనియన్న వాలి యొక ♦ యప్పుడు రావణు చేవ క్రుంగ ని
ర్భీతిని తోఁకఁ జుట్టికొని ♦ వీఁకను దిక్కులఁ జుట్టినట్టి వి
ఖ్యాత యశుండు వేలుపుల ♦ ప్రార్థన మందర మంథ దండమున్
ప్రాఁతిగఁ బాఁపత్రాడఁటుగఁ ♦ బట్టి మథించిన దోర్బలిష్ఠుఁడున్. ౪౮౦

ఉ॥ అంత బలాఢ్యు వాలి నొక ♦ యమ్మునఁ గూలఁగనేసి రామభూ
కాంతుఁడు కీశరాజ్యము వి ♦ కర్తన సూనునకుం బ్రియంబునన్
వంతనగాఁగ నిచ్చె నట ♦ శ్వానముఁ బోలిన యేను వానికిన్
మంతిరినౌదు మారుత కు ♦ మారుఁడఁ బేరున నాంజనేయుఁడన్. ౪౮౧

సీ॥ డెబ్బది వెల్లువల్ ♦ డీకొని జగములఁ, జేతుల నెత్తెడు ♦ చేవగలిగి
జలనిధి నవలీలఁ ♦ గడచు సామర్థ్యంబు, వినుదాఁకఁ బెరిఁగెడి ♦ వీకుగలిగి
శ్రీరామభద్రుండు ♦ చేయఁదలంచిన, సంజ్ఞలఁ గని యట్లు ♦ జరపువార
లేడు జలధులందు ♦ నేడు దీవులయందు, నాకంబునందును ♦ నాగమందు

ఆ॥ కలయవెదకి నిన్ను ♦ గాననిచో నండ, గోళములను దాఁటి ♦ లీలఁబోయి
వెదకి చూచి రాఁగ ♦ నెల గడువుంగొని, పోయి యున్నవారు♦పూతచరిత !

చ॥ నిను దశకంఠుఁ డెత్తికొని ♦ నింగిని పోయెడినాఁడు నీవు చే
లను ముడివైచి భూషణము ♦ లం బడవైచితి వాని మాకడన్
గని గుఱుతించి రాఘవుఁడు ♦ క్రచ్చఱ నన్గొని వేఱుచోటికిం
గొని కొని పల్కె యామ్యదిశ ♦ కుం జనఁబంచెఁ గుతూహలస్థితిన్.

ఉ॥ నీవట జార్చు భూషలను ♦ నీపతి చూచిన నాఁటి తద్దశన్
నే వివరింప నైతి యగు ♦ నే? మఱి నీవు గ్రహింపలేవె? య
మ్మా! వెయి యేల? నీదయిన ♦ మంగళ సూత్రము నేఁటిదాఁక సు
శ్రీవహమై రహించుటయుఁ ♦ జెల్వగు భూషణకార్యమే సుమీ.

తే॥ వాలి ప్రియపుత్త్రుఁ డుత్సాహ♦వంతుఁ డగుచు, రెండు వెల్వలతోడను♦గండు మిగిలి
యామ్యదిశ కరుదెంచి న♦న్నతఁడు లంక, వెతకఁ బంచి నాఁ డనుచు మా♦రుతి వచింప

తే॥ మేర లేని కౌతుకమున♦మీఱి సీత, మేను పూరింప జీవించు♦మిఱియుఁ గలదె?
యని పలికి బాష్పములు రాల్చ♦యాంజనేయ, ఆర్యు చెలువ మెట్టులు గను♦దనుచు నడుగ

—: హనుమ శ్రీరాముని రూప మభివర్ణించుట :—

మ॥ ఉపమావస్తువులెల్ల నచ్చట మహా♦న్యూనత్వముం బొందవే?
యుపమాతీతము రాము మేను జననీ! ♦ యూహింతుగా కట్టులే
యుపమాన క్రమ హేతు భూతములచే ♦ నొప్పారఁగా నంచు న
య్యుపవర్గాధిపుఁ బల్కె నిట్లనిలజుం ♦ డాపాద మస్తంబు దాన్. ౮౮౭

చ॥ ఉపమగ నెఱ్ఱదామరల ♦ నుత్తమవిజ్ఞులు పల్కువార ల
య్యుపమను రామపాదముల ♦ కొప్పుగఁ గొంటిమయేని నీచమౌ
నుపమితి దానికంటె మఱి ♦ యుర్విఁ గ నున్నె? ప్రవాళకాంతి నీ
లపు జలజమ్ము కై వడి క ♦ లంకు వహించును వాని ముందఱన్. ౮౮౮

తే॥ పల్లవిత కల్పకలికా ప్ర♦వాళ లతల, నుపమ గొని యేమియును ఫల♦ మొందఁబోదు
బాలభాను మయూఖముల్♦కాలి వ్రేళ్ల, కుపమగా నొప్పినను గొంత♦యొప్పవచ్చు.

తే॥ చిన్నవై పెద్దవై పొచ్చె ♦ మెన్న లేని, బంతి జాబిల్లి బిల్లికల్ ♦ వసుధ లేవు
నిలక యగుకాంతి వజ్రాలు♦కలవి కావు, కాన వ్రేళ్లకు సాటి జ♦గానఁ గాన.

తే॥ నేల నడవని కాలి మీఁ♦గాళ్లు లడవు, లందు దిరిగినఁ బుస్తంబు♦ననువు నొందు
నిఖిల లోకంబులకు శర♦ణీయములగు, నతని పదముల వర్ణింప ♦ నలవి యగునె?

తే॥ కంబు చక్రంబులం దాల్చ♦గాలిఁ గ్రోలు, పాఁపపడకఁ బరుండిన ♦ వాఁడెయైన
జంఘలకుఁ దూణరూపంబు♦నవతుచేసి, పలుకఁబూనిన నయ్యది ♦ పసగ నున్నె?

తే॥ ధర్మమూర్తియౌ తార్క్ష్య నం♦దంపు మెడను, దొరసి దిజ్మదావళ పీన♦తుండములును
సిగ్గిలఁగ నొప్పు తొడలకుఁజెనయికరయ, భూమియం దొక్కఁడైననుఁ♦పొందు పఱునె?

తే॥ తమ్మితో సర్వజగములు♦తనరు హేతు, వైన నాభికి వలమురి♦యైన గంగ
సుడులు పొగడలు నంతయు♦నూటిగావ, యుపమ యెందుండి తెత్తు నీ♦యుర్విియందు.

క॥ అతిసుందర మరకత వ, ర్వతమును వెనుదీయు వెడఁద ♦ వక్షమ్మున ను
న్నతినుండ ఘన తపము సం, గతిఁ జేసిన లక్ష్మిఁగంటెఁ ♦ గలరే పుణ్యుల్ ?

తే॥ బంభరములు చెందమ్ములన్♦భ్రమను మునర, వ్రతువలయి పీనములయి♦వజ్రలు దీర్ఘ
బాహువులకు వేలుపుగొరు♦బలుపుచేయు, పోలు నొకకొంత వేతొండు♦పుడమి లేదు.

ఉ॥ పచ్చని క్రింది పత్రములు ♦ భాసిల నెఱ్ఱని పంకజాతముల్
విచ్చినరీతి నొప్పు చెయి ♦ వ్రేళుల యందలి గోళ్లు దుష్ట సం
పచ్చరితున్ †సురారివిభు ♦ వజ్రశరీరము నెట్లు తుండ్లుగా
వ్రచ్చెనొ యన్న సందియముఁ ♦ బాపఁగఁజాలుఁ బతివ్రతామణీ !

ఉ॥ గట్టివికావు కాంతులును ♦ గల్లవు సంగర శైత్రలక్ష్మిఁ జే
పట్టవు మేరుకార్ముకము ♦ భగ్నముగా గొనయమ్ము నీడ్వవున్
నిట్ట యశంబు నొందవు జ ♦ నింపవు రెండు సమానరీతులన్
గట్టుల నెట్లు పోల్పఁదగుఁ ♦ గాంతుని బాహు విలాస లీలకున్ ? ౯౯౮

తే॥ శేషశయను నెడమచేతి♦చింద మొందు,పొదలఁ గడలిశంఖమ్ము లేఁ♦బోఁకమ్రాఁకుఁ
గంఠమున కుపమించు నెం♦గలుల పలుకు, లియ్యకొనఁగ మావలనఁ గా♦దింత యేని.

క॥ శ్రీరాము నెమ్మొగముతో, నీరజములఁ బోల్తమన్న♦నేత్రంబులకున్
వేరుపమ దేనిఁ జూపుదు, నీరజాఁడును దఱుఁగుచుండు♦నెఱి నెలనెలకున్. ౯౧౦౦

చ॥ ఇనకుల వార్ధి చంద్రముని ♦ యెఱ్ఱని నోటికి నీరుద్రావి వి
చ్చిన యెఱదమ్మిఁ బోల్ప నది ♦ సిగ్గిలు దేవ సుధాభమైన చ
ల్లని నుడిలేని దంత విర ♦ శంబగు హాసములేని విద్రుమం
బును గొని పల్కుచో జగము♦ మూర్ఖత నాపయి మోపకుండునే? ౯౧౦౧

సీ॥ వెలయ మొలచు ధర్మ♦బీజాంకురంబులా !, యమృతబిందు శ్రేణి♦యా ? వచింప
నత్య భూమిజ సి♦శ్చల కోరకంబులా !, యమృతాంశు శకల సం♦ఘములు? తలఁప
ముత్తెంబులా? తక్కు♦ మొల్ల మున్నగునవా ?, ఎదియని తెలుపుదు ♦ రదనపంక్తి
నుక్షేత్రమునఁ బుట్టు ♦ సురరాజమణికాంతి, మరకతమును పోలు♦మావి చిగురు

తే॥ కొసరి కొసరి వేడఁగఁజాలు♦కొమరు కాంతి, గలుగు రాము మైచాయకుఁ♦గలదె
సవతు ?
తొడరియింద్రగోపముఁ బట్టు♦తొండ యైన,నాసికకుఁ బోల్పఁదలఁచుట♦నయము కాదు.

ఉ॥ దండకలో ♣ రాదు లెడఁ ♦ దన్ పడఁకంగఁ ఓశాచపంక్తి కో
దండము వేలుపుల్ మునులు ♦ ధర్మము వేదము లెల్ల విద్విష

† హిరణ్యకశిపుని

త్తండము దుంపతోఁ దెగెఁ గ ♦ దా యని మోదముతో నటింపఁగాఁ
గొండొక వ్రాలు కన్బొమల ♦ కుఁ దగుపోలిక నీవుఁగాంతువే? ౯౦౩

తే॥ అష్టమిఁ జందురుఁడు సహజ చి♦హ్నంబు వృద్ధి, తఱుఁగుటలు పుట్టు క్రుంకుటల్ ♦ తోఁఁగునేని
చీకటుల్ నిశ్చలుండయి ♦ చెలఁగునేని, రాము నెన్నొసటికి సాటి ♦ రాఁగలండు.

తే॥ పొడవులై నెఱులై నీల♦ములయి విరిసి, కొనలు వంకరలై వ్రాలి♦కుసుమములను
తావిపొఁగయుఁ గోరకవ్రుట్టు♦తావిపీచు, కురులు జడలయ్యె మొగుళుల♦కొ్కుమరుగలవె?

ఉ॥ లచ్చియు భూమిదేవియుఁ ద ♦ లంపునఁ బొందఁగఁ దగ్గయట్లుగా
నిచ్చ నికేడు దీవుల ♦ వహింపుమ యన్నపుడుఁ విలాతి తే
దచ్చుగఁ గానకేగుమసి ♦ యన్నపుడుఁ దడఁబాటులేని యా
క్రచ్ఛటు పోక గిబ్బయెడఁ ♦ గద్దన వారణ మేద్వకుండునే! ౯౦౬

తే॥ ఇట్లు పలుకు పల్కులు విని♦యింగలమున,మైన మట్టులు కరఁగుచు♦మఱుఁగుచుండు
సీతఁగని తల్లి! నీపతి♦చెప్పినట్టి, యానవాళ్లను వినుమని♦యనియె నిట్లు. ౯౦౭

చ॥ అడవుల త్రోవలందు నడ ♦ యాడుట కష్టతమంబు పట్టుగాఁ
గడపు దినంబు లింద యెస ♦ కంబుగఁ దల్లుల కెల్లసేవలఁ
నడపుచునుండు మన్న తరు ♦ ణంబున వాడిన మేనితో నొకే
యుడిచిన చేలతోఁ గినుక ♦ యొప్పఁ గుఱంగట నిల్చి టాడుమా. ౯౦౮

చ॥ ధరణిపునాజ్ఞ నౌదల్గను ♦ దాలిచి పేరిమి నమ్మతించి రా
జ్యరమను వీడి యేగు సమ ♦ యంబున జానకి కోటవాకిటఁ
దఱియకమున్నె యింత కసు ♦ దవ్వొకో కాన! మఱెంత దూర మం
చరుదుగఁ బ్రశ్న సేయుటయు ♦ నాదటఁ దెల్పుదుగాక మారుతీ! ౯౦౯

ఉ॥ నావిభు నూఱడింపు వచ ♦ నంబులఁ దేఱితి మానసంబు నం
దేవగ్నయైన చింత వహి ♦ యింపను చిల్కల గోరువంకలఁ
నావలెఁ జూచు కొండనుచు ♦ నాచెలియంద్రకుఁ బ్రేమతో సుమం
త్రా! పచియింపుమంచుఁ దగ ♦ నాడిన పల్కులు జ్ఞప్తి సేయుమా.

చ॥ మఱిమఱి పల్కనేల? హను ♦ మా! యిది యిమ్ము మదీయనామ మ
చ్చెరువుగ హీరరత్నములఁ ♦ జెక్కిన యుంగర మంచు సద్గుణో
త్తరుఁడు ప్రియంబుతో నొసఁగెఁ ♦ దల్లిరో! కై కొను మంచుఁ జూపె వా
నరవరుఁ డంత మైథిలియు ♦ నర్మిలిమైఁ గనె నంగుళీయముఁ. ౯౧౧

—: సీత యుంగరముం గని యానందించుట :

సీ॥ అర్ధేందుఫాల యా ♦ యంగుళీయముఁ గాంచి, పొందిన స్థితి దేనఁ♦బోల్పనగును?
చచ్చిన వారలు ♦ జన్మ సాఫల్యంబు, గాంచిన సంతృప్తిఁ ♦ గాంచె ననిరొ?

మఱచిన వారలు ♦ మఱచిన సంగతి, సభ జ్ఞప్తిఁగొని పొందు ♦ చంద మనియొ?
విడిచి యేగిన జీవ ♦ వితతి మరలి వచ్చి, బొందిఁ జేరిన నొందు♦నంద మనియొ!

తే॥ వీడు మణిఁగన్న సర్పంబు♦వీఁక ననియొ?, తొలఁగు నిధి నొందు మానవు♦తోయ
మనియొ ?

లేక లేక బిడ్డను గన్న♦లీల యనియొ?, తొలఁగు నిధి నొందు మానవు♦తోయ మనియొ?

తే॥ అందికొనియెను ఱొమ్మున♦నలమికొనియె, నెత్తిని ధరించెఁ గన్నుల♦నొత్తికొనియె
బాహు లుబ్బెను కృశియించె ♦ బాళి గొనియెఁ, గుండె నిట్టూర్చెఁ దెలిసి వా ♦
క్రువ్వఁదరమొ? [యడరిచూచుఁ

తే॥ మూఁరుకొను నక్కునం జేర్చు♦మొగిని తడవు, నశ్రువులఁ దుడ్చుకొని యట్టె♦
బలుకనుంకించు నేమియుఁ♦బలుక కుండు, మేను పొంగార దానిని♦ద్రిప్పిఁగఁజూచు.

క॥ మించుం బోలిన యొడలునఁ, గాంచన సంకాశ రుచులు♦గాన్పించె నటన్
మించిన రాముని యుంగర, మంచితమగు స్పర్శవేధి♦యగునేమొ కదా!

తే॥ క్షుధితునకు మంచి భోజ్యంబు♦చొప్పడొఁచె, గేస్తునకు మంచి విందబ్బ ♦ క్రియఁ
దలిర్చె
మరలఁ బ్రాణంబు రప్పించు♦మందుఁ బోలెఁ, బడఁతి కారామభద్రుని♦భద్రముద్ర.

తే॥ జీవములు నెమ్మి నింజెంది♦చెలఁగుసుదతి, కన్నులముదశ్రువులుఱొమ్ముఁ♦గడుగుచుండఁ
బ్రాణమొసఁగితి వుత్తమా? యనుచు మరల, ననియె నిట్టులు మృదుమధు♦రాక్షరముల

చ॥ జగముల సృష్టిసేయు నల♦స్రష్టకుఁ గారకుఁడైన రాము దూ
తగఁ జనుదెంచి జీవములఁ♦దద్దయు నిల్కడసేయు నీకుఁ బొం
దుగ నొసరించు ప్రత్యుపకృ♦తు ల్గలవే తలిదండ్రు లట్టి పు
ణ్యగుణ! కృపానిధీ! యిహప ♦ రాధిక సౌఖ్యము లిచ్చితియ్యెడన్. ౯౧౭

ఉ॥ దిక్కొకయింతలేని బలు♦దీనకు దిక్కయి దుఃఖమూడ్చి యి
ట్లెక్కుడు మోదమిచ్చిన క♦పీంద్ర! చిరాయువు నొందుమయ్య! యేఁ
జొక్కవు మానసంబు గల ♦ జోటినయేని యజాండ గోళముల్
స్రుక్కెడువేళ నేఁటివలె ♦ శోభిలుచుందువుగాక మారుతీ! ౯౧౯

ఉ॥ ఎచ్చటనున్న వాఁ డినకు ♦ లేశుఁడు తమ్మునితోడ నిన్ను దా
నెచ్చటఁ గన్నవాఁ డరి గ♦జేంద్ర మృగేంద్రున కేరు దెల్పి రే
నిచ్చట నున్కి నాకుఁ దెఱఁ ♦ గేర్పడఁ బల్కఁగదయ్య పావనీ!
సచ్చరితాగ్రగణ్య! యన ♦ జానకికిం గపివర్యుఁ డిట్లనున్.

శా॥ మారీచుండు దశాస్య ప్రేరణమునన్ ♦ మాయామృగాకారుఁడై
శ్రీరాము న్వడిఁగొంచు దూర మరుగన్ ♦ జింతించి రాముం డొకే

క్రూరాస్త్రంబున నేయ వాఁడు నిను నం ♦ క్షోభింపఁ జేయంగ నా
ర్తారావంబు చెలంగ మొఱ్ఱయిడె న ♦ ట్లమ్మా! జగత్పావనీ! ౯౨౧

శా॥ ఆకంఠధ్వని లక్ష్మణుండు విని స ♦ త్యం బెంచి నాకుంటకై
కాకుత్థ్సుండు శరాననోగ్రరవముం ♦ గావించె నట్లయ్యు న
స్తోకంబౌ విధియోగమే గెలిచె నెం ♦ దుం గల్ల కంఠస్వరం
బేకాకొండదొ యేమొ? త్రోవ ననుజుల్ ♦ వీక్షించెఁ దా వచ్చుచున్.

సీ॥ కాంచి లక్ష్మణు ముఖా ♦ కారచిహ్నంబుల, చే లోని తలఁ పవ ♦ లీల నెఱిఁగి
జరిగిన వృత్తంబు ♦ సౌమిత్రిచే నంత, నాలించి వడిఁ బర్ణ ♦ శాలఁ జేరి
నీసౌరుమేను గా ♦ న్పింపమి జీవముల్, చెదరిన గతి సొమ్మ ♦ సిల్లె విమల
కరుణామయుండు దుః ఖంబొంద వేఱొక్క, కత మింతకంటెను♦గలదె భువిని?

తే॥ అవల నేనన్ను వెదకి ప్ర♦త్యక్షముగను, రమణిఁ గాంచితి నీకుభ♦ద్రమగుఁ గాక
ప్రభుఁడు రాముఁడు జీవముల్ ♦ పాయలేఁడు, కారణంబును నీవును♦గాంచలేవె?

ఉ॥ నిక్కపుఁ బ్రాణమై చెలఁగు ♦ నీవు తొలంగ ననత్య జీవముల్
చెక్కినయట్లు నిల్చు రఘు ♦ శేఖరు చిత్తమునంద యిప్పుడున్
జెక్కుచెమర్ప కుంటి విఁకఁ♦జేటొనఁగూడుట యెట్లు? నీవు ని
ట్లెక్కడనుండ నాతఁ డట? ♦ నేగతి నేయవి వీడు నమ్మరో! ౯౨౪

తే॥ అట్టి రాముఁడు కొండలు♦నడవు లేళ్లు, వెదక యంత్రప్రతిమ వోలె♦వెడలి చనుచు
జగము కీర్తింపఁ దనజీవ♦సమితి వీడఁ, గాచియున్న జటాయువుఁ♦గాంచెఁ ద్రోవ

సీ॥ అతని మేనింగాంచి♦యడలుచుఁ దండ్రి! నీ, కిట్టి దుస్థితి యెట్టు♦లెనసె ననుడు
నిను రావణుఁడు దొంగ♦నియతిఁ దెచ్చుట తెల్పు,చున్నంతలో నల్క♦మిన్నుముట్ట
జగములనెల్ల మ♦చ్చరవహ్నికీలల, బూది గావింతు నం♦చూఁది నిలిచి
కోదండమును గాంచు♦కొమరు జటాయువు, వీక్షించి యొక యవి♦వేకి చెడుగు

తే॥ సేయ జగముల నాశంబు♦సేయఁదగునె?, శాంతినొందుము తొందర♦చనదు తండ్రి!
ధర్మచరితుఁడ వని సమా♦ధాన పఱుప, రామచంద్రుండు కోపభా♦రంబు వీడి.

ఉ॥ ఎచ్చట నుండువాఁడు? మఱి ♦ యేభువనంబున నిల్చువాడు? వాఁ
డెచ్చటి కేగినాఁడు? దను ♦ జేంద్రుడు పోయిన దారియేది! నా
కచ్చుపడంగ దెల్పు జన ♦ కా! యన నాతఁడు చెప్పబూని నో
ర్విచ్చుడుఁ బ్రాణముల్ నెగసె ♦ వీరవరేణ్యులు వంది కుందఁగన్. ౯౨౭

తరల. తలరి మిక్కిలి రామచంద్రుఁడు ♦ తండ్రికిం దగు నంత్యక
ర్మలు సురావళియున్ భ్రమింపఁ గ్ర ♦ మంబుగా నెఱవేర్చి యా
ఖలుని రోయుచుఁ బర్వతంబులు ♦ కానలున్ భ్రమియించుచున్
దెలివినొందక నిన్ను గానమి ♦ దీనతన్ గడియించుచున్. ౯౨౮

తే॥ పూవు ద్రోవలు కన్నీట ♦ బూదగాఁగ, వహ్ని మైనంబు కరఁగిన ♦ వహిని మనసు
కరఁగ రాముఁడు మతిచెడి ♦ కలవరించి, పలవరించుచు మిక్కిలి ♦ పనవి పనవి.
తే॥ జనులలోఁ గర్మముల దాఁటు ♦ జాణ లెవరు! వీరలక్ష్మి వసించెడు ♦ వినుతభుజుఁడు
మతి కలంగ సర్వంబు న ♦ మ్మోతను దాల్చు, చిత్తజాతవైరివలె న ♦ న్మత్తుఁడయ్యె.

ఉ॥ నీ వనమందు మాపటను ♦ నిక్కముగా మునిఁగెన్ మదీయ రా
జీవదళాక్షి కల్లయని ♦ చెప్పెదవే? మదిరాక్షి రోసి నా
కేవగనైన నీపలుకు ♦ నీయక తక్కితివేని నీవు గో
దావరి! నిప్పవై మఱిఁగి ♦ తప్పక మాఁడెద వీక్షణంబునన్. ౯౩౧

ఉ॥ పర్వతరాజమా! వశిని ♦ బాలకురంగమనేత్ర నేత్ర సం
పర్వముగాఁగఁ జూపు మటు ♦ పాయక చూపవయేని నీవృథా
గర్వము సర్వముం జెడఁగఁ ♦ గాలిచి బూదియొనర్ప మన్మహా
ఖర్వ శరం బొకండె యొడి ♦ కంబుగఁ జాలుఁ జెడంగఁ జూతువే? ౯౩౨

ఉ॥ బంగరులేడి మాయలను ♦ పన్నుటచే హరిణాక్షి నేఁడు నా
కుం గనరాక పోయినది ♦ క్రూరకురంగములార! నాదు త
న్వంగిని చూపరేని కఠి ♦ నాత్ముఁడనై మిము దుంపతోడఁ ద్రుం
గం గసిదీఱఁ జంపెద ను ♦ కర్మము గాకిది ఘోరకర్మమే? ౯౩౩

తే॥ డెంద మగల నీరీతిఁ దాఁ ♦ గుందికుంది, రాఘవుఁడు వాడుచుండ ని ♦ ర్మలమనస్కు
తమ్ము చల్లని వాక్సుధా ♦ ధారచేతఁ, జిత్త మొక్కింత తేటయై ♦ చింతవీడె. ౯౩౪

తే॥ కీశకుల శేఖరుండు సు ♦ గ్రీవుఁ డుండు, ఋశ్యమూకంబు చేరిరి ♦ నృపకుమారు
లచట నెల్లప్రాణుల మనో ♦ వ్యధ తొలంగ, మిత్రకుల మిత్రపుత్రుల ♦ మైత్రికుదిరె.

సీ॥ శ్రుతులచే జ్ఞానవి ♦ శ్రుతులచే నిజరూప, మెఱుఁగరాకుండు లో ♦ కేశ్వరుండు
తనకుఁ గల్గిన దుఃఖ ♦ మునకు హేతువును మా, యెదలు పుండ్లుగఁ జెప్పి ♦ యుదిలగొనఁగ
నీతొడవులఁ జూప ♦ నాతండు మూర్ఛిల్లి, మావచనంబుల ♦ మరలఁ దెలిసి
యరసి నీతొడవుల ♦ నమృతంబు చల్లిన, నాఱని పెనునొవ్వి ♦ నందినాఁడు
తే॥ ఆమనోవ్యధ మున్నె తా ♦ నందియున్న, నపుడు మఱిమఱి క్రొత్తలై ♦ యడరె మేము
మది సమాశ్వాస పడఁజూప ♦ మఱియుఁ బెరిఁగె, నేమిచెప్పుదు రాముని ♦ యెడఁద వనట.

సీ॥ ఆపర్వతంబున ♦ కావలిగిరి నున్న, వాఁడు శైలనిభుండు ♦ వాలి యనెడు
కపిరాజు నీదుఃఖ ♦ తతికిఁ గారకుఁడగు, పంక్తికంఠుని దన ♦ వాలమందు
వ్రేలాడఁగాఁ జుట్టి ♦ పృథివీధరంబుల, వననిధులం దాఁటి ♦ వచ్చినతఁడు
వాని నొక్క శరాన ♦ వడిఁ గూలఁగా నేసి, తన మిత్రుఁడగు మిత్ర ♦ తనయునకును
తే॥ రాజ్య మొసఁగి సేవలఁ గూడి ♦ రాఁగఁ బనిచి, వచ్చు దాఁక నాలుగు నెలల్ ♦ వానలేగ
మాల్యవంతంబునందు ల ♦ క్ష్మణునితోడ, జరపె నాలుగు యుగములు ♦ జరపులీల.

తే॥ కపిబలంబు చేరినది ది♦క్తతులు వెనుకఁ, బడఁగ వెదకంగ వారలఁ♦బంపి నన్ను
దక్షిణంబున కంపె నా♦తరలి రాక, కిదియ హేతువు జనకరా♦జేంద్రతనయ !

చ॥ చనవున నిట్లు రామ నృప ♦ చంద్రుని తీరు మరుత్సుతుండు ప
ల్కిన విని భర్తృ దుఃఖ మగ ♦ లింపఁగ డెందము నొచ్చియున్ ముదం
బును కుతుకంబు నొక్కదెసఁ ♦ బొందుచు మూలగయుం గరంగ నా
హనుమని నీ యపారమగు ♦ నంబుధి నెట్లు తరించి తీవనన్. ౫౩౯

మ॥ జననీ! రామ పవిత్ర పాద సరసీ ♦ జాతంబు లుల్లంబునం
దనిశంబున్ జపియించు ధీవరులు మా ♦ యా సాగరంబుం దరిం
చిన చందంబున మీకృపా మహిమచేఁ ♦ జేకూరు చేవన్ దరిం
చిన వాఁడీ కపియన్న శంకయె మదిం ♦ జెందంగఁ జింతించుచున్.

చ॥ కదుకొను నాణిముత్తెముల ♦ కంటెను వెన్నెలకంటె మిన్నయౌ
రదనరుచుల్ చెలంగిన ధ ♦ రాసుత మారుతిఁ గాంచి నాయనా!
పొదఁడవు నీవు దొడ్డది స ♦ ముద్రము దాఁటఁగ నెట్టులయ్యె నె
మ్మదిని తపోబలంబుననొ ♦ మంత్రబలంబుననో వచింపుమా. ౫౪౦

—: హనుమ స్వస్వరూపముం జూపుట :—

తే॥ అనుడుఁ గేల్మోడ్చి హనుమంతుఁ ♦ డంబరంబు, దాఁకఁ బెరిఁగి మఱియుఁ బోవఁ♦ దల దగులునో
యను భయంబున వినతుఁడై ♦ తనదు రూపు, తోఁపఁ జూపె జానకి శంక♦ తొలఁగి పఱవ.

తే॥ పొగడఁదగు గురుత్వము పంచ♦భూతములకుఁ
గలదొ? కపి వరేణ్యునియందు ♦ గలదొ? యెంచ
గలదు? నిజము నూహింపంగఁ♦ గలమె? యనుచు
ద్రోపులాడంగఁ దగిన దా ♦ రూపమహిమ.

క॥ పెరిఁగిన బంగరు గిరిఁగల, తరువుల ఖద్యోత వితతి ♦ తనరె ననఁగ వా
నరవరు రోమంబులలో, గురుతరగతి మెఱసె ఋక్ష ♦ కూటము లరయన్.

క॥ కనులను జ్ఞానంబును కడ, చిన రూపము గొన్న హనుమ ♦ చెవి కుండలముల్
ఘనముగ గ్రహముల వెలిఁగెడి, దినకర శశధరుల తోడ ♦ దీకొని నిలిచెన్.

చ॥ జగములఁ గొల్చి నిల్చిన భు ♦ జంగమ తల్పుఁడె యోర్పుతోడఁ గీ
డగు నొక వానరంబని య ♦ నాదరముం బొనరింపరాని య
త్తుగ శిఖరాణిఁ బోలు కపి ♦ చంద్రుని యున్నతిఁ గాంచెనేని లో
కగురుత యొక్కవానికె స్వ ♦ కంబుగఁ గాదని యెంచి సిగ్గిలున్.

తే॥ అన్నిలోకజాలములందు ♦ నన్నిదిశల, నన్నిప్రాణులు గాంచె నా ♦ హనుమనపుడు
పొసఁగఁ బైలోకములనున్న ♦ పుణ్యగుణుల, నందఱను దన కన్నుల ♦ నతఁడు గాంచె.

తే॥ పరవి పెరిఁగిన మారుతి ♦ పాదయుగళి, నణఁపఁగా లంక సంద్రంబు ♦ నందు మునిగెఁ
బొరలి ప్రబ్బెఁ దెల్లని యలల్ ♦ భూమిమీఁద, మీలు తళతళ మెఱయుచు ♦ మిట్టఁబడియె.

చ॥ గరితలమిన్నయైన జన ♦ క ప్రభుపుత్త్రిక వాయుపుత్త్రుఁ ద
చ్చరణ సరోజ యుగ్మమును ♦ సైతము గానఁగలేక సోఁకు లీ
ల్గిరయని యుత్సహించి సుబ ♦ లీ! భవదీయ మహాస్వరూప బం
ధురతను చూడఁగా జడియు ♦ దుఁ వడిగా నుపసంహరింపుమా. ౯౮౭

తే॥ అయ్య! నీయనంతాకృతి ♦ నరయఁదగిన, సత్త్వమొందదు జగ ముప ♦ సంహరింపు
మనుచు జానకి విభు పరి ♦ ష్వంగ సౌఖ్య, సమ ముదము గాంచి పరవశ ♦ త్వము భజించె.

తే॥ అంతఁ జిత్తమనుచు సమీ ♦ రాత్మజుండు, వెంటనే చూడదఁగు నొక ♦ పిన్నరూపు
దాల్చి వినతుఁడై యాయమ ♦ దాసి నిలువ, నిట్టులను మణి దీపంబు ♦ నెనయుసీత.

సీ॥ పవన జవన వీర! భువిఁ గులాద్రులతోడఁ, బ్రిదులక తలను ధ ♦ రించి తన్న
లీల స్వర్గముఁ బెక ♦ లించి యెత్తితివన్న, లోకంబు లన్నింటి ♦ జోక మోచు
శేషుని డాపలి ♦ చేత నీడ్చితివన్న, వనధిని నడచియే ♦ వచ్చితన్న
భవదీయ మహిమకు ♦ ఫలవంతమగు గొప్ప, పనికాదు లజ్జనే ♦ పాదుకొలుపు

తే॥ నీజలధి దాఁటి వచ్చుట ♦ యేమిగొప్ప, విభుని కరుణయు యశమును ♦ పెక్కుకల్ప
ములు తిరంబుగ నెలకొనఁ ♦ బూనిసేయ, నీవ యొక్కండవై యుంటి ♦ నియతచరిత.

సీ॥ ఈలంక నీపేర్మి ♦ కేడు మున్నిఖిల, కవల నుండమియుఁ ద ♦ క్కువయె గాదె
యిట్టిదే విజ్ఞాన ♦ మిట్టిదే నీమాన, మిట్టిదే శమము ని ♦ ట్టిదియె దమము
కార్యంబు నిట్టిదే ♦ వీర్యంబు నిట్టిదే, తెల్విఁ యిట్టిదె యిల్లె ♦ తెల్విఫలము
తలఁపు నిట్టిదె నీతి ♦ మెలపు నిట్టిదె మఱి, గెలుపు నిట్టిదె యిల్లె ♦ కీర్తిగరిమ

తే॥ ఎల్ల సుగుణముల్ నీకిట్టి ♦ వే యటన్న, నింక లోకపాలకులయి ♦ యెసఁగుచుండు
నజహరామరాదులు సద్గు ♦ ణాళియందు, హీనులే యగుదురు కదా ♦ మాననీయ!

సీ॥ మెఱుపుకోఱలు మేర ♦ మీఱిన బలమొందు, కర్బురావళి వృద్ధిఁ ♦ గాంచినప్పు
డమ్మహావీరున ♦ కనుజుఁడొక్కఁడు తక్కఁ, దోడు లేదను చింతఁ ♦ దోఁగుచుండు
వీడితి నాశంక ♦ వీడెఁ బ్రాణాపద, కొదువలేదని తృప్తి ♦ పొదలె నిపుడు
నీయట్టిమహిమాఢ్యు ♦ సాయమబ్బినమీఁద, నీరక్కసులు లంక ♦ యేమియగునో?

తే॥ ఇంక నేమరణించిన ♦ నెగ్గులేదు, నన్ను నలఁచిన రాక్షసా ♦ న్వయము తూలె
నేఁడె చెలువీడె నాథుని ♦ నేఁడె గంటి, యశమె గాక నిందయునాకు ♦ నబ్బునేమి!

సీ॥ అవియిట్టు లామోద ♦ మున నాడు జానకి, పాదంబులకు మ్రొక్కి ♦ పావనియను
నమ్మ! రాముని దాసు ♦ లగు కపివర్యులు, కడలి యిసుక కంబెఁ ♦ గలరు హెచ్చు

వారలలో నొక్క ♦ వనచరుండను భవ, దాజ్ఞలఁ దలమోచు ♦ నడియఁడేను
ఏడుపదుల వెల్వ ♦ లెట్టపో గది నము, ద్రంబందు నీరు మొ ♦ త్తమ్ము నొక్క
తే॥ చేతఁ ద్రావంగఁ జాలునే ♦ సేనకెల్ల, రాక్షసుల లంక కాసంగ ♦ రాకపోవు
కతన నింతవఱకు నిల్వఁ♦గలిగెఁ గాక, తెలియు పిమ్మట నింకను♦నిలుచు నేమి?
సీ॥ కమలాప్తపుత్త్రుఁడం♦గదుఁడు మైందుఁడుద్వివి, దుఁడు నీలుఁడనుకుము♦దుండునలుఁడు
వృషభుండు శంఖుండు♦వినతుండు గవయుండు, శరభుండు ధూమ్రుండు♦జాంబవంతుఁ
డుగ్రుండు కుముదాక్షుఁ♦డురుబలుఁడగు శత, బలి గవయాక్షుండు♦పనస కాంబ
దధిముఖ గంధమా♦దనులు దుర్మర్షణా, దులు సైన్యనాయకుల్♦దుర్జయులును
తే॥ రామబాణమువలెనె కార్యంబు గొంద్రు, జగములెల్ల నొక్కటిచేయఁ♦జాలువారు
వారి లెక్కింప దానవ♦వర్గమెల్ల, సలుగకైనను జాలదు♦జనని! నిజము. ౧౧౬

౬. చూడామణి పటలము. (౮౯)

తే॥ దుఃఖతయు రాము ప్రాణముల్♦దొరయునదియు, శ్రీసమానయు నగుసీతఁ♦జెలు వెడల్చి
కొంచుఁ బోవుటే తగుకర్జ♦మంచుఁ దలఁచె, నట్టి హానును కుపమ సెప్ప♦నై తియగునే?
తే॥ బంటువార్తను వినుము కో♦పంబు వలదు, రావణుని గెల్చు టరిది కా♦ర్యంబుగాదు
నిన్ను నీపతి కడఁజేర్చి♦నెమ్మి మీఱ, మీపదంబుల భజియింతు♦నేవు గనుము.
చ॥ అతి మృదురోమముల్ గల మ♦దంసముపై వసియించి నెమ్మదిన్
వెతవిడి నిద్రపొమ్మనిల♦వేగముతో నెడ నిల్వ కేగి నీ
పతి గల మాల్యవంతమునఁ♦బన్నన ద్రావెలెద నీకు భద్ర మ
బ్బుత భవదీయ సేవకుని ♦ పోఁడిమిఁ గాంచుము తల్లి! లెమ్మిఁకన్ ౧౧౯
ఉ॥ దైత్యులు కాంచి యడ్డుపడఁ♦దప్పును కార్యమె యందువేమొ? సం
స్తుత్య బలంబుతో నరుల ♦ దోర్బలముల్ నశియింపఁ గూల్చి నా
యత్యురుకోప మార్చికొని ♦ యప్పుడ తేటఁదనంబు గాంతు సం
ప్రత్యయ ముంచు మమ్మరో! భ ♦ వత్థ్సితి గాంచియు నైఁపనేర్తునే?
చ॥ పెలుచన లంకతోడఁగొని ♦ వే చనుమన్నను కెల్లగించి యేఁ
జులుకన నొక్క చేతఁ గొని ♦ చుట్టిన దైత్యుల నొక్కచేతఁ బెన్
జలమున నగ్గుచేసి రఘు ♦ నాయకు పాదసరోజ సన్నిధిం
దొలఁకక డించువాఁడ నిది ♦ దొడ్డగు కార్యము కాదు చేయఁగన్.
చ॥ మరలుచు లోకమోహానువి ♦ ఘంటట మీాయమృతంబుఁ బోలు సుం
దరి దితిజేంద్రుడైచు చెలి ♦ దప్పు నుపాయము లేక మిక్కిలిం

జరిపరి రీతులన్ మనసు ♦ మాఁడఁ దపించుచు నున్నదన్న నా
వెరవరి దౌత్యమేమి యొద ♦ వించినదా? వచియింపు మమ్మరో!

ఉ॥ గాయములేని పీనభుజ ♦ కాండముతో నటకేగి శాత్రవ
స్వీయ బలంబు నేర్పఱచి ♦ చెప్పఁగ నెట్లగుఁ? దోడికొంచు నే
నాయమఁ దేరలే దకట! ప్రాణము మాత్రము గాచుకొంటి మీ
నాయికఁ గాంచి పల్కఁ జత♦నం బోనఁ గూడద యందునా? యటన్.

ఉ॥ రక్షితసాలమైన నగ ♦ రంబును కాల్చి బూదిచేసి యీ
రాక్షసవర్గముం బద క ♦ రంబులతో నలిగాఁగఁద్రొక్కి నే
యీక్షణమందె సర్వము న ♦ దీశుని పొట్టను పెట్టి రావణుం
దక్షతఁ జంపుమన్న వడిఁ ♦ ద్రమ్మెద నాజ్ఞ యొసంగు మమ్మరో!

ఉ॥ శ్రీరఘువీరశేఖరుఁడు ♦ చెల్వుగ నిప్పుడె నిన్నుఁ గూడి ముం
గూరిన తాపమెల్ల విడి ♦ కోరికతోడఁ బ్రసన్న విస్ఫుర
చ్ఛ్రీరమతోఁ జెలంగి మఱి ♦ చెన్నటి దానవ వంశమెల్లఁ బో
కారిచి లోకజాలముల ♦ కష్టములం దొలఁగించు టొప్పగున్. ౫౬౫

ఉ॥ ఇందుల కొక్కయడ్డు వచి ♦ యింపఁగఁ దగ్గది లేద యట్టి భా
గ్యేందిర నాకు లభ్యమగు ♦ నిమ్ముల నీవు దలంచితేని రా
ముం దగఁజేరి దుఃఖములఁ ♦ బోకడపెట్టి సుఖింతువమ్మ! న
న్నుం దయఁజూచి మూఁపుపయి♦నూల్కొన నెక్కుమ యంచు మ్రొక్కినన్.

తే॥ పూన్కి యుక్తవాక్యంబులఁ♦బోనఁగఁ బలికి, తల్లికడ నిల్చు లేఁగనాఁ♦దనరి నిలుచు
హనుమఁ గాంచి నిర్దుష్ట వా♦క్యముల మృదుల, ఫక్కి నిట్లనిపలికె నా♦పద్మగంధి.

శా॥ అన్నా! నీకిది దుష్కరంబగునె? యో ♦ గ్యప్రౌఢి నీశక్తికిన్
మన్నింపందగు భంగి నెంచితివి సా ♦ మర్థ్యంబు మెచ్చయ్యె నీ
కన్నన్ దిక్కట లేరు లేరయిన ము ♦ గ్ధాత్వంబుచే నిట్టి నీ
పన్నాగం బనమంజసం బనుచుఁదె ♦ ల్పం బూనితిన్ మారుతీ! ౫౬౮

ఉ॥ అంబుధి మధ్యమందు దను ♦ జావళి క్రన్ననఁ జుట్టు ముట్టి క్రూ
రంబుగ నస్త్రశస్త్రముల ♦ రాయిడి చేసిన వారితోడ ఘో
రంబుగఁ బోరెదో? మఱియు ♦ రక్షణచేసెదొ నన్ను? రెండు నం
తంబునఁ గష్టమే యొసఁగఁ ♦ దప్పను కర్జ మొకండ వాటచే. ౫౬౯

చ॥ మఱియొకమాట రాఘవు న ♦ మంచిత కార్ముకవిద్య యాడికం
బొరయును చాప మాఱడిని ♦ పొందును పక్వపు టోగిరంబుఁ గు
క్కురములు దొంగిలించుకొనఁ ♦ గోరిన రీతిగ నొప్పఁ గార్యమున్
వెరవరివైన నీవును ప ♦ విత్ర మనంబున నిట్టు లెంతువే? ౫౭౦

శా॥ ఘోరాయోధనమందు రాఘవు మహా ♦ కోదండ పాండిత్య మే
పారన్ వేల్పులు చూచుచుండ, నను చౌ ♦ ర్యప్రౌఢి సాధించుచుం
గారాగారమునందు కూర్చిన మహా ♦ కష్టాత్ము కన్నుల్ సమి
ద్ద్వారరంగంబునఁ గాకముల్ పొడువ నం ♦ తోషించి వీక్షించెదన్.

ఉ॥ రాముఁడు లక్ష్మణుండును దు ♦ రంబునఁ గార్ముక హస్తులౌచు న్వ
న్థేమముఁ జూపి దైత్యుల వ ♦ ధింపఁగ ముక్కిఁడిఁ బోలి రాక్షస
స్వామినులెల్ల దైన్య విధ ♦ వాత్వము లొందినఁగాక నాయెడన్
రామతనంబు నానయును ♦ రాజిలునే? గురుతన్ గడించునే? ౭౨

చ॥ కనకమయ త్రికూటమునఁ ♦ గ్రాలెడు లంకయె నేను చూడ దై
త్య నికర శల్య సంచయ యు ♦ తంబుగ నిల్వదయేని జీవితం
బును సుచరిత్రమున్ గరిమ ♦ మున్ మహిమాన్వితమౌ సతీత్వమున్
జనులకు నెవ్విధిం దెలుపఁ ♦ జాలుదు నీవ వచింపు మారుతీ! ౭౩

శా॥ ఈ రక్షో నిలయంబ కాదు మఱి యీ ♦ యీరేడు లోకంబులన్
శ్రీరామాస్త్రమువోలెఁ గాల్తు నివృత్తై ♦ చిందన్ సతీత్వాగ్నిచే
నారామప్రభు నేర్చినట్టి విలువి ♦ ద్యా ప్రౌఢికి న్న్యూనతన్
గూరంజేసిన దాన నౌదు ననియే ♦ కోపక్రియన్ మానితిన్. ౭౪

తే॥ మఱి జితాక్షమునిన్న స♦మ్మాన్యుఁడనుచు, జగము వినుతించు; రామువర్ష్మంబుదక్షఁ
దక్క మేను దాఁకుట నాకుఁ♦దగదు నీకు, రాముకీర్తికి భంగ మో♦ర్వంగఁదగదు.

తే॥ ఉదరె నను రావణుఁడు తాఁకి♦యుండు నేని, వానిమేన నిన్నాళులు♦ప్రాణము న్న
ప్రాణములు త్రుటిలో వీడు♦ననియెవాఁడు, నేలఁ గెల్లగించికొని వి♦న్వీది నేగె.

తే॥ తన్ను చేర నిష్టపడని♦తరుణిఁదాఁకె, నేని శీర్షముల్ తెగి యిల♦పైని గూలు
ననుచు నలువ యిచ్చిన శాప♦మరయ నాదు, ప్రాణముల నిన్నినాళ్లు కా♦పాడెనయ్య.

తే॥ అట్టి శాపంబు గలదని♦యరసి సత్య, వంతుఁడగు విభీషణు పుత్రి♦పరమసాధ్వి
ప్రేమ నాయెడఁ గలదియౌ♦త్రిజట చెప్పె, నాకు భయము దీర్చెడు జత♦నంబుతోడ.

క॥ అది కలుగుటచే ధర్మము, వదలదనుచు నిశ్చయించి ♦ పతి శౌర్యంబున్
మదినమ్మి నిష్కలంకత, పదిలమ్ముగఁ దెలుపనుంటిఁ ♦ బ్రాణమ్ములతో. ౭౯

ఉ॥ అచ్చటినుండి రావణుఁ డ ♦ హమ్మతి ధాత్రిఁ బెకల్చి తెచ్చి నాఁ
డిచ్చటనుంచె లక్ష్మణుఁ డ ♦ హీన గుణుం డొనరించి నట్టి యీ
పచ్చని యాకుటింటిని కృ ♦ పామతిఁ జక్షువులారఁ గాంచి నా
యొచ్చెములేని మానస మ ♦ హోన్నతి నమ్ముము నీవు పావనీ! ౮౦

ఉ॥ ఇచ్చటువీడి యెచ్చటికి ♦ నేగెడు దానను కాను రాము మే
నచ్చముగాఁగఁ బోలు నమ ♦ లాంబువు లున్న సరోజసద్మమున్

జొచ్చెద వే చలించెదు న ♦ సుప్రకరంబుల నిల్పఁగోరి యు
ద్యచ్చరితుఁడ రఘూత్తము ము ♦ దంబునఁ బొందెదు నాస నొక్కటన్.

తే॥ కాన నియ్యది యుక్తంబు ♦ గాదు నీవు, వేదనాయకు నెదుటికి ♦ వేగపోవు
టెన్నఁ గార్యమనుచు సీత♦యిట్లు పలుక, విని మహామతిమంతుఁ డి♦వ్విధివచించె

తే॥ కలుగు సందేహ తాపముల్♦తొలఁగ హనుమ, రామచంద్రునకుం దగు♦రాణివైతి
తల్లి! నీ తపోనిష్ఠ చం♦దమ్ము మేలు, మేలనుచు నుత్సహించుచు♦మించి పొగడి.

ఉ॥ చింతిలకమ్మ! యిచ్చట వ ♦ సించుట నిక్కము కొంతకాలమే
సంతమసంబు రావణు వ ♦ శంబున నిండిన లోకమెల్ల ని
శ్చింతఁ బ్రసన్నతం బొదలఁ ♦ జేయుము చింతిలుచున్న రామ భూ
కాంతునకున్ వచింపఁదగు ♦ కార్యము నానతి యిమ్మనన్ వెసన్

—: సీత రామునకుఁ బంపు సందేశము :—

మ॥ హనుమా! యింకొకమాసమే యెటులొ నేఁ ♦ బ్రాణంబుతో నుండెదన్
వెనుకన్ రాముని యానసుమ్మి యసువుల్ ♦ నిల్పంగఁ జాలన్ నిజం
బనుమా నావచనంబు లవ్విభునకే ♦ యంగంబునం బల్కఁ దా
నెనరుం బూనునొ యాప్రకారమున వి ♦ న్పింపందగుం బావనీ!

మ॥ అతిలోకుండగు రాఘవేంద్రునకు భా ♦ ర్యారత్న మొక్కర్తు దు
ర్గతిపాలై తపియింపఁ జల్లని కృపా ♦ రంభంబు లేకున్న భూ
పతివంశస్వము క్షత్రధర్మమును గా ♦ పాడంగనైనన్ వరిం
చితిఁ బ్రార్థించితి నంచుఁ దెల్పుము కపి ♦ శ్రేష్ఠా! దయావారిధీ! ౫౮

తే॥ లలిత గుణ శీలుఁడైన మా♦లక్ష్మణునకుఁ, దేటపడఁగ శ్రీరాము నా♦దేశమునను
నన్ను గాచుచునుండఁగా♦నడుమఁ దొడరు, చెఱను విడిపింప విధియని♦చెప్పుమయ్య.

చ॥ ఒకనెలతోడ నేనిచట ♦ నూను వ్రతంబు సమాప్తి చెందు నం
తకు మును రాముఁ డిచ్చటి కు ♦ దాత్తమతిం జనుదేరలేనిచో
నకలుషమైన గంగదరి ♦ నాతని కెందలిరాకుచేతఁ ద
ప్పక తిలతర్పణం బొనరు ♦ పం బతిమాలితి నంచుఁ బల్కుమా. ౫౯

మ॥ వరధర్మాధికృతుండు రాఘవుఁడు నా ♦ పైనింపకుం తేనియున్
గరుణాభావము లేశయే మఱచినన్ ♦ నామీఁద నిండారు ప్రే
మరసాత్మల్ ముగురత్తవారలకు మీ ♦ మన్నించుచు వైదేహి తాఁ
జెఱలో లంకను క్రమించుచోఁ గరము మో ♦ ద్భక్తి నంచాడుమా.

చ॥ మిథిలకు వచ్చి నన్నచట ♦ మీఱిన ప్రేమఁ బరిగ్రహించుచో
బుధులుం వచించు మార్గమునఁ ♦ బోయెద రెండవ కన్యహస్త మీ

ప్రథిత భవంబునం దొడరి ♦ పట్టను నెమ్మదినైన నెంచ నం
చధిక ముదంబుతో, ననుట ♦ యార్యునకున్ వినిపింపు మారుతీ! ౫౯౦

ఉ॥ చిక్కులఁబొంది యిచ్చటనె ♦ జీనములం ద్యజియింతునేని వే
ఱొక్క భవంబునందయిన ♦ నుత్తమవీరు పవిత్రదేహమున్
దక్కక దాఁకు నిష్కలుషి ♦ తంపు వరంబును కేలుమోడ్పుతో
మిక్కిలి కోరుదాన నని ♦ మేదిని భర్తకు విన్నవింపుమా. ౫౯౧

చ॥ నలువుగ రాజ్యపాలన మొ♦నర్ప ననర్ఘమణుల్ ఖచించు తా
వళములఁ దాల్పు భద్రమద ♦ వారణ రాజముపై రహించి వి
థులఁ దగనేగు వేడుక కు ♦ తూహలినై కన నోచకుండు నే
నెలసి వృథా వచించి ఫల ♦ మేమి? పురాకృత మిట్టులుండఁగన్. ౫౯౨

తే॥ తన్ను గూర్చి జనంబులు ♦ తలరుచుంట, తల్లిచింతయు భరతుండు ♦ తనకుఁగాఁగ
ననుభవించు నొవ్వియునెంచి♦యచటి కేగుఁ, గాని యిచటికి నెట్లు రాఁ♦గలుగు నతఁడు.

తే॥ తల్లిదండ్రులకును బంధు♦తతికి నాదు, కేలుమోడ్పు లందింపు సు♦గ్రీవుతోడ
రాముతో నయోధ్యకుఁ జని♦ రాణచెడిన, పురికిఁ బట్టము గట్టఁగ ♦ మొగిచెనుము.

—: హనుమంతుడు సీతకు ధైర్య వాక్కులాడుట :—

తే॥ వెగడుపడి యిట్లు పలుకు పృ♦థ్వీజఁ గాంచి, తల్లి యింకను దుఃఖానఁ♦దలరెదేల?
యనుచు మృదు మధురములు స♦మంజసములు, నైన గంభీర వాక్కుల♦ననియె హనుమ.

క॥ స్రుక్కెదు నీవీలంకనె, స్రుక్కక రాముండు బ్రతికి♦చొచ్చు నయోధ్యన్
జక్కని మకుటము దాలుచు, నెక్కడి మాటలివి! చింత ♦ యేటికిఁ దల్లీ!

చ॥ విడివడి పోవ మానవులు ♦ వేడ్క వహించెదు కారయందె శ్రో
త్రడితన మించు కేనియును ♦ తాఁజని నిన్ను గలంచు పంక్తికం
ఠుఁడు తనశీర్షముల్ భువిని ♦ దుల్లక కాచికొనున్ రఘూత్తముల్
వడి ననినుండి పాఱుదురు ♦ పాతక మిట్లును సిద్ధిఁ బొందునే! ౫౯౩

ఉ॥ అన్నుల మిన్న! ఘొల్లరము ♦ నక్కటికం బిసుమంత లేక నిన్
బన్నము నొంద జేయు బలు ♦పావులఁ గూల్పక మాశరీరముల్
మన్ననఁ గాచికొంచు నృప ♦ మాన్యుని ముందటి కేగ నాతఁడున్
గ్రన్నన వింటితోఁ దన పు ♦ రమ్మునకున్ మరలం దలంచునే?

క॥ భరియింపరాని వెతలం, బరితాపము నొందనీక♦ప్రాభవమును మా
కిరవుగ నొసఁగిన నృపతికి, మరల న్నినొ్నెసఁగకున్న ♦ మహితులమె కదా!

చ॥ వ్రతులగు మానివర్యులను ♦ వ్రచ్చి భుజించెడు దైత్యపాళి శో
ణిత పలలాంత్ర రాసుల గు ♦ ణించి పిశాచ నృగాల గృధ్ర సం

తతులు గ్రసింపఁ జంపక వృ♦ థా విలుపూని యయోధ్య కేగనీ
ప్రతిన యొనర్చు వానికొక ♦ పాటియె యీపని? రాజనందినీ! ౬౦౦

క॥ అఁజఁగని పగవారి చెఱం, బడు నిను గైకొనక వదలి ♦ మరలితి మేనిక్
జనులును పెద్దలు పిన్నలు, నడరి హసింపరొకో? తల్లి! యదియొక బ్రతుకే?

క॥ క్రొత్తడియగు గృహిణి మదో, న్మత్తులు తాఁకుటకు మున్నె ♦ నాశిలె నంచుం
జిత్తము మదిమది మరలిన, యుత్తము విక్రమ మదెంత♦యొప్పారునొకో?

క॥ జెడితిం జెడితి ససువులం, జెడఁబాసితివేని నిశిత ♦ విశిఖమ్ములచేఁ
దొడిఁబడ సకల జగమ్ములఁ, బొడిపొడి సేసినను కొడిమె♦పోవునె తల్లీ? ౬౦౩

క॥ మునుపే ముజ్జగములఁ గల, దనుజులఁ బరిమార్తు ననుచుఁ ♦ దలపడు నతఁడో
జనకజ! నీస్థితి యెఱిఁగిన, వెనుకను నెమ్మది వహించి♦నిఁగునె? తల్లీ! ౬౦౪

క॥ ఊరక రాని యమర్షము, క్రూరుల జీవములమాత్ర ♦ గొని శాంతిలుచో
వేరేది దాని కావఁలతి?, ధారణియుం దివియుఁ గ్రుంగి ♦ తాఱి నమయదే?

క॥ లయకాల వహ్నివోలెక్, రయమున భువనముల సాగ ♦ రముల నివ్రుఱు చే
సియె వీడఁగాక యడఁగునె? నియమిత రామాస్త్ర వితతి♦నీస్థితి విన్నక్. ౬౦౬

క॥ దేవారాతులఁ ద్రుంచెను, కావలముల మాన్చి నుజన ♦ గణములఁ గాచెక్
ధీవరుల కొనఁగె సద్గతి, శ్రీవరలక్ష్మి యను కీర్తి♦చెలఁగఁ దలఁపవో? ౬౦౭

ఉ॥ నీవలనక్ జగంబులు వి ♦ నిశ్చల వృద్ధి భజించునమ్మ! శో
కావలినే గ్రహించి శ్రమ ♦ లంది యొకించుక కాల మిట్టులే
త్రోవుము లోక మంగళము ♦ తూకొని చేసెదు వారె పెక్కులా
హావదు లొందువారు భువి ♦ హాయికె నోర్చుట భావ్యమేకదా!

తే॥ రోయఁదగు లోక కంటక♦రుధిర పూర, మునను ప్రేతభూతాదులు♦మునిఁగి క్రీడ
సేయ దాఁగిన సురలు హా♦ర్షించి పొంగు, సత్కృతిని నీవు చూడంగఁ♦జాలవేమి?

మ॥ ప్రళయాంభోద తటిన్మహారుచుల ని ♦ ర్ఘాతంబులం బోలె రా
మ లసద్భీకర బాణరాజి దనుజ ♦ క్ష్మాపాల సైన్యంబులక్
దొలువం గాఁతెదు నస్రపూరము పయో ♦ ధు ల్నిండి ఘోషింప వీ
నుల విందారఁగ నుత్సహింపుము విన♦న్గొన్నాళ్లలోఁ దల్లిరో! ౬౧౦

చ॥ కరువులు జాఱు నట్లసుర ♦ కాంతలు కద్బుల మోఁదికొంచు వం
దురుచును దుఃఖబాష్పములఁ ♦ దోఁగుచుఁ ద్రెంచిన తాలికూటువల్
గిరులయి మింటి నంటి వడి ♦ ఖేచర లోకవిమానముల్ చనక్
దెరువున కడ్డమై నిలువఁ ♦ దేకువఁ జూడఁగ నుత్సహింపుమా. ౬౧౧

తే॥ వింగి కానఁబడక కప్పి♦నిండు భూత, ములును కంకగృధ్రము లస్ర♦జలధి మునిఁగి
దైత్యవనితల బాష్ప న♦దంబులందు, స్నానమాడుట గాంచ ను♦త్సాహముంచు

ఉ॥ వీణల మించి గాత్రములు ♦ వెల్వడ మర్దళముల్ ధ్వనింపఁగా
బాణలు వేల్పుసానులు ప ♦ సందుగ నాట్యము సేయుచోటులన్
బ్రీణన ముల్లసిల్లఁ గపి ♦ వీరులు వీరరవంబు సేయుచున్
శ్రేణిగ మోదనృత్యమున ♦ రేఁగుటఁ జూడఁగ నుత్సహింపుమా. ౬౧౩

చ॥ కొడిమలు మీఱ నైచ్యములు ♦ గూడిన క్రూరుల మేలు వ్రీలఁగా
వెడలెడు రక్తవాహినులు ♦ వే కొని పోయెడు కొండలట్టి పె
న్బడుగుల కుప్పతిప్పలు సు ♦ పర్వులు వెక్కసమంది చూడఁగాఁ
గడలిని నిండి పొర్లుటను ♦ కాంచఁగ నీమది నుత్సహింపుమా. ౬౧౪

తే॥ అవనిజా వహ్ని రామ శ♦రానిలమున, నల త్రికూటమున్ కుంపటి ♦ యందు పెఱిగి
క్రూర దానవు లనెడి బొ♦గ్గులను కాల్ప, లంకయను పైఁడి కరఁగుట♦లక్ష్మి! కనుమ

తే॥ భువన కంటకుఁడగు దశ♦ముఖుని తలల, వ్రాలి పుణ్యఫలముఁ బోలి♦పావన మగు
నీశరీరంబుఁ గాంచిన ♦ నేత్రపంక్తి, నొలిచి కాకులు దినఁ జూడ♦నుత్సహింపు.

చ॥ మును సురవైరి కోడి బిడె ♦ ముంగొని మాఱు మొగంబుగొన్న ది
గ్ఘన గజ వాల సన్నిధి ది♦గాలు మనంబడ రాఘవాంక మా
ర్గణములు పంక్తికంఠుని శి ♦ రంబులఁ ద్రెంచి తొలంగఁద్రోవఁగా
గుణవతివైన యోజనని! కోరికఁ గాంచఁగ నుత్సహింపుమా. ౬౧౭

ఉ॥ ఖంబు చెమర్చెనేమొ యని ♦ గాదిలి నష్టపు డల్ల వీచు శ్వే
తాంబరముం బలెన్ వెలయు ♦ నట్టి ధ్వజావళి యొప్పు లంకలో
నంబుల వర్షముం గురియ ♦ నల్లరి సేయుచు లేచు భూతముల్
పంబిన ధూళిలో వికృత ♦ భంగుల నాడుట గాంచు మమ్మరో!

ఉ॥ నల్లని రేయి ద్రిమ్మరుల ♦ నల్లల వెల్లువలెల్ల వార్ధి జొ
బ్బిల్లి తలంబులేమి నటు ♦ వెన్కకు మళ్లుటయున్ సమస్తమున్
ద్రెళ్లు యుగాంత వేళలను ♦ తృప్తి వహింపని మృత్యు మూర్తియున్
గొల్లగ మెక్కి త్రక్కుటయుఁ ♦ గూరిమిఁ గాంచెదు గాక తల్లిరో!

ఉ॥ వేలుపుబోట్లవంటి యలి ♦ వేణులతో ననురాళి క్రీడలం
దేలు సుగంధ కల్పవన ♦ దీర్ఘికలన్ గపిమూఁక వక్రతాం
గూలము లొండొకళ్ల వడిఁ ♦ గూరిచికొంచు వినోద లీలలం
బోల మునుంగుచుండుటలు ♦ పోఁడిమిఁ గాంచెదుగాక తల్లిరో! ౬౨౦

ఉ॥ పెక్కులు పల్కనేల? రఘు ♦ వీరుని దివ్య శరాళి లంకలో
నొక్కను దైత్యకాయముల♦నిల్వక యవ్వల దుస్సి పోఁకు తె
య్యెక్కడ నుందు రయ్యచటి♦ కేవున నేగఁ త్రిలోకవాసులా
రక్కసి మూఁకలెల్ల సమ♦రంబునఁ గూలుటఁ గాంతు వమ్మరో! ౬౨౧

చ॥ ఒకనెల తీఱు లోపలనె♦యుమ్మలికంబు రవంతయేని పొం
దక సుఖియింతు వమ్మ త్వరి♦తంబున నేఁ జని రాముఁ గాంచు చే
యొక తడ వంత మీఁద నిట♦ కొందఁగ రాఁ దరితీపు గల్గునే?
యొక క్షణమేని భారమగుఁ♦ డొప్పరికించునె యింకఁ దల్లి రో! ౬౨౭

తే॥ ప్రాణ మున్నదని వచించు♦నంతెకాని, తన శరీరము తాఁకి మాఁ♦డని సుమములు
చివుళులును లేవు పేలాలు♦చెదరకుండు, తరువులును లేవు వల్లు లం♦తకును లేవు.

తే॥ తెలివి తేటలుండినఁ గదా♦తీవ్రరు వంత, మొగులు పిడుగులతోడఁ బై♦ఁదగులుచున్నఁ
నై దుతలల సర్పము తొమ్మ♦నంటి కఱచు, చున్న నెఱుకగల్గదు రాఘు♦వోర్విపతికి.

తే॥ చిలుకఁబడు దధికై వడిఁ♦గలఁతనొంది, యెడను తడఁబడు ప్రాణంబు♦లింద్రియములు
గందనగు పైత్యమును వియో♦గంపు వంత, యెంత కలదొ లెక్కఁగ వచి♦యింపనగునె?

తే॥ ఇట్టి శోచనీయస్థితి♦నెనయు రాముఁ, డుండె సుఖముగ ననుమాట♦యొప్పు కాదు
పలుకునవి యెల్లఁ గరతలా♦మలకముగను, చూపెదను చూచెదవు గాక♦సుగుణచరిత!

శా॥ తల్లీ! నిర్మలుఁడైన దాశరథి యు♦ద్దండుండు సుగ్రీవుఁడున్
దెల్లం బారఁగ నీదువార్త విని తృ♦ప్తిం జెందు మున్నే కపుల్
ప్రోల్లాసంబున వార్ధి దాఁటి నగరం♦బుం జుట్టి హుంకారముల్
మొల్లంబొప్ప నొనర్చుచుంట విని ప♦మ్మోదింతు నిక్కంబుగన్ ౬౨౮

శా॥ దేవీ! లెక్కిడరాని వానరులు ప్రో♦ద్దీప్తిన్ దగన్ రేపె లం
కా వాటిన్ వడిఁజేర మధ్యమున నా♦కాశంబునం దార్క్ష్యుపై
శ్రీవిష్ణుంబలె నా భుజంబులపయిం♦జెన్నారు రామప్రభున్
సేవింపారఁగఁ గాంతుగాక కను లు♦న్మేషస్థితిం జెందఁగన్. ౬౨౯

ఉ॥ అంగదు మూఁపుమీఁద నుద♦యాద్రిపయిం గనుపట్టు బాల భా
నుం గనులీల లక్ష్మణుఁ గ♦నుంగొని మోదము నొందెదమ్మ! పో
రుం గొన వానరేంద్ర నిక♦రుంబము నాయితమై చెలంగు నీ
యంగదయుం దొలంగు నరి♦యాటయు నీఁగు వియోగముం జెదున్.

ఉ॥ ఈమెయి నీవు పల్కఁ గడు♦విచ్చిన మానసములోనె వచ్చి శ్రీ
రాముఁడు నీచెఱన్ విడుగ♦రం బొనరింపఁడయేని నిందచే
రాముఁడె రావణుండగును♦రావణుఁడున్ మఱి రాముఁడే యగున్
శ్రీమహిళామతల్లి! కొద♦చెందెదవేల? వహింపు నెమ్మదిన్. ౬౩౦

తే॥ తొడరి మోదకరములు ని♦ర్దుష్టములును, పౌరుషోచితములు నగు♦పలుకు లాంజ
నేయుఁడాడఁగ నువ్విఁగి♦నెమ్మది గొని, యుర్వితనయ యిట్లని పల్కె♦నుత్సుకతను

## —: సీత యానవాళ్లు తెలుపుట :—

శా॥ అయ్యా! యేగెదుగాక వైళముగ శ్రే♦యఃశాలి నిన్నొందఁగా
కయ్యైవిఘ్నములం దరించెదవుగా ♦ కార్యంబు శ్రీరాముతో
నెయ్యంబారఁగ నానవాళ్లడరు వా ♦ నిం బ్రీతి వాక్రుచ్చు మా
యయ్యాదం దొలఁగించు భారమది నీ ♦ దే కాదె ప్రాభంజనీ! ౬౩౨

ఉ॥ ముందటఁ జిత్రకూటమున ♦ మ్రుక్కడికాకము వాఁడి ముక్కుతో
డం దగ నాయురమ్మునఁ గ ♦ డంగి పుటుక్కునఁ గాటుసేయ నేఁ
గుంసఁగఁ జూచి నెత్తుగని ♦ కూర్మివిభుం డొకపూరిఁ గొంచుఁ బ్రేఁ
పొందఁగ బ్రహ్మమంత్రమున ♦ నుగ్రత నేయుడుఁ గాకి భీతిమై. ౬౩౩

చ॥ కొదుకుచు సత్యలోకమున ♦ కుం జని ధాతయు రొప్పి త్రోలనా
ప్రదరము వెంటనంట వడిఁ ♦ బాఱుచు శంభుని డాసి యాతఁడుం
బదరఁగ మల్లి దిక్పతుల♦వల్లను రక్షణ మొందలేక యె
య్యదియును దోఁప కేడ్చు నెడ ♦ నాత్మల వేల్పులు పిచ్చలించుచున్.

ఉ॥ ఇంద్రసుతా! జయంత! యిటు ♦ లేల చరించితి నీతిమాలి ని
న్నింద్రుఁడె కాఁడు సర్వభువ♦నేంద్రులు చేరియుఁ గావనేర్తురే!
రుంద్ర యశస్వి శ్రీరఘువ♦రున్ శరణంబని చేరు మా దయా
సాంద్రుఁడె కాచు నిన్ను రభ ♦ సంబునఁ బొమ్మని పల్కె నాతఁడున్.

చ॥ భయమునఁ బాఱివచ్చి రఘు♦వర్య! భవత్పద పంకజంబులే
దయగల వంచు నే నభయ ♦ దానము వేఁడితి నన్న సత్కృపా
శ్రయుఁడు క్షమించి వానిదగు♦చక్షు వొకండు గ్రహించి యస్త్రమా
పయి నుపసంహరించుటలు ♦ పావని! నాథునకున్ వచింపుమా.

తే॥ నీ చరణములే శరణముల్ ♦ నిఖిలనాథ!, యనఁగ దోసఁగు మన్నించితి♦నవనియందు
కాకి రెండుకన్నుల కొక్క♦కంటిపాప, యుండు నీవల్ల ననుటయు♦నొగి వచింపు.

తే॥ మ్రొక్కి సెలవంది కాకంబు♦పోయె దివికి, సురలు పువ్వుల వానలు♦కురిసినారు
దీని సౌమిత్రి సుంతయుఁ♦దెలియఁడయ్య, యింపు పలుకులతో వచి♦యింపు మిదియు.

ఉ॥ ప్రేముడిఁ బెంచు నాచిలుక ♦ పిల్లకు నెవ్వరిపేరు పెట్టుదున్
శ్రీ మహితా! యన న్మిగులఁ ♦ జిర్నగవార మదీయమాత స
త్ప్రేమమయాత్మయా కయిక ♦ పేరిడుమా యని నాఁడు పల్కె నా
యామెత గూర్చు వాక్యముల ♦ యాదరమున్ వినిపింపు మారుతీ!

ఉ॥ ఇన్నియుఁ బల్కుమీఁద వచి ♦ యింపలఁగఁ దగ్గది యొండు లేద యం
చెన్ని ధరించు వస్త్రమున ♦ నింపుగఁ గట్టిన మానికంబు పై

నున్న జగంబు క్రింది జగ ♦ మొప్పఁగఁ గల్గిన కాంతి సంతతిన్
గ్రన్న జయించు దాని నటఁ♦గైకొనె మారుతియున్ భ్రమింపఁగన్.

తే॥ హనుమ యచ్చెరు పాటొందె♦యరయుసాగె, సప్తలోకంబుల తమంబు♦సమసిపోయె
రవియు భయపడ కీనగ♦రంబు చేరె, నేమి? యని దైత్యులును శంక♦నెనసినారు.

ఉ॥ శోకమునొందు జక్కవలు ♦ స్రుక్కుట వీడె ముడింగియున్న ప
ద్మాకరమందు పంకజము♦లన్ని యెలర్చెను సూర్యకాంతముల్
తూకొని నిప్పు లుమ్మినవి ♦ దుఃఖముతో ముకుళించెఁ గల్వలున్
వే కనుపట్టె నయ్యెడ ర ♦ విప్రభఁ దోఁచెడు చిన్నె లన్నియున్.

చ॥ మృదువగు కేశపాశమను ♦ మేఘముపై గ్రహరాజుఁబోలి య
మ్ముద్రిత మనోజ్ఞసంహనన ♦ ముంబలె రాగమునొందె రాగ సం
పదగల రామపాదముల ♦ బాగున వెల్గు శిరోమణిం గుణా
స్పదయగు సీత చూపెఁ గనె ♦ వాయుసుతుండు ప్రమోదమందుచున్.

చ॥ వెదకుచు వచ్చి జీవముల ♦ నిందుగ నిచ్చిన పుణ్యమూర్తి! నా
కిది యొక కంటిపాపవలె ♦ నింబుగ నుండుఁ జిరంబు వల్వలో
విడులక చుట్టియుంచితి న ♦ భిజ్ఞగఁ గైకొను మంచు సత్యవా
క్పదయగు సీతయిచ్చెఁ గడు ♦ భక్తిని గాడుపుపట్టి చేకొనెన్.

ఉ॥ కైకొని వస్త్రమందు దుసి ♦ క్రమ్మక యుండఁగ ముడ్చి వీడకోల్
కైకొని మ్రొక్కి ముమ్మఱు వ ♦ లంగొని చాఁగిలి లేచి దీవనల్
కైకొని ధీరవాక్యములు ♦ క్రమ్మఱఁ బల్కి మఱిన్ మఱిన్ నుతుల్
కైకొని యుబ్బి గంతులిడి ♦ గంధవహాత్మజుఁ డట్లు క్రమ్మఱెన్. ౯౪౫

౨. వనభంగ పటలము. (౯౦).

చ॥ వనమును గూల్చి యుత్తరపు ♦ వైపునకుం జననెంచి దొడ్డ రూ
పును ధరియించినట్టి కపి ♦ ముఖ్యుఁడు స్వల్పకృతిం బొనర్చి యేఁ
జనుట వివేకలక్షణమె? చయ్యన నచ్చటికేగి రాఘవుం
డును ముదలించు వాని కొఱకఁ ♦ దున్ సరి పల్కుమి దూత లక్షమే?

ఉ॥ ఏవునఁ గాలుసేతులనె ♦ యెల్లర నీచులఁ ద్రొక్కి చంపి లం
కాపురి వార్ధి నూఁకి జన ♦ కప్రభు పుత్త్రిని గొంచు రాఘవ
శ్రీపదపద్మ సన్నిధిని ♦ చేర్చనయేని తలంప నెవ్విధిన్
లోపములేని యుత్తమ గు ♦ ణుండగు దూతుఁడ నౌదు నిద్ధరన్.

ఉ॥ పంచముఁడైన రావణుని ♦ వాలముచే దశ మస్తకంబులున్
ఖండించిన చేతు లిర్వదియు ♦ మిడ్కఁగ నుక్కఁగఁ గట్టి కారలో

నంచిన వాడఁగాను గడు ♦ నుద్ధతిఁ దాఁకి జయింపలేదు మా
ప్రాంచిత రామ భానుజ ప ♦ రస్పరమైత్రి ఫలించు టెట్లగున్ ? ౬౪౯
చ॥ బలయుతమైన యీ యసుర ♦ వర్యముఁ గాడ్పుడఁజేసి కూల్చి దో
ర్బలు దశకంఠుఁ బట్టికొని ♦ క్రమ్మఁగ మోఁది యతండు కన్నులం
బులుకుసఁ జూచుచుండ మయ ♦ పుత్రి శిరోజములం గదించి వె
ళ్ళలగొన నీడ్చి తెచ్చి చెఱ ♦ వేయుట దోసముఁ గూర్చుకార్యమే ?
ఉ॥ వీరల హింస చేసి పృథి ♦ వీభరముల్ రఘువీరు భారముల్
దీఱ సడల్చి దూతకృతి ♦ తీరుగఁ బూర్తి యొనర్చుటే తగం
గారియ మంచు భావమున ♦ గట్టి యొనర్చి దితి ప్రజాతతిన్
బోరొనరింప రేఁపు విధ ♦ ముం దలపోసె మనంబు లోపలన్. ౬౫౦
తే॥ కడఁగి యిప్పుడే యివ్వనిం♦గాకువఱుతుఁ, బఱుచు పెనుదోని చెవిఁబడఁ♦బలలభుజులు
కోపులై యెదిరింపంగఁ గూల్చువాఁడ, నిదియ తగిన యుక్తి యనుచు♦నెంచె మదిని.
చ॥ పొదివిన దైత్యులన్ మరలి ♦ పోవఁగ నీయక కూల్తుఁ గూలిరే
నెదురఁగ రావణాసురుఁడు ♦ నేపున దుస్సహ సైన్యయుక్తుఁడై
కదలును వచ్చెనేని కడు ♦ కావరముం జెడ మస్తకంబులన్
జిదురలు చేసి నాకసి న ♦ శింపఁగ నెమ్మదినంది మళ్లెదన్. ౬౫౧
చ॥ అని తలపోసి రేవగలి ♦ కాథ్యులు ప్రిమ్మరు మేరుశైలమున్
జెనయు భుజార్గళుండు మును ♦ చెన్నుగఁ గొమ్మున భూమినెత్తు నా
ఘనకిటిఁ బోలి దొడ్డ యడ ♦ గైకొని వేలకువేలు కావలిన్
గనిన యశోకికా వని న ♦ గంబులఁ గాళులఁ ద్రొక్కి వ్రీలఁగన్.
తే॥ విఱిగెఁ జీలెను వ్రాలెను♦పెల్లగిల్లె, నడఁగెఁ బొడియయ్యె మడఁగెఁ బె♦ల్లవిసె నెగసెఁ
జెదరె మండెను మాఁడెను♦ప్రిదిలెఁ ప్రేలె, బొగ్గులగుచు ఛిన్నాభిన్న♦ములుగ రాలె.
తే॥ కొన్ని వ్రేళ్లతో లేచెను♦కొన్ని కాలెఁ, గొన్ని మొగుళులలోఁ జేరెఁ♦గొన్ని చీలె
కొన్ని మున్నీటఁబడిపోయెఁ♦గొన్ని తేలెఁ, గొన్ని దేవలోకముఁ దాఁకెఁ♦గొన్ని తూలె.
తే॥ చుట్టి విసరిన మబ్బుల♦నుడిసి కొన్ని, దిక్కరుల కాకు మేఁతగా♦దిగువ వ్రాలె
నడుగు పట్టి వీచిన కొన్ని♦యాకసంబు, దాఁటి యింద్రు నందనమును♦ద్రెమ్ము చేసె.
తే॥ వాలి యలలచే జలధి క♦ల్లోల మయ్యె, దైత్యుల విశాల సౌధముల్♦ధరణిఁ గూలెఁ
గులగిరులు తుమురయ్యెను♦కుసుమచయము, పట్టు దప్పి దిక్కులతోడఁ♦బడి యడంగె.
చ॥ పొడవగు వ్రేళ్లతో నడరు ♦ భూజముల్ వడిఁ బెల్లగించి త్రొ
క్కుడుపడి లోకముల్ ప్రిదుల ♦ గోటున వైచిన కొన్ని దిక్కరుల్
పిడులకు నందియీయఁ దమ ♦ బెట్టిదమౌ రదనాంతరంబునన్
బెడఁకుచు వ్రేలు తుండముల ♦ వీఁక ధరించిన రీతి భాసిలెన్. ౬౫౨

ఉ॥ క్రూరుని పంక్తికంధరుని ♦ కోమల వృక్ష వనంబులోనివౌ
సౌరభ పుష్పసంచయము ♦ జక్కుల పర్వతమందు దేవతా
వారములుండు స్వర్గమునఁ ♦ బద్మదళాక్షులు మూఁగి వచ్చి యిం
పారఁగ నొల్లసిండఁ బదు ♦ మాడిరి యొండొరు మించి వేడుకన్.

తే॥ కనకరత్నమయంబులై ♦ క్రాలు తరులు, దిక్కులకు మించులంబోలెఁ ♦ దిరుగుచుండెఁ
గొన్ని సూర్యకాంతులఁ బోలెఁ ♦ గొన్ని నడుమఁ, దాఁకి రాలురిక్కలవలె ♦ ధరణిఁ గూలె

తే॥ పక్షులును జంటియీఁగలు-భ్రమరములును, మొగ్గలుఁ జివుళ్లుఁ దేనెయుఁ-బూలుపండ్లు
కడలిఁ బడ మీలు మ్రింగుచు ♦ మిడిసియాడెఁ, బచ్చి చెట్లంతలోఁ బడఁ ♦ బచ్చడయ్యె.

క॥ చెదరిన పూవులఁ దాలిచి, సదమల గంధంబు వీచి ♦ జలధులు వేల్పుల్
సుదతులతోఁ గ్రీడించు ప్ర, మదావన సరోవరముల ♦ మాడికి నొప్పెన్.

మ॥ హనుమంతుండు పెకల్చి వైచు మణిహే ♦ మాంచత్ప్రభా వేదులన్
ఘన భూజ వ్రజముం బొదళ్లు పెనుపే ♦ క్కంజొచ్చి నిండారుటన్
జనముల్ దాఁటియె పోవఁగాఁదగు వనం ♦ జాల్సంద్ర మవ్వేళఁ గా
లి నడన్ దాఁటఁగఁ దగ్గదయ్యె ననఁ జా ♦ లెన్ జూడ్కి కబ్బంబుగన్.

తే॥ గ్రీష్మభానుని పోలి య ♦ గ్రిమమరీచు, లడర మింటి కెగసి యుర ♦ వడిని మరలు
తరులవలన దానవుల సౌ ♦ ధములు తుమురులయ్యె నశనిచేఁ గుధరంబు ♦ లవియునట్లు.

తే॥ హనుమ పెకలించి వైచిన ♦ యగచయంబు, క్రిక్కిఱిసి మబ్బువలెఁ దోఁపఁ ♦ గినుకచేత
రావణుని వనమెల్ల స్వ ♦ ర్గంబుచేరఁ, బంపు క్రియదోఁచె నప్పటి ♦ యతని చెయిది

ఉ॥ తేనియ తుంపురుల్ చెదర ♦ దిక్కఱి పక్షులు రంపుసేయఁగా
సూనచయంబు నిండుకొన ♦ శోభిలు రత్నమయావనీజముల్
మానుగ మింటఁ గ్రిక్కిఱిసి ♦ మంజుల కాంతులు కత్తులట్లు సిం
గాణులరీతిఁ గ్రాలి వడి ♦ గాఁ జనె మేటి విమానపంక్తినాన్. ౬౬౬

ఉ॥ వారణరాజముం జెనయు ♦ వాయుకుమారుఁడు చుట్టివైచు భూ
మీరుహముల్ సుడింబడుచు ♦ మింటను నిల్వక క్రమ్మఱిల్లి పెన్
వారిధి వ్రాలుచుండుటలు ♦ వ్రట్రిలి తోయదముల్ పయోధిలో
నీరము నానఁగా దొడఁగి ♦ నిండుగ వ్రాలిన లీలఁ గన్పడెన్. ౬౬౭

ఉ॥ పాపముచేసి మధ్యమ భు ♦ వంబున జన్మముఁ గాంచి జ్ఞానులై
తాపములన్ జయించి విను ♦ తంబగు ముక్తిని పొందు వారి య
ట్లేపున మూడ్చి పైకెగుర ♦ నేసిన కల్పకజాల మప్డు స్వ
ర్గోపరి భాగ మేగి మఱి ♦ యొందెను మున్పటి స్వస్థలంబులన్. ౬౬౮

తే॥ గుఱిగ మణికుట్టిమంబులఁ ♦ గూలఁదన్ని, చదిపి చవికలు దీర్ఘికల్ ♦ చదునుచేసి
కుడ్యములను క్రీడాద్రులఁ ♦ గుదియఁ ద్రొక్కి, చేయ దుస్సాధములనెల్లఁ ♦ జేసివైచె

తే॥ సాల సర్జకాదులఁ ద్రోచి♦పూలతోడఁ, జంపకశ్రేణి గెలఁకి ప♦జ్జను గలట్టి
మూత నాలంబు లూడ్చియ♦చ్చోటఁ జెలఁగు, ఫలతరూత్కరం బెల్లను♦పాడుచేసె.

ఉ॥ కంతు వసంతు మోములవి ♦ కానము లెల్లఁ గృశింప నా హనూ
మంతుని పాదముల్ దగుల ♦ మంజుల పుష్పవనంబు తారు మా
ఱెంతయు నొందఁ జందన మ ♦ హీజము లింధనభంగిఁ గాల న
య్యంతర భాగమెల్లఁ బొగ ♦ యై నివృత్తై కనెఁ గాదు పోలికన్. ౬౭౧

క॥ రోదసేయుచు భ్రమరంబులు, చెదరఁగ భూజములు గలసెఁ♦జేడ్పడి మఁటన్
మదవతుల నృత్యశాలలు, కదిసిన విరి లతలతోడఁ♦గాలెఁ బదడుగాన్. ౬౭౨

చ॥ తలరెడు పూలకొమ్మలు ల ♦ తావితతుల్ పికముల్ రహించు క్రొం
దలిరులు గల్గు మావులును ♦ తావులఁ జిమ్ముచు నల్లిబిల్లిగా
నలమిన తీఁగలం జెలఁగి ♦ యందము చింద నమర్చు ద్వారముల్
పులుగులతోడ గుల్మముల ♦ పుంజములున్ జెడె నుగ్గు నూచమై. ౬౭౩

ఉ వైచు ప్రవాళ వల్లరులు ♦ వారిదపంక్తిని మించు లట్లు చు
ట్టేచిన కొండలంబడి ర ♦ హించె మహీధ్రము వంటి యేనుఁగుల్
మోచిన మోము పట్టములఁ ♦ బోలి హిరణ్మయ చూత శాఖికల్
వే చని యందు దంతులకు ♦ వేడుక యోగిరమయ్యె నయ్యెడన్. ౬౭౪

తే॥ పిట్ట లఱచు శబ్దంబులు ♦ వృక్షచయము,విఱుగు సవ్వడి మారుతి♦పెలుచఁజేయు
సింహనాదంబు పెనురోద ♦ సిం దరించి, యండగోళంబులం దాఁటి♦యవలికేగె.

క॥ కూలెను పాటల కుజములు, ప్రీలెను వర గోఁగులును ద్వి ♦ రేఫ రవంబుల్
మాలెను విహగ రుతంబులు, గ్రాలెను రోదనముగాఁగఁ♦గడలిం బడుచున్. ౬౭౬

క॥ అడఁగెం బొడవగు మేడలు, మడఁగెం బందిళ్ల లతలు♦మఱి వృక్షంబుల్
పడియెం గావేరినదిఁ, జెడియెం గంగాజలంబు ♦ చేరఁగఁ డేకుల్. ౬౭౭

క॥ అందము చిందెడు కొలఁకులు, చందనముం గలిపినట్లు ♦ చెడెఁ బంకముగాఁ
బెందరువులు కూలిన యా, సందర మొక పూలతోట♦చందంబయ్యెన్ ౬౭౮

ఉత్సా. సిందువార వారమేగి ♦ చెదరి చేరె వారిధిన్
చందనములు ఱివ్వుమంచు జరగి♦దైత్య సౌధముల్
పొందు మేల్కవాటములను ♦ పొడిచి విఱిచె నుగ్గుగా
నందు రక్క సీంద్రు జడిసి ♦ యఱచి పఱచి యేడ్వఁగన్. ౬౭౯

ఉ॥ ఆకసమందు మించి వెలుఁ ♦ గారెడు రిక్కలఁ బోలి నందన
ప్రాకట వృక్ష పుష్పములు ♦ పైఁబఱపై విలసిల్లెఁ దింత్రిణుల్
వ్రేకనఁ జుట్టి చుట్టి కడ ♦ లిం దిగబాఁదఁగ శంఖ కీటముల్
వ్యాకులమంది ముత్తెముల ♦ నయ్యెడ రాల్చుచుఁ బాఱె భీతిమై

తే॥ ఆకసమునకు వీచిన యండమైన, కొమ్మలం గల్గు మణిమయ ♦ కుజము లచటఁ
దిశిఁ దైత్య వినాశ దు♦ర్దిన నిమిత్త, మైన యింద్రధనువు వోలెఁ♦గానఁబడియె

మ॥ చతురంభోధులలోఁ బడక్ విసరు నా♦చాంపేయ వల్లీ తతుల్
చితుకంబాఱుచు రాలుచుండుటలు వీ ♦ క్షింపక్ దిగం జొచ్చుచున్
సిత జీమూత వితానముల్ జలములన్ ♦ సేవించు వారాశి నా
తతరీతిం బ్రసరించు భానుకర సం ♦ తానంబునా భాసిలెన్. ౬౮౨

తే॥ ప్రాఁకులం ద్రిప్పివైవఁ బు♦రంబునందు, లాయములు రథశాల లా♦లాన శాల
లాటపట్టులు పానశా ♦ లాదికములు, నేలమట్టంబులై పేరు ♦ మాలికూలె

తే॥ ప్రాఁకులును కొండలును తారు♦మాఱుఁగాగ, వైచుటంజేసి బంగారు♦ప్రహరులెల్ల
జిలిపడ మేడలగ్గిచేఁ♦జిటిలి పెటిలి, యతల కుతలమై పురమెల్ల♦నడలు కుడిచె.

చ॥ అవనిజకై వగం బొగుల ♦ నట్లుడికించితి విష్ణు నాకు శా
త్రవులగు వారు నవ్వఁ బ్రమ ♦ దావన నాశము సేయుచుండ గా
రవమునఁ గాంచుచుంటివని ♦ క్రాఁగి చిరాకు గడించునంచు దా
నవపతి కల్కి డాఁకొని న ♦ నక్ హరిణాంకుఁడు డాఁగెఁ బైదెసన్.

చ॥ కనకము రత్నరాజి రవి♦కాంతములున్ శశికాంతముల్ మణుల్
మునుకొని వెల్గు ప్రాఁకులుగఁ ♦ బొల్చిన యావనవృక్ష సంతతుల్
హనుమఁడు పెల్లగించి కకు ♦ బంతర దేశములం బడంగ వై
చిన కతనక్ జగంబు విల ♦ సిల్లెను వట్ట పగంటి చాడ్పునన్. ౬౮౬

చ॥ మెకములు భీతిమైఁ జెదరి ♦ మిక్కిలి భ్రాంతి వహించి యార్చుచున్
గకవికచెంది ప్రాలె నెఱ ♦ కల్ గల పక్షులు కొన్ని పాఱెఁ గొ
న్ని కడలిఁ జెట్లతో నడఁగె ♦ నిచ్చలు పాఱిన వెల్లఁ గొంత మే
రకుఁ జని తత్తఱిల్లి ధర ♦ వ్రాలెను పక్షములన్ విదుర్చుచున్. ౬౮౭

ఉ॥ పువ్వులతోడ భాసిలిన ♦ భూజములన్ హనుమంతుఁ డుగ్రుఁడై
ఱివ్వున వీవ నత్తరుల ♦ వ్రేలెడు గూఁడులతో విహంగముల్
త్రెవ్వక కొన్ని చేరవవి ♦ దివ్యపదంబు నతం డనుగ్రహం
బువ్వున నూననేని మఱి ♦ యున్ దగనెట్టి ఫలంబు గూర్చునో! ౬౮౮

తే॥ రాక్షసులు కాచుచున్న యా♦రామమందు, శ్రమల నొంది తపించు భూ♦జాతయున్న
వృక్షమొందు మాత్రము నిల్చె♦విలయ వేళ, విష్ణుఁడు పరుండు వట వృక్ష♦విధముదోఁప.

ఉ॥ మిక్కిలి కాంతిగల్గు నొక ♦ మేటి శిరోమణి భూమిజాత తా
నిక్కడ నావవాలుగఁ బ్రి ♦ యేశున కొందఁగ నిచ్చి పంచె నిం
కొక్కటియేని భూషణము ♦ నొందద యంచుఁ దలంచి సాగరుం
డక్కటికంబుతోఁ బనిచె ♦ నన్నవిధంబువఁ దోఁచె భానుఁడున్ ౬౯౦

చ॥ నవిచిన యవ్వనం బటులు ♦ నాశముచేసి మహత్ప్రతుండు పా
ల్పున విలసిల్లె నొక్కఁడయిఁ ♦ పోఁడిగ లోకములెల్ల గొల్చి ని
ల్చిన జగదీశు పోలికను ♦ క్షీర మహోదధి మధ్యనొప్పు మం
థన నగముం బలెం బ్రళయ♦దాహ రుషానల నేత్రు నైవడిన్. ౬౧

శా॥ ఈలీలన్ వనమెల్లఁ గూల్చి హనుమం ♦ డేపారు నవ్వేళ దై
త్యాలోలాక్షులు లేచి హా యనుచు న ♦ త్యంతంబుగా నుల్లముల్
ప్రీలన్ మేరువుబోలె నిల్చు నతనిన్ ♦ వీక్షించి ఏఁడెవ్వఁడే?
బేలా! కాంచితి వేమి? యన్నఁ గని పృ ♦ థ్వీజాత దానిట్లనున్.

చ॥ కొడిమెలు సేయు రక్కసులు ♦ కూడని మాయలు చేయుచుండ నా
చెడుగరులే యెఱుంగ మఱి ♦ చెప్ప సమర్థులు గాక యన్యులున్
నుడువ సమర్థులే? మునుపు ♦ నూల్కొని దైత్యుఁడు జింకయై కనం
బడ వలదంచు లక్ష్మణుఁడు ♦ పల్కిన సత్యమ యంచుఁ గోరెతిన్. ౬౩

చ॥ అని జనకాత్మజాత పలు ♦ కాడఁగ ఱొమ్ములు మోఁదికొంచు న
వ్వనితలు నేలయుం జదలు ♦ వారిధులున్ వడఁకొందఁ బాఱఁగా
హనుమయుఁ జెంత స్వర్ణమయ ♦ మై పొలుపారెడు హోమ మండపం
బును గని దీనిఁ గూల్తునని ♦ పూనికఁ జేతులు సాఁచి పట్టుచున్. ౬౪

సీ॥ కనులఁ జూడను గాదు ♦ కాలు వెట్టను గాదు, స్తంభముల్ లెక్కింపఁ♦దరముగాదు
నిసులందు జీఁకటుల్ ♦ నెఱయవు ధరణియుఁ, గడఁగి మోయుటయన్నఁ♦గానిపనియె
యాకాశమంటు హే♦మాద్రియు సిగ్గిలి, మదినొచ్చి వుండగు♦మాడ్కిఁ బెరిఁగి
క్రమముగా వర్ధిల్లి♦కళల సంపాదించి, దుగ్ధంబుఁబోలు కాం♦తులను కురియు
తే॥ శీతకరుఁ దాఁకు కందను ♦ చీఁకటులను, వారి తినునట్లు వింశతి♦బాహునాజ్ఞ
బ్రహ్మదేవుండె స్వయముగా ♦ బంగరు గొని, మానుగాఁ గట్టినట్టిదా♦మండపంబు.

సీ॥ స్తంభంబులెల్ల ర♦త్నమయంబులగుఁ జుట్టు, ప్రక్కలు ముత్తెమ్ము♦స్వర్ణ తార
మయములు వెనుక సం ♦ ప్రథిత మహోపల, మయములు రవికిని♦మండనములు
దశకంధరుఁడు మున్ను♦తారాద్రి నెత్తుట, విన్న మారుతి యది♦వెలితి పఱుప
మేరువునే తోఁడి♦మీఁదికెత్తినయట్లు, దీర్ఘ బాహులతోడఁ♦దివిరి యెత్తి
తే॥ లంకపై వైచె మేడలు♦క్రుంకె నిప్పు, మిడుఁగుఱులు లేచి కొన్నింటి♦నడరి కాల్చెఁ
బూఁడి బ్రమ్మగిరి కొండఱు♦పొలసుదిండ్లు, చెడుగరులకు వచ్చెడునవి♦చెడుగులెకద!

సీ॥ అయ్యశోక వనంబు♦నరసి కాపాడెడు, షడ్మతుదైవతములు♦సాశ్రుపూర్ణ
ముఖపద్మములవస్త్ర♦ములతోఁ దుడిచికొంచు, దుఃఖాగ్ని♦మనసులఁ♦ద్రొక్కి కాల్ప
వ్రీలి నెత్తురు కాఱు♦పెను దేహములతోడఁ, దడఁబడి పెనఁగు పా♦దములతోడఁ
బురమెల్ల గగ్గోలు♦పొరయ రోదించుచుఁ, బరుగున రావణా♦సురుని దఱిసి

తే॥ చరణములఁ బడి దానవ♦సార్వభౌమ! వనము నేఁడు కావఁగలేని♦వారమైతి
మొక్కవెనుకోఁతియారామ♦మూఁడ్చివిఱువ,నగ్గిఁబడువస్త్రముంబోలె♦నవిసెఁద్రుంటిని.

కవిరాజ. పలుకఁగఁ దేలికయా పని గాదిది ♦ పాద కరంబులతోఁ గసవున్
నలుసులు దూసియులే కఱునట్టు లో ♦ నర్చె మహో క్రతు మండపమున్
బెలుచ నగల్చి వెసన్ విసరెం బుర ♦ వీథుల మేడలు కొన్నియ పో
నిలువ సమస్తము నాశమొనర్చె వ ♦ నేచర మర్కట! యిక్కరణిన్.

చ॥ అనవిని రావణుండు పరి ♦ హాసముతో నొకకోఁతి చొచ్చి యా
కనక తరూత్కరంబుఁ గడఁ ♦ కన్ విదళించి మఖాగ్నిశాల భూ
మిని పడఁద్రోచి గొప్ప కడి ♦ మి న్నగరంబును కాడుసేసెనే?
దనుజుల పేర్మిమెచ్చఁదగుఁ! దప్పి వెడంగులు నిట్టు లందురే? ౧౯౯

చ॥ అనవుడు వారలిట్లనిరి ♦ యయ్యరో! యాప్లవగంబు మేను మో
చిన ధరణి న్నుతింపఁదగు ♦ శిష్ట గణార్చితులౌ త్రిమూర్తులం
దున నొకఁ డీతఁడన్న నది ♦ తోఁచును న్యూనతగాఁగ నక్కపీం
ద్రుని కడిమిన్ గణింప నెవ ♦ రుం బనియేమిఁకఁ గాంచ నేర్పరున్.

ఉ॥ ధారణి చీలి యానెఱియ ♦ దండడిఁ గంధి జలంబు నిండ ది
గ్వారణముల్ సురాసురులు ♦ కక్కిఱిబిక్కిఱిగాఁగ దైత్యనా
రీ రమణీయ గర్భములు ♦ వ్రీలఁగ రోదసి బూరటిల్ల న
మ్మారుతి హుంకరించె దశ ♦ మస్తకుతో నటు వారు పల్కఁ దో.

౬. కింకరవధ పటలము. (౬౧)

చ॥ కులగిరి గహ్వరంబున న ♦ ఘోర మహాశని పాత ఘోషమున్
జలనిధి ఘూర్ణనంబు శివ ♦ చాప విదారణ భీషణారవం
బిల సరిపోలు నారుతి న ♦ మిద్ధ మణీమయ శీర్షక స్ఫుటా
కలిత దశాస్య మస్త దశ ♦ కం బదరన్ వడిఁ జొచ్చె వీనులన్. ౨౦౨

మ॥ చిఱునవ్వించుక యోర్వలేమి యలమం ♦ జింతించి యాకోఁతి యం
బరవీథిన్ మఱి యెట్టులుం జనని కే ♦ వన్ జుట్టుముట్టాడి దు
ర్భరమా పోరొనరించి యేని త్వరగా ♦ బంధించి తోతెండు పొం
డురవా సేనలతోడ నంచు సుభట ♦ వ్యూహంబులం బంపఁగన్. ౨౦౩

తే॥ శూల కుంత తోమర భిండి♦పాల ముసల, పరశు పట్టిసాదులఁ దాల్చి♦కఱకుసోఁకు
మూఁక లయకాలమున వార్ధి♦పొంగి లేచు, కరణి నడరి బయలు దేఱెఁ♦గపిని పట్ట

సీ॥ అలంబువేరు వి ♦న్నంత మద్యముకంటె, నతిశయోత్సాహంబు♦నందువారు
అడవికంటెను వరపైన వారలు పెను, ఘోషచే జడధికి♦గొప్పవారు

గిరికంటె నున్నత♦వర దృఢ దేహులు, యశమున నాకస♦మందువారు
దేవదానవకీర్తి ♦ దీధితులను తమ, హుంకృతిచేతనే ♦ యూర్చువారు

తే॥ స్వల్పవైరంబు నిర్లక్ష్య ♦ సరణి విడుట, యాపదలకు మూలంబని ♦ యరసి దాని
కోఁతివలనఁ దీర్చుకొనఁగఁ♦గుందిసిగ్గు, పడినహృదయంబు గలవారు♦ బాహుబలులు.

సీ॥ కత్తులు గలవారు ♦ కవచముల్ గలవారు, వీరచిహ్నంబుల ♦ వెలయువారు
వసుధ నడఁగ ద్రొక్కు ♦ పదములు గలవారు, కడలనంటెడు కేలు♦గలుగువారు
గగనమంటెడు మస్త ♦ కంబులు గలవారు, కాళ్లతో నులలను ♦ గడపువారు
పిడుగులకంటెను ♦ పెడబొబ్బ గలవారు, వారి కరుల ద్రిమ్మంగు ♦ నోరివారు

తే॥ క్రొన్నెలంబోలు కోఱలఁ ♦ గొఱలువారు, గుణకిణాంకిత భుజులు మా♦ర్గణ నివిష్ట
పాద పాణి వక్షఃస్థల ♦ భాగులైన, వారు దివ్యభూషణముల ♦ నఱలువారు.

ఉ॥ కేల గదాది సాధన వి ♦ కీర్ణ మయూఖము లెండగాయఁగా ।
లీలగఁ బోవలేమి నద ♦ లించుచు బొండని త్రోవ ముందు వా
రేలొకొ సాగరంచు బయ ♦ లీదుచు నూకుచుఁ ద్రుళ్లి నేలకున్
వ్రాలుచు నట్లు వ్రాలుటకు ♦ వైనము లేక శ్రమంబు నొందుచున్.

ఉ॥ సాధనముల్ తటిత్తులుగఁ ♦ జాపము లింద్ర శరాసనాలుగాఁ
గ్రోధముతోడి యూరుపులె ♦ ఘోరమరుత్తుగ మేనులెల్ల ధా
రాధర పంక్తిగా నడరి ♦ రక్కసి మూఁక యుగాంతకాల పా
థోధరపాళి తారసిలు ♦ తోయమునం జనుదెంచె నత్తఱిన్　　౨౦౮

చ॥ సురుచిర భూజయుక్తమయి ♦ శోభిలు నివ్వని నెల్లఁగూల్చి భా
స్వర మఖ మండపంబు నొగిఁ ♦ బగ్గము పాడుగఁ జేసినట్టి దొం
టరియగు కోఁతియట్టె! విక ♦ టంబుగ నున్నది నిర్జరారి వి
స్ఫురదురు శౌర్యముల్ మన య ♦ శోవిభవంబులు గాల్పనే యిఁకన్ ?

మ॥ అని అంపిల్లుచు నాయుధ ధ్వనులు శిం ♦ జారావముల్ సింహ గ
ర్జనముల్ దంతుల ఘీంకృతుల్ తురగహే ♦ షల్ గూడి పెన్ మ్రోఁతయై
శనరన్ దర్జన భర్జనంబులఁ గపిం ♦ దట్టుండు కొట్టుండు చం
పినఁ జంపుండని యార్చి రయ్యమర వి ♦ ద్వేషుల్ వడిం బోవుచున్

సీ॥ వీథులలోఁ జన♦వెరవింతగానక, యెగసి మింటనె పోవ♦నెగడువారు
బొమలు విండులు నొక్క♦పోలికగా వంచి, పొగయు నిట్టూర్పులు♦పుచ్చువారు
ఒకరి నొండొకరు త్రో♦చికొని ముందేగుట, గని వీరుఁడే! యని♦కనలువారు
లంకలోఁ దమకుఁ బో♦లఁగఁ జాలినంత తా, వమరదే యని పెద్ద♦యఱచువారు

తే॥ తూణములనుండియమ్ములు♦దూయువారు,నొఱలనుండికత్తులనూడ♦బెఱుకువారు
నెఱసి చోటింత లేక క్రి♦క్కిఱియువారు, కుటిలదంతముల్ పటపట♦గొఱుకువారు.

సీ॥ అల్పతపస్సులౌ ♦ నవాలులు ♦ పోరఁగలేక, పాఱుచో నవ్విన ♦ వారువీరు
ధనదుని కీర్తి పాఁ ♦ తఱవేయ నలకను, పాడొనరించిన ♦ వారు వీరు
దురము సేయుట లేక ♦ దురద పుట్టిన కేలఁ, బోరుగోరి తిరుగు♦వారు వీరు
పూర్వయుద్ధంబుల♦ముక్కాఁకలం దీఱి, వీరమద్దెలఁ గొన్న♦వారువీరు
తే॥ కొండలం బలెఁ జలియింప♦కుండువారు, సమరదోహలులు కృతాస్త్రు♦లమరవరులఁ
బెక్కుసారులు గెల్చిన♦వీరవరులు, పుడమి నడుము విఱుగునట్లు♦నడచినారు.

ఉ॥ కొండలఁ ద్రోయుఁ డన్న వసిఁ♦గుంభిని గూలఁగ ద్రొక్కుఁడన్న మా
ర్తాండుని నేల కీడ్వుఁడన♦నబ్ధములన్ వెసఁ బిండుఁడన్న నొ
క్కండొకఁడే సమర్థుఁడయి♦క్రాలు మరుత్సమ వేగవంతు లు
ద్దండబలుల్ రణక్రమ వి ♦ దగ్ధులు సాహస శౌర్యధుర్యులున్ ౨౧౩

ఉ॥ పాదరజమ్ము స్వర్గపుర ♦ వాసుల కన్నులుగప్ప శౌర్యమే
మోదము తోడ రూపమును ♦ పొందిన చందము దోఁప మత్త నా
గాదన సంఘముం బలెను ♦ వ్యాఘ్ర కదంబమువోలె నీల మే
ఘోదయ మట్లు దైత్యులు మ ♦ హోద్ధతి నేగిరి బాణవేగులై. ౨౧౪

చ॥ మిడుఁగులు కన్నులం దురల ♦ మిక్కిలి యూర్పుల ధూమ మొప్పఁగాఁ
దొడిబడు నాయుధంబుల ద్యు ♦ తుల్ మిఱుమిట్లు గడింప రక్కసుల్
పిడుగులఁ బోలె నార్చుచున ♦ వీఁకున నుబ్బుచు గంతులేయుచున్
సుడిసిరి చూచి పాడగు న ♦ శోక వనంబు మనంబు కాద్పడన్. ౨౧౫

ఉ॥ భానుఁడు పూర్వచర్య మదిఁ ♦ బాఱఁగ భీతిలి మింటఁదాఱఁగా
మానుగ రేఁగి వర్ధిలిన ♦ మారుతి కాహళ తూర్య శంఖ భే
రీ నినదంబు మ్రోఁగ విని ♦ రేఁగి నిశాచరు లాజి సేయఁగాఁ
బూనిక వచ్చుచుండుటలు ♦ పోలునటంచుఁ దలంచి మోదిలెన్.

చ॥ వనమును గూల్చుచే తగిన ♦ పద్ధతియంచుఁ దలంచె మున్నె యా
పని యనుకూల మార్గమును ♦ పట్టుటచేఁ బెనుపోరు గల్గె నీ
దనుజుల తోడ నియ్యదియె ♦ త్రాఁ దలపోసిన వైనమాట నె
మ్మనమున మోదమంది హను ♦ మంతుఁడు వారలఁ గాంచెఁ దేఁకువన్.

చ॥ పగటనె రాత్రి తోఁచు చెలు ♦ వంబగు నల్లని సోఁకుమూఁక యా
పగతుఁడు వీఁడె వీఁడె వెసఁ ♦ బట్టుఁడు కొట్టుఁడు కట్టుఁడంచుఁ దెం
పుగ నటుచొచ్చి వాఁడిమియుఁ ♦ బోఁడిమి వెల్వడ నార్చిరెల్ల భూ
గగన ధరాధరంబులును ♦ కంధియు లంకయు బిట్టు కంపిలన్. ౨౧౮

సీ॥ జలనిధి బెడిదంపు ♦ టులివు కీడ్పడ శంఖ, భేరీరవములు గా ♦ వించువారు
గుహలఁబోలిన నోళ్లు♦రహిఁ దెఱచినవారు, పొగ రేఁగు చూపుల♦నెగడువారు

భుజగేంద్రు మెడయును♦భుజము లొక్కటిగాఁగ, నడఁగంగఁ బుడమిపై ♦నడచువారు
బహువిధాయుధ మహా♦ప్రభలు వంశాటవి, నలమినగతి వెల్గ♦నడరువారుఁ

తే॥ గసిమసంగి యాలము సేయఁ♦గడఁగినంతఁ, బావనియు నొక పెనుపాద♦పంబు మిత్రు
పగిదిఁ గని కేలఁదాలిచి♦వాలి కడలి, నడిమి మందరమన వారి♦నడుమ నిల్చె.

ఉ॥ కొండల ప్రీల్చునట్టి పిడు♦గుల్ నహితంబు వడంకఁ పోటు దో
ర్దండ బలంబునం దరు వ ♦ రంబున రక్కసి పిండుఁ దాఁపఁగాఁ
గొండలు వాఁగులం బలెన ♦ కొండలఁబోలు భుజాలు వ్రచ్చి యం
దుండి మహాస్త్ర ధార లిల ♦ నోడిగిలం బడి చచ్చి రక్కలున్. ౭౧౦

తే॥ కొండ లతనిపైఁ గ్రైదువుల్ ♦గూర విసరి, పొట్టలవియఁబండ్లనుపోవ♦ మొగము లగలఁ
ద్రొక్కఁబడి రక్తమాంసముల్ ♦దుక్కిగాఁగఁ, జదిసి రూపఱఁ జచ్చి రా♦స్థలమునంద

చ॥ ఒరపిడిచేత రాఁజిన మ♦హోజ్జ్వల వహ్ని యెసంగి వెంట్రుకల్
చుఱచుఱఁ జూఁడఁ గంఠములు ♦ స్రుక్కఁగ గన్నులువోవ మూఁపులున్
విరవిరవోవ వీఁపులును ♦ ప్రీలఁగ నిట్టటు వోవలేక దు
ర్భరమగు తాపముం బొరసి ♦ పాసిరి కొందఱు జీవితంబులన్. ౭౧౧

క॥ అక్కనఁ దన్నఁగ నెత్తురు, గ్రక్కుచు ఱొమ్ములును పగుల♦బాహులు విఱుగన్
స్రుక్కుచు విలవిల వోవుచు, ముక్కుచుఁ గొందఱు నలంగి ♦ ముగిసిరి శోఁకుల్.

ఉ॥ పొందుగఁ జెంతఁ గానఁబడు ♦ భూధ్రము మీఁదికి వైవ నందుచేఁ
గొందఱు నాకలోకమునఁ♦గొందఱు గుహ్యక పట్టనంబునన్
గొందఱు వ్యోమమందు మఱి ♦ కొందఱు సందరమందుచేరి యే
చందమునన్ నివర్తిలఁగఁ♦జాలక యీల్గిరి పోవ్రు త్రోవలన్. ౭౧౨

తే॥ కాళ్లుచేతులు విఱిచి య♦క్కడనె వైవ♦ తెక్కలూడిన కొండల♦రీతిఁబడిరి
తివిరి వాలంబునం జుట్టి♦త్రిప్పివిడువ, గిరగిరం దిర్గిఁ దుర్విఁ బొం♦గరములట్లు.

ఉ॥ కొందఱ ఖడ్గముల్ విఱిగెఁ ♦ గొందఱ చాపగదాదు లుక్కలెన్
గొందఱ బాహువుల్ తెగియెఁ♦గొందఱ మోములు నల్గి రూపఱెన్
గొందఱ పండ్లురాలె మఱి ♦ కొందఱ కాళులువోయె మధ్యముల్
కొందఱ కుక్కె నెమ్మొకలు ♦ కొందఱకుం బొడియయ్యె నయ్యెడన్.

ఉ॥ కొందఱ చర్మముల్ చినిఁగెఁ ♦ గొందఱ వర్మము శీర్ణమయ్యె వే
కొందఱ మేలు చీలె మఱి ♦ కొందఱ దేహము లయ్యె నజ్జుగాఁ
గొందఱ మస్తముల్ చిదిసెఁ♦గొందఱ కాయము లయ్యె బజ్జిగాఁ
గొందఱ గాత్రముల్ మునిఁగెఁ ♦ గ్రొత్తగ నొత్తిలి పాఱు నెత్తురన్.

సీ॥ కాలఁ గొందఱ రాఁచి♦ కేలఁ గొందఱఁ దాఁచి, వాలుతోఁ గొందఱ♦వైచి వైచి
చూపులఁ గొందఱఁ♦దాఁపులఁ గొందఱ, రాపులఁ గొందఱ♦వ్రాల్చి వ్రాల్చి

లాగి కొండఱఁబట్టి♦మేఁగి కొండఱఁ జుట్టి, సాఁగి కొండఱఁ గిట్టి♦చదిపి చదిపి
తరువులఁ గొండఱఁ♦ఖరువులఁ గొందఱ, బరువుల గొందఱ♦నుఱిచి నుఱిచి
తే॥ వారి యాయుధముల తోడ♦వ్రచ్చివ్రచ్చి, పేర్చి యొకనిపై నొక్కని♦వ్రేసివ్రేసి
కఱచి విఱిచి నులిమి ఉక్కి♦చఱచి చెఱచి, తిరిగి పఱచి రాకాసులఁ♦దివిరి చంపె.

ఉ॥ తాఁకినవారిఁ దాఁకుచును♦దాసిన సోఁకుల మూఁక దాయుచున్
నూఁకిన వారి నూఁకుచును ♦ నూర్చిన వారలఁబట్టి నూర్చుచున్
దూఁకిన మీఁద దూఁకుచును♦తూల్చిన దైత్యులఁ గొట్టి తూల్చుచున్.
గాఁక నెదుర్చు వారలను ♦ గాఁక నెదుర్చుచుఁ గూలఁద్రోయుచున్.

చ॥ మఱిఁగినఁ జంపు దాఁకినను ♦ మానకచంపుఁ దలంపఁ జంపుఁ గ
న్నుఱిమినఁ జంపుఁ బైకెగుర ♦ నుప్పరమందును చంపుఁ బాఱినన్
దొలఁగినఁ జంపుఁ దూకొనిన ♦ తోడన చంపు వియత్పథంబునన్
దఱిమినఁ జంపుఁ దార్కొని యు ♦ దగ్ర మహాగ్రహ భీషణాకృతిన్.

చ॥ మొదడును క్రొవ్వు మాంసము స ♦ మిద్ధర రక్తముతోడఁ బంకమై
నదులుగఁ బాఱి యెల్లెడఁ గ ♦ సంబడ లంకయె వాయుసూను బె
ట్టిదమగు పోటుచే వెత ఘ ♦ టింపఁగ రక్తము బొళ్కు బొళ్కు మం
చదవద గ్రక్కుచున్నదన ♦ నయ్యె రణస్థితియే యఘోరమై. ౨౩౧

చ॥ కరములఁబట్టి వాలమునఁ ♦ గట్టి పదంబులఁ దన్ని నెవ్వడిన్
దరువుల పైకి వ్రేయఁ బడి ♦ దైత్యులు గానుగ లోని యించు వై
ఖరిని నలంగి పాలవలెఁ♦గాఱిన రక్తము పాఱి సంద్రమున్
గరగను నించి చుట్టు నధి ♦ కంబుగఁ బొంగె సురాళి మోదిలన్.

చ॥ అసురుల దేహముల్ విసర ♦ నంబరవీథిని పోయి టెక్కెముల్
కొసరి చలించు మేడలును ♦ గోపురముల్ వర మండపంబులున్
వసుమతిఁ గూలఁజేసినవి ♦ వారణరాజములన్ నలంచె ర
క్కసులను మోఁదె గుఱ్ఱముల ♦ గాత్రములన్ ధరఁజేర్చె నజ్జగన్.

ఉ॥ కొందఱ వారియిండ్లఁ బడఁ ♦ గూల్చెను వారల మేను దూదిగాఁ
గొందఱ వైచె వారి యెల ♦ కూనల వారి నరాజి త్రుంపగాఁ
గొందఱనిచ్చె భార్యలకుఁ ♦ గ్రొత్తగఁ బెండిలియైన వారికిన్
గొందఱనిచ్చె దారకులు ♦ గోరిన వారికి వారి తండ్రులన్ ౨౩౪

చ॥ అరుగులమీఁద నిండ్లవయి ♦ నంగడి వీథులయందు దొడ్లలో
దొరువులయందు వాడల చ ♦ తుష్కములన్ నడుత్రోవలందు నం
బరమున మూతులన్ దిగుడు ♦ బావులఁ బెద్ద జలాశయంబులన్
శరనిధియందు నిండె శవ ♦ సంచయ మా హనుమందు వైవఁగన్.

ఉ॥ వాలి మరుత్సుతుం డొకఁడె ♦ వారక దైత్యులఁ గూల్చుచుండఁగాఁ
గాలుఁడు వాని కింకరులు ♦ కాళులు నొవ్వఁగ మోచు ప్రాణముల్
నేలను వాయు మేఘ రజ ♦ సీకర భాస్కర మండలంబులం
దోలిని నిండె వ్యోమచరు ♦ లోరకు నోర కొమంగుచుండఁగన్. ౨౩౬

తే॥ బవర మిట్లుసాఁగఁగ మతి♦భ్రష్టులైన, వారిపై ఖడిఁ గోపించి♦వాఁడిసముల
భాతిఁబర్విన రాక్షస♦వరుల నడుమ, మారుతసుతుండు వూర్తండు♦మూర్కినండె.

తే॥ వ్యాపన ముఘూర్ణనంబురా-వంబునల్లఁ, దనముతో మీాలఁబోలుకుం-తములు మెఱయు
కతనఁ గర్బురుల్ సంద్రంబు♦కరణినుండ, నడుమ మందరమట్లు వా♦నరుఁడు తిరిగె.

తే॥ దండఁజేరి చచ్చిన సోఁకు♦పిండు నడుమ, నమృతముంగొనివచ్చుచో♦నహులు వెంట
నంట నడుమనుండిన విహ♦గాధినాథుఁ, బోలియుండె నభస్వత్సు♦పుత్త్రుఁ డచట.

క॥ దనుజ సముదయము లిభముల, యనువున వర్తిల్లి నడువ♦నాతఁడు తద్వా
రణ మస్తక మస్తిష్కం, బును గొను కేసరి కిశోర♦ముఖ్యత నొప్పెన్. ౨౪౦

సీ॥ వైచుటచేతను ♦ వీచుటచేతను, కొట్టుటచేతను ♦ కోఁతచేతఁ
గ్రుచ్చుటచేతను ♦ వ్రచ్చుటచేతను, పొడుచుట కతమున ♦ విడుచుకతన
నఱుముట వలనను ♦ తఱుముట వలనను, తొలుచుటవలన మే ♦ లొలుచువలనఁ
జీల్చుటం జేసియు ♦ వ్రాల్చుటంజేసియుఁ, బట్టుకతమ్మున ♦ నెట్టుకతనఁ

తే॥ గలిగినట్టి హనుమ మేని♦గాయములకుఁ, గొలతయిడరాదు లెక్కింప♦నలవికాదు
రాక్షసులు నేయు భీకరా♦రవముకంటెఁ, బొగడు వేల్పుల రవము లె♦మిగుల నెగడె.

తే॥ ఆయుధంబులు పెక్కుకో♦ల్పైనవాని, వలనఁ గల్గిన పెనుగాయ♦ములును వేలు
పులునుత త్కాంతలునుచల్లు♦పువ్వులును, భేద మెనయనియనువున♦ వెలయుచుండె.

క॥ తిరుగుటచే నెగయుటచే, నఱకుటచే దూఁకుకతవ ♦ నసురులు పొలివో
యిరిగాని హనుమ శ్రమలం, బెరసియుఁ జెమరుపఁడు నూర్పు♦విడువఁడు పెలుచన్.

ఉ॥ రాక్షసరాజు పంపఁగ గ♦రాదుల పోలికఁ బోరికేగు వా
రీక్షణ నేయుచుండ నశి ♦ యించుట గానము నిన్నదాఁక నా
దక్షులు చచ్చి స్వర్గము ము ♦ దంబునఁ జెందిరి కాని యోడ రా
నీక్షితి వారిఁబోలు మగ ♦ లెవ్వరు కల్గరు కల్గరారయన్ ౨౪౪

మ॥ అనికిన్ వచ్చినవార లీల్గుట వనా ♦ ధ్యక్షుల్ పరీక్షించి ముం
దునకుం జంకెనకాళ్లు వెన్కకు దడం ♦ ద్రోవంగ నీడ్వంగఁ గ్ర
న్నన రక్షఃకుణపాళిఁ ద్రొక్కికొనుచున్ ♦ జన్దెంచి దైత్యేశ్వరుం
గని భీతిం బలుకాడకే వణఁకునన్ ♦ గైసన్నతోఁ దెల్పఁగన్. ౨౪౫

శా॥ వారల్ పొందిన భీతియే తనకుఁదె ♦ ల్పన్ సర్వవృత్తాంతమున్
ఘోరప్రేక్షణుఁడై కనుంగవల న ♦ గ్నుల్ గ్రక్క దైత్యేంద్రుఁ డా

ఘోరం గింకరవర్గముల్ మడిసెనా? ♦ పోరాటముం మానెనా?
పాఱంజొచ్చెన? యేమి యయ్యె? ననుచుం♦ బ్రశ్నింప నవ్వారలున్. ౨౮౮

తే॥ వారు బెగ్గిలి పాఱిన♦వారుగారు, ప్లవగ మని యలక్ష్యంబున ♦ వదలలేదు
తెలిసి కల్లసాక్ష్యంబిచ్చు♦మఁలుచకోలము, మాటిక్కఁ గోఁతిచే వారలు♦మాఁడిరనుచు.

మ॥ తనయాజ్ఞన్ దరిఁజేరి సేవ లను వొం ♦ దం జేయు దిక్పాలురం
గని లజ్జించుచు రావణుండు వన ర ♦ క్షాదక్షులం గాంచి కూ
రిన చండం బిది యంచెఱుంగక విచా ♦ రింపంగఁ బ్రాల్మాలి నో
రను వెల్వడ్డదియెల్లఁ బేలెదరె దు♦ర్భ్రాంతాత్ములై ముంగలన్. ౨౮౯

తే॥ అనుడు వా రడలున నేమి♦యనఁగలేక, వడఁకుచు న్నిల్వ కోఁతి యీ♦పగిదిచేతఁ
మీరు విన్నదా? కన్నదా? నీరునమల, కంతయును దెల్పఁగోరెద♦ననఁగవారు.

ఉ॥ ప్రక్క కొదింగి నిల్చి భయ ♦ భావమునం దనువుల్ కుదించి నేఁ
డక్కట! నేమిసెప్ప దను ♦ జాధిప! కోఁతియొకండె కింకరుల్
క్రిక్కనకుండఁ జావ నొక ♦ వృక్షముకైకొని త్రిప్పి త్రిప్పి య
మ్మక్క! సమస్తముం జదిపి♦యచ్చట నున్నది పాఱ దెయ్యెడన్. ౨౯౦

—: జంబుమాలి వధ పటలము :—

మ॥ వనపాలోక్త విధానము న్విని న దే ♦ వద్వేషి కోపించి క్ర
న్నన బిట్టార్చుచు జంబుమాలిఁ గని సై ♦ న్యశ్రేణితో నేగి కో
తిని గర్వం బడఁగించి పట్టుకొని వే ♦ తెమ్మిట్లు నాప్రోలకున్
ఘనమోదంబును నాకుఁ గూర్చు మిది నీ ♦ కార్యంబనన్ దైత్యుఁడున్

ఆ॥ మ్రొక్కి లెక్కలేని♦మూఁకలో నన్ను నీ, పనికిఁ దేర్చిపంపు♦భాగ్యమొదవె
ధన్యుఁడైతి ననుచు♦దైత్యకోపంబెరూ, పొందెననఁగ నేగె♦యుద్ధమునకు

మ॥ తనసైన్యంబులతోడఁ బం క్తిముఖుఁ డొం ♦ దం బంపు సైన్యంబుతో
జనకుండంపిన సేనతోడను సుహృ ♦ త్సైన్యంబుతో నేగి నేఁ
డని సేయంగల భాగ్యమబ్బె నను న ♦ త్యానందవృత్తిం బ్రహ
స్తుని పుత్త్రుండగు జంబుమాలి నడచెన్♦దోషాటు లగ్గింపఁగన్ ౨౯౩

సీ॥ పిడుగుల మొగుళులఁ♦బెనచి ప్రాణముపోసి, నిలిపెనా నొప్పు న♦నేకపములు
ఊఱుములు మెఱుములు♦నొక్కటిగాఁ జేయఁ, బరఁగిన వననొప్పు♦నరదములును
గాలిని నాలుగు♦కాళ్లుగా నొనరించి, ధరనిల్పె నన నొప్పు♦హరి చయములు
వజ్రంబు వినుము వ్యా♦ఘ్రప్రవృవులు గాఁగొని, క్రాలిన వననొప్పు♦కాల్బలములు

తే॥ గుహలనుండి పులులు వచ్చు♦కొవుదోఁప, ఖడ్గ శర శరాసన తూణ♦ఘనగదాది
సాధనంబులు మెఱయంగ♦జంబుమాలి, సైన్యములు సాగె మేదినీ♦చక్రమదర.

తే॥ చిఱుకటారు లీఁటియలును ♦ సిడము లంబు, దంబు నొరయుంగనైన రం ♦ ధ్రములనుండి
కాఱు జలములు రజముతోఁ ♦ గలిసి స్రవణము, లందుగాఱు రక్తంబునా ♦ నతిశయిల్లె.

తే॥ నేమిరవములు శంఖధ్వ ♦ నియుఁ దురంగ, హేషణములు వివిధ వాద్య ♦ ఘోషణములు
కింకిణుల విండ్లరుతులు ఘీం ♦ కృతులు మిగులఁ, గలిసి వేల్పుల పలుకుఁ ♦ గలఁత పఱిచె.

తే॥ కనకమయమైనలంకాన ♦ గరము ప్రిదిలి, యెగురు ధూళిపైఁబడఁ గొండ ♦ లెల్ల స్వర్ణ
గిరిని పోలెను తక్కిన ♦ పురవరములు, నాక లోకంబు బోలి వి ♦ న్నాణమొందె

తే॥ రక్కసులసేనఁ బదివేల ♦ రథములుండె, వాని కినుమడియై యుండె ♦ వారణములు
వానికిమ్మడియై యొప్పె ♦ వారువములు, వానికిబ్బడి యయ్యె గా ♦ ల్బలములెన్న.

ఉ॥ అందఱు నాఱితేఱిన మ ♦ హాహవ యోధులు మాయలందు పే
రందినవారు నేత్రముల ♦ యందు మహోగ్రత చూపువారు చే
వం దనరారువారు తత ♦ వక్షములం గవచంబు దాల్చినా
రెందును సాటిలేని విజ ♦ యేందిరఁ జేకొనినారు నిచ్చలుౕ.　　౨౫౯

తే॥ వారణారోహణక్రియా ♦ ప్రథితు లస్త్ర, శస్త్రవిద్యాప్రవీణులు ♦ చతురమతులు
వ్యూహనిర్మాణచతురులు ♦ సాహసులును, నిర్భతివంశ్యులు తరణి స ♦ న్నిభులువారు

తే॥ రథగజాధిరోహకులశి ♦ రంబులపయి, నెగిరిపోవు మనోవేగ ♦ మెనయువార
లాశ్వికులు వారిగుఱ్ఱమ్ము ♦ లట్టివయగు, వివిధగతులనెఱింగిన ♦ జవనహరులు.　౨౬౧

చ॥ అరయఁగ జంబుమాలి చతు ♦ రంగబలంబులు చుట్టిరాఁగ ని
ర్జరులు భయంపడం గనలు ♦ చంద్ర మిడుంగుఱు లట్లు వెల్గఁ బె
న్నరదము మీఁదఁ గొండవలె ♦ నాతఁడు గ్రాలఁగఁ గంకటంబు పే
రురమునఁ గారుచిచ్చువలె ♦ నుజ్జ్వలమై వెలయౕ వెసం జనెౕ.　౨౬౨

చ॥ రణమొనరింప రక్కసులు ♦ రారొకొ? యేలొకొ తామసంబు ప
ట్టణమున నున్న వీరుల క ♦ డంక నశించెనొ యింతకం చవా
రణగతి మారుతాత్మజుఁడు ♦ క్రన్న నశోక వన ప్రధాన తో
రణ ముఖసీమ దానవుల ♦ రాకఁ బ్రతీక్షణ సేయఁగాఁ జనెౕ.　౨౬౩

చ॥ స్ఫటిక శిలా హిరణ్మయ వి ♦ భాసుర సౌధ విశేషకాంతి చీఁ
కటులఁ జెదర్పఁగాఁ జకచ ♦ కల్ గల రత్న మయూఖ జాలకం
బటనట వన్నెచిన్నె లెస ♦ లారఁగ మారుతి యందుఁ దోఁచెఁ జొ
క్కటమగు వేవెలుంగు వడు ♦ కంధిని భాసిలఁ దోఁచు రీతిగౕ.　౨౬౪

చ॥ పిడుగులతోడ మేఘములు ♦ ప్రేలఁగ సంద్రము కొందలింప ము
ప్పడరిన దంచు పర్వత గు ♦ హాంతర సీమల సర్పముల్ విసం
బెడలఁగఁ గ్రక్క రక్కసు ల ♦ హీనభయంబు భజింప వేల్పు పిం
డడలఁగ నాంజనేయుఁడు మ ♦ హారవముం బొనరించె నయ్యెడౕ.　౨౬౫

తే॥ దిగ్గజములు విశ్రాంతిఁ బొం♦దెను జముండు, దద్దరిల్లె బుతుంబులు♦ధరణిరాలెఁ
బర్వతంబులు భూమియు♦బ్రద్దలయ్యె, నలఁగెఁ గడలియు హనుమ బా♦హాస్ఫలింప.

తే॥ అంతదైత్యులు కదలి పె♦ల్లార్చి పీన్గు, పెంటలును రక్తవాహినుల్♦పెరిఁగివారి
నాఁక పెట్టుటవలన నా♦హనుమఁజేర, ననువుదోఁపక మిక్కిలి♦యడిచిపడిరి. ౨౬౭

తే॥ జంబుమాలి సైన్యము విభ♦జనముచేసి, రెండుప్రక్కలఁబంపి యా♦దండ తాను
రథికుఁడై దాయ హనుమ వా♦రలనుగాంచి, సంతసింపఁ బూరించె భు♦జంబులంత

చ॥ అమలిన దీప్త దీపశిఖ♦యందమునొంది వెలుంగు నూర్ధ్వ పుం
డ్రముగల ఫాలమే మొదటి ♦ రాణువగా నఖరాజి నిట్ట రో
మములు చెలంగు బాహువులె♦మధ్యమసేనగ వాలు వెన్కసై
న్యముగఁ బొసంగఁ బావనియు♦నాయితమయ్యె రణంబుసేయఁగన్.

ఉ॥ కాహళముల్ చెలంగ నెస ♦ కంబుగ వాద్య విరావమొప్ప మా
యాహవ దోహలుల్ బహు వి ♦ ధాయుధ వర్గము నాంజనేయుపై
నోహరి సాహరిన్ వయిచి ♦ రుద్ధతి నాతఁడు చూచి లోక వి
ద్రోహులు కుందఁ దూల్చె నొక ♦ దోరణగంబముతోడ నన్నిటిన్.

ఉ॥ దోరణగంబమున్ సమర ♦ దోహలుఁడై కొని తాను దిగ్గుటల్
పోరుట గానలేక వెఱఁ ♦ బొందుచు గుంపులు గూడుచున్ విడం
బాఱుచుఁ దాఱుచున్ మరలి ♦ పైకొనుచున్ దిరుగాడు విద్విష
ద్వీరులఁ గాలసద్మమున ♦ విందులుగాఁ జనునట్లు మోఁదుచున్. ౨౭౧

తే॥ ఏయునవి త్రుమ్మునవి యగు♦నాయుధముల, నెడమచేత నలంచుచుఁ♦గుడికరమున
పోరు సాగింప నంజనీ♦పుత్త్రకుండు, దొరలె రథములు గజములు♦తురగములును

తే॥ మోఁదుదిన్న యేనుంగులు♦మీఁదిలెక్క,ములనుదంతములనుతొండ♦ములనుచెవులఁ
గాళ్ల మద జలంబులను ఘీం♦కారములను, కినుకలెల్లను పోఁగొట్టు♦కొనియె నపుడు

తే॥ పీరు లెక్కివచ్చిన రథ♦వితతి నొగలు, ప్రక్కలును శిఖరములు చ♦క్రములు కింకి
ణులునుధ్వజములు వారువ♦ములునునలఁగి, మహిని చెదరిపడియె హనూ♦మంతుచేత.

ఉ॥ కొన్నిటి కుత్తుకల్ దెగియెఁ ♦ గొన్నిటి పొట్టలు వ్రీలెఁ బ్రేవులున్
గొన్నిటి కీఁగెఁ గొన్నిటి య ♦ కుంఠితవేగము గ్రుంగెఁ గాళ్లు వోఁ
గొన్నిటి ముచ్చలే విఱిఁగెఁ ♦ గొన్నిటి యెమ్ములు వ్రస్సె నుగ్గుగాఁ
గొన్ని నశించెఁ గొన్నివడెఁ ♦ గొన్ని యడంగెఁ దురంగబృందముల్

ఉ॥ కొందఱు విహ్వలించుచును ♦ కొందఱు కుందుచుఁ గొంద ఱేడ్చుచుం
గొందఱు దిగ్భ్రమంగొనుచుఁ ♦ గొందఱు పోరుచుఁ గొంద ఱార్చుచుం
గొందఱు పాఱుచుం బొరలి ♦ కుప్పలు గూలుచుఁ జచ్చుచుండఁగాఁ
గొందఱు దవ్వునుండి కని ♦ కొంకుచుఁ జాఱిరి తిర్గిచూచుచున్ ౨౭౬

ఆ॥ కరులచేతఁ గరుల ♦ హరులచే హరులను, గాల్బలములతోడఁ ♦ గాల్బలముల
స్యందనములతోడ ♦ స్యందనంబులఁ గూల్చెఁ, గదనమందు హనుము ♦ కసిమసంగి.
ఆ॥ కాళ్లు తలలు తునిఁగెఁ♦గంధరంబులు తెగె, భుజము లూడిపడియె♦బురదయయ్యె
మెదడు నెత్తు రురలి♦మదగజావళులందు, మునుక వేసి యశ్వ♦మునిఁగిపోయె.
తే॥ దనుజవరులను వక్రదం♦తములతోడఁ, గరులతో విండ్లతోడ ఖ♦డ్గములతోడఁ
గడిమితో గర్జనలతోడఁ♦గఱకుతోడ, నలఁగఁద్రొక్కి చంపెను మరు♦న్నందనుండు.
చ॥ మిడుఁగులు ముందుగాఁ జెదరి ♦ మేఁగ జరించెడు వాయుపుత్త్రుఁ డా
సిడములచెంత నేనుఁగులఁ ♦ చెంత రథంబులచెంత గుఱ్ఱపుం
దడములచెంత ఁబద్గ సము ♦ దాయముచెంత మఱేడఁ జూడ న
క్కడఁ గనవచ్చె నచ్చెరువు ♦ గాఁ గనువారల కుగ్రవేగుఁడై. ౨౮౦
తే॥ కరుల తలలపై వీరవ♦క్షములమీఁద, వారువముల వీఁపులపయిఁ ♦ దేరులపయి
విలయకాలాశనియొ నాఁగ♦వెలసి దుమికె, హనుమ నజ్జునజ్జుగ నవి♦నవసిపోవ.
మ॥ జగతిఁ నిశ్చలరీతి వర్తిలు నృపా ♦ జ్ఞాచక్రముం బోలె ము
జ్జగముల్ పొంపిరివోవు సజ్జనుల వి ♦ జ్ఞానప్రభంబోలె బా
డిగకుఁ దేహము నొప్పగించు ధనచే ♦ టీ చిత్తముం బోలె నా
శుగపుత్త్రుం డెటఁ జూడఁ దానయయి సం ♦ శోభిల్లె రంగస్థలిఁ. ౨౮౧
మ॥ భగవద్భక్తులు సర్వదా హరిని సం ♦ భావించి సారూప్య మొ
ప్పుగ సాధించెదరన్న యర్థమును సం ♦ పూర్ణంబుగాఁ జూపుచుఁ
గగనంబందున ధాత్రియందునను ది ♦ గ్భాగంబులఁ ముందరఁ
దగ డెందంబునఁ గానిపించెను మరు ♦ త్సంజాతుఁ డయ్యెడఁ. ౨౮౩
మ॥ ధ్వజరాజద్రథపంక్తి రథ్యములతో ♦ దాచేత మత్తద్విప
వ్రజముఁ వేఱొకచేత గుఱ్ఱముల ను ♦ గ్రక్రోధుడై పోరు పు
ణ్యజనాళిం బద సంప్రఘాతముల భ ♦ గ్న ధ్వంసముఁ జేసి య
క్కజుఁడై పేర్చె యుగాంతకాల లయ శే ♦ ఖుం బోల్చు రుద్రుండనఁ.
తే॥ చక్రఖడ్గతోమర పర ♦ శ్వథరథాశ్వ, గజ లసచ్ఛత్ర కేతన ♦ కాండమెల్లఁ
గుప్పలై కూలి నెత్తుటఁ ♦ దెప్ప దేలె, పూచి విలసిల్లు పెను జల ♦ పూరమట్లు.
తే॥ దొరకు నాయుధములఁ గొని♦తొడరి యేయఁ, దెగిన తలలును కొండలఁ♦బగులుతలలు
నెగురుతలలు నొండొంటికిఁ♦దగులు తలలు, తటపటాయించె సంగర♦స్థలమునందు.
తే॥ జమునికరణి విజృంభించి ♦జంబుమాలి, కుపితసింహంబు కరిఘటం♦గూల్చుత్రోయ
మిగిలియున్న యూథపమట్లు♦మెఱసి తేనె, వంటి కన్నుల నిప్పుకల్♦వఱలఁ దాఁకె
ఉ॥ పీనుఁగు లడ్డదిడ్డముగఁ ♦ బెంటగఁ గూలిన సంగరస్థలిఁ
జానుగ స్యందనం బరుగఁ ♦ జాలని తీరు నెఱింగి వేఱుగాఁ

బో నెడలేక యుండియును ♦ పోరునకుం ద్వరసేసెం బాప మా
దానవవీరు దుస్థ్సితి వి ♦ ధంబది యొప్పెను శోచనీయమై ౭౮౮

ఉ॥ పూచిన కింశుకాకృతిని ♦ పొల్చిన పావని జంబుమాలితోఁ
జూచిన స్యందనమ్మొకటి ♦ సొమ్ముగ నాయుధ మొక్కటయ్యె నిన్
గాచుట కేగుదెంచిన ని ♦ కాయముఁ గావక యొంటివైతి ని
న్నేఁచుట నీతిగాదు మఱి ♦ యేగుము వీడెద నన్న దైత్యుఁడున్ ౭౮౯

శా॥ కారుణ్యామృతమూర్తి వీ వదియు ని ♦ క్కంబిప్డు నాపైని దై
వాఱం జూపితి మేలుమేలు భళి యె ♦ వ్వాఁడంచు నన్నెంచితో
పోరాటంబున కేను జంకుదునె పో ♦ పొమ్మంచు దర్పించుచున్
గ్రూరాస్త్రంబులు పెక్కులేసి యొడలం♦గ్రుచ్చెం గ్రుధామగ్నుఁడై. ౭౯౦

ఉ॥ మారుతి జంబుమాలిఁ గని ♦ మాయురె యాయుధహీనుతోడ వే
పోర వలంతి వౌదనుచుఁ ♦ బూనిన తోరణ గుంజఁ ద్రిప్పి దే
వారి శరంబులన్ జల క ♦ ణావలి వాయువు దూల్చు లీలఁ బెం
దూరమునం బడంగ వడిఁ♦దూల్చి హసింపఁగ వాఁడు హుంకృతిన్ ౭౯౧

చ॥ అదలిచి తేరు వాయుసుతు ♦ నండకుఁ దోలఁగఁ దెర్వులేమి నం
గదగొని కిన్క వాయుజుని ♦ కాయము మొత్తము నొవ్వఁ గర్కశ
ప్రదరములేసి చేతఁ బొల ♦ పంబగు తోరణగుంజ తున్కలై
చెదరఁగఁ గొట్టె యార్చెఁ గపి ♦ శేఖరుఁ డంతట రేఁగి యుద్ధృతిన్ ౭౯౨

ఉ॥ లెక్కకుమీఱి పైఁబడు శి ♦ లీముఖముల్ గణియింపకోర్చి పే
రుక్కున వాని తేరిపయి ♦ కుప్రగతరాకృతి నుద్గమించి వి
ల్లక్కనుతోడ లాగి గన ♦ యమ్మునఁ గొంతు దగిల్చి నెత్తురుల్
గ్రక్కుచుఁ గూలి చావఁగ స ♦ రాలున నీడ్చెను దోర్బలంబునన్ ౭౯౩

ఉ॥ ఆవలఁ దేరినుండి దిగి ♦ యారథమున్ రథచోదకుం దురం
గావళి నుగ్గునూచముగఁ ♦ గాళ్లనుద్రొక్కి విదిర్చి తోరణ
స్థావరగుంధ మెక్కెను స ♦ దాగతి పుత్త్రుఁడు తీఱువృత్తమున్
గావలివాంఛ్రుడు కాంచి కలఁ ♦ కం జని రంతయుఁ దెల్ప జేనికిన్. ౭౯౪

చ॥ పరుగున శోక విహ్వలత ♦ వచ్చి దువారములందు చూచు న
త్తరుణులు భర్తృదేహముల ♦ దారుణరీతిగ నీడ్చుకొంచు న
త్తరు వఱదల్ రహింపఁగని ♦ దుఃఖము చెందిరి లంకయెల్ల దు
ర్భరమగు నాలగోడుగను ♦ బాలురగోడుగ నయ్యె నయ్యెడన్ ౭౯౫

ఉ॥ ఏగిన కావలీంద్రుడు దను ♦ జేంద్రుని సన్నిధిఁజేరి తెల్పఁగా
వింగుచు వెక్కసంపడుచు ♦ వెక్కుచునుండఁగ భీతియేల ? విూ

రేగతి గాంచినారొ? యన ♦ నిట్లని పల్కిన జంకి వారు దే
వా! గతియించి రెల్ల రొక ♦ వానరుచే మన జంబుమాలితో. ౭౬౬

ఉ॥ ఆపలు కాలకించి దను ♦ జాధిపుఁ డుల్లము మండఁ గన్నులన్
దేపకు రక్తబిందువులు ♦ దీర్ణత రాలఁగ నిట్టులయ్యొ సే
నాపని? సేనవచ్చి జత ♦ నంబునఁ బట్టిదఁ గోఁతినన్న సే
నాపతు లేవ్వ రిట్లనిరి ♦ నాయకు కోపము నుంత శాంతిలన్. ౭౬౭

౧౦. సేనాపతి పంచక వధ పటలము. (౬౭)

సీ॥ సార్వభౌమా! నీవు ♦ సాలీఁడులం దిని, మనుకోఁతితోఁ బోరఁ♦జనెద వేని
వర్ణహీనతచేత ♦ వనటిన సెలయేళ్లఁ, గల పర్వతంబుల ♦ కరణి నున్న
దిక్కరుల్ క్రమ్మఱఁ ♦ దివిరి సాగరదాన, నీధువు లొప్పారఁ♦జెలఁగకున్నె?
ఉరుజవ సత్త్వండు ♦ గరుడుఁ డుద్ధతి మళ్ళ, కములపై నేగెడు ♦ కరణిఁగాదె?
తే॥ అల్ప వానరుపై నీవ♦యరిగినంత, నీభుజబలంబుఁ జింతించి ♦ నిసియుఁ బవలుఁ
గొదుకు తారాద్రి తనదు సం♦కోచవృత్తి, మాని యెప్పటి సంస్థితి ♦నూనకున్నె?
సీ॥ ఈవ యాకోఁతిపై ♦ నేగితివేని ని, న్నెదిరించి ఫలమేమి ♦ యొదవకుండ
నీపేరు వినుటకు ♦ నోపక భీతిల్లి, పాటు త్రిమూర్తుల♦వదనములకు
మందహాస రుచులు♦కందళింపవె? దీన, ఫలము నుంతేనియుఁ ♦ గలదెనీకు?
నదిగాక నీ వన ♦ హాయుఁడవై తెంచుఁ, బరులు తలఁపఁ దగ్గ♦పని యదేల?
తే॥ మున్ను కొండఱఁ బంపితి♦మోఱకులను♦ఇప్పు డుచితంబుఁ బాటించి, యొలమినించి
మమ్ము పంపుమా యనుచు న♦మస్కరింప, లెస్సయని సమ్మతించె ని♦లింపవైరి
తే॥ అఖిల జగముల కాధిప♦త్యము వహించి, నంత నంతనమంది సే♦నాధిపతులు
వలసినంత బలముగొని♦బవరమునకు, నేఁకరినవారు రండని♦యొఱుక పఱుప.
తే॥సంద్రముంబలెఁ దెరలెను♦సైన్యనమితి, మొగుళులంబలెదుందుభుల్♦మ్రోఁగెఁ బెలుచ
కారుమబ్బుల మెఱపుల♦కరణి మెఱసె, నసురల కరంబులందలి♦ యాయుధములు
తే॥ గగనముం దాఁకు పొడవైన♦కాళ్లుగలవి, నింగి వాఁక యలలఁబోలె♦నెగడునవియు
నైన కెక్కెముల్ చచ్చిన♦యసురకీర్తు, లట్లు గాలికిఁ దటపట♦లాడుచుండె.
తే॥ పసిఁడి గండపెండరములు♦బాణపూర్ణ, తూణ కవచాదుల ధరించి♦రాణనొప్పి
యరదములకు గుఱ్ఱాలకు♦హస్తిఘటకు, స్వేచ్ఛఁగొలఁది వేడుకగఁ గై♦సేసినారు.
ఉ॥ ఏఱులఁజేసె మార్గము మ♦దేభ గళన్మదధార లేఱులన్
దేరులు త్రొక్కి దమ్ముగను ♦ తీర్చెఁ దురంగ ఖుర ప్రఘాతముల్

మాఱిచె దిక్కుగా మరల ♦ మావుల చొంగలు చేసె రొచ్చుగాఁ
దోరము క్రింది వారల గ ♦ తుల్ వివిధంబులు భూతలంబునన్. ౧౦౪

తే॥ స్యందనధ్వని వారుల హే ♦ షలును కరుల, ఘీంకృతులు తూర్యవాదన ♦ ఝాంకృతులును
సింహనాదమ్ములొక్కటై ♦ చేరి యెసఁగి, కడలిఘోషంబు కంటెను ♦ మ్మెదుఁగు మీఱె

క॥ ఏఁబదివేల రథంబుల, నేఁబదివే లిభచయంబు ♦ నిమ్మడి తేజుల్
ధీబలయుతమై లక్షకుఁ, బైఁబడిన పదాతిసేన ♦ బయలన్ వెడలెన్ ౧౦౬

సీ॥ సేనాపతులు చీరఁ ♦ జెచ్చెర రాఁ ద్రోవ, లేక క్రిక్కిఱిసిన ♦ మూఁకయందు
కైదువు లొఱసెడు ♦ కతన వెల్వడిన యిం, గలములు మొగుళులఁ ♦ గాల్పుచుండ
మదగజ ఘంటికా ♦ మాద్యద్విరావంబు, పిడుగుల కంటెను ♦ భీతిఁగొలుప
నిప్పులవలె నున్న ♦ నేత్రముల్ భూషామ, ణులు మబ్బువిడు రవి ♦ చెలువుదోఁప

తే॥ మద మతంగజంబులపయి ♦ మావులపయి, నరదములపయి వెడలు వీ ♦ రాళిఁగాంచి
చెలులు లోహాభిసారంబు ♦ నేయవచ్చి, పతులఁ గనుఁగొని యుల్లముల్ ♦ పల్లటిలఁగ.

చ॥ వెడలిన వార లొక్కరును ♦ వెన్కకు రారు ప్లవంగవీర్యమో
బెడిదము పోవకుండనుడు ♦ వీరు లుపేక్షయొనర్పఁ జెల్వలున్
బడిబడి పోయి కీశునకె ♦ ప్రాణము నిత్తము భర్తృయోగ మె
య్యెడలను వీడకుండు నని ♦ యేగిరి కొందఱు కొందలంబునన్

సీ॥ కాలమేఘముకంటె ♦ ఘనదేహముల వారు, పంచభూతంబులే ♦ యంచితముగ
రూపుగొన్నవి యన ♦ రూఢికెక్కినవారు, మహితసైన్యాంబుధి ♦ మధ్యగతులు
పంచసేనాపతుల్ ♦ భాస్వద్రథము లెక్కి, పంచ భాస్కరులు నాఁ ♦ బరిఢవిల్లి
పంచేంద్రియంబుల ♦ పగిది నెల్లర కువ, ద్రవము లెల్లప్పుడుఁ ♦ దడవువారు

తే॥ వజ్రి వజ్రము వరుణుని ♦ పాశము యమ, దండమును వ్యర్థపఱచు దో ♦ ర్దండు లెదుట
మొనసి పెక్కు వాద్యంబులు ♦ మ్రోఁగుచుండ, నారి మొరయించుచు బయలు ♦ దేఱినారు

తే॥ తారకుని కూల్చినట్టి కు ♦ మారు నెక్కు, రింత యీఁకలతోడ వి ♦ రించి యంచ
ఱెక్కలను జేసినట్టి నూ ♦ త్రికల వీర, పట్టములను ఫాలంబులఁ ♦ గట్టినారు.

తే॥ రావణుని వక్షముం దాఁకి ♦ వ్రస్సిపడిన, దిక్కరుల రదనములఁ జి ♦ త్రింపఁబడిన
కుండలములు గలారు ది ♦ క్కుంభివదన, పట్టములనె నొసళ్లకుఁ ♦ గట్టినారు. ౧౧౧

తే॥ నవనిధీశుని లంకాధి ♦ నాయకుండు, గెలిచి యలకాపురము కొల్ల ♦ గొలువునాఁడు
తేర్చిమూట గట్టుకొనిన ♦ దివ్యభూష, ణములఁ దాల్చి వెలుంగు నం ♦ గముల వారు

తే॥ అమరవిభుఁ డోడిపాఱ వె ♦ న్నంటి తఱిమి, వెల్లచౌదంతి వాలంబు ♦ వెనుక కీడ్చి
పట్టి జాణవయేని వే ♦ పాఱుమనుచు, నిలువఁబెట్టిన ఘన భుజ ♦ బలులు వారు.

తే॥ బ్రహయాజ్ఞచే సమవర్తి ♦ ప్రాణములను, గొనుచు భవదాజ్ఞ దాఁటినాఁ ♦ డనుచు లంక
జనులు పల్క విభుని యాజ్ఞ ♦ శమనుఁబట్టి, కట్టి బంది నుంచిన పరా ♦ క్రములు వారు,

తే॥ కరువలంగేరు పీనవ♦క్షములవారు, ఉపఘ యలల హసించు బా♦హువులవారు
జముని మించి తత్కార్యంబు♦జరపువారు, కొలిమి నిప్పులవంటి క♦న్నులుగలారు.

మ॥ విలయోత్పాతముగాఁగ బాడబము పృ ♦ థ్వీభాగముల్ గప్పినన్
బలువాతోద్ధతి ఘోరమై పరవినన్ ♦ వారాసు లుప్పొంగినన్
జలదశ్రేణి భువిం గలంప నడఁగన్ ♦ సత్త్వంబుచే వాని య
గ్గలికన్ మాన్ప సమర్థులున్ శ్లథగుణ ♦క్లాంతి వ్యథాదూరులున్. ౮౧౬

తే॥ వెడలితోరణంబునుసమీ♦పించిచుట్టి, వాహినులవ్యూహముగ నిల్పి♦పతులునిలువ
వారి పనులను కనుల నే♦పారఁగాంచి, హనుమ యొకసారి గర్జించె♦నసురు లడల.

తే॥ దళము యధికంబు మొనగాండ్ర♦బలము పెచ్చు, పావనియు యొంటియయ్యె నే♦పగిది మగియు
ననుచు నింద్రాదిదేవత♦లాకసమున, జంకుగొంకును పొంది రా♦సమయమందు.

తే॥ వచ్చిరిరక్కసులు జము♦వాతఁబడఁగ, ననుచు మారుతి చుట్టు సై♦న్యములఁగాంచి
తనభుజంబులఁగని మది♦వనజనేత్రుఁ, గొని మహోత్సాహమున లేచి♦కొప్పరించె.

తే॥ కోఁతియొక్కటి జరిగిన♦ఘోరసమర, మందు జయమంది వేలుపు♦లొందుకీర్తిఁ
గ్రుంగఁజేసిన రాకాసి♦కూటువల న, డంచెనే యని కుందె న♦క్తంచరాళి.

తే॥ నందనమునుండి తెచ్చివ♦నంబునందు, రావణుండు నాటించు తో♦రణముమీఁదఁ
గౌతుకంబునఁబెరిఁగెను♦గగనమంట,భువనభీకరుఁడై వాయు♦పుత్రుఁడపుడు. ౮౨౧

తే॥ వర్ధిలిన మారుతిని కని♦భ్రమమునొంది, విమతులై బొమల్ ముడివై చి♦వింట్లువంచి
నిశిత నారాచముల నాంజ♦నేయు మీఁదఁ, బరపి రయ్యెడ శంఖరా♦వంబుప్రబల.

తే॥ తక్కురక్కసు లగ్నులు♦గ్రక్కువాఁడి, కైదువుల నేసి రవి కపి♦కాయ మంటి
దురదవోవ గీఱినగతి♦దొరయ హనుమ, కొంతసేపు కనుల్ మూసి♦కొనియొసైఁచి

తే॥ మఱియుఁగొట్టవచ్చినయంత♦మారుతియును,తక్కువారలుపోరరాఁ♦దరుణమొసఁగి
యెదుటివారలవడిమడి♦యింపఁదలంచి, యందుగలయుక్కుకంబంబు♦నందికొనియె.

తే॥ కంబమును గొని వైచిన♦కైదువులను, వీరులను వారువంబుల♦వారణముల
రథచయంబుల బలు దుమా♦రంబు రేఁగఁ, జితుకఁగొట్టి క్షణంబునఁ♦జెలఁగియార్చె

తే॥ రథసమూహంబువిఱిచిచ♦క్రములఁగొంచు,దంతులఁజదిపివానిదం♦తములఁగొనుచు
ననురులం జంపి వారి క♦రాసులఁగొని, చీల్చె నశ్వచయంబు నా♦శ్వికులతోడ.

తే॥ రెండుపెద్ద తేర్ల ♦ రెంపుచేతుల నెత్తి, రెండు కరులు చదిసి ♦ ప్రీలవైచె
రెండు కరులనెత్తి♦ రెండు గుఱ్ఱంబుల, నలఁగఁగొట్టె వీర♦నాద మొనర　౮౨౭

ఆ॥ పెద్దకొండ యొందు♦పెకలించి కొని వేయు, పొడవుతేరు లడఁగఁ♦బూడ్చివైచెఁ
బెద్ద సాల మొందు♦పెకలించికొని వేయు, నాగసముదయంబు♦నలియఁ గొట్టె.

తే॥ ద్వీపములఁ దన్ని తేరులఁ♦దిరుగవైచి, తేజుల నలంచి పిడుగుల♦యోజ దుమికి
వీరవరుల శిరంబులు♦వీఁపు లగల, నలఁచి పొడిచి ఱెక్కి కఱచి♦పొలియఁ జేసె.

తే॥ వేగముగఁ బాఱు రథముల ♦ నాగములను, వింటికిని దిగంతములకు♦విసరివైచె
స్వారిగుఱ్ఱంబులను వాని♦పైని మగల, బలిమి నొక్కటిగాఁజేసి♦నులిమివైచె.

చ॥ ఎగురఁగ వైవఁబడ్డ ద్విర♦దేంద్రము లంబుధిలోనఁ గూలుచున్
దగఁ దెఱచాపతో మునిఁగి♦తాఱు కలంబుల భంగిఁ దోఁచె న
ల్లిగసిన స్యందనావళులు ♦ హేమమణి ప్రభ యుల్లసిల్ల నం
దగపడె నప్పుడే పొడము ♦ నంబుజమిత్రు రథంబు కై వడిన్. ౮౩౧

ఉ॥ మారుతి మింటికిన్ విసరు ♦ మావులు రక్తము గ్రక్కుచున్ మహా
వారిధిఁగూలి వహ్ని విడు ♦ బాడబ సంఘముఁబోలె వాలుతోఁ
దీరుగ దిర్దిరం దిరుగఁ♦ద్రిప్పుచు వైవఁగఁ బడ్డ రక్కసుల్
కోరికఁ ద్రిప్పఁబడ్డ తర♦గొండక్రియం దిరుగాడి రంబుధిన్. ౮౩౨

తే॥ వడిగఁబాఱిన రక్తప్ర♦వాహతతులు, హనుమ విసరివైచిన ద్విర ♦ దాదికములు
కడలిఁ బడుటకు మున్నుగాఁ♦గడచిచేరె, గొప్పధ్వనితోడఁ బంతంబు♦గోరినట్లు.

సీ॥ ఘనతోరణ ద్వార♦మున కిరుప్రక్కల, నెలరేకవంటి కో♦ఱలను గుహలఁ
బోలు నోళులు రక్త♦మును నిప్పులను గ్రక్కు, జంకెన చూపుల♦చక్షువులును
బొమముడి వీడని♦ మొగములు పెదవులఁ, గొఱుకుచు నున్నట్టి♦కఱకు పండ్లు
గల రక్కసుల పీనుఁ♦గులు గగనంబును, దాఁకు కొండలమాడ్కి♦వీఁకఁ బెరిఁగి

తే॥ చూచు వారల చూపులు♦సురిఁగిపోవఁ, గాంచువారల మనసులు♦కరఁగిపోవ
మకర తోరణ ద్వారమ్ము♦మఱుఁగుపడఁగ, నిండిపోయెఁ బెఱలు గని♦బెండుపడఁగ

చ॥ తరువులు కంబముల్ గిరులు ♦ దండిగ నుండఁగ దండపాణియుం
దరుణము వేచి పాశియయి ♦ దండనె యుండగఁ గోపమూర్తులై
దురమునకు న్నిశాచరులు ♦ దూఁకుచు నుండగ దున్సహాంపు దు
ర్మరణముగాక పల్క మఱి ♦ మాటయు వేఱొకరుండు గల్గునే? ౮౩౫

క॥ భవునకు శూలమ్మునకై వడిఁ, బవనసుతునిచేతి నొక్క♦పరిఘము దొరకన్
దవిలి కసిమసఁగి దానవ, నివహమ్ముఁ బరిమార్చె నొక్క♦నిముసములోనన్.

క॥ సేనాపతి పంచక సే, నా నివహంబట్లు సమసి ♦ నం దెలిసిన లం
కా నగరమెల్ల గగ్గోఁ, లూనఁగ దళపతులు కినిసి ♦ యుల్లము నొవ్వన్.

చ॥ శవములఁ ద్రోచికొంచుఁ జన ♦ సాగిన నెత్తుటిలోనఁ జక్రముల్
దవిలి నిదానమై చను ర ♦ థంబుల నేవ్రురు డాసి యార్చుచున్
బవనజుపై ననేక శిత ♦ భల్లములేసి యలంప నిశ్చలుం
డవు హనుమంతుఁ డంత నొక ♦ స్యందన చక్రము లూడఁ దన్నుడున్.

సీ॥ రథము పాడగుడు దు♦ర్ధర్షణుఁ డాకాశ, మున కేగ హనుమంతు♦కినిసి యొక్క
యినుపకంబముతోడ♦నేసె వాఁడును దాని, దసవింటితో నొక్క♦శకలముఁ జేయు
సింగిణి విఱిగెఁ గొం♦డం గొని వాఁడేయఁ, బదరక యినుప కం♦బంబుతోడఁ
బడిపి దుర్ధర్షణుఁ♦జంప నానల్వురు, కాలాగ్ని కీలల♦కరణి మండి

తే॥ కన్నులను పొగల్వెల్వడఁ♦గార్ముకముల, బాణవర్షము గురిసి పా♦వనిని పొదువ
నతఁడు పెనుబండవైవ వా♦రడఁచివైచి, వికటహాసంబుతో నిజ్జ♦వెగినారు ౧౩౯

ఉ॥ వారల బాణముల్ హనుమ ♦ వక్షము తంగు మనంగఁ దాఁకి ని
స్సారము లౌచు వెన్కలకు ♦ స్రగ్గె మరుత్సుతుఁ డంతఁ గిన్కమైఁ
గూరఁగ డాసి యొక్కరథ ♦ కూబరముం బదలించి పట్టి యా
హారవమొప్ప దోర్బలత ♦ నంబరవీథికిఁ ద్రిప్పి వైచుచున్. ౧౪౦

ఉ॥ రాక్షసు తేరు నింగి కెగు ♦ రం గని లోపలనున్న యా విరూ
పాక్షుఁడు లాఘవంబున న ♦ హార్యముకైవడి వాయునూనుపై
కక్షముఁడై వడిం దుముక ♦ నాతఁడు నాగముమీఁది కేఁగు హ
ర్యక్షము మాడ్కి వానిపయి ♦ కామిక దాఁటి నలంచెఁ ద్రొక్కుచున్.

చ॥ నలిగులియై యతండు మర ♦ ణంబు భజింపఁగఁ దక్కు ముప్వుర
త్యలఘుతర ప్రకోపమున ♦ నార్చుచు వానర! యెందువోయె దీ
తులువతనంబు సాగదని ♦ తూపులు కోపులుగాఁగ నాట దో
ర్బలమున నేయునంతటఁ బ్ర ♦ భంజనపుత్త్రుఁడు రేఁగి హుంకృతిన్.

ఉ॥ ఆక్షణమంద డాసిన శ ♦ తాంగయుగంబును రెండుకేల ని
ర్లక్షముగాఁగఁ బట్టి యత ♦ లంబునకుం గొనిపోవుచుండ యూ
పాక్షుఁడు భాసకర్ణుఁడు త ♦ దంతరమంద తొలంగఁ గాంచి గ
ర్వాక్షయ మొందవైచెను క ♦ రంబుల నుండిన రెండు తేరులన్. ౧౪౩

చ॥ ఖరువులు సారథుల్ నలఁగఁ ♦ గార్ముకముల్ విఱుగంగ వారలు
ద్ధురతర రోష భీమణతఁ ♦ దూకొని మల్లరణంబు సేయఁగా
నురవడి భాను మ్రింగుటకు ♦ నుద్ధతి వచ్చెడు రాహుకేతువుల్
పరిగొను వైఖరిం బొదివి ♦ పట్టుడు మారుతి వాలు పెంచుచున్. ౧౪౪

ఉ॥ కంఠములన్ బిగించి యొడి ♦ కంబున నొత్తుడు నుక్కిబిక్కియై
కుంఠిత సత్త్వులై ధరణిఁ ♦ గూలి నశించిరి రాహుకేతు లు
త్కంఠతఁబట్టి వీడఁగ వి ♦ కర్తనుఁ డయ్యెడ వెల్గు పోలికన్
శుంఠలు చావఁగాఁ బవన ♦ సూనుఁడు శోభిలె సంగరస్థలిన్. ౧౪౫

తే॥ మిగిలియున్నట్టి ప్రఘసుఁడు ♦ మీఁటిరాఁగ, ఘనతరాకృతి నూనిన♦గాలికొడుకు
కరువమీఁదికి దుముకు సిం♦గంబుమాడ్కి, వానితల నలిగులిగాఁగ♦నూని దుమికె.

ఉ॥ వంచన దుష్కృతంబులు స్వ ♦ భావముగా జనహింసనేయు న
క్తంచరు లెల్లరున్ మడియఁ ♦ దత్ప్రతు లేవురు చావఁ జింతలం
గ్రుంచెడు దుఃఖసంతతులు ♦ ఘోరత రేంద్రియ పంచకంబు ని
శ్చంచలతన్ గుదించి చను ♦ జ్ఞానిక్రియన్ హనుమంతు భాసిలెన్. ౧౪౯

తే. సమరమున నొక్కరైనను♦చావుదప్పి, మిగులకుండుట దళపతుల్♦మిడికి యఱుట
కన్నులారంగఁ గని భయ♦కంపితులయి, తడయఁ జంపునో యని యెంచి♦దవ్వునుండి.

సీ॥ వనపాలకులు వడి ♦ వడి నేగి రావణు, శుద్ధాంతసౌధంబు ♦ చొచ్చియచట
మైథిలిపైఁ బ్రీతి♦మమ్ము గన్నెత్తియుఁ, గాంచఁడంచు నెడందఁ ♦ గలఁతచెంది
యున్న కాంతలఁ జూచి♦యుడుకుచు దూషించు, చున్న ప్రభునిగాంచి♦యుల్ల మెరియఁ
గర్ణరంధ్రంబులు ♦ గాఁడ నేనలును నే, నాపతు లేవురు ♦ నాశమొంది

తే॥ రయ్య! యొకకోఁతిచే నది♦యడవినట్టు, గాదు లయకాలుఁడగు నను♦కంప మమ్ము
విడువ వచ్చితి మింకను ♦ వీఁకవచ్చు, వారు లేరా యనుచు నుండె ♦ బద్ధకించి.

—: అక్షువధ పటలము :—

మ॥ అను పల్కుల్విని దానవేంద్రుఁ డొడలన్ ♦ వ్యాపించు రోషంబుచే
ఘన హాసంబులు మాఁడ నార్చి యటులా ♦ కానిమ్ము! తద్వానరం
బును నేనే యెదిరించి పట్టెద రథం ♦ బుం దేరఁగాఁ బల్కుఁడీ
యన నక్షుండు నమస్కరించి యనియెన్ ♦ వ్యాహార గంభీరిమన్ ౧౫౦

మ॥ అది ఫాలాక్షుని నందియా? హరికి వా ♦ హంబా? భుజంగేంద్రుఁడా?
పదరన్ దిక్కరులం దొకండొకో? మహా ♦ ల్పంబైన యాకోఁతిపైఁ
బదరంబుల్గొని తేరిపైఁగడఁగి పో ♦ ర న్నీవు పోఁ జూచుటా?
ఇది నీపోఁటికి యుక్తకార్యమగునే? యీయక్షుఁడుం జచ్చెనే? ౧౫౧

మ॥ మును వృద్ధశ్రవుఁబట్టి తెచ్చుటకు నిం ♦ బున్ డంబు పెంపార మా
యనఁ బంపించి కొఱంత గూర్చి తది యిం ♦ ద్రైనం దొలంగింపుమా
నను శాఖాచరు మీఁదికైనఁ బనుప ♦ న్మానంబు గాదయ్యెనే?
అనుమానింతువె? నక్క యుప్పతిలునే♦హర్యక్షు గర్భంబునన్? ౧౫౨

క॥ చిచ్చుఱ కంటియొ మనకొక, పొచ్చెము గూర్పంగఁ బ్లవగ ♦ మూర్తిం గొని తా
వచ్చినయేనియు నేఁగొని, తెచ్చెద నీమెచ్చు గొనెద ♦ దితిజాధీశా? ౧౫౩

మ॥ అవనిం గోఱల గ్రుచ్చియెత్తిన వరా ♦ హస్వామి యాఁగాక దా
నవ సంహారము నేయఁ గంబమున జ ♦ న్మంబంది వంచించు మా
నవ సింహంబగుఁ గాక పోరిన నజాం ♦ డం బావలం దాఁటినన్
దవులం గట్టియె తేకయుండిన ననున్ ♦ దండింపు దైత్యేశ్వరా! ౧౫౪

చ॥ అని యిటుపల్కి యాజ్ఞ యిడు ♦ మంచు నమస్కృతిసేయు పుత్త్రకుం
గని రథమెక్కియే నిలుము ♦ కార్ముకముం గొని పోరుసేయు మా
వనచరుఁ డాయఁబోకు మెటు ♦ వచ్చిన యేని నియుద్ధ పద్ధతిం
జనకుము పోయి రమ్మనుచుఁ ♦ జక్రసహాయుఁడు వాఁడు వెల్వడెన్.

చ॥ మునుపటి యుద్ధమందు సుర ♦ ముఖ్యుఁ డొసంగిన దార్ఢ్యమైన తే
రను తగ రెండువందల గు ♦ ఱాలను గట్టిన దాన నెక్కి దీ
వన లిడి రెల్ల దానవులు ♦ వాద్యరవంబులు మిన్ను ముట్టె వా
హినులును వాహినీ పతు ల♦హీన సముద్రము పోలె నుబ్బఁగన్. ౨౫౭

సీ॥ వనధిని మకరంబు ♦ లను లెక్కవెట్టుచో, వారణంబుల లెక్క ♦ పఱుపవచ్చుఁ
గడలి మత్స్యంబులు ♦ గణనకుఁ దెచ్చుచో, స్యందనంబుల లెక్క♦సలుపవచ్చు
జలధి యిసుక రేణు ♦ వుల నెంచనైనచోఁ, గాల్బలంబుల నెంచఁ♦గడఁగవచ్చు
శరధి వీచీ సము♦త్కరమెన్నఁ దగినచో, నచటివాజుల లెక్క ♦ యరయవచ్చు
తే॥ నన నసంఖ్యాకమై యొప్పె♦నందుమఱియు, దావ కీలలఁ బోలిన♦తన యనుంగు
కాంౘ్రదు పంౘ్రెండువేల ర♦క్కసులుచుట్టి, యరుగు దేరంగఁ జనియె దే♦వారిసుతుఁడు.
తే॥ ప్రగ్గడల కుమారులు దళ♦పతులసుతులు, వేల్పుపడఁతుకలకు నుద్భ ♦ వించినట్టి
రావణుని కొడుకులు చేరి♦రథములందు, నాల్గులక్షల వీరులు♦నడచివారు. ౨౫౮

చ॥ ముసల ముసుండి శూల ఘన ♦ ముద్గర తోమర చక్ర కుంత ప
ట్టిస ధనురాది సాధన ప ♦ టిష్ఠులు కైదువు లెండగాయ ధూ
ళి సముదయంబు పైకెగుర ♦ లేఖుల లోకముపోలె భూమియుం
బసిఁడి మయంబుగా వెలుఁగ ♦ బంధుర వైఖరి సాగి రయ్యెడన్ ౨౫౯

సీ॥ కాకులు గ్రద్దలు ♦ ఘన పిశాచంబులు, కాలుండు సంచిత ♦ కర్మచయము
వెన్నంటిరా నన్ను ♦ మిన్నల దృష్టులు, కలువ పూసరముల ♦ కరణి నెఱయ
విధవల యేడ్పు ను ♦ దధి ఘోషమును వాద్య, సేనారవంబులు ♦ చెవుడు పఱుప
పోయిన వారలు ♦ పోవుటె కాని క్ర, మ్మఱ రంచుఁ దమ సతు ♦ లఱచుచుండ
తే॥ దర్పరణదోహలత్వముల్ ♦తఱుముచుండ, నీర్ష్యయునుకిన్కతమకు ము♦న్నెగుచుండ
వాహినీరాజి బలసి రాఁ♦బంక్తివదన, తనయుఁ డయ్యెడ సంగర♦స్థలికి నడచె.

చ॥ రవి కిరణాళిఁ గప్పె బహు ♦ రత్న విభూషణ కాంతి పంక్తి కై
దువుల వెలుంగులన్ మఱఁగెఁ ♦ దోరపు భూషలఁ గ్రాలు డాలుఁ దా
నవ ఖర దంష్ట్రికా సుషమ ♦ నాఁడెపు వాలుల యొప్పుఁ గప్పఁగాఁ
బవలును రాత్రియుం గలిసి ♦ భాసిలు చందము దోఁచె నత్తఱిన్. ౨౬౧

సీ॥ కుదిరలు రథములఁ♦గునుకుపా టొందంగ, నెడమ కన్నులు కేలు♦నెడఁ జలింప
రక్తవర్షంబు ని♦ర్జలదంబు గురియంగఁ, బిడుగులు పైనుండి♦పెటిలి పడఁగఁ

బరఁగఁ గృతాంతుండు♦భావి నాలోచింపఁ, గంక గృధ్రంబులు♦కడకుఁ దిరుగ
భూతగణంబులు♦పొంగి నాట్యము సేయ, ఖేచరుల్ మిగుల సం♦కోచ మొంద
తే॥ నొక్క వెల్లువ సేన త♦న్నొలసిరాఁగ, భువన భీకరుఁ డగుచు వై♦భవము తోడ
వచ్చు దశముఖ సుతు నక్షు♦వాయుపుత్త్రుఁ, డించుకంత దూరాన గ♦ణించికాంచి.

ఉ॥ వచ్చెడువాఁడు రావణుఁడొ ♦ వాని కుమారకుఁ డింద్రజిత్తొ కా
వచ్చు మదీయ పుణ్య ఫల ♦ భాగ్యము నేఁడు ప్రసన్నమయ్యె నీ
వచ్చు రణంబు కీర్తియును ♦ వచ్చును రాముని మెచ్చు వచ్చు నా
కచ్చుగ నంచు మోదిలె భు ♦ జార్గళముల్ తగఁ గాంచి వెండియున్.

ఉ॥ శ్రీరఘు వీర శేఖరుని ♦ సీతను చిత్తమునందు నిల్పి కై
వారముచేసి నాతపము ♦ పండఁగ సిద్ధముగాఁగ నుంటి నా
చేరువఁ గాలుఁడుం బడటు ♦ సేయుచుఁ గాచియె యున్నవాఁడు నా
కారియ యిప్పుడే యదను ♦ గాంచి ముగించెద దాపురించుడున్. ౨౬౪

మ॥ పదిశీర్షంబులు లేవు గానఁ దలఁపం ♦ బౌలస్త్యుఁడా కాఁడు మా
య దల్పిరం బురుహూతుఁ గెల్చిన మను ♦ ష్యాదుండొకో కాఁడు దు
ర్మదుఁ డెవ్వాఁడొకొ సుందరుండగుఁ గుమా ♦ రస్వామియుం గాఁడు పెం
పొదవం గాటుకకొండ యట్టిఁడు మహో ♦ ద్యోగుండు వీఁడెవ్వఁడో?

మ॥ అని సంతోషము నంది తోరణముపై ♦ నాసీనుఁడై యున్న పా
వని నక్షుండు గణించి చూచి యిదియా ♦ భంజించి యుద్యానమున్
దనుజానీకముఁ గూల్చినట్టి ప్లవగేం ♦ ద్రం బంచు నిర్లక్ష్య భా
వనతో నవ్వఁగఁ గాంచి సారథి యిటుల్ ♦ వాక్రుచ్చె నయ్యక్షుతోన్.

శా॥ ఈ లోకంబునఁ గల్గు వింతలు సదా♦వీక్షింపుచున్ నేఁటికిన్
లీలామాత్రముగాఁ దలంపఁదగ దా ♦ లింపందగున్ వాలియుం
బోలం జూచిన నొక్క కోఁతియె గదా ♦ పొంగార్చె మాతంద్రి నా
పాశంబుం దగ జ్ఞప్తి నుంచుకొని సం ♦ భావింపు మియ్యాలమున్. ౨౬౭

ఉ॥ సారథి వాక్కులన్ విని ని ♦ శాచర రాజ కుమారుఁ డిట్లనున్
వారక మాపురంబునకు ♦ వచ్చియు నూరక పోక యిట్టి వ్యా
పారము చేయు దీని నిట ♦ ద్రవ్చుటతో మదమర్ష మింత చ
ల్లాఱదు రోసి రోసి ప్లవ ♦ గావళి వంశమె రూపు మాపెదన్. ౨౬౮

శా॥ కానిండంచు స్వసైన్యముం దఱుమ లం ♦ కానాథ పుత్త్రుండు త
త్సేనల్ మారుతిఁ జుట్టుముట్టి బహు హే ♦ తివ్రాతముల్ వైవఁగా
భూసాక స్థలు లల్లలాడెను మరు ♦ త్పుత్త్రుండు తప్పించు కొం
చేసంగుల్ రథముల్ హయంబులను మా ♦ యించెం బద క్రీడచేన్.

ఆ. ఎండు గడ్డిమీఁద♦నెరగలి పడినట్లు, లసురవరుల మీఁద♦హనుమ యడరె
వారి ప్రాణములను♦వారి కొంపోవఁ గిం, కరులు చాలఁ గలరె♦కాలునకును? ౨౭౦

ఉ॥ వచ్చుట కాయితంబయిన ♦ వారును వచ్చుచు నున్నవారు మున్
వచ్చినవారు లెక్కయిడ ♦ వైనము గామి యటుండఁ బోరిలోఁ
జచ్చినవారుఁ జచ్చుచును ♦ చచ్చియుఁ జావక కూలువారు నై
పెచ్చుగ నెమ్మిలేని మయి ♦ వీఁక నలంగిరి దైత్యులయ్యెడన్. ౨౭౧

ఉ॥ మిక్కుటమైన శోణితము ♦ మీఱి ప్రవాహముగాఁగ దానిలో
నుక్కఱి వ్రీలి కూలిన మ ♦ దోత్కట వారణముల్ తురంగముల్
మిక్కిలి పంకిలంబుగ గ ♦ మించెను మారుతి నాఁడె లంకలోఁ
గొక్కిరి మూఁకఁ గాలునకుఁ ♦ గొల్ల యొసంగిన రీతి దోఁపఁగన్. ౨౭౨

ఉ॥ కొందఱు చచ్చుచుండ మఱి ♦ కొందఱు ముందఱి కేగుచుండఁగాఁ
గొందఱు పాఱుచుండఁగను ♦ కొందఱు దవ్వుల నిల్చి చూచుచుం
గొందలమందెఁ దేరులనిఁ ♦ గూలె మదావళ రాజియంచు వే
మ్రందెఁ దురంగపాళి యని ♦ మాఁడెఁ బదాతి యటంచుఁ బల్కఁగన్.

చ॥ చిలికెడు కుండలోని దధి ♦ చెన్నున నొప్పె నిశాచరావళుల్
చిలుకుచునుండు కవ్వమను ♦ చెల్వున నొప్పె మరుత్కుమారకుం
డిలఁగల జీవసంచయము ♦ లెల్లను సోఁకులె గాఁగఁ దోఁపఁగా
విలయ సముద్ర మట్లయిరి ♦ వీఁకను మారుతి బాడబాగ్నిగాన్. ౨౭౪

ఉ॥ వచ్చెడువారు పైపయిని ♦ వచ్చుచునుండఁగ వెంటవెంటనే
చచ్చుచునుండ నొక్కరును ♦ చావక తప్పినవారు లేమిచే
హెచ్చుగ భీతినొంది యెడ ♦ యీఁగిరి పాఱిరి తక్కువారు వి
వ్వచ్చమె రూపుగొన్న క్రియ ♦ భాసిలి యక్షుఁడు తాఁకె మారుతిన్.

ఉ॥ అక్షుఁ డెదిర్చె నొక్కదిన ♦ మందె నిశాచర రాజి నుద్ధతిన్
లక్షలకొద్ది చంపిన వ ♦ లంతి యొకం డెదురయ్యె దీని మా
యక్షుల మాయరాని విధి ♦ నందిన మేము కనంగనయ్యె మా
కక్షమ మయ్యె నంచు సుర ♦ లందఱు మూసిరి కేలఁ గన్నులన్.

ఉ॥ అయ్యెడ నక్షుఁడేసె వడి ♦ నగ్నులఁ గ్రక్కు శిలీముఖంబులన్
దయ్యొక వాయుజుం డినుప ♦ దండముతో నెగఁదట్టె నుగ్రుఁడై
దయ్యముఁ బోలు నాయినుప ♦ దండము నగ్గగఁగొట్టె దైత్యజుం
డొయ్యనఁ గేల బాణముల ♦ నూఁడ్చుచుఁ బావని యేగ మందలన్.

చ॥ అరదము మీఁదికిం దుమికి ♦ యాతని సారథిఁజంపి వాజులన్
ధరఁ బడఁదన్న నక్షుఁడు ను ♦ దగ్రతరాస్త్రము లేసి కీశు పై

న్నరము భుజంబుల న్నలఁచె ♦ నుక్కున మారుతి లెక్కసేయ కు
ద్ధురతర రోష భీషణతఁ ♦ దోరపు వింటిని పట్టె గట్టిగన్. ౧౦౯

తే॥ పట్టుకొన్న వింటిని దన♦బలిమి లాగ, పెళ్లుమంచు రెండుగ నది♦విఱిగిపోయె
చిక్కటారితో నక్షుండు♦చీల్పఁ బూన, పీఁకఁ బట్టి దానిని లాగి♦విఱిచివైచె.

ఉ॥ విల్లు కటారియున్ విఱుగ ♦ పీఁకున దైత్యకుమారుఁ డంతటన్
మల్ల రణంబుసేసి పరి ♦ మార్పఁగ మారుతిఁ బట్టెఁ బట్టుడున్
గొల్లగ వాఁడి రోమములు ♦ గ్రువ్వఁగ వాలము వెంచి వాని మే
నెల్లెడ సందులేక బిగి ♦ యించి తటాలున నెక్కె వానిపై. ౧౧౦

ఉ॥ చెంపలఁ గొట్టె దంతములు ♦ శీర్ణముగాఁగ మెఱుంగు లట్టు లా
కంపిత దేహమందు మణి ♦ కాంచన భూషలు రాల నాంత్రముల్
జంపుగ జాఱఁ గ్రుమ్మి రథ ♦ సంబునఁ గంఠము వంచి క్రుంచి వి
ల్వంపుగ మేను వంగఁ గటి ♦ భాగము జానువు నూఁది త్రొక్కుచున్.

చ॥ నపురతలంబు సన్నొకలు ♦ జాఱిన నెత్తురు నీరు గాత్రమే
యమరిన నానఁ బ్రాలు తన ♦ హస్తమె పాత్రముగాఁగ జీవముల్
యమునకుఁజెంద నూఱె నని ♦ లాత్మజుఁ డక్షుని మిన్నుమన్ను వా
రమర మనుష్యవర్గ మర♦యం గని విస్మృతి చెందకుండఁగన్. ౧౧౧

సీ॥ కొందఱు నెత్తురు ♦ చిందు గాయములతో, డాఁగిరి భూత భం ♦ డారములను
కొందఱు భీతిచేఁ ♦ గుంది గ్రుందిరి పోవు, వెరవు దోఁపక చాల ♦ విహ్వలించి
కొందఱు సాధన ♦ బృందంబు దిగజాఱఁ, బోయిన పోకగాఁ ♦ బోయినారు
కొందఱు మీఁలై య ♦ కూపారముం జొచ్చి, రావులై కొందఱు♦త్రోవలందు
తే॥ పూరి మేయసాగిరి కంక♦వారమగుచుఁ, దిరుగసాగిరి కొందఱు ♦ ధరణిసురుల
రూపములు కొంద ఱూనిరి♦పూపచనుల, పడుచులై కొంద ఱరిగిరి♦పతులఁగనుచు.

సీ॥ కొందఱు వారలే ♦ కూడని వారలు, మేము గామనిరి సా ♦ మీరితోడ
గొందఱు నతినుతు ♦ లొందంగ నలమిన, మేము చుట్టాలము ♦ గాము నురల
మని దూరమేగిరి ♦ మనుజుల మనిరి కొం, దఱు తేఁటులైరి మం ♦ దార వనిని
కొందఱు దిగ్భ్రమఁ♦గొందలించిరి కొంద, ఱరసి దంష్ట్రికలను♦ విఱిచికొనుచుఁ
తే॥ వెంట్రుకలను నల్లనగఁ గా♦వించుకొనుచు, వేషముల మార్చికొనిరి దు♦ర్భీతిచేతఁ
గొంద ఱెదురగు వారిని♦గూడఁ ద్రోచి, పరుగులెత్తిరి పోవుచో♦బెఱుఁగ రాక.

సీ॥ కుండలకర్ణలు ♦ కుంకుమపంక ప, యోధరల్ మధుర ర ♦ సాధరలును
క్రొమ్ముడుల్ వీడి ప♦దమ్ములఁ బెనఁగ త్రొ, మ్ములు మోదికొంచు నె♦మ్ములు నలంగఁ
బలవించు రోదన♦ధ్వని లంకయే గాక, భువి దివిఁ గడచుచుఁ♦దివిరి నిండ
బాలభాస్కరుఁ బోలు♦వదనంబు లొప్పారు, పతుల పాదంబుల♦పైని వ్రాలి

తే॥ తూలి సోలులో లాత్ముల♦ తుఱుములూడి, తమయుదమపతులయు శరీ♦రములఁగప్పఁ
దచ్చిరోజంబులకు రక్త♦ధారలకును, నుంతయేనియు భేదంబు♦ చూడలేదు.
తే॥ దురమునందు చచ్చినతమ♦ దొరలమిూఁదఁ, బ్రతిమలం బోలుచెలువలు♦ పడుచునూర్పు
పుచ్చుచును తెప్పలార్పక♦ మొఱ్ఱ యిడిరి, తనువు వేఱగు కతనఁగా♦ మొనయు నిద్ది?
తే॥ అసువులను రోయు దేహంబు♦లట్లు పరుగు, లిడిరి రాణివాసము వార♦లెల్లఁగుణప
నివహమున వెదకిరి ప్రేమ♦నిగుడు కతనఁ, బతులఁ జేరి రంభాదులఁ♦బడరినారు.
క॥ తరలాక్షి గోల యొకతుక, దురమున నటియించు నట్టి♦తోఁ దచ్చిరముఁ
నరి నిలిపి మ్రొక్కి వేఁడెను, వరుఁ జూపుము నీకుఁ బుణ్య♦ఫలమగు ననుచున్.
క॥ చెలువ యొకర్తుక నాథుని, తల గైకొని యొగురుచుండు♦తనువును గని మే
నలసెను రమ్మని పిలుచుచు, నలమి బిగియఁ గవుఁగిలించె♦నారట పడుచున్.
ఆ॥ వెదకి పతుల మేలు♦సుదతులు గనిపెట్టి, కడఁకఁ బ్రాణములను♦విడిచినారు.
దితిజనాథుఁ జేరి♦ బుతు దేవతలు కడ, చనిన వృత్తమెల్ల ♦ వినిచినారు.
తే॥ మయుని తనయ మండోదరి♦ మందగమన, తుఱుముపీడంగ బాష్పబిం♦దువులు గనుల
జాఱఁగా వచ్చి తననాథు♦చక్కిఁ జేరి, కడువు బాఁదుకొనుచు నేడ్చెఁ♦గళవళించి.
తే॥ లంకలో నున్న కాంత లె♦ల్లరును వచ్చి, యేడ్చి రరలిరి దైత్యేంద్రు♦నెదుట; లోవ
ముదము నొందియు నెలువల♦గదురనీక, తెరలి చాలఁ గుందిరి బుతు♦ దేవతలును

౧౨. పాశపటలము. (౬౩)

తే॥ శక్రుగెల్చిన యురు కీర్తి♦శాలి తమ్ము, మరణవార్తను విని మది♦మలఁగి మండి
కనుల నిప్పులు రాల జ♦గంబు లడల, రోష భీషణుఁడై చల♦ద్భ్రుకుటి యడర.
క॥ మది యెరియఁగ మిడుఁగుఱులం, జెదరుచు నిట్టూర్పు లుబ్బి♦ చెలఁగఁ బురంబుల్
పదటునఁ గలిపిన రుద్రుని, పదురున నెఱిఁ జూడరాని♦పద్ధతి లేచెన్.
చ॥ అమర జగంబు పై నరుదు ♦ నంటెడు వేయి పిశాచ పంక్తు లం
దముగ నమర్చి కట్టిన ర ♦ థంబు పయిన్ వెస నెక్కి వీర వా
క్యములు వచించుచున్ జన ని ♦ కాయము భీతిలి పాఱ సింహ నా
దము లొనరించుచున్ జనియె ♦ దారుణ చర్యల నాచరించుచున్.
ఆ॥ వీర మద్దియలును ♦ వీర కింకిణులును, భేరు లులిసె నశని♦బృంద మడల
నింద్రు నసువు లూర ♦ కెగసిపోవఁగ నని, బలిసె నని త్రిమూర్తు♦లలఁగి మలఁగ
ఉ॥ తమ్ము మృతిం దలంపఁగనె ♦ ధారలు ధారలు గాఁగ వేఁడి బా
ష్పమ్ములు గాఱ నొక్కయెడ ♦ వానము లేక తరూత్కరంబులం
దిమ్ముగ గంతుచుండు నొక ♦ య్యెల్లిదమా ప్లవగమ్ముచేత నా
తమ్ముఁడు కూలెనా? యనుచు ♦ దానవనాథుని కీర్తియుం గదా!

చ॥ అని తలపోయుచున్ జరుగ ♦ నాతనితోఁ జను విల్లువీరులన్
ఘన గదలన్ ధరించి చను ♦ కచ్చురులన్ సుధరంబు రెండుగాఁ
దనుమఱఁగఁ జాలు దోర్బలులఁ ♦ దోరపు లెక్కలఁ దెల్పలేము స్యం
దనములు వారువంబులును ♦ దంతిఘటల్ పదిరెండు వేలగున్. ౮౯౮

చ॥ మఱియును సైన్యనాయకులు ♦ మానుగఁ జేరుచునుండఁ గన్నులన్
విరివిగ బాష్పముల్ కినుక ♦ పెచ్చుగ నించిన యింద్రజిత్తు త
త్తఱమున వచ్చి చేరెఁ దన ♦ తండ్రి వసించు కన ద్వితాన సుం
దరతర సౌధమున్ గనక ♦ దండ భటాలి మహా నిరోధమున్. ౮౯౯

ఉ॥ చేరి నిశాచరేంద్రునకుఁ ♦ జేతులు మోడ్చి యనుంగుఁ దమ్ముకై
యారటమందఁ బంక్తిముఖుఁ ♦ డాదట నాతని గౌఁగిలించి క
న్నీరొలికించెఁ జెంతఁ గల ♦ నీరజ నేత్రలు దుఃఖమొంద న
వ్వారలఁ దేర్చి యవ్వలకుఁ ♦ బంపి సురేంద్రజితుండు తండ్రితో. ౯౦౦

చ॥ ఇతరుల చేవఁగూర్చి యొక ♦ యించుకయైనఁ దలంప కిప్డు దుః
ఖితమతి వౌట యేమిటికిఁ? గీశుని చేవయు నేర్పు పెంపు నూ
చితమయి యుండియుం జనుఁడు ♦ నేయుఁడు పోరని పంపి పంపి నీ
దితిజ బలంబు నెల్లఁ గడ ♦ తేర్చిన వాఁడవు నీవ కావొకో? ౯౦౧

ఉ॥ కింకరు లాదిగాఁగఁ జని ♦ గీటడఁగం జనినార కాక యీ
వంకకుఁ గ్రమ్మఱిల్లిన దెవండు శరీరముతోడ నయ్య! మీ
నాంకుని పోలు సూనుని వ ♦ నాటుని వాతను పెట్టి చూచెదే?
యింక జయింపమా? యనుట ♦ యేటికి? నయ్యది తెల్వికార్యమే?

ఉ॥ దిక్కరులన్ జయించితివి ♦ తేఁకువ నెత్తితి శంభు భూధరం
బుక్కున లోకముల్ గెలిచి ♦ తొక్క ప్లవంగముకై తపించుటల్
చక్కటియే? వహింపుము ప్ర ♦ శాంతము వానరుఁబట్టి యేనె నీ
చక్కికిఁ దెచ్చెదన్ బరవ ♦ సంబున నుండుమయంచుఁ గ్రమ్మఱన్.

ఉ॥ ఓడిన చీఁకటుల్ మరల ♦ నుగ్రతపం బొనరించి చేవతోఁ
గూడిన మేను లొందె రవి ♦ ఘోర కరంబులె భూషణాలిగాఁ
బోఁడిమిఁ దాల్చి శత్రు వల ♦ మున్ రుచిచూచిన శాత ఖడ్గముల్
నాఁడెముగా ధరించిన వ ♦ నందగి వచ్చెఁ జమూ సమూహముల్. ౯౦౪

ఉ॥ మావులు తేరులుం గరులు ♦ మత్తులు చేరిన దైత్య సైనికా
రావము వార్ధిఘోషముఁ గ ♦ రంబు జయింపఁగ వీర ఘోర సే
నా వనరాశి మధ్యమున ♦ నాణెముగా వెలుఁగొందు మేరువన్
వైవడి నొప్పె వీరవర కర్మము ♦ నూనిన మేఘనాదుఁడున్. ౯౦౫

చ॥ జనములు వేల్పులున్ మునులు ♦ జంకు వహింపఁ బ్రయాణ భేరికా
నినదముతోడ లేచు రజ ♦ నీచర నాథ కుమారుఁ డప్పు డ
య్యనువునఁ బోరినట్టి యని ♦ లాత్మజు ధైర్య పరాక్రమంబులన్
మనమున మెచ్చె శాత్రవు ను ♦ మాళము శూరులు మెత్తురే కదా?

సీ॥ శవమయమైన యీ ♦ సంగరస్థలి గొప్ప, రక్తపంకమున న ♦ రాజు లొనరఁ
గదలుచుండుటచే న♦గంబులు నదులు కా, ననములు గల భువ♦నంబుఁ బోలి
వెలయుచున్నదిగదా? వీరవర్యులు లోక, ముల జయించిన దైత్య♦కులమువారు
పెక్కండ్రు నశియించి♦రొక్క వానరుచేత, నేమి చోద్యం బిట్టు♦లెన్నఁడయ్యె?
తే॥ నింకరాముఁడే తమ్మునితో♦నిటకు రాఁగఁ, బ్రజ్ఞలం బల్కి యే వీర♦బలము గొనుచుఁ
గలన నెదిరించి విజయమ్ము♦గాంచువార, మనుచుఁ జింతించె. గొంత సే♦పసురకొడుకు.

సీ॥ కనులఁ బోలినవారు♦మనముఁ బోలినవార, లలవు బలము గల్గి♦యరయువార
లై యట నీల్గిన♦యసురవరుల నసం, ఖ్యాకులఁ గని నిల్చి♦యాడు గఱచి
కోలను వ్రణమున♦గ్రుచ్చిన క్రియ నొచ్చి, తపియించి రోషంబు♦దర్పమొంది
వనమున నత్తకు ♦ నొనరిన యవమతి, ఖరదూషణాదుల ♦ కాడుపాటు
తే॥ ప్రాణధనమైన తమ్ముని♦పఱచుపాటు, తక్కువారల మరణంబుఁ♦దలఁచి తలఁచి
నరులచే నొక్కకోఁతిచే♦జరిగె నింత, ప్రాభవం బేటికని చాలఁ♦బరితపించె. ౯౦౮

సీ॥ మరణించు దైత్యులు♦మండెడు చోటుగాఁ, గనిపించు నట నీడ్వఁ♦గాని కుణప
పర్వతంబులు నట్టు♦పఱుపంగ జరగుపు, రందరజిత్తు నూ♦ఱంగఁ బడిన
యనుజు కళేబర♦మును తన కన్నులు, కరఁచిన తామ్రంబు♦కరణి వెలుఁగఁ
గినుకతోఁ గని తార♦కుని నెత్తు రనఁదగు, వెల్లువ బీభత్స♦విధము దోఁప
తే॥ ఖర నృసింహ నఖర దంష్ట్రి♦కా విదారి, తోగ్ర కనకకశివు తను♦వ్యుత్క్రమంబు
కరణిఁ గనఁబడఁ దన తేరు♦నురక నిలువఁ, జేతి ధనువును జాఱ ని♦శ్చేష్టుఁడయ్యె.

ఉ॥ నీరును నిప్పు నెత్తురును ♦ నేత్రములన్ వెలివాఱ దుఃఖ దు
ర్వార మనస్కుఁడై యసుర ♦ రాజ నిదేశము మీఱి చంపఁగా
నేరఁడు కాలుఁ డీ జగము ♦ నేరదు తండ్రికి లోఁకువౌట నీ
వే రహి నెందు డాఁగితివొ ♦ యించుక నేరను కాదె తమ్ముఁడా! ౯౧౦

చ॥ అని సహియింపలేక మతి ♦ యల్లల నాడఁగఁ గుందు వేళఁ గో
పన గుణమొండె కాదె పరి ♦ భావ వికారములెల్ల మాన్పు? న
య్యనువున నింద్రజిత్తు వగ ♦ యంతయుఁ బైకొను మేకు క్రింది మే
కును వడిఁ గ్రుంచు పైనమునఁ ♦ గోపముచే మఱుఁగయ్యె వ్రేల్మిడిన్.

ఆ॥ అట్టి తరుణమంద ♦ యరదంబుపై నున్న, యింద్రజితుని గాంచె ♦ నీరసమునఁ
ద్రిపుర దాహమునకు♦దీకొని లేచిన, యుగ్రుఁబోలి హనుమ ♦ వ్యగ్రుఁడగుచు

ఉ॥ నచ్చెను వాఁడె గావలయు ♦ వానవు గెల్చిన జోదు మున్ను నే
నచ్చుగఁ గాంచినట్టి విజ ♦ యంబు పరాలున వీనిఁదెచ్చె నేఁ
డిచ్చట గెల్పుటో యటులొ ♦ యెన్నఁగ నొక్కటె తక్కియుండు నా
శ్రచ్చును దీటవచ్చె నిది ♦ గాదె మహోదయ వేళ నాకగుఁ. ౯౧౩

ఉ॥ ఏఁడు వశించెనేని యది ♦ విశ్రుత రావణ నాశహేతువౌ
వీడును జానకిఁ గనుచు ♦ వేల్పులతేఁడు మనోవిభీతియుఁ
వీడును దైత్యసంఘ మవి ♦ వేకవ్రఁ జేష్టల లంక యిప్పుడే
వీడును రక్ష రావణుని ♦ పేరిమి గెల్చినవాఁడ నయ్యెదఁ. ౯౧౪

చ॥ అని తలపోయుచుండ దను ♦ జావళి మావులుఁ దేరులుం గరుల్
మొనయుచు మూఁడులోకముల ♦ ముమ్మరు లోరిచి కాఁక దేలు మే
ఘ నినదు ముంగలై భయద ♦ గర్జనముల్ పొనరింప నంజనీ
తనయుఁడు కోపగించి యొక ♦ తాలము గైకొని కొప్పరింపఁగఁ.

సీ॥ కాఁచిన కరులును♦త్రోచిన కరులును, పొరలిన కరులును♦మరలు కరులు
దొకలిన కరులు పై♦నురలిన కరులును, త్రుళ్లిన కరులును♦ త్రెళ్లు కరులు
విఱిగిన తేరులు ♦ తఱిగిన తేరులు, ముడిగిన తేరులు ♦ నుడిగినవియు
చెవరిన తేరులు♦నదరిన తేరులు, పగిలిన తేరులు ♦ నగలి నవియు

తే॥ నుగ్గులై బొగ్గులై యిగ్గ ♦ ముగ్గఁ బడిన, యిరుసులూడిన చక్రంబు♦లిలకుఁగ్రుంగి
వాలి కూలిన యవియునై ♦ వారణములు, స్యందనంబులు నలఁగె నా♦సమరభూమి

సీ॥ తలలు నలఁగి కుత్తు♦కలు త్రెళ్లవైచి క, న్గ్రుడ్లు చెదరి కాళ్లు ♦ కుదియఁగూలి
నడుములు విఱిగియుఁ♦గడుపులు తఱిగియు, ఱొమ్ములు పగిలియు♦ నెమ్ము లగలి
కీళ్లూడి నెత్తురు ♦ బొళ్లున గ్రక్కు కు, ప్పలుగూలె బవరాన ♦ వారువములు
పట్టువడినవారు ♦ గిట్టి పడినవారు, క్రుంగఁబడినవారు ♦ క్రుంగువారు

తే॥ కఱచి వాలంబుతోఁ జుట్టి♦చఱచి తన్ని, మెడల నుల్చి తోళులనొల్చి♦కడుపుఁ బ్రీల్చి
నడుము విఱిచి శిరము వ్రచ్చి♦నలఁచుచుండఁ, గూలినారు నక్తంచర♦కోటులెల్ల.

చ॥ గుములుగ వింధ్య వంచి విడు♦కోలలు తక్కిన యాయుధంబులుఁ
బడి హానమాను మేనిపయి ♦ వ్యర్థములయ్యె నయశ్శలాక లు
గ్గడువుగ గ్రాఁగి డాకలిని ♦ గాల్పని తీరున నెట్టి లేచుచుఁ
మిడుఁగుఱు లుప్పతిల్లి ధర ♦ మీఁదఁ బడెఁ నశియించె వానితోఁ.

చ॥ అదిగని యింద్రజిత్తు మది ♦ యట్లుడుకఁ జ్వాలదగ్ని సంయుత
ప్రదరము లాంజనేయు పయి ♦వైవఁగ నయ్యవి కాలి మాఁడుచుం
జెదరుట గాంచి యొంటిమెయి ♦ నిల్చిన దోర్బలశాలి నవ్వుచుఁ
జెదరక రమ్ము రమ్మనుచుఁ ♦ బిల్చుచు డాసె మహోగ్రమూర్తియై.

ఆ॥ పిడుగులెల్లఁ బెటిలి♦పడఁ బురందర శిర, మదర శేషు శిరము♦లటమటింప
నండ కుహర మదలి♦యల్లలనాడఁ డం, కృతి యొనర్చె గడఁక♦నింద్రజిత్తు.

ఆ॥ అండగోళమెల్ల♦నదలి బ్రద్దలువాఱఁ, గొండ లదరి దొరలఁ♦గువలయంబు
దిశలు పగులఁ దెగయుఁ♦దెగ నార్చె శ్రీరామ, దూత యుప్పళించి దోర్యుగంబు.

ఆ॥ మేలుమేలు మిగుల♦మెచ్చితి నీవంటి, వీరులెవరు తెంపు పెంపునందు!
నేఁడు ముగియ వచ్చె♦నీజీవితపు మితి, యనుచు మేఘనాదుఁ♦డార్చియాడె.

చ॥ తులువల జీవితంబులకు ♦ నుష్ట విచేష్టలకున్ గళంక దు
ష్కులములకున్ సుకార్య విని ♦ షూదన ధృష్ట మహాయుధాళికిన్
జెలఁగి ముగింపుకాల మది ♦ చేయఁగ వచ్చితిఁ జూడు నన్ను నా
బలమున కెల్ల లేదు బల ♦ వైరిని గాననె నాంజనేయుఁడున్.  ౯౨౭

ఆ॥ పరఁగ వీనికున్న♦బలమందు నమ్మిక, తొలఁతునంచు వాఁడి♦తూపు లేసి
యురము శిరము నొంచి♦విరివిగ నెత్తురు, వఱలఁ జేసె నింద్ర♦వైరి యంత.

ఆ॥ చిన్నతల్లి వలుకు♦శిరసావహించి రా, జ్యంబు వదలి ధర్మ♦మందు నిలుచు
రాము కీర్తి వోలె♦రహి నాకసము నంటఁ, బెరిఁగి నిలిచె హనుమ♦భీకరముగ.

తే॥ భూరి దశదిశా యుతములౌ♦భువనములకు, నాయకుండగు హరిహయు♦నలఁచికట్టి
నట్టి మేఘనాదుఁడు గాలి♦పట్టి రూపు, పూర్తి గనలేక దిగ్భ్రాంతిఁ♦బొంది నిలిచె.

ఆ॥ దీర్ఘభుజము చాఁచి♦దితివంశ్యుఁ డేసిన, యలుఁగు లొడిసి పట్టి ♦ యతని నేసి
వాని రథము తురగ♦పంక్తితో సారథిఁ, జావమోఁదె రామ♦సేవకుండు.  ౯౨౮

ఆ॥ పవన జవన వాజి♦నివహంబుఁ బూంచిన, వేఱు తేరి నెక్కి♦విదిత బలుఁడు
పవనసుతుని మీఁద♦బహువిధ చక్ర న, న్నిభ శరంబు లేసి♦నించి కప్పె.  ౯౨౯

ఉ॥ మారుతి మేనినంటి పలు ♦ మార్గణముల్ తగ వ్రేలుచుండ న
మ్మారుతిన సాయకావళుల♦మేను విదిర్చి తొలంచి ధీరతం
దేరికి దాఁటి లోకములఁ♦దేఁకువ గెల్చిన వానివిల్లు దో
స్సారముచే వడిం దిగిచి ♦ చాఁగజలాడె నిలింపు లుబ్బఁగన్.

ఉ॥ పెళ్ళున చేతి విల్విఱుగు ♦ భీకర శబ్ద మడంగు నంతలోఁ
ద్రుళ్ళుచు నింద్రు నోర్చిన దు ♦ రుద్ధరు సంగరమందు గొన్న పె
న్విల్లు ధరించి రావణియు♦నిండు తెగన్ శరరాజిఁ గూర్చి వే
వెల్లిగ నేయ మారుతియు♦వెక్కస పాటున సోలి యంతలో.  ౯౩౦

ఉ॥ లేఖులు సంతసిల్ల వడి ♦ లేచి మహోద్ధతి నార్చి యుల్లస
ద్వైఖరి నొక్కసాలము జ ♦ వంబునఁ గైకొని పేర్చి లోక జీ
వాఖల భీకరంబుగ ను ♦ రారి శిరంబును చూచి వైచెఁ ద
చ్ఛాఖలఁ జిక్కి నొచ్చి వివ ♦ శత్వము నొంది యతండు తేఱుచున్.

చ॥ పటపట పండ్లు నూఱుచు సు♦పర్వులు దిగ్భ్రమ చెంది నిల్వ న
త్కట గిరి కై వడి న్నిలుచు ♦ గాడుపు పట్టి యొడల్ చలించి లం
పటగొనఁ బుంఖపుంఖ మను ♦ బంధముగాఁ గొన రింగు రింగునన్
జటపట శబ్దముల్ పఱవ ♦ సాయక జాలము లేసి నొంపఁగన్. ౯౩౨
చ॥ శిరము నురంబు బాహువులు ♦ చివ్వన గ్రుచ్చుచు నొంప నొచ్చి యు
ద్ధురతర రోష భీషణత ♦ దూఁగొని శ్రీ రఘు వీర బాణ వై
ఖరిఁ జని మారుతాత్మజుఁడు ♦ కర్బురు తోడను వాని తేరి నం
బరమున కేగ మీటి ఘన ♦ బంధుర గర్జ యొనర్చి మించఁగన్. ౯౩౩
క॥ కనుమూసి తెఱచునంతనె, ఘనుఁ డింద్రజితుఁడు శతాంగ♦గతుఁడై మిన్నె
ల్లను గాంచి నెత్తు రొలుకుచుఁ, దనుకుచు ధరమీఁద బడెడు♦తత్సమయమునన్.
తే॥ ఎక్కటకుఁ డేరు నెదిరింప♦నుక్కు లేమి, మదిని కుములుచు నప్పం క్తి♦వదనసుతుఁడు
వేఱుమార్గంబు గానమి♦మాఱులేక, చంపు బ్రహ్మాస్త్రమును బ్రయో♦గింపఁదలఁచె

—: హనుమంతుఁడు బ్రహ్మాస్త్రముచేఁ గట్టువడుట :—

మ॥ విరి పుష్పంబులు ధూప దీపములు నై ♦ వేద్యంబు ధ్యానంబుతోఁ
స్థిరభక్తిన్ మది నర్చనల్ సలిపి దృ ♦ గ్దర్శ్యాది శశ్వచ్చరా
చర సృష్టిం దగఁజేయు ధాతృశరమున్ ♦ సంధించి భూనాక భీ
కర లీలన్ హనుమంతు బాహువుల ల ♦ క్ష్యం బుంచి యేసెన్ వడిన్.
ఆ॥ అమరు లడల వచ్చి ♦ యయ్యమోఘాస్త్రంబు, సర్పరాజ రూప ♦ సరణి మెఱసి
ఖగకులాధి పతియుఁ♦గదిరి దిగ్భ్రమఁ జెందఁ, బవన సుతుని కేలు♦పట్టి చుట్టె.
మ॥ బల సంపన్న శరీర మావిధమునన్ ♦ బ్రహ్మాస్త్ర బద్ధంబుగా
విలయాంతోగ్ర విధుంతుద గ్రసిత ని ♦ ర్వీర్య ప్రభాయుక్తి మై
నిలకుం ద్రెళ్లిన చంద్రుఁడో యనఁగ ను♦గ్రేష్టాంశుఁ డవ్వేళ నో
త్తిలి వెన్నంటిన ధర్మదేవతయు నా ♦ ర్తిం బొంద భూమిం బడెన్.
మ॥ వనవాటీ బహిరంగణంబున జగ ♦ త్ప్రాణి ప్రమోదుండు త
ద్ఘనపాశంబు విరించనాస్త్రమనియున్ ♦ దన్మైత్రి, దా నేర్పియున్
వనజాతాసను వాక్యముం దలఁచి ని ♦ ర్బంధంబు నంగీకృతిన్
గనుల న్మూసెను డాసె నింద్రజితుఁడున్ ♦ గౌతూహల స్వాంతుఁడై.
మ॥ అసువుల్ దక్కనఁ జాలునంచు వడి ము ♦ న్నత్యంత భీతాత్ములై
చెనలం దూఱిన దైత్యు లప్పుడు మహా ♦ ధీరాత్ములై డాసి వె
క్కసమై చుట్టిన నాగపాశమును పీఁ♦కంబట్టి యీడించుచుం
గసి దీఱం గని తిట్టి రార్చిరి మహా ♦ గాంభీర్యముల్ సూపుచున్,

ఉ॥ కోఁతిబలంబు క్రుంగె నని ♦ కూఁతలు వెట్టుచు గంతులేయుచుం
బ్రీతి వహించు లంక యొక ♦ భీకర వారిధి పొల్పుదోఁచె న
వ్వాతసుతుం గవించు నహి ♦ వాసుకిఁ బోల నిశాచరుల్ సుర
వ్రాతముఁ బోల నొప్పెనఁగ ♦ వాయుజుఁ డయ్యెడ మందరాద్రినాఁ.

మత్త. నాగపాశ నిబద్ధ మారుతి ♦ నవ్య కాంచన దేహముం
బాగుగా గమనించి చూడఁ బ్ర ♦ భంజనుండు కదల్పఁగా
భోగిరాజు కదించి చుట్టిన ♦ భూరి భూధరమో యనం
రాగిలెం స్థిర చిత్రతం రుచి ♦ ర ప్రభా లస దంగితం. ౯౪౩

చ॥ పురుషులు చెల్వలుం గలిసి ♦ మూఁగిరి దిక్కులు భూతలంబు నం
బరమును సందులేక వడి ♦ వాయుజుఁ గాంచిరి పొంగియార్చి ర
ప్పర మపుడొప్పె మున్ను సుర ♦ ముఖ్యుఁడు పట్టువడంగ నైన నం
బరమును సంతసంబు వెఱ ♦ పాటును పొంది రహించు కైవడిం.

౧౩ పాశముక్తి పటలము (౧౪౦)

సీ॥ ఏయుఁడు నఱకుఁడు ♦ వ్రేయుఁడు పొడువుఁడు, చీల్పుఁడు ప్రేవులు ♦ వేల్పుఁ డనుచుఁ
ద్రెంపుఁడు త్రుంపుఁడు ♦ తినుఁడు మ్రింగుఁడు కొంది, పచ్చడి సేయుఁడు ♦ బ్రదికెనేని
మన జీవితంబులు ♦ మాఁడు ననుచు డాసి, పురుషులు తరుణులు ♦ ముసరి కసరి
యిందాఁక మసుఱుండ ♦ నిత్తురే యనుచును, తలను రోఁకండ్లతో ♦ దంపుఁ డనుచు

తే॥ నగ్ని లోనై చికాల్పుఁడీ ♦ యనుచు నంజు, కొనుఁడీయంచు నేలను రాచుఁ ♦ డనుచు తాలు
కట్టి కడలిఁ ద్రోపుండని ♦ నెట్టుఁ డనుచు, వారివారికిఁ దోఁచిన ♦ వగిది ననిరి.

క॥ నాతండ్రిని నాయన్నల, నాతమ్ముల నొప్పగించి ♦ నడువు మనుచు వీఁ
డీతీరు రాఁగతము న్వా, జ్ఞాతుల దీకనుచు వారిఁ ♦ జంపుం డనుచుం. ౯౪౬

ఉ॥ కొండలవంటి దార్ఢ్యము న ♦ కుంఠిత సత్త్వము గల్గు భర్తలం
గొండొక వీడియుండ మిఁక ♦ గోడుగ నేడ్చువనేల కోఁతి పె
న్మొండము ద్రొక్కి నిల్చి పెడ ♦ మోముల నూడ్తము తాళిబొట్టులం
ముండలమైతి మంచు వెత ♦ ముచ్చిరు చెల్వలు పల్వురయ్యెడం. ౯౪౭

తే॥ ఈడ్చుకొని పోవువారికి ♦ నెదురు వచ్చు, లంక జనములు నేయు కో ♦ లాహలంబు
పతులు మరణింప విలపించు ♦ సతులకెల్ల, నించుకంత సమాశ్వాస ♦ మొనయఁ జేసె.

ఉ॥ వీరుల గొరులం హరులఁ ♦ బెంపగు తేరుల నెత్తివెవ బృం
దారకనాథ వజ్రహతి ♦ ధాత్రిధరంబులమాడ్కిఁ బడ్డ సిం
గారము గల్గు వీథుల న ♦ గారములం గని సంతసిల్లుచుం
మారుతి పోవుచుండె నల ♦ మానుష భోజను లీడ్చు త్రోవలం. ౯౪౮

ఉ॥ చీమల కూటువల్ మునరి ♦ చెట్టును చుట్టిన యట్లు సంగర
స్థేమము నొందు బాహువులు ♦ దివ్య భుజంగ నిబద్ధమాట కాం
తామణు లారఁ గానక వి ♦ తాకున నీకపి వచ్చె నీడ క
మ్మా! మన కేది దిక్కనుచు ♦ మూసిరి చేష్టలు కొంద ఱుత్తలన్. ౯౫౦

చ॥ పలువురు చూచి నివ్వెఱగు ♦ పాటున నేడ్చిరి విహ్వలించుచున్
పలువురు వెక్క నేమిగతి ♦ పట్టునొ యంచొగిఁ బాఱి రవ్వలన్
బలువురు పాఁపత్రాళ్ళు లోక ♦ పాటిరొ యంచు వచించి రొయ్యనన్
బలువురు కీరితించి రల ♦ వాయుజ వీర విహార లీలలన్. ౯౫౧

ఉ॥ కొండలు పిచ్చలించి కని ♦ క్రూర భుజంగమ పాశ మీా మరు
న్నందను మేనఁ బూసరము ♦ నాణెముగాఁ బెనవైచినట్టు లిం
పొంద వెలుంగుచుండెను స ♦ మున్నతి నాస్యము సత్ఫలంబులన్
డెందములందు తేలిచి ఘ♦టించుట మేలని యాడి రయ్యెడన్. ౯౫౨

తే॥ రాజుకడకుఁ గొంపోవుట ♦ రాణకాదు, క్రుంగి వీఁడుంట కట్టుల ♦ లొంగికాదు
వెనుకయాలోచనము వేఱు♦వెతలుగలుగు,ననుచు వాయుజుఁగని మ్రొక్కి♦యణఁగినారు.

తే॥ వైనతేయుని మించిన♦బాహుబలులు, దైత్య లేఁబదివేలు గం♦ధవహతనయుఁ
గట్టినట్టి పాశంబును♦పట్టి లాగి, కొనుచుఁ బోవుచుండిరి వేడ్క♦కొనలుసాగ.

క॥ అంతకుఁడు బల పరాక్రమ, వంతుల దైత్యుల నడంప ♦ స్వాకృతితో రా
స్వాంతమున జడిసి యీా వహి, వింతగు రూపంబు గొని క♦వించెనొ యనుచున్.

చ॥ దనుజ చిరంటికల్ ఘన సు ♦ ధా ధవళంబగు సౌధ వీథులన్
మునుకొను చంద్రశాలలను ♦ ముంగిళులందున దిడ్డియందు వా
దనములు గల్గు చోటుల ము ♦ దం బలరారఁగఁ జూడవచ్చి యీా
వనచరుఁ డెందు వాఁ డితనిఁ ♦ బంపిన దెవ్వరొ యంద్రు నివ్వెఱన్.

తే॥ మడఁతి సీత పాతివ్రత్య♦ మహిమచేత, రేఁపఁగా ఖండపరశు వీ♦కృత్రిమంపు
రూపుగొని యంతమైన లం♦కాపురంబు, మూలుపంబూని వచ్చెఁ గాఁ♦బోలుననిరి.

తే॥ అమరకాంతలు విద్యాధ♦రాంగనలును, భుజగకన్యలు చక్కఁరఁ♦బోఁడులైన
సిద్ధవనితలు మత్తకా♦శినులు జక్కి, నులును కలకలమని వచ్చి♦యొలసిచూచి.

తే॥ వారిధిని యోగనిద్ర నొ♦ప్పారుచక్రి, సృష్టికర్తయై వెలయుఁ బవి♦రించియుఁ బగ
పూని తమతమ రూపముల్ ♦మాని యొక్క, దేహముంగొని భూమికి♦దిగిరొ యనిరి,

ఉ॥ దైత్యులు దైత్యకామినులు ♦ దక్కఁగఁ దక్కిన యక్ష కిన్నరా
దిత్య భుజంగ సిద్ధ సుద ♦ తీమణు లెల్లరుఁ గాంచి డెందమం
దత్యనురాగులై కనుల ♦ నశ్రులు నించిరి ధారణీ సుతా
నిత్యహితంబు గోరుటనొ? నిర్మల ధర్మము నాశ మాటనో? ౯౬౦

క॥ వీరుఁడు మారుతి యిదియే, కారణముగ నిట్లి వేఱు ♦ గాక చనుచు లం
కారమణుం గాంచుట నా, కారయ లగ్గనుచు నెంచి♦యటులే యరిగెఁ. ౯౬౧

ఉ॥ నాజనకుండు వాయు కరు ♦ ణఁ రఘురామ పదారవింద హృ
త్పూజను తల్లి రామసతి ♦ పూర్ణమతిఁ జయసేయు దీవనఁ
జేజె లొనంగు సద్వరము ♦ చేతను వారిజగర్భు నస్త్రమి
య్యోజన త్రెంచికోఁగలను ♦ ప్రోద్బల పద్ధతిఁ జేయ నియ్యెదఁ. ౯౬౨

తే॥ రాక్షసేంద్రుని సంధించి ♦ రాజిత గతి, నెల్ల రెఱుఁగంగ రఘురాము♦నీద్యశక్తి
సంభవించు పరిస్థితుల్♦చక్కఁ దెలుప, దిటవు చెడి జానకిని వీడఁ♦దివురవచ్చు.

ఉ॥ అంతియకాక వాని నచి ♦ వార్త చమూబల సంపదాళియుఁ
నంతనగా నెఱుంగనగుఁ♦జక్కటి దెల్పఁగవచ్చు రావణ
స్వాంతము జాడయుఁ దిటవు ♦ సంస్థితి గానఁగవచ్చు వాఁడు త
త్స్వాంతము దాఁచినఁ మొగము ♦ తప్పక చెప్పదె యెల్ల రీతులఁ ?

తే॥ వాలి నిధనంబు మఱి సాల♦భంజనంబు, వానర బలంబు రవిజు న♦వార్యగరిమ
తెలియఁ దెలుపఁగవచ్చును♦తెలిపినంత, మదికి నాటినఁ జెడుగులు♦మానవచ్చు.

ఉ॥ కావున నేగుటే తగిన ♦ కార్యము రామ పరాక్రమ స్థితుల్
రావణుఁ డాలకించి తగు ♦ రాణఁ జరించిన లెస్స కాదయే
నావలఁ గొంచెకొంచెముగ ♦ నబ్బిన దానవసేనఁ గూల్చి ధా
త్రీవరుఁ జేరుటే తగిన ♦ తీరని మారుతి యేగె వారితో. ౯౬౬

ఆ॥ గొప్పసేన తన్ను♦గొలిచి రా వృషభంబు, పగిదిఁ గట్టువడిన♦వాయుసుతుని
రాజ సౌధమునకు♦రాణతోఁ గొంపోయె, నెల్లవారు చూడ♦నింద్రజిత్తు. ౯౬౭

క॥ దూతలు మున్నుగ వెసఁ జని, దైతేయప్రభుని గాంచి ♦ తలిరుచు భక్తిఁ
వాతూలి కట్టువడె జల, జాతాసను నస్త్రమునఁ బో♦నంగఁగ ననుడుఁ. ౯౬౮

తే॥ వినిన యతఁ డుత్సహించి య♦వ్వినుచువారి, కిచ్చె దిగ్గజ రదనంబు♦లీడ్చికొన్న
తారహారంబు తనయొమ్ము♦నూర చంద్ర, రహిత గగన స్థలంబను♦రహిఁ వెలుంగ.

తే॥ అమిత కౌతూహలమున బా♦హాలి వొంగ, గండొవలు వికసింప లం♦కావిభుండు
సత్వరంబుగ మీఁ రేగి చంపకుండఁ, గోఁతి నిటకుఁ దోడ్తేరఁ బ♦ల్కుఁడని పంపె.

క॥ వార్తాహరు లరిగి విభుని, వార్తను తనయునకుఁ దెలుపఁ♦బరవిన యది య
వ్వార్తపురమెల్ల నది విని, యార్తిని మదిగుంది సీత♦యమిత వ్యథచే. ౯౭౧

ఉ॥ కావలిగల్గు నీవనముఁ ♦ గాడుగఁ జేసెను పట్టువచ్చు దై
త్యావళిఁ గూల్చెనంచు విని ♦ యప్పటి కప్పుడ నంతసించితిఁ
బావని యిట్టి యాపదల ♦ పాలగుటం దలపోయ దుర్విధుల్
పోవవు నన్ను వీడి యని ♦ బుద్ధిఁ దలంచెద నంచుఁ గుందుచుఁ ౯౭౨

ఆ॥ ఒడలు ధూళిఁ గ్రుంగ ♦ నొక్కిదంష్ట్రఁ జిత్రంబు, పొగచు కరణి నొప్పి ♦ భూమిపుత్రి
చెడుగు మృగయుచేతఁ ♦ జిక్కిన పోతంబు, కొఱకు నేడ్చు హంసి ♦ కరణి వగచె.

తే॥ మింటి నంటెడి పొడవగు ♦ మేను గలిగి, సర్వ విద్యల నేర్చిన ♦ చదురు గలిగి
జలధి దాఁటిన యలవును ♦ బలువు గలిగి, యక్కటా! చిక్కితివె యొక ♦ యసురుచేత

చ॥ తగవె జయించు నిక్కమను ♦ తద్‌జ్ఞుల పల్కులు పొల్ల యయ్యె నీ
దగు బలశక్తు లిక్కరణి ♦ నాఱెనె ? పాపమె గెల్పు నొందెనే ?
జగతిని ధర్మమే నిలువఁ ♦ జాలక తాఱెనె ? యక్కటక్కటా ?
నెగుళ్లులపై నెగుళ్లు లిటు ♦ నిల్వనఁ గాల్చునె నన్ను నిచ్చలున్ ? ౯౨౫

ఉ॥ ముద్రిక నిచ్చి ప్రాణములు ♦ ముచ్చట నిల్పిన నీకుఁ బ్రీతిమై
భద్రములం జిరాయువును ♦ పల్కితి నయ్యది తప్పదంచు నీ
క్షుద్రుల గీటడంప భుజ ♦ శూరతఁ జూపఁ దలంచి యిట్లు సో
పద్రవ మార్గగుండవయి ♦ ప్రబ్బ గడించితి వాయునందనా ! ౯౨౬

మ॥త్త॥ ప్రాణదాతవు నీవు నాపదు ♦ పాటు లచ్చటఁ దెల్పి నా
ప్రాణనాథుని తోడి తెత్తువు ♦ రాముఁ డాజిని రావణ
ప్రాణముల్ తొలఁగించి నాచెఱఁ ♦ బాపునే యని యో జగ
త్ప్రాణనందన! నమ్మియుండఁగఁ ♦ బాడు చేసితి వన్నియున్. [వడీన

తే॥ అనుచుఁ బలువార్త లాడుచు ♦ మనసు కరఁగఁ, బ్రాణములు చలింపఁగఁ ♦ గ్రేపు ♦ కట్టు
గోవువలెఁ దపించుచు గ్రుంగి ♦ కోమలాంగి, సీత మేదినిపై సొమ్మ ♦ సిల్లి వ్రాలె.

ఆ॥ అట మహాత్ముఁడైన ♦ యంజనీ పుత్త్రకు, నిటియఁ గట్టినట్టి ♦ యింద్రజిత్తు
తొలి తపఃఫలమునఁ ♦ దొడరి జగంబుల, గెలిచినట్టి యసుర ♦ కొలువుచేరె. ౯౨౭

సీ॥ ముల్లోకముల వెల్గు ♦ ముద్దు చంద్రుండనఁ, గ్రుచ్చి యెత్తిన వెండి ♦ కొండ యనఁగ
ముత్యాల గొడుగు న ♦ మ్మున్నతి వెలుఁగఁ జక్ర పవి శూలంబుల ♦ వ్రణ వితాన
మతివల నఖ రేఖ ♦ లలరారు వింశతి, బాహుల నంగద ♦ ప్రభలు వెలయ
నురుకోప వహ్నిచే ♦ నూర్పుల పొగలచే, వడగాలి వడ వెస ♦ నడరె ననఁగ

తే॥ మరకత ద్యుతి ప్రతతితో ♦ మణుల శోభ, నరకమున కేగి దాఁగిన ♦ యిరులఁ గ్రింగ
శేషుఁ డన్ని దిక్కులకును ♦ శిరము లలరఁ, ద్రిప్పి పేరోలగంబున ♦ నొప్పెననఁగ.

ఉ॥ తేర్చి ఖచించినట్టి మణి ♦ దీప్తులు కాసియు నుండి పర్వఁగాఁ
జేర్చి దివాకర ద్యుతిఁ గ ♦ వించు విభూషలు బాహుకీర్తులన్
దీర్చి వెలుంగ వారినిధి ♦ దివ్య సువర్ణ గిరీంద్ర శృంగముల్
మార్చి కిరీట పంక్తిగ న ♦ మర్చి ధరించిన చెల్వు దోఁపఁగన్.

ఉ॥ చెందిర పన్న బిరాజు కటి ♦ చేలము కచ్చముతో వెలుంగఁ దా
కేందు వర ప్రకర్ష మురు ♦ హీర మణి ద్యుతి నెచ్చరింపఁగా

డాంధ తమంబు సాంధ్య రవి ♦ నంతరమందు ధరించి తారకా
బృందము భూమిగాఁగఁ జలి ♦ వెల్గును ఛత్రముగా ధరించెరా.

తే॥ సౌరునకు వేదములకు గం ♦ భీరిమకును, తావలంబగు మొగములు ♦ దశదిశలకు
దృష్టులం ద్రిప్పు నప్పుడెల్ల ♦ దిగిభ పాల, కులకు ధ్రువ శేషులకు భీతి ♦ గొలుపుచుండ.

సీ॥ లోకైకనాయకు ♦ కాకుత్స్థు దేవిని, కాంచిన పిదప నా ♦ గంబునుండి
సత్యమ్ముదాఁక నీ ♦ జగముల తరుణులు, పురుషులవలెఁ దోఁచు ♦ పొలుపు నిలువ
వానర హరి హర ♦ మానవావళి తక్కఁ, జెరవారు కేల్మోడ్చి ♦ బిరుదులాడ
వేణు వీణాదిక ♦ వినుత రవంబుతో, రంభాదు లించు న ♦ ర్తనము సలుప
లయకు ననుగుణంబుగ మద్దె ♦ లయు ధ్వనింప, హస్తములు నేత్రములు బొమల్ ♦ హారువుమీఱ
మునులు సైతము ముక్తిపై ♦ మనసు రోసి, యూడు మేనకపైఁ జూడ్కు ♦ లలర నిలుప

సీ॥ ఒకమోము పొలయల్క ♦ నూనిన సతి ముఖా, బ్జాత మరంద మా ♦ సక్తి నాన
ఒకమోము తనతోడ ♦ నొగిఁగూడి యలసిన, చెలి యధరామృత ♦ మొలసి యాన
ఒకమోము తనియ గీ ♦ తికఁ బాడు కామినీ, తారుణ్య మోహామృ ♦ తంబు నాన
ఒకమోము నర్తన ♦ మొనరించు మగువల, యభినయ రస సుధ ♦ నాన నాన

తే॥ ఒకమొగము వేల్పులకు నాజ్ఞ ♦ లొసఁగుచుండ, నొకమొగము మంత్రణంబుల ♦ నొనరఁ జలుప
నొకమొగముఘోరపాపచి ♦ హ్నకలవెలుప, నొకమొగముజానకీరూప ♦ మూహసేయ.

తే॥ ధరణిజాత పతీత్వమర్ణ ♦ శరధి సీఁది, దరిని చేరు టెట్లని యొక ♦ శిరము దలఁప
మలయజస్తనుల్ తనచుట్టు ♦ నిలిచిచూపు, ముకురమునఁదనసౌరొక ♦ మొకముచూడ.

చ॥ తొఱటను తేనెకై చను మ ♦ ధువ్రతమట్లు ధరాత్మజాతపై
పరుగులు వాఱు డెందమును ♦ భావననేసి తపించువారు చ
న్గిరులను బొమ్మ బిందువులు ♦ నెట్టన రాలఁ గృశించువారు నొ
తెఱవల చూపు తూపులు ప ♦ దింబది బాహులమీఁద వ్రాలఁగన్.

ఉ॥ పుష్పొడిఁ బూసికొంచు మధు ♦ వుం దగఁ ద్రావుచుఁ దమ్మిమొగ్గ ల
ట్లొప్పిన చన్నుదోయి పయి ♦ నొందిన చందనమందు డిందుచున్
గుప్పున వచ్చు తెమ్మెరలు ♦ గొప్ప ప్రతిక్రియ సేయు కైవడిన్
విప్పగు పుష్పబాణ శర ♦ విద్ధ మహా వ్రణరాజిఁ దూఱఁగన్. ౯౮౮

తే॥ వాలుగంటుల యానన ♦ పద్మములకు, భాస్కరుంబోలు వాఁడై సు ♦ పర్వ వరుల
కేలుఁ దామరలకు శశిఁ ♦ బోలియున్న, వైశ్రవసుఁ గాంచె ముంగల ♦ వాయుసుతుఁడు.

ఉ॥ కాంచి భుజంగముం గను ఖ ♦ గప్రవరుం బలె నుగ్రమూర్తియై
సంచిత కర్మబంధముల ♦ జ్ఞానముచే బలె నాగపాశముం

ద్రెంచి విదిర్చి మైథిలికిఁ ♦ దీఅని శోకము గూర్చినట్టి న
క్తంచర నాథుఁ ద్రుంతునని ♦ తత్తఱమందుచు వెండి యిట్లనున్. ౯౯౦

శా॥ నిద్రం బొందిన వాని యావి గొనుటల్ ♦ నింద్యంబుగా నెంచి యా
త్మన్ద్రుఁ వీడితి రేయి నిప్పుడో యిటం♦గొల్వున్న వాఁ డేల యు
న్మాద్రిన్ మానుట వీనిఁ జంపి జనక ♦ క్ష్మానాథ సంజాతకున్
భద్రంబుల్ సమకూర్చి రామునకు నో ♦ ప్పంజెప్పు టే యుక్తమా. ౯౯౧

ఉ॥ రాముని దేవిఁ జైకొని జె ♦ ఱం బదిలించుటఁ జూచుచున్న దై
త్యామరపాళి యిప్డు కను ♦ లారఁ గనుంగొన వీని శీర్షముల్
దామెనగట్టి యీడ్చికొని ♦ తామరసాక్షుని చెంత కేగ కి
క్లేమని రిక్త హస్తముల ♦ నేగుదు? నేమని విన్నవించెదన్? ౯౯౨

చ॥ వెదకుచు వచ్చినట్టి యొక ♦ వీర వనేచర ముత్సహించి తా
మది గొను మానినీ మణులు ♦ మస్తములం దగ మోఁదికొంచు ది
క్పదముల కేగఁ బంక్తిముఖు ♦ బంధుర వక్త్రము లుర్విఁ గూల్చి బె
ట్టిదముగ సింహనాదము ఘ ♦ టించిన దన్న యశంబు పిన్న యే?

చ॥ ఎదుటనె కాంచి దానవ కు ♦ లేశ్వరు జీవము లుజ్జగించి ప్ర
ల్లదములు గొన్ని పల్కి మర ♦ లం జనినాఁడన యేని అవ్వ యే
కుదురు; నెదిర్చి గెల్వ కిలఁ♦గూలిన యేనియుఁ గీర్తిగాక వే
ఱొదవునె? యెట్టులైనను శు ♦ భోన్నతి గల్గుట నిక్క మిర్విధిన్.

తే॥ నాగపాశంబు తెగిపడ♦నగము మీఁది, కుఱుకు మగ సింగముం బలెఁ♦గఱకు టసుర
పైకి లంఘింతునని తల♦పడుచు నుంత, తగదనుచుఁ గూడ వగచె నా♦శుగ సుతుండు.

మ॥ అమరారాతి వధింపఁదగ్గ సులభుం ♦ డౌనేమి? సాహాయ్య సై
న్యములం జూడ నలంతిఁ బోవఁ డితనిన్ ♦ న క్తంచర శ్రేణి వం
శముతోఁ ద్రెంపఁగ రాఘవుండె తగు; నెం ♦ చన్ సాహసోద్యోగి శ్రే
యము:లం గాంచునె? మించిపోవునొకొ దై ♦ త్యాధీశుఁ డింతింతలో?

మ॥ గెలువన్ శక్యముగాదు వీనికి నను్ ♦ గీర్వాణులుం దోడ్పడన్
బలవంతుండగు వీని నేనును జయిం ♦ పం గాదు డీకొన్న చోఁ
దలఁపం బెక్కు దినంబు లేగు; ధరజా ♦ ధ్యక్షుండు నారాకకై
తలఁకున్ శంకిలు నట్లు సేయుటలు న ♦ త్కార్యంబొకో దూతకున్?

చ॥ జగములు సంతసిల్ల భువి ♦ శాశ్వత ధర్మము పూని నిల్వ న
వ్వగతుని రావణాసురుని ♦ బాహులు శీర్షములెల్ల మేదినిం
దెగిపడఁ గూల్తు నేనని ప్ర ♦ తిజ్ఞ యొనర్చిన రాము వాక్యముల్
తగ విని యిట్టి సేతకును ♦ తార్కొను టేటి హితంబు నాకగున్?

ఉ॥ ముమ్మరమైన సంగరము ♦ పూని యొనర్చుచుఁ గాలమెల్ల వ్య
ర్థమ్ముగఁ ద్రోచుచుండిన ధ ♦ రాసుత పక్షము లొక్క రెండె ప్రా
ణమ్ముల నిల్పు దాన నని ♦ నాథుని పేరఁ బ్రతిజ్ఞసేసె నే
నిమ్మెయినైన నాజనని ♦ యీల్గుట నిక్కము నిక్క మక్కటా! ౯౯౯

తే॥ కాన బవరంబు తగినది♦కాదు నాకు, దౌత్యమే యిందు చూడ ను♦త్తమ మటంచు
నిశ్చయించి రాఘవదూత♦నిర్భయమున, రావణుని కొల్వు లోనికి♦రాణఁ జనియె.

కం॥ దానవేంద్రుఁ గాంచి♦తగ నింద్రజిత్తు పా, వనిని చూపి వీఁడు♦వనచరుండు
కాఁడు హరుని వంటి♦కడిమి గలాఁడు వ, నంబుఁ జెఱిచి యక్షు♦నలఁచెననుడు.

మ॥ కన నంకించిన నేత్ర తారకలఁ బ♦ ల్కం బూను నాస్యంబునన్
ఘన ఖద్యోతము లుప్పతిల్లి హనుమ♦ ద్గాత్రంబు గాల్పంగ నూ
ర్చిన నిట్టూర్పుల ధూమజాలము వెసం ♦ జిత్రంబుగా నూత్న బం
ధనమై క్రాల దశాననుండు పలికెన్ ♦ దర్పంబుతోఁ జూచుచున్.

చ॥ కులిశివో శూలివో హరివొ ♦ గూఢ పదార్థ్యుఁడవో యముండవో
జలజహితుండవో శిఖివొ ♦ శక్తి ధరుండవొ పొట్టి మానివో
పలువలు మాను లిప్పగిదిఁ ♦ బంపిన కృత్తివొ ధాత లంక ని
ట్లిలమఁగఁ గ్రొత్తగాఁ బడసి ♦ యంపిన యుద్భట ధైర్యమూర్తివో?

—: హనుమంతుఁడు రావణునకు నీతి గఱపుట :—

చ॥ ఎవఁడవు నీవు? వచ్చుటకు ♦ హేతు వదెయ్యది? పంపినట్టి వా
రెవరు? నిజంబు తేల వచి ♦ యింపుము నావుడు నాంజనేయుఁ డీ
పవిది వచించు నీవనిన ♦ వారల నెవ్వఁడఁ గాను రాజ పుం
గవుఁ డనమాన ధన్వి పని♦కై యిట వచ్చిన దూత రావణా! ౧౦౦౪

చ॥ అతఁ డెవఁ డంచు వేని యజ ♦ రాదు లజాదులు మాని బృందముల్
తత సుగుణాఢ్యులుం బహు వి ♦ ధంబులఁ జర్చ యొనర్చి నేయఁగా
జత పడకుండు నక్కజపుఁ ♦ జక్కటి దీర్పఁగ దీక్షపూని యు
ద్ధతిమెయి నుద్భవించిన యు ♦ దార జగత్పరి రక్షకుండగున్. ౧౦౦౫

చ॥ బలము తపః ఫలంబు పరి ♦ వారము ధాతృవరంబులున్ యశః
కలిత గురుత్వముల్ జయము ♦ గర్వము శౌర్యము ధైర్య కార్యముల్
కలిమియు దుష్టచేష్టలు న ♦ కాండముగా నొక యమ్ముతోన యి
య్యిలఁ గలువం గలట్టి ధను ♦ రింద్రము చేకొనినాఁడు రావణా! ౧౦౦౬

ఉ॥ కాఁడతఁ డాదితేయుఁడును ♦ కాఁడసురుండును కాఁడు దిక్కరుల్
కాఁడల వెండికొండయును ♦ కాఁడు త్రిమూర్తులు కాఁడు దిక్పతుల్

కాఁడు మునీంద్రులున్ జడలు ♦ కాఁపుల పున్నెము కంబరాదులం
దాడన సేయు నా దశర ♦ థ క్షితిపాలుని పట్టి రావణా! ౧౦౦౭

ఉ॥ జ్ఞానము సర్వశాస్త్రములు ♦ సత్తపముల్ సకలంబు మానుగాఁ
దానెది నిశ్చయించు మదిఁ ♦ దత్ఫలమే యొసఁగున్ జగత్త్రయిన్
మానవమాత్రుఁడా యతఁడు ♦ మైవడి ధర్మము వేద శాస్త్రముల్
పూని నుతించుచుండు పరి ♦ పూతుఁడు నిర్మల ధర్మ మూర్తియున్.

సీ॥ వేదంబులందును ♦ వేదశిరస్సుల, యందుఁ బూర్తిగఁ జూడ ♦ నందకుండు
విజ్ఞానమునకును ♦ విజ్ఞాన మగువాఁడు, ముగురు మూర్తులకును ♦ మొదలివాఁడు
మూఁడు కాలములకు♦మూఁడు గుణములకు, మూఁడు తావులకును♦మొదలివాఁడు
గజరాజుఁ గాచిన ♦ కరుణామయుఁడు సుర, ప్రార్థనంబును విని ♦ వారికొఱకుఁ
తే॥ జక్ర శూల కమండలు ♦ సాధనముల, వదలి విలుదాల్చి ప్రాఁతవౌ ♦ వటదళంబు
వెండికొండను గమలంబు♦వీడి క్రొత్త, దగు నయోధ్యా పురంబున ♦ నవతరించె.

మ॥ తన పాదాబ్జముల న్నిరంతరము చి ♦ త్తంబందు ధ్యానించు స
జ్జన హృద్వాసుఁడు ధర్మ పద్ధతుల సం ♦ స్థాపించి తాఁబోవు తె
న్నున లోకంబు చరింప దుర్జనతతిన్ ♦ నుగ్గాడి సన్మార్గ వ
ర్తనులం గావ జనించె నాతఁడు జగ ♦ ద్రక్షామతిన్ రావణా! ౧౦౧౦

తే॥ అతనిదాసుఁడ హనుమంతుఁ♦డంద్రు నన్ను, ధరణిజను రోయఁజను వారి♦వరులయందు
వచ్చె దక్షిణదిశకు మా♦వాలిసూనుఁ, డతఁడు పంపవచ్చిన వాఁడ♦ననుడు నతఁడు

ఉ॥ వాలి సుతుండు నిన్ననుప ♦ వచ్చిన దూతవొ నీవు? ధీరుఁడౌ
వాలికి సేమమే? ప్రభుత ♦ పద్ధతిగా నెఱవేఱుచున్నదే?
పోలఁగఁ దెల్పుమా యనుడు ♦ పూత చరిత్రుఁడు రామదూత వా
తూల సుతుండు దంతములు ♦ తోఁపఁగఁ బక్కున నవ్వి యిట్లనున్.

ఉ॥ ఏల భయంబు రాక్షస కు ♦ లేశ్వర! డెందము నిల్వరింపు మ
వ్వాలి దివంబుచేరె రఘు ♦ వర్యుని శాత శరం బొకంట న
వ్వాలి మరించునాఁ డతని ♦ వాల్మును తోడనె పోయెఁ గ్రమ్మఱం
జాలదు మాకు నిప్పుడు త్వ ♦ షాంపతి పుత్త్రుఁడు రాజు నావుడున్. ౧౦౧౩

తే॥ వాలి నొక కోలచే నేల♦కూలనేసె? రాముఁ డిపుడేడ నున్నాఁడు♦రాముదేవి
వెదక నంగదుం డరుదేరు♦విధ మదెట్లు? తెలియఁ గోరెద ననుచు దై♦తేయుఁ డడుగ.

మ॥ ధరజాన్వేషణ తత్పరత్వమునఁ గాం ♦ తారంబులన్ వచ్చు భా
స్కర వంశాఢ్యుల రామలక్ష్మణుల వే ♦ డ్కం గాంచి సుగ్రీవుఁ డ
క్కఱతో స్నేహముచేసి తాఁబడిన దుః♦ఖంబుల్ ప్రసంగింపఁగాఁ
గరుణాళుండయి రాఘవుండు తునిమెం ♦ గాపేయ రాజ్యప్రభున్. ౧౦౧౪

మ॥ రుమతో రాజ్యరమన్ రఘూత్తముఁడు కా ♦ రుణ్యంబుతో నిచ్చి మి
త్రముతో నాలుగు మాసము ల్కడపి చే ♦ రన్ వచ్చియున్నట్టి సై
న్యములం గాంచి ధరాత్మజన్ వెదక నా ♦ నాదిక్కులం బంప నే
మముతో నేమిట వచ్చినార మిదియే ♦ మాకార్యముల్ నావుడున్.

ఉ॥ మీ కులనాయకుం దునిమి ♦ మీ కపకారము చేసినట్టి ని
ర్భీకునితోడఁ గూడి కుల ♦ శీలము బూదిని గల్పికొంటి ర
స్తోక యశంబుఁ గోలుపడి ♦ తోరపు నిందను మోచినారలే
కాకయు నిట్టులౌటయు జ♦గత్ప్రతి స్త్రీత్వమె యొందెనంటకా? ౧౧౭

ఉ॥ అన్నను చంపఁగాఁ గొలిపి♦యట్టు లొనర్చిన వానితోడనే
మిన్నక మైత్రి చేసికొను ♦ మీప్రభు పంపున నాకుఁ దెల్పఁగా
నున్నది యేది? నీవు దను ♦ జోత్కరముం బొరివుచ్చ నేలరా?
నిన్ను వధింప జంకకుము ♦ నిక్కము తెల్పుము వానరాధమా! ౧౧౮

ఆ॥ అనుడు సద్గుణాఢ్యుఁ♦డౌ హనుమంతుడు, పంక్తిముఖుఁడు పల్కు♦పల్కుల విని
యించుకంత వగచి♦యిట్లను మాధ్యస్థ, నీతి దెలుపు టుచిత♦రీతి యనుచు. ౧౧౯

తే॥ దూతనై వచ్చినది రవి♦సూతి హేతు, వునని యుక్తంబులును ధర్మ♦వులును నీతి
మంతములు హితములును సం♦భావ్యములును,గలుగు పలుకులు గలవు పెం♦పలర వినుము

ఉ॥ జీవితమున్ వితావితగఁ ♦ జేసితి వించుకయేని రాజ ధ
ర్మావధి గానకుండితి వ ♦ హా! పలుగాకులు సేయు నైచ్యముల్
హావిరిఁ జేసి తిప్ప దిగఁ ♦ బాటెడు వేళయు వచ్చె నైన నో
రావణ! నాదు మాటవిని ♦ రాజ్యము నేలుము కొంత కాలమేన్. ౧౨౦

ఉ॥ మిక్కిలి కష్టపెట్టితిను ♦ మీజని నిశ్చల మానినీత్వమున్
జొక్కము గాఁగఁ గల్గినది♦శుమ్మ్రముకంటెఁ బవిత్ర జానకిన్
జిక్కులపాలు చేసితివి ♦ చిక్కని యింద్రియపాళి గెల్చి పెం
పెక్కఁ దపించి తత్ఫలము ♦ నిట్టులు నాశము సేయు టొప్పునే! ౧౨౧

తే॥ వఱదఁ బోయెను నీగౌర♦వంబు నేఁడె, యించుకంత శ్రేమించిన♦నిఁకయు రేపె
నిర్జరుల జయించితి నని♦నిక్కనీల్గు, గర్వ మగ్గలమాట నీ ♦ కఠణి జరిగె.

ఉ॥ పాపము పుణ్యమున్ గెలిచి ♦ పైకొన లేదను నార్యవాక్యమున్
బాపమతిం దలంపక త ♦ పఃఫల సంపద లెల్ల జానకిన్
దాపము పాలుచేసి వీత ♦ థం బొనరించితి వట్టి కృత్యముల్
నీపయి మాత్రమే చనునె?♦నీ యమరాన్వయ మెల్లఁ గాల్పదే? ౧౨౩

చ॥ తగవు తొలంగినట్టి వల ♦ తాపముచే మతి పాడుగాఁగ నీ
జగతిని నిందనొంది మఱి ♦ చచ్చి యధోగతి నొందినట్టి పీ

నుఁగుల గణింపఁగాఁ దరమె? ♦ నూల్కొని యొక్కఁడు బాగుపడ్డ వా
డగపడునేమి? లోకముల ♦ నారసినన్ బరమేష్ఠి వంశజా! ౧౦౨౫

ఉ॥ కాంచన కాంచనాంగులెడఁ ♦ గామముగాక మహాంధకార మొ
క్కించుక వేఱు గల్గునని ♦ యెన్న రుదార దయాగుణాన్వితుల్
కాంచన కాంచనాంగులెడఁ ♦ గామము వీడుట గాక వేఱుగా
నంచితమైన తెల్విగల ♦ దంచుఁ దలంపరు తత్త్వవిద్వరుల్ ౧౦౨౬

తే॥ మరులుగొని పరదారపై ♦ మనసునిల్పి, యెల్లిదంబొంది బిడియంబు ♦ కొల్లవిడిచి
మిసిమిమేనుకార్శ్యము నొందఁ ♦ బ్రబ్బునొందు, నీచ పురుషత్వమున మేల్మి ♦ నెగడునేమి?

చ॥ శరధి పరీత భూతలము ♦ జానుగ నేలిన రాజులందు నీ
కరణిని నీతిమంతులును ♦ కానరు వేదము లభ్యసించి య
త్యురుతర ధర్మముం దెలిసి ♦ యున్నతి నొందిన నీవ యిట్లు వెం
బరవలె నీతిమీఱఁ దగ ♦ వా? తలపోయుము నుంత రావణా! ౧౦౨౭

తే॥ ప్రియములేని యొకర్తును ♦ వేఁడి తెగడు, వడిన పిదప జీవములతో ♦ బ్రతుకుకంటె
ముక్కుతెగి మనుదశయును ♦ మురువు గలదె, యనుచుఁ బలుకుటయును యుక్త ♦
మగునె చెపుమ?

తే॥ జగములనశింపఁ జేయంగఁ ♦ జాలినట్టి, భుజములును శిరంబులు వేయి ♦ పొసఁగియున్నఁ
గావఁజాలునే యవి యూరిఁ ♦ గాల్ప రేఁగు, నగ్నిలోఁ బడు వలువల ♦ ట్లగును గాక.

తే॥ మెచ్చి త్రిపుర దాహకుఁడు నీ ♦ కిచ్చినట్టి, గొప్పవరములు దప్పినఁ ♦ దప్పుఁగాక
పాడి తప్పని శ్రీరామ ♦ భద్రుశరము, తప్పునని మదిఁ దలఁచుట ♦ తప్పు తప్పు.

చ॥ చెదరఁగనీక కావఁదగు ♦ సిగ్గుచెడంగ నహీన రాజ్య సం
పదలు నశింప నీచగుణ ♦ పద్ధతి నన్య సుమాంగి నిట్లు నీ
యెద వలపింతువే మఱియు ♦ నెల్లిదపుం బనులందు చాల బె
ట్టిదుఁడయి యాఱితేఱితి క ♦ డింది యవాంత్రము లబ్బ రావణా!

ఉ॥ పుట్టినవారు పుట్టు చెడ ♦ ముక్తిని పొందినవారు వేల్పులన్
నెట్టి తరించినారలును ♦ నిర్మలబుద్ధులు నీవు తప్ప నే
కట్టిఁడులేని రామపద ♦ కంజయుగంబును విస్మరించు వా
రెట్టులు నెందుఁ బుట్టిరిఁక ♦ నెవ్వరుఁ బుట్టనుపోరు రావణా!

ఉ॥ పంచిన రాజ్య సంపదను ♦ బంధు జనంబును జీవితంబులన్
వెంబర విత్తవై చెడఁగ ♦ వీడెద వేల? విదేహకన్య చి
త్తం బుపశాంతి నొంద విడి ♦ దాశరథిన్ శరణంబు వేఁడు వ్య
ర్థంబుగఁ జావనేల? యని ♦ తావక మిత్రుఁడు తెల్పె నావుడున్. ౧౦౩౪

తే॥ కొండలంబట్టి తిరుగాడు♦క్రోఁతికాదె? తెలుపఁబంపె నీతాకు సీ♦తులను నాకు
మేలుమేలని వికటంపు♦లీల నవ్వె, నపజయం బెన్నఁ డెఱుగని♦యసురవిభుఁడు.
తే॥ కోఁతి మాటలు మనుజుల♦గురు జయంబు, తొనకుఁగాక యట్లుండనీ♦దూతవగుచు
వచ్చినాఁడవు వనమును♦భంగపఱుప, నేల రక్కసులను చంప♦నేల యనుచు. ౧౦౩౬
తే॥ నిన్నుచూపు నారెవరు లే♦కున్న కతన, రాక్షసేంద్రు దర్శనము దు♦ర్లభ మటంచు
వనము పాడుజేసితిఁ జంప♦వచ్చువారి, నాత్మరక్షణార్థము చంపు♦ననువువలసె.
తే॥ మరలఁ బాశబద్ధుఁడనై తి♦దరిసెనంబు, కొఱకు నన రావణుఁడు వండ్లు♦కొఱికి వీనిఁ
జంపుఁడన సూనరులు లేచు♦సమయమందు, పీడుఁడని యడ్డువచ్చె వి♦భీషణుండు.

ఉ॥ అన్నకుఁ గేలుమోడ్చి నయ ♦ మారఁగ నిట్లను వేదశాస్త్రసం
పన్న! తపఃఫలంబున భ ♦ వంబులు సృష్టియొనర్చు ధాతయున్
మన్నన సేయఁగాఁ దగిన ♦ మార్గ మెఱింగి త్రిలోక రాజ్యమున్
గొన్న మహాయశుండ వొక ♦ కోఁతిని దూతను చంపఁ బూనెదే?
చ॥ అవని నజాండగోళముల ♦ కావల లోపల సత్యధర్మముల్
తవిలిన యెల్ల చోటుల ను ♦ దార గుణాశయులందు చూడగా
యువతులఁ జంపినట్టి జను ♦ లుందురు గాని నిబద్ధి రాయబా
రి వధముసేయు పార్థివ వ ♦ రేణ్యుల నెందును గాన మింతకున్. ౧౦౪౦
చ॥ పగఱ పురంబుచేరి తమ ♦ పంపిన వారల వార్తఁదెల్పి యా
పగఱకుఁ గల్గు కిన్కలకుఁ ♦ బొల్పడి సత్యము ధైర్యవాక్కులన్
సొగసుగఁ జెల్పఁబూను మతి ♦ శూరుల నిక్కపట ప్రబుద్ధులన్
దెగఁ దలపోయ నెల్లిదము ♦ తీఁగలు వాఱదె లోకమెల్లెడన్? ౧౦౪౧
మ॥ పెరవారంపిన దూతఁ జంపునెడ వి ♦ ద్వేషంబు శాంతించునే?
పెరుగం జొచ్చునుగాక శాత్రవులకున్ ♦ వృత్తాంతముల్ నేరమిన్
నురుఁగంబాఱక శత్రుశేష మిల ని ♦ ల్చుంగాన నీతిజ్ఞ లీ
తెరువుం ద్రొక్కరు నింద్యమం చరసి దై ♦ తేయేంద్ర చూడామణీ!
ఉ॥ వీరులు నీతిమంతులు వి ♦ వేకులు ధీరులు రామలక్ష్మణుల్
వారక ముక్కుగోసి తమ ♦ వార్తలు దెల్పఁగఁ జుప్పనాక నీ
చేరువ కంపినా రటులు ♦ శ్రేయము నాత్మను కోరెదేనియున్
ధీరత నిన్ను దెల్పఁ జను ♦ దేరఁగ వీడుము నేఁడు మారుతిన్ ౧౦౪౩
ఉ॥ నావుడు లెస్సవల్కితివి ♦ నాణెముగాఁ గపిఁ జంపరాదు నిం
దావహమంచు వాయుసుతు ♦ నారసి నీవు బిరాన నేగి యా
కావరులన్ వనేచర ని ♦ కాయము తోడను తెత్తుగాక యో
సేవకులార! రండితని ♦ చెన్నగు వాలముఁ గాల్చి యంతటన్. ౧౦౪౪

చ॥ పురము జనంబు లీ కపిని ♦ పోలఁగఁ జూడఁగఁ ద్రిప్పి త్రిప్పి యీ
నరుదుల దాఁట వీడుఁడని ♦ చయ్యన రావణుఁ డాడ నింద్రజి
త్తురవడి నాగపాశముల ♦ నూడ్చెను మోఁకులఁ దెచ్చి కింకరుల్
తరముగఁ గట్టి లాగిరి ము ♦ దంబునఁ గేకలు వెట్టు చుద్ధతిన్. ౧౦౪౬

క॥ తేరుల గౌరుల కుదిరల, దారము లుయ్యేలలఁ గట్టు ♦ దారంబులు వే
కూరిచిరి నాఁడు పురమున, దారము కఱవయ్యె వాయు♦తనయుని కతనన్

చ॥ వరములుగాఁగఁ గొన్నవి సు ♦ పర్వులనుండియుఁ దక్కువారలన్
మరమున నోర్చి కైకొనిన ♦ తోరపుఁ బాశము లప్పనంబుగాఁ
బరఁగిన వెల్లఁ దెచ్చి ముడి ♦ వైచిరి కట్టిరి దార కంత బం
ధురతర సూత్రరాజములె ♦ త్రుంగక తక్కెను నాఁడు వారిచే. ౧౦౪౭

చ॥ క్రమమును మీఱి త్రెంచుకొను ♦ కష్టములేకయె నాగపాశముల్
దమకముతో విదిర్చి రిఁక ♦ దైత్యుల మోదము నొక్క వ్రేల్మిడిన్
జమరుదునా? యకేల! రభ ♦ సంబున వీరలు తోఁకగాల్చు ను
ద్యమమున లంకగాల్పుమను ♦ దారిని నేర్పుట గాదె యారయన్ ?

చ॥ అని తలపోసి తా నదను♦కై కనుపెట్టుచు వారుగట్ట దీ
నునివలెఁ గ్రుంగి ప్రక్కలకు ♦ నొవ్వఁగ నీడ్వఁగ నోర్చి బ్రహ్మవి
ద్యను ప్రకృతిం జయించియు న ♦ తంబు జగజ్జన సంగ్రహార్థమై
యనువుగ లొంగు నుత్తము క్రి♦యన్ హనుమంతుఁడు లొంగె వారికిన్.

సీ॥ మోకులఁ బట్టి యా♦ముక్కడుల్ ముందఱి, కీడ్వ నీడ్చినయట్టు♦లేగుచుండ
దశముఖ మందిర♦ద్వారంబు వెలుపలి, కమ్మారుతిని దెచ్చి♦యతని వాలు
నిండ జేలికలు చి♦నింగిన వలువలు, పాగాలు పెద్ద దో♦వతులు చుట్టి
చమురు నేయియుఁ బోసి♦సంపూర్తిగా ముంచి, నిప్పువెట్టి రగిల్చి♦నిగుడఁజేసి

తే॥ కోయనుచు నార్చి పెద్దమో♦కులను పట్టి, సోఁకు లీడ్వంగ సాయుధుల్ ♦నూరెలందు
నడవఁ దేరు నడచు గతి♦నడచె హనుమ, చూచు వారెల్లెడల నిండి♦చూచుచుండ.

సీ॥ వనితతో మాటాడి♦వనభంగ మొనరించి, కర్బురవరులఁ బె♦క్కండ్రఁ జంపి
మనుజుల దిటవున♦మన రాజునకుఁ దెల్ప, వచ్చిన కపి తుదిఁ♦దెచ్చుకొన్న
సిలుఁగులఁ♦గనుల వీ♦క్షింతురు రండని, ప్రతిగృహ ద్వారంబు♦పజ్జ నిలిచి
తప్పెటల్ గొట్టుచు♦దనుజులు కొందఱు, ముందుగాఁ జనుచుండ♦మూఁగె జనము

తే॥ పేర్చి రార్చిరి కొందఱు♦భీతి గొనిరి, కొందఱేగి మైథిలికి వా♦క్రుచ్చినారు
వాఁడె దపియించెఁ బలవించె♦వ్రాలె నూర్చె, జాతవేదుని ప్రార్థించె♦జనకజాత.

ఉ॥ శ్రీరఘురామదూత నిటు ♦ చెన్నఁటి సోఁకులు కష్టపెట్ట ని
ష్కారుణికుండవై కనుట ♦ కర్జమె నిర్మల ధర్మసాక్షివై ?

ధారిణి నేఁ బతివ్రతల ♦ ధర్మము దప్పని దాననేని యీ
మారుతికిన్ హిమాంశుక్రియ ♦ మానుగ నంతయును వహ్ని! ప్రమొక్కెదన్.

తే॥ కుందరదనయౌ సీత యా♦చందమునను, బలుక భయమంది మనమునఁ♦ బావకుండు
మేను చలిచే గగుర్పాటు ♦ మీరి వాల, మెమ్ములం దాఁకఁ జల్లనై ♦ యొనఁగె నప్పుడు.

సీ॥ పెక్కులాడఁగ నేల? ♦ భీకర బడబాగ్ని, భూమియందు గల జ్వా♦లాముఖాగ్ని
అమరలోకప్పుఁ గరా♦ళాగ్నియు మునుల ప్రతే, తాగ్నులు రుద్రు నే♦త్రానలంబు
సరసిజగర్భుని ♦ కరతల వహ్నియు, సర్వాగ్నులును భువిఁ ♦ జల్ల నయ్యెఁ
బిడుగులు చల్లనై ♦ వెలసె జ్యోతిర్మండ, లంబు హిమంబు ప్ర♦మంబునొందె

తే॥ కరువఁ గప్పిన కరణి మైఁ♦గప్పినట్టి, యగ్గి కాల్పక యొలయుట ♦ యనిలసుతుఁడు
తల్లి జానకి క్రొ త్తడి♦తనమువలన, శీతలం బయ్యెనని సంత♦సించె మదిని.

చ॥ తొలుతటి రేయి తెల్విమెయిఁ ♦ దూఱని చోటులఁ జూపనెంచి కా
వలయు నొకండొకండుగనె ♦ వాడల వాడల మూఢ దానవుల్
తలకొని త్రిప్పుచుండఁ దొలు ♦ తం జను నింద్రియ పాళి వెన్కలన్
మలపున నేగు బుద్ధిక్రియ ♦ మారుతి యేగుచుఁ గాంచె నన్నిటిన్. ౧౧౫౫

చ॥ కడపటి వీథిలో నిలిచి ♦ కావలులం గికురించి యేను వీ
డ్వడ నదనిద్ది యంచు మదిఁ ♦ బావని భావనచేసి గట్టిగా
వడమును పట్టుకొన్న బహు ♦ బాహువులు మిన్నున ప్రేల లేచి య
చ్చెడుగరులన్ విదిర్చి పడఁ ♦ జెట్టునఁ బందులు దుల్చుకైవడిన్. ౧౧౫౬

తే॥ విద్రువ రక్కసుల్ భుజములు♦విఱుగ నేలఁ, గూలి మాలిరి పాశ బం♦ధాలతోడ
మింటఁ గానంగ వచ్చె సా♦మీరి సర్ప, వర్గ పరివృతుండగు ఖగ♦వర్యుఁబోలి.

తే॥ పగఱ త్రిపురముల్ గాల్చిన♦భవుఁడు వతని, సాధనంబులు మిగుల ల♦జ్జను వహింప
పావులకుఁ గాఁపురంబు లం♦కాపురంబు, వహ్ని కొసఁగంగఁ దన పెను♦వాలు విడిచె

శా॥ వాలం బప్పుడు వాలె బన్నములు వ ♦ ల్పంబూను దైత్యాలితోఁ
బ్రోలిం గాల్చెద నంచు రోమ కలిత ♦ ప్రోత్తుంగ కాలానలా
భీలంబైన పరశ్వథంబు గిరిశున్ ♦ వెన్నంటు చందంబునన్
జ్వాలాదీర్ఘ కరాళ మాలికలతో ♦ సర్వాంకషోద్వేలమై. ౧౧౫౭

తే॥ ప్రోలి నన్ని దెసల నొక♦త్రుటిని గాల్చు, కతన వాలంబు పురములఁ♦గాల్చు మేరు
ధనువు తెగ తెగలాగి యు♦ద్ధతి మృడుండు, విడుచు వైష్ణవాస్త్రంబన♦ వెలసెనపుడు

సీ॥ కల్పాంతమందు లో♦కంబులఁ గాల్పనె, క్కుడు కంటిమంటల♦నడర విడుచు
చెయిది నభ్యాసంబు♦ నేయుటఁబోలి య, కుంఠిత బలుఁడు కా♦కుత్స్థదూత
గర్వితులైన రా♦క్షసుల పురము గా, ల్పఁగ నెంచి తనదు వా♦లంబు పెంచి
మణి కనకాంచిత♦మయముగ సురశిల్పి, శిల్ప చాతుర్యంబు♦నిల్పియున్న

తే॥ గొప్ప సౌధంబులను పెను♦కుధరములకు, వజ్రపాతంబుఁబోలి య♦వ్వాయుసుతుఁడు
వాడవాడకుఁ దిరుగుచు♦మేడమేడ, పైకి లఘించుచుఁ దగిల్చె♦వాలుచిచ్చు.

చ॥ కఱకు నిశాచరావళుల ♦ కార్యముచేఁ గ్రతువుల్ త్యజింప దు
ర్భరమగు నాఁకట న్నలఁగు ♦ పావకుఁడుర్ హనుమంతు వాల మా
దరువుగఁ జేసికొంచుఁ బురిఁ ♦ ద త్తఱ మ్రింగఁ దొడంగె నుగ్రుఁ డా
దరమున విందువెట్టఁ బ్రమ ♦ దంబున లోకము మ్రింగు చాడ్పునన్.

౧౪ లంకాదహన పటలము. (౬౪)

తే॥ భీకరాగ్ని సుందర సౌధ♦వీథులందు, ధ్వజములం గాల్చి పిదప లో♦పలనుచొచ్చి
మేలుకట్లు దహించి కం♦బాల నలమి, కప్పులం దుల్చి బూడిద♦కుప్పచేసె. ౧౦౬౩

తే॥ రత్న తోరణ ద్వార వా♦రముల ముసరి,వస్త్ర జాలంబుఁ గాల్ప లో♦పలి జనములు
వెలికి రాలేక యావ లా♦వలకుఁ దిరిగి, యలసి సొలసి రోదనచేసి♦యడఁగి రల్లె.

తే॥ మణి కనక వేశ్మ కాంతులు♦మలసి వీవ, మండుచున్న యిండులు మఱి♦మండనివని
తెలియఁ జాలక యన్నియుఁ♦ దీఁడిరించి, రగులు కొనెనని యేడ్చిరి♦మగువ లరసి.

తే॥ ఫుల్ల మకరంద తుందిల♦పుష్ప కీర్ణ, సుందరోద్యాన కేకులో♦మందగమన
లెల్లయెడలఁ బొగలు గ్రమ్మ♦నేది త్రోవ,యనుచుఁ దెలియక పలవించి♦రధలునిండ.

తే॥ స్త్రీల కొప్పులఁ బురుషుల♦సిగలయందు, మిడుఁగుఱులు చేరి చిటపట♦నడరియొడలి
మీఁద విరియఁ గేశములకు♦మిడుఁగుఱులకుఁ, దారతమ్యంబు తెలియక♦తల్లడిలిరి.

తే॥ బ్రహ్మవిద్యచేఁ బ్రకృతి సం♦బంధమూడ్చి, స్వస్వరూప విజ్ఞతనొందు♦జనుల పోల్కిఁ
దద్గృహాగ్ని లాజ్ఞప్తి బం♦ధముల వీడి, స్వస్వరూపంబులొందిన♦సరణి మండె.

క॥ ఆ పొగల గములు వామన, రూపములై యలమి యెసఁగె♦రోదోంతరముల్
శ్రీపతి వామన రూపం, బేపున ముజ్జగము లలమ♦నెసఁగిన మాడ్కిన్. ౧౦౬౯

క॥ తెల్లని యేనుఁగులెల్లను, త్రుళ్లుచుఁ దమమేన నిప్పు ♦ తొట్టగిలంగం
దోర్ఘ్యాడి యొఱగి యెమ్ముల, గూళ్లై యైరావతంబు♦కొమరుందాల్చెన్. ౧౦౭౦

క॥ మంచువలె నడరి ధూమము, మించఁగ నగ్నులును తొట్ట♦మిడుకుచు నెనుముల్
ప్రాంచ న్మేఘ నికాయము, సంచున లోఁతైన కడలి♦జలములఁ జొచ్చెన్.

క॥ మిడుఁగుఱులు చిటపటించుచుఁ, బిడుగులవలె నెల్ల కడల♦విరిసి పడుటచేఁ
గడలి జల ముడికె నందుం, దొడిఁబడి జలచరము లవిసి♦తుప్పలు దూలెన్.

ఆ॥ కాఁగి కాఁగి కరఁగి♦కనక పదార్థముల్, వఱద పాఱిపాఱి♦వనధిఁ జేరి
కమలీఁడు కరఁచి♦కడ్డీలు చేసిన, కొమరు దాల్చి మరలఁ♦గోపులయ్యె. ౧౦౭౩

తే॥ క్షణములో లోకములఁగాల్పఁ♦జాలినట్టి, బెట్టిదపుఁ జిచ్చుచే రత్న♦వేశ్మసమితి
వనములం బలె బొగ్గుల♦వఱకుఁ గాలి, నిలిచెనే ? పైఁడిమయమహా♦నిలయము మండె.

తే॥ అమితముగఁ బొగ గ్రమ్మ వృ♦త్రారిజగముఁ, గటికి చీఁకటు లలమె లం♦కాపురమున
నాపతాకా రథాంతమై♦స్యందనములు, కాలి బూడిద కుప్పలై ♦ గాలిఁ గలసె.
తే॥ పానశాలలలో నిల్చి♦పావకుండు, ముక్కడులు ద్రావు మద్యంబు♦గ్రోలె విడక
యుత్తములు దుష్టులం గూడి♦యుండిరేని, చెడుగు పనుల నభ్యాసంబు♦సేయరొక్కొ!
ఉ॥ లంకను మ్రింగి మండు నక♦లంక మహోజ్జ్వల వహ్ని వీవ న
ల్వంకలఁ జుట్టియున్న పెను♦వారిధి నీరము త్రెళ్ళఁ గ్రాఁగె నా
జంకవజీరు జ్వాలికలు♦జిహ్వలు చాఁపఁగ నీరజంబులన్
గంకణరాజి యత్తెనరు♦కై వడి గ్రాఁగి ధరాస్థలిం బడెన్.　　　౧౦౭౭
తే॥ ఒడలి సలమిన యగ్ని చే♦నుడికి నింగి, కెగసి రాక్షసస్త్రీలు ద♦వ్వోలయఁ జూచి
యడవిలోఁ బాఱు వెల్లువ♦యని తలంచి, యెండమావులకడకుఁ బ♦ర్వెత్తినారు
తే॥ మధువనంబుల నిప్పులు♦మలసి రగులఁ, బూలతోఁ గూడియుండిన♦ముసరుఁదేఁటు
లంటుకొని వచ్చు దగ్గఱి♦మంటఁజూచి, యెఱ్ఱ దామరలని యెంచి♦యెగసిపడియె.
తే॥ నాథుఁ డొక కోఁతిచేఁగూలె♦నాజ్ఞమైన, జీవితము చెడె వీథులఁ♦జేరరాదు
ఇంటఁ జచ్చుటే తగవని ♦ యెంచి కొంద, ఱసుర కాంత లా నిప్పున♦నడఁగినారు.
తే॥ పూలు మాఁడి పల్లవములు♦బూది యగుచు, దళము లెరిసి రెమ్మలు మండి♦ఫలము లుడికి
కొమ్మలును పలవలు వేళ్లు♦గూడఁ గాలి, తోఁట లయ్యెను బొగ్గుల♦కూటువలుగ.
తే॥ వనదముల ముంచుకొని లేచు♦ననల కీల, లలమి స్వర్గముం గాల్చుట♦వలనఁ గరఁగి
కాఱు బంగారు ధారల♦తీరు చూడ, స్వస్తరువు వేళ్లు విడిచిన ♦ చంద మొందె.
క॥ భీకర కీలలు లేవ ను, ధాకరుఁడుం గలఁగి యమృత ♦ ధారలు కార్పన్
రాకాసుల కొని మేనులు, జోకగ జీవంబు లొందెఁ♦జోద్యముగాఁగన్.
క॥ ఇనబింబము దాఁకఁగ లే, చిన యనలము వలనఁ గాల♦జీమూతంబుల్
గనగన మండెడు బొగ్గుల, యనువుగ నినుఁడొప్పెఁ గరఁగు ♦ నపరంజి యనన్.
తే॥ కాళ్ల త్రాళ్లను గాల్చి తోఁ♦కలను గాల్చి, మూఁపులం గాల్చి తోళ్లూడ్చి♦మొగముముట్ల
గాల్చ భద్ర లక్షణ తురం♦గమ్ము లురలి, కుప్పగూలెను నిప్పులు♦కొప్పరంప.
తే॥ జమున మ్రింగఁ జాలిన నిశా♦చరులు నెగసి, పోవఁజాలక మిఱిమిఱి♦పొగలు గ్రమ్మ
నూపిరాడక మ్రింగుచు♦ నుక్కిబిక్కి, యగుచుఁ గూలి నాశిల్లి రా♦యగ్నియందె.
చ॥ అసుర లఠాంగులన్ బలిమి ♦ నంటి సువస్త్రము లూడ్చి పైఁటలం
దనుకున జార్చి పైనలమి ♦ తక్కక కొప్పులఁ బట్టుచున్ విభా
వసుఁడు భుజంగు పోల్కి నెగఁ ♦ బ్రాఁకఁగ దిగ్భ్రమనొంది చేష్టలన్
వనమఱ లోఁకువై విలయ ♦ భావము నంది కరంగి రచ్చెలుల్.　　　౧౦౮౭

చ॥ పొడమెను దొండపండునను ♦ ముత్తెపు బంతు లనంగ నొప్పి సొం
పడరిన విస్మితంబు గల ♦ యంగన లొందిన యుల్కఁ దీరఁగా
విడివడియుండి చేరుతఱి ♦ వెన్నెల నాఁజను చేల గాలఁగాఁ
దొడిఁబడి మోద వారినిధిఁ ♦ దూఱక తూఱిరి దుఃఖవార్ధిఁ బ్. ౧౦౮౮

చ॥ చిలుకలు పంజరంబులనె ♦ చిక్కి తపింపఁగఁ గంటినీరు చ
న్నులపయి మిట్టిమిట్టి పడ ♦ నొచ్చుచు నాథులఁ గొంద ఱంగనల్
వలగొని కౌఁగిలించికొని ♦ వారిదమందునఁ జంచలా లతల్
మలిగిన కైవడిఁ బొగల ♦ మాటున మున్గిరి దూపటిల్లుచున్. ౧౦౮౯

తే॥ పెద్దమేడలు గాలఁగ♦వింటి కెగయు, మగువ లయ్యెడఁ బొగలలోఁ♦దగులుకొనుచుఁ
దెర మఱుంగునఁ దోఁచు పాత్రికలఁ బోలి, కానఁబడి కూలి మాలిరి♦కడఁకచెడఁగ.

తే॥ అగురు చందనాదికములు♦యందు పొడము, తావియలముకొనం బ్రమ♦దావనములు
ప్రళయ వహ్ని నడుకు నకూ♦పారమట్లు, లుడికి బొగ్గయి మసియయి యుర్విఁ గూలె.

తే॥ లోకముల మ్రింగఁజాలిన♦భీకరాగ్ని, విస్ఫులింగ ప్రకీర్ణమై♦విరియఁ గల్ప
కములయందు కాలిన విహ♦కాలకున్న, విహ్వలయని యెఱుఁగంగరా♦కెనపెఁ బొగలు.

తే॥ కసిమసఁగి మునిఁన పొగల్♦కడలినీటి, నింకఁజేయ మీఁ లవ్వలి♦కేగ మొగులు
గములు తెలియక గిరి శిఖ♦రముల వ్రాలి, రాలు పూలునాఁ బలపల♦రాలిపడియె.

తే॥ అతిశయంబుగ ధూమంబు♦లడరుకతన, వెండికొండ నీలాద్రియై♦వెలిఁగె హంస
గములు కాకులె యయ్యెఁ బా♦ల్కడలి తక్కు, కడలులం బోలె నితరంబుఁ♦దడవ నేల?

చ॥ బెడిదపుఁ జిచ్చు మేనులనఁ♦వేఁచఁగ జర్మములూడఁ దప్పికో
డుడుకనఁ బాఱె రక్కసులు ♦ దుస్సహ తాపము దీఱ కోర్కెమైఁ
గడలిని చొచ్చి మున్గుతఱిఁ ♦ గానఁగనయ్యెను వారి కేశముల్
జడలును పర్వి యెల్లెడల ♦ సంద్రమె మండుచునుండు చందమై. ౧౦౯౭

ఉ॥ కొండిక వానిఁ జంక నిడు ♦ కొంచు మఱొక్కనిఁ జేతఁగొంచు నిం
కొండొక బాల వెంటఁబడి ♦ యుమ్మలికించుచు రాఁగఁ జుట్టముల్
గుండెలు బాఁదుకొంచుఁ గడు ♦ గోడుగఁ జుట్టును రా శిరోజముల్
చుండఁగ నల్మి కొం చనుర ♦ జోటులు వోయిరి వార్ధి దూఁకఁగన్.

తే॥ చాప ముద్గర కుంతాది♦సాధనములు, కరఁగి పాళ్లై క్రమ్మఁ ♦ గార్మికులకు
వలయు వస్తువులకు నను♦గలముగాఁగ, నేరుపడియె మహాయుధా♦గారములను.

మ॥ మగయేన్గుల్ తమ దేహముల్ కమరుచున్ ♦ మాఁడంగ నాలానముల్
నిగళంబుల్ పెకలించి త్రెంచికొనుచు ♦ న్నిష్యంద గంధంబుతో
తగులం బోలున యంచు వాలములఁ గ ♦ ర్ణద్వంద్వ మల్లార్చ కె
త్తుగఁ దొండమ్ముల నెత్తికొంచుఁ బఱచెన్ ♦ దొట్రిల్లి గీపెట్టుచున్.

మ॥ చదలం బోవఁగనీక ధూమ పితతుల్ ♦ సంధిల్లఁగాఁ బుల్గు లం
గడతోఁ దోయధిఁ గూల వాశ్చరము లా ♦ నందించి భక్షించె ది
క్కొదియుం గానక నొచ్చి వచ్చి శరణం ♦ బిమ్మన్న దీనావళిన్
మది శంకింపక చంపి సంతసిలు ధ ♦ ర్మభ్రష్టు చందంబునన్. ౧౦౯౯

మ॥ జలముం ద్రావి వసుంధరం దడవి భూ ♦ జశ్రేణులం గాల్చి కొం
డలఁ గొల్లాడుచు ద్రింగి కాంచనగిరిన్ ♦ డాకొన్న కాలానలుం
బలెఁ జండంబుగఁ జేర్చి ప్రజ్వరిలి య ♦ జ్వాల ప్రభూతాగ్ని యు
త్తిలి యాపోవక యాక్రమించె దనుజా ♦ధీశాను శుద్ధాంతమున్. ౧౧౦౦

ఉ॥ వేలుపుబోటులున్ బెర వి ♦ భీత మృగాక్షులు దిక్కు దోఁప కే
లీల మొగఁబుపోవు నటు ♦ లే పరుగెత్తిరి సేవసేయు దే
వాలి కకావికం గలఁగి ♦ యార్తత నూడనిఁబాడె దైత్యరా
జాస్మలి దివంబుఁ గొల్లయిను ♦ నాఁటి దశన్ భజియించి యత్తఱిన్.

ఉ॥ కస్తురియుం గలాపములు ♦ కల్పసుమంబులు కాలి ధూమముల్
నిస్తుల లీలఁ బర్వ మధు ♦ నిర్గత మేఘముఁ బోలు దివ్య ది
వ్యమస్తక దేవతా లన ద ♦ నంత సువాసిత కేశ పాశముల్
ప్రస్తుత భంగిగా మఱియుఁ ♦ బ్రబ్బె గుమంగుమలాడు వాసనల్.

తే॥ దావ వహ్ని శైలముఁ గ్రమ్మ ♦ శేవ దోఁప, నెవ్వరిని చేరనీయక ♦ యేస కేఁగి
కాల భయదాగ్ని యేడు లో ♦ కములఁ గాల్చు, కరణి మేడ నిలువు లేదు ♦ గాల్చివైచె

శా॥ ఔన్నత్యంబు విశాలమున్ దిటవు నే ♦ డంతస్తులున్ బ్రన్ననల్
విన్నాణంబు చెలంగు రావణు లన ♦ ద్వేశ్మంబు చోకాటపున్
సొన్నంబై తనరారుటన్ గరఁగి య ♦ చ్చుం బోలి హేమాద్రి యు
త్పన్నం బయ్యెనొ దక్షిణంపు దెస న ♦ వ్యస్ఫూర్తి నా రాజిలెన్.

ఆ॥ దానవేంద్రుఁ డవుడు ♦ దారలతోఁడఁ బు, ష్పకము నెక్కి తప్పి ♦ బ్రదుకఁ గలిగెఁ
దలఁప నార్ప ననువు ♦ దెలియని చందానఁ, బొలుపు గలుగు లంక ♦ బూదియయ్యె.

తే॥ పట్టపగలింటి వేవెల్గు ♦ పగిది మండి, యసుర వర్యుండు సోఁకుల ♦ నట్టెచూచి
విలయకాలంబు డాసెనా! వేఱు హేతు, వుండునే లంక గాలఁ దె ♦ ల్పుండి! యనుడు.

ఉ॥ అన్నలఁ దమ్ములన్ గురుల ♦ నాప్తుల బంధుల నాలు బిడ్డలన్
బ్రన్నని వస్తునంపదలఁ ♦ బాసి యలంగుచునుండు దుఃఖ సం
పన్నులు దేవ! యీ కనలు ♦ వానర వాలముఁ గాల్చు మంటచేఁ
గ్రన్ననఁ గాల్చివైచెఁ బ్లవ ♦ గంబనఁ బంక్తిముఖుండు మండుచున్.

ఉ॥ కోఁతికి నింతశక్తి యొడఁ ♦ గూడుట యెన్నఁడు గాన మీపురిన్
బ్రాఁతిగ ద్రింగి త్రేనువులఁ ♦ గ్రక్కుచునున్నది యగ్ని! సాధ్వసం

ఘాతము మండి బూదియయి ♦ గాలికిఁ బోవుచు నుండె! నిర్జర
వ్రాతము నా పరాక్రమము ♦ రట్టొనరించి యలర్చి నవ్వదే?

మేఘనిస్వనము॥
కాల్చిన యగ్నిని ♦ గాంచి వెదకి తే, డుల్చెదఁ బండ్లను ♦ డొక్క యొలిచెదన్
జీల్చెద దాడలఁ ♦ జేవ దొలఁచెదన్, వ్రేల్చెద దేహము ♦ వీడకుఁ డతనిన్.

అరవిందము॥
పురముం గాల్చిన ♦ ముక్కిడి క్రోఁతిన్, దెరలం బట్టుఁడు ♦ త్రెంపుఁడు వాలున్
సురుఁగం దంచుఁడు ♦ సున్నము గాఁగన్, జరఁగన్ మ్రింగుఁడు ♦ పంతము మీఱన్.

ఇంద్రమణి॥
అని యసుర విభుం ♦ డానతి యొసఁగన్, దనుజ వరులు రా ♦ ద్రస్థితి తొనఁకన్
విని సెలవనుచున్ ♦ వీరవచనముల్, మొనసి నుడువుచుం ♦ బోయిరి వెలుచన్.

పంక్తి॥ మేర గణింపక ♦ మీఱిన యా, వీరులు తూపులు ♦ విండ్లను సం
భారముగాఁ గొని ♦ వాయుజుతోఁ, బోరొనరింపఁగఁ ♦ బోయి రటన్.

పంక్తి॥ సారథులం ద్వర ♦ సల్పుచుఁ బె, న్నీరథి పొంగిన ♦ నీటునఁ బెం
పారఁగ నేడుగు ♦ రాథ్యులు సా, మీరిని పట్ట గ ♦ మించి రటన్.

దోదకము॥
నింగిని ధాత్రిని ♦ నిండిరి ప్రాఁతిన్, బొంగిరి చుట్టుచుఁ ♦ బోయిరి కోఁతిన్
ముంగలఁ గాంచిరి ♦ మూఁగిరి త్రిప్పన్, రంగని నారుల ♦ టంకృతు లొప్పన్.

తే॥ మిగులఁ గనలిన దనుజులు ♦ మిగిలి తగిలి, పట్టు పట్టుఁడు కట్టుఁడు ♦ కొట్టుఁడనుచుఁ
జూతురేల యనుచు డాసి ♦ చుట్టినారు, కాంచెఁ జిఱునవ్వుతో వారి ♦ గాడ్పుపట్టి.

తే॥ చుట్టి డాసిన వీరులఁ ♦ జుమ్మ చుట్ట, మండుచున్న లాంగూలంబు ♦ మలయుఁ జుట్టి
బిగియ నీడిచి పైకెత్తి ♦ పృథివి మీఁద, మోఁది మోఁది తదాయువుల్ ♦ మూఁడఁ జేసె.

క॥ మారుతి మోఁదఁగఁ జచ్చిన, వీరుల రక్తంబు చెదరి ♦ వీథులలో నే
పారిన చండానల మొక, తీరున నొకవంక నాఁటెఁ ♦ దేమ యెలర్పన్. ౧౧౧౭

తే॥ కంటఁబడు వారిలోపల ♦ గెంటుకొనక, మిగిలియున్నట్టి మెఱికల ♦ పగిది నొప్పు
దనుజ లొక్కుమ్మడిం దాఁక ♦ హనుమఁ డంత, యమునికంటెఁ గ్రూరుండయి ♦
యడరి చంపె

క॥ జీమూత సన్నిభులు బల, సామర్థ్యంబులు చెలంగు ♦ సైనికు లిలుగన్
స్థేమములు చెడఁగఁ దక్కిన, యామినిచరు లడలి పాఱి ♦ యడఁగిరి కడలిన్.

క॥ తడిసెను వాలము పావని, జడధియు నుడుకంగఁ మునుఁగు ♦ జనములు చావన్
దుడుకున నాయకు లేడ్చారు, బిడియము చేటనుచు నెదిరి ♦ వేసి రలుఁగులన్.

క॥ విలువిద్దె నేర్పు చూపిన, బలియుర నేడుగుర నొక్క♦పాదపమునఁ గ
ర్వలి కొడుకు గొట్టె వారలు, పొలిసిరి గ్రుడ్లుఱుక నాల్క♦మొదలికిఁ దునుఁగన్.

క॥ మింటఁ జనెడి విద్యాధరు, లంటిన పెనునిప్పు లంకఁయంతటఁ గాల్చెన్
బంటించి కాల్పదది వా, ల్గంటి ధరాజాత యున్న♦కానన మనుచున్.

హంసశ్రేణి॥
సంతోషించెన్♦శ్వసన సుతుండున్, స్వాంతం బారన్♦జనియెను కాంచన్
శాంతిం బొందెన్♦జరణ సరోజా, క్రాంతుం డయ్యెన్♦గలికి యెలర్పన్.

తే॥ కాంచె జానకి కాంచిన♦క్షణములోన, నారటిల్లిన మానస♦మూఱడిల్లెఁ
జెప్పవలసిన దేమిఁక? సెలవు గొనుచు, మరలె మారుతి తలికి న♦మస్కరించి.

తే॥ పావనుండగు పావని♦ తావు విడిచి, మరలె వంచకుల్ కాంచిన♦మన్నిగొందు
రనుచుఁ గాఁబోలు నగ్నియు♦నందునుండి, చూడ్కికిం గనరాక ది♦చ్చు మొగమయ్యె.

౧౫ శ్రీపాదవందన పటలము. (౯౩)

తే॥ వడిగఁ జనవలెనని చేరు♦వం గలట్టి, పర్వతంబును భానుని ♦ పగిదిఁజేరి
హనుమ భువనోదరుండగు హరి విధమునఁ, బెరిఁగి రాముని మదిలోన♦నెరఁగి యెగసె.

చ॥ ఎగసి హిమాద్రి పుత్త్రు నెడ♦కేగి జనించిన వార్త విన్చి యా
శుగగతి నేగుదెంచి తన ♦ చొప్పు ఘణంబుల నిక్క నెత్తు వ్యా
ళ గణము పోల్కి నెత్తి మెడ ♦ లం దిలకించుచుఁ గీశులుండు త
న్నగమును చేరె దూఁకె జత♦నంబున మారుత పుత్త్రుఁ డత్తఱిన్. ౧౨౮

క॥ నోరులు తడఁబడ నేగిన, కారియ మీఁడేఱె నన్న♦కౌతుకమునఁ బె
ల్లారవము సేసెఁ బోతము, లారూఢిం దల్లిఁగన్న♦యట్లయి కోఁతుల్. ౧౨౯

సీ॥ కొందఱు డాసిరి♦కొందఱు మ్రొక్కిరి, కొంద తేడ్చిరి మేలు♦కొంద ఱనిరి
కొంద ఱాడిరి మఱి♦కొందఱు పాడిరి, కొందఱు మ్రింగెదు♦కొమరు చనిరి
కొందఱు కౌఁగిలి♦గొనిరి కొందఱు మూఁపు, పైఁగొని యిటునటు♦పరుగులిడిరి
కొందఱు నీమోము♦కొమరు తేటఁదనంబె, తెల్లంబుగా గెల్పు♦దెల్పె ననిరి

తే॥ కనియు పండ్లును మధువును♦గందములును, దెచ్చి యిచ్చిరి కొందఱు♦శివిరి కిస
మంజరుల వీచి యతని క్ల♦మంబు దీర్చి, రొక్క కొందఱు పాదంబు♦లొత్తినారు.

క॥ కరచరణంబుల నురమున, శిరమునఁ గరతలములందు♦చెందిన వ్రణముల్
పరికించి మనములందున, బరితాపము నొంది రశ్రు♦భరిత నయనులై. ౧౩౦

తే॥ మొదట నంగదునకు మ్రొక్కి♦పిదప జాంబ, వంతున కెఱఁగి తక్కిన♦వారి నుచిత
రీతి మన్నించి మారుతి♦నృపుని దేవి, పంపినట్టి మంగళములఁ♦బలికె యంత. ౧౩౧

తే॥ లేచి కేల్మోడ్చి నందఱు♦లేచి నిలిచి, కౌతుకంబున నటియించి♦గాడ్పుపట్టి
యేఁగినది మొదలుగ మఱి♦యింత దనుక, జరిగినది తెల్ప వేఁడిరి♦చనవుతోడ.

మ॥ తెలిపెన్ మారుతి జానకీ హృదయ పా ♦ తివ్రత్య దార్ఢ్యంబు తాఁ
దెలియన్ దేవికిఁ బల్కుటాదిగ మణిం ♦ దీపింపఁ దానిచ్చు న
ట్లొలఁదిం దెల్పె దురంబు సాగుటలు ర ♦ క్షో వారముం గూల్చుటల్
దెలుపండయ్యెను తన్ను దాఁ బొగడికోల్ ♦ తీయంబు గాకుండుటన్.

చ॥ అది విని వారు నీకచట ♦ నల్పులు దైత్యులతోడ సంగరం
బొదవుట మేని గాయములె ♦ యొప్పుగఁ జెప్పెడి లంకఁ గాల్చుటల్
కదిరిన ధూమ జాలములె ♦ గట్టిగఁ దెల్పెను వారి బల్మియున్
ముదితను తేరకుండుటయె ♦ పొందికఁ దెల్పెను గాదె పావనీ! ౧౧౩౪

శా॥ కర్తవ్యం బిఁక నేదియంచు నడుగన్ ♦ గణ్యుండు శ్రీరామ భూ
భర్తం గాంచి యయోనిజాత సుగుణ♦ప్రఖ్యాత యా సీత యే
వార్త ల్దెల్పఁగఁ బంపె నయ్యవి మహా♦భక్తిం బ్రశంసించి రా
మార్తిం దీర్చుట యుక్తమౌనని జగ♦త్ప్రాణ ప్రియుం డాడుడున్.

తే॥ లెస్సయని వానరావళి♦లేవ వెడలి, రామవిభు ధనుర్ముక్త శ♦రంబు రీతి
గగనవీథిని చనుచు భా♦స్కరుఁడు నడిమి, సీమఁజేర రా మధువన♦సీమ దిగిరి.

ఉ॥ ప్రాణము లింక లేవనుచు ♦ వాడినవాని నొసంగు నో జగ
త్ప్రాణ కుమారకా! గడువు ♦ దాఁటినదంచుఁ దలంచి భీతిచేఁ
ద్రాణచెడంగఁ బన్నువడి ♦ తాఱిఱి మాఁకలి మేరమీఱె నం
త్రాణము సేయుమా యన న♦తండొగి నంగదు డాసి యిట్లనున్.

## —: వానరులు మధువనమును పాడుసేయుట :—

తే॥ నీదు సేన లాఁకటఁ గ్రుంగి♦నీరసించె, వీనికిం దగు ఫలములు♦ తేనె నలయు
వనుడు నతఁడును వలసిన♦యంత గొనుఁడి, యనఁగ వనచరు లుత్సాహ♦మందియార్చి.

సీ॥ కీఁచుకీఁచని పెడ♦కేకలు వెట్టుచు, నొకరికి ముందుగా ♦ నొకరు చనుచు
తేనెపెరలు ప్రేలు♦తీయ మామిళ్లన్న, మధువనంబును చేరి♦మ్రాఁకులెక్కి
కొమ్మల విఱుచుచుఁ♦గూలంగఁ ద్రోచుచు మధుపంబులంబోలి♦మలసి ముసరి
కడుపారఁ దేనియ♦లడరంగఁ గ్రోలి త్రే, న్పుచుఁ జిఱ్ఱుమని యుమ్మి♦చును కడంగి

తే॥ చల్లుకొని వెక్కిరించుచుఁ♦గొల్లగొనుచు, నుత్సహించుచు ప్రేలుచు♦నూఁగుచును గ
దించి దాఁటుచుఁ దోఁకలె♦త్తికొనిపరుగు, లిడుచు దాఁటుచు నంటుచు♦నెలమినాడి.

సీ॥ ఒకఁడురాల్చిన పండ్ల♦నొకఁడుకైకొను వాని, నొకఁడులాగునువాని♦నొకఁడుమ్రింగు
నొకఁడుకైకొను తేనె♦నొక్కఁడొడిసికొను, నొకఁడందునోరుంచు♦నొకఁడుత్రోచు

వాలుగేలును గాఁగ♦లీల వ్రేలుదురు పి, దంగఁ గూలుచు లేచి♦యంగవింత్రతు
ఆనంద మానంద♦మని యాడుదురు కేక, లిడుదురు పడుదురు♦వడిగ లేతు.

తే॥ లిట్లు కోలాహలంబుగా♦నెసఁగుచుండఁ, గావలిం డ్రు పరీక్షించి♦కనలి వచ్చి
యుగ్రశాసను సుగ్రీవు♦నాజ్ఞ వినరొ? జీవముల నొల్లరో? దుష్ట♦చేష్ట విడరొ?.

చ॥ అని యదలించియుఁ ఫలము ♦ నయ్యెడఁ గాంచక వారలేగి యు
వ్వనచర చేష్టలుఁ వనము ♦ పాడొనరించుట ధిక్కరించుటల్
గొనకొని మేటియా దధిము ♦ ఖుం గని సర్వము పోలఁ జెల్పి వా
రి నడఁచు శక్తి యేల? యెది ♦ రించెడు చేవయు లేదు నావుడుఁ. ౧౧౪౧

తే॥ ఎవ్వ రెక్కడి వారలో? యెఱిఁగి నారె?, తెలుపుఁడీ చూపుఁ డన వారు♦పలికిరిట్టు
లంగదుం డాదిగాఁగ వి♦ద్యాప్రవీణు, లైన వానర వరులె పో♦యరుగుదెంచి

ఉ॥ అంగదు నాజ్ఞ చేతఁ గలి ♦ యం బడి కొమ్మలఁ ద్రుంచి పండుల్
ద్రుంగఁగ రాల్చి తేనియలు ♦ తోట్టు పెర ల్వ్రీదిలించి పాడు చే
యం గని మేము డాసి ప్లవ♦గాధిపు నాజ్ఞను తెల్పి పొండనన్
జెంగక మమ్ము దూఱి యఱ ♦ చేతుల మోఁదిరి దేవరా! యనన్.

చ॥ దధిముఖుఁ డుగ్రుఁడై తొడరి ♦ తక్కటి వారలఁ గూర్చుకొంచు న
మ్మధువనిఁ జొచ్చి వాలి మృతి ♦ మర్కట పోత మెఱుంగ దేమొ? యీ
దధిముఖు ముందునా వితథ ♦ దర్పము చూపుట? యంచుఁ ద్రోల నా
ప్రథిత బలుల్ బలీముఖులు ♦ పాఱిరి యంగదుఁ డున్న చోటికిన్. ౧౧౪౪

ఉ॥ దేవ విభుండు వాలికి న ♦ తి ప్రియమార నొసంగ నెప్పుడున్
గావలిగాచు మేము కడఁ ♦ కం బనిసేయఁగ నిగ్రహించి సు
గ్రీవుని చండశాసనము ♦ కీడొనరించెదె? యింత ధైర్యమే?
జీవితమెల్ల నేఁటికె న ♦ శించెనె? ప్రాణము లింత చేదొకో? ౧౧౪౫

సీ॥ అని పెనుగుండు చే♦కొని దధిముఖుఁ డార్చి, వారిపై వైవంగ♦వాలి సుతుఁడు
పాషాణముం దట్టి♦వైచి వానింబట్టి, కొని ప్రభుతోఁ జెప్పి♦కొనుమ యనుచు
మోము నెత్తురు గ్రమ్మ♦ముష్టి ఘాతం బిచ్చి, దధిముఖు వనినుండి♦తఱిమివైచి
వానివారలఁబట్టి♦మేను లిఱియఁగట్టి, నలఁగఁబొడిచి నెత్తు♦రొలుక విడిచి

తే॥ మీరు మీ మొనగానితోఁ♦జేరిపోయి, తెలిపికొనుఁడు దిక్కగుచోటఁ♦దేఱిచూతు
రేని మీ ప్రాణములు పోక♦మానవనుచుఁ, దఱుమ వారలువడఁకుచుఁ♦బఱచినారు.

తే॥ ప్లవగములు వసంతములాడు♦పగిదిఁ దేనెఁ, గొల్లలాడి చల్లికొనుచుఁ♦గోసినట్టి
ఫలములనునాయకులకుఁగా♦న్కలుగనిడుచు, నెండ వేఁడి తగ్గెడుదాఁక♦నుండె నచట.

తే॥ శూలికేనియు నరుదైన♦లీలయనగఁ, దోఁచు దుష్కరంబులు రామ♦దూత తీర్చి
యిచట నిటులుండ నితనికై♦యెదురుచూచు, చుండెనుత్కంఠ భాను కు♦లోద్భవుండు.

ఆ॥ రవిసుతుండు జనక♦రాజపుత్త్రిని గాంచి, యరసి రండటంచు♦హనుమదాది
వనచరాళిఁ బంపి♦మనుకులాధ్యక్షుని, డెందమలర నూఱ♦డించుచుండె. ౧౧౪౯

ఆ॥ భానుసుతుఁడు ప్రస్ర♦వణగిరియందుండి, యనునయోక్తు లెన్నొ♦యాడుచుండ
రామవిభుఁడు పెక్కు♦ప్రాణంబు లొందిన, తీరుగాఁగ సోలి♦తేలుచుండె. ౧౧౫౦

ఆ॥ అరయ మూఁడు దెసల♦కరిగిన వానర, వరులు వచ్చి సీత ♦ దొరకదన్న
వార్త కలఁప రామ♦భద్రుఁడు పావనిం, దలఁచి సుంత జీవ♦ములను నిలిపె.

ఆ॥ వనటఁ గుంది భాను♦తనయుని గని మన, యతనమెల్ల విఫల♦మయ్యె నింద
సుస్థిరముగ నిలిచె♦నుడిసెను ప్రాణముల్, మనియు నేను వారు♦కొనున దేది ?

తే॥ గడువుపెట్టిన దినములో ♦ కడచిపోయె, నరయ నేగినవారలో ♦ మరలిరారు
చిక్కులేవేనిఘటియింపఁ♦జిక్కినారొ?మరణమొందిరో?మఱియేమి♦పొరసెనొక్కొ?.

తే॥ ధరజ మరణించె ననువార్త♦మరలివచ్చి, తెలుపుకంటెను చచ్చుటే♦ తెఱఁగటంచుఁ
జర్చచేసి ప్రాయోపవే♦శంబు చేసి, రేమొ? వెదకుచునే యుండి♦ రేమొ! తెలియ.

తే॥ రక్కసులఁ గని కోపంబు♦మిక్కిలిగొని, ముమ్మరంబుగ జగడించి♦ముగిసినారొ ?
వంచకులమాయఁజిక్కిత♦ప్పించుకొనఁగ, లేక చెఱఁజిక్కియచటఁదూ♦లిరొ?మఱేమొ?.

తే॥ గడువు దినములలోన నె♦క్రమ్మఱమికి, వగచి తనువులపై నాస♦డిగిచి తపము
సేయఁబూనిరొ? మఱియేమి♦సిలుఁగు గలిగె? నేమి నీమదిఁ దోఁచు? ది♦నేంద్రతనయ

తే॥ అనుచుఁ బరితపించుచునుండు♦నవసరమున, మోము నెత్తుటితో దధి♦ముఖుఁడువచ్చి
కీశనాథుని సన్నిధిఁ♦గేలుమోడ్చి, వినయ భయ సంభ్రమంబులు♦పెనఁగొనంగ.

తే॥ దేవ! నేఁటితో మధువన♦స్థితి నశించె, ననుడు నాతని రక్తసి♦క్తాననంబుఁ
గాంచి జరిగిన దేమి? కా♦వించువార, లెవరొ? తెల్పుమ యనఁగ వాఁ♦డిట్టులనియె.

సీ॥ అంగద జాంబవ♦దాంజనేయ కుముద, నీలాదు లేతెంచి♦లీలఁ బేర్చి
మన మధువనము పా♦డొనరింపఁ దొడఁగిరి, వలదని వారించు♦వారిఁ దఱిమి
వాలిసూనుఁడు మిమ్ము♦ తేలికగాఁ బల్కి, తన్నాశమునకుఁ బ్రో♦త్సాహమొసఁగఁ
నేనొక శిలగొని♦యేయ నంగదుఁ డడ్డి, తనకరమున దానిఁ♦దట్టివైచి

తే॥ దావపావకువలె మండి♦దఱిసి నన్ను, తాఁచి క్రుమ్మి నెట్టుచు నీవు♦త్వరగఁ బోయి
దిక్కుగలచోట మొఱని వే♦దించుకొనుమ,యనుచునాడవచ్చితి దేవ♦యనుడునతఁడు.

తే॥ నంతసంబున శ్రీరామ♦చంద్రుఁ గాంచి, వసుమతీజాత యుత్తమ♦వ్రతముతోడ
జీవములతోడ నున్నట్టి♦చెలువు దెలియఁ, బలుకుచున్నవి వారల♦తులువపనులు.

తే॥ శుభచరిత్రను బాగుగాఁ♦జూచినారు, వార లమ్మధువనమును♦పాడుచేసి
తేనె లానుట జనకపు♦త్త్రికను గన్న, కుతుకముననె యగా నిక్కంబు♦కుందు విడుము.

తే॥ అనుడు శ్రీరామవిభుఁడించు♦కంత తనిసి, యేమి తెల్పుదురో వార♦లేగుదెంచి
యని ప్రతీక్షించె నుత్కంఠ♦నర్కసుతుఁడు, దధిముఖుని గాంచి పలికె నా♦దరము మీఱ.

సీ॥ అంగదుండు చెడుగు♦లాచరింపఁడు పావ, నియు జాంబవంతుండు♦నీచమతులు
కారు వారలు రామ♦కార్యంబు తలమోచి, భువియెల్ల ధారణి♦పుత్త్రి వెదకి
యామెను గొనిపోవు♦నసురుల నాశంబు, గావించి వచ్చిరి♦కడఁక వెదక
కనుక వారేమిచే♦సినఁ జెల్లుబడి యయ్యె, నదిగాక చిన్నరా♦జంగదుండు
తే॥ అతని నీవెదిరించుట♦యర్హమగునె? ముందు వెనుక లెఱుంగక♦మొనసితింక
మేలు కోరెదవేని య♦వ్వాలిసుతుని, శరణు వేఁడుమ యదె సమం♦జస మనంగ,
తే॥ ముదుఁగు మేనితో వాడిన♦మొడఁదతోడ, వదనమును మూసికొని వన♦పాలకుండు
ప్రభునకుం జాఁగిమ్రొక్కి త♦త్పరిజనముల, తోడఁ గ్రమ్మఱి మధువనిఁ♦దూఱునంత.
తే॥ అతనిఁగని యంగదుండు క♦ట్టలుక పొంగ, మరలఁదొడరినచో వీని♦మన్నిగొందు
ననుచు మనమునఁ దలపోయు♦నంత వాఁడు, శరణు శరణ మనుచుఁ బట్టెఁ♦జరణములను.
తే॥ ఎఱుకమాలి చేసిన తప్పు♦మఱచికావు, మనుచు వేఁడఁగ నంగదుఁ♦డతనినెత్తి
మిమ్ముపఱిచినయదియును♦మీరు మఱవుఁ, డనుచునోదార్చియంతట♦హనుమఁగాంచి.
చ॥ గదువు తొలంగె నంచు గతి♦గానని దుఃఖ పయోధి మున్గు మా
కుదువము వోలె సాయపడి♦యోపికఁ గాచిన యట్లు రాముఁడున్
గడ గనకుండు దుఃఖముల ♦ గాసిలకుండఁగఁ దేర్చు ముందుగా
నడువుము యంచుఁ బల్క రఘు ♦ నాథుని గానఁగ నేగె నాతఁడున్.
క॥ సూర్యసుతుఁ డుడిగెఁ గోపము, సూర్యుండును గ్రుంచికొని యెఁ♦జాఱుకుఁ దనము నిం
కార్యుని గానఁగఁ బోవుట, కార్యంబని నడచెఁ గపి ని♦కాయంబెల్లన్.
క॥ అట రాముఁడు రవిసుతు వి, స్ఫుట శక్తిం గాంచి వచ్చు♦పుణ్యులు సీతన్
బటిమం జూచితి మందురొ? యెటఁ గన మందురొకొ? యేమొ! యెఱుఁగంగలవే!
తే॥ అనుచు నాతనిఁ బ్రశ్నించు♦నంతలోన, హనుమ దక్షిణ భానూద♦యంబు పగిదిఁ
గానవచ్చె రాఘవుఁడు ను♦త్కంఠతోడ, నతని ముఖ బింబ మెగదిగ♦నరసి చూచె

—: మారుతి శ్రీరామునకు సీతావృత్తాంతము తెలుపుట :—

ఉ॥ మారుతి చేరెఁ జేరి యల♦మాన్యపదంబుల మ్రొక్కలేదు పం
కేరుహ సద్మమున్ దొలఁగ ♦ నీఁగిన యిందిర సీత దిక్కుకై
వారము నేసి భూస్థలిని ♦ వ్రాలి నమస్కృతి నేసి కేలు మో
డ్పార ఘటించి పల్క విన ♦ యంబున మంగళ వాక్యజాలముల్.
ఉ॥ జాడలచేత నింగితము ♦ చక్క నెఱింగెడి రామచంద్రుఁ డా
గాడుపు పట్టి చేష్టలను ♦ గాంచెను జానకి భద్రయుక్తయే
యాడిక లేక యొప్పు సతి ♦ నారసె సీతఁడు నిక్కవంబు నే
నోడక గెల్చఁగంటి నని ♦ యుత్సవంబు భజించె నయ్యెడన్. ౧౧౬౨

తే॥ హనుమ చెయ్యూఁగే కొలఁతగా ♦ హారువుగాఁగ, జరిగినది యెఱింగిన రామ ♦ చంద్రు కనుల
నీరు నిండ బాహువులుబ్బె ♦ నెంజలి చనె, వలపు నిండారె; మారుతి ♦ పలికె నిట్లు.

మ త్త॥ కాంచినాఁడ సతీత్వ భూషను ♦ గణ్యవర్తన జానకిన్
గాంచినాఁడ మదీయ దైవముఁ ♦ గన్నులారఁగ లంకలోఁ
గాంచినాఁడను శంక వీడుము ♦ కాంచుమూ మది నెమ్మదిన్
గాంచితిన్ మఱి మాటలాడితిఁ ♦ గ్రమ్మఱితిల్లితి రాఘవా!

ఆ॥ మీకుఁ దగిన దేవి ♦ మీ తండ్రి కోడలు, జనక రాజతనయ ♦ యనఁగఁ దగిన
గారవంబుతోడఁ ♦ గ్రాలుచు నున్నది, నీకు భూషణంబు ♦ నాకుఁదల్లి.

సీ॥ బంగారుతో సాటి ♦ బంగారమే తక్క, నన్యంబు జగతి లే ♦ దనఁగ నొప్పి
తన సాటివారలు ♦ తాఁదక్క జగముల, నరసిన లేరు లే ♦ రనఁగఁ దనరి
తన కన్నివిధములఁ ♦ దగియున్న నిను పోలు, ఘనుఁడు నీకంటె లేఁ ♦ డనఁగ నమరి
నన్ను పోలిన వారు ♦ నాకంటె లేరను, నాణెంపుఁ గీర్తిని ♦ నాకొనంగె

తే॥ ధరణి జాత ప్రపూత క్రొ ♦ త్తదుల పంట, లోక దీపంబు నిఖిల లో ♦ కైకమాత
భువనవంద్య క్షేమప్రద ♦ భూరి సుగుణ, రాశి కరుణామయాత్మక ♦ రామచంద్ర!

సీ॥ నీవు జన్మించిన ♦ నీకులంబును నీకుఁ, దగినదిగాఁ జేసి ♦ ధరణి తనయ
జనకుని కులమున ♦ కనుపమ విఖ్యాతి, నాచంద్ర తారార్క ♦ మమర నిలిపి
తన్నుఁడఁ బాపిన ♦ దనుజుని కులమును, మెప్పుగా నమవర్తి ♦ కొప్పగించి
యిల్లు వాకిలి వీడి ♦ యిక్కట్టులం బడు, వేల్పుల కొలము జీ ♦ వింపఁజేసి

తే॥ నా కులంబున నాకు మా ♦ న్యత నొసంగె, నింతకంటె నాయమ చేయ ♦ నేది గలదు?
చేయవలసిన దెల్లను ♦ చేసి యుంచె, దానిఁ గాపాడుకొన నీకుఁ ♦ దరుణ మిచ్చె.

ఉ॥ చూచితి లంకలో భువన ♦ సుందర దేవతయైన జానకిన్
శ్రీ చెలువారు జన్మ కుల ♦ శీల మహత్త్వము భూరి శాంతముల్
బూచు తపఃఫలం బనఁగఁ ♦ బోలిన భవ్య పతివ్రతాత్వముల్
బైచవ నేచి లోకనుత ♦ పద్ధతి నుద్ధతిఁ దాండవింపఁగన్.

ఉ॥ ఆయమ కన్నులందు మన ♦ మందును వాక్కునయందు దర్పకుం
డేయఁగ నైన గాయముల ♦ నెక్కుడఁ జూచిన నున్నవాఁడ వ
త్యాయతనేత్ర నిన్ను విడ ♦ నాడిన దంచు వచింపఁబూనుటే
న్యాయముగాఁగఁ దోఁప దది ♦ యర్యమ వంశ పయోధి చంద్రమా!

చ॥ తపమె స్వయంబుగాఁ దప ము ♦ దగ్రతఁ జేసి యపూర్వ రూప మా
తపము ఫలంబుగాఁ గొను వి ♦ ధంబున నున్నది భూమిజాత ర
క్తపుల పూరమ్ముగం గనక ♦ కల్ప మహీరుహ వాటి లక్ష్మణుం
డుపమరి కప్పియుంచిన తృ ♦ ణోత్కర భవ్య కుటీరమందునన్. ౧౧౬౦

చ॥ వలవని సుందరాంగులను ♦ బల్మిని దాఁకితి వేచి సీతలన్
వలవల వ్రక్కలై పుడమి ♦ వ్రాలఁగఁ జచ్చెద వంచు నుగ్రతన్
జలజ భవుం డొసంగె మును ♦ శాపము గావున సీత యున్న భూ
తలమును వెల్లగించికొని ♦ తర్లె నిశాచరుఁ డార్య నన్నుతా!

ఉ॥ తొయ్యలి నాతఁడంటఁ డను ♦ స్తుత్య వచస్సు నజాండ గోళముల్
వ్రయ్యవు శేషు శీర్షములు ♦ వ్రక్కలు గావు సముద్ర నీరముల్
క్రయ్యవు సూర్యచంద్రులును ♦ గూలరు లోకము మాయదింక నీ
వొయ్యన నీనిఁ గాంచి నిజ ♦ మొప్ప నెఱింగెదు గాక రాఘవా! ౧౧౩

సీ॥ శోకాకులితచిత్త ♦ కాకుత్స్థదేవి పా, తివ్రత్య మహిమంబు ♦ తెఱుకతన
బ్రహ్మాది విబుధుల ♦ భార్య లొప్పిదమగు, క్రొత్తడి తనమున ♦ గురుతగనిరి
శివుని సామేన వ♦సించు నుమాదేవి, శిరమునఁ గూడ వ♦సింపఁదగియె
పంకజాలయ విష్ణు♦వక్షమందే కాక, వేయి తలల మీఁద ♦ వెలయఁదగియె

తే॥ పురుషులకు గౌరవముదక్కెఁ ♦ బుడమియందు మానినులకును మానంబు ♦ మానమయ్యె
మనసు నిలుకడ యందుట ♦ మానినీత్వ, మహిమ యెల్ల వారలకు న♦మ్మాన్యమయ్యె

శా॥ లంకాపట్టణ మెల్లెడం దిరిగి యిం ♦ డ్లం జొచ్చి శోధించి యా
తంకం బేమియు లేక రావణుని శు♦ద్ధాంతంబు గాలించి యా
వంకం గల్గు నశోకవాటి నడుమన్ ♦ బాష్పాపగా వీచికా
పంక క్షాళిత శుష్క గాత్రిని మహా ♦ భవ్యాత్మికం గాంచితిన్. ౧౧౪

మ॥ అకటా! దేవి యనేక రాక్షసుల మ ♦ ధ్యంబందు భూతంబు లం
జిక నొందం గల గర్వ గర్జనముతోఁ ♦ జేకూర్చు నిబ్బందు లో
పిక యే చేడియ రూపమొందె ననఁగాఁ ♦ బెంపొందు శాంతంబుతో
నొకటం దెప్పర మోర్చుచున్నయది నీ ♦ యుద్యోగ మీక్షించుచున్.

చ॥ గురు గుణముల్ స్వభావగతిఁ ♦ గూరిన యుత్తమ సాధ్వి నీవయిన్
హరువుగ నుంచు నత్యతిశ ♦ యాంచిత భావముఁ గన్నులారఁగాఁ
బురికొని కాంచఁగా జగతిఁ ♦ బుట్టుటచే నొకరుండ నీవ పో
పురుషుఁడవై జనించుటకుఁ ♦ బోలిన భాగ్యము నొంది తిమ్మహిన్.

చ॥ దనుజపురంబునం దతుల ♦ దైన్యము నొందుచు నూర్పు పుచ్చుచున్
బొనుపడి జీవ సంచయము ♦ ద్రుంగుచు నుయ్యెలలూఁగ దైత్య సే
వనములు సేయుచుండెదు సు ♦ పర్వ లతాంగులు మున్ను చూడకుం
డిన నివు డొర్పుమైఁ దృణకు ♦ టిం గనువారలు సాధ్వి తత్త్వమున్.

ఉ॥ దేవిని గాంచఁగాఁ దగిన ♦ తేఁకువ కాలము వేచియుండఁగా
రావణుఁ డయ్యెడం దొడరి ♦ ప్రార్థనచేసి నమస్కరించి యొం

తో వడి దేవులాడియును ♦ తొయ్యలి వానిఁ దిరస్కరింప నా
పై వడి వాఁడు మైథిలిని ♦ ప్రాణము తీయఁగఁబూనె రాఘవా! ౧౧౮

ఉ॥ దేవి పతివ్రతాత్వమును ♦ దీటు గడింపని నీ ప్రసాదముం
గావలిమైన ధర్మమును ♦ కావఁగ రాక్షసకాంతలన్ ప్రభూ
తావహ రోష భీషణత ♦ నారసి యామెకు బుద్ధిసెప్ప నా
జ్ఞా విధి సేసిపోయెఁ దద ♦ నంతర మేనును చెంది నెమ్మదిన్. ౧౧౯

ఉ॥ నాఁగు మంత్రశక్తి కత ♦ నన్ దనుజాంగన లెల్లఁ గూర్కఁగా
మేదినిపుత్రి యత్తఱిని ♦ మేనొని ప్రాణము వీడఁ దీవియల్
వీరాఁడుగఁ గట్టి కంఠముఁ ద ♦ విం గొని కూర్చఁగఁ బోవునంతలో
నీదు పవిత్రనామమును ♦ నే వచియింపుచు డాయఁబోయితిన్. ౧౨౦

చ॥ జడిగొని బాష్పముల్ గురియఁ ♦ జాల వెతంబడు భూమిజాత న
న్నొడికముతోడఁ గాంచి యిది ♦ యుత్కట రాక్షసమాయ యంచుఁ దా
నెడఁదఁ దలంచియున్ వపువు ♦ నీఁగెడు వేళను రామనామమున్
గడఁకను పల్క యడ్డుపడి ♦ కాచితి వెవ్వఁడ వీవు తెల్పుమా. ౧౨౧

చ॥ అనవుడు నేను పూని యడి ♦ యాలము లెల్లను దెల్ప నామెయున్
దమకఁగ నాలకించి తమ ♦ దానుని చిత్త విశుద్ధిఁ గాంచి పెం
పున నదుగంగఁ బూనునెడ ♦ ముద్రిక నిచ్చితిఁ జెప్పనేల? త
న్మనమున శ్రద్ధ యూయు విడు ♦ మందుగ నొప్పెను జానకీశ్వరా! ౧౨౨

చ॥ క్షణమున రెండు చూచితిని ♦ సారసలోచన యంగుళీయమున్
గొని తన ఱొమ్మునం దడఁచి ♦ క్రొన్నది నీయెడఁబాటుచేతఁ గ్రాఁ
గిన మది కాఁకుచేతఁ గరఁ ♦ గెన్ మఱి చేతము చల్లఁగాఁగ నం
దనుకఁ గరంగినట్టిది య ♦ థాస్థితి నొందినదయ్య! వెంటనే ౧౨౩

మ॥ అపవిత్రుల్ గల పట్టనంబునకుఁ బెం ♦ పారంగ నే తేరఁగా
నపవిత్ర స్థితి నొందె నంచుఁ దన హా ♦ ర్దాపూర్ణ బాష్పావలిన్
వ్యపనోదం బొనరింప నార్చె నొడలున్ ♦ వర్ధిల్లె నేత్రంబు లా
రుప కుత్కంఠను గాంచె ముద్దులిడె నా ♦ ర్పుల్పుచ్చె సమ్మోదిలన్.

సీ॥ పావని నిన్నెడఁ♦బాయుట మొదలుగా, జరిగిన యదియెల్ల♦పారిదిగాఁగ
నెఱిఁగించి తల్లి! నీ ♦ వెట నుండువది యెఱుఁ, గక యింతకాలంబు♦కడచిపోయె
నని నీవు పడు వెత♦లను దెల్ప నామెయు, సాంత్వన మొంది యి♦చ్చటఁ గలట్టి
స్థితిగతు లాలించి♦ దేవియు నచ్చటి, తన స్థితియును నాకుఁ♦దనరఁ దెలిపి

తే॥ యింక నొక నెల జీవించి♦యెట్లో యుందు, నివకు లేకుండు కరుణ వ♦హింపఁడేని
విదపఁ దనయావ జీవము♦ల్విడుచుదాన, ననుచు నీపాదములకు వం♦దన మొనర్చె.

తే॥ ముదిత తన చేలకొంగున ♦ ముడిచియున్న
ఘన శిరోరత్న మానవా ♦ ల్గా నొసంగెఁ
గన్ను లలరఁ గాంచుమ యని ♦ గాడ్పుపట్టి
జానకీజాని కొసఁగె హ ♦ ర్షము తలిర్ప.

సీ॥ కాంచినయంత రో♦మాంచమయ్యెను మేను, కన్నీరు మున్నీరు♦గాఁగఁ బరవె
భుజములు వక్షంబు♦పూరించెఁ జెమరించె, నూపిరి లోపల♦నూఁజడిల్లెఁ
గామంబు మెలమెల్ల♦సోమించి వర్ధిల్లెఁ, దాపంబు దూపిల్లి♦రూపుమాసె
మోదాబ్ధి మది మున్గె♦ఖేదంబు వడి క్రుంగెఁ, దెలుపంగఁ దరమె యా♦తీరులెల

తే॥ చేతనున్న చూడామణి ♦ ప్రాఁతచనవు
తోడఁ జూడంగ జానకి ♦ తొల్లిఁ దన్ను
ముదముతోఁ బట్టు కేలె యౌ ♦ మొగిఁదనర్చె
ధర్మ సంస్థాపకుండగు ♦ దాశరథికి.

తే॥ అప్పు డంగదాదులు వచ్చి ♦ యనఘులైన
రామలక్ష్మణులకు దిన ♦ రాజ సుతున
కెఱఁగి తమ కార్యమునఁ గృత ♦ కృత్యులగుటఁ
బూర్ణచంద్రాభ వదనులై ♦ పొలుపు గనిరి.

తే॥ అవల సుగ్రీవుఁ డలరుచు ♦ నవనిజాత
సులభురాలయ్యె మనమింకఁ ♦ జూడ ననుచుఁ
గడచెఁ గాలంబు మఱియును ♦ కడపవలెనె ?
యనుచు రాఘవుఁ డనఁ ద్వర ♦ గొనుచులేచి.

చ॥ తరలఁగ వచ్చు సేన యనిఁ ♦ తప్పెటతోఁ గపివర్గమెల్లఁ ద
త్తఱపడి లేవఁ జాటిరి ము ♦ దంబుగఁ గొందఱు కీశు లంత నొ
త్తరముగ వాహినుల్ గదలె ♦ దర్పముతో వనరాశి పొంగి యీ
కరణిని లేచి వచ్చెననఁ ♦ గాఁ దగి దక్షిణ దిఙ్ముఖంబుగన్. ౧౩౦౦

తే॥ తగిన రీతిని మోగెఁ బ్ర ♦ స్థానభేరి
శత్రువులనుండి చెడుగులు ♦ జరుగకుండ
నడపుమా సేనలను దగు ♦ నడవ చూపి
యనుచు నీలు నాజ్ఞాపించె ♦ నర్క కులుఁడు.

చ॥ హనుమఁడు కేలుమోడ్చి యిది ♦ యల్ప వనేచరమంచు నెంచ క
త్యనఘమతిన్ మదీయ భుజ♦మందు వసింపుము మోతునంచు వం
దన మొనరించి వేఁడ గుణ♦ధాముఁడు రాముడు మంచిదంచు నా
తనివయి నెక్కె మారుతి యు♦దార గుణంబుల నగ్గలింపఁగన్. ౧౩౦౧

మ॥ అకలంకాత్మక! నా భుజంబుల పయిం ♦ బ్రార్థింతుఁ గూర్చుండుమా
ఘకరస్ఫూర్తి వహింతు నంచు వినతిం ♦ జూపించుచున్ వేఁడు వా
లి కుమారుం దగ నెక్కె లక్ష్మణుఁడు నో ♦ లిన్ సైన్య సందోహముల్
ప్రకటానర్గళ రీతి నేగెఁ దగు త్రో ♦ వ న్నాయకుల్ చూపఁగన్. ౧౨౦౩

తే॥ గరుడ వృషభ పృష్ఠము లెక్కు ♦ ఘనులఁబోలి
హనుమపై నంగదునిపై వి ♦ హారరీతి
రామ లక్ష్మణు లిరువురు ♦ రమణ నేగ
సురలు దీవించి చల్లిరి ♦ సుమ చయంబు. ౧౨౦౪

తే॥ ఊరి త్రోవల నడచిన ♦ నొత్తిడి యగు
నంచు రాముఁ డాజ్ఞాపింప ♦ నలరుఁ దేనె
పండ్లు కందముల్ లభియించు ♦ పర్వతముల
త్రోవ నడచెను కీశ సం ♦ దోహమెల్ల. ౧౨౦౫

తే॥ రాక్షసుల సత్త్వములను ప ♦ రాక్రమముల
వాయు సూనుండు తెలుపంగఁ ♦ బ్రీతి వినుచుఁ
జాలదూరంబు నడచెను ♦ శ్రమ మెఱుఁగక
కపి సమూహంబు రామ ల ♦ క్ష్మణులతోడ. ౧౨౦౬

తే॥ పొడవు త్రోవను భాస్కర ♦ పుత్త్రుతోడ
రామలక్ష్మణుల్ ప్లవగ వ ♦ ర్గంబుతోడ
నడచి కనిరి పండ్రెండవ ♦ నాఁడు తమకు
దారి యొసఁగక నిలిచిన ♦ దక్షిణాబ్ధి. ౧౨౦౭

  



శ్రీ రామ.

# కంబరామాయణము.

## యుద్ధకాండము :: పూర్వభాగము.

---

మ॥ విమలంబై యొకటన్న నొక్కటియు నై ♦ విధ్యంబనం బెక్కులై
సుమహాత్తై తగునన్న నౌననుచు నె ♦ చ్చోఁగాదనం గానిదై
రమణ౯ నేఁడన నేఁడెయై కలదన౯ ♦ రాజిల్ల నున్నట్టిదై
యమరంగా నెటునమ్మ యేవిధమున౯ ♦ ధ్యానంబు గావింతుమో? ౧

### ౧ సముద్ర దర్శన పటలము (౧౧)

మ॥ జలనిధి తీరభూమిఁ గపి ♦ సైన్యము చేరఁగ నుత్తరంబున౯
విలయము వేళ నాశిలని ♦ పృథ్వీధరంబు పయోధి భూమియుం
జులుకన లేచి యాకసము ♦ సూటిగఁదాఁకెను దక్షిణంపు భూ
స్థలియు మహీధరంబొదిఁగి ♦ తాఁతె రసాతల మంటసిల్లఁగ౯. ౨
ఉ॥ చిందము వోలు స్వచ్ఛగుణ ♦ శీల మహీజను పాయు. పిమ్మట౯
బందుగులైన తామరస ♦ వర్గము కూరికి మోడ్పు సెందు వే
ళం దన కన్ను మూయని ద ♦ శత్కమలాక్షుఁ డపారవాహినీ
బృందము తన్ను చుట్టి చరి ♦ యింపఁగ నయ్యెడఁగాంచె వారిధి౯. ౩
చ॥ అలల సమూహమే విభవ ♦ మైన పయోధి వియోగ మొంది చి
క్కులఁబడి స్వీయతల్పమున ♦ కూరిమిచేఁ జనుదెంచు మాయి ని
శ్చలుఁ డగునంచు బుష్పములఁ ♦ జల్లి యమర్చిన సెజ్జఁబోలె నా
తలమున ఫేన మౌక్తిక వి ♦ తానముఁ జల్లుచుచుండెఁ దెమ్మెర౯. ౪
చ॥ బలితపు దుఃఖవార్ధిఁ బడి ♦ బాష్ప జలంబులఁ దేలు సీత నె
వ్వాలఁబడి వేఁగుచుంట నప ♦ వాదునకు౯ స్మర శాత సాయకా
వలికిని లక్ష్యమైన రఘు ♦ వర్యుని సుందర బాహు యుగ్మము౯
గాలిమిని లేచు నిప్పుకల ♦ కోపునఁ గాల్చెను వార్ధి తుంపురల్. ౫
చ॥ గుఱుతిడరాక స్రుక్కిన ర ♦ ఘుప్రభుఁగాంచి మనంబు నంతయుం
గరఁగక భేదబుద్ధిఁ గడఁ ♦ క౯ రొదసేయు మహాబ్ధి నుండి పై

పొరియుచునుండు వీచికలఁ ♦ జేర్మి మునుంగుచు లేచి వచ్చు తె
మ్మెర నురవొన్న వుప్పొడిని ♦ మేవక పోవ దొక్కొక్క సారియున్. ౬
చ॥ పొగడువడన్ శరాసనము ♦ వూనిన బాహులు జానకీ వియో
గ గురుత రార్తిచేఁ గృశతఁ ♦ గాంచి మహీధర సన్నిభంబులై
నెగడుచు నుండు రామ ధర ♦ ణీధవు చెంగట సీత నోటి సో
యగము వహించి కాలుని క్రి ♦ యం గనుపట్టెఁ బ్రవాళ వల్లరుల్. ౭
ఉ॥ మత్తగజేంద్రయాన జన ♦ మాన్య చరిత్ర వసించుచోటు నీ
కిత్తఱి దవ్వు లేదనుచు ♦ నిచ్చ గమింపఁగ మాన వీర్యముల్
చిత్తము లాగ మిక్కిలి కృ ♦ శించెను రాముని చంప నెంచి యో
ముత్తెమ! దైత్య సంగతిని ♦ వూనెదె? జానకి నవ్వు చూపెదే? ౮
ఉ॥ కన్నకుమార్తె శాత్రవుని ♦ కారఁ దగుల్కొని వంతఁ గుందుచున్
గన్నగచాట్లు గొన్నయది ♦ గా యని దుఃఖమునొంది మిక్కిలిన్
గన్నుల నీటి ముత్తెములు ♦ గార్చి కరళ్లను కేలనెత్తి తాఁ
బన్నగ రామపాదములఁ ♦ బట్టిన యట్లు పయోధి గన్పడెన్. ౯
చ॥ వసుధయె నన్నికల్లుగ ని ♦ వంబును నీరము చల్లి వార్ధిలోఁ
బొవఁగిన ద్రవ్యమున్ మెదిపి ♦ పొందిక ఫేనము వేరి గందమున్
విసిగి తపించు సూర్యకుల ♦ వీరుని తాపము వోవఁ బూయఁగా
లన దురు వీచికా కరము♦లన్ వడి నూఱిన తీరు గన్పడెన్. ౧౦
చ॥ స్తనములు గల్గు కోకిలము ♦ చందము నొందినసీత దుఃఖముం
బొనుపడఁ జేయఁ వేల్పులకుఁ ♦ బూర్ణసుఖంబుల నీయ హస్తమం
దున శరచాపము ల్గొనుచు ♦ దుర్దమలీలను దాడిసేయు రా
ముని గని వార్ధి సంతసము ♦ పొంగ నటించిన సౌరు గన్పడెన్. ౧౧
ఉ॥ వారిధి డాసి రాఘవుఁడు ♦ వారిధి కంటెను మించి మానమున్
గూరిమి దుఃఖముల్ మిగులఁ ♦ గూడఁగఁ జేయఁగఁ దగ్గ చెయ్దియున్
వారక చిత్తమందు తలఁ ♦ పం దొడఁగెం; ద్రిదశారి లంకలో
మారుతి చన్న మీఁదఁ దన ♦ మంత్రులతోఁ దలపోసి యవ్వలన్. ౧౨

## ౨ రావణ మంత్ర పటలము. (౧౮)

ఉ॥ శిల్పిని మామఁగాంచి కడు ♦ శీఘ్రము బ్రహ్మను గూడి లంక మున్
శోభిగ నున్న తీరునకు ♦ ముమ్మడుఁగై విలసిల్ల మీ మనః
కల్పనము ల్బయల్పడఁ ద ♦ గన్ ఘటియింపుఁడి యన్న వారలున్
వేల్పులు భ్రాంతినొందఁ దమ ♦ నేరుపుచూపి సృజించి రత్తఱిన్. ౧౩

క॥ బంగారము మణి సంతతి, రంగారఁగ వెలుఁగు తనపు ♦ రము త్రిదివము క
న్నం గొమరగుటం గాంచి మ, దింగల కోపంబు మానె ♦ దితిజాధిపుఁడున్. ౧౪

చ॥ పరఁగఁ ద్రిమూర్తులందు తొలి ♦ వాఁడగు బ్రహ్మయె ముందు నిల్చి సుం
దరతకు మేరచూపి ఘన ♦ తం దగు శక్తియు నిచ్చె ధర్మముల్
కొఱవడ లోక జాలములఁ ♦ గూల్చుచుఁ జేయుచుఁ బెక్కుసార్లు చే
దిరిగిన వానికిన్ సొగసు ♦ దేఱని కార్యము లున్న యిద్ధరన్? ౧౫

క॥ అరుదుగఁ గట్టిన నగరము, వరుదుగ వీక్షించి నిర్జ ♦ రారి యజుం జే
రరుదుగ నర్చించి మయున, కరుదగు వస్తువుల నొసఁగె ♦ నాదరణమునన్. ౧౬

తే॥ మెఱుపువంటి యలల మిఱు ♦ మిట్లు గొలుపు, కెంపు ఱాకంబముల దీప్తి ♦ కెరలుచున్న
మండపమున సింహాసన ♦ మధ్యవీథి, నిండుకొలువు దీరెను నాఁడు ♦ నిర్జరారి.

తే॥ సురపతులు వైచుచుండు వీ ♦ చోపు వలనఁ, గదలు పూమాలఁ దాల్చిన ♦ త్రిదశవైరి
సచివు లనుభవవృద్ధులు ♦ సైన్యపతులు, బంధువులు చుట్టియుండ రా ♦ వణుఁడు గాంచి.

తే॥ తలఁచు కార్యంబు తగిన ప ♦ ద్ధతిని తెలిపి, వృద్ధమంత్రుల తలఁపులు ♦ వేడ్కఁ దెలియ
వెలఁదులను పిన్నవారల ♦ వేలుపులను, ప్రకృతి జనముల నెల్ల న ♦ వ్వలికిఁ బంపె.

తే॥ ప్రాభవంబుచే నాజ్ఞ చే ♦ బంభరముల, తోడ గాలిని సైతము ♦ తొలఁగఁ బంపి
యనుభవజ్ఞులు వాక్యజ్ఞ ♦ లైన సచివ, వరులతోడ నాలోచనా ♦ పరతనొప్పె.

తే॥ వీరులై బహుశ్రుతులయి ♦ ప్రేమచూఱ, గొన్న వారయ్యుఁ దమ్ములు ♦ కొడుకులట్టి
యాత్మబంధులఁ దక్క వే ♦ ఱైన జనుల, నెల్లరను వెలికంపె స్వ ♦ హితము గోరి.

ఆ॥ జగములెల్ల నొక్క ♦ మొగి నెత్తి వచ్చిన, నలఁపఁదగిన వీర ♦ నాయకులను
కడలఁ దిరుగుచుండఁ ♦ గాపుంచె మృగపక్షి, చయము చేష్ట మాని ♦ జంకునొంది.

తే॥ ఒక్కకోఁతిచే గౌరవ ♦ ముర్విఁ గలిసెఁ, బాలనము బలగర్వముల్ ♦ పాడుపడియె
నింతకంటె వేఱొండేది ♦ యెనఁగు సిగ్గు, చేటనుచుఁ బ్రెగ్గడల తోడఁ ♦ జెప్పఁదొడఁగె.

ఉ॥ అగ్గియె కొల్లవెట్టఁ గపి ♦ యక్కట! యొక్కటి నిప్పువెట్టఁగా
బొగ్గుల కాడె యయ్యెఁ బుర ♦ మున్ జయభూతి వెలార్చు టెక్కముల్
బుగ్గిగఁ దూలె బంధులును ♦ పుత్రులు మిత్రులు గూలి నార లి
ట్లుగ్గడువయ్యె నిందగొని ♦ యుంటిని నేను శవంబు పోలికన్. ౨౪

తే॥ బావులను నిండి నెత్తురు ♦ పాఱుచుండె, నగ్ని యింకను ప్రోలఁ జ ♦ ల్లాఱలేదు
అగురు పొగవీచు మగువల ♦ యలకలందు, చుండు కంపు కొట్టుచునుండెఁ ♦ జూచినారె!

ఉ॥ ఏవొ విశేషకార్యముల ♦ నీడ్యతఁ జేయకయున్న మానె నీ
భూవలయంబునం బొడమి ♦ పుట్టనివారలలో గణింపఁ బా
లై వగఁగుంది నిందయు న ♦ పాఖ్యయుఁ గైకొనినార మాఱలోఁ
జావము వానరుం బొదివి ♦ చంపఁ దిఁ కేమి యొనర్పనేర్తుమో? ౨౬

తే॥ అనుచు రావణుఁ డాడంగ♦నంతటంగ, మందు నొచ్చి సేనాపతి♦యప్పుడు లేచి
కేలుమోడ్చి నామనవిని♦గేలి గొనక, వినఁగ వేఁడెద నని యిట్లు♦విన్నవించె.

ఉ॥ దేవరవారెఱుంగనివి ♦ తెలిచి చూచినలేవు ధాత్రి మా
యావిధి మాననీయుల స ♦ రాధ్యుల వంచనచేసి జానకీ
దేవిని తెచ్చు నీతి యది ♦ ధీరులపద్ధతి గాదటంచు నాఁ
డే వివరించినాఁడ గణి ♦ యింపక తెచ్చితి రీబెడఁదలన్. ౨౮

చ॥ చెలియలి మోము సొరుచేడఁ ♦ జేసి మహాబలులన్ ఖరాదులన్
గలుమములోఁ జంపు కడు ♦ కావరులన్ గసిదీఱ భూమికిన్
బలి యొనరించి పక్షులకుఁ♦బారణనేయక పాలనంబు దు
ర్బలమయి కూలెనంచు మది ♦ వందుట పోలునె నిన్ను బోఁటికిన్? ౨౯

ఆ॥ చంపఁదగిన చోర♦సంతతి దొరకినఁ, జంప కూరకుంట♦చనదు పతికిఁ
బగఱ గొప్పబలముఁ♦బరికించి పరిమార్ప, కొదిఁగి యుంట పౌరు♦షోచితంబె. 30

తే॥ జయము బల విక్రమములు య♦శమ్ము గురుత, వేలుపుల గెల్చు చేతనా? విక్రమంబు
వీడి యోర్చుట చేతనా? వెలసెమీకుఁ, దెలుపుఁడయ్య నిశ్చయముగఁ♦దేటపడఁగ

క॥ పగఁజంపి తృప్తిఁబొందుట, తగవుగఁ దలపోయకిట్లు ♦ తగుసౌఖ్యములం
దగిలినఁ గపి పనితో నిది, తెగునే? తొలుదుమె యెదురు♦తిరిగిన దోర్మన్?

ఉ॥ పోయిన కోఁతి వెంబడినె ♦ పోవుచు దానిని పంపువారి పే
రాయువులం గ్రహించి మది♦నందిన దుఃఖము తీర్ప కివ్విధిన్
వాయిడి వ్రేలుచున్న మన ♦ వన్నెయు వాసియుఁ గ్రుంగకున్నె? పై
నేయది యుక్తమో? యెఱుఁగుఁ ♦ డీ యని యాతఁడు కూరుచుండఁగన్.

తే॥ ఒవర వభఁగాంచి పల్కె మ♦హోదరుండు, సైన్యపతి పల్కుచందంబు♦సర్వవిధులఁ
జక్కనై యుండు; నాపల్కు♦సరణి వినుము, తప్పులున్న మన్నింపుము♦దైత్యరాజ!

క॥ అడఁగిరి వేల్పులు యక్షులు, మడఁగిరి పన్నగులు వైరి♦మర్ద న! విడువం
దొడఁగిరి గర్వము లోకులు, కడఁగిరి వడఁకంగ నెదుటఁ♦గన్న త్రిమూర్తుల్.

తే॥ అఖల జీవంబులం జంపు♦యముఁడుఁ గూడఁ, దనకు నీవ యముఁడవని♦తలఁచి జంకి
నియమశక్తులఁ దలఁదాల్చి♦నెగడుచుండు, నింతకంటె గౌరవ మిఁక♦నేది కలదు? 3౬

మ॥ భవుతోడన్ రజతాద్రి నింగి దగులన్ ♦ బాహా బలాధిక్యతల్
మివ్వులం దాలిచి సామగానమున పే ♦ ర్మిన్ శర్వు మెప్పించు దా
నవవీరా! భవదీయ శౌర్యమహిమన్ ♦ మాత్రోడఁ గ్రుంగించి యె
క్కువ ప్రౌఢోక్తుల నొక్కవంది పగిదిన్ ♦ గ్రోఁతిం బ్రశంసింతువే? 3౭

ఉ॥ కంటికిఁ గానరాక త్రిజ♦గంబులఁ దప్పి చరించువారు దు
ష్కంటకులై యకేయులయి ♦ కానఁగవచ్చిరె? దోర్బలాఢ్యులై

రెంటని వారిపట్ల వడి ♦ యోచన సేయఁగఁ దగ్గ తీరు చె
న్నంటుల పట్లఁ జేయఁ దగు ♦ నా? యిదిపోలునె నిన్నుబోఁటికిన్?

ఆ॥ సంకటమ్ము వచ్చెఁ ♦ జావేది? బ్రదుకేది? యనఁగనేల? నన్నె ♦ యంపితేని
వనచరులను నరుల ♦ వధియించి నీపగ, రూపుమాపి వత్తు ♦ రూఢిగాఁగ. ౩౯

క॥ అనుచు మహోదరుఁ డాడఁగ, విని కన్నుల నెత్తురొలుక ♦ వీక్షించుచు రు
ద్రనిభుండు వజ్ర దంష్ట్రుఁడు, దను జేంద్రుని దిక్కుదిరిగి ♦ తాత్పర్యమునన్. ౪౦

చ॥ మనుజులు వానరుల్ మిగుల ♦ మాన్యత చూపఁగఁ దగ్గవారె? యో
దనుజ వరేణ్యులార! చని ♦ దర్పముతో వెసఁబట్టి మ్రింగుఁ డం
చనుమతి యిచ్చి యిచ్చటనె ♦ హాయి వహించుట మాని యిట్లు మీ
మనమునఁ జింతిలం దగునె? ♦ మాపయి నమ్మిక మీకుఁ బుట్టదో? ౪౧

ఆ॥ ఆజ్ఞ మీఱువారి ♦ నప్పుడ తెగటార్చి, లోకములను మీకు ♦ లోఁగఁ జేయు
నేను మిమ్ము మీఱి ♦ యెన్నఁడు నడచితి? నుత్తరువు నొసంగ ♦ కుండుటేల?

ఆ॥ అనుచు నుండు మనుచు ♦ నావజ్రదంతు నా, క్షేపణంబు చేసి ♦ భూవు మొగము
గాంచి దుర్ముఖుండు♦కడు నల్పువలె నుండ, నేల? యనుచు మఱియు♦నిట్టులనియె,

తే॥ దిక్కరులు దుర్బలంబులై ♦ తేజు మాసె, వేల్పు లుడిగిరి రజతాద్రి♦బెండువడియె
నట్టి నీకు నృపులు కపు ♦ లధికులైన, మెచ్చఁ దగినదే నీ బల్మి♦యిచ్చకొలఁది!

తే॥ బాగుగాఁ జూడ నీ తీరు ♦ బలవిహీను, లైన వారల తీరగు ♦ నయ్య నిజము
పగఱు బలవంతులే యైనఁ♦బ్రాణరక్ష, ణంబుకై వారి కడఁగి యుం♦డంగఁ దగునె?

క॥ మనుజులు నెలుఁగులుఁ గపులును, మన కాహారములు; వాని♦మార్కొన దిగులం
గొనుదుమ యేనిన్ జగమున, మనకంటె వివేకులెవరు?♦మగ లెవ్వారల్? ౪౬

తే॥ ఒక్క కోఁతి సంద్రము దాఁటి♦యూరఁజొచ్చి, నిప్పు వెట్టి పల్వురఁ జంపి♦ నగడి మరలె
రాక్షసులమైన మనకుఁ బు♦రంబు వీడి, దాడి సేయుట తగదేమి? దానవేంద్ర!

తే॥ మన పురికి వచ్చి సౌధముల్ ♦మంటఁ గలిపి, సైన్య బల పరాక్రమముఁ ♦నరణిఁ దెలిసి
ప్రాణములతోడ మరలిన♦వారలెవరు, గలరు జగమునఁ గోఁతి యొ♦క్కండు దక్క?

తే॥ తగవు కర్తవ్య జయములఁ♦దలఁచి తీరు, మానముగఁ జేయఁ దగ్గది♦మనుజవర్యు
లున్న కడ కేగి వారల♦యుసుఱు లూడ్చు,పద్ధతియె యొప్పు వన మహా♦పార్శ్వుఁడనియె

తే॥ కోఁతి యొక్కటి పురి నాల♦గోడు బాల, గోడుగాఁ జేసి పోవఁ గ♦న్గొనుచునున్న
మనము పొందక విజముగ♦మానియున్న, పేదతనమేది? నిలిపిన♦పేర్మి యేది?

తే॥ మొదటిపోరువ బలహీన ♦ పురుషులొక్క, కొంద ఆ కోఁతిచేతులఁ♦గూలినంత
తక్కువారల చేవయుఁ♦దఱిఁగెనేమి? లంకతో శౌర్యమును కాలి♦క్రుంకెనేమి?

తే॥ పంపినారలో మనుజులు; వచ్చినదియొ, తరుచరము; చేసినది పుర♦దాహమయ్యొ
దానికై దైత్యవర్యులు♦ తలఁచిరన్న, నింక నేమేమి తోఁడరునో♦యెన్ననగునె?
తే॥ ఇచట నిలిచి మాటాడుట♦కిష్టపడను, వెంటనే యేగి వారల ♦ పేరు లేక
చేసి తనివారఁ దినుటయే♦చేయఁ దగిన, కర్జ మిఁక వేఱు యోచనల్♦కానివనియె.
తే॥ ప్రభువు ఇంకి కర్తవ్యంబు ♦ ప్రశ్నచేసె, నేగి తలకొక్క దిక్కుగా ♦ నీల్గు టింకఁ
గొనుమ! యని వినుకొంది యం♦గదను మండ్, చాలున నేఁ బిశాచుఁడను ని♦శాచరుండు.
తే॥ ఇంతగా నిషు చెప్ప శం♦కింతుమేమి, కార్య మిదియేని మనకంటె♦ఘనులు వారు
మనము తక్కువ వారమే♦యనుచుఁ బలికె, సూర్య శత్రువనెడు దైత్య♦వర్యుఁడొకఁడు.
క॥ మన మాలోచించెడు నది, మనుజులఁ గూరిచియె కాన ♦ మనచేవయుఁ బా
లన శక్తి చెడియె నను వి, న్నన కిది చాలునని యజ్ఞ♦నాశకుఁ డనియెన్.
తే॥ జ్వలిత నేత్రుఁడై శివుపై కి♦జరుగుటన్న, నవ్వఁ దగియుండుఁ గపి పై కి♦నరులపైకి
వెడలుకంటెను వార లి♦వ్వీడు సేరు, నంత కోర్చియుండమని ధూ♦మ్రాక్షుఁడనియె.
తే॥ తక్కువారలు పాము చందమున బువలు, కొట్టి యిదియె లెస్సనుచు వా♦క్రుచ్చినారు
పిదప నెల్లర వారించి♦వినతి తోడ, నిలిచి కుంభ కర్ణుం డిట్లు♦పలుకఁ దొడఁగె.

—: కుంభకర్ణుఁడు హితము పలుకుట :—

తే॥ వెనుకముందారయఁగలేని ♦పిన్న లెల్లఁ, బలుకుకంటె నూరకయుంట♦పాడియగును
తమ్ముఁడసి యెంతువేని హి♦తమ్ము దెలుపు, వాఁడఁ గటు వేని మన్నింప♦వలతు నిన్ను

ఉ॥ పుట్టితి బ్రహ్మవంశమునఁ ♦ బోఁడిమి వేదము లభ్యసించి య
ప్పట్టున విద్యకుం దగిన ♦ ప్రజ్ఞయు శీలము నొందినాఁడ వీ
కట్టిఁడి సేఁత నీకు నవుఁ ♦ గాదననేల? విరాళి వహ్నిపైఁ
బుట్టె నిఁకింత మాత్రయును ♦ పొందక యున్నె ఫలంబు దానిచే? ౬౦

ఉ॥ అందముచిందు లంక యెరి ♦ యంగఁ బ్రభుత్వమె కూలినట్లు నీ
డెందమునం దపించితి క ♦డిందిగ రాముని దేవిఁ దెచ్చు నీ
చందము మంచిదేమి? ములు ♦ చల్ కడుపావులు పొందఁదగ్గ యీ
నిందకు మించి రోయఁదగు ♦ నీచత ధాత్రి నొకండు గల్గునే? ౬౧

చ॥ నగరము రూపు మాపెదని ♦ నాన వహించెదు ధర్మపత్నులా
మగువలు నీపయిన్ రుచిర ♦ మందతర స్మితకాంతు లూన్ప న
వ్వగరిత కాళ్లపైఁ బడుచు ♦ నోర్వక యామెయుఁ బ్రువ్వఁదిట్ట నో
ర్పుగొని సహించుచుండుటయు♦రూఢ యశంబు నొసంగఁ జాలునే? ౬౨

శా॥ ఏవాఁడిట్లు లధర్మరీతిని కృపా ♦ హీనుండవై క్రొత్తడిన్
మానంబొప్పఁగ నీచపద్ధతుల నం ♦ భావించుచుం దెచ్చితో

యానాఁడే మన వన్నెవాసి తఱిఁగెన్ ♦ హైన్యంబు చేకూరె లో
కానక్ దుష్కృతముల్ పొనర్చి యశముం ♦ గాంక్షింపఁగాఁ బోలునే ?

చ॥ అకలుషశీలయా నొకని ♦ యంగనఁ దెత్తము కార నుంతమున్
ప్రకటిత కీర్తిఁ గోరుదము ♦ వాక్కుల శౌర్యము వెల్లడింతమున్
వికలత గూర్చు కామమునఁ ♦ బ్రీతి వహింతము మానవాళికిన్
గకవిక లౌదమున్ జయముఁ ♦ గాంక్ష యొనర్తము మేలుమేలగున్. ౩౪

ఉ॥ పెద్దలు సేయు కార్యముల ♦ వీఁడితి వంశవినాశ కార్యముల్
పెద్దగఁ జేసి తా పయిద ♦ లిన్ విడిపించుట యొల్లిదంబుగా
బుద్ధిఁ దోఁచెఁ గాన నిఁక ♦ భూపకుమారులు వచ్చి కీర్తియున్
దొడ్డకుఁ బోవఁ జంపినను ♦ దోసమె ? నిందయు రాదు ధాత్రిపై. ౩౫

చ॥ వనమున నొక్కఁడే ప్రబల ♦ వాహినిఁ గూల్చి తమ్ముఁ జంపి రే
పెను పెనువైర మియ్యదియు ♦ వెల్తిగనున్నది యింక ముఖ్యవకా
పని సమరంబు సేయుటకు ♦ వాహిని సిద్ధముచేసి యుంచు టే
మనకు హితంబు; వేఱొకటి ♦ మాన్యత గూర్పదు చింతచేసినన్. ౩౬

తే॥ మనుజు లల్పులేయైనను ♦ వినుము వారు, వచ్చుదాఁక నొర్తమయున్న ♦ వారితోడ
సమరులును లోకములు నొక్క ♦ టైన యెడల, మనకు నాపద తప్పదు ♦ దనుజ నాథ.

తే॥ సేన మితిమీఱ వారికిఁ ♦ జేరుమున్నె, వనధిదాఁటి నేఁడే నర ♦ వానరులను
అవలికేఁగనీయక చుట్టి ♦ యవియఁ జేయు, కర్జమే ముఖ్యమని కుంభ ♦ కర్ణుఁడనియె.

చ॥ అనవుడు దానవేంద్రుఁ డను ♦ జా ! కడులెస్స వచించి తీవు నా
మనమున నున్నవాని నను ♦ మానములేక గ్రహించితెల్ల ; వే
రనుకొను టేల ? నేఁడె విజ ♦ యధ్వజ సుందర సైన్యరాజితోఁ
జని పగఱన్ వధించి పెలు ♦ చం జనుదెంచుట మేలు లెండనన్. ౩౭

—: ఇంద్రజిత్తుని ప్రతాపోక్తులు :—

తే॥ అంత మేఘనాదుఁడు లేచి ♦ యనియెఁ దండ్రి ! నీవ వైశమ దండెత్తి ♦ నీచజనులఁ
జంపఁ దగినంత స్థితి యేమి ♦ సంభవించె ? మాబలంబులు కృశియించి ♦ మాఁడెనేమి!

క॥ భవుఁడును నహాప్రదశ సం, భవుఁడు ప్రసాదించి యొసఁగు ♦ పాశాదికముల్
విపులఁగల దనుజు లుండిరి, తవిలి యలయుచుండు నొకఁడు ♦ దానుఁడ నుంటిన్ ౪౦

తే॥ మూఁడు లోకములును ♦ మొదటి వేలుపుతోడ, నెదిరినేని గెలువు ♦ నిత్తు నీకుఁ
గాద యేని కొడుకు ♦ గాను నిజము పులి, కడుపునందు మేఁక ♦ పొడము నేమి ? ౪౧

చ॥ వనచరు లాజిఁ గూలఁగఁ గ ♦ బంధము లెల్లెడ నాట్యమాడఁగా
మనుజులు చింతిలన్ జన న ♦ మాజము జాలి వహించు తీరుతో

జనకజ సొమ్మసిల్లెడు గదు ♦ జాల్ముల రాఘవులన్ వధించి నేఁ
డనువుగ వారి శీర్షములు♦నర్మిలిఁ గానుక యిత్తుఁ జూడుమా. ౨౩

ఉ॥ చందురు ముఖంబు రోఁతవడఁ ♦ జూచెదు కోఁతులు మన్మహోగ్ర కో
దండ విముక్త చండ నిశి ♦ త ప్రదరంబులు ముంచి నొంచఁగాఁ
గుందు లెగిస్తి దిక్కులకుఁ ♦ బాఱుట గాంచి మనంబులోపలన్
నిండుగ మోదమందెదవు ♦ నీఁగెదు నీదగు చింత చూడుమా. ౨౪

చ॥ కరిఘటలున్ రథంబులకుఁ ♦ గట్టఁ దురంగములున్ బదాతులున్
బొరపగు పూర్వజన్మ కృత ♦ పుణ్యము రాజ్యము లేని శత్రులా?
నిరివిగ గూన్పలైన యట ♦ వీచర వర్గముఁ గూడి గెల్తురా?
నరవరి యట్టులైన దను ♦ జవ్రజ శౌర్యములేల కాల్పనే! ౨౫

తే॥ పాంచ భౌతికమై యొప్పు♦ప్రాణి కోటి, నెల్లఁ గూఁకుడు వేళ్లతోఁ♦గెల్లగించి
నరులు వానరులను పేరు♦ధరణిలేక, చేసి గాక క్రమ్మఱఁగ నా♦సింపఁ జుమ్ము ౨౬

తే॥ అనుచుఁ బదములఁ బడిలేచి♦యంజలిఁ గొని, సెలవు వేఁడఁగ నిఖిలదు♦ష్కృత్యములను
గెలిచి శత్రుజ్ఞుఁడై లస♦త్కీర్తి గను వి, భీషణుం డౌదుగ అచి యి♦వ్విధి వచించె

—: విభీషణ నీతి :—

చ॥ నెఱి వివరించి పల్కఁ జత ♦ నించిన కుఱ్ఱఁడ! మూర్ఖబుద్ధివై
నెఱిఁగిన వారిఁ బోలె వచి ♦ యింపఁ దొడంగితి రాఁగలట్టి కీ
డెఱిఁగితె? ముందు వెన్కలరక ♦ యించుక యారయ కిట్టు లిచ్ఛవై
వెఱి మొఱి పల్కులాడి యొద ♦ వింతువె కార్యము పిల్ల చేష్టలన్? ౨౭

ఉ॥ గ్రుడ్డి యొకండు చిత్తరువు ♦ కుంచియతో లిఖియించు తీరుగా
నెడ్డె తనంబునం బలుక ♦ నెంచితి కార్యము చంద మారయన్
దొడ్డ గుణంబులున్ తలఁపు ♦ తోరము కార్య విచక్షణత్వముల్
బిడ్డలకున్ బలంపదునె? పెద్దల కూటమి నుండఁబోలునే? ౨౮

చ॥ విమల గుణమ్ములన్ వెలసి ♦ విశ్రుత సత్య పథానువర్తులై
యమరిన పెద్దలేల? యను ♦ రావణిలో గుణ శీల సంపదల్
క్రమమున నొందు చేతనా? తి ♦ రంబుగ వంచన చేతనో? పరా
క్రమమున నో? మహాత్త్వమును ♦ గాంచిరి కొందఱు నీవ చెప్పుమా?

తే॥ [illegible] మాయచే గెల్చు♦నేర్పు నీకు, నిచ్చినది తపంబో? మఱి♦యేదో? చూడు
[illegible] నీఁగి ధర్మమా♦ర్గమున నడచు, వారెనుమ్మ నీ కొసఁగిరి♦బలము నలవు.

తే॥ పాప [illegible] జగములఁ♦బరిఢవిల్లి, బ్రహ్మ ముఖ్యామరుల గెల్చి♦పరుమ ముదురఁ
[illegible] తుదిఁ గూలి♦వడిరిగాక, తిరముగా స్వర్గ మేలిన♦ధీరు లెవరు?

తే॥ పూర్వమును తరువాతను♦బుద్ధి నిలిపి, చెడుగులం ద్రోచి మోక్ష సం♦సిద్ధి గన్న
పెద్దలెందఱు గలరు భా♦వించి చూడ, వారిలో నొక్కరేం జెడు♦వారు గలరె?
తే॥ ఎఱుక లేని బాలుండ వౌట♦నిట్లుపలికి, తంచు ఒలయుతు సుతు మంద♦లించి యవల
రావణుం గని పల్కు న♦ర్థంబు గేలి, సేయ కాలింతు వేని వ ♦ చింతు ననుచు.

ఉ॥ తల్లియు నీవె తండ్రియును ♦ దైవము నన్నయు నీవె చూడంగా
నెల్ల సుఖంబు లీవగుడు♦నింద్రసుఖంబుల నొందుచున్న సం
పల్లలితార్థమౌ పదవి ♦ పాడఱం జేసెద వంచు మించి చిం
తిల్లెద మద్భృతంబులకుం ♦ దీఱకయున్నె సురేంద్ర భోగముల్? ౮౫

చ॥ చదివిన దానికిన్ ఫలము♦సచ్చరితంబున లేదయున్న ని
ష్ఠాదవిన కార్యమందు తగు ♦ యోచన శక్తియు లేదయున్న నొ
ప్పిదమగు కార్యనిశ్చయ వి ♦ వేచన లేకయయున్న నానుడుల్
తుదివఱ కాలకించి మఱి ♦ దోసము దోంచినం గోపగింపుమా. ౮౬

క॥ జానకి యను పేరొందిన, మానవతి పతివ్రతాగ్ని ♦ మాడ్చిన యది లం
కా నగరము గాకున్న నొ, కానొక వానరము కాల్చెం♦గా యనంజనునే? ౮౭

క॥ ఎవరెటు యోచించిన గా, రవమును పోంగొట్టు కొనుట♦రమణుల వలలోం
దవిలి; యటుగాక యున్నను, భువికై; యివి రెండు గాక ♦ పుడమింగలదే?

క॥ శరధిపరిఖమగు లంకా, పురి కధిపు తపః ఫలంబు♦పూర్తిగం జెడుటల్
నరతరుణి కొరకె కై యని, పరులాడంగ విని సహింపం♦బాల్పడ నగునే? ౮౯

క॥ ఉరుతపము చేసి యజుచే, వరములం గొనునాండు మనుజ♦వర్యులచే నో
టొరయక గెల్పొందుటకున్, వర మడుగవు పోనంగు బెట్లు♦వారిం గెలువన్? ౯౦

క॥ మనుజుల వలనన్ మన మొం, దిన వానిని చింతనేసి♦తెలుపంగ వలెనే?
విను వేయికేల వానిం, జెనసి నిలువ కడంగి తిపుడు♦చేయుట గలదే? ౯౧

చ॥ పొడవయి యంబరస్థలము ♦ ముట్టిన తారగిరిం బెకల్చు నాం
డడరి చతుర్భుజుండగు మ ♦ హాత్ముండు నంది యొసంగు శాప మి
య్యెడ ఫలియింపంగాం దొడంగె♦నింతకు హేతువు వాలిచే బలం
బెడలి కృశించునాండె గ్రహి ♦ యించితిం బెద్దలవాక్కు తప్పునే? ౯౨

ఉ॥ నిప్పునంగూలి ప్రాణముల ♦ నీంగిన క్రొత్తడి యిచ్చు శాపమున్
దప్పిగొనంగ నేర్తువొకొ? దండడి దుఃఖము నీకుం గూర్తు నం
చప్పుడు పల్కు వేదవతి ♦ యంబుజసద్మ యయోనిజాతయై
యిప్పుడు సీతగాంగ జని ♦ యించె నిజంబిది దానవేశ్వరా! ౯౩

క॥ దశరథుండను నరపతి తన, పశమున నీజగము నడప♦వర్తించి మహా
యశుండయి శంబరుం జంపి త్రి, దశపతికిని స్వర్గమును ప♦దంపడి యొసంగెన్. ౯౪

సీ॥ వృషభ రూపుం డైన ♦ యింద్రుమై౽ జని దైత్య, కులము రూపడంచు క ♦ కుత్స్థ నృపుఁడు
ఉర్వి గోవుగఁ జేసి ♦ యోషధుల్ పిదికించి, జనులఁ గాచిన పృథు ♦ చక్రవర్తి
జలనిధిం ద్రవ్విన ♦ సాగరులును గంగఁ, గ్రిందికిఁ దెచ్చు భ ♦ గీరథుండు
పొడమిన కులమునఁ ♦ బుట్టి జగంబున, శత్రులఁ దునిమి వి ♦ శ్రాంతి నొంది

తే॥ ధర్మముం గాచి న్యాయప ♦ థమున నిలిచి, యజల కొసఁగిన వరము లే ♦ దనఁగ లేక
సత్యమునకుఁ బ్రాణము వీడు ♦ జన శరణ్యు, దశరథుని పుత్త్రకులు వారు ♦ దానవేంద్ర!

క॥ వార లసామాన్యులు ముని, వీరులకును వేలుపులకు ♦ వేత్తై యెఱుఁగం
గా రాని వారు మన క, ర్మారంభముచేత సులభు ♦ లైరి మనుజులై. ౯౯

తే॥ బ్రహ్మతోడ స్పర్ధించి ప్ర ♦ పంచమొండు, సృష్టి చేయంగఁ బూను కౌ ♦ శికుఁడు పూర్వ
మభవువలన నొందిన యమో ♦ ఘాస్త్రములను, వారికొసఁగె యజ్ఞము గాచు ♦ పట్టునందు

తే॥ దేవ దానవులకుఁ బోరు ♦ దివురునాఁడు, గరుడు నెక్కి విష్ణువుగొన్న ♦ కార్ముకమును
పుర విదాహంబు సేయు శం ♦ కరు శరమ్ముఁ, గుబ్జుఁడైన యగస్త్యుచేఁ ♦ గొన్నవాఁడు.

చ॥ అతని శరావళులో జగము ♦ లన్నిటి లేహన సేయు దిక్కులన్
జతనముతోడఁ గొల్చును వి ♦ సంబును గ్రక్కును ఘోరదంష్ట్రికా
యుతములు తూణ భూకముల ♦ నందు మహాత్ముల హింస సేయు దు
ర్మతులను దక్కఁ దక్కగల ♦ ప్రాణుల నాహుతి సేయ నొల్లవున్.

చ॥ ధనువులు రామలక్ష్మణులు ♦ దక్కఁ బరుల్ గదలింప లేరు శిం
జినులును చేవయుం జెడవు ♦ శ్రేష్ఠము లౌ మనవిండ్లు పెద్దవై
నను తమ విండులన్ విఱువ ♦ నాటఁగ లేవవి కల్పకంబులో?
కనువు వెదుళ్లొ? మేరువులొ? ♦ కాక కులాచల సత్త్వ మూర్తులో? ౧౦౦

తే॥ వాలి వక్షంబు పగిలె భు ♦ వంబుఁ గ్రమ్మ, నేడు మద్దులు గూలె దై ♦ త్యేంద్రులైన
ఖర విరాధులు మడిసిరి ♦ కదన మైనఁ, బగఱు తెగి మాలుటయె కాక ♦ బ్రతుకఁగలదె?

ఉ॥ కాంతులకెల్ల నెల్లయగు ♦ కార్ముక వీరులు రామలక్ష్మణుల్
స్వాంతములం జలింపక వి ♦ శంకట వృత్తిని తోడులేకయే
మంతురు లోక జాలముల ♦ మానుగ సోఁకులమూఁక దుంపతోఁ
ద్రెంతు రటంచు నమ్మెయె త ♦ ఱిం గని మానులు వేఁడిరిమ్మలన్. ౧౦౨

చ॥ మనమునఁ జింతచేఁ గుమిలి ♦ మాఁడుచు నీయెడఁ బల్క జంకి యా
దనుజాలు రేఁబవల్ నిదుర ♦ తక్కి కృశించుచుఁ గల్వరింత్రు నె
మ్మనములఁ జింతనూని గతి ♦ మాలిన వేల్పులు సీత యన్వివం
బును గొనువారు నిశ్చయము ♦ బ్రుంగెదరంచు మదించినారలున్. ౧౦౩

ఉ॥ కీర్తి మాయ నోర్పుగొని ♦ కీడ్వడి చిర్నవు మాని తేజముం
దేరకఁ బోవఁ గాంతి చెడి ♦ దీనతఁ బ్రాణము మాత్రమొంది చిం

తారతఁ గుందుచుం బగటి ♦ తమ్ములదాయను బోలియున్న వా
రారయఁ బూర్ణిమా విధుని ♦ యందము నందిన వారు నిర్జరుల్. ౧౦౪

చ॥ ధరణిని దాఁటి యావలికిఁ ♦ దాటిన కాలుఁడు దేవ యక్ష కి
న్నర ఫణి ముఖ్యులెల్ల రఘు ♦ నాయకు దేవి విదేహపుత్త్రి యీ
పురిఁ జెఱ నున్న దంచు ♦ విని ♦ మోదమునొంది భయంబు వీడి చె
చ్చెర నవుడప్పు డిందలి వి ♦ శేషము లారయుచుండ్రు శ్రద్ధమై. ౧౦౫

చ॥ చెడు శకునంబు లెన్నియొ వ ♦ చింపఁగరానివి కానవచ్చె నొ
క్కెడఁ బగయూని యోటువడి ♦ యేడ్చిన వేల్పులు దానవేంద్రు లిం
డెడనెడఁ గాన వత్తురు మ ♦ దేభ తురంగము లిప్పు డిండ్లలో
నెడము పదంబు వెట్టి చరి ♦ యింపఁగ వచ్చెడు రాక్షసేశ్వరా!

చ॥ పరపెను జిహ్వికల్ దనుజ ♦ పాళికి నక్కలు సంచరించె మం
దిరములలోఁ జిరంటికల ♦ తీరగు ముంగురులందునన్ విప
త్కరముగ మిక్కిలిం గమరు ♦ కంపు బయల్పడె నింతకంటె దు
ర్భరతర సూచనల్ గనఁగ ♦ వాంఛ యొనర్తువె రాక్షసేశ్వరా! ౧౦౭

సీ॥ ఖరుఁడు దూషణుఁడు త్రి♦శిరుఁడు మారీచుండు, వాలి విరాధుండు♦కూలు తీరు
నారసి చూడంగ ♦ సారంగ పాణియుఁ, జక్రపాణియు వారి♦సములె? చెపుమ
వారితోఁ గూడిన♦వానర వరులు దే, వతలు వారలతోడ♦వైరమేల?
ఇది మంచి పని యని ♦ యెంచుట తగవె? నీ, కీర్తి భోగంబులు ♦ కీడు పడును

తే॥ ప్రాభవము ప్రమాలు నపవాదు♦పైకి వచ్చు, నెల్లిదంబగు బంధులు♦హితులు సుతులు
చెడెడి చేఁతలు తగదయ్య! సీత విడు, మింతకంటెను మేలు నీ♦కెదియు లేదు.

ఉ॥ మేలు దలంచి తమ్ముఁడిటు ♦ మేవడి నాడిన పల్కులన్ రణా
భీలుఁడు రావణుండు విని ♦ పెద్దగఁ జేతులు దట్టి వక్ర దం
ష్ట్రాళి వెలుంగ నేత్రముల ♦ నగ్నికణంబులు రాలఁగా భుజా
పాళి యురంబు గ్రక్కదలఁ ♦ బక్కున నవ్వి గణింప కిట్లనున్. ౧౦౯

ఉ॥ మేదుర రీతిమై హితము ♦ మీఱు వచించెద నంచుఁ బూని యు
న్మాదుని పోల్కిఁ బల్కితివి ♦ మాయురె! నన్ను మనుష్యులంట! పెం
పేదక గెల్తురంట! విని ♦ యెవ్వరు నవ్వక యుందు వార! లీ
వేదతనంబు గల్గినది ♦ భీతినొ? ప్రేమనొ? యెందు చేతనో? ౧౧౦

తే॥ మనుజ పశువుల గెలుపొందు♦మాడ్కి యడుగ, లేదటంటి దిగ్దన్తుల♦లీల గెలుచు
నాఁడు కైలాసగిరి నెత్తు♦నాఁడు నేమి, వరము లొందితిఁ దెల్పంగ♦వలతు నిన్ను.

తే॥ ఇంచుకైన యోచింపక♦యిట్లు వ్యర్థ, వాక్కులాడితి గాక కో♦పంబు గొన్న
త్రిదశు లేమైరి తెలియవే? యిది యటుండ, నిమ్ము నీకంటె మానవు♦లెచ్చువారె?

తే॥ పలుకఁ దగిన వాక్పద్ధతి ♦ దెలియవీవు, జయము నొకసారియైన ని ♦ ర్జరులు గొనిరె?
నింగి నత్తంగ ధరణిఁ జీ ♦ ల్చంగ నేర్తు, నన్ను నరులు గెల్తు రనుట ♦ న్యాయమగునె?

తే॥ దేవవరములచే నైన ♦ తేజమందు, వేని హరి హరులను మున్ను ♦ దేన గెలిచి
నాఁడఁ దెల్పుము? పిఱికి త ♦ నంబు లేల? నన్ను నరులు గెల్తురని యె ♦ న్నంగఁ దగునె?

తే॥ నందిశాపంబు గలదని ♦ యందువేని? కలుగు శాపంబులకు లెక్క ♦ గలదె? యేమి
చేసె? నింద్రాదులీప్సము నా ♦ చెదుగు గోర, కుండ్రె? పిల్లి శాపంబుల ♦ కుట్లు తెగునె?

తే॥ కనకసభను నర్తించెడు ♦ కాలకంఠు, వలన వరము నొందుట మున్నె ♦ తెలియనైతిఁ
గానవాలి కోడితిని ని ♦ క్కంబె? యైనఁ, దక్కుకపులు గెల్తు రటంచుఁ ♦ దలఁచి తేమి?.

క॥ హరిహరులైనను వాలిని, దురమున నెదిరింప వారి ♦ దోర్బలము కపీ
శ్వరుఁ జేసు దాని నెఱిఁగిరె, నరుఁడు మఱుఁగునుండి కూల్చె ♦ నారాచమునన్.

చ॥ చిఱికిన చాపమున్ విఱిచి ♦ చేవ తొలంగి పగుల్లువాఱు సా
ల విటపవర్గముం దొలిచి ♦ లభ్యపదం బొక తాఁగయుక్తిఁ బో
వ విడిచి కానలం బడి యు ♦ పాయము పన్నఁగ నాలిఁ గోలు పో
యి వెతల డిందు మానవుని ♦ యీ వొకరుండవె మెత్తు విచ్చమై

తే॥ అనుచు నజ్ఞాని యని విభీ ♦ షణుని పలికి, లెండు దాడి సేయుదము రా ♦ రండటంచు
నుదుటు గొను నన్నఁగని యూర ♦ కుండలేక, వెండి నుడివె నీరీతి వి ♦ భీషణుండు.

శా॥ అన్నా! రాఘవుఁ డప్రమేయుఁడు జగ ♦ ద్వ్యాప్తుండు నిర్ద్వంద్వుఁ డా
పన్నానీకశరణ్యుఁ డర్థిజన క ♦ ల్పప్రాయుఁ డాద్యుండు భ
క్తి న్నాకేశులు కోరఁగా దనుజులన్ ♦ గీడ్పాటు సేయంగఁ బు
ట్టె న్నాపైఁ గరుణించి మానుమని ప ♦ ట్టెం బాదముల్ ఖిన్నుఁడై ౧౨౦

మ॥ దనుజేంద్రుండు వచించు నిట్టు లనుజా! దైత్యారి లోకేశ్వరుం
డనెదా మోఱకు నెన్నిసారులో రణ ♦ వ్యామోహినై తాఁక నో
డినవాఁడై యెట డాఁగెనో యెఱుఁగరాఁ ♦ డే! వాఁడు నిర్భీతుఁడై
మనుజాకారము దాల్చి వచ్చెనొకో? నన్ ♦ భ్రమందింపఁగా నియ్యెడన్?

మ॥ అమరేంద్రుం జెఱనుంచుచో దివముఁ గొ ♦ ల్లాడించుచో దిగ్గజేం
ద్రములం బట్టి రదంబులం బెఱుకుచో ♦ దైత్యద్విషుం దోలుచో
సమరంబందున శత్రులం దునుముచో ♦ సాధింపఁగాలేని బా
ల్యము నందుండెనో? యేమిగాఁ దలఁచెనో ♦ యం బేదయై? తెల్పుమా.

క॥ హరిహర విరించనులు సుర, వర నర నాగులు నడంగి ♦ వర్తింపఁగ నేఁ
దిరముగఁ ద్రిజగము శేలుట, నరుఁ డీతఁడు పుట్టకుంట ♦ నా? తెలుపఁగదే!

మ॥ బలవంతుండగు శౌరి వేయిశిరముల్ ♦ బాహాసహస్రంబు ని
య్యాలఁ గొల్చొందగు పాదముల్ గలుగు రూ ♦ పెన్నంగఁ బిన్నంచు ని

చ్చలు యోచించి నిశాచరావళికి భ ♦ క్ష్యప్రాయమై యున్న దు
ర్బలమా మానవ రూపముం గొనియెనే ?♦ పల్కాడవే తమ్ముఁడా ? ౧౨౪

మ॥ భవుఁడున్ విష్ణుఁడు సంగరాంగణమునన్ ♦ భ్రాంతాత్ములై పాఱుచో
నెవ్వలుం బూనిన నందిపై గరుడుపై ♦ నే వీఁపునం బూన్చు బా
ణ విశేషంబులు ప్రోదిసీ సమములై ♦ నాయొద్దనే యుండ మా
నవులా నన్ను జయించువారలు ? జగ ♦ న్మాన్యా ! భ్రమం బొందితే ?

తే॥ రావలదు నీవు మాతోడ ♦ రణముసేయ, లంక పెద్దది పెను విశా ♦ లంబు గలది
భయపడక యుండుమని పల్కి ♦ పరిజనములఁ, గాంచియొకసక్కెముగనవ్వెఁ ♦ గసలుతోడ

తే॥ అప్పుడా విభీషణుఁడు ద ♦ శాస్యుఁ గాంచి, పలికె పేకంబె నతిశయ ♦ బలము గలుగు
వారు బంధులతో వెన్ను ♦ వలన మున్ను, చెడిరి వినుము వారల కథ ♦ చెప్పువాఁడ.

—: హిరణ్యకశిపు వధ పటలము :—

చ॥ అకలుషమూర్తి బ్రహ్మ శ్రుతు ♦ లన్నియు నేర్పెఁ దవంబు మెచ్చి కో
రికల నొసంగె శంభుఁడు వి ♦ రించి రమేశుఁడు దొడ్డ భూత పం
చకము వహించియుండు గురు ♦ సత్త్వము లెల్లను దాల్చి యా హిర
ణ్యకశిపు దానవేంద్రుఁ డమ ♦ రాది విరోధుల గెల్చె బ్రేల్మిడిన్. ౧౨౮

చ॥ కమలజ శౌరి శంకరులు ♦ కాంచి భరించి నశింపఁజేయు నీ
కమలజ గోళ మొక్కటియె ♦ కాదు గణింపఁగరాని పెక్కు గో
ళములఁ గలట్టి ప్రాణు లవ ♦ లంబముగాఁ దననామమే సదా
విమల మనస్కులై తగ జ ♦ పింపఁగఁ బాలన సేసె బల్మిమై. ౧౨౯

తే॥ రెండు దిగ్గజములఁ గేల ♦ రెంటఁబట్టి, యీడ్చి చేరంగ విడుచు లోఁ ♦ తెన్నరాని
కడలు లేడింటి నొక యంజఁ ♦ గడచునట్లు, దాఁటిపోవుచునుండు నా ♦ దనుజ విభుఁడు.

ఉ॥ వండలి వెట్టుచుం బొరలి ♦ పాఱు తరంగిణులెల్లఁ జిన్నవం
చండకుఁబోఁడు మేఘముల ♦ యంబువు చల్లన గాదటంచు వా
డండు పయోధి యుప్పని క ♦ డంగి యజాండముఁ దాఁటుచేసి వే
ఱండములోని వారిధి ప ♦ యస్సు చొరం జలమాడు నందునన్. ౧౩౧

ఉ॥ నాగభువంబుఁ జేరి యట ♦ నాగ వరాంగుల తోడ నింపుమై
నోగిరమాని నాకమున ♦ నుండి దినంబును వుచ్చి రాత్రియం
దేగి విరించి లోకమున ♦ కిమ్ముగ నచ్చటఁ గొల్వుసేయు ను
ద్యోగి సమస్తలోక భయ ♦ దుండు నిశాచరరాజు నిత్యమున్. ౧౩౨

చ॥ ఇనుని రథంబునెక్కి యట ♦ నేత్తఱఁ ద్రిమ్మరుచుండు శీత భా
నుని చవికం గ్రహించుచు వి ♦ నోదముగాఁ బయనించు దిక్పతుల్

ముడుకొని సేయు కార్యములు ♦ పూర్తిగఁ దానె యొనర్చు మేరు భూ
మిని కొలువుండి బ్రహ్మవలె ♦ మేకొని పాలనసేయు వీఁడదె. ౧౩౩

తే॥ పంచభూతాధిదేవతా♦పదవులెల్లఁ, దాన కైకొని సకల భూ♦తముల కార్య
ములను మేఘుని పనుల ని♦మ్ముగ నొనర్చు, సర్వశక్తుఁడై యామినీ♦చర విభుండు.

క॥ కమలాక్షుని నామస్మర, ణము నిఖిల జగంబులందు ♦ నడపక తన నా
మమె జపియింపఁగఁ జేయుచు, నమరుల భాగము హవిస్సు♦నతఁడే కొనియెన్.

శా॥ ముమ్మాటికిన్ తమకార్యపాళి సతత ♦ మ్మొంజేయలే రన్నచో
నిమ్మిం దక్కిన వారి కార్యముల పూ ♦ ర్తిం జెప్పఁగానేల? యో
గమ్మున్ బూనిన మౌనులుం బదవులం ♦ గాసిల్లి కోల్పోయి ని
త్యమ్మున్ దానవ సార్వభౌము పదముల్ ♦ దక్కొండు పూజింపరున్.

మ॥ అమరుల్ నేరిచి పల్కుచుందురు దై ♦ త్యస్వామికిన్ మేలు! ని
త్యము వేదంబులు సర్వశాస్త్రములు నే ♦ యాద్యున్ జగద్వంద్యు త
త్త్వము వాక్రుచ్చెను నాహిరణ్యకశిపున్ ♦ దాత్పర్య మేపార స్తో
త్రములం జేయుచు మ్రొక్కుచుందుమని యు ♦ ద్యద్భక్తిమై నిచ్చలున్.

తే॥ త్రిదశు లసురులు క్షీరాంబు♦ధిని మథింపఁ, దెచ్చు మందరగిరి తన♦దీర్ఘ బాహు
వులను దాలిచి తనదగు ♦ బలముచూపఁ,దగిన దండము కాదని♦తలఁచి విడిచె.

క॥ రవి యుదయాస్తాచల గిరు, లవి చూడ హిరణ్యనేత్రు ♦ నన్నకు సొబగౌ
జెవి పోఁగులె యగు నాతని, జవ సత్త్వము లుగ్గడింప ♦ శక్యమె? యరయన్.

ఆ॥ అప్రమత్తుఁడైన♦యాహిరణ్యకశిపుఁ, డడుగు మోపెనేని ♦ యహి వడంకు
నిలుచునేని శిరము♦వంగిని దాఁకు భూ, తాలి వెంటఁ దవులు♦నంగ లిడిన. ౧౪౦

సీ॥ స్త్రీలచేఁ బురుషుల♦చే నపుంసకులచే, బృథివిఁ జరాచర ♦ వితతిచేత
దృశ్యవస్తువుల న ♦ దృశ్య వస్తువులచే, సురలచేఁ దక్కుఖే ♦ చరులచేత
నజ హరి హరులచే♦నగ్నిని గాలిని, పుడమిని చదల నం ♦ బువుల నింట
వెలుపలఁ బ్రాణంబు♦గలవాన లేని వా, నను రేలఁ బగలఁ జా♦వొనరకుండ

తే॥ వస్త్రశస్త్రాదులను వాని♦కటుట లేదు, మునుల తిట్టు లాదిక్కునఁ♦బోవలేవు
కమనఁ దాదెనఁ జాపులఁ♦జాఁప లేఁడు, వాని యనుజు గొనఁగఁ జాలు♦వార లెవరు?

తే॥ చావఁ డభిచారములకును♦జనకుఁ డేని, యొంటరిగ వచ్చి చంపిన♦నుసుఱువోదు
సకలలోకంబులందున♦సాటిలేని, మేటి ప్రభువయి యతఁడొక♦పాటినుండు. ౧౪౨

సీ॥ ఆ హేమకశిపున ♦ కరుదుగాఁ బుట్టిన, ధీరుఁడు జ్ఞానుల ♦ మేరువాన
శ్రుతులకంటెను శాస్త్ర♦మతులకంటెను నత్య, మూర్తికంటెను పరి♦శుద్ధ గుణుఁడు
సర్వేశ సంబంధ♦సంపూర్ణ విజ్ఞాని, శీలవ్రతములలో♦మేలుబంతి
భూతదయను తల్లి♦బోలిన సుగుణుండు, యుగముల దాఁటు నా♦యువు గలాఁడు

తే॥ జగములెల్లను పూజింపఁ♦దగినవాఁడు, లలిత మోహన మూర్తి ప్ర♦హ్లాదుఁడనెడు
తనయుఁ గని సంతసించి వి♦ద్యను గఱింప, మనుచు నొక దేశికుని యొద్ద♦నప్పగించె.
తే॥ అంధుపోలిక నున్నవాఁ♦డస్మదీయ, చరిత మాతనికిం జెప్పి♦చక్కఁజేసి
కన్ను దెఱపి తెమ్మని పంపఁ♦గరుణతోడ, నొజ్జగానిపోయి నేర్పంగ♦నుత్సహించి.
సీ॥ ఓం నమో దనుజ కు♦లోదధి చంద్రాయ, హేమ కశిపవే మ♦హేశ్వరాయ
యనుమన నతఁడు ర♦యంబునఁ జెవులను, మూసి మాపద్ధతి♦పాసఁగ నేను
వినఁగఁజాల ననుచు♦వేద శిరోర్థమౌ, నిత్యవస్తువు పేరు♦నియతి నుడివి
చేతంబు కరఁగ ని♦శ్చేష్టుఁడై రోమ హ, ర్షణ మొప్పఁ గనుల బా♦ష్పములు జాఱ
తే॥ నొడలు మఱచి నటింప నా♦బుదుతఁ గాంచి, చెనఁటి! నిను గాక నన్నను♦చెఱచె దేమి?
వేలుపులకును పలుకంగ♦వీలుకాని, పలుకు పలికితె యని వడ♦వడ వడంకె. ౧౮౭
సీ॥ తత్త్వ విజ్ఞాన ని ♦ ధానంబు ప్రహ్లాదుఁ, డిట్లను నన్ను నీ♦వేర్పుకొంటి
జనకు నీపేర్చితి ♦ నిను గడ తేర్చితి, నెల్లలోకముల నీ ♦ వేర్చునట్టి
నారాయణుని దివ్య♦నామంబు ప్రణవంబు, తోఁ జేర్చి పలుకుట♦దోసమగునె?
నాఁగ నీతంద్రి స♦నాతనులగు సుర, లకుఁ ద్రిమూర్తులకు నా♦యకుఁడనుమ్మ
తే॥ అతని శ్రీనామమును జపమర్థిఁ జలుపు, విప్రుఁడైన నాకం బెను♦విజ్ఞుఁడగుదె?
యొనర నీపేరు మఱిమఱి♦యుచ్చరించి, నన్ను చెఱుపకుమయ్య! నా♦యన్న కాన!
తే॥ అనుచు గురుఁడు వేడంగఁ బ్ర♦హ్లాదుఁ డనియె, సకలలోక నాయకు పేరు♦నన్ను తింతుఁ
గాక యొండెఱుంగను నేర్వఁ♦గా నొకండు, లేదు నిక్కచ్చి పఱచిన♦లేదు ఫలము.
చ॥ శ్రుతులకు నెల్లఁగాఁ దెలియు ♦ శుద్ధ పరాత్పరుఁ డెల్లవేళ సం
గతమతి నాయెదన్నెలవు ♦ గాఁ గొని పాయకనిల్చె వేఱు సం
స్తుతమగు వాక్యముం గలదె? సూనృతముల్ సుకృతంబు సుస్థిర
స్థితిగల శ్రోత్ర వాక్యములఁ ♦ దెల్పుము నేరిచికొందు భక్తిమై. ౧౮౮
తే॥ శిష్టు లేదైవమును విమ♦ర్శించి పలుకు, వార లుపనిషత్తులు దెల్పు♦వస్తువేది?
కర్మ ఫలములు నశియింప♦ఘనులు వేని, నామమును జపియింతు రా♦నందముననుఁ?
ఉ॥ వేదము లభ్యసించి క్రతు♦బృందము లెన్నియొ యాచరించి సం
పాదిత తత్త్వ విజ్ఞతను ♦ వాంఛిత సిద్ధి భజించినట్టి వి
ద్యా దయితుల్ జపించు జగ♦దాశ్రయు నామము పల్కనాఁడ నీ
వాదట నేర్చినట్టి శ్రుతు♦లందున వేఱొక వస్తువున్నదే? ౧౯౦
చ॥ వనబిల పర్వతంబులను ♦ వాసముచేసి మృగాజినంబులన్
గొని ధరియించి యాకులను ♦ కోరికతో భుజియించి శీర్షముం
డన మొనరించి పెక్కులు జ♦డల్ ధరియించి శ్రమంబులోర్చి కై
కొను ఘనులొందు భాగ్యమును♦కొంటిని వేఱొక టున్నె కోరఁగన్?

తే॥ భక్తులకు సేవసేయు పా♦వనులు శాస్త్రవిషయ మెఱుఁగక యున్నను♦వేదసార
మైన యర్థద్వయంబు మే♦లరసియుంద్రు, వారె కవులు తత్త్వార్థ వి♦ద్వరులునిజము.
తే॥ అవనిసుర! నాకు బ్రహ్మాదిరుద్రాదిసురలకు, నరయరాని యేకైక నా♦యకుఁడు నన్ను
చేరఁ గామిత సంసిద్ధిఁ♦జెందినాఁడ, నీవు నతని భజింపు మే♦లెనయఁగలవు.
చ॥ అనవిని విప్రుఁడేది బదు♦లాడఁగ లేక యెదం గలంగి నా
కును చెడు కాల మబ్బె నిఁకఁ♦గుఱ్ఱఁడు బాగుపడంచు తామసిం
చినఁ జెడునంచుఁ బాఱి విభుఁ ♦ జేరి యనెన్ ; సమయోచితంపు వ
ర్తనము మహీసురావళుల ♦ దగ్గఱకంపెను గల్గునే భువిన్ ? ౧౫౪
తే॥ ప్రభువరా! నీ సుతుండు క♦ర్మద్వయంబుఁ, గ్రెంచు పలుకులు నాకు బో♦ధింపసాగె
నింపుకై నను వినఁడు కాం♦క్షించు బోధ, వేఱుమార్గంబు లేదని♦విన్నవింప. ౧౫౫
తే॥ మనకుఁ దగనిది శ్రోత్రది♦తన తెలివికిఁ, దోఁచినట్టిది బాలుఁ డే♦తోయమునను
పలికెఁ దెలుపు మాయనవిప్ర♦వరుఁడువడఁకి, కేలు మోడ్చియిట్లని యెఱం♦కెనయలంప.
తే॥ దానవేంద్ర! నాశ్రవణరం♦ధములయందు, క్రూరవిష సర్పములఁబో లెఁ♦దూఱినట్టి
వాక్యములఁ దెల్పి నరకంబు♦పడయఁజాల, నాలుకయు మొట్టమొదటికే♦ప్రీలునని యె.
తే॥ వానిఁ దోడితెండని రాజ♦భటులఁ బంప, వారు చని తోడితేరఁగా♦భక్తవరుల
జవకుఁ డగు విష్ణునామంబు♦సంస్మరించి, యొడలు మఱచు కొడుకు తండ్రి♦కడకువచ్చి
ఉ॥ మ్రొక్కిన నూను మూర్ధమును ♦ మూర్కొని మేని కలాపమంటఁగా
నక్కునఁ జిక్కఁ జేర్చి యొడి ♦ యందునఁ బ్రేముడి నుంచుకొంచు నీ
వెక్కడ నేర్చితో విన న ♦ హింపని వాక్కుల నాడెతంచు నే
నక్కజమంద నీ గురు కు ♦ లాఢ్యుఁడు పల్కె నదేదో తెల్పుమా?.
తే॥ అనుడుఁ దనయుఁడిట్లను శ్రుతు♦లభ్యసించు, నెడలఁ దొలుత వచించు లో♦కేశు పేరు
జన్మదుఃఖముల్ దొలఁగింపఁ♦జాలుపేరు, పలికినాఁడ నంతకు మేలు♦గలదె? యరయ.
తే॥ అవఁగఁ దండ్రియిట్లను, గురుఁ♦డరసి యుక్త, మే వచించు నట్లుండనీ♦యీవు పలుకు
పేరదెయ్యది తెల్పుము♦వినఁగవలతు, ననుడుఁ గొడుకు ప్రియంబున♦ననియెనిట్లు.
సీ॥ వలచిన పురుషార్థ♦ముల నిచ్చును త్రివర్గ, మును దాఁటఁ దోడ్పడి♦ముక్తి నొసఁగు
వత్సయం బాద్యంబు♦నజ హరాదులకు న, దా చింతనీయం బు♦దారతమము
మర్త్యలోకము దాఁక♦సకలలోకంబుల, స్థావర జంగమ♦సమితియందు
వెండంబునం గల్గు♦ తెలివిచే ధ్యానింప, నలవియైయుండు న♦ష్టాక్షరముల
తే॥ మహిమ వివరింప నరిదియా♦మఱచు వారు, నిజము జీవచ్ఛవములు వి♦న్నింతుఁబూత
నామ మోంకార నారా రాయ♦ణా యయనుగును, అనవృశంబైన మంత్రమి♦య్యదియె తండ్రి!
మ॥ భవ వారాశిని పూర్వ కర్మమను నా ♦ వర్తంబు నందుండి జం
తువులుం దీరము చేర్చు నావ జగి దొం ♦ తుల్ గూర్చు మైమర్వ న

ద్భవికంబుల్ పొసఁగించు నామము మునిం ♦ ద్ర స్తుత్యమున్ వేద శీ
ర్ష వధూ మస్తక రత్న మీ విమల మం ♦ త్రం బన్య దుస్సాధమున్.

శా॥ నీకు న్నాకు నమస్త జీవులకు గ్లా ♦ ని న్మార్చి భవ్యంబు ల
స్తోక ప్రాభవ మొప్ప నిచ్చునదియం♦చున్ విజ్ఞులే పల్కు వా
రేకీభావముతోడ నంచుఁ దనయుం ♦ డిమ్మాడ్కి భాషింప రా
ద్రాకారుండయి చూచి దానవకులా ♦ ధ్యక్షుండు దట్టించుచున్. ౧౬౩

శా॥ ఓరీ మోఱకు! నేఁటిదాఁక నొకఁడే ♦ నొక్కప్డు నా ముంగలన్
ధీరత్వంబునఁ బల్కలేఁడు పలుకన్ ♦ దీండ్రించి నాయాజ్ఞ దు
ర్వార ప్రక్రియఁ గాల్చినైచుఁగడ యె ♦ వ్వారిట్లు బోధించి రె
చ్చో రూఢంబుగ నేర్చితో తెలుపుమా ♦ శుంఠా! వడి న్నిక్కమున్.

కం॥ అజహర ముని దివిజాధిపు, లజస్రము మదీయ నామ♦మర్థి జపింత్రా
రజమున వారలుఁ దెలుపరు, నిజముగఁ జాఁదలఁచి యొవఁడు♦నేర్పెఁ దెలుపుమా?.

కం॥ కదనము సేయఁగఁ బలుమా, ఱెదిరించియు విఱిగి గరుడు♦నెక్కి యుదధి నె
ల్లిదముగఁ జేరి యివల రా, కొదిఁగిన యాపంద నామ♦మొసఁగునె మేల్మిన్?

మ॥ మన వంశంబున వారలెందఱో మహా ♦ మాయావియౌ విష్ణు వం
చనచేఁ గూలిరి నాదు తమ్ముని జగ ♦ జ్జాలంబులం గర్భమం
దునఁ దాల్పం దగువానిఁ బోత్రియయి యా ♦ దుష్టుండె చంపెన్ ధరి
త్రిని సర్వంబును మూషికం బలరు భ ♦ క్తిం గొల్వ మేలౌనొకో? ౧౬౬

చ॥ సకల చరాచరంబులకుఁ ♦ జావును పుట్టువు గూర్చువాఁడ నే
నొకరుఁడ నెందులేఁడు మఱి ♦ యొక్కఁడు కార్యముచేతఁగాక తోఁ
చికల నెఱుంగు టెక్కడి వి ♦ వేకము? నేర్పిన వాఁడెవండు? వా
నికి మఱి నీకు జీవితము ♦ నిక్కము డాసె నిఁకేల చెప్పఁగన్?. ౧౬౭

చ॥ శ్రుతిహిత కార్యముల్ సలుపు ♦ శూరులు మేల్పడుచుందువారు; దు
ర్గతులకుఁ బోవుచుంద్రు చెడు ♦ కార్యములే యొనరించువారు; ని
శ్చితము జగత్స్వభావమునఁ ♦ జెడ్డది మంచిది రాజు నాజ్ఞచే
గతులు వహించు నాది తుది ♦ గల్గదు లోకమునందు దేనికిన్. ౧౬౮

ఉ॥ గొప్ప తపంబుచే నమర ♦ కోటి త్రిమూర్తులు మేల్మినొంద నే
నొప్పుగ వారికంటెఁ దప ♦ ముత్కటరీతిగఁ జేసి మించఁగా
నిప్పుడు తాము మేల్పదవు ♦ లెల్లను ముందటఁ గోలుపోయి నా
రప్పటినుండి వారి పను ♦ లన్నియు మానిరి చుల్కనౌటచే. ౧౬౯

ఉ॥ జన్నములుం దపంబులును ♦ శత్రుల కక్షయ సౌఖ్యదంబులౌ
ట న్నెఱినెంచి వానిని క ♦ డంక నొనర్పఁగనీక మాన్చితిన్

బన్నుగ వారలిప్పుడు త ♦ పంబు మఖంబులు లేమి సత్త్వసం
పన్నత డిందె దిక్కఱిరి ♦ పాయక నిన్నిటు కావనేర్తురో! ౧౨౦

తే॥ క్రించ! సీతప్ప నిప్పుడు మ♦న్నించినాఁడ, వ్యర్థవాక్కుల నింకిటు♦లాడఁబోకు
గురులవాక్కులు శ్రేయంబు♦గూర్చుననుచు, నమ్మిమతియింపుమనె హిర♦ణ్యకశిపుండు

తే॥ చదువులకునెల్లఁ జేమిరి♦చందమగుచుఁ, గ్రతువులకు శ్రుతులకుఁగట్ట♦కడపటిదగు
నెఱి యొకండు దెల్పెదను మ♦న్నించి యరయు, మనుచుఁ దెలుపంగఁదొడఁగెఁ
బ్ర ♦ హ్లాదుఁడిట్లు.

తే॥ విత్తులేక వృక్షము పుట్టి♦వెలయఁబోదు, భ్రాంతి గొలుపు నజ్ఞానంబు♦వదలి సత్య
మెఱుఁగఁ దలఁచినఁ దెల్పెద♦హెచ్చరికను, తెలియుమా దీనిఁగరతలా♦మలకముగను.

మ॥ తనలోనుండి సమస్తలోకముల న ♦ ద్యల్లీల సృష్టించి యం
దున వెవ్వేఱుగఁ బెక్కురూపముల జం ♦ తుశ్రేణినై వానిలో
నన నైలంబును నువ్వులంబలెనె యు ♦ న్నాఁడైన భేదంబులం
గొనఁ డా యాద్యుని తొంటియున్కి తరమే ♦ గుర్తించి వాక్రువ్వఁగన్?

తే॥ వస్తుతత్త్వంబు విభజించి♦పలుకు సాంఖ్య, యోగములు రెండు త్రోవలా♦యునికి
పూర్తి
గా నెఱింగిన వారికిఁ♦గాక యాది, పురుషు నచ్చస్థితి నెఱుంగఁ♦దరమె? తండ్రి!

సీ॥ వేదాంతశాస్త్రముల్♦విజ్ఞానమయుఁడని, తనరఁ దెల్పెడు పర♦తత్త్వ మతఁడు
తమ్ము దా మెఱిఁగిన♦తద్జ్ఞు లీయర్థంబు, నెఱుఁగుదు రజ్ఞాను♦లెఱుఁగలేరు
తెలియనివారు ము♦క్తిని గాంచలేరు ప్ర, త్యక్షాది సుప్రమా♦ణాదులఁ గొని
కొలువంగరాని యా♦కూటస్థుఁడగువాని, మాయ నెఱుంగ నె♦వ్వాఁడు గాదు
తే॥ త్రిగుణరూపుండు త్రిజగదా♦కృతి చరాచ, రాది రూపుఁ డేకాకృతి♦నందియుండి
భిన్నరీతులఁ దోఁచు న♦వ్విభుఁ డనుగ్ర, హించు కర్మముల్ చులుకన♦నెఱుఁగనగునె?

క॥ క్రియలును ఫలములు ఫలదా, తయుఁ గర్తయు భోక్తయైన♦తత్త్వంబును ని
శ్చయముగ నెఱిఁగిన చతురులె, నియతిన్ భవ జలధి దాఁట♦నేర్తురు తండ్రీ!

క॥ తపములు మంత్రములు జపము, తపఃఫలము కుదువు నగుచు♦ద్రష్టయు దృగ్దృ
శ్య పరిజ్ఞానంబులు నగు, నవరుని మాయాబలంబు♦నగునే తెలియన్? ౧౨౮

మ॥ తొలి కర్మంబులకున్ ఫలానుభవముల్♦తోత్తం బ్రసాదించు న
వ్వలి కర్మంబులకున్ ఫలంబు నవలన్ ♦ బ్రాపింపఁగా జేయుఁ ద
త్ఫలముల్ ముందులు వెన్కలై వెడ తడం♦బాటొందుటల్ తప్పియుం
బొలఁగం బాఱుట లేదు చిత్రముగ నొం ♦ దుం గర్మ సంబంధముల్.

తే॥ పాప పుణ్య కర్మంబుల♦ఫలములెల్లఁ, బరిమితంబులు పరమేశు♦భక్తితోడఁ
దలఁచు ఫలములు కొంతలే♦కలరుచుండు, నింతకంటెను మేలేది♦యెఱుఁగఁ గలదు?

ఆ॥ యాగములను తుదిని•యోగేశ్వరునకొక్క, వేల్మి వేల్చుచుండ్రు•విజ్ఞులెల్ల
నది చరాచరంబు•లందు చేరుననుచు, శ్రుతులు దెలుపు ఫలము•నూటి యదియ.

సీ॥ ఆ పరబ్రహ్మమే•యానంద లీలకై, మూల ప్రకృతినుండి•మొట్టమొదటఁ
గార్య రూపంబైన•చర్యా ప్రపంచంబు, సృష్టి గావించె వి•చిత్రరీతి
శాస్త్రంబులందు చ•ర్చా ప్రసంగంబులౌ, సర్థంబులన్నియు•నాద్యమైన
ప్రకృతియొనంగిన•వికృతులచేనైన, భేదంబులే కాని•వేఱుకావు

తే॥ బ్రహ్మ మొదలగు నీ జీవ•రాసులెల్ల, బంధురంబైన తన్నాభి•పంకజమున
నతిశయంబైన బీజంబు•నందయొక్క, భాగముననుండఁ బూర్తియా•బ్రహ్మకనెనె!

చ॥ అసదృశుఁ డప్రమేయుఁ డజుఁ • డాద్యుఁడు మేరయె లేనివాఁడు ని
ర్వ్యసనుఁడు కన్నులం గలఁడు • పక్వీన చూపులనుండు విజ్ఞ మా
ససముల నిండియుండు గగ•నంబున భూమిని సర్వభూత హృ
ద్వసతులలోన బాహ్యమున • భాసిలు సర్వ జగత్ప్రపూర్ణుఁడై. ౧౫౩

క॥ తలఁపునఁ బలుకులఁ జేఁతల, గలఁ డింద్రియములను గలఁడు•గలఁ డోంకారో
చ్చలిత స్వర సంధులలోఁ, గలఁడు త్రికాలములఁ గలఁడు • కలఁ డసురేంద్రా!

క॥ అరిషడ్వర్గము భక్తుల, దరిఁజేరఁగనీక కాచి•దరిఁజేర్చెడు స
త్కరుణానిధి నామమె త, త్పరులకు భవ జలధి దాఁటఁ•దరణి మహాత్మా! ౧౫౫

క॥ వటబీజ న్యాయంబున, విటతాటములేని మహిమ•వెలసిన హరి యు
త్కటకాలము స్థానమ్మును, పటు సాధన శీలములును•ఫలమును తండ్రీ! ౧౫౬

క॥ వీణెయ సుస్వరముం బలె, నాణెయమగు శీల మదరు•నారాయణు వి
న్నాణంపు మహిమ సర్వాం, గీణంబగు నంటకుండఁ•గించిత్తైనన్. ౧౫౭

సీ॥ ఏకాక్షరంబయి•యెసఁగు నోంకారంబు, నందాద్యకారమై•ప్రాణమైన
యక్షరార్థంబగు•నాదిదేవుఁడు జ్ఞాన, మునకు జ్ఞానంబుగా•నొనరువాఁడు
నిఖిల లోకములందు•నిండారియుంటచేఁ, బొగయు నిప్పునుపోలె•నెగడువాఁడు
నవ్యమాలా సుమ•నస్సులఁ బోలిన, వివిధ మతములందు•వివిధగతులఁ

తే॥ దరిచి వాదించువారలు•తనరుకతనఁ, గలుగు పలుభేదములు గాక•గలదె యతని
కిన్ని భేదంబు లింతేల•యెంచిచూడ, కడలి కలలకు భిన్నత•గలదె? తండ్రి!

తే॥ ఇట్టి యసమాన విభవు నీ•వెల్లిదంబు, చేసి సంపదాయువులను•క్షీణపఱచి
కొందువే యని చింతింతుఁ•గొదవలేక, వినుతి చేసి ధన్యుఁడనై తి•ననివచింప.

—: తండ్రి ప్రహ్లాదు వివిధోపాయముల శిక్షించుట :—

మ॥ విని వైతేయ కులేంద్రుఁ డుగ్రుఁడయి ని • ర్భీతిన్ వినాదించు పు
త్రుని ధాత్రీస్థలి ద్రొబ్బి నేత్రముల ఖ•ద్యోతంబు లుగ్గంగఁ జూ

చిన భూగోళము కంపిలెఁ గ్రహములుం ♦ జీకాకులయ్యెఁ గిరుల్
వణఁకెఁ నవ్వాడి లేకయుండె సభయుం ♦ బంకించె బ్రహ్మాండముల్.

ఉ॥ ఇంతకు మించి నాకుఁ బగ ♦ యేదియులేదు శరీరమందె దు
ర్దాంత రుజా ప్రరోహము వి ♦ ధంబునఁ బుట్టె నెఱుంగ నేల యీ
భ్రాంతుని చిత్తవృత్తి? హరి ♦ భక్తుఁడనంచు వచించువాఁడు ని
శ్చింతముగాఁ దెగం బొడిచి ♦ చీల్పుఁడు త్రుంపుడు చంపుఁ డుద్ధతిన్.

చ॥ అని దనుజేంద్రుఁ డాడ వ్రాద ♦ యంబున నక్కటికంబు సుంతయుం
జెనయని రక్కసుల్ ప్రభుని ♦ చిన్నికుమారు మృగేంద్రు లేన్గు గు
న్నను గొనిపోవు లీల జత ♦ నంబున వాకిటి కీడ్చి తెచ్చి యె
క్కనువున వాఁడి కత్తులు గ ♦ దావళి వీచిరి హిచ్ఛలించుచున్. ౧౯౩

తే॥ పదయుఁ బ్రహ్లాదు నదయులు ♦ నరగఁజుట్టి, వైచు కైదువుల్ జగదీశ ♦ భక్తవరుని
శాత్రవులు తిట్టు తిట్టులు ♦ చందమగుచు, నిష్ఫలంబు లయ్యెను రజ ♦ నీచ రేంద్ర!.

ఉ॥ కాలిచి వైచి క్రుమ్మి కడి ♦ కండలుగాఁ దెగనేసి రెండుగాఁ
జీలిచి త్రోచు కైదువులు ♦ చేడ్పడి ఛేదిలి నుగ్గునూచమై
బాలునిమేనిపై మరద ♦ పాపిన కోపున నొప్పె నాతఁడున్
దీలక సోలిపోక హరి ♦ దివ్య పదంబుల నిల్పె నాత్మలో. ౧౯౪

ఉ॥ అంతట దానవుల్ చని ను ♦ రారికి నంతయు విన్నవించి యా
వంతయు నొవ్వఁ డాయుధము ♦ లన్నియుఁ జూర్ణములయ్యె నన్న బ
ల్వింతగ నాలకించి పడ ♦ వేయుఁడు నిప్పులగుంటలో నన
గంతులు వైచుచుం జనిరి ♦ కట్టెఁడి దైత్యులు సంతసంబునన్. ౧౯౫

తే॥ పెద్దగుంటలోఁ గట్టెలు ♦ పేర్చి చమురు, పోసి నిప్పు రగిల్చి యా ♦ బుడుత డాసి
పట్టి త్రోసిరా మంట శ్రీ ♦ వరుని కరుణఁ, జందనము చందమునఁ జాలఁ ♦ జల్లనయ్యె.

ఉ॥ సోఁకులు తైల వస్త్రములు ♦ చుట్టి రగుల్చ మరుత్తనూజు పెం
డోఁకకు మైథిలేంద్ర సుత ♦ దుర్దమ తీక్ష్ణ సతీత్వ వహ్నిచే
నాఁకయి వేఁడి చల్లనయి ♦ నట్టులు రక్కసి మూఁక రాల్చు నా
భీకర వహ్ని బాలునకుఁ ♦ జేవ మంచును పోలె నయ్యెడన్. ౧౯౬

ఆ॥ అవల వార లేగి ♦ యసురేంద్రునకుఁ దెల్పఁ, మండిపడుచు జగము ♦ మాడ్చు విసము
గలుగు నహులఁ దెచ్చి ♦ కఱపింపుఁడని యాజ్ఞ, యిడఁగ దనుజ భటులు ♦ వడిగఁ జనిరి

తే॥ అష్టనాగంబు లసురేంద్రు ♦ నాజ్ఞవచ్చి, విసము లుమియుచు హరిభక్తు ♦ వీరు మేనఁ
గోలలాడంగఁ గఱచెఁ గు ♦ మార వరుఁడు, మదిని వెన్నుని సన్నుతి ♦ మానఁడయ్యె.

ఉ॥ కక్కలు మన్ను వారలు వ ♦ డంకుచు నెత్తురు గ్రక్క సాంద్రమై
క్రమ్మిగిన పేరదంబులను ♦ క్రొన్నెల చొచ్చినలీల మేనిలో

నిగ్గడి కోఱలూనికను♦నీఁగి పదింబది తుండులై ధరన్
వ్రగ్గెను వానిలో విసము ♦ మా యమృతంబు స్రవించె వింతగన్. ౨౦౦

తే॥ దనుజు లావింత తమ ప్రభు♦వునకుఁ దెలుప, రాక్షసేంద్రుండు కనలి యై♦రావతంబుఁ
దెచ్చి త్రొక్కింపుఁ డన వారు♦త్రిదశరాజు, నడుగ నాతండు భయమున నట్టి♦
యొనఁగె.

తే॥ కాలు సేతుల బొమ్మనఁ గంతమందు, నిడియఁ బాశంబులం గట్టి♦యేన్గు నెదుట
దొరలఁ జేయఁ బ్రహ్లాదుండు♦దొడ్డబుద్ధి, నిట్లు వాక్రుచ్చెఁ జౌదంతి♦నెనఁగఁ గాంచి.

క॥ భుజగకులాధిపశయనుఁడు, భుజగారిధ్వజుఁడు భుజగ♦భూషనుతుఁడు మా
గజరాజుఁ గాచినాతఁడు, త్రిజగద్వంద్యుండు నామ♦దిం గలఁ డన్నన్ ౨౦౩

క॥ దంతి తలవ్రాల్చి యాగుణ, వంతునకున్ మ్రొక్కి మరలె♦బ్రభు భటు లావృ
త్తాంతముఁ దెలుపఁగ మండుచు, నంతకువలెఁ గనలి దాని♦నడుపుం డనియెన్.

క॥ రక్కసులు చంప డాయుడు, నక్కరి ప్రహ్లాదు నురము♦నంటఁగఁ బొడిచెన్
మిక్కిలి యనంటి బోదెల, ముక్కలవలె విఱిగె మేన ♦ ముట్టిన దంష్ట్రల్.

క॥ దనుజులు వడివడిఁ జని జరి, గిన వార్త్తం దెలుప వేసఁ♦గిని మండెడు నూ
ర్యుని పోలె మండి జనకుఁడు, తనయుని వనరాశిఁ ద్రోవ♦దైత్యులఁ బంపెన్.

ఉ॥ ఈ దనుజేంద్రుఁ డెట్లయిన ♦ నీతని చంపక మానఁడంచుఁ బ్ర
హ్లాదుని పట్టి యొండొక య ♦ హార్యముతో జతగట్టి యగ్గభీ
రోదధి మధ్యమందు నుగు♦ణోత్తరుఁ ద్రోచిరి భక్తవర్యుఁ డా
శ్రీదుని పాదపద్మములఁ♦జింతన సేయుచు నుండె నిచ్చలున్. ౨౦౭

క॥ జడధి యొక మడువువలె నే, ర్పడ గిరి కలహగుచుఁ దుంబి♦ఫలముపగిది నా
బుడుతను తేల్పఁగ నాతఁడు, కడలిని వటపత్త్రశాయి♦ కరణిని వెలసెన్.

మ॥ కరుణావారిధి! యప్రమేయ మహిమా♦ గంభీర! లోకేశ్వరా!
దురహంకారినొ? దుష్ట మానసుఁడనో? దుర్వంశ జాతుండనో?
యరయం జాలవొ? భారమో? తగఁ బరీ♦క్షార్హుండనో? మాధవా!
వరదా! దీనశరణ్య! యన్య మెఱుఁగన్♦భక్తావనా? ప్రోవవే. ౨౦౯

క॥ వంచకుల వంచకుండవు, చంచలమతినైన నన్ను ♦ సంశోధింపన్
బ్రాంచ త్పద్ధతి యగునే, పంచముఖాదులకు నెఱుఁగఁ ♦ బడవు మహేశా!

మ॥ పరమేశున్నిను పొందఁగాఁ దగు మహో ♦ పాయంబె విజ్ఞాన మం
చరయం గల్గిన తత్త్వవేత్తలును ని ♦ న్నందంగ లేకుండి బ
మ్మెరకున్ లోఁగిరి నేనొ పాపిని మదా ♦ త్మీయుండ దైతేయుఁడన్
శరణం బంటిని దీనవత్సలత నీ ♦ స్వామ్యమ్యో మన్నింపవే! ౨౧౧

కం॥ స్థిరుఁడను నే నితరము ల, స్థిరము లహం బ్రహ్మమని వ♦చింతురు పలుకం
జొరవయగుఁ గాని పలికిన, కరణి జరగునే ప్రపంచ ♦ కర్మము లెల్లన్ ? ౨౧౨

మ॥ జగదాద్యంబగు వస్తు వున్నదనుచుం ♦ జర్చింప లేదంచు రెం
డగు రీతుల్ వచియింపఁ దుర్ శ్రుతులు భి ♦ న్నార్థంబులై యొప్పు భూ
రి గుహాంతస్థము ధర్మ తత్త్వ మది గు♦ర్తింపంగ దుస్సాధ మి
ట్లగునే నీకు నిగూఢ పద్ధతిని మా ♦ యా నాటకం బాడఁగన్ ? ౨౧౩

మ॥ తెలియన్నేరని నన్ను బోఁటులు విధా ♦ తృండంచు రుద్రుండుగాఁ
బలుకం జెల్లునె ? కాయలాకులు పువుల్ ♦ పండ్లుం గొమల్ బీజమం
దలి వైనట్టులు సర్వ దేవతలు నీ ♦ తత్త్వంబునం దోఁచు వా
రలు నీ వాదిమ బీజమై వెలయు దీ ♦ రాద్ధాంతమే నిక్కమా ౨౧౪

కం॥ వెలువడి నీనుండి జగము, పలుభేదము లొందినంతఁ ♦ బరఁగునె వేఱై ?
పలు భూషలు పలు పేరులు, గలవైనను కనకమగును ♦ గాకేమి యగున్ ?

కం॥ తలిదండ్రులక్రియఁ బ్రేమను, కలిగించితి వీవు వెలయఁ ♦ గల హృదయంబే
కలవాఁడను భవ దుఃఖం, బుల నొసఁగిన నీవ తీర్పఁ ♦ బోలుదు తండ్రీ !

కం॥ అని వినుతించుచు నుండిన, తనయుని స్థితి యొఱిఁగి దనుజ ♦ దయితుఁడు వానిం
గొని తెమ్మని హాలాహల, మును బోలిన విషము నొసఁగె♦మున్నగఁ ద్రావన్.

కం॥ విషధర శయనుని భక్తుఁడు, విషముం గొని త్రావె భవుని♦విధమున నది ని
ర్విషమై సుధ యయ్యెను ని, ర్విషయునకున్ విషము ఫలము♦వృథ గాకున్నే ?

కం॥ దిక్కులు గదల మోఁదఁగ, నుక్కఱఁడును కందికుందఁ♦డుల్లంబునఁ దా
నొక్కొక మకుంద నామము, చెక్కు చెదరకుండ నిలిచి♦చింతన చేయున్. ౨౧౯

ఆ॥ సాటిలేని మాయఁ♦జావకుండెడు నహా, యమ్మ నైజముగనె♦యమరినాఁడు
వీని నేన చంపి♦విశ్వంబులో నప, ఖ్యాతిఁ దొలతునంచు♦నతని డాసి. ౨౨౦

మ॥ అమరేంద్రుం డదలింపఁ దండ్రికి నుతుం♦డత్యార్థిమై మ్రొక్కి నా
యనువుల్ నీయవికావె ? యైనను జగ♦ద్వ్యాప్తుండు నారాయణుం
డెవకంబారఁ దలంచినన్ జరగు గా ♦ కెట్లున్ని చందాల నీ
రవచేఁ బూనిన నానకో భువన సం ♦ త్రాణుండు తా నుండఁగన్ ?

శా॥ చూపం జూడఁ దలంపుఁగొన్న దనుజే ♦ శుం డంత మూఢాత్మకా !
నాపేరే జపియించుచుం బ్రదుకుచు ♦ న్నారైన ముమ్మూర్తులో ?
ప్రోవుం గొల్పడినట్టి వేలుపులొ ? యా ♦ భోగీంద్రుఁడో ? మానులో ?
తాపాటిం గలవారొ ? తెల్పు జగముల్ ♦ సృష్టించు నానేర్పరుల్ ?

సీ॥ అవిధ తండ్రికిఁ బుత్త్రుఁ♦డను లోకములనెల్ల, సృష్టించినాఁడు లె♦క్కిడఁగరాని
ప్రాణులఁ గల్పించి♦వాని యన్నిటిలోనఁ, బూవులఁ దావి మా♦పులను మాన

పోఁడిమి నిండి యు♦న్నాఁడు మానాయకుఁ, డతఁడు నాకనులకు♦నరయఁదగిన
కరణి నెల్లెడలను♦కానవచ్చెడువాఁడు, చూడుమా చూచెదు♦చొప్పుదెలుప
తే॥ నమ్మకున్నావు నిజము నీ♦తమ్ముఁడాఁడు, జీవములఁ గొన్న యాహారి♦నీవుచూడ
దగినయంత చుల్కనయయి♦తనరువాఁడె?, సర్వజీవాంతరాత్మయా♦సత్యమూర్తి.

ఉ॥ మూఁడు గుణంబు లాతనివె♦మూఁడు పనుల్ మఱి మూఁడు మూర్తులున్
మూఁడగు నేత్రముల్ స్థితులు♦మూఁడును మూఁడు జగాలు వానివే
మూఁడగు కాలముల్ దెలియు♦ముఖ్యుఁ డతండె సమస్తసాక్షియా
ప్రోడ యతండె సత్యమిది♦ముమ్మఱు సత్య మనంగ నాతఁడున్. ౨౨౪

మ॥ వినరా మూర్ఖ! సమస్త లోకముల వె♦వ్వైతైన వస్తు వ్రజం
బున నొక్కండె కలం డటంచు మిగులన్♦మూర్ఖించుచున్నావు నీ
వను మాటల్ నిజమైన దొంగయగు నా♦యబ్జాక్షు నీ కంబ మం
దునఁ జూపింపుము పిమ్మటన్ దగిన యు♦ద్యోగంబు గావింతమున్.

సీ॥ అనుడు జగన్నాథుఁ♦డణువున నున్నవాఁ, డణు శతాంశంబున♦నణఁగినాఁడు
మేరువం దున్నాఁడు♦మింట నున్నాఁడు నీ, వాక్కునఁ గలఁడు స్తం♦భమునఁ గలఁడు
చూడంగ వలతేని♦చూచెదుగాకని, ప్రహ్లాదుఁ డనఁగఁ గ్ర♦వ్యాదనాథుఁ
డో! రి! నీయనుకూలు♦నొప్పుగ నీ స్తంభ, మందు చూపుము చూప♦కుందువేని
తే॥ కరి శిరంబును హరి చీల్చు♦కరణి మెఱసి, నిన్ను నీఖడ్గమునఁ♦ జీల్చి నెత్తురాని
ద్రింగి వైచెదనని పెను♦మేఘమట్లు, గర్జనము చేసెఁ దర్జన♦భర్జనముల. ౨౨౬

మ॥ జనకా! నాయనుఁ డింత చుల్కనగునే? సర్వేశ్వరుం డీవు కో
రిన యాతావులనెల్లఁ గానఁబడఁ గా♦ర్వైరంబునం దాఁగి యుం
డెనయేనిన్ బ్రదుకంగనొల్లఁ దనువు♦న్నేనే విసర్జించెదన్
దన దాసుండను కానటంచుఁ దుదిఁ బం♦తం బాడెఁ బ్రహ్లాదుఁడున్.

—: నృసింహమూర్త్యావిర్భావము :—

తే॥ అసురనాథుండు మేలు మే♦లనుచు నవ్వి, హస్తమున నొక్కకంబంబు♦నంటఁజఱచెఁ
బెలుచ దిక్కులు గోళముల్♦బీఁటలెగయ, సింహగర్జన మందుండి♦చెలఁగెనపుడు.

మ॥ అరవిందాసన శంకరాదులును ది♦వ్యాబ్దంబు లెన్నేనియున్
స్థిరభక్తిం దపమాచరించియును వీ♦క్షింపంగ లేనట్టి శ్రీ
హరి నవ్వున్ విని యుబ్బి గంతులిడి ప్ర♦హ్లాదుండు కేల్మోడ్చి త
త్పరుఁడై పాడెను వేఁడె నేడిచె గగు♦ర్పాటొందెఁ జొక్కెన్నగెన్.

చ॥ పటపట పండ్లు గీఁటి మర♦వైరి యదల్చుచు నవ్వినట్టి నీ
విటు నట డాఁగినాఁడవుర♦యాతఁడు పల్కిన కేశవుండవా!

కిటివయి తమ్ముఁ బంపితివి ♦ కీడ్పడి జంకి పయోధి దాఁగి తి
న్పటికి మగండవైన వెలి ♦ వాఙుము రమ్మని కాలుఁద్రవ్వఁగన్. ౨౩౦

శా॥ స్తంభం బప్పుడు పెళ్లునం బగిలె ది ♦ గ్జాలంబు లూటాడ సం
రంభుండై హరి వెల్వడె న్నరుఁడు హా ♦ ర్యత్యాకృతిన్ వాని పా
దాంభోజంబులు భూమినుండఁ బయి లో ♦ కాలిన్ వెసం దాఁటి యా
యంభోజాననుఁ డప్డు పుట్టిన విధం ♦ బందెం దదీయస్థితుల్. ౨౩౧

ఉ॥ లెక్కయిడంగరాక పొడ ♦ లెన్ శిరముల్ కరముల్ సురారి కొ
క్కొక్కని కొక్క మోము కర ♦ యుగ్మము కన్నులు మూఁడు వారిధుల్
గ్రుక్కగొనంగఁజాలు పెను ♦ ఘోర ముఖంబులుఁ గల్గి యెల్లరన్
జిక్కఁగఁబట్టి నొక్కుచును ♦ జిందఱవందఱ చేసె న్ముగతన్. ౨౩౧

తే॥ విలయకాలవహ్ని నిమించి ♦ వెలిఁగెజ్వాలు, విలయవాయువులనుమించి ♦ వలసెనూర్పు
లవ్వి రెండు నృసింహుని ♦ యందనిలిచెఁ, గాని చిత్రము జగములఁ ♦ గాల్పలేదు.

చ॥ పొదిఁగి ప్రిగిల్చి పిల్లలను ♦ పోషణ చేసెడు తల్లి కోడి యా
పద తఱి తెక్కలం దడఁచి ♦ పట్టుగఁ గాచెడు లీల నండముల్
కుదురుగ లోనఁదాల్చి వెలి ♦ గూర్చ వసించెడు జీవులెల్ల న
య్యదన నృసింహు నాస్యమున ♦ యంద యడంగె భయంబు డిందఁగన్.

చ॥ నలువను దొట్టి వచ్చిన స ♦ నాతన ధర్మపథంబు మంతయున్
వలవని దుష్ట రాక్షసుల ♦ వారలఁ జేరిన వారిఁ గూల్చి సా
ధుల నుదరంబునంద యిడి ♦ దొడ్డకృపామతిఁ గాచె; సజ్జనుల్
తొలుత పిలుంగు లొందఁ దుదిఁ ♦ దూకొని సౌఖ్యము గాంతురే కదా!

సీ॥ దంష్ట్రలఁ జీల్చి కొం ♦ దఱఁ జంపెఁ గొందఱ, నండ కటాహంబు ♦ నంటవైచె
ధరణిని రాచెఁ గొం ♦ దఱఁ గొందఱను మేరు, గిరికిఁ దాఁకఁగఁ బట్టి ♦ తిరుగవైచెఁ
గొందఱ జలరాశి ♦ యందు పాఱఁగవైచెఁ, గొందఱఁ బడబాగ్నిఁ ♦ గూల్చి కాల్చెఁ
జెఱచుఱఁజూచి కొం ♦ దఱ త్రుళ్లడంచెఁ గొం, దఱ వాయుశక్తిని తూలి ♦ తెరలనడఁచె

తే॥ రెండుగాఁ జీల్చె శిరములు ♦ చెండెఁ జర్మ, మొలిచె వలఁచెఁ బ్రేవులఁ జుట్టి ♦ మెలియనూడ్చె
కన్నుగ్రుడ్లను పెఱికెను ♦ కాళ్లు విఱిచెఁ, జెలఁగి లయరుద్రుభంగి నృ ♦ సింహమూర్తి.

తే॥ దంతి రథ వాజి భటుల మ ♦ ర్దనమొనర్చ్రిమింగుఁ, దోయధిఁ జలంబు చేవల ♦ తోడఁ ద్రావు
శేషుఁ డను బిరుగులతోడ ♦ ద్రిమింగివైచు, ధర్మదేవతయును చాల ♦ దద్దఱిల్ల. ౨౩౪

తే॥ కొందఱను కులగిరులపైఁ ♦ గూల మోదుఁ, గొందఱను చక్రవాళాద్రిఁ ♦ గూల మోదుఁ
గొందఱను గోళకుడ్యంబు ♦ గూల మోదుఁ, గొందఱ దిగంతములు దాఁటి ♦ కూల మోదు

తే॥ శిరములు గిల్లి కొందఱ ♦ దొరలఁద్రోచు, నిప్పు పుట్టంగఁ గొందఱ ♦ నేలరాచు
జయము మించి చెరఁబట్టి ♦ జలధిపైచుఁ, దోఁచివట్టి తెలుంగులఁ ♦ దూల వీచు.

తే॥ నగములను మూఁట నసురుల♦మిగులనీక, కడఁకఁ జంపి దైత్యాంగనా♦గర్భములను
నాశ మొనరించి యట వారి♦నలును లేమి, నయుటి యండంబులకుఁ గేలు♦పఱఁగఁజాఁచె.

క॥ నరసింగఁడు ప్రహ్లాదుని, హిరణ్యకశిపువును దక్క♦నెల్లరఁ దునుమన్
గురుకోపంబున రాక్షస, వరుఁ డుఱుముచు నతనిఁగాంచి♦వారని కడిమిన్. ౨౮౧

తే॥ వజ్ర ఖడ్గంబు నొజనుండి♦యజల దూసి, డాకరంబున దొడ్డ ఖే♦టకముఁదాల్చి
యమరు లులుక సంభ్రమంబులు♦నుద్రు లదర, నార్చి పేర్చి యాడుగఁజచి♦యతనిడాసె.

మ॥ అమరస్తుత్య యశోభిరాముఁడగు ప్ర ♦ హ్లాదుండు తండ్రీ! జగ
ద్భ్రమణంబుం గాంచియు నించుకంత హితముం ♦ దక్కింప వేమయ్య? దేం
దమునం దప్పులఁ ద్రోచి కాచు భువనా ♦ ధ్యక్షున్ రమానాథు ద్రొ
క్కుము మేలొందెదు పాప జాలము తొలం♦గున్ లెమ్మనన్ రౌద్రుఁడై

ఉ॥ పిల్లను ద్రొక్కు గేలి గొను ♦ వీఁక వచించెదు చిత్రమైన యీ
కల్ల మెకంబు చేతులను ♦ కాళ్లను ద్రుంచి వధించి యంత నిన్
ద్రెళ్లఁగ జంపి యవ్వలనె ♦ తీవ్ర తరాసిని ద్రావ్తు నాయెడన్
మెల్లన ద్రాలుటల్ గలదె ♦ మెల్తుక లల్కు వహించి నప్పుడున్. ౨౮౨

సీ॥ అని కాలు నేతుల♦నసిదంబున నొన్నటఁ, బొగలు నిప్పులు గ్రక్కు♦నెగడి డాయ
దనుజమాయలఁ దల♦దన్నెడి మాయల, యందు నేర్పరియగు ము♦కుందుఁ డంత
గణకుల కరిది ల♦క్షణములు గల కాలు, సేతులతో వానిఁ♦జేర్చిపట్టి
బెడిదుఁడై నిర్భీతిఁ♦బెనుపారిన హిరణ్య, కశిపుండు మేరు న♦గంబుఁ బోల

తే॥ ఖర నఖరముల తోడభీ♦కర విరావ, గర్జతో నృసింహుఁడు పాల♦కడలి పొంగి
బ్రహ్మలోకంబు దాఁకంగఁ♦బరవు పగిది, నొప్పి మేరువు ముంచిన♦చొప్పుదాల్చె.

మ॥ భుజముల్ ఖడ్గములుం గిరీటమును సం ♦ శోభిల్లి పైనున్న త్రో
యజ గర్భాండ కటాహ కుడ్య మొరయన్ ♦ వ్యాపించి జ్యోతిర్గ్రహ
వ్రజముల్ మేరువుఁ జుట్టు చందమున దీ ♦ ప్యద్రత్న భూషాలి యా
రజమై రాజిల దానవేంద్ర చరణా ♦ గ్రం బెత్తి త్రిప్పెన్ వడిన్. ౨౮౩

తే॥ వ్రేలుచుండిన పోఁగులు♦రెండు చెదరి, పడినవై యిప్పు డుదయాస్త♦పర్వతములు
గాఁగ వెలసె నందలి పద్మ♦రాగ కాంతి, యేకదా సాంధ్యరాగమై♦యొసఁగుచుండు.

ఆ॥ ఉగ్రమూర్తియైన♦వ్యగ్రు నృసింహు క, రాగ్ర ఖర నఖరము♦లానినంతఁ
గశ్యపేంద్రు వజ్ర♦కఠిన వక్షమునుండి, నల్ల బయలు వెడలె♦వెల్లిగాఁగ. ౨౮౪

శా॥ మాయమేయ జగన్నియామకుఁడు దు ♦ ర్మానిన్ నిలింపద్విషున్
సాయంకాలమునన్ దదీయ నగరిన్ ♦ రత్నప్రభా దేహళిన్
మాయింపం దొడపైనఁ జేర్చికొని సే ♦ మంబుల్ జగంబొంద దై
తేయు శ్రీకరమైన వక్షము నము ♦ ద్భేదించి చంపెన్ వెసన్. ౨౮౫

తే॥ కనఁగరాక దాఁగిన మూఁడు♦నెనిమిదియును, వేయి కన్నులు గలవారు♦వెండి దిక్ప
తులును ఋషులును గుంపులై♦కలిసి వచ్చి, చేరి రేకంటితోఁ జూచు♦వారమనుచు.

తే॥ కాంచఁ గాంచఁగ నెల్లెడఁ♦గానవచ్చు, కాలు సేతులు మోములు♦గాఁగ నిండి
మనసుచే వాక్కుచే జ్ఞాన♦మహిమచేతఁ, గడ యెఱుఁగలేని రూపంబు♦కనిరి జడిసి.

తే॥ పండ్లు సందులే దిక్కులు♦పట్టవచ్చు, ననఁగఁ దగు మొగములు కోటు♦లగుచు వెలయు
నారసింహ రూపము కను♦లారఁ గాంచి, బ్రహ్మ తత్కీర్తి నీరీతిఁ♦బ్రస్తుతించె.

తే॥ నన్ను సృష్టించు కొనువాఁడు♦నీవ యనెదు, సత్య మీరూపమున నిప్డు♦స్పష్టమయ్యె
నిట్టులైనచో♦ బ్రాణుల♦సృష్టి సేయ, నన్ను పుట్టించు టేటికో ? నారసింహ ! ౨౯౩

తే॥ బుద్బుదంబుల కరణి నీ♦భువన వితతి, ప్రజలు నీయందె యెల్లరూ♦పములు నీవ
యిట్టి రూపంబు నొకదాని♦నీవు పూన, నాది మధ్యాంత రహితత్వ♦మమరు టెట్లు ?

తే॥ పరఁగి యేకమై నామ రూ♦పములు పెక్కు, లందుదువు నీవ తొలి హేతు♦వగుచునుండ
నెవరి సృజియింతు ? కాచెద♦వెవరి ? నేఁడి, సంహరింతువు ? తెలియంగఁ♦జాలనయ్య !

శా॥ నీవే నన్ను సృజించినాఁడవు తొలిన్ ♦ నిన్నుండి నీ సత్కృపా
భావం బబ్బుటచే జగంబుల సృజిం ♦ పన్ గల్గినాఁడన్ జగం
బీవే కర్తవు నీవె భర్తవును నీ ♦ వే హేమ మీవౌదు వం
దావిర్భావము నొందు భూషణము నే ♦ నౌదున్ జగన్నాయకా !

క॥ అని వినుతించుచు బ్రహ్మయుఁ, బినాకియును దిక్పతులును♦వేల్పులు మునులున్
వినతులయి కేలు మోడ్పఁగ, ననజాక్షుం డుగ్ర కోప♦వర్తన మానెన్ ౨౯౭

తే॥ జగము లెల్లను చేఁడె నా♦శంబు నొందు, ననుచు వడఁకెడు దివ్యులఁ♦గని ప్రసన్న
మూర్తియై నరసింహుఁడు♦పూర్ణ కరుణ, తనర హస్తమం దభయ ము♦ద్రను వహించె.

సీ॥ అండంబులకు నెల్ల♦నాభరణంబు న, మస్త జీవులకు సం♦పదయుఁ దోడు
నీడయుఁ గారుణ్య♦నిలయ లోకజనని, యమృతంబుతోఁ బుట్టు♦నమృత హస్త
పద్మాలయను హరి♦పజ్జకుఁ జనుమని, ప్రార్థించి వేల్పులు♦పంప నృహరి
తావి గుబాళించు♦తలిరువంటిది యగు, కమలను నెనరున♦గారవించె

తే॥ మునులు వేల్పు లంతట♦మూఁగి వేఁడ, వారిఁ గరుణించి ప్రహ్లాదుఁ♦జేరఁ జీరి
వారుకొన వత్స! నీభక్తి♦మేర మీరె, దీనికిం బ్రతికృతి యెద్ది♦తెలుపుమయ్య!.

సీ॥ నీ యెట్ట యెదుటనే♦నీతండ్రిఁ జంపఁగా, నిశ్చలబుద్ధితో ♦ నిలిచితయ్య !
ప్రాణముల్ వెదకు నై♦పడి నొడల్ చీల్పఁగా, దుఃఖమింతయు లోనఁ♦దొడరవయ్య!
నీకులంబున వారి♦నీఱుగాఁ జేయఁగా, నొక్కింత యారాట♦మొందవయ్య !
నీవంశమునఁ బుట్టు♦నిర్జర వైరులు, దుష్టులైనను వారిఁ♦ద్రుంపనయ్య !

తే॥ నీవు నాభక్తవరుఁడవై♦నెగడుకతన, వలయు మేలేదియో తెల్పు♦వలతునయ్య !
దాంతివై భవజలధిని♦దాఁటితయ్య! యనుచుఁ బ్రేమతోఁ బలుకఁ బ్ర♦హ్లాదుఁ డంత.

శా॥ ఓ కారుణ్యపయోధి! నీకరుణ నే ♦ నొక్కిమేల్లు చేకొంటి నీ
లోకంబందునఁ బొందఁగాఁ దగిన మే ♦ లుం గల్గునే యెందు? నా
కే కష్ట ప్రభవంబు వచ్చిన నదే ♦ యింపౌను నీభక్తి య
స్తోకంబై విలసిల్లనిమ్ము మది సం ♦ తోషింతు మహాత్మకా. ౨౬౧

సీ॥ అంజలి ఘటియించి ♦ యట్లు వేఁడిన దైత్యు, తనయుని గని హరి ♦ తనిసి యనియె
పంచభూతములు న ♦ శించిన సర్వదా, స్థిరుఁడవై నావలెఁ ♦ జెలఁగుచుండు
భక్తవరులు నన్ను ♦ ప్రార్థించి పడసెడు, ఫలము నిన్నర్థించి ♦ పడయఁ గలరు
లోకత్రయము నీకు ♦ లోఁబడియుండు నా, భక్తులెల్లరును నీ ♦ భక్తులగుదు

తే॥ రసురులకె కాదు సురలకు ♦ నధిపుఁ డగుదు,వితర మర్లభ మిది చుమ్ము ♦ శ్రుతులు ధర్మ
సత్యములు కరుణయు శీల ♦ సమితి సుఖము, నిన్ను సేవించుచుండఁగా ♦ నెగడఁగలవు.

క॥ అని వర మొసఁగుచుఁ బ్రహ్లా, దున కభిషేకంబు సేయఁ ♦ దోడ్తోఁ జనులం
బొనరింపుఁ డనుచు వేల్పుల, కనుమతి యిడె నెల్లవార ♦ లానందింపన్. ౨౬౩

చ॥ సురపతి ముఖ్యులెల్లరును ♦ సూటిగఁ గార్యము లొగ్గి సేయఁ దా
మరసభవుండు హోమము క్ర ♦ మంబుగఁ బూర్తి యొనర్చుచుండ నా
గరకులు నర్తింప సుర ♦ కాహళ దుందుభి ఘోష మొప్ప నా
సిరివరుఁ డుల్లసిల్లి యభి ♦ షేక మొనర్చె సురారి సూతికిన్. ౨౬౪

క॥ మును జరిగిన చరితం బిది, మనమున నా వార్త నుంత ♦ మన్నింపక త్రో
చినఁ జెడుగులు తప్పని నరి, యనుచు విభీషణుఁడు పలుక ♦ నన్నయుఁ గినుకన్.

౪. విభీషణ శరణాగతి పటలము. (౧౫౫)

తే॥ విని విమర్శింపఁ జాలక ♦ వీఁగి నిజము, తెలియనేరక భేద బు ♦ ద్ధిని గ్రహించి
కనులఁ బారాణి పూసిన ♦ కరణి నెఱ్ఱ, చేసి నిప్పుక లురియుచుఁ ♦ జెప్పఁదొడఁగె.

తే॥ మృత్యువిజయ తపోబల! మేటి బలము, గలిగి నాతఁడగు హిరణ్య ♦ కశిపు నర్థి
జనులఁ గాచెడు హరి చంపె ♦ నని తలంచి, యతని యెడ భక్తిగొంటి వీ ♦ వయ్య! లెస్స!

క॥ కని పెంచిన జనకుని తా, మ్మును మాయలమారి చీల్చి ♦ మోదించిన యా
తనయుఁడు మన శత్రువునెడ, నెనరూనిన నీవు సములు ♦ నిజము మతేరీ! ౨౬౫

క॥ ఆ రామలక్ష్మణులతోఁ, బోరి మడియ నాదు రాజ్య ♦ భోగంబులఁ బెం
పారఁ గొనఁ దలఁచితే? పితృ, మారకుబలె నీవు భ్రాతృ ♦ మారకుఁ డగుచున్.

సీ॥ ఇది ఫలియింప నే ♦ రద యైనఁ జేరాస, మునుపె వారల యెడ ♦ నెనరుఁ గొంటి
మనుజులవలె నీవు ♦ దనుజులయెడ గొప్ప, యౌర్వ్యలేని విరోధ ♦ మూనియుంటి
వెమ్ములు కరఁగు ప్రే ♦ మమ్ము రాఘవులందు, తెలుపుచు నంటి స్తు ♦ తించుచుంటి
వానంద బాష్పమ్ము ♦ లధికమ్ముగా వార్కి, వినుతించు నప్పుడెల్ల ♦ విడుచుచుంటి

తే॥ శరణమగుదుము వారలా•నకుల కడకుఁ, బొమ్ము కర్తవ్యమదియ ని•జమ్ము నన్ను
గెలుచు తెరవు నాలోచించి• తెలిసికొంటి, నీకు మించిన శత్రుండు•నాకుఁగలఁడె?

ఉ॥ నాఁడొకకోఁతి వచ్చి వన•నాశము సేయుడుఁ జంపుఁడంచు నే
నాడఁగ దూతఁ జంపుటలు•న్యాయము గాదని పల్కినాఁడ వా
నాఁడె భవిష్యదర్థము మ•నంబున నెంచితొ యడ్డుకొంటివా
నేఁడది వెల్లడించితివి•నీ కృతకంబు ఫలానుమేయమౌ. ౨౭౧

చ॥ అరులకు భీతిఁజెంది తలు•తాలను పోటరి కావు నిక్కమా
నరులకు భక్తిఁ జూపి పెను • నమ్మకముంచితి వంచకుండవై
పురుషుని తోడ వచ్చు గుణ • పుంజము లెల్లను మార్చుకొంటి నీ
గరువగు వెల్మికంపె భుజ•గంబు మెడం గొనుటెన్న మేలగుఁ. ౨౭౨

తే॥ జగము నిందకు జంకి నిన్ •జంపకుంటి, వదరుటింకను మానవు•వడిగ నన్ను
విడిచి పొమ్ము పోవక వెండి•నుడువఁబూను, దేని నిన్ను చెండాడక•మాన నసుడు.

క॥ తలపోసి యేమి చేయుం, గలనని తమ్ముండు మిత్ర•తతితో గగన
స్థలమున నిలిచి విడక నయ, కలితములగు వాక్యములను•క్రమ్మఱ ననియెన్.

క॥ బ్రదుకం దలఁచిన యన్నా!, మదిమది సుఖసంపదలను•మనఁదగియుండన్
వదరల పలుకులఁ జెడియెదు, బ్రదుకు గలదె నీతిచెడిన•ప్రాణులకెందున్?

చ॥ సుతులును బంధు మిత్రులును • స్తోత్రము చేసెడు బుద్ధిహీనులున్
హితులును శూర కేసరులు•నెల్లరు రామ శరాళిచేత భూ
పతితులు గాఁగఁ జూచి మఱి•ప్రాణము వీడఁ దలంచినాఁడవే?
హితము వచించు నన్ను గణి•యింపక శత్రువుగాఁ దలంచితే? ౨౭౬

ఉ॥ తేరుపఁ జూచితిన్ హితము • దెల్పి సహింపక నీతిమాలి న
న్నూరక దూఱులాడితి హి•తోక్తులు నీచెవిఁ దూఱవయ్యె; వి
న్నారము పూర్వమున్ గరిఁజెం•నాకి వ్రతమ్మును కోలుపోవు చో
ప్పారయనయ్యె నొక్క చెలి•కై కులనాశము దెచ్చికొందువే? ౨౭౭

క॥ మన్నింపుము నాతప్పుల, నన్నా! సెలవిమ్ము పోదు•నని వెడలుటయున్
గ్రన్నన మంత్రులు నలువురు, తన్ను విడక వెంటనంటి•తరలిరి ప్రీతిన్. ౨౭౮

క॥ అవలుండు సంపాతి హరుం, డనిలుండను వారితోడ•ననువుగ నాలో
చనచేసి విభీషణుఁ డ, య్యనకులుతో నెయ్యమాడ•నేగె ముదమునన్. ౨౭౯

క॥ ఇంబుగ వనధిం గడచి దీ, పంబులు విలసిల్ల దుగ్ధ•వారాన్నిధి య
ట్టంబులు పూచె వనెడు చం, దంబున వికసిల్లు కపి క•దంబముఁ గాంచెన్. ౨౮౦

క॥ ఒక ప్రక్కను కపి సంఘము, నొక ప్రక్కను జీవకోటి•నుంచి గణింపన్
దుకము వింగళ్ల పావర పై, న్య కదంబమె యనుచు మఱియు•నతఁడిట్లనియెన్.

సీ॥ ధర ధర్మమార్గ సం♦స్థాపకుఁడగు దాశ, రథి యెడ నామనో♦రథము పాత్ర
కీర్తిదంబగు శుద్ధ♦వర్తనంబునఁ గాక, యే మార్గమున నేగ♦నిచ్ఛగింప
సోదరుండగు నాదు ♦ సూక్తి గైకొనని మా, యన్న చే వీడంగ♦నసదనైతి
నీయదనందు నేఁ♦జేయంగఁ దగిన దె, య్యది వచింపుఁడు మీర♦లనుఁగులార !

తే॥ యనుడుఁ బుణ్యాపురుష! బురు♦షార్థదాయి, యైన శ్రీరాము దర్శించు♦టధిక మఖ్య
మనుచు శాస్త్ర విజ్ఞానులా♦తనదు హితులు,పలుక నాతఁడు నమ్మోద♦కలితుఁ డగుచు.

మ॥ శుభదంబౌ ఘనితిర్ వచించితిరి మీ ♦ సూక్తుల్ హితంబయ్యె మా
కభయం బిమ్మని వేడఁ బోవుదము నీ ♦ తాధీశ్వరుం దర్శి ను
ర్లభుఁడే ? వేటొక తీరు నేసినను ♦ త్రోలన్నె ర్తుమే దుష్ట దై
త్యభవంబుల్ ? మన కిద్దియే యిపుడు క ♦ ర్తవ్యంబు చింతింపఁగన్.

మ॥ మును దర్శింపఁగ లేదు విన్నయదియుం ♦ బౌల్సార దెన్నండు నె
మ్మనమం దిట్టులు ప్రేమగల్గఁ గతమే ♦ మాత్రంబుఁ గానంగ రా
దనయంబుం దలఁపన్ శరీరము గగు ♦ ర్పందుర్ గరంగున్ మనం
బినరాజన్యుఁడు దైత్యదేహి కరి యం ♦ చీమాత్ర చింతించెడన్ ౨౭౩

తే॥ అయిన సర్వజ్ఞుఁ డీమాత్ర♦మరయకున్నె ?, దైవభక్తి ధర్మము నీతి♦తప్పమియును
భూతదయయుబ్రహ్మావలనఁ♦బూర్వమున నెపడయువరములుఫలియించు♦నెడయువచ్చె

తే॥ మేలె పల్కితి రీరు స♦మీాత్తుచేసి, శ్రీశు పదములఁ బొంది య♦భీష్టములను
గొంద మిప్పుడు చీఁకటి♦గొఱలు కతన, నుదయమునఁ గాంతమని వని♦నుండునంత.

తే॥ కడలి దాఁటు నాలోచన♦గలుగఁ గలువ, కంటి జానకిఁ దలఁచి దుః♦ఖమున మనసు
చలన మొందుచునుండభా♦స్కరుఁడుపొడమె, రాముఁడునువచ్చె వార్ధితీ♦రంబుచేర.

తే॥ తమమునం దటఁ గల యుప్ప♦శముల నైక, తములఁ బున్నాగములఁ దమా♦
లములఁ గంజ
ములను కలువల వేడ్కమై♦నలరు హంస, మిథున సంతతిఁ గాంచెను♦మిహిరకులుఁడు

తే॥ పసిఁడి రంగు నిండారిన♦వనచయములు, సికత వేదికా స్థలుల నె♦ట్టుకొని వచ్చి
కెరటములుచేర్పు మణిసము♦త్కరము మదికి, నింపుగూర్పఁగఁ గనె జాన♦కీశ్వరుండు.

ఉ॥ అందలి సుందరుల్ మెఱుపు ♦ నందము చిందెడు భామనావళుల్
చందముగా ధరించిన ప ♦ సందగు వ్రేళులు రాయ బొమ్మముల్
క్రందుగఁ గాఱుటన్ నుడియు ♦ కాల్వలఁ బూడ్చుచుఁ గాలివ్రేళ్ల భూ
మిం దగ గీచు గీఁతలును ♦ మిక్కిలి గల్గు వనంబులం గనెన్. ౨౮౦

తే॥ ఇంచు గేదంగులందుండి♦హిమకణములు, జాఱఁ బెంటులఁ జీరి వ♦క్షముల నదిమి
కొనుచుఁ దూఁగెడి హంసల♦గుంపుగాంచి, యుల్లమున నొచ్చి గొప్ప ని♦ట్టూర్పువుచ్చె.

తే॥ శిఖ సచించుమీలను పట్టి తేరఁ జనిన,గండు పులుఁగువచ్చెడు దిక్కు గాంచి యింపు
మీఱఁ గూయు నారణపక్కి తీరుగాంచి, చింతగొనియె శ్రీరాముఁడు చిత్తమందు.

తే॥ ఒక్క పెట్టపై వలపూని యుల్లమందు, మచ్చరము పెచ్చరేఁగ దీమసముతోడ
రెండుపుంజులు పోరాడుచుండఁ జూచి, కనుబొమల ముడివెట్టె రాఘవవరుండు

తే॥ అడ నిండిన నెయ్యంపు టల్కయందు, గెలుపు గొనలేని యొకహంసి కలయికందు
జయము నొందుట గని రామజనవిభుండు, పవడముం బోలు నధరంబుఁ బంటనొక్కె.

తే॥ డాసి హనుమదాదులు సమాశ్వాసపఱుప, చింతవీడి తెలివి తెరచేరు పిచ్చి
వానికై పడి నాచోటు వదలిపోయె, శ్రీవిభుండు సీతాక్రాంత చిత్తుఁడగుచు.

తే॥ ప్రాజ్ఞులైన వానర మిత్రవరులు బలిసి, రాఁగ నడచు వాహిని కొక ప్రక్క నిలిచి
కంత లేని మదిని విభీషణుండు కడఁకఁ, గాంచుచుండి యిట్లనియె రాఘవుఁడు వినఁగ

క॥ నీకంటెను సుశరణ్యము, నాకెద్దియు లేదు రక్షణం బీవె యనన్
గాకుత్స్థుఁడు విని మిత్రవ, నౌకసుల మొగమ్ములరసి యల్లన ననియెన్.

క॥ శరణము తండ్రీ! యని యిను, డరుదుగ వచియించు వారలరయంగా నే
తెరమున వారలో మీ మీ, యరసిన తెఱఁగెంత వట్టో యరయుఁడ మనుడున్.

తే॥ అచటనవ్విభీషణుఁ గాంచి యమరలిందు, చేరికఁ బట్టుకొనుఁడు హింసింపుఁడుగ్ర
గతులఁ జంపుఁ డనుచుఁ గపిగణము వారిఁ, దర్జనముల భర్జనముల డాసిచుట్టి.

తే॥ పాడి దేవతయే వీనిఁ బట్టితెచ్చె, నితఁడు పాపాలపుట్ట లంకేశ్వరుండు
మన తలంపులు నేఁడె చయ్యన ఫలించె, తెరలకుండని వారి నెదిర్చినారు. 300

క॥ తలలు పది చేతు లిరువది, గలుగవు దౌర్భాగ్యునకును గతియించెనొకో!
తెలియ మనువారు మాతోఁ, దలపడు మని క్రోసికొనుచు డాసెడు వారున్.

క॥ పట్టి పెడతెక్క లీడిచి, కట్టి నలఁగఁ బొడిచి రాముకట్టెదుటికిఁ బో
న్వెట్టుదమ యనెడు వారును, తిట్టుచుఁ జెడుమనుచు నెదురు తిరిగెడి వారున్.

క॥ గగనమునకు నొక్కతంటిలో, నెగసివఁ జేయునది యేమి? యిప్పుడు వీనిం
బొట్టా ర్తము రావణుఁ డిదు, కఁగఁ బొడుతము శాసింపఁ గాదను వారున్.

తే॥ పలు విధమ్ముల నీరీతిఁ బలుకుచుండ, గణన కెక్కు నైంద్ర వ్యాకరణ విశార
దుండు హనుమంతుఁ డంప మైందుండు ద్వివిదుఁ, డనెడు వానర వీరు లాతనిని డాసి.

తే॥ ధర్మ[illegible] తెలుఁగు మైందద్వివిదులు, వానరుల నవ్వలికిఁ ద్రోచి పదరవలదు
వీని [illegible] మంచవాదూరము లగు, ననుచు వారలతోడ నిట్లనిరి యవల.

క॥ మీ[illegible] వచ్చిన, కారణ మదియేది? రణముఁ గాంక్షించితివో?
వేరొక తలంపు [illegible]? యిక, తీరులు మదిదాఁచకుండఁ దెలుపుఁ డనంగన్.

మ॥ అనలుం డిట్లను ధర్మవర్తనుఁడు స ♦ త్యాచార సంపన్నుఁ డీ
ఘనుఁ డబ్జాసన పౌత్రుఁ డార్యహిత స ♦ త్కార్యుండు పేరన్ విభీ
షణుఁ డీరాఘవ పాదపద్మములు వాం ♦ ఛం గొల్చి జన్మంబు పా
వనతం గాంచఁగఁ గోరి వచ్చెఁ గరుణా ♦ వష్టంభులారా! వెనన్. ౩౦౭

ఆ॥ పాడి తప్పకుంట ♦ పరమాత్ము పై భక్తి, సత్యవాక్య నిష్ఠ♦శమ దమాదు
లబ్జభవుని వలన♦నరుదైన తపమున, వరముగాఁగఁ గొన్న♦వాఁడితండు. ౩౦౮

ఆ॥ ప్రజ్వరిల్లు నగ్ని♦వస్త్రంబునం జుట్టి, నట్లు లోకనాథుఁ♦డైన రాము
పత్నిఁ గార నిడితి♦వదలి బ్రదుకు గను, మనుచు హితము దెలుప♦నన్న కితఁడు.

తే॥ విగత సద్బుద్ధి దానవ♦విభుఁడు కినిసి, తమ్ముఁడవు గాన బ్రదికితి♦తావునుండి
తొలఁగి పొమ్ము పోవేని మృ♦త్యువు నిజంబు, పలువ!యని పల్క నీతండు♦వదలివచ్చె.

ఆ॥ అనుచు ననలుఁ డాడ♦ దనుజుని సేనను, గాంచి హెచ్చరికను♦గనుచునుండుఁ
డేను రాఘవునకు♦నీవార్త దెలిపెద, నంచుఁ బలికి మైందుఁ♦డచటు వీడె. ౩౧౧

తే॥ పాడియుఁదపంబుజ్ఞానంబు♦ప్రహరులుగను, గౌరవంబు శాంతంబును♦ద్వారములుగ
కరుణయను దేవళంబునఁ♦బరఁగు లోక, మోహనుని పద కంజాత♦ములకు నెఱఁగి

తే॥ తెలుప వలసిన దొకవార్త♦గలదు దేవ! ఏమి ఫలియించునో మాకు♦నెఱుఁగరాదు
వంచకుండగు రావణు♦వదలి యతని, తమ్ముఁడగు విభీషణుఁడు మీ♦దరికి వచ్చె.

తే॥ పట్టి కట్టుఁడు కొట్టుఁడు♦ద్రచ్చుఁ డనుచు, మన చమూబృంద మాతనిఁ♦జెనయ నేను
వారి నదలించి వచ్చిన♦మీర లెవ్వ, రేమి పనియన నొక మంత్రి♦యిట్టులనియె.

తే॥ తనకు వ్యతిరేక గుణుఁడగు♦దశముఖుండు, మనను పోయిన త్రోవనే♦చనెడుకతన
దగిన శరణ ముదారుఁడౌ♦దాశరథియె, యనుచు నాశ్రయింపఁగ నిట♦కరుగుదెంచె.

తే॥ ధర్మమార్గ వర్తనమును♦దైవభక్తి, సత్యనిష్ఠయు ఘన తప♦శ్శక్తిచేత
నీత దానవగుణుఁడు వి♦భీషణుండు, బ్రహ్మవలన వరంబుగాఁ♦బడసినాఁడు ౩౧౬

చ॥ అలఘుపతివ్రతామణి కు ♦ లాంగన రాముని ధర్మపత్ని ని
ట్లలయఁగఁ గారలో నునుప ♦ నక్షయసంపద లీను లంక యె
మ్ములల గిరులౌను నీమకుట ♦ భూషిత మస్తక సంఘముల్ ధరా
స్థలి దొరలు న్నిజంబని హి ♦ తంబు వచింపఁగ వన్న కిన్కమై. ౩౧౭

తే॥ ఇటు విరుద్ధవాక్కుల వచి♦యింతు వేని, చంపువాఁడఁ బొమ్మవలి కీ♦క్షణమునందె
యనుచుఁ దఱుమఁగొట్టంగ మి♦మ్మాశ్రయింప, వచ్చినాఁడఁట! యిదికల♦వార్తయనుడు.

తే॥ రక్షణీయుఁడో కాఁడో యి♦రావణానుజుం డని మీమాంస్య మతులకు♦నూటిగాఁగఁ
దోఁచువిధము దెల్పుండుమి♦త్రులరమీర, లని రఘువర్యుఁ గనిర వి♦తనయుఁ డనియె

—: సుగ్రీవాదులు తమ తమ యభిప్రాయములఁ దెలుపుట :—

తే॥ విధికి మించిన వాఁడవు♦ వేదశాస్త్ర, పారగతుఁడవు నీవిట్లు♦ప్రశ్న నేత
మావలన నెఱుఁగుటకానె? మమ్ము గౌర, వించుటకుఁగాక యాగమ♦వినుత చరిత!

తే॥ ఐన వచియింతు నెఱిఁగిన♦యంతవట్టు, వినుము విని సరియైన-చోఁ♦గొనుము పిదప
భావి ఫలితమ్ము తీర్మాన♦పఱచి నీవ, తెలిసికొనఁగల్గుదువు దయా♦కలితచిత్త!

ఉ॥ అన్నను వీడి వచ్చుటిది ♦ యారయ వైరముచేతఁగాదు వ్యా
పన్నత నొందికాదు తన ♦ ప్రాణము గాచికొనంగఁగాదు పే
రెన్నిక గల్గువంచు నెద♦నెంచియు గాదొక కీడుచేసి కా
దున్నతిఁ దొక్కరుండు కలఁ♦డో ఖలులైన నిశాచరావళిన్? 3_౨౨

తే॥ తల్లిదండ్రుల గురుల బాం♦ధవులఁ ప్రభుల, శత్రువులు చుట్టు ముట్టిన♦సమయమందు
చేయి విడిచి వచ్చుట యెట్టి♦శీలమయ్య! హేయమగుఁగాక సజ్జన♦హితము నగునె?

తే॥ వలయు పనులందు నింపగు♦పలుకులాడి, రణము నేయ వలయునెడఁ♦ప్రాణమైన
వీడవలసిన పద్ధతి♦వీడి శత్రు, వత్తు మొందు వాఁడొక ధీర♦వర్యుఁ డగునె?

ఉ॥ జ్ఞానము ధర్మముం దనకు ♦ సమ్మతపద్ధతి నుండవచ్చు న
వ్వానికి భంగముల్ దొరయు ♦ పట్టున వేసరి సన్న్యసింపఁగా
బూనుట శ్లాఘ్యమైనపని ♦ మూర్ఖులు సైతము వవ్వ శత్రు ప
క్షానకు వచ్చి చేరుటది ♦ సజ్జన సమ్మతమే? యనింద్యమే? 3_౨౪

తే॥ అన్న మఱియింతఁ దానుసౌఖ్యంబు లంది, ముట్ట వచ్చిన తఱిఁ దోడు♦పూనకిట్లు
వీడివచ్చు నీతడు తగు♦వేళ రాఁగ, నెవ్వరికిఁ దోడుపడునని♦యెంచవచ్చు? 3_౨౬

తే॥ వృద్ధుఁడైన మారీచుఁడు♦విభునియాజ్ఞ, చెడుగయైనను విధిలేక♦చేయఁబూనె
రాజధర్మ తత్త్వ జ్ఞుఁడై♦రాజు వీడి, వచ్చెనని నమ్మి చే యిా య♦వచ్చునేమి?

తే॥ యముని తోలోక మెల్ల నే♦కముగనగుచుఁ, దాఁకినను మాఱుకొనఁగసి♦ద్ధముగనున్న
వార మోరామ! మనప్రక్క♦వచ్చితోడు, పడునెశత్రుతమ్ముఁడునె నమ్మ♦వచ్చునేమి?

తే॥ అమరులను మాఱుమూఁగ నొ♦క్కఁడఁచిధర్మ, మొనరనిలిపెడు గౌరవ♦మూనియున్న
వానివీడి దోడుగఁగొన♦వాఁడుపయిత్వ, మునకె మనలోటుగాఁదోఁచు♦వినకులాఢ్య!

తే॥ బంధుగులు హితులును వీడు♦పట్టునందుఁ, గూడియున్నెడ సంపదల్♦కొల్లపోవు
నప్పుడు విందారగించెదరు♦నప్పుడు నొక్క, పద్ధతిగ నుండువారలే♦పరమహితులు.

తే॥ గడచి పాటిక మాదంగఁ♦గడలి వీడు, వచ్చెఁగాక శరణ మొంద♦వచ్చినతఁడు
కాడు శత్రుఁడు చెప్పకొనఁగఁ♦గాదు వీని, తీరు సంశయాస్పదమని♦తెలియఁబలికె.

తే॥ అంతయై యాత్మకులలోఁ♦ననముఁడై న, జాంబవంతుని గని రామ♦చంద్ర విభుఁడు
నీ యభిప్రాయ మేమని♦నారు దోఁప, నడుగ ధర్మపద్ధతి నిట్లు♦నాతఁడనియె.

చ॥ పగఱను చేర్చుకొన్న నెటు ♦ వంటి మహాత్ములైనఁ గీడులం
దగులుట నిక్కవంబు పగ ♦ ధర్మపదుండని చూతురేని వం
శగత దురాగతంబు విడి ♦ జాఱునె యెన్నఁటికేని? లోక మీ
పగిదిని వమ్మతింప దిది ♦ పార్థివ పద్ధతి గాదు రాఘవా! 333

ఉ॥ క్రూర విరోధు లెప్పుడును ♦ కోరుచునుందురు మిత్రభేదముల్
దారి గనంబడం జెమగు ♦ దాక్తురు వేళ గ్రహించి పోరికిన్
ధీరత నెత్తుచుందురు ♦ తేఁకువతో జయముల్ గడింతు రి
ట్లారయ దుష్టసంగతి న ♦ యంబు నొసంగునె? రాఘవేశ్వరా! 33౪

తే॥ వేదములయు యాగములయుఁ ♦ బేరు మాపి, శిష్టులకు వేల్పులకు బల్మిఁ ♦ జెడుగుఁ గూర్చు
పాపులగు రక్కసులు మన ♦ వజ్జఁ జేరి, సజ్జనాచారములఁ గావఁ ♦ జాలువారె?

చ॥ శరణము సొచ్చి రం చభయ ♦ సంపద పెంపుగ నిచ్చి కాచుచో
దొరకొన వీరి మోసమున ♦ దోసము లెయ్యవి సంభవించినన్
భరమయి ప్రాణముల్ విడువ ♦ వచ్చిన నప్పుడు వీరి వీడినన్
తిరమగు నిందయూఁ దగవు ♦ దేవతయుల్ దొలఁగుః రఘూత్తమా!

తే॥ ఎక్కువగఁ దెల్పనేల? మీ ♦ రెలమి తోడఁ, గాఁటనుండ బంగరు లేడి ♦ గాఁగ వచ్చి
మోసపుచ్చు మారీచుని ♦ మునుపు రాక, నీవి రాకయు నొకతీరె ♦ వీరవర్య!

తే॥ అనుచు బహువిధ శాస్త్ర సి ♦ ద్ధాంతములను, చక్కఁగా విని యెఱిఁగిన ♦ సైన్యపతిని
నీలుఁ గని నీయభిప్రాయ ♦ నిశ్చితంబు, దెలుపుమన నాతఁ డిట్లని ♦ పలుక సాగె.

సీ॥ కూడని వారలఁ ♦ దోడుగాఁ గొను పద్ధ, తులు గొన్ని కలవు రా ♦ ట్తిలక వినుము
తమవంశమున వారి ♦ సమయించు వారల, కడ కెల్లిదమ్ముగ ♦ వడచువారు
వనితల విషయాన ♦ వైరంబు గలవారు, పగఱచే ధనము గో ♦ ల్పడినవారు
మఱవఁగూడని యవ ♦ మాన మొందినవారు, దాయలవలన బీ ♦ దలగువారు

తే॥ సంగరంబున వెన్నిచ్చి ♦ శరణు చొచ్చు, వారు పరుల మిత్రుల బాధ ♦ పఱచువారు
ప్రక్క రాజులచేఁ గీడు ♦ పడయువారు, వైరి సోదరులైనఁ జే ♦ పట్టఁదగును. 33౫

సీ॥ పగఱఁ జేరఁదగిన ♦ భంగంబు లొందని, వారును శాత్రవ ♦ భయద బలులు
చేరిన వదను వ ♦ చ్చినఁ దొలఁగంగఁ దీ, ర్మానించు కొనియుంద్రు ♦ గానఁ దగదు
ఈ విభీషణు రాక ♦ కిందేది కారణ, మగునని యారయఁ ♦ దగును మనకుఁ
గాల దేశములు నృ ♦ పాల నీతియుఁ జూడ, వినిగిన వాని న ♦ ద్వృత్తి యొకఁడె

తే॥ కాంచినమ్మంగఁ దగదు ని ♦ క్కముగ నిదియు, నాయభిప్రాయమనఁ గవా ♦ నరులు తక్కు
వార లుచ్చావచంబుగఁ ♦ బలికి తుదకుఁ, బగఱ జేపట్టఁ దగదని ♦ పలికినారు. 3౪౦

—: హనుమంతుఁడు తన యుద్దేశమును తెలుపుట :—

సీ॥ సర్వసామాన్య వి॥జ్ఞానంబున కతీతుఁ, డైన శ్రీరామ భూ॥జాని యవల
మతిమంతుఁ డగు హను॥మంతుని గని బహు, శ్రుతుఁడ ! నీ తలఁపున॥చొప్పువినఁగ
నెంతు నీవారెల్ల॥రేక వాక్యులె యయి, రను సూచకంబుగ॥నరయునంత
నాలోచనమున వి॥శజ్ఞానులై నను, దగు గౌరవింప బాం॥ధవ్యరీతి
తే॥ ననుచుఁగృతమతి మారుతి॥యవన తాంగుఁ, డగుచుహ స్తముల్ముకుళించి॥యాననమున
కడ్డముగఁ జేయియిడి పెద్ద॥లంద ఱొక్క, పద్ధతిగఁ బల్క మీఁద నేఁ॥బలుకవలెనె ?
తే॥ కృతమతులు మంత్రులెల్ల రీ॥రీతి దీర్చి, పలుకుచున్న భావ్యంబగు॥ఫక్కియైన
నితఁడు దుర్గుణుఁడని సంశ॥యింపఁజాల, దీనికిం దగు హేతువుల్॥దెలియ వినుఁడు.
క॥ వంచకుల వక్రవదనము, లంచించి పరీక్ష నేసి॥యరయఁగ వచ్చున్
కంచనము వారు దాఁచిన, వంచిత హృదయంబు మోము॥నం దెడలించున్.
క॥ పగవారు శరణుచొత్తురె ?, పగటం బీకటులు కాన॥బడునే ? మదిలోఁ
దగులుకొను చౌర్యమువకున్, మొగమే యద్దముయి వ్యక్త॥ముగ వెలిపుచ్చున్.
తే॥ వాలి స్వర్గలోకముచేర॥నేలయెల్లఁ, దమ్ముఁ డొందఁగఁజేయ నీ॥ధనువుబలము
జయము కీలము పర్వమ్ము॥చక్క నెఱిఁగి, రాజ్యకాంక్షచే నితఁడు చే॥రంగ వచ్చె.
తే॥ దనుజకుపాలనమునకుఁ॥దాళలేమి, తమ్మునకు రాజ్యమిచ్చు ను॥దారబుద్ధి
పత్య వాత్సాలనము ధర్మ॥సంస్థితియును, తిరుగా నెఱింగియె మిమ్ము॥చేరవచ్చె.
తే॥ ఇతఁడు కాల దేశంబుల॥నెఱిఁగి నీవు, వాలిఁ జంపుట దెలిసి రా॥వణునకింక
నాశమే నిజమని లోక॥నాయకుఁ డగు, నిన్ను చేరఁగోరియె వచ్చె॥నన్న వీడి.
క॥ దానవ నైజము మాయలు, వాని నెఱుఁగు వలఁతు లిపుడు॥వశులైరి జయం
బే నిక్కువమగు మనకిఁక, దీనికిఁ జింతింపనేల ? ధీరవరేణ్యా ! ౩౭౮

చ॥ దనుజులు మానసంబులను ॥ దాఁచిన క్రూర గుణవ్రజంబులన్
గనుఁగొన దుష్కరంబ యగుఁ ॥ గాక నృశంసులు వీరిలోన నుం
డినఁ దగ నుండవచ్చునక ॥ డింది మగంటిమి గల్గు వైరిచే
దనుజులగ బన్న మొందిన క ॥ తమ్ముని నయ్యవి యెన్నఁగూడునే ? ౩౭౯
మ॥ నను వైశ్యాదంచు చంప నాజ్ఞయిడ న ॥ న్నంగాంచి యీతండు దూ
తను చంపించుట పాడిగాదు మతి త ॥ త్కార్యంబుచేఁ బూర్తిగాఁ
జనునే శాస్త్రవ శేషమంచు పబలా ॥ జాతిన్ బలంబేది యుం
డినవారిన్ వధియింపరాదనుచుఁ జా ॥ టించెన్ సభన్ ధీరతన్. ౩౮౦
తే॥ శాస్త్ర [illegible] మొంది॥రమున శ్రీగ్ని, నపుడుఁ దరువాత నాత్రో॥వ॥పరిగి నపుడు
మంది[illegible]నాత్మ జికిసించె, మతియునితనిగాఁ జిచికొం॥తొ॥యెఱిఁగినాఁడ.

తే॥ సజ్జనానర్హమైన మాం♦సంబు నింద్య, మైన మద్యంబు నితని గృ♦హంబునందు
  కానరావు దైవార్చనల్♦దానధర్మ, విధుల నొప్పారె సుకృతాత్ము♦వేశ్మ మనఁగ.
తే॥ ధరణిజాతే దుఃఖింప నీ♦తని కుమారి, పాపి యసురకు బ్రహ్మనా♦శంబు కలదు
  నిన్ను బలిమిమై దాఁకంగ♦నేరఁ డనుచు, డిందుపడవలదని యూఱ♦డించుచుండె.

మ॥ దనుజాధీశుఁడు పొందినట్టి వరముల్ ♦ దర్పంబు మోసంబు త
  క్కిన దుర్జాతిగుణంబులన్ వెలికిఁ ద్ర ♦ క్కింపంగఁ దానోపు నీ
  ఘన కోదండ విముక్త శాత శర సం ♦ ఘాతం బమోఘంబుగా
  నని యూహించియె వచ్చినాఁడు రఘురా ♦ మా! భక్త చింతామణీ!

చ॥ తన వరముల్ గుణంబులు కృ ♦ తార్థత నొందఁగఁ జూచి యందుపై
  ననితర సాధ్య కార్యముల ♦ నారసి యాపదవేళఁ గావుమా
  జనవర! యంచు వచ్చిన ని ♦ శాచరునైనను పోవ విడిచన్
  వననిధి బావి నీటిఁ గని ♦ వారని శంక యొనర్చి నట్లగున్.     ౩౫౫

చ॥ అరులకుఁ జేరువారలు స ♦ హాయులు కారని యీ విభీషణున్
  దొఱఁగినచో నయజ్ఞు లిల ♦ దొడ్డగ నవ్వరె? యన్నదమ్ములౌ
  పురుషులకారె వైరమును♦పూనుచు నుంద్రొక వెంట కోసమై
  యిరవిది తెల్పితిం బిదప ♦ నిష్టము వచ్చినయట్లు చేయుఁడీ.     ౩౫౬

—: శ్రీరాము నభిప్రాయము :—

చ॥ అను హనుమంతు వాక్యముల ♦ నారసి దేవ సుధం గ్రహించు చొ
  ప్పున మది నుల్లసిల్లి కడుఁ ♦ బోఁడిమితోఁ గొనియాడి తక్కువా
  రిని గని యీతఁ డాడినది ♦ కృత్యము మీరలుఁ జర్చ సేయుఁడీ
  వనచరులార! నా తలఁచు ♦ పద్ధతి యియ్యదియే నిజంబుగన్.     ౩౫౭

ఉ॥ నిర్వహణ ప్రభావమును ♦ నెక్కొన వచ్చిన వేళయున్ మనః
  పూర్వక రాజ్యకాంక్షయును ♦ ముఖ్యములై తగియుండె వీని ని
  ర్గర్వము మెచ్చఁ దగ్గది ని ♦ రంబుగ నిల్చిన కార్య దీక్షయుం
  బర్వెన బుద్ధి గొప్పయవి ♦ పాపమొకందును లేనివాఁడగున్.     ౩౫౮

ఉ॥ మారుతి పల్కెల్లను స ♦ మంజసముల్ పలుమాటలేటికిన్
  వేరగు తీరుచే గెలుపు ♦ వీడినఁ బ్రాణము తీగినన్ జయం
  బేరహిఁగల్గినన్ బహు ము ♦ రేశ్వర భోగములబ్బినన్ నరే
  కోరిక మీఱ నన్ శరణు ♦ గోరినఁ గాచుట నా వ్రతంబగున్.     ౩౫౯

చ॥ శరణము గోరి నాతఁడొక ♦ శాత్రవుఁడైనను క్రొత్తవాడైన ము
  ష్కర గుణుఁడైన మాత్మ పితృ ♦ ఘాతకుఁడైనను భ్రాతృహంతయో

శరణమునొంది పిమ్మటను ♦ జాఱిన దాన యశంబకాక దు
ర్భరముగ దుర్యశంబు మన ♦ పాలఁ బొసంగునె యెన్నఁడేనియున్!. ౩౬౦

చ॥ ఇనకులచంద్రుఁడైన శిబి ♦ యిచ్చెను మేను కపోతపక్షి కా
ఘనుని యశంబు నేఁటికిని ♦ గల్గదె? నాశరణమ్ము గోరి యొ
ప్పిన సుఖమొంద వచ్చిన వి ♦ భీషణు చేవిడనాఁటికంటె నా
యన కపటంబుచే మరణ ♦ మందిన నాఁడెకదా కృతార్థుఁడౌ?. ౩౬౧

ఉ॥ హాలహలంబు మ్రింగి యమ ♦ రావలిఁ గాచిన శంభువృత్తముం
బోల నెఱుంగరో? యిడుమఁ ♦ బొందిన వానిని వీడువాఁడు భా
గ్యాళిని దాఁచువాఁడు శర ♦ ణార్థిని గావనివాఁడుఁ గాంచఁగాఁ
జాలెడువారె ధర్మఫల ♦ సంపదఁ బిమ్మటఁ జింతనొందిరౌ. ౩౬౨

ఉ॥ దారను బుట్టఁబెట్టికొని ♦ తన్నను పట్టఁగ నున్న బోయకుం
జేరిమి నగ్నిఁగూర్చి చలి ♦ వీడిచి యాఁకలి బాధవోవ నా
హారముగాఁగ దేహము న ♦ మర్పణసేసిన పిట్ట సత్కథల్
నీరులు మేలుమేలని న ♦ తింపరె నేఁటికి మంచి వేళలన్? ౩౬౩

క॥ కరి మకరముతోఁ బోరఁగ, నరిరాక యలంగి నొచ్చి ♦ శరణార్థిని శ్రీ
వర కావవె యన విష్ణువు, కరుణించిన కథను మఱవఁ♦గలరే సుజనుల్?. ౩౬౪

చ॥ కరుణను సృష్టిచేసి తగఁ ♦ గాచెడు విష్ణువు సర్వలోకముల్
చరములు స్థావరమ్ములును ♦ సత్యము ధర్మము తత్ఫలంబులున్
గర మరుదారఁ దానయయి ♦ కావఁగఁ గోరిన వారిఁగాచు శ్రీ
వరదుఁడు గాఁగ నొప్పెనన ♦ వార్తల నాడఁగనేల దీనికిన్? ౩౬౫

తే॥ తక్కువగ జీవితంబును♦దాన యొసఁగి, యవలఁ జావ భీతిలి యభ♦యంబు వేఁడఁ
గాలుఁ గాలమర్దించి మృ♦కండసుతుని, మృతిని మాన్పఁడె శంభుండు♦మేలుగూర్చి?.

ఉ॥ దిక్కొకఁ యింత లేదనుచు ♦ దీనత జానకి యేడ్వ నీకు నే
దిక్కయి యుంటిగా యని యె ♦ దిర్చి సురారి కులేంద్రు దోర్బలం
బుక్కుఱఁ జేసి ఘోర కద ♦ నోర్వి యశస్కరరీతిఁ బ్రాణముల్
దక్కిన పక్షిరాయుని వి ♦ తంబది మాకును పాటి కాదొకో?. ౩౬౭

చ॥ శరణము వేఁడువానిఁ దన ♦ చందమునం గయికోనివాఁడు మేల్
మఱచినవాఁడు నిష్కలుష ♦ మానసమందునఁ దత్త్వచింతనం
బరమరలేక చేసి భువ ♦ నాధ్యుఁడు లేఁడను నాస్తికుండుఁ బెం
పఱి మరలంగలేని నిర ♦ యంబునఁ గూలెడు వారు నిచ్చలున్. ౩౬౮

చ॥ పనివడి దేవమానవుల కు ♦ పద్రవముల్ పొనరించు రావణున్
జెనకి దురంబునందు పది♦శీర్షములన్ దెగవైతునంచు నే

ననుట విదేహకన్య కొఱ ♦ కా? మునులెల్లను వేడఁ బద్ధుగా
ననిన వచస్సు తప్పఁగల ♦ నా? యని మానులు తప్పనేర్తురే?. ౩౬౯

చ॥ తలఁచిన కార్య మొక్కట నుప ♦ థంబున సంతసగాఁగ సాగనీ
యలవడకుండనీ కృపగ ♦ లట్టి జనాళికి మేల్మి గూర్పఁగాఁ
గలిగిన కార్య మింతకును ♦ కల్గునె? కావుమయంచు వేడు న
ల్పులకయి జీవము ల్విడుచు ♦ పుణ్యులు ధారణి నెంద ఱుండరో? ౩౭౦

ఉ॥ కావునఁ గావుమా యని యొ ♦ కం డభయమ్మును కోరినప్పుడే
త్రోవక కాచుటే తగవు ♦ త్రోవ సమంచితు లీరు నాయెడన్
వావిరి ప్రేమచే నిటులు ♦ పల్కితి రైనను తప్పులేదు సు
గ్రీవ! బిరాన నీవ చని ♦ ప్రీతిని తేవలయున్ విభీషణున్. ౩౭౧

తే॥ శంక సుంతయు లేక ప్ర♦సన్నమైన, మనసుతో రాముఁ డిట్లు ప♦ల్కినఁ గపీంద్రుఁ
డెడఁద తేటదనంబుతో♦నేగె నతనిఁ, బిలుచుకొని వత్తునని మోద♦కలితుఁ డగుచు.

ఉ॥ వచ్చి కపీంద్రుఁ డగ్గొని య♦పార కృపారసధాముఁడైన యు
ద్యచ్చరితుండు రాముఁడు న♦మంచిత రీతిని నిన్నుతోడి తే
నిచ్చను రాజు నంపె నని ♦ యెన్ ద్వివిదుండు విభీషణుఁడు దా
హెచ్చు ముదంబుతోడ నెదు ♦ రేగె వికస్వర మానసంబుతో. ౩౭౩

చ॥ చిరముగఁ జేరియున్న మదిఁ♦జేరరు శుద్ధగుణంబులేని వా
రరుదుగఁ జేరినంతఁ గలి ♦ యం గల వారలు శుద్ధ మానసుల్
త్వరగ మనంబు లొండయినఁ ♦ దారొకఁడైన నిర్వురు రేయియుం బవల్
దరికొని చేరుసట్లు సము ♦ దారతఁ జేరిరి కౌఁగిలింతలన్. ౩౭౪

ఆ॥ తరణి వంశజులకుఁ ♦ దగినపద్ధతిని ము, దాన నీకు నభయ♦దాన మొసఁగు
రామవిభుని పాద♦రాజీవముల నాశ్ర, యింప వెడలుమనియె♦నిన నుతుండు. ౩౭౫

ఆ॥ ఎడఁదవలెనె యొడలు♦కడుఁజల్లనయ్యె దా, నికిని మించి గగురు♦నెఱసెఁ గనుల
నంతకెక్కుడయ్యె♦నానంద బాష్పముల్, ప్లవగనాథు పలుకు♦చెవులఁబడఁగ.

శా॥ పారాణిం దలపంగనే మెఱుపులౌ ♦ పాదంబులం గల్గు నీ
తారామం బెడఁబాపు పాపమతికిం ♦ దమ్ముండనౌ నన్ను నిం
పారం జేరఁగఁ బిల్చెనే? యభయ మే♦ పారం బ్రసాదించెనే
శ్రీరాముండు? కృతార్థుఁడైతి హారుఁడ ♦ ర్థిన్ బ్రమింగు ఘ్నేశ్రియన్.

ఉ॥ రాముని మానసంబునఁ ది ♦ రంపుఁ దలంపిది యయ్యెనేని త
త్ప్రేమము నిట్టిదైన నవి ♦ వేకి దశాస్యుఁడు నా హితోక్తులన్
దామసవృత్తిమైఁ గొనక ♦ తక్కెడ చెడెన్ జెడితిన్ మహోద్ధతిం
దామరసాప్తుఁడింకఁ బ్రమ ♦ దంబున లంకపయిం జరింపఁడే? ౩౭౬

తే॥ క్రోవవాని కీశులు సేయ♦దొడ్డవారు, నైజమగు కృపాళుతను మా♦నంగఁగలరె?
మంథనము నాటి విందుఁగుఱుల్♦చిందునట్లు, చిలికినను సురలకు నీదె♦జలధి సుధను.

చ॥ ముని హితుఁడైన రాఘవుఁడు ♦ మోదముతో నను సన్నుతించి చే
కొని యిఁక నెప్పుడుం జెడని ♦ కూరిమి నాకభయం బొసంగె నే
మనఁగలవాఁడ? నీకు లంక ♦ యంబును మాయలతోడఁ జేయు నీ
దనుజభవంబు వీడితిని ♦ తప్పును నాకకముం దరించితిన్. ౩౫౦

చ॥ అనవుడు సూర్యపుత్రుఁడను ♦ నయ్య! రఘుప్రభుఁ డొడ్డయందు స
ద్గుణములు దుర్గుణంబులును ♦ కోరికి నారయు వాఁడయయ్యె న
ర్థిని తనప్రాణముంబలె మ ♦ తించు దయాళువు నిన్ను గాంచు నా
స నెదుగు చూచువాఁడగు వె ♦ సం బదమా యని వెంబడింపఁగన్.

తే॥ వడిఁ దరువులు గిరులును♦వడఁకునొంక, నీలగిరియు మేరువు వచ్చు♦నెటి రహింప
వినుత పూర్వపుణ్యులు కపి♦దనుజ విభులు, చెలఁగి సాలభంజను కడఁ♦జేరినారు.

—: శ్రీరాముఁడు విభీషణున కభయ మొసఁగుట :—

సీ॥ ఇల నాకసంబున♦కెగుర వైవఁగఁ జాలు, బలయుతులగు కపి♦వరులు గొలువ
పొడవైన విల్లు చే♦బూని మేరువుక్రియు, వహియించి సౌమిత్రి♦ప్రక్కనిలువఁ
బాలకడలి చుట్టి♦పరవ వికచ పద్మ, యుత నీలవార్ధి నా♦నొప్పు వానిఁ
జతురబ్ధి వేష్టిత♦సర్వసర్వంసహా, నాయకుఁడగు నర♦నాథ సుతుని

తే॥ వేలుపాల వేడికోలునఁ♦బాలవెల్లి, పాఁపపానుపు వీడి యి♦వ్వసుధ కేగు
దెంచు శ్రీకేశవుఁబోలెఁ దో♦తెంచువాని, విశ్వ మోహనాకారుఁడై♦వెలయువాని.

సీ॥ భ్రూలతక్రియ వంపు♦సోలుపారు పీచికా, తతుల పరంపరల్♦తాఁకుచుండ
ధరియింపఁదగిన ము♦త్యాలకై వడి డాలు, నవరించు సైకత♦స్థలమునందు
ధవళిమమై యున్న♦తలమును తన మేని, కాంతులు నీలిమ♦గాఁగఁజేయ
నర్ధేందుఫాల సీ♦తాంగన కనుపాప, వలె నొప్పిదంబుగ♦వెలయువాని

తే॥ రతనపువ్విల్లులేని సీ♦రదము భాతి, రత్నహారముల్లేని యా♦రంబువాని
పరయఁ దర్రితాడు లేని మం♦దరముకరణి, బాహుపురి లేని భుజములఁ♦బరఁగువాని.

తే॥ అమృతవృష్టి మానుచుఁ గరు♦ణామృతంబు, గురియు నిండు చందవు మోము ♦
పరఁగువానిఁ
దండ్రి యిచ్చిన మకుటంబు♦తమ్ముఁ డొందఁ, దల్లి యిచ్చిన జడలతోఁ♦దనరువాని.

తే॥ ఎలమి దర్శించి యొడలెల్లఁ♦బులకరింప, గనుల నీరుకాలఁగ మది♦కరఁగ నిలిచి
కాంత విమోచన భాగ్యత♦కరణి నామ, నంబు నీడ్చు నీతఁడు లోక♦నాథుఁడనుచు,

సీ॥ ఎఱ్ఱని కనులతో • నెలరారి కనువాఁ, డాత్మల లాగు సీ • లా[ గియేమొ?
రక్తాంబుజంబులు • రాణఁ బుష్పించి క్రొ, మ్మించుఁ బూసిన కాల • మేఘమేమొ?
తనియంగఁ గరుణామృ • తంబు వర్షించుచుఁ, గొలుపు మీఱిన ధర్మ • మూర్తియేమొ?
యననొప్పు శ్రీరాముఁ • గనులారఁ గంటిఁ ద, న్మాతఁ గంటిఁ గలుచు మా • యంగఁ గంటి

తే॥ మిడుఁగుఱుం బుర్వు పగిదిని • మెఱయు భవ వ, రంపు లనీఁగఁగాఁ జద్మ • రాగ మకుట
మును విసర్జించి పాదుక • ల్గొనియుఁ దని, గొలువఁ జంపు నన్న యుఁజాల • కూర్మికాఁడె.

తే॥ తాపసులకును నీఁగఁగాఁ • దరము కాని, భవరుజం బాపు మందునాఁ • బరిఢవిల్లు
రాఘవుఁడు తానె వాఁడినా • రాచములను, పరపి చంపఁ దక్కను లెంత • భాగ్యయుతులొ?

చ॥ రతనపు బొమ్మికంబు పయి • రాజిలు చేతులతోఁ దరుల్ శిలల్
మెతుకనయై కరంగ మిఱి • మీఱిన భక్తిని తన్ను రాఘవుం
డితవుగఁ జూడ నొగ్గుచు మ • హీస్థలిఁ జాఁగుచుఁ జేరి మ్రొక్కి వాం
ఛిత మణు లిచ్చు వార్ధి క్రియఁ • జెన్నరు తత్పద కంజ సన్నిధిన్. ౩౮౯

చ॥ తొలఁగెను జన్మ బాధలని • తోఁచు మొగం బెలరార నుబ్బుచున్
వెలువడ మోద బాష్పములు • పృథ్విని వత్తుముసోక మ్రొక్కఁ జి
ప్పిలు కరుణన్ విభీషణుని • శీర్షము దాఁకుచు రాఘవుండు పెం
పొలయఁగఁ గూరుచుండుమని • యొప్పగు తావును కేలఁ జూపుచున్.

మ॥ భువనంబుల్ రవిచంద్ర తారలు మహా • భూతంబులున్ భవ్య రా
ఘవ నామం బది యెంత దాఁక నిలుచున్ • స్కన్నంబు గాకుండ సం
స్తవలీలన్ భరియింపు మంతదనుకన్ • దైతేయ రాజ్యంబు నం
చు వచించెన్ గరుణాళుఁడై త్రిదశులున్ • సూరుల్ ప్రశంసింపఁగన్.

మ॥ అకలంకాత్మకుఁడైన రామ కరుణా • వ్యాపారముం గాంచిరో
ప్రకటాత్ముండగు నవ్విభీషణుని ధ • ర్మప్రోన్నతిం గాంచిరో
యొకటన్ రెంటిని గాంచిరో జగతి భూ • తౌఘంబు సంతోష తా
రకమయ్యెన్ రఘురామ భూవరుని వా • ర్తన్ విన్న యప్పట్టునన్.

ఉ॥ దాసుఁడు ధన్యుఁడయ్యెనని • దండము వెట్టిన యవ్విభీషణున్
డాసిన లక్ష్మణుం గని క • డంకను నిద్దుర మాను తండ్రి! సం
త్రాసము పాసినట్టి మన • తమ్మునకున్ మకుటాభిషేకముం
జేసి ప్రమోదమానసుఁగఁ • జేయుమ యంచు ననుజ్ఞ యీయఁగన్.

చ॥ అదను నెఱింగి కార్యఫల • మారయునట్టి విభీషణుండు స
మ్మదమున రాముఁ గాంచి జన • మాన్య! తెఱుంగని శ్రేష్ఠసంపదల్
ముదమున నిత్తువే ననుర • ముఖ్యభవంబు తగుల్ తొలంగఁగా
నొదవుచుఁ గైకపుత్త్రునకు • నున్నతి నిచ్చు కిరీట మీయవే! ౩౯౪

సీ॥ అనుచు శ్రీ రాముఁ డి♦ట్లను విభీషణ! మున్ను, వరసోదరులము న♦ల్వురమె యుంటి
మావల గుహునితో♦నేవురమైతిమి, పదపడి వానర♦ప్రభునితోడ
నార్వురమైతి మీ♦యెడనున నీతోడ, నేడ్వురమైతిమి♦ యింపుమీఱ
నీతండ్రి దశరథ♦నేత కాంతారంబు, నాకిచ్చి సుతులచే♦నలువునొంది

తే॥ వెలసె నని పల్క విన్న వి♦భీషణుండు, నన్ను మీసోదరులలోన♦నెన్నుకతన
బానిసలయందు మేటినై♦పరఁగినాఁడ, ధన్యుడైతిని భయములు♦శూన్యమయ్యె.

మ॥ అని సందేహము వీడి రామపద చి♦హ్నాంబై లసద్రత్నశో
భనమై యొప్పిన హేమశీర్షకము నొ♦ప్పందాల్చి భానూదయం
బునఁ బూర్వాద్రి యెలుప్పు లీల వెలసెన్ ♦ బుణ్యుండు సౌమిత్రి త
క్కిన కీశాదులు మోదమందిరి దివిన్ ♦ గీర్వాణు లగ్గింపఁగన్. ౩౯౬

క॥ విరిసోనలు వర్షించెను, శరధులు ఘోషించె మేఘ♦నముదయ ముఱిమెన్
సుర దుందుభి శంఖాదులు, మొరసెఁ బసిఁడి కురిసె గంధ♦పొడియును రాలెన్.

చ॥ అమృతము లొల్క పల్కు లల ♦ రారెడి జానకిపట్ల ధర్మమున్
నమయుటచేఁ గృశించిన ప్ర ♦ శస్తగుణంబును నేఁడు గౌరవం
బమరఁగఁ గాంచె నంచు విధి ♦ హర్షమునొందె దశాస్య దుష్ట కా
ర్యములును సంపదల్ పొలిసె♦నంచు నెలర్చెను ధర్మదైవమున్. ౩౯౮

తే॥ శత్రురాజ్యసంపద విభీ♦షణుని పొందు, టెంబుగా నెల్ల రెఱుఁగఁ బా♦ళెంబునందు
మెఱవడిం జేయుఁ డీవుసు♦మిహిరసూనుఁ, డనుచు రాముఁ డాజ్ఞాపింప♦నాక్షణమున.

క॥ గుణనిధి విభీషణుని ల, క్ష్మణుఁడు రవిసుతుండు పెను వి♦మానంబునఁ బే
రణితో ముదమున వానర, గణములు మోవఁగ మెఱవణి♦గావించి రొగిన్.

ఉ॥ ఏ జగదీశు పాద రజ ♦ మెల్ల ముముక్షులు పొందఁగోరు వా
రా జనవంద్యు పాదముల ♦ నారసి బ్రహ్మ యజింపఁ బుట్టు గం
గా జలమందు మున్గ నర ♦ కంబును పొందరు తత్పదంబులే
రాజులఁ దాల్చు వారెనయు ♦ ప్రాజ్యపదంబు వచింప శక్యమే? ౪౦౧

తే॥ సురలు మానులు దానులు♦సోమయాజు, లాత్మవిజ్ఞులు దేవర్షు♦లమరవరులు
తక్కు పెద్ద లీదైత్యచం♦దమున మేల్మి నొందినట్టి వారెవ్వరీ♦యుర్విఁగలరు?

చ॥ మెఱవడియైన యప్పిదప ♦ మెల్లన నాతఁడు వచ్చి భక్తిమై
నెఱఁగినఁ గేలనెత్తి మను ♦ ధేశుఁడు దీవనలిచ్చి నిల్వఁగా
మఱవగు తాపుచూపె నట ♦ నుగ్రకరంబులచేత వారలం
బఱచిరి నంచు లాగికొనె ♦ భానుఁడు స్వీయ మయూఖజాలమున్. ౪౦౩

## —: లంకా వృత్తాంత పటలము (౨౩).—

తే॥ సాంధ్యకృత్యముల్ రాముఁడు ♦ సలిపికొనియె
మనసుతపియింపఁబూవిల్లు ♦ మదనుఁడెత్తె
నాకసంబెల్ల నెఱ్ఱన ♦ యయ్యె మఱి జ
గమ్మునం జిమ్మ చీఁకటుల్ ♦ గ్రమ్మనయ్యె.

తే॥ దిక్కులఁ డాగియుండిన ♦ తిమిర సమితి, జలధి జలము భూమిని ముంచు ♦ చందమునను
పరవె నిండు కొలఁకు పూచు ♦ పగిది మిన్ను, తేజరిల్లె నక్షత్ర దీ ♦ ధితుల వలన.

తే॥ మహిత వివిధ సుందర వేణి ♦ మహి తనూజఁ, దలఁచి తపియించు రాముని ♦ నలఁగఁజేసి
నిసులఁ బూచు మల్లికలు రా ♦ ణించు వనము, ఋక్షయుక్తమైన గగనంబు ♦ రీతినొప్పె.

చ॥ తన యెనలేని నెమ్మొగము ♦ తామర నీటుగఁ జూపి వన్నె చు
ల్కనయొనరించి గెల్చిన యి ♦ లాతనుజాత విధుఁ జయింతు నే
నని పెను కందుతోఁ గినుక ♦ నబ్జుఁడు వెన్నెల కత్తి దూసి చో
ర నికర భీతిదుండయి బి ♦ రానఁ గనంబడెఁ దూర్పుదిక్కునన్. ౪౦౮

తే॥ గోచరముగాక యెచ్చోట ♦ గూఢరీతి, నున్న స్త్రీఛాయ యేరీతి ♦ నున్నఁ జాలుఁ
బట్టెద నటంచుఁ జంద్రుండు ♦ పరవునట్లు, వెన్నె లనియెడి పెనువల ♦ విసరివైచె నంత.

ఉ॥ మేలయి యొప్పు నాయెడలి ♦ మేదురవర్ణము గొంటకాక కీ
లాలిని రేచి నన్నను ర ♦ యంబునఁ గట్టఁ దలంచి రాముఁ డీ
లీలను డాసినాఁడని చ ♦ లించి యయుత్సుకతన్ దరంగలన్
గేలఁ దటంబు మోఁదుచును ♦ కేరినరీతి నెలర్చె నబ్ధియున్. ౪౦౯

తే॥ ప్రాఁతదై ఘోష మొనరించు ♦ వార్ధి ముదిమి, గొన్న మేనెల్లఁ దోలొల్చు ♦ కొమరు దోఁచు
సికతవేదులఁ బాలు పో ♦ సిన విధానఁ, బంచు వెన్నెల లెల్లెడఁ ♦ బరవఁదొడఁగె.

తే॥ మల్లికా విమ దంష్ట్రిలు ♦ మధుప దుర్గ, మెఱ్ఱని కమలు శైల వి ♦ వ్యాప్తియుఁ గలుగు
మలయ మారుత వ్యాఘ్రంబు ♦ మలయఁజొచ్చె, బెట్టు ధ్వనితో వియోగ హృ ♦ ద్భేదకముగ.

తే॥ వాలి యురమును ఖరు ఱొమ్ము ♦ సాలములను, తొలిచినట్టి శ్రీరాముని ♦ లలితవక్ష
మందు మదను నమ్ములతోడ ♦ నిందుకిరణ, జాలమను శాతఖడ్గంబు ♦ జాఱఁదూతె.

తే॥ ఒడలుచూచుఁబుడమిపట్టి ♦ యెడఁదఁదలఁచుఁ, గష్టములనెంచి చింతించుఁ ♦ గడలిఁ జూచు
దొంగదై చెలిఁ గొంపోవు ♦ ధూర్తులంక, దిక్కుచూచు రాముఁడు వింటి ♦ దిక్కుచూచు.

ఉ॥ చందము చిందు మేలివగ ♦ చందము నందము నొందుసీత మై
యందము డెందమందు పెను ♦ వందఁ దలంచి తపించి విభ్రమం

బొందిన రాఘవుండు పౌలు ♦ వుం దలపించెడు మౌక్తికంబులం
జెందిన పద్మరాగమనఁ ♦ జెల్లు ముఖంబును విస్మరించునే? ౪౧౪

తే॥ ఇట్లు పరితపించెడు రాము♦నినసుతుండు, డాసి కర్తవ్యమును తల♦పోసి చేయఁ
దగిన నీవిట్లు చింతింపఁ♦దగునె ? హితుని, పిలిచి యోచింపు మన రఘు♦వీరవరుఁడు.

తే॥ అంతఁ గొంత తెప్పిఱి మది♦చింతవీడి, యల విభీషణుఁ దోడి తె♦మ్మనుడు నతఁడు
పిలువ రాక్షసత్వము మాని♦వినుతపథము, నొంది నాతఁడు శ్రీరాము♦నొద్దఁజేరె.

తే॥ వికసితాంబుజాతె వనంబు♦విధముదోఁచు, వార్థి వేంద్రుండు తన పాద♦పద్మములకు
మ్రొక్కిన విభీషణాఖ్యుఁ గూ♦ర్చుండఁబెట్టి, మృదుల ఫణితి నిల్లసి ప్రేమ♦మీఱఁ బలికె.

తే॥ రావణుని స్వీయబలము దు♦ర్గంపు బలము, నంగబలమును మారుతి♦యచటఁ జూపు
విక్రమంబును నే విన♦విశదరీతిఁ, దెలుపుమా యన నాతండు♦నిలుచునంత. ౪౧౮

తే॥ వలదుకూర్చుండి యే తెల్ప♦వచ్చునన, నమ్రుఁడై యంజలిఘటించి♦నయముమీఱ
నడుగు ప్రశ్నములకు సంశ♦యంబు నీఁగఁ, దగు సమాధాన మిట్లు ప♦ల్కఁగఁదొడంగె.

తే॥ హనుమతండ్రియౌ వాయువు♦కనకశిఖరిఁ, బాఁపఁ జేఁదూని యుండ లే♦పంగఁ బ్రబిన
చేసి యల్త్రికూట శిఖర♦మీఁపమీఁప, జలధిలోఁబడవై చె నా♦స్థలమె లంక. ౪౨౦

తే॥ యోజనంబులు నూఱు లోఁ♦తొలయుచుండు, నేడునూఱులౌ నాకోట♦గోడ వెలువు
పొడవు గలదు జ్యోతిశ్చక్ర♦మునకు మించి, బలసియుండు లంకను చక్ర♦వాళ మట్లు.

తే॥ ప్రహరివనితనమును యంత్ర♦పద్ధతియును, బురుజులును తక్కఁగలయవి♦పొగడిచెప్ప
మనసువిసుగొందుఁబరిఖయే♦వనధియగును, మీరుచూడఁగలరు దాని♦మేల్మినింక.

సీ॥ ఉత్తరద్వారమం ♦ దుండు వీరులు రెండు, కోటులు కాలాంత ♦ కునకు సములు
పడమటి వాకిట♦ వారి కిమ్మడుఁగగు, వారు మృత్యువుఁ బోలు♦శూరవరులు
దక్షిణద్వారానఁ♦దగఁ బదునాఱు కో, టులు జము పంతంబుఁ♦గలఁచువారు
తూర్పు గవని వారు♦తొమ్మిది యేడు కో, టులు దిక్కరుల నేల♦నలఁచువారు

తే॥ నింగిఁ గన్నులు మూయక♦నిలుచువారు, గండు గలవారు ముప్పది♦రెండుకోట్లు
పగఱు నిర్జరు లెప్పుడో♦వత్తురనుచు, ధరణిపై నుంద్రు లెక్కకు♦దాఁటువారు.

తే॥ ప్రహరిలోపల వెలుపల♦బలసి కాచు, వారు తేఁకువగలవారు♦మారుతంబె
కుదువుగాఁగల్గి పెను గాలి♦వడగలవలె, మిన్ను వీథిఁ దిరుగువారు♦వేయికోట్లు. ౪౨౪

తే॥ నగర రక్షణ దుర్గముల్ ♦సొగసుమీఱి, మూఁడు గలవు వానిని గూర్చి♦పొగడనేల?
వానిఁ దొంబది కోటు ల♦వార్యబలులు, చెలఁగి రేయిం బవల్లు ర♦క్షించుచుంద్రు.

తే॥ తాజమమ్మాన మొంది వి♦క్రమమునంది, ధర్మదూరులై శత్రువుల్ ♦తాఁకువేళ
మంచననము తే పోవయ్య♦పడెదువారు, పదియు నాఱు నూఱుల కోట్లు♦పరఁగుచుంద్రు

ఆ॥ వినముకాఱు ఘోర♦వీక్షణ మవఁదగు, కనులవారు తిరుగు♦వనులవారు
అంతిపురము చుట్టు♦పఱువది నాలుగు, కోటు లమర వరులు♦క్రూరగుణులు ౪౨౭

ఆ॥ పదరి పదరి మఱియు♦వర్ణింప ఫలమేమి?, యుర్విఁ బంక్తివదనుఁ♦డుంచియున్న
సేన లోకముల న♦శింపఁ జేయఁగఁజాలి, వేయి వెల్వలగుచు♦ వెలయుచుండు. ౭౩౮
క॥ ఒక్కొక్కండి లోకమ్ముల, నుక్కునఁ జెకలింపఁజాలు♦నురుబలు లసురుల్
మొక్కలులు మణుల వాకిటఁ, గుక్కలవలెఁ గాచువారు♦కోటుల కోటుల్. ౭౩౯
తే॥ పరఁగుఁ దేరులు పదివేల♦పద్మసంఖ్య, అంతకంటెను రెండంతలు♦దంతిబలము
అంతకంటెను రెండంతలు♦హయముల బలము, అంతకంటెను లొట్టియలు రెం♦డంతలగును.
తే॥ నగరికోట యిట్టిదియు సే♦నాబలంబు, నిట్టి దీశ్వరుచేఁ గ్రత్తి♦నెసఁగఁ గొన్న
రావణునకుఁ దోడగునట్టి♦రక్కసులును, తపము ఫలముగా వర బలో♦ద్ధతి గలారు.
చ॥ యుగములు చెల్లఁగాఁ జెడక ♦ యుగ్రతపం బొనరించినాఁడు పెక్
జగడము లొండు దక్క మఱి ♦ సత్కృతు లేవియు లేనివాఁడు సే
న గలుగువాఁడు వక్ర రద♦నంబులు గొల్లను లేకయుండు ను
గ్ర నృహరిఁ బోలు వాఁడొకఁడ ♦ కంపనుఁ డబ్ధిని ద్రావు జాణఁడుర్.
తే॥ మేఘవాహను గెల్చిన♦మేటి యొక్కఁ, డున్నవాఁడు నికుంభుఁడర్♦పిన్నవాఁడు
కోపశీలుండు తొమ్మిది♦కోట్ల మత్త, గజ తురంగ రథాదులు♦గలుగువాఁడు.
తే॥ సిద్ధులను చెఱసాల నుం♦చిన ఘనుండు, కుంభుఁ డనెడి దైత్యుఁడు పది♦కోట్ల బలము
తనరువాఁడు కల్పాంత మా♦ర్తాండుకంటె, వేఁడి గలవాఁడు దుస్సహ♦వీరవరుఁడు.
తే॥ కరి పిశాచ తురగ ఖర♦కాండయుక్త, రథము లొక పదికోట్లు ప♦రంగువాఁడు
తల్లినైన వంచనముచే♦దాఱుమాఱు, పఱుపఁజాలు నేర్పరి మహో♦దరుఁడు గలఁడు.
ఉ॥ కొండలనుండు రెండు పది ♦ కోటుల సేనకు నాయకుండు నేఁ
డుండెడు వాఁడు రేపు గలఁ ♦ డోయను నానుడి సార్థకంబుగా
మెండుగఁ గన్నవారలను ♦ మ్రింగుచునుండును యజ్ఞనాశ కా
ఖ్యుండు భయంకరుండు బలి♦యుండు సురావలి గెల్చె వేమఱుల్. ౭౪౦
తే॥ నరసురాదుల వెవ్వేఱు♦పఱచి నిలుప, నొక్క దివమునఁ దినఁజాలు♦నుక్కడింద్రు
సాయుధులు రెండుకోట్లతో♦నమరువాఁడు, సూర్యశత్రుఁడు క్రూరదృ♦ష్టులు గలాఁడు.
తే॥ఋషులు సుమవన్నులును త్రిమూ♦ర్తులును చేరి,వలకుఁలం జూచి మాటాడ♦వలసినట్టి
బెట్టిదుఁడు మహాపార్శ్వుడర్♦వికృతకోపి, కలఁడు పదునాఱు కోటుల♦బలమువాఁడు.
తే॥తలకుఁబై ప్రక్కసూర్యుచం♦దంపు మోము, గలుగువాఁడెనిమిదికోట్ల♦బలమువాఁడు
వజ్రదంష్ట్రుండు జమునకుఁ♦బైని జముఁడు, శూలపాణి కసాధ్యుండు♦సుకృతవైరి.
తే॥చంచలత లేనిపదికోట్ల♦సైన్యములకు,దొర యసామాన్యబలుఁడసా♦ధ్యుండుయక్ష
సిద్ధసాధ్యగుహ్యకులహిం♦సించినాఁడు,మదయుతుఁడుపిశాచాఖ్యుఁడు♦న్మత్తుఁ డొకఁడు.
తే॥ చదురుగల చతురంగముల్♦పదియు నాల్గు, కోట్ల సైన్యములకు నాయ♦కుండు కొండ
లదర గర్జించువాఁడు తీ♦ర్యక్ప్రచారుఁ, డధికకోపి దుర్ముఖుఁడను♦సమరవరుఁడు.

తే॥ నాయకుఁడు పదికోట్ల సే♦నలకు ఖడ్గ, యుద్ధమునఁ బ్రసిద్ధుండు వి♦ద్యుద్ద్రుశుండు
మాపె విద్యాధరులకీర్తి♦మహిమ లెల్ల, ఘనబలుండు విరూపాక్షుఁ♦డనెడువాఁడు.

ఆ॥ శవ సమూహముల శ్మ♦శానంబునకుఁ బోవ, నీక పట్టి పండ్ల♦నిఱుకువాఁడు
పద్మసంఖ్య సైన్య♦పతి ధూమ్రవరుఁడు ధూ, మ్రాక్షుఁ డొక్కరుండ♦హార్యబలుఁడు.

తే॥ మందరముఁ బోలువారు దుర్మానయుతులు, కడలిఁబోలిన సైన్యంబు♦గలుగువారు
వారి పేర్వెన్న లోకము♦ల్వడఁకుచుండు, రణ శిరుండు వ్యమత్తుఁడన్♦రక్కసీంద్రు.

తే॥ ఇట్టి యుద్ధవీరుల లెక్క♦యిడఁగరాదు, వీరికంటె నిమ్మడి సేన♦వెలయువాఁడు
నమరదోహలుఁడు సమస్త♦సైన్యములకు, నధిపుఁడు ప్రహస్తుఁడను నిర్జ♦రాంతకుండు.

తే॥ ఇంద్రుచౌకంతి దిగ్గజ♦మెనసి యేడు, సంద్రముల దాఁటి యవలికిఁ♦జావుపరువు
వెట్ట దిక్కున కొకరుగా♦వేలువులును, పరుగులిడ శరవర్షంబు♦గురిసె వాఁడు.

ఉత్సా॥ తఱిమి వెల్లదంతి నాల్గు ♦ దంతములను వేరుతోఁ
బెఱికి వానితోడఁ గొట్టి ♦ వేల్పు లెల్ల దెసలకున్
వెఱచి పఱవ నరుణ నగము ♦ వెల్లియెత్తి తిరుగు నా
కరణిఁ దిరిగి సతఁడు కుంభ ♦ కర్ణుఁ డధిపు తమ్ముఁడౌ. ౪౪౭

ఉత్సా॥ చంద్ర రవులఁ జెఱనువైచె ♦ జయము వానిసొమ్ము తా
నింద్రుఁబట్టి కట్టువాఁత ♦ లిప్పుడుం గనంబడున్
సాంద్రకీర్తి గొన్నవాఁడు ♦ చాల మాయలొప్ప వాఁ
డింద్రజిత్తు రావణునకు ♦ జ్యేష్ఠసుతుఁడు భూవరా! ౪౪౮

,, చెనకి పాడివేల్పు తన్ను ♦ చెఱచునంచు నెంచఁడున్
వనజభవుని వలన విల్లు ♦ వరముగాఁగఁ బడసె వే
అనఘుఁ డింద్రుఁ డొకఁడు లేమి ♦ నన్నపేరు దాల్పలే
దనఁగనొప్ప నింద్రజితువ ♦ కవరజుఁ డతికాయుఁడౌ. ౪౪౯

తే॥ ముగురు మూర్తులెదిర్చిన♦మొక్కవోని, యరిది సత్త్వంబుగలుగు దే♦వాంతకుండు
త్రిశిరముఁడు నరాంతకుఁ డనఁ దిరుగువారు, రావణుని ముద్దు కొమరులు♦రాఘవేంద్ర!

సీ॥ అమరేశునకు సహా♦య బల మిట్టిది వాని, దార్ఢ్య మెఱింగి నం♦దాఁక వినుతు
వజాని పుత్త్రుండగు♦వల పులస్త్యుని పట్టి, సత్కృతియగు వి♦శ్రవసుని సుతుండు
బలు తపంబున బ్రహ్మ♦వలవను హరు వల, నను వరాలొంది యు♦న్నతి గడించెఁ
బంచభూతంబులు♦ పాంచభౌతికములు, నతని స్వాధీనంబు♦లై యడంగుఁ

తే॥ పార్వతీ పరమేశ్వరుల్♦భక్త పాల, నంబు పొంటె వేంచేయఁగ♦నలువుమీఱు
వెండికొండను పాదుతోఁ♦బెల్లగించి, నింగి దాఁకంగ నెత్తిన♦తుంగబలుఁడు.

తే॥ దిగ్గజంబుల దంతముల్♦దివిరి భుజము, లందు డిగ లెక్కసేయని♦యతిబలుండు
సుర గరుడ యక్షసాధ్య కిం♦పురుష నాగ, వరులు దేవచాడి పాఱంగఁ♦దఱిమినాఁడు.

తే॥ మణి కిరీట మస్తకములు♦మహిని కూలఁ, గాలకేయుల కులములఁ♦దూలఁజేసె
రావణుని పేరు విన్న మా♦త్రాన నిపుడు, నచటికాంతల గర్భంబు♦లవియుచుండు.

మ॥ ఘన రాజ్యేందిరయుఁ మహానిధులు లం♦కారాజ్య సర్వస్వముఁ
ఘనతం గోల్పడి బెబ్బులిం గనిన జిం♦కంబోలెఁ బొర్లాడి పే
తిని రాజ్యంబును పుష్పకంబు నెడగా♦దీనత్వముం బొంది యా
ధనదుం డిప్పుడు దాఁగినాఁ డలకలో♦దైత్యాస్వవాయాంతకా! ౪౫౪

ఉ॥ త్రాణచెడంగ వీఁపుపయి ♦ రక్తము లొల్కెడు పుండ్లఁ జూచుచుఁ
బాణ విఘాత జాత హతిఁ♦బొల్పడి యోర్వక యంతకుండు న్వ
ప్రాణములఁ హరించునని♦పాఱి దినంబులు లెక్కగొంచు గీ
ర్వాణ విరోధి నామమె జ♦పంబొనరించుచు నుండు రాఘవా! ౪౫౫

క॥ తరణి వఱకేల చెప్పఁగ, వరుణుని కన్నులును చొచ్చి♦యరయవు లంకన్
వరుణుఁడు పాశముఁ గోల్పడి, శరణముకై వడిగఁ బాఱి♦జడధిం దూఱెన్. ౪౫౬

ఉ॥ కొండలు పిండిసేయు రణ ♦ కోవిద కర్కశ బాహు దండముల్
కొండొకయు న్నలంగని య♦కుంఠిత విక్రమశాలి రావణో
ద్దండ పరాక్రమంబు తుద♦దాఁక వచింపఁ దరంబె? నీదు కో
దండవిముక్త బాణ శర♦దంబునఁగాక నశించునే యెటుల్? ౪౫౭

సీ॥ పావనిచేఁ గోట♦వాకిటి తోరణ, స్తంభంబుచే బల♦దర్పులైన
దనుజులు చదిసి చ♦చ్చినవారు సంద్రంపు, టిసుకకంటెను లెక్క♦కెచ్చువారు
తదితరుల్ వ్యాఘ్రంబు♦తఱుమంగఁ బాఱిన, జింకలక్రియఁ జెల్లఁ♦జెదరినారు
రక్త మేదో మాంస♦రాసులు ప్రేవుల, ప్రోవు లెల్లెడలను♦తావుకొనియె

తే॥ వీఁకతోఁ దాఁకు నక్షుని♦వింటితోడఁ, బట్టి నేలకు రాచిన♦పట్టి యనవ్యా
పలల మస్తిష్క శోణిత♦పంక మింక, నాఱకున్నది వర్ణించి♦తీఱునేమి? ౪౫౮

క॥ అమరుల నగరముతో మా, వము చూఱలు చేసినట్టి♦నాయకులను సై
న్యములను చుట్టంబుల ప్రా, ణములఁ జెఱచె దంతి చెదల♦నలఁచిన భంగిన్.

చ॥ ఎనుబది వేల సైనికు ల ♦ హీన బలాఢ్యులు కింకరాభిధుల్
హనుమని తాఁకఁగా మిగుల♦నాఁకలిగొన్న మృగేంద్రుడుకై వడిన్
గినిసి పరాక్రమించి వడిఁ♦గేలను కాలను వాలుతోడఁ గూ
ల్చెను త్రిపురాసుర ప్రతతి♦లీలను రుద్రుఁడు త్రుంచునై ఖరిన్. ౪౬౦

ఆ॥ జంబుమాలి గొప్ప♦సైన్యంబుతో వచ్చి, యంపవాన గురిసి♦హనుమ భుజము
నొంచ నితఁడు వాని♦యుంచిత ధనువుచే, తన కృతాంతు వేశ్మ♦మునకు నంపె.

తే॥ కనక దుర్గ వేష్టితము లం♦కాపురంబు, నందు నలఁగి తలలు పోయి♦నట్టివారు
లెక్కలేరు హనుమ గాల్ప♦లేచినట్టి, యగిని రక్తప్రవాహంబు♦నిగురఁజేసె.

తే॥ నాఁడు దాల్చిన విరులు చం◆దనము నగలు, వస్త్రములు మార్చకుండి న◆భంబునంద
యేడు దినములు నిలిచె లం◆కేశ్వరుండు, నగరి కాలిన తెఱఁగును◆పొగడనేల?

తే॥ నగరిఁగూర్చి కోటలఁగూర్చి◆తగినరీతి, వినిచితిని లంక కాలిన◆పిదప జేని
యాజ్ఞచే బ్రహ్మ మునుపటి◆యట్లె సృష్టి, చేసియున్నాఁడు జానకీ◆చిత్త నిలయ!

ఉ॥ ఆలమునం దెదిర్చిన ఖ◆రాదులఁ గూల్చుటచేతఁ గాద య
వ్వాలి నమోఘ బాణహతి◆వ్రాల్చుటచేతను గాద సంగరా
భీలుఁడు వాయుసూతి తొలి◆వేల్పుల మూఁకలఁ గూల్చుటల్ పురిం
దేలిక నగ్ని కాహుతిగ ◆ దీల్చుట నమ్మిక గొల్ప వచ్చితిన్. ౪౬౫

ఉ॥ స్నేహముచే నెలర్చిన వి ◆ శిష్టగుణుండు విభీషణుండు సం
దేహము లేని శేవ నిగ ◆ దించిన పల్కుల నాలకించి వై
దేహిని పాయు హేతువున ◆ దీల్పడి సన్ననమైన బాహువుల్
దేహముతోడ నుబ్బ జగ ◆ తీపతి మారుతిఁ గాంచి యిట్లనున్. ౪౬౬

సీ॥ వీరవరేణ్య! వి◆ద్వేషి సైన్యంబులో, సగముపైఁబడ నీవ◆చంపివైచి
రావణుపురము పూ◆ర్ణంబుగాఁ గాల్చి నీ, ఘనపరాక్రమము నే◆వినుచునిండ
శుకవాణి జానకిఁ◆జూచి తోడ్కొని రాక, మరలుట చూడ నా◆శరబలంబు
తెలిపింపఁగోరి యి◆త్తెఱఁగున వచ్చితి, వని మనంబున నెంచి◆తనిసినాఁడ

తే॥ నీవు చూపిన మగఁటిమి◆నిండియున్న, వైరి నగరాన మఱికొన్ని◆వీరకృత్య
ముల నొనర్తము గాని నీ◆పొగడు నెదుట, భాను నెదుటి దీపమువలెఁ◆బ్రబలఁగలదె?

తే॥ మద్బలంబును రావణు◆మహిత బలము, నీదిగాఁ జేసికొంటివి◆నిపుణచరిత!
వనజభవపద మీజన్మ◆మునకుఁ బిదపఁ, బడయుమా నీకుఁగాఁగ నే◆ర్పఱచినాఁడ.

చ॥ అని రఘురామమూర్తి పలు ◆ కాడఁగ నంజలిచేసి యంజనా
తనయుఁడు సిగ్గునొంది వసు ◆ ధాస్థలిఁ జూచుచు నూరకుండె నె
మ్మనముల నుబ్బి ముక్తిగొను ◆ మాన్యులభంగిని మోదవార్ధిలో
మునుఁగుచు నోలలాడి రిన ◆ పుత్త్రుఁడుఁ దక్కిన కీశబృందముల్. ౪౬౭

—: ౬. వరుణ ప్రార్థన పటలము :— (౪౫)

సీ॥ ప్రథిత విజ్ఞాన పం◆పన్న! విభీషణ! కడలి కట్టుటకు లోఁ◆బడునయేని
మూఁడు లోకములును◆భుజ బలంబున వడ, చుటయు నాశంబు నే◆యుటయునరుదె?
ఉత్సాహవంతమై◆యున్న యీమనసేన, జలధి దాఁటుట యెట్లొ◆తెలుపుమనఁగ
మరలవచ్చియున్న నీ◆మహిమంబు నెఱుఁగఁడే, శరధి మీకులము సా◆గరుల వలనఁ
బ్రవర్ధంబదెఁ గావఁ బ్రేమ వ◆రం బొసంగుమనము దాఁటంగ మార్గమి◆మ్మని సముద్ర
దేవుని రఘువర్ధిని◆విమల హృదయ!, యని విభీషణుఁ డాడంగ◆నాత్మ నలరి.

తే॥ లెస్స వచియించి తంచుఁ దా♦లిమిని పొగడి, అక్కనుత విభీషణ పవ♦నాత్మజాదు
లెల్లఁ గ్రేవల రా నాప♦గేశతీర, మునకుఁ జనునంత నినుఁడును♦పొడమెఁ దూర్పు.

తే॥ వేఁడి వెలుఁగుచేఁ జీకటుల్♦విరియునంత, షోడశ కలాప్రపూర్ణుఁడౌ♦సుందర శశి
యరయ రాహువు మ్రింగి వె♦ల్వెఁజచుచున్న, చందమునఁ దోఁచెఁ గాంతులు♦
సమసిపోవ

మ॥ యువతీరత్నము సీతఁ దెచ్చుటకునై ♦ యుర్వీశ సింహుఁడు రా
ఘవ చంద్రుండొక త్రోవ యిమ్మనుచుఁ గాం♦క్షన్ వేఁడఁగాఁ గోరి శా
స్త్ర విశిష్టంబగు పద్ధతిం జలుప క♦ర్ఘప్రస్తరంబందు వే
డ్క వసించెన్ జపియించె శ్రద్ధ వరుణాం♦కంబైన సన్మంత్రమున్

ఉ॥ మేనఁ బరాగముం బొలయ♦మిక్కిలి యెండ మొగంబుపైఁ బడన్
జానుగఁ గన్ను మోడ్చి యొక♦జాము యుగంబుగఁ దోఁప నేఁడు నా
ళ్లూని వసించి తోయములు♦నోగిర మంటక వేఁడ నీరధీ
శానుఁడు సంతసింపఁడు ప్ర♦సన్నుఁడు గాఁడును పల్కరింపఁడున్. ౪౭౪

మ॥ బలవంతుండయి యీ నదీశ్వరుఁడు నన్ ♦ భంగించుచున్నాఁడు ని
శ్చలితుండై యవుఁ గాదనండు మది నా♦సంతాపముం గానఁ డీ
లలి భీష్మించుచు దాఁగినాఁడని కృపా♦లంకారుఁ డా రాముఁ డ
గ్గలికన్ జూచెదనంచు వంచె బొమలు♦ గ్రక్రోధ దుర్వీక్షుఁడై. ౪౭౫

ఉ॥ కోరనివారలైన నొక♦కోరిక నొక్కనియొద్దఁ జేరుచున్
గోరికిఁ దెల్పఁగాఁ బిసిని♦గొట్టు స్వభావగుణంబు వీడునే!
వారిధిఁ ద్రోవ యిమ్మనినఁ♦బల్కఁడు చూడఁడు మేలుమేలు! నా
శూరత వీనికింత రుచి♦చూపెదఁగాకని నవ్వెఁ గిన్కమై. ౪౭౬

ఆ॥ దైత్యుఁ డపహరింప♦దారను గోల్పోయి, పరువుచెడిన వింటి♦బరువుమోసె
ననుచు నెంచి చుల్కఁ♦దనము చేసినవాఁడు, గావలయును జడధి♦కరుణమాని

తే॥ తోడుపడికొంటపొగడిత♦తోడఁగొనుట, బలిమిగైకొంట యనుమూఁడు♦పద్ధతులె జ
గంబునం గల్గు; వేఁడియు♦గౌరవంబు, పాడిచెడ డాఁగెఁ బలికియు♦ఫలముగలదె?

తే॥ అడవులంజొచ్చి కాయలు♦నాకులుదిని, యొడలు పెంచువాఁడని యెంచు♦జడధి గొప్ప
తనము నల్పమానవుశక్తి♦తగ్గు హెచ్చు, లెఱుఁగుదురు గాక వేలుపు♦లెల్లనింక.

ఉ॥ నింద యటంచు జంకి ఘన♦నిష్ఠను వేఁడఁ దిరస్కరించి స
న్నెందును గాక చూచిన న♦దీశ్వరు లేద్వరు మండి మాఁడఁగా
డెందమునందు పుట్టిన క♦డింది భయంబునఁ బంచభూతముల్
నందడిఁ బ్రాణభిక్ష గొని♦సాగఁ జరింతురు గాక వానరుల్. ౪౮౦

ఉ॥ మోక్షము నొందినట్టి ముని ♦ ముఖ్యులె యైనను చూచు వేడ్కతో
నక్షితిఁ జేరరేని ధన ♦ హీనత గాంచిన యంత గౌరవ
ప్రేక్షణముల్ వహింపఁ గన ♦ రెవ్వరు; కుట్టకయున్నఁ దేలె? భో
గక్షములెందునే నివులు ♦ గప్పిన నిప్పును లెక్కగొందురే! ౪౮౧

చ॥ వనచరులెల్లఁ గాల్నడనె ♦ వారిధి దాఁటుదు రింక లక్ష్మణా!
ధనువిటు తెమ్మ యంచుఁ గడు ♦ దారుణ కోప పరీతచిత్తుఁడై
కనఁ దన తమ్ముఁడిచ్చినను ♦ కన్నులతో ఘనచింతతో శరా
సనము నొసంగ రాఘవుఁడు ♦ సవ్వడిగాఁగ గుణంబు నెక్కిడెన్. ౪౮౨

ఆ॥ ధనువు నెక్కువెట్టి♦కొనయమ్ము లాగఁగాఁ, గలిగినట్టి పేరు♦టులివు హరుని
కొమ్మ యొందు ప్రణయ♦కోపంబు నడలించె, జగము లొక్కసారి♦సంచలించె.

ఉ॥ మేలగువానిలో మిగుల ♦ మేలగు తూపులు వర్షధారలం
బోలి యుగాంతకాలమున ♦ భూమి జలంబులఁ ద్రావు భాస్కరుం
బోలి పురారినేత్రమును ♦ పోలి మహాలయ కాల పావకుం
బోలి సముద్రమెల్ల నొక ♦ మూర్తము లోపలఁ గ్రమ్మె దండడిన్.

సీ॥ కులశైలములకంటె♦బలమైన కోదండ, మును మండలాకార♦ముగను వంచి
నిఖిల చరాచర♦నికరంబుఁ బ్రళయ వే, శను కాల్చు నగ్ని కీ♦లలకు మించి
నగములు మత్స్యముల్♦నాగు లింధనముగా, తదితరంబులు చిన్న♦చిదుగులుగను
కడలి నీరము నెయ్యి♦గా రామబాణాగ్ని, గొఱల వారిధి యగ్ని♦కుండమయ్యె
తే॥ నేడు జలధులలోఁ బొగ♦లెగయఁగా న, భంబుఁ గప్పుచుఁ జక్రవా♦ళంబు నవలి
చిమ్మచీఁకటిఁ బోఁగొట్టి♦బమ్మగోళ, మగ్ని గోళమయయ్యెఁ బో♦యనఁగఁ జేసె.

క॥ నెఱఁకులు చుఱుక్కుమనఁగాఁ, జొఱమీలును చొక్కి యొఱఁగ♦సురతరువులు చి
చ్చుఱ పిడుగులక్రియఁ బడు తుం, పఱచే మాఁడంగ రామ♦బాణము లడరెన్.

క॥ మిడుఁగుఱులతోడి జ్వాలలు, పొడమఁగ బొగ్గులయి రాలె♦మొగుళుల గములున్
జడధి బడబాగ్ని వలెఁగా, వడిఁ గమరె నటించు వేల్పు♦పడఁతుల కురులున్. ౪౮౩

తే॥ లెక్కయిడరాక నెత్తురుల్♦గ్రక్కి తేలె, మకర నికరంబులును పెక్కు♦మడిసి తేలి
కొరలెఁ దిమి తిమింగిల తిమిం♦గిలగిలములు, రామశరములు వారాశిఁ♦ద్రచ్చి కాల్ప

తే॥ బూది పొగయంగ నగ్నులు♦పుట్టి కొండ, లన్నియుం గాల వేకోట్ల♦యంపగములు
కోరఁగ నదులతో బురదతో♦శరధి మాఁడఁ, బాఁపఱేని తలలు గాన♦వచ్చెనందు.

తే॥ మాటదప్పిన యొకదొడ్డ♦మనుజకులము, సరణి నిర్మూలమయ్యె మ♦త్స్యముల కులము
త్రాళ్ళములతోడ వావలు♦జరగునట్లు, వీఁపుపై బాణములతోడ♦వెలసె మీలు.

తే॥ క్రొత్తలై నిశిత శరములు♦వెలుఁగుకతనఁ, గొన్ని యుడుకుచు మాఁడి బొగ్గులయి బూది
యయ్యె నట్టితో బాణాగ్ను♦లలముకతనఁ, గంధి యొప్పె సంధ్యాకాల♦గగనమనఁగ.

తే॥ రామ శితసాయకాగ్నులు♦ క్రావసిర, మున్న వో లేదొ యననొప్పె♦నుదధి యొక్క
ప్రమిదఁ బోలఁగ నేతిలోఁ♦ గ్రాఁగినట్టి. వానిఁ బోలెను జలచర♦ ప్రతతి చూడ.
తే॥ శిత శిలీముఖములు రక్త♦సిక్తముఖము, లగుచు జలమెల్లఁ ద్రావ ర♦క్తాళి బయలు
పడఁగ జడనిధియుదుకు చా♦ర్పంగ రాని, మిడుఁగుఱులఁ జెదర్చుచునుండె♦ మితము మీఱి.
తే॥ ఎల్లయెడ బయలుగ జల♦మింకిపోవ, సంబరువునైచి దుంపలు♦ శాకములును
నరుగులుగఁ జేసి యుంచిన♦ కరణి నొప్పెఁ, గ్రొప్పినట్టి మత్స్యములును♦ కూర్మసతతి.
తే॥ ఉలివుతో వచ్చు బాణమ్ము♦లొండొకండు, దాఁకి వెదురుటడవిఁ బోలె♦ దవము రేఁప
నెల్లజంతువు లుడుకుచుఁ♦ ద్రెల్లుచుండె, నవ్వి క్రక్కిన శోణిత♦ మలలు పాఱె
ఆ॥ కొండగములనుండు♦ కుజములు తుండ్లయి, కడలి జలము పైని♦ బడుచునుండ
మండుచుండెఁ జముర♦ మఱిమఱి చల్లంగ, నాఱకుండ మండు♦ నంగమునను.
తే॥ రామవిభుఁడు పరవు శర♦స్తోమ మజుని, యస్త్రమట్టు లమోఘంబు♦ లగుచు మనను
కంటె వడియయిమిడుఁగుఱుల్♦ గలుగఁ జేయు, గొప్ప పద్మాకరము క్రియఁ♦ గొఱలె శరధి.
తే॥ ఉత్తములు కోపగించిన♦ నోదవు మేలె, యనుట నిచ్చోట దృష్టాంత♦మయ్యె వార్ధి
యుప్పుకడలి యనెడి పేరు♦ తప్పి శుద్ధ, జలధియయ్యెను శ్రీరాము♦ చలము కతన.

చ॥ క్రమముగ నండగోళములు ♦ గర్భమునం గొని కాచు విష్ణు నం
శమగు రఘూద్వహుం డనద్య ♦ శ ప్రదరంబులచేఁ బయోధి తో
యముల నశింపఁజేయు టొక ♦ యబ్రమె? లోకములన్ జలంబు నీ
రములను వహ్ని మ్రింగునను ♦ ప్రాక్తనవాక్యము నిల్పె గట్టిగన్. ౧౯౯
చ॥ చిరముగ వార్ధిలోనన వ ♦ సించుచు శ్రీశుని పాదచింత ని
బ్బరముగఁ జేయుచుండు ఋషి ♦ వర్యుల కెగ్గొక యింత లేద; యు
ద్ధురముగ నన్నిదిక్కులను ♦ ధూమ సమూహము పర్వ దట్టమై
తరణి గుఱాలు నల్లనయి ♦ దారి తడంబడ నిల్చె దిగ్భ్రమన్. ౨౦౦
చ॥ దురమున భీకరుండయిన ♦ తోయజనేత్రుఁడు మా యవస్థ దా
నరసియు లెక్కనేయని య♦నార్యుని పోలిక నుండెనంచు నం
బరమున సంచరించు జల♦పక్షులు పెంటులఁ బాసి చింతమైఁ
గరఁగుచు నిప్పుముట్టి యొఱ ♦ కల్ గమరం బడి చచ్చె నంబుధిన్.
ఉ॥ ఓరువు వీడ హేతువయి♦ యొప్పిన వారిధి నిప్పు నిండఁగాఁ
జేరిచి వేణుకాననము♦ వీఁక వహింప వచింపఁ బోలునే?
తోరపు జేర్పులై యడరు ♦ ధూమ సమూహము చుట్టుకొంటచే
నాఱిచెఁ గన్నుదోయి నమ ♦ రావళి మేనులు చెమ్మరింపఁగన్. ౨౦౧
సీ॥ పూలపైనను పోవఁ♦ జాలని మృదుపద, కంజాత జానకి♦ గతులకోడి
యవమతి నొందిన♦ హంసలెల్లను వహ్ని, నెఱియని త్రోవ గా♦న్పింపకుంటఁ

బఱవఁ జాలనివయి♦వరుణుని కీర్తి కై, వడి జడధింబడి♦యడఁగి పోయె
మొగుళులు మండెడు ♦ నగముల కై వడి, నింగి నిల్వఁగలేక ♦ క్రుంగిపడియెఁ

తే॥ ఒచ్చి చచ్చి కూలఁగఁ గొన్ని♦చావకుండుఁ, గొన్ని పులుఁగులు గుడి దిరు♦గుచును పొగలు
గ్రమ్మ గ్రుడ్లు పెట్టిన చోటు♦గానలేక, ముత్తెములఁగాంచి భ్రాంతిచేఁ ♦ బొదుగఁజేరు.

మ॥ జలజాతేక్షణు రామచంద్రు నరుగా♦సామాన్యగా నెంచియే
చులుకం జూచితి మింతవచ్చె ననుచున్♦శుష్కించుచుం బెక్కు సి
ల్గులకున్ లోనయి పండ్లగుల్చుచును ది♦క్కుల్ దోఁప కల్లాడుచున్
జలశాఖా మృగసంచయం బడలెఁ బ♦శ్చాత్తాపముం బొందుచున్.

ఆ॥ దుష్టకార్యములను♦దూకొని చేయుచు, సంద్రమందు దాఁగి♦సంచరించు
చుండునట్టి వార♦లుగ్ర మాంసాశను, లట్టె యుడికి తెట్టె♦గట్టినారు. ౫౦౧

తే॥ గొప్ప పైఁడి విమానముల్♦కుండ లవిసి, పిదపఁ గరఁగుచుఁ బడినవి♦వేల్పుటేటి
దండిజలము తుంపురులతో♦వండుగట్టి, యెండె నుడు గణ ముడుకుచు♦నిలకురాలె.

తే॥ చేవ గలవి నిప్పులు రేఁచు♦తేవ గలవి, పద్ధతిం జనునవి తప♦స్సిద్ధి గలవి
పెక్కురూపముల్ గొనునవై♦విశిఖ వితతి, కంధి జీవన మానె న♦గస్త్యుఁబోలి.

క॥ వనధిఁ బొడము నగ్గిని దై, త్యుని పురిలోఁ బ్రవారి కరఁగ♦నుప్పరిగలు మం
డినఁ గని పౌరులు పదపడి, హనుమానుఁడు వచ్చెననుచు♦నడలిరి పెలుచన్. ౫౦౨

తే॥ ఉదయభానునివలె వెలుఁ♦గొందుచుండు, మలత్రికూటంబు బంగరు♦మాడ్కిఁ గరఁగి
శోణితము పడనయ్యెఁగిం♦శుకము కరణిఁ, బొనుఁగువడి ప్రవాళంబులు♦బొగ్గులయ్యె.

తే॥ కులగిరులవంటివగు కొన్ని♦గొప్పమీలు, నెలవు నెమ్మది చెడి లోఁతు♦నీటి కేగి
జలముకంటెను వహ్ని యే♦చల్లనైన, దంచు భూమిపైఁబడి తత్త♦రించుచుండె.

తే॥ కడలి కలగుండు వడ నుడ♦కములఁ ద్రావి, మఱియు నీరు లేకుంటచే♦మనుజులెల్ల
దిగ్భ్రమమునొందఁ బాతాళ♦తిమిరచయము, తలఁగనేగె నారాచముల్♦తపనుభంగి.

తే॥ అంబుధులలోని యుప్పనీ♦రంబుఁ ద్రావి, చాల దగయెత్తి శ్రీరామ♦సాయకములు
త్రావ నీరులేమిని యండ♦తతులఁ దొలిచి, కొనుచు వడినేగె నందలి♦వననిధులకు.

ఉ॥ లీల నయోముఖంబులు శి♦లీముఖము ల్గల రామబాణముల్
వాలి సముద్రమున్ బయలు ♦ వాఱఁగఁ జేయఁగ రత్నసంతతుల్
చీలిన భూమి గర్భమునఁ ♦ జిందెడు రక్తము రీతి వెల్వడెన్
వాలిన నాగజాలములు ♦ మేలిన ప్రేవుల తేవఁ గన్పడెన్. ౫౦౩

తే॥ అంబువులు వట్టిపోవ ర♦త్నాకరములు, భాగ్యశాలి మణుల్గు నించు♦భవనములను
బోలె నారవముల్గ మిండ♦ములకుఁ బొడుచు, కొనఁగ నయ్యావి యుబుకల♦కొమరుదాల్చె.

తే॥ వేలకొలఁది చీలికలయి♦విద్రుమములు, మౌక్తికంబులు రత్నముల్♦మలసె జగతి
గొప్పవారు కోపించినఁ♦గోపగింపఁ, బడినవారు మేలొందక ♦ చెడుదు రేమి?

క॥ సలసలఁ గ్రాఁగిన యాజల, ములఁ జచ్చిన జీవవితతి♦ముక్తిని పొందెన్
జలజాక్షునిచేఁ జచ్చిన, యలుపులకును ముక్తి దొరకు ♦ టరుదే తలఁపన్?

తే॥ అనల శరములు మిక్కిలి♦యలమికొనఁగ, ధారణీదేవి సిలంపుఁ♦జీర విడిచి
మొగ్గపూల రంగులతోడ♦ నెలమి గులుకు, చీర నడుముసఁ గట్టెన♦చెన్ను దోఁచ

తే॥ విజయ శీలుఁడౌ రాముని♦విశిఖ వహ్ని, త్రావినట్టి కడలి విడి♦తావు వేఱు
వెదకికొన లేచుక్రియ విజృం♦భించె బడబ, యితర పాండితి మెచ్చు పం♦డితులె యరిది.

తే॥ జగము నడఁగించుకొని యాక♦సంబు గూడ, నలమి బడబాగ్ని యప్పుడు♦విలయ వేళ
లోకముల నాశమొనరింప♦వీఁక లేచు, పెను మహార్ణవ మట్టులు♦పెఱిగి లేచె.

తే॥ ఊర్ధ్వముఖుమై ప్రాణించి♦యుడుకు చూపఁ, గ్రతుభుజులు లేచి సత్యలో♦కంబు దనుక
నెడలుచుండిరి వేఁడిమి♦తోడఁకసీక, యింక భూజనములఁ గూర్చి♦యేమి చెప్ప!

తే॥ జగము సిలుగొందునని యెంచఁ♦జాల నిప్రుడు, వరుణుని చటికి రప్పించు♦వాఁడ ననుచు
నధిక కోప సంయుక్తుఁడై♦యవని విభుఁడు, చెలసి బ్రహ్మాస్త్రమును కుడి♦చేతఁ గొనియె

క॥ వడఁకిరి వేల్పులు మొగుళులు, పిడుగుల వెడలించెఁ బుడమి♦బీఁటలువాఱెన్
తడఁబడి జీవులు వెలవెల, పడియెన్ నదులెల్ల నింకి♦వండలి గట్టెన్. ౨౩

ఆ॥ అండగోళమునకు♦నావలి జలధులే, యుడికెనన్న భూమి♦నున్నవానిఁ
జెప్పనేల? మఱిఁగె♦శివుని జటాగంగ, యజు కమండలూ జల♦మల్లనుడికె.

ఆ॥ లోకనాథుఁడైన♦కాకుత్స్థ వర్యుని, యరయలేక నునలె♦వరుణుఁ డిట్టు
లితనికంటె మూర్ఖు♦లెవరని ప్రాజ్ఞులు, తలఁచి చింతనొంది♦తల్లడిలిరి. ౨౪

చ॥ తలఁపునఁ జేసి తొట్టతొలు ♦ తన్ దనుదానె సృజించికొంచు న
వ్వల జగముల్ సృజించి పరి♦పాలన సేయు విభుండు కోప మ
గ్గలముగఁ బూనె నింక బ్రతు♦కం గలవార మె? యంచు నెల్ల ప్రా
ణులు తపియింపసాగె వరు♦ణున్ తపియించుచుఁ బ్రాణ భీతిచే. ౨౫

—: వరుణుఁడు రాముంజేరి శరణు వేఁడుట :—

మ॥ పొగచేఁ జూడఁగలేని నేత్రములతోఁ ♦ బుంఖానుపుంఖంబులై
తగులం బాఱిన మేని బాణములతో♦ దైవాఱు జ్వాలాళితో
దిగులెగ్గాడు మనంబుతో వణఁకుతో♦దీల్పడ్డ కేలోడ్పుతోఁ
దగు వేడ్కోలులతో సముద్రపతి సీ♦తానాథుఁ జేరన్వడిన్. ౨౬

తే॥ కడలి కడవలనుంటి లెం♦కనగు నేను, గాన నీపిల్పు వినవైతిఁ♦గరుణఁజూడు
మనుచు నిప్పుపై నడతెంచు♦జనుని పగిది, పలతపై వచ్చె నడచుచు♦జలధి తేఁడు.

మ॥ సురుఁగర్ మాఁడిన మోముతో వెగపుతో ♦ శోకంబుతో నన్యథా
శరణం నాస్తి యటన్న వాక్యములతో ♦ శంకించుచుర్ గ్రుడ్డి వై
ఖరిఁ దొట్రిల్లుచుఁ గ్రుంగు పాదములతోఁ♦గాన్పించు నబ్ధీశుఁ డ
క్కరుణావారిధిఁ గాంచి యిట్లనియె నుత్కంపంబు హెచ్చిల్లఁగర్.

సీ॥ లోకేశ నీవె యీ♦జోకఁ గోపించిన, మాకేది శరణ మీ♦లోకమందు
నీకసాధ్యం బేది? నిన్నాదరించు స, త్త్వము మాకుఁ గలదె? స♦త్యప్రకాశ
నీరధు లీవ య♦గ్నియు నీవ విలయంబు, నీవలననె కదా♦నెగడుచుండు
లోకంబులను నీవ♦లోకాంతరస్థ భూ, తంబులు నీవ త♦త్త్వంబు నీవ
తే॥ జగములను పాదమించి ర♦క్షణము సేసి, యుదరమునఁ బదిలంబుగ♦నుంచుకొందు
నీవు కినిసిన లోకముల్ ♦నిలువఁగలవె? సర్వలోకాంతరాత్మక♦శరణు శరణు.

తే॥ దిగ్భ్రమకుఁ గారణంబగు♦తిమిరవనముఁ, గిరణ ఖడ్గంబుచేఁ ద్రెంచు♦తరణిలోన
నుండు జ్యోతివి బ్రహ్మము♦లొండఁ గలుగు, పొక్కిలి గలట్టి ప్రాక్తన♦పురుష! శరణు.

తే॥ సర్వ భూతాంతరాత్మక♦శరణు శరణు, సకల భూతకారణ భూత♦శరణు శరణు
సాధు జనచయ సంత్రాణ♦శరణు శరణు, సామజేంద్ర సంరక్షణ♦శరణు శరణు.

తే॥ తల్లియును తండ్రియును సమ♦స్తంబు నీవ, మోక్ష నరకము లాద్యంత♦ములును నీవ
యేను దాస దాసుండ ని♦న్నెఱుఁగఁగలనె! నిన్ను నీవ యెఱుఁగకుందు♦నిక్కలంక!

ఉ॥ నేరక పిన్న వార లొక ♦ నేరమి చేసిరయేని పెద్దవా
రోరిచి బుద్ధి చెప్పఁదగు ♦ నో జననాయక! కావుమంచు మే
ల్హారము సూర్యతేజ నిభ♦మైన దొకండు ధరిత్రినుంచి యా
సారసనేత్రు పాదముల ♦ సన్నిధి వ్రాలె నిలాతలంబునన్. ౨౩౩

తే॥ వ్రాలి మంటలతోడి గా♦త్రంబు చూపి, పిచ్చుకపయి బ్రహ్మాస్త్రంబు♦విడువఁ దగునె?
యనుచు వేఁడ రాముని కోప♦మంతరించె, పొంగు పాలలో నీర్వడు♦పోలువుదోఁప.

క॥ గోపము పీడిత భయమును, తాపంబును విడుము భక్తి♦తాత్పర్యములం
బ్రాపింప వేఁడ రాకిట్టు, కోపింపఁగ వచ్చు కతము♦కోరెదఁ దెలియర్.

చ॥ అన వరుణుండు రాముఁగని ♦ యార్య! భవత్సతి శాంతరూప యా
జనకజ చెందినట్టి యగ ♦ చాట్లును నీవును కోరి పిల్చుటల్
మును విననైతి నేడవ స ♦ ముద్రమునం గల మీలు కయ్యముం
జెనుపఁగఁ దీర్ప నేగితి క్ష ♦ మింపుము హేతువు వేఱు లేదిఁకర్. ౨౩౬

తే॥ వరుణునకు ప్రీతి చేసి రాముఁడు♦కరుణచెంది, దైవనగుఁగాక యీయమో♦ఘాస్త్రమునకు
నేమి లక్ష్యంబు చూపెదు♦తెలియఁబలుకు, మనిన బ్రతికితి నని యాతఁ♦డనియె నిట్లు.

తే॥ అనఘ! మరుకాంతార♦మనెడి దీవి, యందు దైత్యులు పలుకోటు♦లమరినారు
జగమునకు వారు బాధలు♦పలువు చుంద్రు, వారిపై నీ మహాస్త్రంబు♦వదలు మనఁగ

క॥ పూతుఁడు శాస్త్ర జ్ఞానా, తీతుఁడు రాముండు విడిచె♦దివిరి శరంబుల్
ఘాతుకులను పరిమాపిచి, సీతాపతి కడకు నదియుఁ♦జేరె క్షణమునన్. ౫౩౯

క॥ పరిశీలన గుణమొప్పఁగ, నెఱి దప్పకయుండు జనికి♦నెగడునె కీడుల్ ?
వరుణునిపైఁ బొడమిన కటి, కరి దుష్టులు రాక్షసులకె♦కష్టము గొలిపెన్. ౫౪౦

తే॥ చాలదూరము పోయి ము♦ష్కరులఁ జంపె, శాంతమూర్తులౌ పెద్దల♦శాపమట్లు
రామచంద్రు నమోఘ శ♦రంబు జగతి, ధర్మమె జలీయమనుట సా♦ర్థకముగాఁగ.

మ॥ జలధీశం గని రాముఁడిట్టులను ర ♦ క్షన్ వేడ మన్నించితిన్
బలుదుష్టుల్ దితిజాళి నాశగడు గూ ♦ ర్పంబూని పాథోధియన్
పులుకాల్చన్ దమ కోటగాఁగొని మహా ♦ మోదంబుతోఁ జేయు తోం
గలి నృత్యంబులు మానునట్టు లోక మా♦ర్గం బీయవే మాకనన్. ౫౪౨

సీ॥ జగముల వ్యాప్తికి ♦ నరుదులు లేనట్లు, లోఁతునకును వెడ ♦ ల్పునకు మేర
లేదు సీరంశ నె ♦ న్నో దినంబులు వట్టు, నంతకాలము నిల్వ ♦ నైతిగాదు
జడకై వడి ఘనీ♦భావ మొందుదునన్న, మలఁగి నాలోని ప్రా♦ణులు నశించు
నాపై నిడిన వృక్ష♦నగ శిలాదికములఁ, దొలఁగనీయక తేల్చి♦నిలుపువాఁడ

తే॥ సేతు వొకఁడు నీపేర నా♦శిరముమీఁద, నమర నీసేన నడపింపు♦సమరభీమ !
రామ ! సద్గుణధామ ! దు♦ర్జనవిరామ !. శుభదనామ ! మునిస్తోమ♦నూక్తిసీమ !

సీ॥ అని వరుణుఁడు పల్క♦విని సంతసమునంది, కాకుత్స్థ వర్యుండు♦కడఁకతోడ
నీమహా సత్కార్య♦మే చేయుదము వార్ధి, శ్రేష్ఠత మనచే న♦శించెనేని
తక్కిననాల్గు భూ♦తములును చులుకఁద, నంబు నొందును గాన♦నయముమీఱ
పర్వత ఘనవృక్ష ♦ వారంబులం దెచ్చి, కట్టుఁడు సేతువు ♦ గట్టిగాఁగ

తే॥ ననుచు వానర వరులకు♦నాజ్ఞ యొసఁగి, యిరవునకు నేగ రాముని♦కరుణతోడి
వీడికోలు గైకొని యబ్ధి♦విభుఁడు వోయె, నుత్సహించిరి వనచరు♦లుదధిఁగట్ట.

—: 2 సేతు బంధన పటలము :— (౭౧)

తే॥ వానరేంద్రుఁడు రాక్షసే♦శ్వరుఁడు జ్ఞాన, సిద్ధులగు కపివరులు యో♦చించి నలుని
పిలిచి సేతుబంధనము గా♦వింపు మిదియ, యిపుడు ముఖ్యకర్తవ్యమం♦చెఱుకపఱుప

క॥ పలుమాటలేల మేసవు, నలుసును సమమగు తెఱంగు♦నాజ్ఞెంబుగ నీ
జలధిం గట్టెద విరివిగ, శిలలు తరులు గిరులు దేరఁ♦జెప్పుఁడి కపులకున్. ౫౪౬

క॥ అని నలుఁడన నజుపుత్త్రుఁడు, వనధిని పూడ్పంగ రండు♦వనచరులారా !
యని చాటింపఁగ వచ్చిరి, గొనకొని యొండొకరు త్రోసి♦కొని యుత్సుకులై.

తే॥ రామ లక్ష్మణ వానర♦రాక్షసేంద్రు, లరుదుగాఁ జూచుచుండ వ♦నాటు లెల్ల
భుజశిరంబులపై గిరుల్♦మోచి తెచ్చి, రుదధులాఱొక్కటింబూడ్ప♦నొలయుకరణి.

క॥ కొన్ని పెకలించుచుండఁగఁ, గొన్ని ప్లవంగంబు లీడ్చి♦కొనివచ్చెను వే
కొన్ని శిరంబుల మోచెను, గొన్ని కడలి దించెఁ గొన్ని♦కూఁతలు వెట్టెన్ ౫౪౯
క॥ కొన్ని దొరలించెఁ గాళులఁ, గొన్ని కరతలములఁ దెచ్చెఁ♦గుండాడుచు వే
కొన్ని తమ వాలములతోఁ, బన్నుగ నీడ్చికొని వచ్చెఁ♦బటుతరశక్తిన్ ౫౫౦
క॥ అనఘుఁడగు నలుఁడు వడిగాఁ, గొని తెండని త్వరపఱచుచుఁ♦గొండల నొకచేఁ
గొని వరుసలుగాఁ జేర్చుచు, వనధిని కల్లోలపఱచి♦వడఁకం జేసెన్ ౫౫౧
క॥ † కరుణాకరుఁడగు విభుపద, శరణార్థుల రహి భరించు♦చందమునఁ గపుల్
తొరతొరఁ దెచ్చిన కొండల, భరియించె నలుండు కార్య♦భరణ నిపుణతన్ ౫౫౨
తే॥ చంద్రముఁడు కాళ్లఁ బడవెడు♦శైలములను, కెల్లగింపఁగ మేఘపం♦క్తియును చెదరె
నందు దిరుగు యక్షిణులును♦యక్షవరులు, పడుచు లేచుచుఁ దడఁబడి♦పరుగులిడిరి.

ఉ॥ పాదగలించి నొప్పగిరి ♦ పంక్తుల వీచుడు నొక్కటొక్కటిన్
మోఁదఁగ నిప్పుకల్ పొడమి ♦ మున్నొకని మాలిక లొచుఁ బోవఁగా
వేదనచెంది వెండి రఘు ♦ వీరుని భీమ శరాగ్ని వచ్చె నే
మో దరికొంచు నంచు భయ ♦ మొందె సముద్రవిభుండు చూచుచున్.
తే॥ కొండవగలించికొనిగ వా♦త్ముండు తెచ్చి, గుభిలుమనవైవ నంబుధిఁ♦గొఱలు వరాక్తి
కములు జలబిందువులతోడ♦గగనవీథిఁ, జేరి నక్షత్ర మండలిఁ♦గేరి వెలిఁగె.

చ॥ కరులు వసింపఁగాఁదగిన ♦ కందర లున్న మహీధరంబులన్
శరధిని వైచుచుండ రభ ♦ సంబున మింటికి లేచు ముత్తెముల్
వరుసలుగాఁగ నేర్పడుచు ♦ వారిద పంక్తికి జల్లియయ్యె న
ప్పరుసు బలేజమిత్రునకు ♦ వైచిన పందిరిఁబోలె నయ్యెడన్. ౫౫౬
తే॥ వెదురుగుములున్న కొండల♦విసరివైవ, నెగయు జలబిందువులఁ దడి♦యొనయువలువ
లంగముల కంటుకొనఁ గాంచి♦యమర వనిత, లెడఁదలందున వాన వ♦హించినారు
తే॥ పెను తరులతోడి కొండలఁ♦బెల్లగించి, జలధి వైవఁగ బిందువుల్♦చాల దవ్వు
పోయి మరలుటచేత వే♦ల్పుల జగమ్ము, వాన కురిసిన చందానఁ♦బరిఢవిల్లె.
తే॥ కడలి మద వారణంబులు♦పడుచునుండ, వాని మొసళులు గాంచి కా♦లంట్టిలాగఁ
గొండములనె త్రిగిపెట్టి♦తొల్లి గజవి, భుండు హరిఁగూర్చి మొఱవెట్టు♦పోల్కి నొప్పె.
తే॥ అలరులును తేనెవాఁకలు♦నగురుచంద, నములుతక్కుగందంపుద్ర♦వ్యములుమిన్న
గప్పుచుం బడి దట్టంబు♦గాఁగఁ బర్వ, శరధి నీచు వాసన వీడి♦పరిమళించె. ౫౬౦
తే॥ ఉత్తములకుఁ బూర్ణ విసాశ♦ముప్పతిలిన, నైజమైన యుదారగు♦ణంబు విడరు
ఫలతరులతోడిశైలముల్ ♦జలధిఁగూలి,మత్స్యములకుఁ దేనెలుపండ్లు♦మాంస మొసఁగె.

† [illegible] కరుణను [illegible] వచ్చిన వారిని భరించునట్లు. అని తాత్పర్యము.

తే॥ క్రమ ఫలములఁ దినఁ గాంక్ష♦గలిగి నోరు, తెఱచుకొని పేదలట్లు వా♦శ్చర్యముండ
బురదలోఁబూఁదుకొనిపోయె♦గిరులు కొన్ని, యాచకులకీక దాఁచులో♦భాలిఁబోలె.

ఉ॥ గాలిపటంబుకైవడిఁ ద ♦ గం దిరుగాడు ప్లవంగముల్ మహా
శైలములం బెకల్చి రభ ♦ సంబుగ నంబుధివైవ దంతులన్
బోలఁగ నోట వైచుకొను ♦ బుద్ధి భుజంగము లుండి చచ్చె మూ
ర్ఖాలి దొసంగెసంగు తఱి ♦ నైన వివేకము చెందనేర్తురే? ౫౬౩

తే॥ తొండములఁ బెనవైచి దం♦తులును తమ్ముఁ, బట్టవచ్చు నక్రమ్ములఁ♦గిట్టి పొడువఁ
గరులు మకరులు పోరాటఁ♦గలిగినట్టి, విరవ మొప్పారెఁ జెవులు గిం♦గిరులుపోవ.

తే॥ నిప్పు లురలంగఁ దాఁకుచు♦నీరధిఁ బడు, భూమిధర శిఖరము లల్ప♦పుణ్యముగల
జనములం బలె స్వర్లోక♦మునకు నెగసి, నిలువలేక క్రమ్మఱిన వ♦న్నియుఁ జెలంగె.

తే॥ శరభ సింహ శార్దూలముల్♦శరధిఁ జొచ్చి, మీలచే నోడి గుటుకున♦ మ్రింగఁ బడియె
నున్న చోటు వీడిన నెట్టి♦యున్నతులును, బన్న మొందుదు రల్పుల♦వలనఁగూడ

తే॥ బుద్ధి పూర్వకంబుగఁ దోడు♦పొసరకున్న, నుత్తముల సొత్తు బీదల♦కొదవుచుండు
మింటికెగసిన చేఁపలు♦వెంట నెగయు, కొండ తేనె ద్రావి కపుల♦కొమరుఁగొన్వె.

తే॥ మంచునీటిని చిందించు ♦ మలలనుండి, దవమునించు వెదుళ్లు చిం♦దంగఁ జేయు
ముత్తెములకు వారిధి ముత్యా♦ములు వలముఁ, చిందములును ప్రేమంబున♦విందుచేసె.

ఉ॥ అంబరచుంబితంబులగు ♦ నద్రులఁ వెచ్చి కపీంద్ర సంఘముల్
డంబుగవైవ నందలి జ♦డంబులు పొంగి ధరిత్రి ముంపఁగా
నంబుధి పంబు భూస్థలియె ♦ యయ్యె ధరాస్థలి సంద్రమయ్యె లో
కంబున దుర్ఘటం బొకటి ♦ గల్గునె? తారక నామఁ డెంచినన్. ౫౬౯

తే॥ దట్టముగఁ బడు కొండలం♦దలి మృగేంద్ర, శరభ శార్దూల పంఘము♦ల్దిరుగుకతనఁ
దీరభూమి యధిత్యక♦తీరుదాల్చె, నిఖలనాథుండు తలఁపఁ గా♦నిదియుఁ గలదె?

తే॥ మేము తిననివే యిచ్చట♦మిగులఁగలుగు, నంచుఁ దిండి మానినవి మృ♦గాదులెల్ల
మెకములంటని నీర్వాని♦మీలచేతఁ, దినఁగఁ బడనివి లేవు ధా♦త్రీస్థలమున.

తే॥ క్రూరమృగములైనను పెంచు♦వారియెడలఁ, దాలు ప్రేమను వీడంగఁ♦జాలఁగలవె?
తమ్మునాకు కొండలవీడి♦తరలమన్న, చందమునఁ బడె మెకములు♦జలధియందు.

తే॥ తపము సుకరముగాఁ జల్పఁ♦దావలములు, ఫలదములు చల్లనివి యైన♦పర్వతముల
విడువలేక తోడనె పడఁ♦దొడఁగినారు, బంధములఁ ద్రెంచినట్టి తా♦పసులుకూడ.

తే॥ పడెడు కొండలయందున్న♦పలల భుజులు, తలలఁ గేల్మొంచుకొనిచింత♦యలమికొనఁగ
లంక కేగిరి కాణాచి♦లంకె వీడి, జన్మభూమి యేరికిని దు♦స్త్యజము కాదె? ౫౭౪

తే॥ మునిఁగినట్టి మలలమీఁద♦మునుఁగకుండు, శిఖరములఁ జేరి యుండిన♦సింహ శరభ
వితతి గొప్ప సేతువునకు♦వింతయైన, మ్రాలిక లమర్చు తీరున♦మలయుచుండె. ౫౭౫

ఆ॥ వైచు పర్వతములు♦వనధిని మునిఁగెను, చాలవనుచు మరల♦శైలములను
క్రమము లెక్కయిడక♦చని తెచ్చియిచ్చుచు, నుండినారు కొంద♦ఱుత్సుకతను.

ఆ॥ భూమిదేవి వీఁపు♦పెద్ద రంధ్రము పడఁ, బెల్లగించి తెచ్చు♦పృథ్వీధరము
లందునుండి జాఱు♦నహులు వ్రేలె ధరిత్రి, వ్రేవులవలె గిరుల♦వ్రేళ్లవలెను. ౫౭౭

తే॥ పద్మరాగమయాద్రుల♦ప్రక్క నీల, రత్నమయమహీధ్రములు పే♦ర్చంగఁ బడఁగ
నెనఁగె చిత్రకంఠుఁడు సము♦ద్రేశ్వరునకు, రఘువరుండిచ్చు రత్నహా♦రం బనంగ.

తే॥ స్థిరనివాసంబు నాత్మకుఁ♦దెలియవెదకు, యోగులంబలెఁ దోయధి♦నురలినట్టి
కొండచిలువలువడిఁ బాతీ♦గుహలఁ జేరె,నడఁగునేయెన్న ఁడునుకాణ♦యాచిమరులు.

తే॥ సేతు మహిమకు నొప్పుగాఁ♦జెప్పఁదగిన, వేఱు కారణమొండు భా♦వించు టేల?
రామ దూత వైచిన గిరి♦వ్రజమువలన, స్వర్గముం జేరె మీలును♦జల కణములు.

తే॥ నీలుఁడేపున వైచిన♦నీలనగము, జలధి యడుగు వఱకుఁదాఁకి♦ జలము పొరలి
నేలముంప జీవులు పాఱు♦లీల గొప్ప, కలకలంబును పుట్టించె♦గాటముగను. ౫౮౧

కం॥ మైందుఁడు వైచిన గిరిచే, సందరము జలంబు లాకసం బొరసి పడన్
దొందరపడి దిగ్గజములు, మందరగతిఁ దిరిగెఁ జెదరి♦మల్లటపడుచున్. ౫౮౨

కం॥ పూనిక లక్ష్మణుని శరము, లైనను తొలగింపరాని♦యద్రిని బలభి
త్సూనుని కొమరుఁడు తెచ్చి య, నూనగతిన్ వైచె మఱియు♦నుదధి గలంగన్.

కం॥ హనుమని భుజమును పోలిన, ఘనగిరి భల్లూకరాజు♦కడిమిం బెకలిం
చెను వనధి వైచెఁ దుంపురు, లనుపొందఁగ నెగసి పడఁగ♦నమరుల తలలన్. ౫౮౪

కం॥ శైలము కుముదుఁడు వైవఁగ, శీలవు లాస్యమున కనువు♦ చెడక ధ్వనించెన్
దమవగరఁ దుంపురులు పడ, నమరుల కమృతాశ క్రొత్త♦యై యుదయించెన్.

తే॥ పవనుఁ డేపున వైచిన♦పర్వతములు, పిడుగులంబలెఁ బడుచుండ♦ వెగడు కుడిచి
యౌర్వలోక వ్యాజీవిత♦ముజ్జగింప, నిరశనవ్రతముం బూనె♦నురగవిభుఁడు. ౫౮౬

తే॥ లెక్కలేని భల్లూకము♦లొక్కమొగిని, పెక్కుమలలను వైవ నొం♦డొక్కదానిఁ
దాఁకి పుణ్యాహమనివ్రయ♦త్నంబు పోల్కిఁ, గకవికలుగాఁగఁ బడిపోయెఁ♦గడలియందు

తే॥ బహుళ యోజన విస్తృతి♦పరవియున్న, యొక తిమింగిల వృష్ఠంబు♦వికలముగను
గొండ యొక్కండు పడ నది♦క్రుంగి యవలి, కేగఁ గొండయు జడధియు♦నిమ్ముదప్పె.

తే॥ నేర్పుతోడ నలుఁడు శిలా♦నిచయములను, పొందికగ నిడి విఱిచి చే♦ర్పుగను చేసి
మలలఁ జేర్చి యిమడ్చ చల్లి♦తలలుగాన, రాక కేలఁ దడవి యెత్త♦రంబు వదుము.

తే॥ వానరులు తెచ్చు భూధర♦పంక్తులెల్ల, నినుప కంబంబులం బోలి♦ యొనఁగు కేలఁ
గొనుచు నలుఁడు పైకొనుచు♦కుఱుచలగుచు, నలరు నట్లుగఁ గాళ్లతో♦నలఁచి యడఁచు

తే॥ లీల శైలముల్ మోచు న♦లీముఖములు, పోవ జోటు లేకుండ స♦ముద్రమందె
గాక తలలమీఁదనె యొక♦కట్టి సేతు, వానరీ యున్న చందంబున♦గొప్పమీఱె.

తే॥ పెద్దకొండలఁ దాల్చిన♦పెక్కుకపులు, వరుసనై నిల్వఁ దక్కిన♦వారు పోవ
దోవలేమిఁగొండలతోడఁ♦దోయధిఁ బడి, యీఁది తెచ్చియిచ్చుచునుండి♦ రెసకమెసఁగ.

తే॥ పాడవు కొండల మోవంగఁ♦బోడఁగి కాళ్లు, సంచలింప నాఁకలిగొన్న♦శైలచరము
లక్షి మోచు మలల దించి♦యందు గలుగు, మధువు దండిగఁ ద్రావిమై♦మఱచిసొక్కె.

తే॥ అన్ని దిక్కులఁ బరపిన♦యగచరాలి, చొచ్చువారు మరలువారు♦వచ్చువారు
నగుచు నెంత దూరము సేతు♦వయ్యెననఁగఁ, గొండ యందురు సగము చే♦కూడె ననుచు

తే॥ ధాత్రిధరముల యందున్న♦ధాతువులును, పేటులందున్న పెందేనె♦పెరలుఁ దరుల
మంజరులు తీరమందెల్ల♦మలసియుండఁ, దద్భయంకరాంబుధి మధూ♦దధిని పోలె.

తే॥ కష్టములు రేఁగి యిక్కలి♦కలఁచుచున్న, నోర్పుమైఁ గుటుంబము గాచు♦నుత్తమువలె
గొప్ప భూమీధరములు పె♦క్కులుగలంపఁ, గలఁగఁడయ్యెను నుంతైన♦జలధి తేఁడు.

తే॥ పరవియున్న ప్రవాళ వ♦ల్లరులు మునుఁగ, నుదధి వైచిన కొండల♦నుండి చెదరి
దరులఁ బడియున్న పెక్కుర♦త్నాలకాంతు, లింద్రధనువుల కై వడి♦నెనఁగుచుండె.

ఆ॥ వానరం బొకండు♦వటవృక్షమును పెక, లించికొనఁగ నట వ♦సించు పులుఁగు
లాదరువుగ నున్న♦యధిపుఁడు మరణింప, నడలు బంధులట్టు♦లఱచుచుండె. ౫౯౯

తే॥ పాంథవిశ్రాంతి కెడమయి♦పరఁగుచుండు, మావిమ్రాఁకులువనధిలో♦మణుఁగుపడఁగ
రక్షకులు గతియింప ని♦ర్గతికులయిన, సేవకులక్రియఁ దుమ్మెదల్♦చెదరిపోయె.

క॥ చెల్లాచెదరై తుంపురు, లెల్లెడ వ్యాపించుచుండు♦టీక్షింపఁగ సొం
పిల్లు పయోనిధి పూఁడఁగ, మెల్లఁగ వేతెడకు జాఱు♦మీలం బోలెన్. ౬౦౦

క॥ వలపుగొని మునరుచుండిన, యళిబృందము సంద్రమున మ♦హాద్రులతో దం
తులు గూల విడిచి మరలెను, వలపెద లేకుండు వణ్యా♦వనితలకరణిన్. ౬౦౧

క॥ ధరనూనిన వేళులతో, నురలింపఁగఁ బడి సిలుంగు♦లొందినవయ్యెన్
వరసతుల క్రియను తీవలు, తరువుల విడకుండి శర ని♦ధానమునఁ బడెన్. ౬౦౨

క॥ జలకణము లెగుర నవ్వలి, జలధియు నుప్పయ్యె వశని♦చల్లనయయ్యెన్
జలదములు గురిసె నుప్పని, జలముల వేవెలుఁగు కూడఁ♦జలి వెలుఁగయ్యెన్.

తే॥ పరిమళించు పర్వతముల♦వలన నెగురు, పసిఁడివంటి తుంపురులు గ♦ప్పఁగ నెలర్చి
వడిగఁ బైకి లేచిన తీఁగ♦పగడములు తం, జంగలించెను మింటి మె♦ఱుంగు లట్లు.

తే॥ పన్నిదంబులు వైచుచుఁ♦బరుగులిడుచుఁ, బ్లవగు లడవులఁ గల పాద♦పముల గిరుల
వెదకి వెదకి తెచ్చి కడలి♦విడుచుకతన, మొక్కలును చూడఁ గనరాక♦పోయెధరను.

తే॥ నెఱవు కీర్తి పఱపు వానరుల పఱపు, గిరుల పఱపును వనముల♦పఱపు డాలు
ధరణిఁ బఱపుటంబోలి చి♦త్తముల పఱపు, విరియ నొక శరధి పఱపు♦ తెఱఁగు దోఁచె
తే॥ అరయఁ బగళులు మూఁడేగు♦నంతలోఁ ద్రి, కూటముం జేరె సేతువు క్రోఁతు లపుడొ
నర్చు కోలాహలము గగ♦నంబు బ్రద్దలుగ నొనర్చె; నియ్యది వేఱు♦గగన మేమొ?
తే॥ వేఱ యుపమ లుత్ప్రేక్షలు♦ వెదక నేల ?, ప్రభుఁడు రాముఁడు సీత యా♦పదలఁ దీర్ప
నావయిం బదాజ్ఞములుంచి♦నడచుఁగాక, యనుచు శేషుఁడు నిల్చె నా♦నల రెఁగట్ట.
తే॥ సత్యవతియగు లంకయన్ సరసిజాక్షి, దైత్యు లొనరించు చెడుగులు♦తాళలేక
జలజనేత్రుని చేసాఁచి♦పిలుచు కరణిఁ, జెలఁగె రణజయ హేతువు♦సేతు వపుడు
తే॥ తనదు ప్రియ పుత్త్రి పడు బాము♦లను తలంచి, సైఁపలేక భూదేవి హ♦స్తంబు చాఁచి
సీతయున్కి చూపిన దనఁ♦జెన్ను మీఱె, బంధవారిధి వారధి♦పాప రోధి. ౬౧౦
తే॥ కడలిపై నేను రాముండు♦నడపవలసి, యుండ నేను కాకెవరిప్పు♦డోదవు వార
లనుచు విష్ణు పాదోద్భవ♦యవనికి దిగి, నట్టి చెలువున వంతెన♦యమరెఁ జూడ.
తే॥ మలలయందుండు రత్నరా♦సులు జ్వలింప, వానరులు గట్టు జలనిధి♦బంధనమ్ము
వేవెలుం గ త్తమిల్లిన♦వేళలందు, మెఱుపుఁదీఁగల కైవడి♦మెఱయుచుండె.
తే॥ కపులు పూర్తిగా వంతెన♦గట్టు పిదప, వనచరేంద్రుండు రాక్షస♦వల్లభుండు
తక్కువార లావిషయంబు♦తనియఁ దెలుపఁ, జనిరి కుతుకంబుతో రాము♦సన్నిధికిని.
తే॥ డాసి సేతువు నూఱామ♦డల పొడవును, వెలుపు పదియామడలుగాఁగ♦వెలసెననుచు
శ్రీరఘూత్తము చరణ రా♦జీవములకు, మ్రొక్కి విన్నవించిరి మోద♦పూర్ణులగుచు.

౮. చారశ్రవణ పటలము (౬౬)

ఉ॥ వారధియైన వార్తవిని ♦ వారిద వర్ణుఁడు మేరమీఱు ము
ద్వారిధిఁ దేలి వారల న ♦ పార కృపారస మారఁ గౌఁగిలిం
జేరిచి మేనులం డడవి ♦ సేతువుఁ జూడఁగఁబోదమంచు దు
ర్వార విరోధి రాక్షస వి ♦ రాముఁడు రాముఁడు లేచెఁ గ్రన్ననన్.
క॥ ప్రానెలవు కడలి కెదుటను, సేనావారిధికి దిగిన♦జీమూత మనన్
మామగ నిలుచుచు సేతువు, జానకిఁ గన్నట్లు గాంచి♦సంతసమందెన్. ౬౧౬
సీ॥ పలు తరఁగలచేతఁ♦గలగుండు పడుచుండు, జలధి నిండంగఁగొం♦డలను పేర్చి
వారధి నిర్మించు♦నేరుపు మెచ్చుదమ్యొ, దీని లోఁతెంతయో♦ తెలియవశమె ?
వలువ నిర్మింప నె♦న్నాళ్లకు ముగియునో, యీలంక యేడు సం♦ద్రాల కవల
నున్నను వలఁడింకఁ♦గొన్ని దినాలలో, నిక్కంబుగాఁ గట్టి♦నిల్పఁగలఁడు
తే॥ అనుచుఁగొనియాడి కారుణ్య♦వర్మిలి మెయి, నలమి నాఁడు వరుణుఁడిచ్చు♦హార మొసఁగి
యింక జయమునిశ్చయమని♦ యెలుఁగఁబలికి, బయలు దేఱఁగఁ ద్వరపడెఁ♦బరమవిభుఁడు.

ఉ॥ మున్న విభీషణుండు జవ ♦ మోదముతో నడవంగ జ్ఞాన సం
పన్నుఁడు వాయుసూతి కపి ♦ వర్గము వెన్కలరాఁగ లక్ష్మణుం
డన్నను వెంబడింప మద ♦ హస్తి క్రియన్ రఘురామ భూవరుం
డున్నడ తెంచె వంతెనఁ గ ♦ నుంగడు సంతసమంది చూచుచున్. ౬౧౮

ఉ॥ చారు చిరత్న రత్నములు ♦ చందనముల్ చరణాలఁ గ్రువ్వఁగా
హారి వనంబులెల్ల నల ♦ లట్టులు ప్రక్కల నుల్లసిల్లఁ గా
వేరిని పోలియున్న కడు ♦ విస్తృత సేతువుపైఁ గపీంద్ర సం
చారము రామచంద్రునకు ♦ సమ్మతిఁగూర్చె ననేక భంగులన్. ౬౧౯

తే॥ కొండప్రక్కలఁ గల తిను బండములను, వారుకొని మోచి తెచ్చుట♦వలనజలధి
నడచు కతనను ప్లవగసై♦న్యంబుచూడ, గొప్ప కావేరి వఱదనాఁ♦గొమరుమీఱె.

చ॥ నడవఁగఁ బల్లము ల్వడిన ♦ నాఁడెవు జాడలలోఁ దరంగముల్
నడుమను తూఱుచుండ జత ♦ నంబున సంగర రంగమందు ప
ర్విడు తురగాల నెక్కి చను♦రీతి మనోహర లీలలన్ వడిన్
దడములు పోవసాగెఁ గను♦దమ్ముల విందుగ నందడించుచున్

తే॥ ఇఱుకు గానున్న చోటుల♦నేగలేక, యోరలం బోయి పడనున్న♦వారిఁబట్టి
చేయి యూఁత యొసఁగి దరిఁ♦జేర్చినారు, కరుణ నిండిన కపివరుల్♦కడఁక చెడక.

క॥ పలువురు ప్లవగులు రాఘవు, తలపై నాతపము వేఁడి♦తగిలెడి నని జొ
బ్బిలు జొంపములగు తరు శా, ఖల గొడుగులక్రియను పట్టి♦కడపిరి త్రోవన్.

క॥ కాకుత్స్థు మేను వాఁడగ, నీక ననిచియున్న విటప♦నిచయమ్ములతో
జోకగఁ జామరలవలెం, జేకొని వీచిరి చెలంగి ♦ సేనానాథుల్. ౬౨౪

తే॥ జానకీదేవిఁ జేరంగఁ♦జనుటఁ దలఁచి, యుత్కమైన మనంబుతో♦నుర్విభుఁడు
బలసి వచ్చు సేనలతోడ♦జలధి దాఁటి, యవలి దరిఁజేరె వేల్పులు♦హర్ష మొంద.

చ॥ సురలును మానులుం గడఁక ♦ స్రుక్కక గొప్ప తపంబుచేసి య
త్యురుఫలమొందు హేతువున ♦ నుద్భట వానరసేనతోఁ బ్రియా
వరజానితో నరుంధతియు ♦ భక్తిని మ్రొక్కఁగఁ దగ్గ సీత ము
చ్చిరు నగరంబు పొంత విడి ♦ సెన్ రఘువీరుఁడు వే మవేలపై. ౬౨౬

క॥ శ్రీరాముఁడు మన సేనా, వారమ్మున కెల్ల వలయు♦పద్ధతి విడుదుల్
నేరుపుతోఁ దీరుపుఁడని, యారఁగ నీలునకుఁ దెలుప♦నతఁ డగునను చున్. ౬౨౭

చ॥ నలునకుఁ దెల్ప నాతఁడును ♦ నాల్గుముఖంబులుగా సమర్చి సే
నలకును దండనాథులకు ♦ నానెమ లేర్పడ వేఱు వేఱుగా
నెలవు లమర్చి దైత్యకుల ♦ నేతను భాస్కర నూతికిం గుతూ
హలమున రమ్యమైన నిల ♦ యంబులు దా నవరించె నెవ్వడిన్. ౬౨౮

తే॥ రామలక్ష్మణులకు మధ్య♦రమ్యములగు, తాలు మలిచి కఱ్ఱలు గట్టి♦పూలతలను
గప్పి దర్భలఁ బఱపి చో♦క్షముగఁ జేసి, యెలమి నిట్లు స్కంధావార♦మెల్లఁ దీర్చ.

తే॥ లోకరక్షకు జానకీ♦లోలు నెల్ల, వారు మనసుచే వాక్కుచే♦ఁ బ్రస్తుతించి
యెఱిఁగి తమతమ విడుదుల♦కేగినంత, రాముఁడును తనవీడు చే♦రంగ నరిగె.

ఉ॥ వ్యాపన శీలులైన కపి ♦ వర్యులు కొండలు తెచ్చి వైవ ని
ర్వ్యాపక యబ్ధి వ్యాకరణము ♦ లుప్పర వీదికి వచ్చి విద్రుమ
శ్రీ పెనుపారు నంశువుల ♦ చెన్ను దొలంగఁగఁ జేసె నంచుఁ దా
నీపరిఁ దానమాకుటకు ♦ నేగిన కైవడి నేగె భానుఁడున్. ౬౩౦

క॥ దార రహితుఁడై యుండెను, శ్రీరాఘవు నేయఁగోరి♦చిత్తజుఁ డెక్కుం
గూర్చిన చెఱకు విల్లన, వారుణిఁ గనుపించె లేఁత♦వలివెలుఁగంతన్. ౬౩౨

ఉ॥ నీరజ పుష్ప రేణువులు ♦ నిండఁగ నూఱుచు మంచు బిందువుల్
చేరిన మందమారుతము ♦ చేతను రేయను దావవహ్నిచే
మార శిలీముఖంబను న ♦ మాఖ్యవహించు కృతాంతుదూతచే
ఘోరతర ప్రతాపమును ♦ కోరికఁ జూపె విధుండు గొబ్బునన్. ౬౩౩

ఉ॥ కోపము చూపినన్ బిగులు ♦ కోమలికం బెడఁబాయకుండు సు
శ్రీ పెనుపారు మోముగల ♦ సీత యెడంపడ నిద్ర సౌఖ్యమున్
ద్రోపడియున్న రాఘవుని ♦ దోష్ప్రలి వెన్నెలపాటుఁ కేకియుం
బై పడి వీడఁగా వెడలు ♦ పాప భుజంగము లీల నేర్పడెన్. ౬౩౪

తే॥ లంక డాయుటచే రాము♦లలితగాత్ర, మతిశయోత్థిత సంతాప ♦ మధిగమించె
నెట్టనోరు పల్లనికను♦లెనయు నగ్ని, కాల్చె దవ్వులనే డాయఁ♦గాల్చకున్నె ?

చ॥ తన చెడువేళ దగ్గఱిన ♦ దానవనాథుఁడు రావణుండు పం
పిన కొటికాండ్రు వానరుల ♦ వేషమునం జనుదెంచి పాళియం
బునఁ దిరుగాడుచుండఁ దన ♦ పూర్వులు చేయు తపఃఫలంబు రేఁ
పిన లలి వచ్చి యుండిన వి ♦ భీషణుఁ డొయ్యనఁ గాంచె వారలన్.

తే॥ వానరులవలె నేవలో♦పలులుచుండు, వారిఁ గనిపెట్టె నప్పుడే♦ప్రాజ్ఞవరుఁడు
కలశ వారాశిలో నీటి♦కణము పడిన, వేఱుపఱచి త్రోచెడు హంస♦విధముగాఁగ,

తే॥ వరఁగ నణువై మహత్తయి♦పరవి నిండి, విద్యలకుఁ గట్టువడి తిరో♦వృత్తిఁ దనరు
చున్నవారిఁ గనుల ద♦ర్శించినట్టి, యోగిరీతి విభీషణుఁ♦డొప్పె నపుడు.

చ॥ కడఁకను దెల్ప వానరులు ♦ కాళులు నేతులు గట్టి వారలం
బిడికిలి పోట్లచే నొడలు ♦ ఛేదిల నెత్తురు గ్రక్క గ్రుద్దుచున్
వడివడి రాఘవేశ్వరుని ♦ వద్దకు నీడిచి తెచ్చి చూపఁగా
నడఁచ ధరాధవుం బలిక♦యుంప వతండును గాంచె వారలన్. ౬౩౫

చ॥ కని పగవారలంచుఁ గినుకన్ వధియింపక నింద్యమైన చో
ప్యని నగచాట్లు వానరులు • పూన్చిరె యంచు దయాంబురాశియై
కని పగవారలైన నొడికంబు చెడన్ శరణంబు వేఁడ నొ
ప్పని పని సేయఁగా దగునె? బంధములన్ విడిపింపుఁడీ యనన్. ౨౪౦

చ॥ మనమున మార్దవంబుగల • మాన్యుఁడు రాముఁడు గూఢచారులన్
గనులను నీరు చిప్పిలఁగఁ•గాంచినఁ జూచి విభీషణుండు శ్రీ
వనజదళాక్ష! రావణుఁడు • పంపఁగ వచ్చినవారు వీరు వీఁ
డనయుఁడు సారణుండగు శు • కాఖ్యుఁడు వీఁడగు నంచుఁబల్కఁగన్.

ఉ॥ వంచకులైన వేగులు కృ • పారసధాముని రాముఁగాంచి యో
యంచితరూప! వానర బ • లాతిశయంబు నెఱింగి గెల్వముం
గాంచుట దుర్ఘటం బనుచు • గారడముల్ పచరించి హమ్మ్మ చం
పించఁగ వచ్చినాఁడితఁడు•పెద్దరి నిక్కము నమ్ముమీ యనన్. ౨౪౨

ఉ॥ భేదము గూర్తురా యని వి • భీషణుఁ డప్పుడు మోహనప్రతి
చ్ఛేదక మంత్రమున్ జపన • సేయఁగ గుట్టు బయల్పడెన్ వడిన్
బాదరసంబుపోకి తెలి • పాఱిన పైఁడి పుటంబు వెట్టఁగా
నాదిమ వర్ణముం జెనయు • నట్టులు వారు యథాస్థితిం గొనన్. ౨౪౩

తే॥ భీతిచే వడఁకుచునుండు•వేగులఁ గని, దీనరక్షకుఁడైన యా•దిత్యకులుఁడు
మోమునన్ మందహాసంబు•మొలకలెత్త, నలుకు వలదు వచ్చిన పని• తెలుపుఁడనఁగ.

తే॥ వారలేమియుఁ దోఁపక•నోరు మెదుప, శ్రీకరా! లోకమాతయౌ•సీత తనకు
మృత్యువని యెఱుంగని దాన•వేశ్వరుండు, పంప వచ్చిన వంచనా•పరులమయ్య!

తే॥ అనుడు రాముఁడిట్లను మీర•లలుకులేక, చూడఁదగు వాని నెల్లను•చూచియుపల
మీ దశాస్యుని కడకేగి•మేము తెలుపు, పలుకులెల్లను మఱవక•పలుకవలయు.

సీ॥ మేరలేకుండు లం•కారాజ్య సంపద, కీ వూ విభీషణుఁ•డీశుఁ డనుఁడు
మకరాలయంబును•మలలచేఁ బూడ్చి పెం, పెచ్చంగ వనచరుల్•వచ్చిరనుఁడు
నిన్ను నీవారిని•నీఱుగాఁ జేయఁ బ్ర, తినగొన్న వీరు లే•తెంచి రనుఁడు
భోగానుభవమును•భూరి విక్రమ వైభ, వంబులు పూర్తిగాఁ•బాసె ననుఁడు

తే॥ ఆలుఁ బిడ్డల బంధుల•ననుఁగువారి, నింపు దీఱఁగ నిపుడ వీ•క్షింపు మనుఁడు
అన్ని యాసలఁ దెగఁగోసి•యనికి వచ్చి, ప్రాణముల నాశరాళికి•వదలు మనుఁడు

ఉ॥ గుత్తులుగాఁగ మత్తములు • గూడినరావణ! లంక వార్ధిలో
నొత్తిలి కావరాక పడి • యుండుటచే నుమఱుల్ భరించి పె
న్మత్తున దారపుత్త్ర హిత • మంత్రులతో మనఁగల్గి తింక నే
యెత్తులు చెల్లవంచు వచి • యింపుము తప్పక రాక్షసేశుతో. ౨౪౮

క॥ హరిహర హిరణ్యగర్భులు, గరుడోరగ సిద్ధసాధ్య ♦ గంధర్వాదుల్
మరమున నినుగాచిన నీ, శిరములు నాశరము లురలఁ♦జేయు ననుండీ. ౬౮౯

మ॥ తన తండ్రిన్ వధియించు హేతువున ను ♦ద్యత్క్రోధుండై భార్గవుం
డనిలో బంధులతోడ నర్జునుని సం ♦ హారంబు గావించు తీ
రున నీవారల నాజిలోఁ దునిమి నీ ♦ క్రొవ్వారు రక్తానఁ ద
ర్పణముం జేసెదఁ బక్కి తేని కని నో ♦ వ్వం బల్కెడీ మీరటన్.

ఉ॥ మాయలమారివై తపసి ♦ మానిని యొంటిగఁ గాన నుండ న
న్యాయము మీఱఁ గొంచుఁ జెఱ ♦ యందు వసింపఁగ వైచు నీచు నీ
న్యాయముతో సమూలముగ ♦ నాశముచేసి దురాన నారకా
ఖ్యాయతకారయందు తిర ♦ మారఁగ నుంచెదనంచుఁ దెల్పెడీ

తే॥ వేరు కోరిక లున్నచోఁ♦గోరికొనుఁడు, ప్రాణభీతి మానుండు మా♦వారలెవరు
మిమ్ము బాధింపకుందురు♦మీరు పోవుఁ, డనఁగ బ్రదికితిమని వార♦లరిగినారు.

—: రావణుఁడు రహస్యమందిరము చేరి యాలోచించుట :—

ఆ॥ వరుణుఁ డొందు భయము♦వారధి నిర్మించు, నేర్పు కపులు వచ్చు♦నెఱియువినిన
రావణుండు సగము♦రాతిరివేళ నే, కాంత మందిరంబు♦నందుచేరె. ౬౯౩

ఆ॥ రమ్మనంగఁ దక్కఁ♦దెవ్వరయును రాని, మంతనంబు సేయు♦మందిరమున
నున్న స్త్రీలు పురుషు♦లోగి నవ్వలికినేగ, నతఁడు హితులతోడ♦నందు చేరె.

ఆ॥ విజ్ఞ లక్షణంబు♦వెలయునివారు మూ, కులును చెవిటివారు♦గూనివారు
కుబ్జులైన వారు♦గూడి యచ్చట దీప, ములను మోచికొంచు♦నిలిచినారు. ౬౯౫

తే॥ వినత దానవ మస్తక♦విమల మకుట, రత్నదీపిత చరణుండు♦రావణుండు
పగఱు నర వానరులు పురి♦పఱగడందు, చేరినారు కార్యంబు చ♦ర్చింపుఁడనుడు.

తే॥ మాల్యవంతుఁ డిట్లను దశ♦మస్తకునకు, రామబాణాగ్నిచే నబ్ధి♦రాయఁ డుడికి
నడఁకి వారి మొక్కుండు కా♦న్కగ నొసంగు, తీరు విన నామనంబు వే♦ధించుచుండె.

తే॥ చీలికలుగాఁగ జలనిధి♦చీల్పఁబడఁగఁ, జూపులంబలెఁ బడు రాము♦తూపులకును
భంగపాటొంది భయమంది♦వనధిరాజు, త్రోవ యిచ్చుట నామదిఁ♦దొలుచుచుండె

తే॥ కానవచ్చిన వెల్లఁ బె♦కల్చి తెచ్చి, సృష్టి మల లింక లేవనఁ♦జేసినట్టి
కపులు భుజ మప్పళించుట♦కడలి నడర, నీక యడఁచుట నామది♦నేఁచుచుండె.

తే॥ వలఁతులైన వనచరేంద్రు♦లలవు మెఱయఁ, దెచ్చి యిచ్చు మలలఁ జేతి♦తీఁటవోవ
నొక్క కపి యందుకొని యబ్ధి♦నుంచు టెన్నఁ, గడుపు చేవెట్టి కలఁచిన♦కరణియయ్యె

క॥ కాల్చినది చూచి నేతువ్వ, దాల్చినయది చూచి కాన ♦ దానవవరుల్
మార్చినది చూచి తొమర, న్నిల్చిన యదిచూచి తలఁచు♦నియతియుఁ దగునే ?

తే॥ అనుచు మాతామహుఁడు పల్కు ♦ నమరవిభుఁడు, కనులనిప్పులురలనాడు ♦ గఱచి మాచి
మేలు మేలు నీ రోచన ♦ చాలమేలు, తమ్మునితోఁ బొమ్ము నీపంద ♦ తనము మెఱయ.

ఆ॥ అనుచుఁ బరుషవాక్కు ♦ లాడ నాతఁడు మూర్ఖు, పట్ల హితము హీన ♦ పఱచు నిజము
సత్యవాది బహుళ ♦ జన విరోధియకాదె, యనుచు మానమూని ♦ సంతమీఁద.

సీ॥ దండనాథుఁడు లేచి ♦ దర్పంబుతోఁ జూచి, నఱువదేఁడులు దాఁట ♦ నరులో మరులో
యనుమాట నిజమాయె ♦ వినుము తాతా! కప్పు, లగడితే దాఁటిన ♦ యలవు తక్క
దిక్పాలకులు భీతి ♦ తిగువ నక్కుచువచ్చి, సేవించుచుంట వీ ♦ క్షింపవేమొ?
పండ్లిగిలించుచుఁ ♦ బరువెత్తు కోఁతులు, మలల మోచిన వంచుఁ ♦ దెలుపుచుంటి

తే॥ గాక భయమంది పురవైరిఁ ♦ గౌఁగిలింప, రణజితై రావణుండగు ♦ రావణుండు
వెండిమల జల్లివేళ్లతోఁ ♦ బెల్లగించి, నింగిదాఁక నెత్తుటయు నె ♦ ఱుంగవేమొ?

చ॥ జరిగిన వానిఁగూర్చి యెల ♦ నంబుగఁ జర్చలు సేయనేల? ము
ష్కరులగువారు కొందఱు వి ♦ శంకట దుర్విధి చంపఁబూని యీ
కరణిని త్రోవ సంగర ము ♦ ఖంబున జావఁగ నెంచి సింహ కం
దరమునఁ జొచ్చు గొఱ్ఱెల వి ♦ధంబున వచ్చిరి యంచు నుండఁగన్

తే॥ వేత్రహస్తుఁడౌ కంచుకి ♦ వేగవచ్చి, దేవరం జూడ వేగు లే ♦ తెంచిరనఁగ
లోని కంపుఁడనుచు విభుఁ ♦ డానతీయఁ, జిత్తమని వాఁడు చారులఁ ♦ జేరఁదెచ్చె.

తే॥ వానరులఁ దలంచిన యంత ♦ వడఁకువారు, పలుకు నపుడెల్ల నెత్తురు ♦ లొలుకువారు
చారులా దశాస్యుం దున్న ♦ నరస కరిగి, పాదములకడ సాగిలఁ ♦ బడుచు లేవ.

తే॥ ప్రాణములఁ గొనఁ బెదవు ల ♦ ల్లార్చుచుండు, యమునివంటి రావణుఁడు న ♦ యంబు మెఱయఁ
దరుచరులఁ గూడియున్న సో ♦ మరుల తెఱఁగు, లెఱుఁగఁ బలుకఁడియున్న వా ♦ రిట్టులనిరి

ఉ॥ దానులమైన మేము వసు ♦ ధావర సేనను పూర్తి చూచు పే
రాసను వానరాకృతుల ♦ నంచితరీతి గ్రహించి పోయియున్
దోనముతో విశాలమగు ♦ తోయధి విస్తృతి గాంచ బల్మినై
నాసలఁజుట్టి వచ్చిన ఖ ♦ గాధిపుకై వడి లేము దేవరా! ౬౬౯

ఆ॥ జలధి వేల గానఁ ♦ జాలనిచింత తో, లంగఁ బర్వతములఁ ♦ గ్రుంగఁ జేర్చి
నవ్వు డార్చి లేచు ♦ నంబుకణంబులే, వచ్చి తెలుప లేదె? వలుకవలెన?. ౬౭౦

ఉ॥ కట్టినఁ దేలు కట్టుమిని ♦ కుమ్మరిపుర్వమునట్లు వేఁడిన
నెట్టన గానరాఁడు నది ♦ నేత యటంచుఁ బతంగవంశజుం
డట్టె భుజంబులన్ శరశ ♦ రాసనముల్ తగఁ గాంచినంతనే
బిట్టుడికెం బయోధి కడు ♦ భీతములయ్యె జగంబు లన్నియున్. ౬౭౧

క॥ సీతమ్మయు శ్రీరాముని, ప్రీతిఁ జిత్రమయి పొందెఁ ♦ జేర్చిని లంకా
శ్రీ తరుణిని సూర్యేందులు, భూతంబులు రాము వెనుక♦ పొలిచెను దనుకన్. ౬౭౨

క॥ దూతగ వచ్చిన హనుమని, ఖ్యాత బలము తెలిసియున్న♦ కతమదియుండన్
సేతువు గట్టిన నేరుపు, సీతజి తలపోసి వెలి వ♦హింపఁగ నేలా ? ౬౭౩

తే॥ వేల్పు లమృత పానము సేయు♦ వేళయందు, సూర్యచంద్రులు రాహువుఁజూపినట్లు
నీదు తమ్ముండు వానర♦నికరమునకు, మమ్ము గుర్తించి తెలిపె య♦త్న మ్ముతోడ

తే॥ దేహమెల్లను నలఁచి వే♦ధించికట్టి, యీడ్చికొనిపోయి పగలింటి♦యినునిభంగి
వెలుఁగుచున్నట్టి జానకీ♦విభుని యెదుట, నిలిపినారు వానరవరుల్♦నిర్జరారి ! ౬౭౫

ఉ॥ పావనుఁడైన రాముఁడు కృ ♦ పాళుఁడు గావున మమ్ము గాంచి స
ద్భావముతో వదల్చి మఱి ♦ పంపుచుఁ జిర్నగ వంకురింపఁగా
రావణు మున్ను పొందిన ప ♦ రంబులు తోడ్పడవంచు నాజి దై
త్యావళి చావు నిక్కమని ♦ యాడెను దైత్య కులాబ్ధి చంద్రమా ? ౬౭౬

తే॥ అనుచు రాముఁడు దెలుపువా♦క్యములు సైన్య, బలము దెల్పిదో సంగులు♦తొలగుఁగాత
మసురవిభుఁడు చిరాయుష్మఁ♦డగుత మనుచు, విజయ గీతంబు పాడిరి♦విపులభక్తి

—: ౬. లంకాదర్శన పటలము :— (౪౮)

ఉ॥ శాపమువంటి మేటి శర ♦ చాపముల్ ధరియించినట్టి యా
తాపసవేషు లీ జలధి ♦ దాఁటి పురంబునఁ జొచ్చుచుండఁగా
నోపికతోడ నేఁడొకటి ♦ యోచన సేయఁగఁ బోలదన్న లం
కాపతిఁ గాంచి సైన్యపతి ♦ క్రమ్మఱ నిట్లను ధీరపద్ధతిన్. ౬౭౮

ఉ॥ సీతను వీడినన్ భయము ♦ చెందెనయంచు విరోధులం దప
ఖ్యాతి ఘటిల్లు సంగరము ♦ గల్గిన వైరము తీఱవచ్చు దు
ర్నీతుఁడు నీదుతమ్ముఁ డొక ♦ రీతిని సంధి పొసంగనీఁడు చు
విఖ్యాతతఱి యిక్కపాటొదవ ♦ నీయక యోచన సేయఁగాఁ దగున్.

తే॥ మనము దండెత్తవలయు ద్ర♦శ్రమమ్ము లేక, పగతె యిచటికి వచ్చిర♦వాంఛతోడ
వలసివట్టి శైలము పయి♦వానగురిసె, నింతకును మించి యనుకూల♦మేది మనకు?

ఉ॥ రక్కసి వేయి వెల్లువల ♦ రాణువ ప్రాణముఁ దీయఁబూనుచోఁ
దిక్కక మాఱు మృత్యువయి ♦ దేవతలైనను వచ్చి కావలెన్
దక్కవయేది నీవిచట దా ♦ రణభంగిఁ గన ల్వహించినన్
గుక్కలు సింగమును గనిన ♦ కోపునఁ గోఁతులు పాఱకుందునే ? ౬౮౧

ఉ॥ వచ్చిన వానరావళులు ♦ వచ్చిన త్రోవనె పాఱి తోయధిం
జొచ్చి వడింబ దైత్యకులం ♦ శూరుల తోడుత నేను పోయి వె

న్మచ్చరమూని సేయు కద ♦ నంబును కాంచెనుగాక యానతిం
బుచ్చుము దేవ! నన్నుఁ జ ♦ మూపతి యుక్తహితోక్తులాడఁగన్,
తే॥ మాటలంగాక పోరునఁ♦బోటుమాప్ప, టుత్తముల లక్షణంబగు♦నుర్వియందు
గాఁగలది కాకమానదు♦గాదె యనుచు, మాల్యవంతుఁడు వాక్రుచ్చె♦మఱియునిట్లు.
తే॥ జలధివేష్టిత భూతల♦చక్రవర్తి, దశరథ సుతుండు జానకీ♦ధవుఁడు శింశు
మార చక్రంబుకంటెఁ బై♦వారనుండు, దేవదేవుఁడె యని మహా♦ధీమలంద్రు.
తే॥ అతని తమ్ముఁడు పరతత్త్వ♦మందునుండి, పీడకుండియు పీడిన♦విధము తోఁచి
ప్రాణులం బలు తెఱఁగులఁ♦బరిధవిల్లు, విష్ణుశయనమే యని తత్త్వ♦విజ్ఞు లంద్రు.
తే॥ కులగిరులలోని సారమొ♦క్కొట గడించి, నలువ యారాముని శరాస♦నంబుచేసె
నల్లెత్రాడు శేషుఁడు నిశి♦తాస్త్రతతులు, కాలచక్రంబు సైతంబు♦గడచునంద్రు.
తే॥ అంగదుసు రేశుఁడనినీలు♦నగ్నియంద్రు, వాయువనిరుద్రుఁడనియంద్రు♦వాయుసుతుని
నతఁడుపిమ్మట బ్రహ్మయే♦యగు నటంద్రు, సకలవనచరుల్ దేవతాం♦శములవారు.

చ॥ నలువ పదంబు మారుతికి ♦ నల్వుగ నిచ్చిన రాఘవుండు దై
త్యులఁ దుదిముట్టఁ గూల్చుటకె ♦ యొప్పుగ నివ్విధి వచ్చెనన్న యీ
పలుకులు పల్కురాదుదురు ♦ వారి గుణాదులఁ బట్టియో నిజా
కలనముచేతనో తెలుపఁ ♦ గా ఫలమేమది నీవెఱుంగవే? ౬౮౮

చ॥ నిజము నెఱింగియో తెలివి ♦ నేర్పుననో మఱి భీతిచేతనో
యజహర పూజ్యయైన యమ్మ ♦ తాగ్రజ పద్మిని లోకమాత భూ
మిజ యని పల్కుచుందు రది ♦ మిథ్యయొ సత్యమొ తెల్పనేల? బే
రజముగ నెల్లిదంబుగ ని ♦ రాకృతి సేయఁగరాదు రావణా!. ౬౮౯

చ॥ అడవుల కేగుదెంచుటయు ♦ నక్కట వేల్పుల ప్రేరణంబుచేఁ
బొడమిన కార్యమంద్రు సుర ♦ ముఖ్యులు వేడఁగ మాధవుండు కే
రడమున నీవుపొందిన వ ♦ రంబుల లోటు నెఱింగియే యిటుల్
పుడమి నరాకృతిం బడసి ♦ పొల్చె నటంద్రు మహాత్ము లెల్లరున్. ౬౯౦

చ॥ పలుమఱు దుర్నిమిత్తములు ♦ పట్టనమందునఁ దోఁచుచుండె న
య్యల తనుజాత నారయఁగ ♦ నేడ్తెఱవచ్చిన దూత తాఁక నీ
నెలవున నున్న దేవతయు ♦ నీఁగినదందురు కల్గె యుద్ధముం
బొలుపుగ మేలుగూర్చు పని ♦ ముఖ్యముగాఁ దలపోయు రావణా!

మ॥ భవకోదండ విఖండనంబున న్నవ ♦ త్వంబున్ బయల్వోచ్చు రా
ఘవ బాణంబులకుం బలాశనులె ల ♦ క్ష్యంబైన వారంద్రు దా
నవ రాజేంద్ర! విభీషణుండు గురుక ♦ న్నన్నించు విజ్ఞాని గా
రవ మొప్పారఁగ మున్నె తెల్పెను కదా ♦ ప్రాపించె నీకావిభున్.

మ॥ వినుమా యియ్యవి యెల్ల నేఁ దెలియుటన్ ♦ వెండిన్ హృషీకేశుచే
మును నావారలు కూలుటన్ మనుమఁడన్ ♦ ముద్దున్ మనోవేదనం
బును నన్నిమ్మడిఁ గష్టపెట్టఁగ శుభం ♦ బుం గూర్చు పల్కాడెదన్
దనయా! సీతను వీడుమా యనుచు నొం ♦ దన్ మాల్యవంతుండనన్.

చ॥ పకపక నవ్వి రావణుఁడు ♦ ప్రాఁతిగ నీవను పల్కులెన్న! త
క్కక యుదులుండనీ నరులు ♦ కోఁతులు పట్టుగ నింతకాల మె
ఱ్ఱ్యొకటియుఁ జేయలేక వెత ♦ పొంది మఱుంగుల డాఁగు దేవ నా
యక మణులంట! నే నవజ ♦ యంబును పొందెదనంట! వింతగున్! ౬౯౪

చ॥ అతగుల మానవేశ్వరుల ♦ నల్పులు కేశవే కాదు తోడుగా
నితర మృగంబులన్నియు న ♦ హీనవిధిం గలియంగనిమ్ము నన్
క్షితివయిఁగాదు నాగులు వ ♦ సించు భువంబుననైనఁ దాఁకనీ
క్షితిజకు నైనచో జుణిఁగి ♦ చెంగుదునే ప్రళయంబు గల్గినన్. ౬౯౫

చ॥ చెడుగులకుం బ్రతిక్రియలు ♦ సేయునవై భువనంబులం గడుం
గడిమిని గెల్చి నిర్జర ని ♦ కాయము వీఁపుల దుస్సినట్టివై
యడరిన మన్మహోగ్ర నిశి ♦ తాస్త్రము లక్కట కోఁతిమూఁకపై
వెడలఁగఁజాలవంచు నొక ♦ వేఱిఁడివైయెవఁ డెగించి పల్కునే? ౬౯౬

ఉ॥ శూలియు నొక్కక్రోఁతియయి ♦ నూటిగ నన్నెదిరించి నిల్చినన్
గేలిగ నెల్లవారు నగఁ ♦ గీడ్పడి పాఱునుగాక గెల్చునే?
మేలగు నా శరావళులు ♦ మ్రింగఁబడంగ జగంబు మ్రింగఁగాఁ
జాలిన వారిధిం బొడము ♦ చండతరంబగు హాలహాలమే?. ౬౯౭

చ॥ బవరమునందు మున్నొడఁగి ♦ పాఱిన చక్రియు వెండివచ్చి యు
క్కివుఁడయి తాఁకినంత నను ♦ గెల్వఁగ నేర్చునె? మర్దను ర్వైము
క్త విశిఖ సంతతుల్ శశి వి ♦ కర్తన ఋక్ష గణంబు మాడ్చుచున్
నివుడ భరింపఁగా నుదధి ♦ నీటను పుట్టిన కౌస్తుభంబొకో? ౬౯౮

తే॥ జిష్ణుఁడొక కపి రూపొంది ♦ చెలఁగె నన్నఁ, దాను వైచిన వజ్రాయు ♦ ధంబుచేత
తొక్కులాడి లేవక పడి ♦ నక్కియుండు, కొండ తానొకో మద్భుజా ♦ దండపాళి.

సీ॥ అని దశాననుఁడు గ ♦ ర్వాంధుఁడై నగుచు పీ, రాలాపములఁ దగ ♦ నాడుచుండ
మనమునే దూతలై ♦ మును పేగు నభిసారి, కల మనంబులు చాలఁ ♦ గలఁతనొందఁ
బ్రక వాశంబులు ♦ సంతోష మొందంగఁ, బద్మినీ వదనంబు ♦ వరిఢవిల్లఁ
గనకశిఖరి దాఁకఁ ♦ గ్రమ్మిన యిరులు ప్ర, వాహజలము తగ్గు ♦ పగిదిఁ దొలఁగె

తే॥ నెట్టెదని తొంగి చూడని ♦ యినుఁడు నాఁడు, రాము దాఁపున బంగరు ♦ ప్రవహిఁజూచు
కొర్కి తన చెంతమునయందు ♦ గుదురుకొనఁగ, మెల్లమెల్లన లంకపై ♦ మెదలసాగె.

—: రాముఁడు సువేలాద్రి శిఖరముఁ జేరుట :—

మ. సుదతీరత్నము సీత లంకఁ గలదం ♦ చుం డెందమందున్న పె
ల్లిదమౌ ప్రేమము రేఁప నందమగు ప్రో ♦ లిం గాంచు వాకంబునన్
నిదురన్ వీడిన లక్ష్మణుండు వెనుకన్ ♦ నిర్భీత కీశవ్రజం
బెదురం బ్రక్కలరాఁ గకుత్స్థ కులజుం ♦ డెక్కెన్ సువేలాద్రిపై. ౨౦౧

ఆ. కదన వీరవరులు♦కలసి ప్రక్కలరాఁగ, రాజయుగళి తోడ♦రామవిభుఁడు
పెక్కుపులులు చుట్టి♦ప్రక్కల రా మృగ, రాజ మద్రినెక్కు♦రాణదోఁచె. ౨౦౨

చ. పుడమి సమస్తమున్ జలధిఁ ♦ బూఁడినకై వడిఁ గ్రమ్మ చీకటిన్
దొడిఁబడ లంకయున్ బొదలు ♦ తోరపు సంపదలు న్నశించు పో
ఒడి దెలుపంగఁ దూర్పుమల ♦ పై నుదయించుటమాని తాఁ జుమా
ర్వడ వలదిక్కు దోఁచు కతి ♦ భానునిపోలెను రాముఁ డత్తఱిన్. ౨౦౩

చ. అసమ మహీధ్రముల్ వయిచి ♦ యబ్ధిని దాఁటిన రమ్య మేరు శై
ల సదృశ ధీరుఁడౌ కపికు ♦ ల ప్రభు లందున నుల్లసిల్లె రా
క్షస కుల కాలుఁడైన ధర ♦ జా హృదయాంబుజ భాస్కరుండు మే
ల్పసిఁడి నగంబుపై వెలయు♦పచ్చలు నిండిన కూటమోయనన్. ౨౦౪

చ. జనకజ పేరుపొందిన ని ♦ జంబగు ప్రాణము వీడ జంటఁ బా
సిన కురరింబలెన్ వగపు ♦ చే విలపించెడువాఁడు సేతువుం
గమఁగొను పిమ్మటన్ గినుకఁ ♦ గన్నుల మానినవాఁడు రాఘవుం
డనువుగఁ గాంచె లంక నయ ♦ నాంబుజ యుగ్మముతో వెఱుంగుతో.

—: రాముఁడు లంకానగర సౌందర్యంబు లక్ష్మణునకుఁ దెలుపుట :—

మ. అనుజన్మా! గమనించితే మన యయో ♦ ధ్యం బోలు సౌందర్య ప
ట్టనముల్ వర్ణనసేయుచో సుకవి కూ ♦ టంబుల్ సురేంద్రస్థలిన్
గొనుచున్నా రుపమాన వస్తువుగ నొ ♦ క్కొండేని లంకాపురిన్
గొనమిం జూడఁగ గొత్తదాఁటె యని వా ♦ క్రువ్వందగున్ లక్ష్మణా!

సీ. దోషంబులేక వి♦ద్యోతించు నపరంజి, మయమైన స్థలముల♦మణి గణములు
ఖచియింపఁ బడి రవి♦కాంతులు సిగ్గిల, దీప్తిమయంబుగఁ♦దేజరిల్లి
వ్రాయ నలవి కాని♦వైఖరి నొప్పారి, మిన్నంటుచుండు న♦మ్మేడలందు
కల శిల్ప మొకయింత♦కనులపండువుగాఁగఁ, గాంతమన్నను వీలు♦గాకయుండె

తే. నధిక రత్నదీప్తులు నింగి♦నంటుచుండ, ధ్వజ పటాంచితమగు లంక♦పవననూనుఁ
డుంచు నిప్పుచే నిప్పుడు♦మించి మండు, చున్న తీరున దోఁచుచు♦నుండెఁ గంటె.

చ॥ మొగుళులు గ్రమ్మి యున్నతిని ♦ మూసిన పచ్చలమేడలన్ ధగ
ద్ధగమను కాంతు లెల్లెడ న ♦ దంచితలీలలఁ బర్వ మంచి వెం
డి గములు హంసలట్లు స్ఫుర ♦ డింపఁగఁ బచ్చని యాకుజొంపముల్
నెగడి సరస్సునం దలరి ♦ నిండిన తమ్ములఁబోలుఁ జూడుమా! ౨౦౮
మ॥ అనలజ్వాలలవంటి తేజములతో ♦ సంగారు మాణిక్యముల్
మునుఁగం జెక్కిన కంబముల్ గల గృహం♦బుల్ కాంతులన్ జిమ్మఁగా
ఘన సంఘంబులు మింటఁబోవునవి లం ♦ కాపట్టనం బన్న క్రొ
ల్చిన గ్రాఁగించిన యొత్తునా నినుప సం ♦ ళ్లెంబుల్ బలెన్ దోఁచెడిన్.
తే॥ కరులు శాల్లలోఁ ద్రవ్వీన♦కనకరజము, పైనిఁ జల్లికొనుటచేత♦వన్నెమీఱి
స్వర్ణగిరులవై ఖరి మెల్లఁ♦జనుచునున్న, వింతతీరులఁ గాంచితే ♦వినుతచరిత!
ఉ॥ అంగపుఁ బైఁడికాఁడ లల ♦ రారెడు చామరలందునుండి పు
ట్టొందిన గాలిచేఁ గదలు ♦ సన్నమిత ధ్వజముల్ వియత్తలం
బంను చరించు వారిదము ♦ లందలి మైల తొలంగఁ జేయుచున్
బొందిక నంచపిండువలె♦ ♦ బొల్చెడి వింతలఁ గాంతె తమ్ముఁడా! ౨౧౧
ఉ॥ ఈనగరంబు నూలిడిన ♦ యేపున శ్రేణులుగాఁగ నొప్పు మే
లైన కడాని చిత్రముల ♦ నందము చిందెడు సౌధపాళియన్
మానగు తారహారమున ♦ నాయకరత్నముగా దశానన
స్థానమెలర్పు నబ్ధిపతి ♦ దాల్చిన హారముగా వెలింగెడిన్. ౨౧౨
తే॥ మించి గృహ రత్నకాంతులు♦మీఁదఁబడఁగ, వీథులందేగు గుఱ్ఱము♦ల్వింతరంగు
లీన సైజవర్ణము జాతి♦యెఱుఁగరాక, యింద్రధనువులకై వడి♦నెసఁగుఁగంటె.
తే॥ చెఱకు విలుకాని సైతము♦చిక్కువెట్టు, పటికలాల మేడలు వేఱు♦వర్ణముపడ
నెఱుఁగనగుచుఁదక్కిన యప్పు♦డెఱుఁగరాక, నీటిచేఁగట్టఁబడిన నం♦దియము దోఁచు.
తే॥ పండువెన్నెలఁ బోలిన♦నిండుకాంతు,లొలయుచున్న ముత్యాల షం♦దిళుల నడుమఁ
జెక్కఁబడినట్టి పచ్చలు♦క్షీరవార్ధి, పైని శయనించు వెన్నుని♦మేనిఁబోలు.
తే॥ వీరసింహమా! తారక♦వితతిఁ దాఁకు, మేడలం దొక్కవేలుపు♦మెఱుఁగుఁబోఁడి
గాసెసం దీయ ముకురంబు♦గాననయ్యె, రాహు వెరగొని వీడిన♦రాజుకరణి.
తే॥ ధ్వజములొప్పారు మలల చం♦దమునఁదోఁచు, సౌధములలోనిమాణిక్య♦దీధితులను
మావిచివురులె యని భుజం♦వంగఁ గోరి, పొడవు మెడల జాఁచెడునుష్ట్ర♦ములనుగాంతె
తే॥ కైక్యావాసనకై కంబు♦కంతు లిడిన, అగురు ధూపమెల్లెడఁ గ్రమ్మి♦యొగయుకతన
దంతిచర్మధారిని పోలి♦తనరుచున్న, పగడపు న్మేడలం గంటె! పావనగుణ!
తే॥ విశ్వకర్మ నిర్మితములై ♦వివిధగతులఁ, జెలఁగి లోభులా రక్కసుల్♦చేర్చియుంచు
పాపపుం గొక్కసంబుల♦పగిదినున్న, నీలరత్న సౌధంబుల♦నెఱిని గంటె? ౨౧౯

తే॥ హరిణ నిభ భీత దృష్టుల♦యందను చెడి, పతి వియోగముచే జాలఁ♦బరితపించి
మొగులుగనునెమిళులకూట♦ములనుపోలె, దేవసతులుమనలఁగాంచు♦తీరుగాంతె?

తే॥ సురలు సురకాంతలును మన♦చొప్పుగాంచి, మంచిదినములు వచ్చిన♦వంచునెంచి
గొప్ప లంకాపురంబును♦కూల్చి పాడు, చేసి పాఱెడి క్రియనున్న♦చెన్నుగంటె?

చ॥ తెలిపిన తీరు వెండియును ♦ తెల్పకయుండెడు తీరు దోఁపఁగాఁ
బలు తెగలన్ దశాననుని ♦ పట్టణపు న్నెఱి నిట్లు తమ్ముతోఁ
బలుకుచు నుండునంత దశ ♦ వక్త్రుఁడు రాముని సైన్యసంఘముల్
దలకొని చూడఁగోరి చనెఁ ♦ దత్పుర గోపుర శీర్ష భూమికిన్. ౭౩౩

## —: ౧౦ వానరసైన్య దర్శన పటలము :— (౩౫)

సీ॥ సీతయందలియాన♦చేఁ బచ్చవిల్కాని, శరము లుచ్చిన బాహు♦లిరువదియును
శిరములు పది గొప్ప♦శిఖరము లలరారు, పెనుపర్వతంబు నొ♦ప్పిదముతోఁ వ
వలఘుచేఁ గృశియించు♦బాహువు లాలంపుఁ, దలఁపు మాత్రన నుబ్బి♦బలువుమీఱు
దశముఖుఁ డుత్తర♦ద్వార గోపురముపై, నధిక వైభవమున♦నలరి యపుడు

తే॥ కలశములె శిఖరంబులు♦గాఁగ గొప్ప, రంబె మేరువుగాఁ బన్ని♦దంబు సేయు
ననిలుఁ గెల్వఁగ శిఖరంబు♦నదిమిపట్టి, నిలుచు పాఁపరాయని మదిఁ♦దలఁపఁజేసె.

సీ॥ దశదిశలను వాని♦దావుల నీడల, గ్రమ్ముగు ఛత్రము తల♦మీఁదఁగ్రాలఁ
జామర వాయు వి♦స్రస్తోత్తరీయంబు, కొండకాల్వవలె న♦క్కునను వ్రేల
రంభాదిసతులు ధ♦రాజాత కెక్కుడం, దము గలిగించుచు♦దాసిరాఁగ
బొల్కడలి జనించు♦పదునాల్గువేల కా, మిను లింపుగాఁ బాడు♦కొనుచురాఁగఁ

తే॥ బాలచంద్రు లిర్వంద్రొక♦పర్వతగుహా, లందునుండి వెల్వడులీల♦నలరు దంష్ట్ర
కల వెలుఁగు నగలకాంతిఁ♦గలిసిమెలయ, రావణుం డొప్పె నీలాద్రి♦రాజపోలె.

తే॥ కుండలములు దాల్చిన యొక♦కొండనుండి, శబ్దమే లేక వర్షంబు♦జాఱుతీరు
ననుకరించు వీనులయందు♦నల్ల కలువ, లోలకములు మిక్కిలి కాంతు♦లొలయ వ్రేల

ఆ॥ సీత సీత యనుచుఁ♦జిత్తంబు తపియించు, చుండుకతనఁ జాల♦నుములు క్రుంగ
సామవేద సుధను♦చల్లుచు వీణతో, నారదముని పాడ♦నానెముఁగను ౭౩౬

ఆ॥ క్రూర చాప ఖడ్గ♦ధారులు హరుకంటె, నలవు బలము కలుగు♦నసురవర్యు
లంగరక్షకులుగ♦నధికంబుగాఁ ద్రావి, మైకమెక్కు కనుల♦మలసిరాఁగ

తే॥ జగములం ద్రవ్వి యెత్తంగఁ♦జాలువారు, నగరి లంకయుఁ బుట్టిన♦నాఁటినుండి
పేరు పొందినవారు ని♦ర్భీతులు నగు, యక్షవరులు కైవారంబు♦లలరఁజేయ.

క॥ భూచరులు గగనచారులు, నై చెలఁగుచు దుందుభి మురజాదికముల ని
ర్మోచనముగ మొరయించుచు, నేచు కడలీ యులివు చెడ న♦నేకులు రాఁగన్.

తే॥ వినము శ్రీలిల్లు సట్టి చూ♦పెసఁగుచున్న, నాగ కన్యకా మణులును♦నానయొంద
వరసురాఁగనల్ పంచమ♦స్వరమునందు, పరభృతంబుల కైవడిఁ♦బాడుచుండ.

తే॥ మేఘ గంభీరరవముల♦మించువారు, నిడుపు టంగీలు కలవారు♦నిర్జరేంద్ర
భీకరులు వేత్రహస్తులు♦వెనుకముందు, హెచ్చరికతోడ దూరాన♦నేగుచుండ.

తే॥ కంఠ గంభీరరవము న♦కుంఠిత భుజ, గిరుల వాసించు చందనా♦కీర్ణ మోద
వాయువుల మోచికొని గంధ♦వహుఁడు దారి, మించి తనరాక మున్నె జెఁ♦గించుచుండ

తే॥ అగ్ని నేత్రులు చంచలు♦లధిక బలులు, సూక్ష్మబుద్ధులు వినతిమై♦చొప్పు దెలుపఁ
దోరణ ద్వార శిఖరమం♦దారనిలిచి, వేదవేద్యుని దానవ♦విభుఁడు కాంచె. ౨౩౩

తే॥ బొదుగఱచిన రావణు♦నక్షులందు, నుండి మిడుఁగుఱుల్ చిటపట♦మండిరాలెఁ
బెను విరావంబు దిక్కుల♦విసఁగవచ్చె, మనసు మాఁడె నెడమ కేలుఁ♦గనులునదరె.

తే॥ ఇల్లు పెక్కు దుశ్శకునంబు♦లెసఁగుచుండ, రామభూవిభుఁ గాంచిన రా♦వణుండు
మర్నిరీక్ష్యుఁడౌ సూర్యునె♦దుర్చు రాహు, పోల్కి నుడుకుఁదనంబుతో♦బొందెఁగినుక.

తే॥ పరవియున్నట్టి యీకపి♦వరులయందు, రాముఁడితఁడని తన శరీ♦రంబె తెలిపెఁ
దక్కువారల నెఱిఁగింపు♦త్వరితగతిని, యనిన విభునకు సారణుఁ♦డనియె నిట్లు.

తే॥ ఇతఁడు లంకాధిపుని చెల్లె♦లీమెయనుచు, విన్నయంతనే తన కేల♦నున్న కత్తి
చేత దర్పితుఁడై ముక్కు♦చెవులుగోసి, లజ్జ నీకుఁ గల్గించిన♦లక్ష్మణుండు. ౨౩౮

తే॥ ధర్మగతి తక్కఁ దక్కిన♦తానములకుఁ, గనుల బోనీయకుండెడు♦కర్మఠుండు
కడలికొక చక్రవాళంబు♦కరణినుండుఁ, దపసుల కసాధ్యమా నిద్రఁ♦దఱిమినాఁడు.

తే॥ లక్ష్మణుని కేలు తనదు కే♦లందరించి, యున్న ఘనభుజుఁ డండంబు♦లదరునట్లు
వాలితో ననిచేసిన♦వలఁతికాఁడు, కీశ కుల వరేణ్యుండు సు♦గ్రీవుఁ డధిప!

సీ॥ వానిప్రక్కనె యున్న♦వానితండ్రియె వేలు, పులు కోరఁ గలశాబ్ధిఁ♦జిలికినతఁడు
ఆ వడచెడువాఁడె♦యర్కుని చెంగట, నెగయుచు విద్దెల♦నేర్చినతఁడు
ఇలను కోటులతోడ♦నెత్తిన వెన్నుని, సాటివాఁ డంబుధి♦దాఁటినాఁడు
అతనిచేతలు నీవు♦నరసినవే కదా, అట నిలుచున్న వాఁ♦డగ్నిసుతుఁడు

తే॥ దండపాశ శూలంబులు♦తనరకున్న, భయదమైన యొడలి రంగు♦పరఁగకున్నఁ
గార్యమునంబట్టి శత్రువ♦ర్గంబులితని, జముఁడెయనివల్కు చంద్రురా♦క్షసకులేంద్ర!

ఉ॥ పేరుగ నిల్చినాతఁ డతి♦విశ్రుత కీర్తి నలుండు వార్ధిఁ జేఁ
దూరక గర్వమొంది తన ♦ కొప్పుగఁ ద్రోవ యొసంగఁడంచు నీ
శౌర్యముండు పొందిన క్రు ♦ ధా బడబానల మాఱుమున్నె యీ
వార్ధి బంధనంబు గరు ♦ వంబుగఁ జేసెను రాక్షసేశ్వరా! ౨౪౧

చ॥ అరయఁ ద్రికాలవేది యను♦రాముఁ డంబుధిఁ ద్రచ్చువేళ ద
గ్గఱఁ దగ నుండి నాతఁడు జ♦గంబులఁ గొల్చిన వాఁడు విష్ణువుఁ
గుఱుతర భక్తితోడ వల♦ గొన్న మహాత్ముఁడు వృద్ధుఁడయ్యు ని
ద్ధరణి సమస్త మెత్తఁగల♦ దట్టుఁడు భల్లుకరాజితుండగుఁ. ౨౮౨

తే॥ నీలశైలంబు ప్రక్కన♦నిల్చు రెండు, పైఁడికొండలవలె నీలు♦ప్రక్కనిలిచి
రామలక్ష్మణులం బలె♦రాజిలు కవు, లమర వైద్య పుత్త్రులు వార♦లసురనాథ!

సీ॥ ఆదూరమునఁ గాన♦నగువాఁడు కుముదుండు, కుముదాక్షుఁడట నిల్చు♦కొన్న వాఁడు
గవయుఁ డీతండగు♦గవయాక్షుఁ డాతఁడు, బ్రహ్మరుద్రులఁబోలు♦బంటుఁగన్న
సజ్జనహితుఁడు కే♦సరియగు నాతండు, నరసింహు బోలిన♦మురభుఁడతఁడు
పెక్కుకొండలఁ జేర్చి♦పెట్టి యెత్తఁగఁజాలు, శరభుఁ డీతఁ డితఁడు♦శతబలియగు

తే॥ మూఁడుకన్నులు లేని త్రి♦పురదహనుఁడు, పనసుఁ డనువాఁడు దురమును♦వబ్బమెల్ల
జరుపఁ బూనినవాఁడు ఋ♦షభుఁడు వాని, యెదుటివాఁడు సుషేణుండు♦హితగుణుండు.

సీ॥ కపిరాజు డాపలఁ♦గలభంబు కైవడి, నొప్పినవాఁడు మ♦హోద్ధతుండు
కొండల నొకచోటఁ♦గూర్చి భూమధ్యంబుఁ, గ్రుంగింపఁ జేసిన♦గురు బలుండు
దధిముఖుఁ డనువాఁడు♦తత్సన్నిధిని గానఁ, బడువాఁడు శంఖుండు♦ప్రథితయశుఁడు
కడలి వీచీలను లెక్క♦యిడవచ్చు వారిధి, యిసుకను లెక్కించి♦యెఱుఁగవచ్చు

తే॥ చుక్కగమినైన లెక్కించి♦చూడవచ్చు, వానరుల లెక్కయిడ నేరి♦వలనఁగాదు
దనుజ చంద్రమ! మేము గాం♦చిన తెఱంగు, విన్నవించితి మన దైత్య♦విభుఁడు కినిసి.

ఉ॥ చేలఁ జరించుచుం విశృత♦చేష్టలఁ జేయుచు నుండు కోఁతులం
బోల నుతించుచుంటి వది♦పోలునె? జింకలు కోటి గూడి బ
ద్ధాలన శీర్ణ వార్ధకమృ♦గాధిపుఁ దాఁకి జయింపనేర్చునే?
యేల వృథా వచింప? వని♦యెల్లిద మాడుచు నవ్వె ఫక్కునం. ౨౮౩

౧౧. మకుటభంగ పటలము. (౫౨)

తే॥ రావణుం డట్టులుండ శ్రీ♦రాముఁ డిచట, రావణానుజుఁ గాంచి పు♦రంబునుండి
మనలఁజూచు వేడుక ద్వార♦మునకు వచ్చి, నట్టివారి గుణాదుల♦నరయఁ దెలుపు.

చ॥ అనుడు విభీషణుండు ధర♦ణాధిపుఁ గాంచి వచించు బంధు లౌ
ఘను లను నాఱు నూఁడ్చి నర♦కంబున నాటఁగ స్వీయవంశముం
గొనకొని మిక్కిలిం బురద♦గుంటగఁ జేసిన నీచకర్ముఁ డా
వన కులకాంతలం జెఱను♦వైచిన రావణుఁ డాతఁడే చుమీ. ౨౮౪

చ॥ అనుచు మఱొక్కనింగుఱిచి♦యాడ దొరంకొను మున్నె భాస్కరుం
గనిసిన వండటంచుఁ దిను♦కాంక్షను దాఁటిన వాయుసూను మా

డీకొని కపిరాజు కన్నులతో ♦ డింబడి దూఁకఁగ విస్ఫులింగముల్
మునుకొని దాఁటె రావణుని♦మూర్ధము లంఘ్రులఁ దన్ని కోర్కిమై
తే॥ కోఁతి ఱేఁడు సువేలాద్రి♦కొమ్ము విడి, రావణుండున్న పెనుగోపు♦రంబుమీఁద
దాని బలమడంగఁగఁ దూఁకెఁ♦దరణి యుదయ, గిరి విడిచి యస్తగిరిఁ జేరు♦కరణిఁ దోఁప.

చ॥ అరయఁగఁ బల్లమందు పడు♦సంబువులంబలె ధాత్రిఁ గూలి కుం
దొరయు త్రికూటముం జలన ♦ మొందఁగ దూఁకిన సూర్యసూతి మున్
ధరణిజ దుఃఖమొందఁ గని ♦ దానవుపైఁ దన డెందమట్లు పె
న్నురవడి దూఁకినట్టి విహ♦గోత్తము పోలిక నొప్పె నత్తఱిన్. ౭౫౧

ఉ॥ నీరదగాత్రు తామరస♦నేత్రు ఝషధ్వజజైత్రు రాముఁ జె
న్నారఁగఁ జూడ గొప్పవగు♦నక్షులు గల్గుటకున్ మనంబులన్
మీఱిన యుబ్బుఁగొన్న దివి♦మొత్తులు పిడ్గు పడంగఁ బాఱు మా
యూరములట్లు దిక్కునకు♦నొక్కరుగాఁ బరువెత్తి రోటమై. ౭౫౨

తే॥ ఇనకుమారుండు రావణు♦నెదుట నల్ల, మల యెదుటఁ దెల్లమల యొండు♦నిలుచునట్లు
దిగఁగ హాలాహలము లేవ♦దిగులుగొనక, నిలుచు హరుచందమున నిల్చె♦నిర్జరారి.
తే॥ వచ్చు కార్యమేమని కపి♦వర్యు నడుగ, మాఱుపలుక కాఱేఁడు దశ♦మస్తు నొడలు
పదరఁ దన బలిష్ఠంబగు♦బాహువెసను, ఱొమ్మునం దిగఁబడునట్లు♦గ్రుమ్మెనంత.
తే॥ వృక్షసాంద్ర మహారణ్య♦విధముగాఁగఁ, బెరిఁగియున్న బాహులతోడఁ♦బిడుగుపోల్కి
దెసలు ప్రతిరావములతోడ♦దిమ్ము పుట్టఁ, గినుక దైత్యుఁడు పొడిచె సు♦గ్రీవునురము

క॥ కొట్టినచోటున నెత్తురు, పుట్టఁగఁ గపిరాజు కోప♦పూర్ణనయనుఁడై
కిట్టి పదితలల మోములఁ, గట్టిగఁ దాఁచెను కడింది♦కాలన్ గేలన్. ౭౫౬

తే॥ తన్నినట్టి సుగ్రీవుపా♦దములు రెండుఁ, బట్టికొని క్షణమున దృఢ♦బలము చూపి
మదగజమును హర్యక్షంబు♦మాడ్కి నసుర, విభుఁడు గోడకుఁ జేరిచి♦విసరి తాఁచె.
తే॥ తాఁప భానుజుఁ డోడికానఁ♦దప్పికొనుచుఁ, గొట్టినట్టి రావణుమేను♦క్రుంగునట్లు
నేలకుం ద్రోచి కందరఁ♦బోలు నోటఁ, గ్రక్కుఁ బొడిచి నెత్తురువట్టి♦కడఁకఁ ద్రావె.

ఉ॥ కాటుకకొండవంటి ఘన ♦ కాయము గల్గిన రావణుండు చో
క్కాటపు నెత్తుఁ ద్రావు ఘన ♦ కర్ముని దేహముఁ బాఁపఱేఁడు మేల్
హాటకశైలమూనిన వ♦యంబునఁ బట్టి బలంబుతోడ ది
క్కూట వగంబుపై నుదుకు ♦ కోపునఁ ద్రిప్పె మిడుంగుఱుల్ పడన్.

చ॥ త్రిపురములన్ దహించుతఱి ♦ రేఁగిన రుద్రునిమాడ్కి పొంగి య
క్కపికులకాంతుఁ డట్లు తన♦కాయముఁ ద్రిప్పిన వాని ఱొమ్మునన్
[illegible] వాఁడిగోళ్లు దిగ ♦ దాయఁగ గ్రుద్ది దశాస్యు మధ్యమున్
[illegible] బట్టి త్రిప్పి వడిఁ♦దాఁచెఁ గడంక నగస్థలిఁ బడన్. ౭౬౦

ఉ॥ రావణుఁ డుం బరంపడి తి ♦ రంబుగ వచ్చుటి కెక్కి వచ్చి సు
గ్రీవుని పట్టి త్రోచి దరి ♦ కిం జను దెమ్మని పంతమాడ నా
త్రోవని యాతఁ డెక్కి వడి ♦ దోర్బలు లిద్దరు బీఱువోక రొ
క్కినడిఁ బోరిపోరి పడి ♦ యాఁగిరి యొక్క యగ డ్తలోనికిన్. ౨౬౧

క॥ ఇరువురు కుడయెడమలుగాఁ, దిరుగుచు డాయుచును డాయఁ ♦ దిగుచుచుఁ దొలఁగం
జరుగుచు నడఁగుచు లేచుచుఁ, బోరిపోరి శ్రమదీర్చుకొనుచుఁ ♦ బోరిరి కడిమిన్.

క॥ అగడిత యను పెనుకడలిన్, సొగసుగఁ జిలుకంగ నొక్క ♦ నుడి యేర్పడఁగా
నగచరపతి వాలిక్రియన్, దగఁ గవ్వంపుఁగొండపగిది ♦ దనుజుండొప్పెన్. ౨౬౩

తే॥ చెలఁకుగానుగనుండి పా ♦ ల్దొరఁగురీతి, గాయములనుండి రక్తంబు ♦ కాఱుచుండ
వార లెగసిరి పక్షుల ♦ వలెనె మింటఁ, బురజనంబులు భీతిల్లి ♦ పరువులెత్త. ౨౬౪

తే॥ గగనమందు పోరాడెడు ♦ కపివరుండు, కక్షయొడలున్న రాక్షస ♦ కాంతు పెక్కు
బాహువులచేత నడుమంగఁ బడుచుఁ బరిధి, చుట్టియున్నట్టి నడుమింటి ♦ నూర్యుఁ బోలె

తే॥ మింటఁ గోపంబుతోఁ బోరు ♦ మిహిరసుతుని, మైకళుకు దన భుజముల ♦ మఱుఁగుపుచ్చ
పంక్తికంఠుఁడొప్పెనుదిన ♦ ప్రభు నికాంతి, మఱుఁగుపడఁ జేయుదొంతుల ♦ మబ్బుమాడ్కి.

క॥ నూపురములు మ్రోయఁ జెలులు, కాఁపురములు వీడి పాఱఁ ♦ గలఁత వడుచు లం
కాపురము చెడఁగ దాఁటెం, గోపురమడఁగ న్నృసింహు ♦ కోపునఁ గపియున్

తే॥ మెఱుపనెడి దంతములు గల ♦ మేఘమొకఁడు, ఘనదృశంబగు పిడుగు వె ♦ న్నాడు తీరు
తోఁప మ్రింగివై చెదనని ♦ దుదుకుతోడ, వచ్చి రావణుఁ డాతనిఁ ♦ బట్టికొనియె.

సీ॥ దాసిన రావణుఁ ♦ ద్రోసి నేలకు రాచి, సుగ్రీవుఁ డార్వన ♦ సుర విభుండు
యంత్రంబు క్రియ లేచి ♦ యాతని నెత్తి యు, వ్వలికి దవ్వుగ బాఱ ♦ వైవ నతఁడు
చెండువలెనె లేచి ♦ చెలఁగె నాపోరున, ధరణి బీటలువాఱెఁ ♦ దరులు విఱిగె
గోడలు ప్రీలెను ♦ గొండలు చలియించెఁ, బ్రాకార మెల్లెడఁ ♦ బగిలి చెడియె

తే॥ గాలివడగలవలె మింటఁ ♦ గ్రాలుచుండు, వారి దేహస్థితులు దాసె ♦ వదలెఁ గలిసె
నెడసె విసరిరి పొడిచి రం ♦ చెఱుఁగ లేక, రక్కసులు నోటగొనిరి దు ♦ రంబు సేయ.

—: శ్రీరాముని చింత :—

తే॥ ఇట్లు వారికి సంగ్రామ ♦ మెసఁగుచుండ, నీల నీరద వర్ణుండు ♦ నీతిమేర
ప్రాణమిత్రుండొ సుగ్రీవు ♦ రాక గనక, తలఁపులెల్లను కలఁగఁ జిం ♦ తను భజించె.

మత్త॥ ఈవు లేక యమూత్కరంబు వ ♦ హించి యేనొక కార్యమున్
దావుకో జరుపంగ నేర్తునె! తత్త్వవిత్తమ! మిత్రమా!
దేవతాళికిఁ గూర్చినాఁడవు ♦ తీవ్రదుఃఖము నీదు కో
పావిలంబగు డెందమిట్లు జ ♦ యంబు దైత్యుల కిచ్చెఁగా! ౨౭౧

మ. మాయలాని నిశాచరేంద్రుని ♦ మాయఁజిక్కితి తప్పిరా
నేయుపాయములేదొకో? యిట ♦ కీవు రామిని క్రూరదై
తేయపాళి జయించియుం గల ♦ దే సుఖంబు? వియోగినై
మాయుచుండఁగఁ బ్రాణమిచ్చిన ♦ మానసీయ! సుహృద్వరా! ౨౨౨

ఉ. కోరిక యొక్కటైన మఱి ♦ కూడిన దొక్కటియయ్యె నక్కటా!
ధారుణిశేఖరంబుగ వృ ♦ థా బ్రదుకేల మది నిచ్చగింప దే
వారియు నీవధింపఁ గడు ♦ నాఱడి చేరఁగ నన్ను గూడ నీ
ఘోర రణంబునందు తెగఁ ♦ గూల్చినవాఁడవు నీవ కావొకో? ౨౨౩

ఉ. నేఁడిటులీవు బ్రుంగ నిట ♦ నిల్చి సురారులఁగూల్చి ప్రాణముల్
వీడుదునేని యాపదల ♦ వేళలఁ దోడయినట్టి మిత్రుఁ గా
పాడఁగలేకపోయెనని ♦ పామరలోకము నిందసేయదే?
నీడనుబోలె నన్ను విడ ♦ నేరని చెల్వుఁడ! యెట్లొనర్తువే? ౨౨౪

ఉ. ప్రాణముపోవునట్టి పని ♦ వట్టితి నాపయినున్న ప్రేమచేఁ
బ్రాణ మొసంగి జీవములఁ ♦ దార్చి సుఖంబులఁ గూర్చి నాకు సం
ప్రీణనముం బొనర్చిన య ♦ మేయ గుణాకర! సైన్యమెల్ల వి
న్నాణముగాఁగఁ గ్రమ్మఱిన ♦ నామది నంగద పాయనేర్చునే? ౨౨౫

మ. అని శ్రీరాముఁడు దుఃఖమొందఁ నట వీ ♦ రాగ్రేసరుల్ గెల్పు ని
ల్పును లేకుండఁగఁ బోరుచుండ నిఁక మే ♦ లుంగూర్పఁ జాలైన నం
చును లంకేశ్వరుఁడెంచ శీర్షకములన్ ♦ శోభిల్లు రత్నంబులన్
దినరాట్పుత్త్రకుఁ డూడఁదీసికొని ప్రీ ♦ తిం జేరె సీతావరున్ ౨౨౬

ఉ. చింతఁ దపించుచున్న రఘు ♦ శేఖరు పాదసరోజ రేణు వ
త్యంతము శీర్షమంటఁగ న ♦ మర్పణసేసెను తన్మణీగణం
బంతట నెల్ల వారలకుఁ ♦ బ్రాణము లవ్వల వచ్చినట్లు పె
న్సంతసమబ్బె నుబ్బె మది ♦ చక్షుల బాష్పముగ్రమ్మె నిమ్ముగన్. ౨౨౭

ఉ. ఎమ్ములదాఁకఁ జీలిన క ♦ పీంద్రుని గాయములందు వచ్చు ర
క్తమ్మును రాక్షసేశ్వరుని ♦ తాఁకిన హైన్యమువోవ రాఘవుం
డిమ్ముగఁ గౌఁగిలించి నయ ♦ నేంద్రియముల్ వెడలించు బాష్పపూ
రమ్మునఁ దానమార్చి యను ♦ రాగముతో వచియించె నిర్వ్యథిన్. ౨౨౮

తే. నన్ను నీ వెడఁబాయుట ♦ నామనంబు, భేదన మొనర్పలేక దా ♦ ప్రేమపూర్ణ!
ఒడలు స్తంభించె మది చేష్ట ♦ లుడిగె జీవ, ములును తల్లడిల్లెను దిగు ♦ లలమికొనియె.

మ. కరుణాహీనుఁడు రావణుండు నిను వీఁ ♦ కం జంపి యున్నేని త
ద్ఘనదోషంబుఁ దలంచి క్రూరశర సం ♦ దోహంబుచే మూలము

ట్టఱ రక్షోవ్యయమెల్లఁ గూల్చినను నా ♦ ప్రాణంబులం గాచికో
ధర జీవింతువయేని యోపుటయె గా ♦ దా? మిత్రవాంఛాశయా!

మ॥ ఒకచిత్తంబున నెంతమేని యశముల్ ♦ యోగ్యత్వముం బ్రాయి యో
ర్మికి సత్త్వంబు నొసంగునట్టివిక దా ♦ మేలంబు గారంబు నీ
వకటా! యెంచ కిహంబు మోక్షమును మా ♦ యం జేసెదే? యూరకే
యొకటింగోరి మఱొంచు చేసితివి నీ ♦ కొప్పారునే యీవిధుల్? ౭౮౧

శా॥ సంతాపస్థితిగొల్పి యింతదనుకన్ ♦ జాలంబునే సేయుచో
వంతం గుందెడు సీతచే ధరణిచేఁ ♦ బ్రాణంబుచే నాకిటన్
మంత్రైనన్ సుఖమబ్బునే? యనువులన్ ♦ బ్రుక్కింప లోకంబు వి
శ్రాంతిం గోరక నన్ను వెన్కొనును కా ♦ ర్యంబిట్టులుం గూడునే?

తే॥ పిల్లతనపుఁజేష్టల నింక ♦ వీడు మనుచు, మందలింప రామునికడ♦మందటిల్లి
శిరము వంచిన సింగంబు♦కరణినుండి, యిట్టు లనియెను సుగ్రీవుఁ♦డీలగొనుచు.

శా॥ కాటంజేసిన గృధ్రరాజుపనియుం ♦ గావింపలేనైతి నా
నాటం జేసిన బోయరాజుపనియున్ ♦ గావింపలేనైతి నీ
నాటం జానకి యొందుచున్న చెఱయున్ ♦ దప్పింపలేనైతి ని
ప్పాటన్ రావణుశీర్షముల్ పదియు న ♦ ర్పింపంగలేకుంటిఁగా. ౭౮౪

మ॥ బలియుండైన విరోధి ప్రాణములతో ♦ భాసిల్లుచున్నాఁడు కీ
శులకుం బోలిన చేష్టఁజూపి తుద కి ♦ చ్చోఁగ్రుంగి నీకీర్తికిం
గలుసుంగొల్పితి నావిరోధి ననిలో ♦ ఖండించి రాజ్యంబు నా
కొలయుంగూర్చిన మీకె మీపగఱ నే ♦ నొప్పించితిన్ లేనైౖ. ౭౮౫

తే॥ దిక్కరుల దంతములకంటెఁ♦దక్కువయ్యె, నాభుజంబులు నీదుబా♦ణములకంటె
ముందుగానేగి ముష్కరు♦ముగియఁజేయు, వాంఛనేగి వ్యర్థుండనై♦వచ్చినాఁడ.

తే॥ శాస్త్రబలుఁడగు నీదూత♦చనియొనర్చె, సమరమున నస్త్రబలమును♦శస్త్రబలము
బాహుబలము శత్రులు చూప♦వాలుబలము, చూపె నాకాలిబలమిటఁ♦జూపినాఁడ.

తే॥ అనుచు వినతశిరస్కుఁడై♦యర్కవంశ్యు, సన్నిధిని రవిసుతుఁడున్న♦సమయ మరసి
ఆతనిఁగని రాముఁ డెఱుఁగంగ♦నసుర నేత, యగు విభీషణుఁ డిట్లు ప♦ల్కాడఁ దొడఁగె.

చ॥ పెకలిచి తెచ్చు రత్నములు♦బెట్టిదుఁడౌ దివిజేంద్రవైరి మ
స్తక మకుటాగ్ర సన్మణి క♦దంబము కావున వానికంటె ను
త్సుకతనుకూర్చు వస్తు వికఁ♦జొప్పడునే దనుజేంద్రుకీర్తి పా
దు కలఁగఁజేసినాఁడవు సు♦దుష్కరమియ్యది యెట్టివారికిన్ ౭౮౯

చ॥ నలఁచి భుజంగమేంద్రుని ఫ♦ణామణు లూడఁగఁదీయవచ్చుఁగా
కలఘు ధనుఃకళాచణు ద♦శాననుమస్తక రత్నరాజముల్

బలిమిఁ బెకల్చి తెచ్చిన చ॥లంబు మగంటిమి రుద్రమూర్తి కే
నలవడునేమి? కీర్తికర॥మైనది యింతకు మించి కల్గునే? ౭౯౦

చ॥ హరుని శిరంబునం దమరు॥నంబుజునైనఁ బెకల్పవచ్చు శ్రీ
హరియురమందు కౌస్తుభము ॥ నైనను బల్మిఁ గొనంగవచ్చు నా
కరణి వసుల్ మగంటిమివి ॥ గావు దశాస్య కిరీట రత్నముల్
పరువడి తీయుటన్న సుల॥భంబగుకార్యముకాదు మిత్రమా! ౭౯౧

చ॥ మెఱుపులఁబోలు కాంతులను ॥ మించిన యంగద బాహువీర! నం
బరమునఁ జంద్రహాసము ను ॥ మాపతినుండి గడించినట్టి ని
ర్జర రిపు మస్త రత్నములు ॥ రాముఁడు నిల్పు జయేందిరా పదాం
బురుహ మలంకరించుటకుఁ ॥ బూనికఁ దెచ్చిన యందియల్ సుమీ!

చ॥ అనుడు దినేశవంశ్యుఁడను ॥ నయ్య జయేందిర చంచలాత్మ యొ
క్కనువుగ గెల్పెముల్ శుభము ॥ లందవు మేలును కీడువచ్చుఁ గా
వున నిటు సాహసించి యటఁ ॥ బోవలదంటిని నీవు చేయు ని
ప్పని సులభంబె భూమిఁ గొన ॥ పంట ధరించిన పోత్రికేనియున్?

మ॥ జయశీలుండగు దైత్యరాజ మకుటా ॥ చ్ఛ స్ఫార రత్నావళుల్
భయమున్ వీడి పెకల్చెఁ బుత్త్రుఁడని నన్ ॥ బాధించునో యంచు సం
శయుఁడై యయ్యెడ డాఁగువానివలె భా ॥ స్వంతుండు క్రుంకెన్ విని
ర్దయులౌ వారికి జంకకుండు రెవరీ ॥ ధాత్రిన్ జగత్సేవకుల్? ౭౯౪

తే॥ రాత్రిగాఁగ రావణ శిరో॥రత్న చయము, దీపములవలె మిక్కిలి॥ తేజరిల్ల
వగచరేంద్రుని విజయంబుఁ॥బొగడి యులరి, రామచంద్రుండు తనశిబి॥రంబు చేరె.

ఉ॥ ఎన్నఁడు నిట్టి భంగములు ॥ నించుక యొందని రావణుండు తన్
బన్నగ నిద్రరావలి నె ॥ పంబిడి కాంచెనో యంచు సిగ్గుతో
నన్నులచూపులెల్ల మగ॥లన్నల చూపులె యౌచునుండఁ ద
త్సన్నుయశంబుమాడ్కి దిగె ॥ ధారణికి న్నడపీన్గుకై వడిన్. ౭౯౬

౧౨. వ్యూహ నిర్మాణ పటలము. (౨౮)

క॥ మావ నిహాత మర్త్యుండగు, దానవ విభు మోము ముడుఁగుఁ॥ దామరవలెఁ గా
మావగు సౌధమునకుఁ జని, పానాదికములను వీడి ॥ పడకకుఁ జేరెన్. ౭౯౭

సీ॥ వాఁడి కోఁజలచేత ॥ పీను మణులచేత, నిట్టూర్పు పెనుబొల్ల॥నియతిచేత
తలల విరిచిచేత॥దామోదరుని వీడి, పాలకడలినుండు॥పాముఁబోలె
నుండ జనవికంపి॥యెందుగ నలవాటు, వడిన వారలనైన॥భ్రమలుపుచ్చు
శార్దూలుఁడను వేగు॥వరగువ వటకురా, ద్వారపాలకుఁడు దై॥త్య విభుఁ జేరి

తే॥ వైరులను డాసి వారల♦పను లెఱింగి, రమ్మనిన గూఢచారి ద్వా♦రంబుచేరె
సెలవె? యనఁ దల వంకించి ♦ చేతిసైఁగ, సేయఁ గంచుకి వానిని♦ చేరఁబిలిచె.

తే॥ ఎఱిఁగినట్టివృత్తమువచి♦యింపుమనఁగ, ప్రభుని మోముజాడను తా♦పమునటదెలిసి
జంకుచును వేగుమెల్లఁ దాఁ♦జన్న మొదలు, గాంచినది పద్ధతిగఁ జెప్పఁ♦గాఁదొడంగె.

తే॥ పదియునేడు వెల్లులతోడఁ ♦ బవనసుతుఁడు, మొనసి పడమటి వాకిలి♦ముట్టఁజనియెఁ
బదియునేడు వెల్లువలతోఁ♦ బ్లవగరాజు, నంచుకొనియె రాముఁడుతన♦యొద్దనధిప!

తే॥ పదియునేడు రాణువలతో ♦ వాలికొడుకు, దక్షిణంపుగవని ముట్టఁ♦దరలినాఁడు
పదియునేడు చేరువలతోఁ♦ బరవి నీలుఁ, డరిగెఁ దూరుపు వాకిలి♦నాక్రమింప.

తే॥ వాహినీద్వయమును పోరు♦వారికెల్లఁ, బండ్లు గాయలు తేర నేర్పఱచె నీదు
తమ్ముఁ డన్ని గవంకులఁ♦దవరు స్థితుల, నరసి తెలుపుచునుండున♦ట్లాజ్ఞయయ్యె.

మ॥ అని శార్దూలుఁడు పల్క రావణుఁడు రౌ♦ద్రాకారుఁడై రేఁగి పం
డ్లను దర్పమ్మున గీఁటుచుఞ్ బగఱఁ జం♦డ ప్రక్రియఞ్ రేపె తొ
త్తునియల్ సేసి రణాంగణంబున మహో ♦ త్తుంగంబుగా లేచు ధూ
ళిని క్రుంగించెద రక్తపూరమున నా ♦ లీనంబుగాఁ జూడుమా. ౮౦౩

మ॥ తరుసాంద్రంబగు నీలశైలముపయిం ♦ దార్కొన్న లేయెండ వై
ఖరి రక్తంబుల డాలు మైనొలయ లం♦కానాథుఁ డవ్వేగు వం
పి రయంబారఁగ రేఁపు వృత్తిగల పూ ♦ విల్కానిచే మాఁడు పూ
సరముల్ మాఱిచి యేగె మంతనముకై ♦సన్మిత్ర వర్గంబుతో. ౮౦౪

సీ॥ బయసె యయ్యది యని♦బమ్మెర గొలుపు ప, టికరాలచేతఁగ♦ట్టింపఁబడిన
సౌధంబునందు పి ♦ శాచగణంబులఁ, జుట్టుకావలిగాఁగ ♦ సొరిది నిలిపి
కర్తవ్యమును చక్కఁ♦గా విమర్శించి వ, చించు నుత్తమ కుల♦శీలవరులఁ
గని మహాద్వారంబు♦లను కోఁతిమూఁకలు, ముట్టడించెను పెను♦పోరుగలిగె

తే॥ వచ్చినది వలదన్నను♦వదలఁబోదు, తలఁచి చేయంగ♦దగినది♦ తెలుపుఁడనిన
వారిలో నికుంభుండను♦వాఁడు లేచి, వంక్తికంతు మోమును కాంచి♦పలికెనిట్లు.

ఉ॥ డెబ్బది వెల్లువల్ ప్లవగ ♦ డింభకముల్ మనకోట ముట్టుచుఞ్
నిబ్బరమొందియుండెనని ♦ నీవిటఁ జింతిలుచుంటి వేల? మే
లబ్బెను వేయివెల్లువలు ♦ హాళిగ సైన్యము వారికోరికల్
దబ్బఱ సేయఁ గాంక్షగొని ♦ తత్తఱ మందుచునుంట గాంచవో? ౮౦౬

చ॥ ముసల గదాది సాధన వ ♦ ముత్కరముల్ ధరియించి వచ్చి రా
క్షసు లెదిరించి నిల్వఁ ద్రిద ♦ శప్రకరంబులె కేలుమోడ్చి వే
దెసలకుఁ బాఱుచుండు నన ♦ దిక్కఱి ప్రామెదు కోఁతిమూఁక యి
క్కనుగొని వట్టిచేతులను ♦ కాంచు జయంబది మెచ్చఁగాఁదగుఞ్. ౮౦౭

తే॥ అనిరణోత్సాహవాక్యంబు♦లాడునతని, మాన్చిమాల్యవంతుఁడు చాల♦మనసునొంచి
వేఘ మొనరించు కామమ్ము♦వేరుతోడఁ, జెఱచె నని యెంచి యీరీతిఁ♦జెప్పఁబూనె.

సీ॥ మనసగరముచొచ్చి♦యనలంబు దరికొల్పి, నీఱుచేసిన యాంజ♦నేయుచేత
శరములుండెనో శరా♦సనముండెనో వట్టి, కాలును కేలును♦వాలుగాక
మలలట్టి యీరాదశ♦మ స్తకంబులనున్న, మణులఁ గొంపోయిన♦వనచరునకు
శూలముండెనో భింది♦పాలముండెనో గొప్ప, వాలముండెనో తలఁ♦పంగవలదె!

తే॥ రామచంద్రుని బాణముల్♦రాకమున్నె, యుర్విజనొసంగిసాయుధీ♦యుల మనాయు
ధీయులను శరణనుచుఁ బ్రా♦ర్థించుటొక్క, యిమ్మదక్క వేఱొక రక్ష♦కమ్మ కలదె?.

ఉ॥ నాశముగూర్పనున్నవిధి ♦ నాలుకఁద్రిప్పుచునుండఁ జూచి లం
కేశుఁడు తాతపల్కులకు ♦ నీక్షణము ల్కడుఁగెంపుచేసి నా
కీశని దావురించెఁ జన ♦ విచ్చు కతమ్మన నంచు దుష్కృధా
వేశము గొల్పు పల్కులను ♦ వీడుము నా నతఁడూనె మానముల్. ౮౧౦

తే॥ అనిని తలసూపు కాలకే♦యాదుల మద, మడఁగఁజేసినవీర! ప్ర♦హ స్త! యారి
తేఁటియున్న సైన్యముల ని♦న్నాఱు వెల్లువలను గొనుచుఁ దూర్పు గవని♦వలనికరుగు.

తే॥ దురమునఁ గృతాంతు మోదంబు♦తూలవుచ్చు, బల! మహోదరా! మన మహా♦పార్శ్వతోడ
రెండువందల వెల్వాల♦నండగఁ గొని, దక్షిణవుఁ గోట వాకిటి♦దండ నిలుము.

ఉ॥ ఇచ్చటఁ బ్రజ్ఞలాడ ఫల♦మేమియుఁ గల్గదు మేఘనాద! నాఁ
డచ్చుగ వాయుసూనుని ప♦రాక్రమముం దగఁగాంచితేకదా!
వచ్చినవారితోడ జత ♦ నంబున రెండగు వంద వాహినుల్
చెచ్చెరఁ గొంచుఁ బశ్చిమము ♦ చేరుము వారలకంటె మున్నగన్.

మ॥ అరుదా జీవితమెల్ల వేల్పులకుఁ గ ♦ ష్టౌఘంబులం గూర్పనే
యరిగె న్నిపరిపీరులెవ్వరు విరూ ♦ పాక్షా! యలంతుల్ వనే
చరులం గూల్పఁగఁబోవు కెల్లిదమగున్ ♦ జర్చింపఁగా నీకు ను
ద్ధరమా మూలబలంబుతోడఁ బురము ♦ దోగ్యంబుతోఁ గావుమా.

ఉ॥ ఇమ్మగ సత్యలోకమున ♦ కీవలనున్న జగంబులందునన్
ముమ్మరమైన పోరులను ♦ మున్ జయమందు శతాంగ వారణా
శ్వమ్ములఁ గాల్బలంబు లిరు ♦ వందల వెల్వలఁగొంచు నేనె ము
ఖ్యమ్మగ నుత్తరంపు దెసఁ ♦ గాచెద నంచు వచించి పంచినన్. ౮౧౫

సీ॥ జగము కకంత వెంచెం♦దఁగ హేతువైన త, మంబు రూపొందు క♦ల్పంబుమాయ
వర్వా మండలంబు♦సంచరించెడు నుర, గణములు మాత్రమా♦కాదుకాదు

ఇవాభోగములఁ ద్యజి ♦ యించిన పకాని ని కాయంబు మాత్రమా ♦ కాదు కాదు
అడజడి కూడుగా ♦ గడియ యుగంబుగాఁ, గల సీతమాత్రమా ♦ కాదుకాదు

తే॥ కడకు రాముఁడు మాత్రమా ♦ కాదుకాదు, కర్బురేంద్రుండుమాత్రమా ♦ కాదుకాదు
ఎల్లవార లానందాన ♦ నుల్లసిలిరి, తిమిర మడఁగుచు భల్లునఁ ♦ దెల్లవాఱ. ౮౧౬

మ॥ కరుణాహీనుని చండశాసనము నీఁ ♦ గన్ లేక యల్లాడు చి
ల్లర జేఁదుల్ తలయెగ్గి యుండఁదగు వే ♦ ళన్ సార్వభౌముండు ము
మ్మరులం గూల్పఁగవచ్చుచోఁ గనెడు వీఁ ♦ కన్ లోక ముత్కంఠతో
వెరవారం గనుచుండ వెల్వడెఁ దమో ♦ విద్వేషి వ్యోమంబునన్. ౮౧౭

చ॥ తెలతెలవాఱుచుండఁగనె ♦ దిక్కుల ముంపఁగఁ బాదధూళి పే
రులివు సముద్రఘోషణము ♦ నొత్తఁగ వానరసైన్యనాయకుల్
తెలిపిన పద్ధతిం బ్లవగ ♦ ధీరులు మిక్కిలి యుత్సహించుచున్
జలకొని ముట్టి గొక్క మొగి ♦ దానవనాథు పురంబు వాకిళుల్. ౮౧౮

తే॥ చుట్టి యండంబు లగలంగఁ ♦ జుక్క లురల, నార్భటింపఁగ సౌమిత్రి ♦ యగచరేంద్రుఁ
డొనరముందుగా నడవ దీ ♦ వనలు మఘవుఁ, డొనఁగ జానకీవిభుఁడాజి ♦ కేసఁగ నడచె.

తే॥ పాతకుండగు రావణు ♦ పట్టనంబు, దైత్యసేనయన్ కడలిచేఁ ♦ ద్రావఁబడిన
కరణిఁ గనిపించెఁ గపిసేన ♦ కవియుతీరు, దాని క్షీరాబ్ధిచుట్టిన ♦ వైనమయ్యె.

ఉ॥ లెక్కకు మీఱియుండిన ని ♦ లింప విరోధుల గుంపు లగ్గమా
టొక్కనఁ గోఁటమూఁక నెగ ♦ డెన్ వల మీలకుఁ బన్నకై వడిన్
మిక్కిలి వాతఘాతమున ♦ మీఱి సముద్రములేదు రేఁగఁగా
నక్కుచుఁ ద్రొక్కఁడో జగ మ ♦ నంగఁదగెన్ దనుజేంద్రసైన్యముల్.

౧౩ అంగద దౌత్య పటలము. (౪౩)

ఉ॥ జంకొకయింతలేని కపి ♦ చంద్రులతోఁ రఘువర్యుఁ డుద్ధతిన్
లంకను ముట్టడించి యక ♦ లంకను సీతను దొంగిలించు ధూ
ర్తంకిలిసేయరాని హృద ♦ యంబున భావనసేసి దైత్య కూ
లంకష మాకృకంబనఁ జె ♦ లంగు విభీషణుఁ గాంచి యిట్లనున్. ౮౨౨

క॥ ఒకదూతను లంకేశ్వరు, నికటంబునకంపి ధార ♦ ణిజను విడ నొ
ప్పికొనెదొ? యని నేసెదొ? యని, ప్రకటించుట రాజనీతి ♦ పద్ధతి యనఁగన్. ౮౨౩

ఉ॥ మేలని యవ్విభీషణుఁడు ♦ మెచ్చె విభాకరపుత్త్రుఁ డిద్దియే
పోలును సద్గుణాఢ్యులగు ♦ భూపులకంచును సమ్మతించె బా
ణాలిని గాక వాక్యముల ♦ నల్పుని వేఁడుట కూడదంచు నం
కీలుఁడు లక్ష్మణుండు నిర ♦ సించుచు వెండియు నన్న కిట్లనున్. ౮౨౪

చ॥ చెఱుగులొనర్చె వేల్పులకు ♦ శీలఁ గులాంగన సీతఁ గారలోఁ
బడ నుసిచెన్ మునీంద్రులకు ♦ బాధలు పెట్టెను బ్రాణికోటికిన్
బెడఁదలుగొల్పె లోకముల ♦ నీకున నేలఁగ నింద్రభోగముల్
చెడనొడిసెన్ జరించె బహు ♦ చేష్టలఁ ద్రోవలుకాని త్రోవలన్.

తే॥ సిలుగులం గూర్చి మిగుల వం♦చించి సీత, నతివిరోగంబుగూర్చెన♦య్యతివకడ్డు
పడు యుగాంతంబుఁ జూడఁజో♦వ్వఁడుచిరాయు,వొప్పు తండ్రి జటాయువు♦నుక్కడంచె.

ఉ॥ రావణుఁ డిప్డు నీవలవ♦రాణిని వీడనయేని వాని ర
క్తావిధిఁ గాతు నేని త్రిజ♦గంబుల నీదగు పేరునిల్చు గా
లావధి లంకనేలు మను♦జా! యను వాక్యము రిత్తవోవదే?
యేవగ నిల్చుఁ దాసముల ♦ కిచ్చిన నీ యభయప్రమాణముల్? ౮౨౮

చ॥ నెఱియును గౌరవంబు మది ♦ నిల్పి వచించిన యాప్రతిజ్ఞలన్
మఱచితివేమి? లంకఁగల♦మానిత సంపదలెల్లఁగాంచి యి
త్తె ఱఁగునఁ జేటుగూర్చ మది ♦ తీరద యేమి? యనేక రీతులం
దఱిమి తలంచినన్ దురమె ♦ నామదికిం దగునంచుఁ దోఁచెడిన్.

సీ॥ అనుడు రాఘవుఁ డిట్టు♦లను లక్ష్మణా! నేను, మదిలోన నేదియు♦మఱవలేదు
నిక్కంబుగాఁ దుది♦నెగడునదియుఁ బోరె, కాన నాపడి మన♦మూననేల?
గురుశుక్రులాదిగా♦గురుధర్మశాసకుల్, పలికిన పద్ధతుల్♦దొలఁగఁదగునె?
వీరవర్యులకేని♦విజయహేతువు క్షమ, రాచపాడియు క్షమ♦రాఁగనొందు

తే॥ మరలమారుతిఁబంపుట♦యురవుకాదు, పగఱకును చుల్కనగు గాన♦వాలిసుతుఁడె
పోయి రాఁదగువాఁడు పా♦వులు కలంగి, విక్రమించిన నోర్చి రా♦వెరవరియగు.

తే॥ అనుచు నెల్లవారలు నరి♦యన్న పిదప, నంగదునిపిల్చి నీవేగి♦యసురయెదుటఁ
బలుకవలసిన యర్థంబు♦నలుకులేక, తెలుపుమన నాతఁ డుత్సాహ♦ధీరుఁడయ్యె.

మ॥ తెలివిన్ జానకి వీడి జీవముల ర ♦ క్తిన్ గాచికోఁ్మెల్లో? కా
కిల నీ మస్తకముల్ దినేశకులు.ను ♦ గ్రేష్వాన నిర్ముక్త శా
త లసత్కార శరమ్ములం దెగిపడన్ ♦ దర్పించి యాయోధన
స్థలి కేతెంచుట మేలో? రెంట నొకటిం ♦ దర్కింపుమంచాడుమా. ౮౩౦

ఉ॥ మోదముకై యడంగి వెఱ ♦ పూని వసించుట ధర్మమార్గమున్
గాదు వరాశ్రమ క్రమము ♦ గాదు మగంటిమిగాదు మేలిమిన్
గాదు విరోధివక్షమునఁ ♦ గాఁడ శరంబుల నేయుశక్తి నిం
పాదిగఁ గల్గెనేని పోలు ♦ పార నెదుర్చుమ యంచు నాడుమా. ౮౩౧

చ॥ అని పనుపంగ మారుతికి ♦ నవ్వల నెన్నఁగఁదగ్గవాఁడ నీ
వని గతువంబు గల్గెనని ♦ యంగదుఁ డార్యుని పాదపద్మ వం

దన మొనరించి యంబర ప ♦ థంబున సింగము దాఁటుభంగి రా
ముని శరమట్టు లేగె సుర ♦ ముఖ్యులు కాంచి ప్రశంస సేయఁగన్. ౮౩౩

ఉ॥ ఉగ్ర నిశాచరావళుల ♦ యుక్కడఁజేయఁగ క్షీరసాగరో
దగ్ర భుజంగతల్పమునఁ ♦ దంపరమాని యయోధ్యయందు ను
వ్యగ్రమతిం జనించిన కృ ♦ పాళుని యాజ్ఞను వాలిపుత్త్రకుం
డుగ్ర మయూఖుఁడుం గసని ♦ యున్నతదుర్గముదాఁటి యుద్ధతిన్. ౮౩౪

ఉ॥ రావణు కొల్వుఁ జేరి నగ ♦ రస్థ జనుల్ హనుమండె వచ్చెనం
చీవల నావలం జనుగు ♦ లెత్తుచు బంధులఁ జేరుచుండ సే
నావలిఁ గాంచుచున్ హితుల ♦ యార్యుల మంత్రుల యుక్తవాక్యముల్
భావననేయు దైత్యకుల ♦ వర్యుని గాంచె సభా స్థలంబునన్. ౮౩౫

ఉ॥ తాలును చెట్లు గగ్గె జల ♦ రాశిని పూడ్చితిమన్న గర్వముం
బోలఁగఁ గల్గెఁగాక తల ♦ పోయఁగ రాఘవుకార్ముకంబు నే
త్రాలకు గోచరింప నెడ ♦ దన్ భయమందునుగాక క్రొత్తగాఁ
గాలుఁడు పుట్టినేమి దశ ♦ కంఠుని ప్రాణము దీయ నేఁటికిన్? ౮౩౬

ఉ॥ భూషలు లేకయున్ సొగసు ♦ పొందిన జానకిమీఁది యాసయన్
దోషముఁ బాపి రావణుని ♦ ద్రుంచెదువార లెవంద్రు? సర్వవి
ద్వేపిబలెం బయిం దుమికి ♦ పేర్మిమణుల్ గొని తెచ్చినట్టియా
పూమనుతుండు చూడఁ బరి ♦ పూర్ణ బలాఢ్యుఁ డటంచు నెంచెదన్.

తే॥ అంగదుం డిట్లు తలపోసి ♦ యగ్నివిషము, కాలుఁడను మాఁటిచేఁ బద ♦ కరములొంది
యున్న కడలినాఁ జను దశా ♦ న్యుండు వఱలు, సింహపీఠికదగ్గఱఁ ♦ జేరి నిలిచె.

చ॥ నిలిచిన యంగదుం దనుజ ♦ నేత ఖరేక్షణపంక్తిఁ జూచి ని
శ్చలమతి వచ్చుహేతువది ♦ చక్కఁగఁ దెల్పుము నీవెవండ వీ
పొలదిను సేవకుల్ గనక ♦ మున్నె శుభంబగు వార్త లుండినన్
బలుకుమ యన్న నాతఁడును ♦ పక్కున నవ్వి వచించె నివ్విధిన్. ౮౪౦

ఉ॥ నిండిన భూతపంచకము ♦ నేత సమస్త జగత్ప్రభుండు మా
ర్తాండకులుం డయోనిజ ధ ♦ రాత్మజభర్త జితేంద్రియుండు కో
దండధరుండు వేదముల ♦ దాఁటిన వస్తువు ధాతతాత శ్రీ
దుండగు రామచంద్రవిభు ♦ దూతగ వచ్చితి నేను రావణా! ౮౪౧

ఉ॥ అంగదుఁ డిట్లుపల్క నజుఁ ♦ డా? హరియా? హరుఁడా? వనాటులన్
సంగడికాండ్రఁ జేసికొని ♦ సంద్రపుఁ గాల్వను పూడ్చివచ్చి సీ
తాంగన నిచ్చునేమొ కరు ♦ ణాత్మకుఁడై యని పంపినట్టి యా
వెంగలియో ముకుందుఁడని ♦ పీకున దానవనేత నవ్వుచున్. ౮౪౨

చ॥ నెలను వియన్నదిన్ నొసటి ♦ నేత్రముఁ దాల్చిన రుద్రమూర్తియున్
మెలుపుగ శంఖచక్రములు ♦ పూనిన విష్ణుఁడు లంకలోనికిన్
దలఁకెడువారు వచ్చుటకు ♦ దర్పముతో నొకమర్త్యుఁడై భయా
కులుఁడవు గాక వచ్చు మొఱ ♦ కుండ వదెవ్వఁడవో వచింపుమా. ౭౪౩

తే॥ అనుడు నిను తనవాలునఁ♦గంటఁగట్టి, వనములందెల్లఁదిరిగిన♦వాఁడు సురల
కొఱకు క్షీరవారాశిని♦తరిచినట్టి, యగచరేశ్వరు పుత్త్రుండ♦నంగదుండ. ౭౪౪

క॥ అన రావణుఁ డిట్లను నీ, జనకుఁడు నామిత్త్రుఁ డీవు ♦ చనుదెంచుట మే
లెనసెను నరునకు దూతగఁ, జనునయ్యా రాఁగ మేము♦చచ్చితిమె? కటా!

ఉ॥ నీకిపుడే యొసంగితి వ♦నేచరరాజ్యము తండ్రిఁ జంపు లుం
టాకుని వెంటఁ జేతులు మ ♦ డంచి మొగంబును వ్రేలవైచి ని
శ్రీకునివోలె గారవము ♦ చేటుగ నెల్లిద మొందుటేల? నీ
తా కమలాక్షిఁ గొంటెనటు ♦ తప్పక గొందును నిన్ను పుత్త్రుఁగన్.

చ॥ మనుజులు నేఁడె చత్తు రను ♦ మానము మానుము మానసంబునన్
వనచరరాజ్య మీదినమె ♦ పట్టము గట్టెద సింహపీఠిపై
దనుజ నిలింప వానర క ♦ దంబము సన్నుతి సేయుచుండ న
త్యనుపమ భోగసం♦పదల ♦ నందుము కల్పముదాఁక వేడ్కమై. ౭౪౬

చ॥ అనవిని వాలిపుత్త్రుఁడు భు ♦ జార్గళముల్ వదనమ్ము ఱొమ్ము ప
ట్టనమును సంచలింప నగి ♦ టక్కరి! యెంతటి మాటలాడె దీ
దనుజులకెల్ల నిందు మృతి ♦ తప్పనిదంచు నెఱింగి కాదె నీ
యనుజుఁడు నిన్ను వీడి సుఖ♦మందఁగ వచ్చెను మమ్ము చేరఁగన్. ౭౪౭

ఉ॥ నోటికి వచ్చినట్లు పెడ ♦ సుద్దులు ప్రేలుచు నన్ను లోఁగొనన్
గాటపు యత్నముం జలుపఁ ♦ గా వశమాటకు బేలఁగాను నీ
యాటలు సాగవింక నృపుఁ ♦ డంపఁగ వచ్చుట నీచకార్యమే?
నీటుగఁ గుక్క యీయఁ గొను ♦ నే మృగరాజు మృగాధిపత్యమున్?

చ॥ అనవిని రావణుండు కడు ♦ నల్కను లేచియు నీచు వానరున్
దునుమఁగ నాయుధంబు గొన ♦ న్యూనత గల్గదె యంచు నాయువున్
జనిఁగిన మర్త్యు నమ్మి మృతిఁ ♦ జెంద మనోరథమయ్యెనేని వ
చ్చిన పని తెల్పుమన్నఁ గపి ♦ సింహము దానవుఁ గాంచి యిట్లనున్.

ఉ॥ ఇంకను నెమ్మది న్నెనరు ♦ నీఁగని రాముఁడు నిన్ను గాంచి నీ
లంకఁ గలట్టి నీ కుల బ ♦ లంబుల నాశము గోరి పోరికిన్
జంకె మరింప భీతిలిన ♦ సాగునె? నిప్పులు మ్రింగి యెవ్వఁగా
నింకునె? సీత వీడు మది ♦ యుంచనిచో నని వీడు ప్రాణముల్. ౭౫౧

శా॥ నీయుర్వన్ మడియించుచో మఖమునన్ ♦ నీమామ న్మగ్గాముచో
దాయన్వచ్చిన నీచెల్లియలి సౌం ♦ దర్యంబు పోకార్చుచో
నీయాజ్ఞ న్నెఱవేర్చు తమ్ముల ననిన్ ♦ నిర్జించుచో రాని వం
దా! యీనాఁడీకఁ జూపు పౌరుషము క ♦ ద్దా! దాఁగి జీవింతువే?

చ॥ బదనిక సంతతంబు పర ♦ పాదప భుక్తి గ్రహించుభంగిఁ బె
ల్లిదమగు కల్పు సన్యతతి ♦ తేజరముం బొనరించుమాడ్కి దు
ర్మదులయి ప్రాణివర్గముల ♦ మాడ్చుచునుండిన నీదు బంధులన్
గదనమునందు చంపుతఱిఁ ♦ గావఁగరా విప్పుడేని వత్తువే? ౧౫౩

ఉ॥ తమ్ముని నన్ను వంచన వి ♦ ధమ్మున దవ్వులకంపి దారఁ జౌ
ర్యమ్మునఁ గొంచుఁబోవు కలు ♦ షాత్ముఁడు పోరొనరింప వచ్చునే?
నెమ్మది సీతఁగాంచి రజ ♦ నీచరులన్ సమయించి పుత్త్రుఁ బా
దమ్మున రాచి మారుతి ము ♦ దమ్మున లంకను కాల్చినన్ నకే. ౧౫౪

ఉ॥ వేగుల భీతిమాన్చి విడి ♦ పించినయప్పుడు వార్ధిరాయఁడున్
జాఁగిలి మ్రొక్కినప్పుడును ♦ సమ్మతి లంకను తమ్ముఁడొందుచో
సాగరబంధనమ్ము వడి ♦ సాగెడునప్పుడు రాని పంద యిం
కేగతివచ్చు యుద్ధమున ♦ కేత్తెఱ డాఁగక యాఁటదింబలెన్. ౧౫౫

చ॥ చెఱఁగలవేల్పు చెల్వలు హ ♦ సించుచుఁ జూడఁగ నల్వలంకలన్
బఱవుగ నున్న నాగ నుర ♦ పద్మదళాక్షులముందు నిన్న భా
స్వరనుతుచే వడిన్ మకుట ♦ భంగమునొందియు సిగ్గుమాలి వెన్
దఱుముచురాని భీరుకుఁడు ♦ ధైర్యముతో దురముం దలంచునే ?

చ॥ అని తెలియంగఁ బల్కుమని ♦ యార్యుఁడు పంపెను మేలుగోరినన్
జనకజనిచ్చి రామ పద ♦ సన్నిధి వ్రాలి సుఖంబునొందు మా
పని తగదందువే వెడలఁ ♦ బాఱుము నావెనువెంట నిప్పుడే
యనిమొనఁ బుత్త్ర బాంధవ హి ♦ తానుజవర్గముతోడఁ జావఁగన్. ౧౫౭

ఉ॥ నీటను మంట మింట నగి ♦ నిం జనియించిన ప్రాణిసంచయం
బోట భజింప సంగరము ♦ లోజ నొనర్చిన నీవు నేఁడు నీ
వీటనె చేరి శాత్రవులు ♦ వీరరవంబులతోడఁ బిల్వఁగా
నేటికిఁ గాంతయట్ల చరి ♦ యించెదు రమ్మికఁ జావ రావణా! ౧౫౮

క॥ అను నంగదు పలుకులు విని, దనుజేంద్రుఁడు జగము ద్రింగు ♦ దారుణ కోపం
బున వీనిని పట్టుఁడు ధా, త్రిని మోఁదుఁడు చంపుఁడని వి ♦ ధించె నలువురన్.

క॥ పలువురు తను పట్టఁగ వా, రలతో వాలిసుతుఁ డుప్ప ♦ రమున కెగసి వా
రల తలల గిల్లి రావణు, తలకెదురుగ వైచి త్రొక్కి ♦ తగ నిల్లనియెన్. ౧౬౦

క॥ పొగలెగయుచు చగ్నులుమియుచు, వెగడొందఁగ వెడలు రామ♦భీమాస్త్రంబుల్
నెగడి నెఱయుటకు మున్నే నగరి విడిచి పాఱిపొందు♦నాల్గు దెసలకున్. ౮౬౧

తే॥ అని పలికి చిందు నల్లమై♦వలమికొని క, లాపముం బోలెఁ గోలాహ♦లముగ నార్చు
చజ్జ బింబంబు దిగినట్టి♦యనువు దోఁప,నంగదుఁడు వచ్చి మ్రొక్కి రా♦మాంఘ్రులకును

తే॥ రావణునితలంపెదియని♦రాముఁడడుగఁ,బూర్తిగాఁ దెల్పిఫలమేమి? మొఱకువాఁడు
శిరములు పదియు రణభూమి♦దొరలుదాఁక, వలవు మానఁజాలఁడని యె♦వాలికొడుకు.

౧౪. ప్రథమ యుద్ధ పటలము. (౨౫౬)

తే॥ రణము తప్పనిదనియుఁ బ్రా♦రంభమయ్యె, ననియు సూచింప మురజవా♦ద్య
ములు మ్రోఁగె
సైన్యములఁగాంచి శ్రీరామ♦జనవిభుఁడు, ముగ్గురములతో గవఁకులఁ♦బొదువుఁడనియె

ఆ॥ వార్ధిఁ బూడ్చి మున్ను♦వాడుకపడియున్న, కేలతోడఁ దరులు♦గిరులు తెచ్చి
నగరి చుట్టునున్న♦యగడిత పూర్తిగాఁ, బూడ్చివేయుఁ డిదియ♦మొదటిచేఁత.

తే॥ తరువులను వైచి రాసిక♦తడయఁజేసి, లగ్గపట్టి వప్రంబుల♦నగ్గపఱచు
కొనుఁడు పేరెత్తి సంగ్రామ♦మునకుఁ బిలుఁడు, వెనుకదీయకుఁడో కపి♦వీరులార!

క॥ అను శ్రీరాముని యానతిఁ, గొని క్రొల్పులులట్లు చెలఁగి♦కుధరచరులు దాఁ
పున నుండు తరుల గిరులను, గొని పూడ్చిరి వనధిఁబోలి♦కొఱలెడు పరిఖన్.

క॥ ఎనిమిదవ వనధియన నొ, ప్పిన సైన్యము పరిఖఁ బూడ్ప♦వెడలు జలము రా
మునకున్ సాయపడిన య, చ్చపు వాకిండ్లందు తూఱి♦చుట్టెను నగరిన్.

క॥ గెలువుగల దనుజ కీరితి, మొలకలతోఁ జెల్లగించి♦ముంచిన క్రియ మొ
గ్గలతోడి యబ్జినుల దుం, పల తోడఁ బెకల్చి పూడ్చి♦వైచిరి ప్లవగుల్. ౮౬౯

క॥ నీరములఁ గప్పలు దుముకఁగఁ, దారంబులఁ బాడు తేంట్లు♦తబ్బిబ్బువడన్
నీరజములఁ గల హంస కి, శోరంబులు బెదర మీలు♦స్రుక్కుచుఁ బ్రుస్లెన్.

క॥ ఇందీవరములు మొగుడఁగ, నిందితుఁడగు దనుజకీర్తి♦నేఁటికి జలధిం
జెందెనని కనులు మోడిచి, కందక మేడిచిన వగిది♦గన్పట్టె నటన్. ౮౭౧

క॥ తమ్ములు పెకలింపంబడఁ, దుమ్మెదలును రొదలు చెడఁగఁ♦దొలఁగి పఱచె హం
సమ్ములు ముక్కులఁ దమయుం, డమ్ములుగొని త్రోవ తడఁబ♦డన్ వడిఁబారెన్.

క॥ శిలలు మలలు గుమురగు తరు, వులు దట్టముగాఁగ నిండి♦పూఁడుటచే నం
దలి జలము పొంగి పలు శా, ఖల నదులై పాఱి కడకుఁ♦గడలిం గలిసెన్.

క॥ కొండలు వైచుకొలఁది మడి, గుండంబులఁ బూఁడి నీటఁ♦గొంచెముగాఁ బై
నుండి కనఁబడు తోయజ, షండము లెనసెన్ ఘనముగు♦పతులు ఘోగములన్.

క॥ గౌరవములకు న్నిలయుం, డౌ రావణు పెద్దవారి ♦ నగచర బలముల్
దోరుపఁగాఁ దోఁచెను సం, సారికిఁ బేదతనము కలిమి ♦ చంచల మనుచున్. ౮౭౫

క॥ అగడితఁ బూడ్చిన కోఁతులు, జగడించిన దనుజ బలముఁ ♦ జక్కాడుచుఁ బై
కెగసి బురుజులను చేరుచు, మొగుళులు చెదరంగ మోఁద ♦ మున గర్జించెన్

క॥ బలువౌ కనకాచలమని, తలఁపంగ నుక్కసంబు ♦ దాఁకెను స్వర్గం
బులపై నెక్కిన వనచర, బలములు తెల్లని ధ్వజాళి ♦ పోడిం దోఁచెన్. ౮౭౭

చ॥ రతనపుఁ డెంకియైన గిరి ♦ రాజము మేరువు త్రాసుగుండుగా
జతనునఁ దూఁచఁగా సమత ♦ సాగు వనేచర బృంద మొక్కటన్
క్షితి యెడమీఁదె మెట్టఁగ న ♦ మేయ భరంబు సహింప లేక యా
కుతికిలఁ గ్రుంగె వా ప్రవారి ♦ కూల్పఁగ నక్కట కూర్మ కర్తకున్. ౮౭౮

క॥ మురజముల మోయు మదకరి, వరసులపై వెలయు డాలు ♦ వరుసలచే సం
బరము మఱుఁగయ్యె ధూళిం, గుఱుచయ్యెం దెసలు దనుజ ♦ కోటి వెడలఁగన్.

ఉ॥ భేరుల మ్రోఁత సంబరము ♦ భేదిలె గర్జనచేసె సింగముల్
హారములుం జలించె నట ♦ దశ్వ గళస్థిత కింకిణీ తతుల్
తేరుల గంటలుం గలిసి ♦ దిక్బధిరత్వము సేసెఁ దోడుగా
వారణ కంఠ ఘంటికల ♦ వారిత రీతిని వైచె దాళముల్. ౮౮౦

చ॥ కులములతో సమూలముగఁ ♦ గ్రూరులు దానవులెల్లఁ గూల న
జ్జ్వలగతి దేవ మానవుల ♦ సంఘము తావుకొనంగఁ గాల మ
త్యలఘుగతి న్నిమిత్తముల ♦ నారయఁ దెల్పుచునుండ వానరా
వలియుఁ గుతూహలం బడర ♦ వచ్చిన సోఁకులతోడ డీకొనెన్. ౮౮౧

క॥ వానరసేనలు కరదం, ష్ట్రా నఖ తరు గిరులతోడఁ ♦ జలమునఁ బెనఁగెన్
దానవసేనలు పోరెను, బాణ ముసల ఖడ్గ కుంత ♦ పరశు గదలతోన్ ౮౮౨

క॥ అమ్ములచేఁ బాషాణము, లమ్ములు నుఱు తరులచేత ♦ నడిముడి యయ్యెన్
ఇమ్ముగ దూసి వెడలు కుం, తమ్ములచేఁ దెగిన తరులు ♦ ధరణిం గూలెన్. ౮౮౩

తే॥ కదనమునఁ గపుల్వైచిన ♦ కఠినశిలలు, తగిలి దైత్యులశిరములు ♦ పగిలి రుధిర
పూరములతోడ మెదడును ♦ ముక్కులందు, చెవుల నోటను వెలువడి ♦ చెదరిపడియె.

తే॥ చీఁకటులె యోడిపాఱుమై ♦ చెన్నుగలుగు, పొలసుదిండులశిరములు ♦ పొదువఁగాఱు
రుధిరధారలలో వాన ♦ రులు మలంగి, కేలఁగల ఱాలతో ధరఁ ♦ గూలినారు. ౮౮౫

ఆ॥ కోటకొనలనుండి ♦ కోఁతులువైచిన, ఱాలు పిడుగులట్లు ♦ రాలుకతన
ఱాలు తగిలినట్టి రాకాసివీరుల, నొక్కరైన బ్రదికి ♦ యుండరైరి.

ఆ॥ మిహిర తేజమట్లు ♦ మిఱుమిట్లు గొలుపు క, న్నులు గలట్టి రక్క ♦ సులు కడంగి
వైచినట్టి యీఁటె ♦ లేచిన కపుల ఱొ, మ్ములకు దవ్వులఁ బ్రవారి ♦ వెలికిఁబడిరి.

తే॥ కపులు మిక్కిలి కోపులై ♦ కఱచి పొడిచి, మెడల నులిమియు గోళ్లతో ♦ నొడలు బరికి
కాలఁదన్ని వాలంబుల ♦ లీలఁజుట్టి, కొట్టి పెక్కండ్ర సోఁకులఁ ♦ గూల్చినారు.
తే॥ వంచకులగు దైత్యులువీచి ♦ వైచియేసి, కొట్టి పొడుచుచు మూఁగఁగాఁ ♦ గోఁతిమూఁక
తగ్గి కాలును కేలును ♦ తలలు మెడలు, తునిసి వేఱయి నెత్తుట ♦ మునిఁగిపోయె.

ఉ॥ చిట్టునఁ జిమ్ము నెత్తుటను ♦ చెన్నగు బంగరుకోట చూడఁగా
నెట్టనయై ప్రవాళగిరి ♦ యేఁపునఁ జుట్టినరీతి నేర్పడెన్
వట్టుగ నెత్తుటేళ్లు శవ ♦ పర్వతపంక్తుల నడ్డుదిడ్డుగా
బిట్టున నీడ్చుకొంచుఁ గడు ♦ భీకరలీలఁ జనెం బయోధికిన్. ౮౯౦

తే॥ హరిహయుండేని సాధింప ♦ ననువుపడని, లంకపైఁ బలుజాతుల ♦ కంకగృధ్ర
వాయసాదులు గుమిగూడి ♦ వజలుకతనఁ, గ్రొత్తపందిరివైచిన ♦ కొమరుదోఁచె
తే॥ నిప్పులంబోలి వెలుఁగొందు ♦ నెత్రుటేఱు, లనెడి సంజమింటను తమి ♦ యను కబంధ
పంక్తి చేతులెత్తికొని యా ♦ వలకునీవ, లకుఁ బరుగువాఱి నర్తించె ♦ వికటలీల. ౮౯౨
తే॥ భయదమైపాఱు రక్తప్ర ♦ వాహమందు, మునిఁగినట్టి పక్షుల పక్ష ♦ ములను తగిలి
పడిన కణములచేఁ బలు ♦ వన్నెలున్న, తీఁగలన్నియు నెట్టనై ♦ తేజరిల్లె. ౮౯౩
తే॥ చేవతగ్గి రక్తము మేనఁ ♦ జిమ్ముచుండ, నిలువలేక ప్రాకారమ్ము ♦ తొలఁగవిడిచి
ప్లవగములు కనకాద్రిపై ♦ భాగము విడి, ప్రక్కలకు దిగు సంద్రంబు ♦ పగిది దిగియె
తే॥ ప్రహరియందును బురుజుల ♦ వాకిళులను, తక్కువానరుల్ పట్టిన ♦ తలములందు
రాక్షసబలంబు పైఁబడి ♦ ప్రబ్బికొనియెఁ, గోఁతిమూకలు వెఱచి ది ♦ క్కులకుఁ బాఱె.
క॥ నక్తంచరు లొత్తుటచే, రక్తాంబువు లీఁది వాన ♦ రంబులు పోవన్
శక్తు లుడిగి పడెఁ గొని యట, ముక్తాంబకములను కొన్ని ♦ ముడిఁగెను త్రోవన్
క॥ కోటంబట్టిన వానర, కోటి బలము తగ్గ నసుర ♦ కోటి కడంకన్
బాటించియార్వఁ దద్ద్రుతి, వాటముగా నెగసె విలయ ♦ వారిధి రుతినాన్.
తే॥ పటహ కాహళ శంఖ త ♦ మ్మట మృదంగ, పణవ భేరీ ప్రముఖ విరా ♦ వములు చెలఁగఁ
చెవులు చిల్లులుపోయె వీ ♦ చీకలాప, యుత పయోధి సంక్షోభంబు ♦ నతకరించె.
తే॥ కమలగర్భుని నాల్గుమొ ♦ గములనుండి, సకలలోకముల్ వెలివడ్డ ♦ సరణినపుడు
దనుజసేనాసముద్ర మ ♦ బ్దంబునోరయు, నాల్గువాకిండ్లనుండియు ♦ నడచె వెలికి
తే॥ మత్తగజఘటల్ నడతెంచు ♦ మలలపోల్కి, నడచి పెక్కెంబులకుఁ దగు ♦ ల్వాడిన లతలు
కొమ్ములను త్రుంగిపడఁ ద్రోసి ♦ కొనుచువచ్చె, బిచ్చికిం దోడు భూతంబు ♦ రెచ్చినట్లు.
క॥ వారణ మదజలములచేఁ, గూరిన పంకమున విలయ ♦ ఘోరానిల సం
చారము కరణిం బరుగిడు, తేరులు వన్నియల ధూళి ♦ తెరలఁగ లేపెన్. ౯౦౧
తే॥ మట్టడించిన కపులచేఁ ♦ గొట్టఁబడిన, గట్టి కోటయున్ వలువను ♦ గట్టినట్టి
లంకయనుచెలి ప్రాయిన ♦ వంకతేని, యలలనఁగనొప్పి వెలువడె ♦ హయచయములు.

తే॥ జరిగినట్టి దినంబులఁ • జెఱఁగినట్టి, చీఁకటుల మొత్త మొక్కచోఁ • జేరియుండి
నడచివచ్చిన చందాన • వెడలఁ బాఱె, దనుజసైన్యంబు ధాత్రియు • దద్దరిల్ల. ౯౦౩
తే॥ రేఁగి వెలివడ్డ పెంధూళి • ప్రేంకణమైన, తలలమీఁది శేషుని మోఁత • తగ్గునట్లు
మిన్ను ముట్టడింపఁగఁ బోవు • విధము నంద, భిత్తి వెనుక దిక్కుల • కొత్తి యలమె
తే॥ క్రమ్ముకొని యసురులు నెట్టు • కతనఁ గప్పులు, పిచ్చి పికపికలైనొచ్చి • విసిగి కలఁగి
గుట్టకొకరుగఁ దిట్టకొ • క్కొరుగఁ బఱచి, యొదిగి చేరి సుగ్రీవుఁ • డున్న యెడను.
ఉ॥ చేవచెడంగ విక్రమము • చెందిన ప్లవంగులు పాఱిరాఁగఁ గ్రూ
రావిల మానసుల్ దనుజ • లంతట నంతల వెంబడింప సు
గ్రీవుఁడు కాంచి దంతములు • గీఁటుచుఁ జెంతఁగలట్టి యొక్క పెన్
రావి యగంబు బీఁకికొని • రక్కసి పిండు నెదిర్చెఁ బోఁడిమిన్. ౯౦౬
క॥ ఒక్కొక రక్కసి పిండున, కొక్కొక సుగ్రీవుఁడగుచు • నురడించి తొలిన్
వెక్కసమై కనవచ్చిన, యక్కరువలిపట్టి వోలె • నని మొనఁ దోఁచెన్ ౯౦౭
క॥ కరి తురగ పదాతులకుం, జరణంబులు విఱుగఁ దొరలి • చనఁ దేరులు నె
త్తురు లేర్లు పిరియఁ గపిపతి, కెరలుచుఁ గైనున్న తరువు • గిరగిరఁ ద్రిప్పెన్. ౯౦౮
ఆ॥ ప్రభువు ముందు చొరఁగఁ • బ్లవగవీరులు కసి, మసఁగి తెంపుమీఱి • మరలివచ్చి
క్రూరదానవులను • కొఱికి చీలిచి తన్ని, ఱక్కి విసరివైచి • ప్రమాల్చినారు ౯౦౯
ఆ॥ లెక్కయిడఁగరాదు • లీల తూలను తువ్వఁ, బ్రాణములను విడిన • రక్కసేంద్ర
లెక్కయిడఁగరాదు • లీల ధనుర్ముక్త, బాణవితతిఁ గూలు • బలిముఖములు. ౯౧౦
ఆ॥ ముమ్మరించినట్టి • పోరున వానరుల్, బలము చూపి కూలు • నైన మదము
తూలి కూలు రాక్ష • సాలి జీవంబులు, దక్షిణాశ నిండెఁ • దలము లేక ౯౧౧
క॥ పాడెఁ బిశాచ సముత్కర, మాడెఁ గబంధములు మింట • నఱచెఁ బతత్రుల్
కూడె జలధి స్రవంబులు, చేడెలచట వెదకినారు • చెలువుల మేనుల్ ౯౧౨
క॥ ఏనుఁగుల మేనులెల్లెడఁ, బీనుఁగులై పడియె నంప • వెల్లిని మునిఁగెన్
వానరసైన్యము లొక్కెడ, వానఁ దడియు ప్రజల తేప • నఱలెం జముపుల్.
క॥ అలుక వహించిన వనచర, బల గురు ఖర నఖర దీర్ణ • పలలాశి తనూ
గళ దస్ర పూరముల క, వ్వల నీచును కాఱె కనుల • బరువయ్యెనటన్. ౯౧౪

—: సుగ్రీవుఁడు వజ్రముష్టిం జంపుట :—

తే॥ అసురబలము క్షీణింపఁగ • నరసి తక్క, వారు పాఱఁదొడంగిన • వజ్రముష్టి
కాంచి యుగ్రుఁడై తేరిపై • గద్దమూఁక, ప్రాలుచుండఁ గడలినావ • పగిదివచ్చి
తే॥ ఎదిరి బాణవర్షము గురి • యించి కపుల, జెదరఁగొట్టె దిక్పతులును • బెదరిపఱవ
భాస్కరసుతుండు నొచ్చియు • వాని నుగ్గ, గీకణంబుల మిడుఁగుఱుల్ • వెడలఁజూచి

ఆ॥ తేరిమీఁది కుజేకి♦వారువంబులఁ జంపి, సారథి తలఁ దునిమి♦చండగతిని
విండ్లు తూణములును♦విఱిచి వానిశిరమ్ము, పట్టి యాడఁ బెఱికి♦పాఱవైచె. ౯౧౭

తే॥ కొండ దొరలినవడిఁ దేరి♦నుండి దొరలి, వజ్రముష్టి భూమింబడ♦వాని సేన
పఱచి లంకాపురమ్ముఁ జొ♦రఁబడిపాఱె, వనచరావళి ఘోషించె♦వార్ధిపోలె

—: తూరుపు వాకిటి యుద్ధము :—

తే॥ నిలయు వారాశి యుప్పొంగు♦లలని రేఁగి, దనుజసైన్యంబు పూర్వది♦గ్ద్వారమందు
ముట్టియున్నట్టి ప్లవగ వ♦రూథములను, తాఁకి పెనుపోరు గావించె♦దర్పమొప్ప.

తే॥ కాలకూటంబువంటి రా♦క్షస గణంబు, శూల కుంత తోమర భిండి♦పాల ఖడ్గ
శర గదాదులు వర్షంబు♦చండమునను, కురియఁ గాలువాలులు తెగె♦క్రోఁతిగమికి.

తే॥ కొండలను పెనుమ్రాకులఁ♦గొంచుఁ దెచ్చి, వనచరులు చండ పవనంబు♦వగిదివీవ
పోఁకుమూఁకలోర్వఁగ లేక♦క్రుక్కికూలెఁ, గరులుహరులునుధరఁజావ♦కట్టుగఁబడె.

తే॥ దర్పమున దనుజులు శూల♦దండచక్ర, తోమరాది సాధనముల♦తోఁడఁ బోర
తఱుచు మైగాయములు నోర్వఁ♦జాలవ నిలువ, లేక వెనుకకుఁ దగ్గె వ♦లీముఖములు.

తే॥ నీలుఁ డొకగొప్ప నీపాద♦నీరుహంబు, వేళ్లతో లేపికొని ఘోర♦విలయపవను
భంగి వీవఁగ రాకాసి♦బలము కుప్ప, తిప్పలై రణ ధారణిఁ♦ద్రెళ్లిపడియె

తే॥ రథములును రథికులు సా♦రథులు రథ్య, ములును శరభముల్ పంచాస్య♦ములును వార
ణములు నేలకు దొరల వ్ర♦ణములనుండి, వెడలు రుధిరంబు వఱ్ఱయి♦కడలినించె.

తే॥ పాలికలను బీడుగాఁగ న♦ప్పోలనుఁ దండి, పటలములు పాఱఁ జూచి కుం♦భానుఁడనెడి
సైన్యపతి సహింపక శరా♦సారపూర్వఁ, దగుచుఁ గీశవారంబుల♦దగిలి నొంచె.

చ॥ అదిగని యెల్లుబంట్ల కొడ ♦ యందు హిడింబుఁడు చండకోపుఁడై
కదిసి కరంబునం బెను న ♦ గంబును గైకొని వైవఁ దేర్పైఁ
బొదలు పతాకఁ దొట్టి హయ ♦ ముల్ రథచోదకుఁడున్ శతాంగముల్
జదిసెను వాఁడు భూమికి వె ♦ సన్ డిగియెం గపులెల్ల భీతిలన్. ౯౨౬

తే॥ డిగ్గి వజ్రమువంటి పి♦డికిలితోడ, ఱొమ్మునొడుచు కుంభాను మా♦ఱుగను మోఁది
రత్నమకుటంబుతో డిశి♦రంబు వ్రాల, వాని కేలు హిడింబుఁడు♦పట్టికొనియె. ౯౨౭

తే॥ ఒడిసి నడుముపై రెండుకా ♦ ళ్లూఁది యెక్కి
తలనుపొడువ నాల్కయు గ్రుడ్లు ♦ వెలికిఁ బిదుక
నొగలు తలయుఁ గంఠమునకు ♦ దిగఁబడంగఁ
ప్రాణములఁ బాసి దొరలెఁ గుం ♦ భానుఁడపుడు. ౯౨౮

—: ప్రహస్తుని యుద్ధము :—

తే॥ తనదుదండనాథుఁడుతన♦యెదుటఁ గూలియు, నలసుమాలిసూనుండు ప్ర♦హస్తుఁడలుక
వింటి నెక్కువెట్టి గుణంబు♦వీనులదక, మొరయఁజేసి హిడింబుపై♦మోహరించె.

ఆ॥ భుజములుబ్బఁ బ్లవగ♦ముఖ్యులు బెగడొంద, విల్లు గుణముపడఁగ♦విస్తరించి
యంపవాన గురియ♦నగచరుల్ మొగతప్పి, యోర్వలేక వెనుక♦కొదిగినారు

ఆ॥ శరము లొడలినిండ♦నెరవ హిడింబుండు, విహ్వలించ నేల♦వీఁగుటయును
గని కపర్థివోలెఁ♦గనలి నీలుఁడు ప్రహ, స్తుని యెదిర్చి పేరు♦కొనుచుఁ బిలిచి.

ఆ॥ ఒకఁడు తెచ్చుచున్న♦యొక తిట్ట గొనిచేవ, చూపి యొడిసి వైవ♦పోఁకు మూఁక
పఱచి విఱుగ నచల♦బయలయ్యె దానిఁ బ్ర, హస్తుఁ డమ్ములేసి♦యడఁచివైచె.

ఆ॥ మరల నీలుఁడొక్క♦తరువును గొనివాసి, విల్లు పడగ తేరు♦విఱుగఁగొట్టి
వారువములఁ జంపి♦సారథిఁ జదియించి, సింహనాద మొనరఁ♦జేయునంత. ౯౩౩

తే॥ విరథుఁడైన ప్రహస్తుండు♦వీఁక చెడక, దండముంగొని లంఘించి♦ధరణికి దిగి
పరిధి వీడిన భానుని♦పగిది మెఱసి, దుర్నిరీక్ష్యుఁడై నీలుని♦తొడరి తాఁకె ౯౩౪

ఆ॥ ఓడు గఱచి కనుల♦నగ్నులు గ్రక్కుచుఁ, దాఁకు దనుజవీరు♦నాఁక పఱచి
వానిఁబట్టి యెగుర♦వైచె నాకసమున, కమరులడలి కాంచి♦యవలఁ బాఱ. ౯౩౫

ఆ॥ వైవవాఁడు మొలఁకు♦వను నొవ్వకుండఁగ, ధరకు దిగుచు సురలు♦తత్తళింప
దండముగొని మోఁదె♦గండని నీలుని, నేత్రములను నోట♦నెత్తురొలుక. ౯౩౬

తే॥ మోఁదఁ జలనమందక కపి♦ముఖ్యుఁ డదరి, వాని దండ మొడిసికొని♦పాఱవైచి
నేటితోఁ దీఱితని ప్రొవు♦నెత్తురెల్లఁ, బొళుకు బొళుకని గ్రక్కఁగఁ♦బొడిచె శిరము.

తే॥ శోణితము గ్రక్కుచును ప్రహ♦స్తుండు కడఁక, చెడక నీలునివక్షంబుఁ♦బొడువనతఁడు
కినుక నట్లచేయుఁగ నిర్వు♦రును వదలక, పోరి రెచ్చుతక్కువ లింత♦పొందకుండ.

తే॥ వాలమున నీలుఁడవ్వల♦వాని యొడలు, కదలనీయక చుట్టి వ♦క్షంబు పగుల
గాఢముష్టిఁ బొడువవాఁడు♦కందరాద్రి, పగిది వదనంబు దెఱచి జీ♦వముల వీడె.

తే॥ సైన్యనాథుండు పడఁగని♦చదల వేల్పు, లెలమిఁ బాడి విరులు గురి♦యించినారు
రక్తరోమముల్ వికృతదం♦ష్ట్రలు జ్వలించు, మబ్బుద్రిమ్మగ లుడ్డాడి♦మరలినారు.

తే॥ దక్షిణద్వారమున కేగు♦దనుజవితతి, నేఁచి యేడాటలాడించి♦యేదు నదుల
నీరు ద్రావించి దళవాయి♦నిహతుఁ జేసి, యంగదుం డార్వ హతశేషు♦లచటు విడిరి.

తే॥ పోటుబంటుల మేటిదు♦ర్ముఖుఁడు రేఁగి, పశ్చిమద్వారమున గాడ్పు♦పట్టి చేతు
లనెడి జముడాఁతఁ బడిపోయె♦ననుచరులును, మరలలేదొక్కరైనను♦పురము త్రోవ

తే॥ అంత నాలుగు దిక్కుల♦యందు జరుగు, దురముగాంచి రావణిగిన♦దూత లేగి
దశముఖునితోడ జరుగువృ♦త్తాంతమెల్లఁ, దెలియఁబల్కి రేకతమునఁ♦దేటపడఁగ.

క॥ వడి భవదాజ్ఞాచక్రము, నడఁబోలిన సైన్యముఖ్య♦నాయకుఁడు ప్రహ
స్తుఁడు తన బలములతో భువిఁ, బడియెను తజ్జీవములు ది♦వంబున కరిగెన్. ౧౮౪

క॥ శూలకరులు దనుజులు కాం, తాళముతో నడచి దక్షి♦ణద్వారమునన్
వాలికొడుకుచే ధారణిఁ, పాలై రని నడపు మన సు♦పార్శ్వుం డీల్గన్. ౧౮౫

తే॥ ఉత్తరపు గవఁకున కేగి♦యున్న వజ్ర, ముష్టియును పడమటితట్టు♦ మొనయు దుర్ము
ఖుండు నేఁబదివేల్వ ల♦కుంఠితబలు, లదరి పెనుపోరు గావించి♦యడఁగినారు. ౧౮౬

ఆ॥ మంటవైచు ఘృతము♦మాడ్కి నవ్వార్తలు, ప్రభుని మనము మిగుల♦రగులఁజేయ
నుండియుండి యేమి♦యును దోప కెడనెడ, వేఁడి యూరుపులను♦విడుచుచుండి.

ఉ॥ తూరుపు వాకిటన్ సమర ♦ దోహలు సైన్యపతిం బ్రహస్తుతోఁ
బోరిన వీరుఁడెవ్వఁ డది ♦ పోలఁగఁ దెల్పుఁడి యన్న వారలున్
గౌరవకీర్తులన్ దిశలఁ ♦ గప్పిన నీలుఁడు వహ్నిపుత్త్రుఁ డం
గారము పూరిఁగాల్చిన ర ♦ కంబున సేనల రూపుమాపఁగన్. ౧౮౭

మ॥ విలయాదిత్యనిభంగి రేఁగి సమరో ♦ ద్వేగంబు చూపించి బి
ట్టలుకం దాఁకి ప్రహస్తుఁ డుగ్రతర బా ♦ ణాసారముం గూర్ప మాం
సల దమ్యంబు జడిం జరించు క్రియ రో ♦ సంబార నీలుండు ని
శ్చలరీతిన్ జరియించె నిర్భరకు మూ ♦ ష్టాముష్టి యయ్యెం దుదిన్.

ఉ॥ అంత దురంత దుస్సహ మ ♦ హాశనిఁ బోలిన నీలు ముష్టిచే
నంతకు నింటి విందయి ప్ర ♦ హస్తుఁడు వోయెఁ దదీయసేనలో
నింతకు మేము దక్క మఱి ♦ యెవ్వరుఁ గ్రమ్మఱలే దనంగ దు
ర్దాంత పరీత రోషుఁడయి ♦ రావణుఁ డాశలు మండఁ జూచుచున్. ౧౯౦

ఉ॥ వింటిరె వింతవార్త యిది ♦ వీనులఁగాల్చె మనస్సు మాడ్చె వే
గంటిని గెల్చినట్టి రణ ♦ కర్కశు నొక్క ప్లవంగుఁ డాజిలో
గెంటెనె? యెల్క పిల్ల హరి ♦ కిం గనకాద్రి ధరిత్రి దొర్లెనే?
మంటను గొల్పు మిడ్త ఱెక ♦ మాత్రముగాఁ దలఁపంగ రాదెటన్.

—: రావణుఁడు రణమున కేగుట :—

చ॥ అని యొకకొంత చింతిలి ద ♦ శాస్యుఁడు బాణ కృపాణ పాణులన్
గని రణభూమికిం బదఁడు ♦ కంటు సమస్తము దీర్చికొంద మే
నును తగ వత్తునంచు వడి ♦ నూత్న కలాప మలంది మేలి భూ
షణ కుసుమాంబరాదులు భృ ♦ శత్వరఁ దాలిచి యెక్కెఁ దేరిపై.

సీ॥ ఆ తేరు వేయి హ♦యంబులఁ గలయది, శరనిధి యంతటి♦పరపుగలది
సురలోక మంతటఁ♦దిరిగినయది యింద్రుఁ, డోడి నొచ్చిన యప్పు♦డొసఁగినయది

యిష్టదేవత రుద్రు♦నెలమి ధ్యానించి డా, పలిచేత నున్నట్టి♦ప్రథిత ధనువు
శింజినీ రవ విశే♦షంబున యముని యా, యుష్కాలమును గూడ♦నూడ్పఁగలది

తే॥ మఱియుఁ గేల ధరించిన♦మహిత సాధ, నములు దిగధీశ దార్ఢ్య వ♦క్షములఁ దాఁకి
మొక్కవోనివి తొడిఁగిన♦బొందడంబు, వజ్రమయమై యభేద్యమై♦వఱలిన యది.

తే॥ వీవఁబడు చామరములచే♦విరిసి వార్ధి, నీరు నురుగుగట్టఁగ రజ♦నీచరుండు
రమణ ముత్యాల గొడుగు శి♦రమునఁ గ్రాలఁ,బూర్ణ శశిక్రిందఁగల జల♦ముచముఁబోలె

తే॥ పటహములు మ్రోఁగె వానర♦బలము కలఁగి, పరవ నిర్జరుల్ చెమ్మట♦పట్టి నుసల
నండభిత్తిక లగల శం♦ఖాది సమర, వాద్యములు మొరసెను జీవ♦భయదరీతి.

క॥ వీరులు హరులును కరులును, తేరులుఁ గ్రిక్కిఱియ నడచు♦దితిజుల నడుమన్
వారిధులు పొంగి చుట్టిన, మేరువుక్రియ రావణుండు♦మీఱి వెలింగెన్: ౯౭౬

తే॥ ఏడుతంతుల వీణ రూ♦పెసఁగు ధ్వజము, విలయకాలుని నాలుక♦లలినిగ్రాల
దనుజ వారాశి నేఁటికి♦దాఁటఁగలిగె, ననుచుఁ జూడవచ్చిన సుర♦లడలిపాఱ.

తే॥ కనులకోపాగ్నిచేఁ బొగల్♦గ్రమ్మ నల్ల, సోఁకుమూఁకల యెఱ్ఱని♦జుంజుఱైన
వెంద్రుకలు తెల్లఁబాఱ దా♦పించు బంధు, సంఘములు గాంచి మిక్కిలి♦సంశయింప

క॥ అరదంబుల భటకరముల, ద్విరదంబుల మీఁది సిడము♦తెట్టువ లొరయన్
మరుదంబు శైవలిని ఘన, శరదంబులఁ గల జలంబు♦సమయఁగ వట్టెన్. ౯౭౯

తే॥పూని వాఁడియాయుధములు♦మోచికొనుచు, వేలకొలఁది పిశాచముల్♦వెంటరాఁగ
గంట లులియఁ దేరులు వెంటఁ♦గదలిరాఁగఁ, గదనరంగంబునకుఁ బంక్తి♦వదనుఁడరిగె.

తే॥ రావణుఁడు గొప్పసేనతో♦రణముసేయ, వచ్చెనని రామునకుఁ గపి♦వరులు దెలుప
భూమిజకు నేఁడు కారా వి♦మోచనంబు, గలుగునన్న యామోదంబు♦గాంచె నతఁడు.

—: రాముఁడు రణ సన్నద్ధుఁ డగుట :—

తే॥ కర్మముల హెల్లఁగాంచిన♦ఘనులు దివ్య, దృష్టిచేఁ గాంచుటకు ముఖ్య♦దృశ్యమైన
రామచంద్రుండు నారచీ♦రను దిటంబు, గాఁగఁజుట్టి మధ్యంబునఁ♦గత్తిఁజెక్కి.

తే॥ జగములం గొల్వఁజాఁచిన♦చరణములను, పడుకు నొక పడఁతిగఁ జేయు♦పాదములను
భక్త హృదయంబులను వెల్గు♦పదములందు, చెలువు.పనిగల వీరమ♦ద్దెలు ధరించి.

తే॥ ఒత్తుగాఁ జుక్క లలరిన♦యుప్పరంబు, పగిది వెలుఁగొందు కవచంబు♦బిగువుగాఁగఁ
దొడిగె శ్రీవత్సమలరు న♦య్యెడను లక్ష్మి, యెడయు కతన నొవ్వ దనుచు♦నెంచెనేమొ!

తే॥ శర్మద కరాంబుజములకుఁ♦జర్మ కవచ, మెనయఁజుట్టిన యొప్పిద♦మెంచిచూడ
నీవి మ్రాఁకుఁ గొమ్మల నెడ♦మీయకుండ, నల్లత్రాఁచు చుట్టిన లలి♦నుల్లసిల్లె.

తే॥ కేలఁబగళుల నొక్కచే♦రీతి వెలయు, తామరలఁ దేఁటులుండు చం♦దమున నొప్పి
శ్రేణులై యొత్తుగా నున్న♦వ్రేళ్లకంత, గోధికాచర్మ కవచంబు♦గూర్చినాఁడు.

తే॥ బహుళపద్ధతుల్ గలిగిన♦భాషలందు, నారితేఱి శాస్త్రంబుల♦ననుసరించు
సుగుణులగు కవీంద్రుల వచ♦స్సులను బోలి, పొల్చు నక్షయ తూణముల్♦దాల్చినాఁడు.

తే॥ మొగులునం దోఁచు మెఱుపను♦పగిది మెఱయు,వీరపట్టంబు నుదుటను♦వెలయఁగట్టి
మలయు లేఁగాంతి గల వన♦మాలతోడఁ, దులసిమాలయు రణమాల♦తో ధరించి.

తే॥ సకలలోకంబులును చరా♦చరచయములుఁ, దాను వేఱుగానున్న ప♦ద్ధతియు నిట్టి
దనుచు నూహింప మనము స♦మర్థులమె కొ? అతఁడు చేకొన్న విల్లు వే♦ఱగునె తనకు?

తే॥ సురలు నరులును మోదించి♦విరులు చల్ల, గొప్ప వానరసేనతోఁ♦గూడి రామ
విభుఁడు పాలకడలితోడ♦వెన్నుఁ డరుగు, దెంచి ప్రత్యక్షమైన రీ♦తిగను దోఁచె.

తే॥ ప్రళయవేళను రుద్ర రూ♦పంబునొంది, జగములను నాశ మొనరించు♦పగిదినొప్పి
విపుల సేనాముఖంబున♦విల్లుదాల్చి, నిలిచియున్న లక్ష్మణుని స♦న్నిధిని చేరె.

తే॥ అంత దక్షిణ దిఙ్నాథుఁ♦డగు యముండు, తనదుకృత్యంబు త్వర నెడ♦గొనక నడప
నుభయసేనలు కలసి యొం♦డొంటిఁ దాఁకె, వనధి వనధి యెదిర్చిన♦వైనమడర.

తే॥ అన్ని దెసల దంష్ట్రల కాంతు♦లలమికొనియెఁ, బడియెఁ గనక రాసులపోల్కిఁ♦గపి
శవములు
దనుజ కుణపముల్ సెల తెట్టు♦లనఁగ నొప్పె, వింత వాన కురిసినట్లు♦వెలసె దురము.

తే॥ తెగియెఁ దలలు ప్రేవులు జాఱెఁ♦దేరు లురలెఁ, గెడసె ఖురవులు కరులును♦నుడిసె
సమర
మేదినియుఁ బీనుఁగులచేత♦మిట్టయయ్యె, నెల్ల దెసలకు నెత్తురు♦టేళ్లు పాఱె.

క॥ ఘోరాకారులు వానర, వీరులు హస్తములఁ బొడువ♦విటతాటముగా
వారువము లురలె రాక్షస, వారముల యురమ్ము లగలెఁ♦బడగలు విఱిగెన్.

క॥ తతసేతువు తెగు లలి శో, ణితవాహిని విరియ దనుజ♦నేత యడరి యు
ద్ధతగతిని శింజినీ టం, కృతి యొనరుప బెదరి చెదరెఁ♦గీశచయంబుల్. ౯౨౬

క॥ పిడుగు బెడిదంపు ప్రమోఁతకు, నడఁగి యొదుఁగు సర్పరాజి♦యనువునఁ బ్లవగుల్
పడి రేడ్చిరి పాఱిరి తడఁ, బడిరి వడఁకి రురలి రాస♦నదలిరి భీతిన్. ౯౨౭

క॥ నిర్దయుఁడగు దనుజేంద్రుని, దుర్దమ గుణరవము దివము♦దూఁటింపఁగఁ ద్రా
సార్దితులై రసురులె యన, నిర్దేశము లేల ప్లవగ♦నిచయము పాటుల్?

తే॥ ఖేచరులు పరువిడి తల♦దాఁచుకొనిరి, లక్ష్మణుండును ప్లవగ వ♦ల్లభుఁడు దనుజ
పతి విభీషణుఁడును తగు♦పగిది యరయ, నిలిచి రితరులు పాఱిరి♦నివ్వెఱపడి.

చ॥ అవనిఁ బెకల్పఁజాలిన బ♦లాఢ్యుఁడు రావణుఁ డీడ్చు శింజినీ
రవమునఁ బద్మజాండ వివ♦రంబును తల్లడమందె భీతినై

దివిజులు కల్పకాల సము ♦ దీర్ణ మహాశని యంచుఁ బాఱి రీ
పవిది నరామరాదులకు ♦ బాధలుగూర్చుట తారకాణగాఁ. ౯౮౦

క॥ చండగతిఁ బఱిడి పిడుగనఁ, గొండనొకటి వైచెఁ బ్రొద్దు♦కొడుకద్దానిన్
మండెడు కినుకను దశవద, నుండొక బాణమున నుగ్గు♦నూచము చేసెన్. ౯౮౧

క॥ అందులకు భానుసూనుఁడు, డెందంబున రోసి వసుమ♦తీ గర్భము ప్రీ
లం దరు వురవడిఁ బెకలిచి, యందికొనియె హస్తమున న♦హంకృతితోడన్.

క॥ చేపట్టిన పెను కుజమును, తూపులచే రావణుండు♦తునుకలు సేయన్
గోపంబున సుగ్రీవుఁడు, దీపించుచు నొక్కగిరిని♦ తేఁకువ వైచెన్. ౯౮౩

క॥ దాని నొకమ్మునఁ దునియలు, గానేసి వనాటులెల్లఁ♦గలఁగుచుఁ బఱవన్
బూని విలు గుడుసువడ నొక, బాణపు మొదలంటి తూఱ♦భానుజు నేసెన్.

క॥ ఆవేఁడియమ్ము చొర సు, గ్రీవుండు కలంగెఁ గలఁగి♦కీడ్పడు మున్నే
పావని తత్స్థితి యెఱిఁగిన, కైవడిఁ జని యడ్డుపడియె♦క్షణకాలమునన్. ౯౮౫

చ॥ తెలిసిన మూర్ఖ! కీశ జగ♦తీపతి క్లేశము తీఱునంతలో
పల నను దాఁకి పీఁక బహు ♦ భంగుల సంగరముం బొనర్తె ముం
గల? నని వాయుపుత్త్రుఁ డడు ♦ గంగఁ గృపాళుత మున్ను వీడినన్
వలనఱి వెండిఁ జచ్చుటకు ♦ వచ్చితివే యని రావణుండనెన్. ౯౮౬

ఉ॥ శైలమొకండు మారుతి వె ♦ సంగొని వైచిన దానిమీఁది మే
ఘాలియు మాఁడి నింగి కెగ ♦ యంగని పంక్తిముఖుండు సాయక
జ్వాలలచేత బూది సలు ♦ పన్ మఱియొక్క నగేంద్రమెత్తి యు
ద్వేల బలంబునన్ విసరి ♦ వేసె దిశల్ వడి రింగు రింగనన్ ౯౮౭

తే॥ పిడుగుకంటెను వడిగాఁగ♦వెడలి శిఖరి, దనుజు నమ్ములనొకలెక్క♦గొనకమీఱి
వాని భుజములఁ దాఁకి శా♦పంబువోలె, బాహుపురులతో నదియును♦భగ్నమయ్యె.

ఉ॥ ఇంచుకనొచ్చి రావణుఁడు ♦ హేలగ వేఱొక శైలమెత్తి తా
టించఁగనున్న వాయుజుఁ గ♦డింది బలంబున నారి లాగి పా
టించి యురంబుగాఁడ నిగి♦డించిన నొవ్వక గాడ్పుపట్టి యం
కించి కుజంబు వైచి యడఁ ♦ గించెను సారథి పంచజీవముల్. ౯౮౯

తే॥ మఱొక చోదకుఁ డంతలోఁ♦దఱిసి నడప, నసురనాథుండు వందసా♦యకము లేసి
ఎరియు మోదుగువలెఁ గళే♦బర మొనర్ప, నుంతనొచ్చి కర్వలిపట్టి♦సొమ్మసిల్లె.

ఉ॥ ప్రేలుచు ఱాలు ప్రాఁకులను♦వీచుచు గోళులతోడఁ బండ్లతో
నాలము సేయు క్రోఁతులని ♦ యక్కటికన్ మదినూని వీడుచో
నేలిద మింత యయ్యె నిఁక ♦ నే ధనువుంగొని యాజి నిల్వఁగాఁ
ధూలక మీరు ప్రాణముల ♦ తో జయముం గొని యేగువారలే? ౯౯౧

చ॥ అని వికటంబుగా నగి యు ♦ గాంత వలాహక భంగిఁ గ్రమ్మ మా
ర్గణ గణ వర్షముం గురియఁ ♦ గాల సమీర మహోరితాబ్ధి మా
డ్కిని కలగుండు పొందుచును ♦ కీశులు పర్విడ లక్ష్మణుండు నా
ఘన శరపాళి వీనిఁ గడి ♦ కండలు సేసెద నంచు డాయుచున్. ౯౯౨

## —: లక్ష్మణ యుద్ధము :—

మ॥ లయ కాలాంబుద ఘోషణంబుక్రియ లీ ♦ లన్నారి మ్రోయింప దు
ర్భయ సంతాపము లొంది మాయలను దు ♦ ర్వారంబుగాఁ గొన్న దు
ర్నయ దైతేయులు సింహగర్జనము నా ♦ రన్ విన్న మత్తేభ సం
చయ భంగిం గడు విహ్వలించిరి రణో ♦ త్సాహంబు చల్లాఱఁగన్.

మ॥ తన సైన్యంబుల తీరుగాంచి యమ నే ♦ త్ర భ్రూనిభంబైన ల
క్ష్మణ బాణాసన రావమున్ విని మదిన్ ♦ జంకొంద కీ నీచుఁడున్
మనుజుండే యని నవ్వి రావణుఁడు స ♦ న్మాణిక్య దీప్తి ప్రభా
జనకంబుల్ ముకుటంబు లున్నతములై ♦ సాఁగన్ బడిన్ గర్జిలెన్.

చ॥ పడియెడు వానచిన్కులొక ♦ పద్ధతి లేకయ క్రాలులీల నొ
త్తడిగల లక్ష్మణాశుగ క ♦ దంబము తేరుల గుంపుమీఁదఁ ద
త్తడులపయిన్ మతంగజ వి♦తానముపై దనుజ వ్రజంబుపై
నడర రణాంగణంబు రుధి ♦ రాశయమై కనుపట్టె నెల్లెడన్. ౯౯౫

తే॥ కరుల మదజల ముఖములఁ ♦ గాఁడినట్టి, సెలలు వెనుకటి కాళ్లలో♦వెలలి యరుల
వక్షములఁ దొల్చి తేరుల♦యక్షములను, విఱిచి నిలువక యటనుంటి♦వెలికి నేగు.

తే॥ పగఱు రేఁపినకరులువా♦ర్వములుసమయ,వ్యూహమమరినయసురసం♦దోహమడరి
మొనసి కైదువులను లోక♦పుణ్యఫలము, వంటి శ్రీరాము తమ్మునిపై♦పైనివైచె.

ఉ॥ వైచి విరోధి మానవుఁ డ ♦ వార్య పరాక్రము దానవేంద్రుపై
నేచుఁచు డాసెనేని మన ♦ కేటికి బీరములంచుఁ బల్కుచున్
దాఁచక యిచ్చుచుండెడు సు ♦ దారుని చుట్టును మూఁగు పేదలా
యాచకులట్లు దానవు ల ♦ హమ్మతి లక్ష్మణు చుట్టుముట్టఁగన్. ౯౯౮

చ॥ ఎడపడకుండ దానవుల ♦ నేసి సురారుల వాఁడికైదువుల్
వడిఁ బడఁద్రుంచి తప్పివడు ♦ వాని భరించె సుమిత్రపట్టి; యు
గ్గడువుగఁ బాణము ల్గొనఁగఁ ♦ గాలుఁడుఁ జీదఱనొందె రక్తముల్
కడలిని చేరనీక యన ♦ కట్టగ నేర్పడె నాజిఁ బీనుఁగుల్. ౯౯౯

ఉ॥ త్రుంగెను వీరమస్తములు ♦ త్రుంగెఁ గరంబులు వ్రేళ్లు పాదముల్
త్రుంగె నురంబులున్ గటులు ♦ త్రుంగెను శూలములున్ నరాళులున్

ద్రుంగె శరాసనంబులును ♦ ద్రుంగె శరంబులు బాణ తూణముల్
ద్రుంగెను తక్కుఁ గైదువులు ♦ ద్రుంగెను దానవ శౌర్యసారముల్. ౧౦౦౦

ఉ॥ త్రెవ్వె శతాంగ సంఘములు ♦ త్రెవ్వెఁ దురంగమ దీర్ఘ కంఠముల్
త్రెవ్వె మతంగజాంగములు ♦ త్రెవ్వెఁ బదంబుల వీరమద్దియల్
త్రెవ్వెఁ బ్రసూనమాలికలు ♦ త్రెవ్వె హిరణ్మయ వజ్రవర్మముల్
త్రెవ్వె ధ్వజ వ్రజంబులును ♦ త్రెవ్వె సముత్సుకతా విరావముల్. ౧౦౦౧

చ॥ తరమిడి సంగరావనిఁ బ ♦ దాతి వితానము గూల దానిపైఁ
దురగ నికాయముల్ తునిసి ♦ తూలఁగ వానిపయిన్ మదేభముల్
దొరల మదేభరాజిపయి ♦ దొంతరలై పెను తేరు లుర్లఁగా
శిరములు వానిపైఁ బడఁగఁ ♦ జీమకునేని యెడంబు లేదటన్ ౧౦౦౨

చ॥ వడివడి లక్ష్మణుండు శర ♦ పంక్తుల నెత్తుట కూర్చు టేర్చుటల్
విడుచుట యేదియుం దెలియ ♦ లేక నిలింపులె మిట్టిచూచి రా
విడిచిన బాణముల్ దనుజ ♦ వీరుల మేనులఁ జొచ్చి పోక విం
గడముగఁ గానరైరి మఱి ♦ కాంచిన దచ్చటి పీన్గురాసులే!

తే॥ చండకోపు లసురులేయు ♦ శక్తి శూల, పరశు పట్టిస కుంత తో ♦ మర గదాది
వివిధ సాధనములు భిన్న ♦ భిన్నములయి, పడియెఁగాని తప్పినది క ♦ న్పడఁగ లేదు.

చ॥ సమర ధరిత్రిఁ జేరిన య ♦ సంఖ్యములైన మదేభముల్ తురం
గమములు కేతన స్ఫురిత ♦ గాంగ రథంబులు వ్యాఘ్ర ఖడ్గ సిం
హములును తక్కు జీవములు ♦ నమ్ములఁ గూలెనకాక సుంత స
క్రమమున నిల్చినట్టివియుఁ ♦ గ్రమ్మఱినట్టివి లేవ యయ్యెడన్. ౧౦౦౫

మ॥ తనవారల్ తలలూడి కాళ్లు తెగి హా ♦ స్తంబుల్ సగంబై రణా
వనిఁ గూలం బెఱవారు డాఁగి పఱి వో ♦ వం బంచబంగాళమై
మొనయన్ నిల్వమి లక్ష్మణుండు విజయా ♦ మోదంబుతోఁ బేర్చుటం
గని రక్షోధిపుఁ డక్షులం దనహనో ♦ గ్ర క్రోధముం జూపుచున్. ౧౦౦౬

మ॥ జవనాశ్వంబులఁ బూన్చినట్టి రథమున్ ♦ సంగ్రామ రంగంబునం
దవలీలం బఱపించి బిట్టలుక డా ♦ యంబోవ నిర్భీతి రా
ఘవు తమ్ముండును గాంచి యోరి జగదాం ♦ గా! యింక నేమార్ప నీ
కవునే? యంచు నిశాత బాణములచే ♦ సంగంబు నొప్పింపఁగన్. ౧౦౦౭

ఉ॥ ఏసిన తూపులెల్ల శపి ♦ యించిన సంచునఁ దాఁక సోఁకు బా
ణాసన మెక్కువెట్టి కొన ♦ లంటఁగ నీడ్చి శిలీముఖంబు లు
ద్భాసిత రీతిగాఁ బఱపి ♦ తచ్ఛరముల్ నడుమన్ హరింప ని
ల్లె సమరాన నిల్వమని ♦ యేపున లక్ష్మణుఁడేసెఁ దూపులన్. ౧౦౦౮

తే॥ వర్ష ముంబోలెఁ బఱపిన♦బాణచయముఁ, దొలఁగఁజేసి సౌమిత్రిని♦తూణమందు
శరము లెత్తనీయక చేసి♦మెఱసె ధర్మ, మెల్లఁజదివియు మఱచు లం♦కేశ్వరుండు

—: హనుమ ద్రావణ ముష్టియుద్ధము :—

ఉ॥ అత్తఱి సామ్మదేఱిన మ ♦ హాబల నందనుఁ డడ్డువచ్చి దు
ర్మత్తుఁడ! నీచమాయలను ♦ మానుము పండువుగూర్తు నిప్డు నీ
కెత్తిన కాలదండమిది♦యే డ్తెఱ గల్గిన వాఁడవేని నీ
చిత్తము వేఱువంకలకుఁ ♦ జేర్పక చూడుము నన్ను రావణా! ౧౧౧౦
చ॥ గెలిచితి మూఁడులోకముల ♦ గెల్చితి దిక్కులనెల్ల వ్రేల్మిడిన్
గలఁచితి వింద్రుకీర్తి కల ♦ కాలము చెల్లద యొక్కతీరుగా
నలఁచెదఁజూడు నేఁడిట వి ♦ నాశము తప్పదు నీకు నంచు న
గ్గలికముతోఁ ద్రివిక్రముని ♦ కైవడి లాయుచుఁ గేలు సాఁచుచున్.
శా॥ చాపాద్యాయుధవిద్యలెల్లను విశే ♦ షస్ఫూర్తి సాధించి తీ
వేపారంగ భుజంబు లిన్ని యతిశా ♦ యిత్వంబునం బొంది దో
ర్వ్యాపారాంచిత సత్త్వముఁ గలిగి వి ♦ క్రాంతిన్ విజృంభించి న
న్నేఁప న్నిల్చితి నిల్వు మన్నిటిని మా ♦ యింతున్ వెసన్ ముష్టిచేన్
చ॥ పలుకులచే ఫలంబు గను ♦ పట్టదు దిగ్గజ శంభుశైలముల్
బలువిడి నోర్చు ధీర! యొక ♦ పాటిది కింగిరి కోఁతి ముష్టికిన్
న్నిలుతువె! నిల్చితేని విను ♦ నీ పిడిపోటున కిత్తు ఔొమ్ము నీ
బలమున కోర్తుఁ గాని మఱి ♦ వాఁడిమి చూపఁ దలంప నీయెడన్.
చ॥ అనవుడుఁ బంక్తికంఠుఁ డని ♦ లాత్మజు పల్కుల నన్నుతించి నీ
గొనములు మెచ్చఁగూడుఁ బలు ♦ కుల్ మగపాడికిఁ దగ్గయట్టి వీ
యనువున నీవుగాక మఱి ♦ యన్యుఁడు నాయెదురన్ వచించునే?
ఘనమగు నీదు కీర్తికి జ ♦ గంబులె కొల్వఁగఁ గొల్తకోలతా! ౧౧౧౪
చ॥ అసదృశ వీరవుంగవుఁడ ♦ వాయుధ మొక్కటి లేక దైత్యులన్
వసమఱఁ జంపినాఁడవు త ♦ వంబునఁ బొందిన చాపఖడ్గముల్
దెసలు భ్రమింపఁబట్టి పెను ♦ తేరున నెక్కిన నాదు సన్నిధిన్
నుసలక పల్కి నిల్చిన ఘ ♦ నుల్ నినుబోలెదు వార లుందురే? ౧౧౧౫
చ॥ శతమఖుజు లాదిగాఁగఁ ద్రిజ♦గంబులఁ దిక్కులు దక్క నెవ్వరున్
బ్రతుకఁగఁ గోరువారు బవ♦రంబున నన్నెదిరించి నిల్తురే?
కొతుకక నిల్చి వక్షమునఁ ♦ గ్రుమ్ము మటంచు వచించి తిట్లు ధీ
రత నిడి పల్కెడ్వాఁ దగిన ♦ ప్రజ్ఞలుగావు మహాబలాత్మజా! ౧౧౧౬

తే॥ చేతు లిరువది కీర్తిగాం♦చినవి కలవు, శయము లొకరెండె నీకుఁ గే♦సరికుమార !
కఱుదులాడితి జయమింత♦కంటెఁ గలదె? తగిలి నీతోడఁ బోరుట♦తగవుకాదు.

తే॥ దిక్కులం గెలిచిన కీర్తి♦ తెఱఁగుమాయ, నింతకంటె వేఱొండునా♦కిలను గలదె?
బాలు నత్తు నేలంబెట్టి♦కాలరాచి, నట్టి వైరి నామున్నిట్టు♦లాడుచుండె ?

ఉ॥ పగ్గెలు పల్కినాఁడ విటు♦పల్కుట సాజమె మాటెఁ గాలముల్
గ్రగ్గిన మాఱుపల్కినఁ బో♦నంగెడు లాభములేదు అట్టుచే
సిగ్గిలి నిన్నుదుర్వ నిర♦సించుచునుంటి జగంబు చూడఁగా
మ్రొగ్గక వచ్చి నీదు పిడి♦పోటునఁ గ్రుమ్మను ఱొమ్ముచూపెదన్.

తే॥ అసురవిభుఁ డిట్టులాడ మే♦లనుచు హనుమ, లీలఁ దేరిపై కుఱికి నే♦త్రాల మిడుఁగు
లురల సరులతోఁ గవచంబు♦నొడలు పొడిగఁ, బడఁగ వక్షమ్ముఁ బొడిచెను♦వజ్రముష్టి.

తే॥ కొండ లిసుకమై రాలిన♦కొమరుదాల్చె, పెనుఁగువలెనై మెదడువచ్చి♦వెలికినుఱికెఁ
దలలు పదియును మెడలపై♦నిలువలేక, వ్రాలె నసురుల జీవముల్♦వ్రాలెఁదోడ.

ఉ॥ జాఱెను వీరచాపములు♦జాఱె గుణంబులు జాఱె ఖడ్గముల్
జాఱె మనస్థిరత్వమును ♦ జాఱె జయాశయు నుత్సుకత్వముల్
జాఱె శరీర దార్ఢ్యమును ♦ జాఱెఁ దెగింపును జాఱెఁ దేజముల్
జాఱెఁ బరాక్రమంబు దను♦జ ప్రభు ఱొమ్మున నిప్పు జాఱఁగన్.

తే॥ ముష్టిపోటుచే నురమున♦మున్ను విఱిగి, నాటియుండిన దిఙ్మద♦నాగదంత
ములును దశవదను యశంబు♦వలెనె వాని, వీఁపునన్ దుస్సి పుటుకున♦వెలికివచ్చె.

చ॥ చిరిఁగిన కంకటంబున ఖ ♦ చించిన రత్నచయంబు రిక్కల
ట్లురవడి దిక్కులం బఱచె ♦ నుల్లమునందలి ప్రాణవాయు సం
చరణము తగ్గ రావణుఁడు ♦ శైలము తల్లడమందు భంగి ని
బ్బర మొకయింత లేక గరు ♦ వంబు చెడం జలియించె మిక్కిలిన్. ౧౦౨౪

చ॥ అమరులు సంతసిల్లి కడు ♦ హర్ష రవంబులు నేసి స్వర్ణ పు
ష్పములను చల్లి దీవనలు ♦ సల్పిరి రక్కసు లీర్ష్యనొంది రు
ల్లముల ముదాతిరేకమున ♦ లంగలు వేయుచుఁ గీశరాజి పం
క్తిముఖుని కీర్తి మాసెనని ♦ కేకలు వైచెను మైగగుర్పుతోన్. ౧౦౨౫

తే॥ వహ్ని నైజగుణము ప్రాణ♦వాయు గుణము, ననుభవించి యెఱింగిన♦ఘనులు, వేఱు
తనువునం జొచ్చి క్రమ్మఱఁ♦దమ తనువునఁ, జేరుకరణి రావణుఁడు మూ♦ర్ఛిల్లి తెలిసె.

తే॥ తెలివినొంది యూరుపుపుచ్చి♦తెరలి నోట, మాటరాక యుఱిమిచూచి♦సాటిలేని
మేటిమగని మారుతిఁగని♦మిడుకకింక, మద్బలంబును చవిచూడు♦మా కపీంద్ర !

చ॥ జగతిఁగలట్టి సర్వబల♦శక్తులు నీయెడఁగల్గు! నీవ పో
మగల మగండవౌదు హను ♦ మంత! కృతాంతుని చూచివచ్చితిన్

దుగినఁడె వచ్చి నీవు భయ ♦ దుఃఖములొందెదవన్న నుంతయున్
బెగడని యేను నీవలన ♦ భీతి నెఱింగితి సంచలించితిన్. ౧౦౨౮

ఉ॥ నిక్కము నన్ను గెల్చిన సు ♦ నిశ్చల విక్రమ శాలివైతి; వే
ఱొక్కటియేల? నిల్వుము స ♦ ముత్కట మత్కర ముష్టి ఘాతమున్
దక్కక సైఁచి జీవములఁ ♦ దాల్చితివేనియు నింతదాఁక ని
న్నక్కజుతో నుతించిన స ♦ మస్తము నిశ్చయమంచు నమ్మెదన్. ౧౦౨౯

చ॥ అనుడు మరుత్సుతుండు బిడీ ♦ యంబును పొందెద నీవు జీవివై
ననుగని మాటలాడు కత ♦ నన్ జయమొందినవాఁడవే చుమీ
మొనసి మదీయ ముష్టి హతిఁ ♦ బొంది మరింపక నిల్చి నా బలం
బును వినుతించు దిట్టరిని ♦ మున్నొకసారియుఁ జూడ నెచ్చటన్. ౧౦౩౦

ఆ॥ అప్పుదీర్చికొనుమ♦యని ఱొమ్ము చూప ద, శాననుండు పెదవు♦లంటఁ గొఱికి
నిడుద కేలు మిగులఁ♦బొడవుగాఁజాఁచి పా, వని యురమ్ముఁ బొడిచె♦బద్ధముష్టి.
ఆ॥ విలయమందుఁ జెడని♦విజ్ఞానమతి జగ, త్ప్రాణసుతుఁడు పంక్తి♦వదనుబలము
మునుపుగన్న రజత♦భూధ్రంబుకై వడి, వాని పోటువలనఁ♦బల్లటిల్లె. ౧౦౩౨

ఉ॥ తూలఁగ వాయుసూతి దివి♦తూలెను ధర్మము తూలె సత్యముం
దూలెను సద్గుణావళియుఁ♦దూలెను కీర్తియుఁ దూలె వేదముల్
తూలెను నీతియున్ దయయుఁ♦దూలె దపంబును తూలె భూమియుం
దూలెను బంచభూతములు ♦ తూలెను తూలె సమస్త సత్కృతుల్.

క॥ అక్కడఁగల కపివరు లప్పు, డొక్కొక రొక్కొక్క నగము♦నొగిఁదెచ్చి వడిన్
రక్కసుల జేనిపై బయ, లెక్కడఁ గనరాక ముసరి♦యేసిరి కడిమిన్. ౧౦౩౪

క॥ బలసంపన్నులు ప్లవగులు, విలయాబ్దముభంగి నింగి♦పిక్కటిలఁగ న
ద్రుల వైవ వియచ్చరు లొ, త్తిలి చెచ్చెర నవ్వలికి నొ♦దింగిరి భీతిన్. ౧౦౩౫

తే॥మింటఁ జోటు లేకొండొండు♦గొంటికొనుచు,నవ్వలికిఁబోక నిలిచె నా♦యద్రిచయము
తరణి మఱుఁగవ్యై జగముల♦నిరులుగ్రమింగె, రక్కసులు తగ్గిరని సురల్♦క్రమ్మరవల.
తే॥కొండ లొకటిపై నొక్కటి♦కూలి విఱుగ, మిడుఁగుఱులు లేవ మెఱుపులు♦మెఱయఁ
లట్లుదాఁకి శిలావృష్టి♦యట్లు రామ, భద్రు దివ్యాస్త్రవర్షంబు♦పగిదిఁ గురిసె. [బిడుగు
తే॥ కర్బురుల పెనుసైన్యంబు♦కలఁగి చెదరి, మలఁగె మింటిరిక్కలతో వి♦మానపంక్తి
రాలె మిడుఁగులచే నబ్ధి♦క్రాఁగి మీలు, తేలి సోఁకుల కనుగ్రుడ్ల♦లీలనుండె.

ఉ॥ లోకము నేఁడె కూలెనని ♦ లొగ్గడిఁ గల్గిన రావ మొల్లెడం
బ్రాఁకఁగ రావణుండు విని ♦ పట్టని రోషభరంబునన్ సురా
స్తోక యశోవిభూతులను ♦ చూఱలు వెట్టిన దొడ్డవిల్లు బిం
బాకృతిఁదోఁపఁ దూపు లొల ♦ యం బఱపించి చెదర్చె నన్నిటిన్.

ఉ॥ అమ్ములు విండ్లు తుండ్లుగ హ♦యమ్ములు ద్రుంచఁగ వారణమ్ము ల
ప్పమ్ములుగాఁగ సింహ శర♦భమ్ములు వ్యాఘ్రము లా రణస్థలిన్
దమ్ముగఁజేసి కుప్పలుగఁ♦ దార్కొను పర్వతముల్ కుజంబులున్
దుమ్మయి గాలిలోఁగలియఁ♦ దూఱె దశాస్యుని యంపవానచే ౧౦౪౦

క॥ ఔరా! తీరగు శరసం, చారము! గిరి యొకటి లక్ష♦శకలను లయ్యెన్
సౌరగు కర లాఘవ మ, య్యారే! యని విద్రిచికొనిరి♦హ_స్తము లమరుల్

తే॥ పంక్తిముఖుచేవ పగ్గము♦పాడుచేయ, హరులు వైచిన గిరులఁ ద♦చ్ఛరము లడరి
త్రుంచి యన్ని దెసల వార్ధి♦ముంచివైచె, నేల నెత్రు గప్పెను మేల♦ధూళిగప్పె.

క॥ వానరులతోడ నేఁడే, మానిసు లిర్వురను రూపు♦మాపెద ననుచున్
దానవవిభుఁ డుగ్రుండై, పూనెం బది యెడమ కేలఁ♦బోరిఁ బదివిండ్లన్ ౧౦౪౩

క॥ పది దీర్ఘ బాహువులతో, బది ధనువులవంచి పదులు♦పదులుగ నమ్ముల్
వదలి దశదిశలు కడలియఁ, గదిరి శరమయముగఁ బంక్తి♦కంఠుఁ డొనర్చెన్

క॥ పొలిసెను కపిసైన్యము కు, ప్పలుగా నాకుప్పలపయి♦ప్రాలె వనదముల్
పొలికలను రక్తమయమ్మై, వెలసెను సాయంతనంపు♦విన్ను విధమునన్ ౧౦౪౫

సీ॥ నిలువంగలేఁడయ్యె♦నీలుండు నడవలేఁ, డయ్యె నలుఁడు లేవఁ♦డయ్యె గజుఁడు
కాలుఁ గానఁగలేదు♦గవయుఁ డంగదుఁడును, జీవించునా యను♦స్థితి భజించె
చలియింపలేఁడయ్యె♦జాంబవంతుఁడు కొఱ, మాలి పడియె గంధ♦మాదనుండు
గువ్వరీతి ముడింగి♦కుడికిలె శతబలి, పనసుని మెడ తూలి♦పడుచునుండె

తే॥ మఱియుఁగల గొప్పవీరులు♦నెఱుఁకులంటఁ, దేజు మాసిరి కూలిరి♦తికమకపడి
పాఱి రదిగని సౌమిత్రి♦భయదరోష, భీమణాకృతితో విజృం♦భించి నడచి

తే॥ రావణుఁడు వైచినట్టి శ♦రప్రకర్ష, మడఁచి వాని యహంకార♦మఁడగఁ బది శ
రాసనమ్ములఁ బదితూపు♦లేసిత్రుంచి, దనుజు లదరంగ సింహ నా♦దమ్ముచేసె.

తే॥ వేలుపులు చాల మోదించి♦ కేలుతట్టి, విరులు చల్లిరి మునులు దీ♦వించినారు
ధర్మదేవత యుత్సుక♦త్వమున నాడె, మెచ్చె లంకేశ్వరుండు సౌ♦మిత్రి నేర్పు.

తే॥ మేలు సంగరోత్సాహంబు! మేలువిద్య!, మేలు రణకార్య పద్ధతి! మేలు తెంపు!
మేలు కర లాఘవంబును! మేలు నేర్పు! మేలనుచు మెచ్చె ముక్కుపై♦వ్రేలుచేర్చి.

ఉ॥ దండకలో ఖరాదుల మ♦దంబు నడంచిన రాఘవుండు నా
ఖండలు ప్రేల్మిడిన్ రణ ము♦ ఖంబున గెల్చిన నానుతుండు ను
ద్దండ శరాసనంబు బెడి♦దంబుగఁ దాల్చిన యేను దక్క బ్ర
హ్మాండమునందు లేరు సమ♦రావని నీ సరివచ్చు దిట్టరుల్

—: రావణశక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట :—

తే॥ అనుచు వింటిచే గెలువంగ♦ననువుగాద, టంచు వీనిని విడువరా♦దంచు నసుర
ధాత యొసఁగిన శక్తి హా♦స్త్రమునఁ గొనుచు, వైచె లక్ష్మణుపై నెల్ల♦వారు బెగడ.
ఉ॥ వైచిన శక్తి లక్ష్మణుని ♦ బాణ నికాయములెల్ల లీలగాఁ
బూచిక లట్లు ద్రుంచుచును ♦ పోయి యురమ్మున నాటె దాని పై
శాచిక శక్తిఁగన్న గుణ ♦ శాలి దురమ్మున వ్రాలి మూర్ఛలన్
మోచిన చింతతోఁ గపులు♦ముచ్చిరి రార్చిరి సోఁకు లుబ్బుమై ౧౦౯౨
తే॥ ఎల్లసురలును దమసామ్ము♦కొల్లవోయి, నట్లు వెలవెలపోయి ర♦త్యాహితమున
మునులు విసిగిరి ధర్మ చిం♦తనమునందు, ధరణి దిరిగెను మార్పడెఁ♦దరణికాంతి.
తే॥ దీని కితఁడు జంకఁగ లేదు♦త్రెళ్లలేదు, మూర్ఛవోయినాఁడని దశ♦ముఖుఁ డెంచి
యితని మేను గైకొని లంక♦కేగెదనని, క్రూరచిత్తుఁడై దిగివచ్చెఁ♦దేరినుండి.
తే॥ బావు లిర్వదింటను కవ్విఁ♦పట్టి మున్ను, తారగిరి నెత్తుటకు సిగ్గు♦మీఱ నిపుడు
మేరుగిరి నెత్తఁబూనిన♦తీరుదోఁప, నెత్తె బలమెల్లఁ జూపి షం♦డ్లీలకఱచి. ౧౦౯౩
తే॥ తాను పీతాంబరుండను♦జ్ఞానగరిమ, మానకున్న హేతువున రా♦మానుజుండు
శివ నగంబును చలియింపఁ♦జేసినట్టి, హస్తముల కెత్తరాని వాఁ♦డయ్యె నపుడు.
క॥ దశముఖుఁడు కడలిఁ బోలెను, దశముఖు హస్తంబు లబ్ధి♦తరఁగలఁ బోలన్
దశరథ సూనుఁడు సాగర, శిశు వనఁదగు శశిని పోలి♦చెలఁగెం జూడన్, ౧౦౯౪
తే॥ఎత్త యత్నించి కదలింప♦నిమ్ముపడక, యూర్పువిడువ వేఱొక్కచో♦నున్న హనుమ
కని తటాలున వచ్చి రా♦వణుని గెంటి, యవ్వలికిఁ గొనిపోయె రా♦మానుజన్ము.
ఉ॥ పావని జ్ఞానులం దధిక ♦ పావనుఁ డౌటను లక్ష్మణాఖ్యుఁ డా
శ్రీవరుఁడౌటచే మఱియుఁ ♦ బ్రేమబలంబును దొడ్డదౌట సం
భావిత భక్తిచేతఁ బసి ♦ పాపను తల్లి వహించు కైవడిం
గైవడిఁ గొంచుఁ బోయె♦రఘు కాంతుని సన్నిధికిన్ రయంబునన్. ౧౦౯౫

—: రామ రావణ ప్రథమ యుద్ధము :—

తే॥ జానకీవిభు డాసి ల♦క్ష్మణుని దించు, నంత నతఁడును తెలివంది♦యులరి లేచె
రాముఁ డప్పుడు లయకాల♦భీము భంగి, నడరి రావణుతోఁ బోరు♦నడప నడచె.
తే॥ దంతిమీఁదికి లంఘింపఁ♦దలఁచు సింగ, మట్లు రాముఁడు వచ్చుట♦యసురవిభుఁడు
గాంచి రాఘవు నెదుటికిఁ♦గనక రథము, పోవనిచ్చె నుత్సాహంబు♦పొదలుచుండ.
క॥ రణకోవిదుఁడగు దానవ, గణనాథుఁడు తేరిమీఁదఁ గ్రాలఁగ సమరాం
గణమున రాముఁడు నేలం, గనఁక నిలుచు టనువె? యనుచుఁ గదలె హనుమఁడున్.

తే॥ తనకు మున్నొసంగిన గంగఁ♦దలను దాల్చి, పావనుండైన శంభుండు♦పాపివితతి
మలయుచోఁ బదచారియౌ♦మామఁ గాంచి, యారకుండుట తెఁపంగ♦మేరయౌనె?

తే॥ అసమరీతి రణము సేయ♦నసుర తేరి, పై వెలయ నేల నీవుంట♦పాడిగాదు
సేవకుఁడనగు నాభుజ♦శిఖరియందు, కూరుచుండుమ యని వేఁడు♦కొనియె హనుమ.

తే॥ మంచిదని రామవిభుఁ డెక్కె♦నంచితముగఁ, గొండపై నెక్కు సింగంబు♦గొమరుదోఁప
గనిన బిడ్డను మోచిన♦జనని పగిది, హనుమ యలరె సురాలి దీ♦వనలు చేసె.

తే॥ అల త్రివిక్రమ రూపంబు♦నరసియున్న, హనుమఁ డతిశయానందంబు♦నందఁ గాంచి
శ్రీహరికి వాహన శయన♦శ్రీలఁ దాల్చు, గరుడి లజ్జించె శేషుండు♦శిరము వంచె.

ఉ॥ మారుతి క్షీరవారిధి ♦ క్రమంబున నొప్పె రఘూద్వహుండు నా
క్షీరపయోధిశాయి యనఁ ♦ జెన్నగు నన్నను యోగనిద్రకుం
దారఁడు; వాయుసూతి శ్రుతి♦తండము వేదశిరోర్థ మా ధరా
జారమణుండనంగఁ దగు ♦ సామ్యము చొప్పడు నిశ్చయంబుగన్.

తే॥ మఱియుఁ జూడంగ నాహను♦మంతుఁ డొప్పె, సకలలోకమూలంబగు♦ప్రకృతినాఁగ
రామభూపాలుఁడొప్పెఁద♦త్ప్రకృతి శక్తి, కరయ మూలకారణ విరా♦ట్పురుషుఁడనఁగ

తే॥ వనజజాండంబు లెల్ల గ♦ర్భమునఁ గొన్న, దాశరథికిఁ గావలయు వ♦ర్ధతులఁ దిరుగు
మారుతి భుజాగ్రదేశంబు♦మేరుశిఖరి, నెనసె నన్న న్యూనోపమ♦మే ఘటించు.

తే॥ ధర్మదేవత మోద న♦ర్తనముచేసె, ఋషులు కేలెత్తి దీవన♦లిచ్చినారు
బ్రహ్మరుద్రాది దేవతల్♦రణము చూడ, వచ్చి మింట మూఁగిరి రఘు♦వరుఁడు కదియ.

తే॥ సంగరోన్ముఖుఁడగు రామ♦చంద్రుఁడపుడు, కేలఁ గోదండగుణము లా♦గిన రవంబు
దివియు భువియు సమస్తంబు♦తివిరి క్రమ్మింగు, రుద్రమూర్తి సేయు మృగేంద్ర♦
రుతముఁ బోలె.

తే॥ యక్షులును రాక్షసులును ప్రా♦ణానిలములు, వీడకున్నను నిలుకడ♦యూడి నాల్క
లెండఁ గలఁగిరి మలఁగిరి♦యండచయము, నెలవు దప్పె బ్రహ్మాదుల♦తలలు నాడె.

సీ॥ విద్రుమ వర్ణముల్♦విలయాగ్ని నిభములు, జలధి నీటిని ద్రావఁ♦జాలినవియు
దిక్కులఁ గొలువంగఁ♦దివురునవియు మింటి, మంటిని తొలువ స♦మర్థములయి
యడరు నేడమ్ములు♦నసురవిభుండేసె, వాని నేడమ్ముల♦వనజనయనుఁ
డేడేసి తుండ్లుగా♦నెడలించి యొక్క సా, రిగ నైదు తూపుల♦మొగిఁ దొడింగి

తే॥ పరప దశకంధరుఁడు నైదు♦శరములేసి, నడుమనే త్రుంచి మఱి♦పది తొడుఁగులంట
నీడ్చి విడువంగ సూర్యకు♦లేశ్వరుండు, విశిఖ దశకమ్ముచే వాని♦విఱిచివైచె.

తే॥ దగ్గఱగనున్న రావణు♦దండువైచు, నాయుధమ్ములన్నిటిని పె♦క్కమ్ములేసి
వెండి వైచినఁ బొడిచేసి♦వీరమస్త, కావళుల నొక తిట్టగాఁ♦బ్రోవుచేసె.　　౧౦౭౮

తే॥ సైన్యనాథులేసిన యస్త్ర♦జాలములను, రావణాశుగమ్ముల వాన♦రావళిపయిఁ
జెదరనీయక తొలగించి♦శిత శరముల, నంగపతుల మస్తములు డు♦ల్లంగనేసె.

చ॥ ఘనతర రామబాణముల ♦ కంటెను దండముకంటెఁ దొందరన్
జను హనుమానుఁ డీధర నె ♦ నంగెడివాఁ డనునంతలో నభం
బునఁ గనుపట్టు రావణుని ♦ ముందరఁ దోఁచు నెడంద లుద్ధ్వ న
ద్దనుజుల కన్నులందు బెడి ♦ దంబుగ వెక్కసమై కనంబడున్. ౧౦౭౬

ఉ॥ ఆడఁదొడంగె నట్టలను ♦ వందఁగ వేడుకతోఁ బిశాచముల్
పాడఁదొడంగెఁ గంకములు ♦ ప్రబ్బి వియత్తలమెల్లఁ జుట్టి ప్రో
పాడఁదొడంగెఁ బీనుఁగుల ♦ యంగములం గొని నెత్రుతో యుద్ధిం
గూడఁదొడంగె రాము శిత♦ఘోర శిలీముఖ రాజి పర్వఁగన్. ౧౦౭౭

తే॥ చక్రములు ఖండములయియ♦క్షములువిఱిగి, ఖురువు లురలి ధ్వజంబులు♦కొరలి తేగు
బారు లెడసి తార్మాఱుగఁ♦బడియెఁ గరులు, తుండములు తెగిపడెఁ గొండ♦పిండులట్లు

తే॥ బండ్లుపోవ విండ్లును పోవఁ♦బండ్లు వోవఁ, గరులుపోవ హరులుపోవఁ♦గంకటములు
పోవ శౌర్యంబుపోవ గ♦ర్వరులు తుదకుఁ, దలలుపోవఁ గూలిరి రణ♦స్థలమునందు.

తే॥ సుతనుమధ్యలు రణభూమిఁ♦బతుల తలలు, కరుల హరుల తలలు నొక♦కరణినుండఁ
దెలియనేరక తచ్ఛిరం♦బులను చేర్చి, కొనుచు నేడ్చి యేడ్చి యచటఁ♦గూలినారు.

చ॥ అడఁగెను సింహనాదము ల♦హంకృతు లాఁగెఁ జిరాకు చూఁపులున్
మడఁగెను ధూళియున్ డిగియె♦మందటిలెన్ బహుళాయుధా రవం
బుడిగెను టంకృతుల్ కడచె♦నుత్కట ఘీంకృతులీఁగె హేషలున్
ముడిఁగెను సైన్యముల్ దనుజ♦ముఖ్యుఁ డొకండయి నిల్చె నాజిలో. ౧౦౮౧

తే॥ నాల్గు విధముల సేనలు♦నలఁగి తునిఁగి, యొడుదుడుకుగాఁగఁ గొండల♦వడువుదోఁప
నున్న శవరాసులను గాంచి♦యుడికి యసుర, వరుఁడు బునకొట్టసాగె స♦ర్పంబుపగిది.

తే॥ నారి నాకర్ణముగ లాగి♦ఘోర శరము, లేసి రాముని భుజముల♦గాసిపఱుప
నతఁడు చిఱునవ్వుతోడ సు♦రాంతకు ధను, వైదు తుండ్లుగ విఱిచె నై♦దంబకముల.

తే॥ వేఱువిల్లందుకొని యెక్కు♦వెట్టునంత, రామవిభుఁ డదియును ద్రుంచి♦రాక్షసేంద్రు
పవన జవన తురంగమ♦పంక్తిఁ గూల్చి, సారథిని చంపివైచె ని♦ర్జరులు పొగడ.

తే॥ అసురమఱియు వేఱొకకై దు♦వందికొనెడు, నంతలోనడుమనద్రుంచి♦స్యందనమును
గొడుగుతోడధ్వజముతోడఁ♦గూల్చివాని, దృఢతనుత్రాణమునుగూడఁ♦ద్రెంచివైచె.

తే॥ వేఱువేఱు తేరులు వచ్చి♦చేరుచుండ, నెక్కనీయక నడుమ మా♦యించుచుండె
రాఘవుఁడు; రావణుండును♦రౌద్రమూర్తి, యయ్యెమృత్యువునటియించు♦నాజియందు.

తే॥ రత్న ఖచితమ్ములైన శీ♦ర్షకములపయిఁ, బది లకోరిలఁ బఱప భా♦స్వరునిమీఁది
కెగయు హనుమనికైవడి♦నేగి విశిఖ, దశక మవ్వాని దోర్చి సం♦ద్రమునఁ బడఁగ.

తే॥ మణులకాంతులు దిక్కుల♦మలయుచుండ, జడధిఁబడినదై త్యేంద్రు శీ♦ర్షకములపుడు
నిగుడు చండ ప్రభంజన♦నిహతిచేతఁ, గూలు మేరువు శిఖరాల♦లీలఁ దోఁచె.

క॥ రాముని నిశాత బాణము, లా ముకుటములఁ గొనిపోయి♦యబ్ధిని విడుటల్
ధామనిధిఁ గొంచు రాహువు, దీమసమున జలధిఁ ద్రోచు♦తెఱఁగున నొప్పెన్.

క॥ అపజయ మెన్నఁడు నెఱుఁగని, కృపణుఁడు మకుటముల నీఁగి♦కీర్తియుఁ జెడఁగాఁ
దపన నిశాకరు లలరని, యపకృష్టాహర్నిశముల♦యనువున నొప్పెన్. ౧౯౦

తే॥ మకుటములఁ గోలుపడు దశ♦మస్తకుండు, ప్రతిభటాభీల గురుత ను♦న్నతుఁడైయునఁ
బ్రవిమలాత్మకుఁడైన సు♦కవి శపింపఁ, బ్రథితకీర్తిని కోల్పోవు ♦ ప్రభువుఁబోలె.

ఉ॥ క్రిందికిఁ జూచు కన్నులును ♦ కీడ్పడు మోమును రిత్తకేలు ప్రే
లం దిగి యూడమర్ల్ని యన ♦ లంబు శరీరముతోడ నున్నదై
త్యేందు డధర్మచారులకు ♦ నిట్టిదె పాటని లోకులెల్లఁ బ
ల్కం దలవంచి నేలపయిఁ♦గాలను రాచుచు నిల్చె నచ్చటన్. ౧౯౨

తే॥ అట్లు నిలిచిన రావణు♦నరసి ధీర, వరుఁడు సుగుణుండు రాముండు ♦ వట్టికేల
నున్నవాఁడని చంపంగ♦నుల్లమందు, తలఁప కిట్లని పల్కె నౌ♦దార్యఘణితి ౧౯౩

ఉ॥ ధర్మపథంబు ద్రొక్కక య ♦ ధర్మవిధంబున సంచరించు దు
ష్కర్ములు వేల్పులైనను య ♦ శంబు జయంబును గాంచ శక్యమే?
దోర్మద ముజ్జగిల్లెనె? వి ♦ ధూత బలుండవు నిన్ను చంప నీ
యర్మిలివారిఁ గూడుకొని ♦ యందుము సౌఖ్యములెల్ల నేఁటికే. ౧౯౪

శా॥ నీవంశస్థులతోఁ గుమారకులతో ♦ స్నిగ్ధాళితో వెండియుం
జేవంగల్గిన సేనతోఁ దొడరి యు ♦ త్సేకంబుతో నెల్లి ర
మ్మా వేళం బెనుపోరునం దలసి నీ♦యేపుం బ్రపూర్ణంబుగా
నావంకం గనిపింపవైతి వది.గా ♦ నంగోరియే పీడితిన్. ౧౯౫

మ॥ సమరోత్సాహము గల్గునేని కడఁకన్ ♦ సైన్యంబుతో రమ్ము ప్రా
ణములం దాఁపఁ దలంతువే జనక క ♦ న్యం దెచ్చి యొప్పించి రా
జ్యము సీతమ్మనకిచ్చి కొల్వు మతనిన్ ♦ జాకుంటకున్ వేఱు మా
ర్గము లే దెన్ని విధాలఁ జూచినను ని ♦ క్కంబిద్ది లంకేశ్వరా? ౧౯౬

మ॥ దురమే సేయఁదలంతువేని బలసం ♦ దోహంబు చేకూర్చుకొం
చిరవారన్ శ్రమదీర్చికొంచు వడి నా ♦ యిత్తంబుగా రేపె నీ
శిరముల్ నాశరపాళి కాహుతిగ న ♦ ర్పింపంగ రమ్మింక ని
ల్వరమున్ లేదు నిజంబు మాయలును చె♦ల్లంబోవు రక్షోధిపా!. ౧౯౭

తే॥ నేఁడుకాంచితే గాలికి♦నెగయు దూది, పింజలట్టులు నీ సేన♦విఱిగి కలఁగి
కూలుటలు నేఁటికేగి రే♦పాలమునకు, రమ్మనుచుఁ గరుణాళుఁడై ♦రాముఁడనఁగ.

## ౧౪ కుంభకర్ణవధ పటలము. (౨౬౩)

సీ॥ దిగ్గజంబుల పోటు♦తిపిరి యోర్చిన ఱొమ్ము, కైలాసమెత్తిన♦ఘన భుజములు
జగడాల తపసి మె♦చ్చఁగఁ బాడు నాల్కయు, శివుఁడిచ్చు కత్తియు♦శీర్షకములు
శౌర్య సంపదయును♦సంగరస్థలి వీడి, త్రిజగంబు లేలిన♦దితిజ విభుఁడు
తలమెత్తనీని యు♦త్తలపాటుతో భంగ, పాటుతో బిడియంపు♦బరువుతోడ
తే॥ భటులఁ గన్నెత్తి చూడక♦పజ్జఁ జేరు, సుతులఁ బ్రేమను కాంచక♦సతులఁ గనక
పరవి యున్న సేననుగూడఁ♦బాటిగొనక, వెంటవచ్చు వారలను భా♦వింపకేగె.
తే॥కమలవదనలకనులు ఖ♦డ్గములపోల్కెఁ,గష్టములెకూర్చునుతులవా♦క్యములురామ
బాణములవలె నొంచెఁ జె♦ల్వాల పయోధ, రములుతన భుజములవలెఁ♦బ్రమదమిడవు
తే॥ మంత్రములు తెల్పువృద్ధులు♦మందయాన, లైన భార్యలు సైన్యనా♦యకులు బంధు
హితులు ప్రతిమలవలె నిల్వ♦దితిజవిభుఁడు, దంతివలె నేగి చేరె నం♦తః పురంబు
తే॥ అచట నొక పైఁడిపీఁటపై♦నమరి చింత, యించుకంత కుదించి యో♦చించి పిదప
గంచుకిని పిల్చి వేగ వే♦గరులఁ దోడి, తెమ్మనుచు నాజ్ఞయిడ వాఁడు♦తీవ్రగతిని.
తే॥ వెడలి వాయువేగుఁడుమరు♦త్తుఁడుమనోగ, తియుమహామేఘుఁడాదిగాఁ ♦ దెలివి
దూతలనసంఖ్యజనములఁ♦దోడితేర, వారలకు రావణుం డాజ్ఞ♦వఱలఁజేసి. [గలుగు
తే॥ ఏడుదీవులయందు మ♦హీధరములఁ, జక్రవాళంబుమీఁదను♦సర్వభువన
మందుగల రాక్షసుల వడి♦నరుగుదేర, నాజ్ఞ దెలిపి తోతెండని♦యనిపి వారి.

చ॥ క్రమముగ నాజ్ఞమోచి యుడి ♦ గంబులు సేయు త్రిలోకవాసులున్
దమవిభు భావమిద్దియని ♦ తత్పరతన్ గమనింపలేక డెం
దములఁ దపింప రామ శర ♦ దారుణ వేదన నోర్వలేక నా
గము తనసెజ్జఁ జేరుక్రియఁ ♦ గర్బురనాథుఁడు చేరె శయ్యకున్. ౧౧౦౫

ఉ॥ సుందరియైన జానకి వ ♦ సుంధరపుత్త్రిక నిండియున్న యా
డెందమునందు నిండుగ బి♦డెంబు గడల్కొనఁ దోడఁ జింతయున్
గ్రందుగఁ జేర నించుకయుఁ ♦ గట్టెఁడి కూరుకురాక లోపలన్
గుందుచు భంగపాటు వెలి♦గొల్పఁగ గొప్పగ నిశ్వసించుచున్. ౧౧౦౬

ఉ॥ పాఱిన వేలుపుల్ నరులు ♦ పల్చన నవ్వుదురంచు శాత్రవుల్
మీఱఁగ నవ్వ వారనుచు ♦ మెట్టుకు సిగ్గు వహింపఁబోఁడు లం
కారమణుండు సీత నగుఁగా ♦ యని మిక్కిలిగాఁ దపించె నా
నారులు నవ్వ సైఁపనగు ♦ నా మగవారికి నిల్వరంబునన్? ౧౧౦౭

ఆ॥ అంత నసుర తాత♦యగు మాల్యవంతుండు, వృద్ధు మేను విల్లు♦విధము వంగ
రావణునకు నగు ప♦రాభవంబును విని, వచ్చి కూరుచుండె♦వానిపజ్జ. ౧౧౦౮

ఉ॥ వాని పరిస్థితిన్ దిగులు ♦ వాఱ నెగాదిగఁ జూచి చూచి య
క్షీణ తపోనిధీ! కడిమి ♦ చేప్పడ ముమ్మరమైన పోరునం
దూనితి నోటునంచు దిగు ♦ లొంది కృశించెదె? యేమియయ్యె? నా
మానవు లెట్టిరో? తెలుపు ♦ మా విన నామది తత్తఱించెడిన్. ౧౧౦౯

ఉ॥ మనసును మేను కన్నులును ♦ మండఁగ శర్కరయైన ద్రాక్షయై
నను రుచి గానలేని వహీ ♦ నాలుకయొండఁగ దైత్యనాథుఁ డి
ట్లనియెను తాపసాకృతుల ♦ నందిన మర్త్యులతో రణంబు కూ
రెను మన వంశగౌరవము ♦ ప్రీలెను నాస్థితి గోడిగంబుగాన్. ౧౧౧౦

—: రావణుఁడు మాల్యవంతునకు రాముని పరాక్రమాదులు తెలుపుట :—

క॥ తాతా! రుద్రుఁడు మొదలుగ, నాతత లోకముల వార ♦ లందఱు పెలుచన్
నాతోడైన సుమిత్రా, జాతుని బాణముల కాగఁ♦జాలరు వింటే. ౧౧౧౧

చ॥ సమరమునం దగణ్యమగు ♦ సైన్య కదంబము రూపుమాపుచో
దమథమమాన్చి యోటమిని ♦ దార్చెడుచో నులి మట్టి యుండలన్
దమకముతోడ మంథరకుఁ ♦ దాలఁగ నేసిన నాఁటి లీల చం
దమునన యుండెఁ గాని భయ ♦ దస్థితిఁ దాల్పఁడు రాముఁ డయ్యెడన్.

ఉ॥ రాక్షససేన దట్టమయి ♦ క్రాలిన లక్ష్యము దప్పకుండు రా
మాక్షయ బాణసంఘము శ ♦ తాంగ తురంగ మతంగజాదులన్
బక్ష శిరోధి మధ్య కర ♦ పాదములన్ వడిఁ ద్రుంచుఁగాక యే
క క్షణమైన నేయెడను ♦ గాఁడుచు డుయ్యక యందు నిల్చునే?. ౧౧౧౩

ఉ॥ రాముని చేతినుండి ప్రద ♦ రంబులు వెల్వడు పిమ్మటన్ జగ
త్స్తోమముఁ జొచ్చుఁగాని వెను ♦ ద్రొక్కవు కల్పము దాఁటవచ్చుఁ ద
ద్భీమ శరప్రఘాతములు ♦ వీడవు దిక్కులఁ గాల్చు మాఱు ప
ల్కేమనఁ గాల్చు వైర మెద ♦ నెంచినఁ గాల్చు లయాగ్నిఁ గాలుచున్.

ఉ॥ మేరువుఁ జీల్చుమన్న వడి ♦ మింటిని రంధ్రము సేయుమన్న నీ
ధారణి వ్రచ్చుమన్న జల ♦ దంబుఁ జెదర్పుమయన్న వారిధిన్
నీరముఁ ద్రావుమన్నఁ దన ♦ నిస్తుల సాయకపాళి శక్తికిన్
నేరుపుగాఁగఁ దోఁప వవి ♦ నిల్చునొ నిల్వవొ వాని ధాటికిన్?. ౧౧౧౫

ఉ॥ అమ్ముల నెత్తికొంట గొన ♦ యమ్మునఁ గూర్చుట యేయుటల్ విలా
సమ్ముగఁ దోఁచెఁ గాని కల ♦ సంబుగఁ గాంచెడు వేల్పులేని న్వ
ల్పమ్మును గానరైరి కర ♦ లాఘవమున్ శర లాఘవంబుఁ బ్రా
ణమ్ములఁ గ్రోలుఁడీ చనుఁడ ♦ నం దన సైన్యము వోలె వెల్వడున్.

క॥ ధరణిజ నాథుని శర సం, చరణమ్ములు సుకవి వాక్య♦చరణ గుణాలం
కరణ ధ్వనులం గలిగియు, విరమణములు లేక విబుధ♦వినుతికి నెక్కెన్. ౧౧౧౭

చ॥ భవుని త్రిశూలముఁ మఘవు ♦ వజ్రము వెన్నుని చక్ర మాజిలోఁ
జవి గనినాఁడ భేదము ని ♦ జంబుగ నెక్కువ యున్నదయ్య! రా
ఘవ శరవేగముఁ సయింపఁ♦గాక యె క్రుంగితి నేనుగాక వే
ఱెవ రిఁకఁ దచ్ఛరాలిఁ గను ♦ లెత్తి కనం గలవార లీధరన్ ? ౧౧౧౮

తే॥ రుద్రు బాహాష్టకంబు నిం♦ద్రుని భుజద్వ, యంబు విష్ణుని బాహు స♦హస్రకంబు
నితని యొక వ్రేలి బలిమికి♦నీఁడురావు, తాళఁజాలవు తాఁకి య♦థార్థ మిద్ది.

తే॥ వీరు లెందఱేనియు నుగ్ర♦విష్ణులైనఁ, గార్తవీర్యుఁ బోలినవారు♦కారు నిజము
అట్టి యర్జునుఁడును రాము♦ననుజు పాద, ధూళికిని పోల్ప సాటి కాఁ♦జాలఁడయ్య!

చ॥ త్రిపురములన్ దహించుతఱి ♦ శ్రీగళుఁ డూనిన విల్లు దాని ముం
దెపుడును వేడ్కకేని ధరి♦యింపఁగ నొప్పదు దానికొక్క వే
ఱుపమితి పల్కలేదు శ్రుతు ♦ లొక్కెడఁ దప్పినఁ దప్పుఁగాక యా
తపన కులేంద్రు చాపము వ ♦ దల్చు శరంబులు తప్ప నేర్చునే? ౧౧౨౧

సీ॥ వెలలుచో నాల్గుమో♦ముల వేల్పుఁ బోలును, చెదరుచోట సహస్ర♦శీర్షుఁ బోలుఁ
బగఱఁజేర యుగాంత♦భైరవుఁ బోలు నా, చిలుకుల పనులు వ♦ర్ణింప నరిది!
నా బలగర్వముల్♦నశియింపఁ జేసిన, వన్న వేఱొక సాక్ష్య♦మెన్న నేల ?
వాఁడు పట్టినవిల్లు ♦ పడమటిదో? తూర్పు, దో? దక్షిణంపుదో? యుత్తరపుదో?

తే॥ మూలలందలిదో? విశాల♦భూమిఁ గలదో?, మింటిదో సమ స్తంబును♦ మేవినదియొ!
యెఱుఁగఁజాలకుంటిని కుడి♦యెడమలందు, నిక్క మేవంకనుండెనో ♦ నేర నిఁకను.

మ॥ వసుధాధీశుని వాహనం బనిలుఁడో♦వైశ్వానరుండో విభా
వసుఁడో కాలుఁడొ కావలెం దెలియఁగా ♦ వచ్చుం బ్లవంగంబుగా
వెస నక్కోఁతి యొనర్చు చేఁత లురగ♦ద్వేష్యుం డుఁ గావించునే?
యసమానోన్నతి నొంద దద్దియన నా ♦ యజ్ఞత్వముం దెల్పదే?

చ॥ కదనతలంబుఁ జేరి యెఱుఁ ♦ గందగు నక్కఱ లేదు గౌరవా
స్పదయగు ధాత్రి కీడయిన ♦ జానకి రాముని మేనుగాంచి భీ
తిదమగు వాని వీర విహా ♦ తిం గని యుండుట మన్మథుండు నే
మొదలుగ నెల్లవా రతివ ♦ ముందఱఁ గుక్కలు గాక యన్యులే?

క॥ నాశము గలిగెడి వేళను, శ్రీశ విరించన మహేశ్వ ♦ రేంద్రాదులచే
నాశిల్లక యుత్తమ వసు, ధేశు నొకని వైరిగాఁగ♦నెనసితిఁ దాతా! ౧౧౨౫

చ॥ అనవిని మాల్యవంతుఁ డను ♦ నన్న! వచించితి మున్నె నీకు నేఁ
జనవున వానిఁగై కొనవు ♦ చాలఁ జిరాకును గొంటి వా యశో

పనుఁడు విభీషణుండు తెలు ♦ పఁగ వినికుంటివి కారణంబు లు
న్నను పరికింప కుంటి వీఁక ♦ నాతరమా వివరింప శ్రేయముల్ ?
చ॥ కటువులుగాఁగ నన్నను సు♦ఖంబులఁ గూర్చెదు పద్ధతుల్ విశం
కటగతిఁ జర్చచేసి యొడి ♦ కంబుగ నిక్కపు బంధులాడ నో
క్కటియుఁ జెవిం గదింపక ము ♦ ఖస్తుతి చేసెదు మూర్ఖ వాక్కులం
బటిమగ విన్చు నీ గతిని ♦ పాడొనరించుచు నుంటి సర్వముల్. ౧౧౨౭
తే॥ అనుడునవ్వలనున్న మా♦యావిమిన్న, యగుమహోదరుఁడెడసొచ్చి♦యతనినుతిమి
చూచినొచ్చిన ప్రభు నిట్టు♦లేఁచఁదగునె?, యనుచునుత్సాహకరముగా♦నాడఁదొడఁగె
ఉ॥ మేలు దలంచి మంచిదని ♦ మేవడిగొన్న యనంతరంబు గె
ల్పే లభియింపనిమ్ము మఱి ♦ యెడ్డమిచే నసువుల్ త్యజింప నో
టే లభియింపనిమ్ము తమ ♦ యెన్నిన పట్టున నిల్చుటే మహా
శీలుల లక్షణంబు వెను ♦ చెంగిన నిందయు రౌరవంబగున్. ౧౧౨౮
తే॥ అల త్రివిక్రముఁడును త్రిపు♦రాంతకుండు, పోరి యోడిరి వైభవ♦స్ఫూర్తి చెడఁగఁ
జంచలీకృత కైలాస♦శైల ? నరుల, తోడి పోరున కీవు వె♦న్నాడు దేమి ? ౧౧౩౦
చ॥ గెలిచిన వార లోడెదరు ♦ గెల్చెద రోడినవార లొక్కచోఁ
గలిమిగలారు క్రుంగెదరు ♦ కల్మి వహింతురు లేనివారలున్
బలమున కొక్కయెల్ల కను ♦ పట్టునె ? యల్ప తపః ఫలంబుచేఁ
దొలఁకెడు రామలక్ష్మణుల ♦ దొడ్డగఁ బల్కెదు బట్టు పోలికన్. ౧౧౩౧
ఉ॥ సీతను వీడితేని యొక ♦ చెట్టయు రా దటు వీడకున్నచో
నీతముగాఁగ జీవముల ♦ నీఁగిన నీఁగఁగవచ్చు వేఱు సం
పాతము గల్గునేమి ? స్థిర ♦ బంధుర గౌరవ మింకిపోవఁ జిం
తా తలిమంబుపైఁ బొరలి ♦ తాపము నొందినఁ దప్పిపోవునే ?. ౧౧౩౨
ఉ॥ ఊరక యిట్లు మున్వెనుక ♦ లుయ్యల లూఁగుచునుండ లంకలోఁ
బౌరులతోడ మమ్ము ఫల ♦ పాదపబృందము వోలె రాము దం
డారడ మొప్ప నార్పదె ? జ ♦ లార్ణవమందొక కొంత నీరమున్
నూరుఁడు త్రావ నంతయును ♦ శోషిలె నంచడలంగఁజెల్లునే ?. ౧౧౩౩
మ॥ మును ముమ్మూర్తులు వేల్పులోడి పఱవన్ ♦ ముల్లోకముల్ నీమహా
జ్ఞను పాలించుచునుండఁగాఁ దృణముపై ♦ నట్టాడు ప్రాలేయముం
జెనయంజాలని మానవాధములు వా ♦ సిం బెద్ద కొండాడి నీ
యనుఁగుందమ్ముని కుంభకర్ణు బల గ ♦ ర్వాదుల్ డిగం బూన్చెదే ?
తే॥ కుంభకర్ణు రప్పించి సం♦రంభ మొప్పఁ, బంపుదేని యతనిఁ గాంచి♦పాఱి డాఁగు
వారు; నిలిచినచో వారి♦ప్రాణములను, తీసికొని రాఁగలండు దై♦తేయచంద్ర !.

ఉ॥ నావుడు రావణుం డతని ♦ నర్మిలి మెచ్చి కుమార! వైభవ
శ్రీ విలసిల్లఁ బల్కితివి ♦ ప్రేమకు మేరయుఁ గల్గునేమి? ర
క్షో వన పాలకుండ వని ♦ సాక్షి సమాహితచిత్తుఁడయ్యె; వి
ఘ్నావలి వచ్చునేమి నడు ♦ మంతరమందు వినాశవేళలన్? ౧౧౩౬

—: కుంభకర్ణుని మేలుకొలుపుట :—

మ॥ ఇది మేలంచు వచించి రావణుఁడు మీ ♦ రింపారఁగా నేగి యొ
వ్విదమైనం దగఁ గుంభకర్ణు నిదురన్ ♦ వేతోలి తోడ్తెండనన్
బదఁడంచున్ యమదూత లట్టు లసుర ♦ వ్రాతంబు నిద్రాళు నిం
టి దరిన్ వాకిట నిల్చి లెమ్మనుచుఁ దా ♦ టింపంగ వాద్యంబులన్. ౧౧౩౭

ఉ॥ లేవని కుంభకర్ణుఁ గని ♦ లెంకలు లోనికిఁ జొచ్చి తేఁకువన్
గ్రేవలఁబోయి తోమర వ♦రిష్ట గదాదుల మస్తకంబుపైఁ
జేవ యెలర్ప మోఁదియుఁ గృ ♦ శింపని నిద్దుర గాంచు దానవున్
సేవకు లంతఁ గన్గొని వ ♦ చించిరి చీఁదఱ యగ్గలింపఁగన్. ౧౧౩౮

శా॥ నిద్రాదేవికి ముద్దుకూన! విను ని ♦ ర్నిద్రుండు కాలుండు నీ
నిద్రాభంగము చేసినాఁ డలుపమా ♦ నిద్రాళుతన్ వీడి పె
న్నిద్రం బొందుము కాలుమందిరమునన్ ♦ నిండారు ప్రేమంబుతో
భద్రంబుల్ సమకూర్చె నగ్రజుఁడు నీ ♦ పాండిత్యమున్ మెచ్చుచున్.

మ॥ కొఱలేకుండిన దానివాలి బ్రదుకుల్ ♦ క్షోభంబులం బొందఁగాఁ
గొఱవిం జేకొని నెత్తి గోఁకికొను మూ ♦ ర్ఖుంబోలె మీరాయన్న యి
క్కెఱగాముల్ పొనరించి దీర్ఘమగు కూ ♦ ర్కున్నీకుఁ జేకూర్చె ని
క్కెఱయౌ నిద్ర యిఁకేల లెమ్మనుచు ర ♦ క్షోవీరు లుంకించుచున్

ఉ॥ నొచ్చిన కేలు మిక్కిలిగ ♦ నొవ్వఁగఁ గొట్టియు మేలు కాంచమిన్
గ్రచ్చఱఁబోయి రావణుని ♦ గాంచి ప్రభూత్తమ! తమ్ము నియ్యెడన్
జెచ్చెర లేవ మావలనఁ ♦ జెల్లదటంచు వచింపఁగా నతం
డెచ్చుగ దంతిమూఁకలఁ బ ♦ యిం బఱపించుచు లేపుఁ డీతనిన్.

తే॥ వారణములు త్రొక్కినను లే♦వకయయున్న, మీకుఁగల నేర్పులం జూపి♦ మేలు కొలుపుఁ
డనుచు వేవురు మల్లుర♦ననుప వారు, ప్రభునిచింత నీతఁడు తీర్ప♦వలఁతి యనుచు.

చ॥ తలఁచుచు నిద్రలేపఁ జని ♦ ద్వారముతీయఁగ వాని శ్వాస మ
త్యలఘువుగాఁగ వీవ జడు ♦ లందు దగుల్పడి లోని కేగుచున్
వెలి కరుదెంచుచుం దగులు ♦ వీడమిఁ జేతు లొకళ్లొకళ్లు ని
ట్టలముగఁ బట్టికొంచును ది ♦ టంపు బలంబున దాఁటి ఠంకిలిన్.

చ॥ ఇతనిని లేపు మార్గమిఁక ♦ నేదని నోటిని ముక్కుఁగాంచి భీ
మతులయి తాఁకఁగా వెఱచి ♦ మందలఁ గాహళ శంఖరావముల్
శ్రుతుల కడం గదించుచు ము ♦ సుండి గదాదులతోడఁ గాలు గే
లు తల నలంగ మోఁదియుఁ గ ♦ లుక్కున కండుట గాంచి వేసటన్.

తే॥ ప్రభునియుత్తరువొంది తు♦రంగములను, తోలి త్రొక్కింప నది తల్లి♦జోలపాడు
కరణి నూఁగింప నా కుంభ♦కర్ణుఁ డంత, గుఱ్ఱువెట్టి గాఢంబగు♦కూర్కు నొందె.

తే॥ అసురులంత నేలికయొద్ద♦కరుగుదెంచి, చేయఁదగిన యుపాయముల్ ♦చేయఁబడియెఁ
గేలు నొచ్చె హారులు త్రొక్కి♦సోలిపోయె, నేమియును లాభ మగపడ♦దెట్లు ననుడు.

తే॥ కరులుహరులు తేరులుద్రొక్కఁ♦గదలకున్న, కుంభకర్ణు శూలములతోఁ♦గ్రుమ్మి గదల
మోఁదియైన మీకుం దోఁచు♦నేదియైనఁ, జేసి నిద్దుర లేపి పి♦ల్చికొని రండు.

తే॥ రిత్త రాకుఁడు పొండని♦తత్తఱింప, దనుజు ననుమతి నాతని ♦ యనుజుఁ జేరి
గూబలంట శూలములతోఁ♦గ్రుమ్మి క్రుమ్మి, ముసలములతోడ దంచఁగా♦నుసలిలేచె.

చ॥ తలఁపునకంటె మించిన యు ♦ దగ్రశరీరుఁడు కుంభకర్ణుఁ డ
మ్మొలపునఁ జచ్చినట్టి యొక ♦ మేటరి ప్రాణములొందు కైవడిన్
మెలఁకువ గాంచి లేచెఁ దల ♦ మింటిని తాఁకఁ ద్రివిక్రమేశ్వరుం
బలెఁ దనమేను దిక్కులకుఁ ♦ బర్వఁగఁ గన్నులు వార్ధి మించఁగన్.

క॥ త్రిజగంబులు వడఁకఁగ ది, గ్గజములు చలియింప రవియుఁ♦గలఁగం బొఱిన్
గుజగుజలువోఁ ద్రిమూర్తులు, గజిబిజి సురలొందఁ గుంభ♦కర్ణుఁడు లేచెన్.

ఉ॥ ఆఁకలి మీఱ మేలుకని ♦ యన్నము చాలమిఁ బేదమోముతో
సోఁకులు వండియున్న దిను ♦ సుల్ పలువందల బండ్ల యన్నమున్
మేఁకలఁ దొట్టి యేనుఁగులు ♦ మీఱలును మద్యము పండ్లు మెక్కి య
ట్టాఁకలి రేఁప దున్నలు న ♦ హస్రము లాన భుజించి తేఁకువన్.

క॥ బెడిదముగఁ గనులు విచ్చెను, పిడుగుల నొకచేతఁ బట్టి ♦ పిండిగఁ జేయన్
జడనిధి వండలి సేయన్, గడిగా రవిఁబట్టి మ్రింగఁ♦గా నగు లీలన్. ౧౦౯౨

సీ॥ కూర్చుండియుండ ర♦క్షోధీశు రావణు, నిలిచినంత పొడవు♦నెగడువాఁడు
కడలి యలలవంటి♦కనుబొమ ల్గలవాఁడు, వరి వెన్నువంటి వా♦ల్పరగుఁవాఁడు
రక్తమాంసములు చ♦ర్మము లెమ్ములును చింద, జవిరి జవిరి తినఁ♦దివురువాఁడు
మీఱిన యాఁకలి♦తీఱ నాయుధముల, నమలి వికావిక♦నవ్వువాఁడు

తే॥ కఱకు శూలంబు కేలను♦గలుగువాఁడు, సగము కాలి నిల్చిన తాడి♦పగిదివాఁడు
మదము గలవాఁడు స్తబ్ధరో♦మములవాఁడు, ఒడలి విఱుపులు త్రేఁపులు♦విడనివాఁడు.

తే॥ ఇంద్రు పండ్లురాల్చిన చేతు♦లెత్తి ప్రహరిఁ, దనరు బురుజుల మెల్లనఁ♦దడవువాఁడు
శక్తి చేతఁదాల్చినవాఁడు♦చవికి సింహ, శరభ మాంసముల్ దిననోరు♦తెఱచువాఁడు.

తే॥ పడకయను వారినిధినుండి♦పైకిలేచు, తనదు నిడుపైన మేనిపై♦జెనకి యలము
బాడబాగ్నికీలలో యనఁ♦బరఁగు నిడుపు, జేగురైన రోమంబులఁ♦జెలఁగువాఁడు.

తే॥ దెసల గెలిచిన దశకంఠు♦నెసకమునకు, జంకి చండ మయూఖుండు♦జాతవేదుఁ
డడఁగి యుండఁ దగిన గుహా♦లనఁగ నిద్ర, కప్పు వీడని లోఁతగు♦కనులవాఁడు.

తే॥ వారణంబులు చరియించు♦పర్వతగుహా,వంటి దోరముల్ గల ముక్కు♦వఱలువాఁడు
కొండ చిలువలు నిద్రింపఁ♦గూడునట్టి, పెద్ద శ్రవణ రంధ్రంబులు♦వెలయువాఁడు.

తే॥ ఐన కుంభకర్ణుని గని♦యన్నగారు, పిలుచుచున్నారు మిమ్మని♦విన్నవించు
సేవకులతోఁడ జనె దశ♦శీర్షుఁడున్న, మందిరమునకు నగరానఁ♦గ్రందువుట్ట.

తే॥ పెద్దకొండ పరుండిన♦విధము దెలియఁ, జాఁగి తమ్ముఁడన్నకు మ్రొక్క♦వేగ యెత్తి
గ్రుచ్చి కౌఁగిలించికొనె ర♦క్షోవిభుండు, కొండ కొండను తడవిన♦కొమరుదోఁప.

తే॥ ప్రక్కఁగూర్చుండనిడుకొని♦రక్తమద్య,ఘటఘటలుకొన్ని తెప్పించి♦కాంక్షనొసఁగి
పలల మిచ్చి తెల్లని పట్టు♦వస్త్రములను, రత్నభూషణముల నపా♦రముగఁ బెట్టి.

తే॥ ఇంద్రుఁ డైరావతంబుతో♦నీగిపాఱు, వేళఁ దప్పి జాఱిపడిన♦వీరపట్ట
మమర ఫాలభాగమున లం♦కాధినాయ, కుండు తమ్ముని కర్మిలిఁ♦గూర్చికట్టె.

తే॥ మెఱుపుకైవడి మేనెల్ల♦మెఱయుచుండఁ, జెందిర మలందిన గజంబు♦చెలువు దెలుప
మొగులుఁబోని దేహంబున♦బుగులు తావి,చందనముపూసెఁ దనదుహ♦స్తములతోడ

తే॥ వినము కసిమసఁగినరీతి♦విన్నత్రోవ, యొరయ నిల్చిన తమ్ముని♦యురమునందు
భవుఁడు ప్రేమతో నొసఁగిన♦వహ్నిఁబోలి, వెలుఁగుకవచంబు దొడిఁగెను♦విబుధవైరి.

ఆ॥ ఎడమకన్ను బొమయు♦నెడమ భుజంబును, కంపమొందఁ గుంభ♦కర్ణుఁ డంత
నన్నఁగాంచి నంగ♦రాలంకరణమేల, సేసె దనఁగఁ బంక్తి♦శిరుఁడు తెలిపె.

క॥ నరపతి సుతు లిరువురు వా, నరసేనలతోడ వచ్చి♦నగరమ్మును పెం
పఱ ముట్టి యెవ్వ రెన్నఁడుఁ, బొరయని విజయమ్ము గొనిరి♦పోరిగొను వారిన్.

## —: కుంభకర్ణుఁడు రావణునకు హిత ముపదేశించుట :—

ఉ॥ నావుడుఁ గుంభకర్ణుఁడు ఘ ♦ నంబగు యుద్ధము సంభవించెనే?
పావనియైన జానకికి ♦ బన్నము లింకను నీఁగ లేదొకో?
దేవ మనుష్య లోకముల ♦ దీపిత రాక్షసకీర్తి మాసెనే?
యావగ దాపరించెనె స ♦ మిద్ధ కులంబునకున్ వినాశముల్? ౧౧౬౬

చ॥ సమరము డాసెనే? యదియు ♦ జానకి కోసమె సంభవించెనే?
కమలదళాక్షిపైఁ జెడుగు ♦ కామము వల్లని మున్నె యంటి నే
శ్రమముల వినంబు గల్గిన పృ ♦ దాకువుఁ బోలిన ధాత్రిపుత్రి పైఁ
దమి విడకుంటివో? విడక ♦ తక్కుటయున్ విధికృత్యమే యగున్. ౧౧౬౭

చ॥ వసుమతిఁ గెల్లగించి సుల ♦ భంబుగ నెత్తఁగవచ్చు లోకముల్
కసిగొని మ్రింగవచ్చు రఘు ♦ కాంతుని సంగరమందు గెల్వ మా
నసమున నెంచుటల్ జనక ♦ నందిని మేను పరిష్వజింపఁగాఁ
బొసఁగునటంచు నెంచుటను ♦ పోలును రాక్షస వంశ భూషణా!.

చ॥ గెలుపును గల్గునే? మఱియుఁ ♦ గీడ్పడుఁగాక పులస్త్య ధాత్రు స
త్కులమున మేలిమిన్ జెడఁగఁ ♦ గోరి యొనర్చితి భూగుణంబుచే
జల గుణమున్ విభిన్నమగు ♦ జానున నుత్తమ వంశ కీర్తి నీ
వలన నశించె సర్వమును ♦ పాడుపడెం బలుభంగులం గటా! ౧౧౬౯

క॥ ఇచ్చితి జయము మఘువునకు, గ్రొచ్చితి పల్లంబు బందు♦గులకు స్నీకున్
దెచ్చితి పలువగలఁ జెఱుగు, వచ్చితి చానిచ్చఁ దొలఁగు♦పద్ధతి గలదే? ౧౧౭౦

తే॥ మంచి ధర్మపద్ధతుల త్ర♦మించిచేసి, వన్నె మున్ను గూర్చితి జల♦భాగ్యములకు
నట్టి ధర్మంబు నీవయి♦యడఁచివైవ, నంచితంబుగ నెవ రుద్ధ♦రించువారు? ౧౧౭౧

చ॥ త్రికరణశుద్ధి యుల్లసిలి ♦ దీన శరణ్యత ధర్మవర్తనల్
ప్రకట పరోపకారమును ♦ భాసిలు పుణ్యులప్రోలఁ గల్ల బూ
టకములఁ బాపమందును వ ♦ టాగితనంబు వహించినట్టి మో
ఱకులు జయింపనేర్తురె? తొ ♦ ఱంగునె ధర్మ మధర్మ పీడచే. ౧౧౭౨

చ॥ మఱియొకమాట విన్నఁ గడు ♦ మంచిదెయా వినవేని లెస్స యొ
డ్డొఱకములేల? యున్నది ప ♦ యోధిని దాఁటిన కోఁతి,సీతయుం
జెఱవడె వాలి వక్షమును ♦ చీల్చిన బాణముకద్దు దైత్యులుం
గొఱవడకుండఁగా మనముఁ ♦ గూడితి మేది కొఱంత యొన్నఁగన్?

శా॥ సీతాదేవిని పీడి రామ పద రా ♦ జీవంబులన్ బ్రాలి ప్ర
స్ఫీత ప్రాభవమొందు నీయనుజు ను ♦ స్నిగ్ధుండవై కొల్చి త
చ్చేతో మోదన రీతి వర్తిలుము; నీ ♦ సేనాతతిం బంపి త
ద్వ్రాతంబుల్ నశియింపఁ జింతిల్లుట భా ♦ వ్యంబౌనె? లంకేశ్వరా!

తే॥ పేర్చి దళములఁ బార్తిగాఁ♦గూర్చికొంచుఁ, గదనరంగంబునకుఁ జని♦కడిమిఁజూపి
శత్రుల జయించుటో లేక♦సమయుటో తగుఁ, గాక యిది యుక్తమగునె లం♦కాపురీశ!

తే॥ అనిన విని రావణుండు ని♦న్నక్కజపడి, పిలుచుచున్న భవిష్యత్తు♦దెలుపఁగాదు
వెడలి యల్పమానవులఁ జ♦క్కడఁచఁగాని, నీహితములెస్స! తెలిసె న♦త్యాహితంబు.

క॥ విడిచితివి పౌరుషంబును, కుడిచితి వుదరంబు నిండఁ♦గుదురుగ నింకన్
నడవుము చల్లనితోడ కటఁ, బడి నిద్దురపొమ్ము రేలు♦పవళులు ప్రీతిన్. ౧౧౭౭

తే॥ మానవులకుఁ గేల్మోడ్చి న♦మస్కరించి, గూనిమ్రానిమున్కలకు మ్రొ♦క్కులనొనర్చి
బ్రతుకు మనుగడ తిండికై ♦ బ్రతుకునట్టి, నీకు నీతమ్మునకుఁ దగు♦నాకుఁ దగునె?

శా॥ ఓరీ సేవక! సాయుధంబగు రథం ♦ బొంటించి తెప్పింపు దు
ర్వార ప్రోద్ధతి దేవ నాగ నర వ♦ర్గంబెల్ల నొక్కుమ్మడిన్
జేరన్వచ్చి మనుష్య వానరులకున్ ♦ జేడ్పాటు గాకుండఁగా
బోరన్ రండని యెల్లవారలకుఁ దె ♦ ల్పుండీ మదీయాజ్ఞచే.

చ॥ అని పయనంబుకై తొడఁగు ♦ నన్న పదంబుల వ్రాలి శూలమున్
మినమినలాడఁ గైకొని త్రు ♦ మింపుము గెల్పునె పొంది వత్తు నే
నని వచియింపఁజాల విధి ♦ యార్పుచు గెంటుచు నుండెఁ జావు త
ప్పని సరి చత్తునేని జన ♦ పాలక నందిని వీడు మేలగున్. ౧౧౮౦

తే॥ ఇంద్రజితుఁడును లక్ష్మణు♦నిషువుచేతఁ, బడుట నిక్కము సేనయో♦పవనధూత
భూతియగు; భావిశుభములఁ♦బొందు తెఱఁగు, చర్చచేసి యంచితరీతిఁ♦జలుపుమన్న!

క॥ నను గెలిచిరేని పిమ్మట, నిను గెలుచుట నిజము; పిదప♦నెమ్మి దలఁచి సీ
తను వీడననుట వెడఁగగుఁ, బనిగొని విడుమెన్న నీ త♦పఃఫల మన్నా!

తే॥ నేర్చి నేరక తొలినుండి♦నేఁటిదాఁక, నేనొనర్చు తప్పులు గల♦వేని సైఁపు
మన్న! నీయెదుటికి వచ్చు♦టరిది యింక, సెలవె? యని కుంభకర్ణుండు♦వెలలఁబాఱె.

తే॥ నిలుచు రావణు కన్నుల♦నీరె కాక, నెత్తురును చిందె నచ్చటి♦నెమ్మి బందు
గులును మిక్కలి తపియించి♦కుమిలినారు, కుంభకర్ణుండు పోయెను♦కోటదాఁటి.

తే॥ శూలధారియై చను మహా♦శూరుతోడ, వెడలుఁగాక సైన్యంబని♦విభుఁడు పలుక
దనుజ బృందంబు వెడలె వా♦ద్యములతోడ, మింట సురలతలల ధూళి♦మేవుకొనఁగ.

తే॥ స్యందనములపై మాతంగ♦బృందముపయి, గాలిబంటుల కేలను♦గ్రాలు కేత
నమ్ము లాజిని లేచు ర♦జమ్ము దివిని, మైలపఱుప వానిఁ దుడుచు♦లీలనొప్పె

తే॥ ఆయుధంబు లొండొంటి రా♦యంగ లేచు, నిప్పుకలు వీరుల కనుల♦నిగుడు మిడుఁగు
ఱులును మిక్కిలి వెలుఁవడి♦యలముకతన, వేఁడిచేత జీమూతముల్♦మాఁడిరాలె.

చ॥ కరులు తురంగముల్ రథ ని ♦ కాయము దందడియై కడల్కొనన్
ద్వరపడి ముంగల న్నడచు ♦ దండును వెన్కల నేగు సేన క్రి
క్కిఱిసి కుదించి మధ్య నిఱి ♦ కింపఁగ లోపలి మూఁక నేలపైఁ
జరణము లూనలేక యొల♦సంబున వేచనె నంతరంబునన్. ౧౧౮౧

ఆ॥ వేయి శరభములును♦వేయి సింగంబులు, వేయి భూతములును♦వేయి కరులు
కట్టఁబడిన దిగిభ♦గణమీడ్వలేని తే, రెక్కి కుంభకర్ణుఁ♦డేగుదెంచె ౧౧౮౨

ఆ॥ పరశు చక్ర భిందె♦పాల గదాసి తో, మర నిషంగ చాప♦దర ఖరోగ్ర
ముసల శూల శస్త్ర♦ముద్గరాదులఁ దాల్చి, దనుజసేన నడచె♦ధరణి యదర.

ఆ॥ వరుస వరుసలుగను♦వడివడి చేనూని, యంది యిచ్చు రాక్ష♦సాలి మద్య
పాత్రములను పక్వ♦పఱచిన మాంసంబు, నినుచు బండ్లతోడఁ♦జనియె వెంట.

సీ॥ పెక్కండ్రు పనివాండ్రు♦వేవేగ బడిబడి, యిరుగేల వారి యం♦దిచ్చుచుండ
గుహాను చొప్పించు నం♦గున నోట నించుచుఁ, గుంభకర్ణుఁడు రణ♦క్షోణిఁ జేర
వీని యీకోలపని♦వానర వితతితోఁ, బూర్తిమై నిలుచునో? పొడవుకొనునొ?
వీని కడుపునిండఁ♦బ్రాణివర్గములెల్లఁ జాలియుండునె యను♦శంకపొడము
తే॥ చరణ ముంచినచోటెల్ల♦శవ మయిఁబు, వీని మూలాన సమవర్తి♦వేఱుక్రొత్త
దారియెఱిఁగెనుయముఁడెప్ర♦త్యక్షుమయ్యెఁ, బాఱుటెట్లనియమరులు♦పరుగులిడిరి
తే॥ సర్పరాజు శిరమునుండి♦జాఱి భూమి, తోడ మేరువు వచ్చిన♦తోయ మొప్ప
కనక రథమెక్కి వచ్చు నా♦ఘనశరీరుఁ, గుంభకర్ణుని శ్యామలాం♦గుండు కాంచె.
తే॥ ఘన పతాకయందున వీణ♦గానరాదు, సింగ మున్నది వాని వి♦చిత్రతనువు
చిత్తవేగముతోడఁజూ♦చినను పూర్తి, కాదు రాక్షసరూపుఁడీ♦ఖరుఁ డెవండొ?.

చ॥ ఒక్క భుజంబుఁదొట్టి మఱి ♦ యొక్క భుజం బగుదాఁకఁ జూడఁగా
నిక్కము కొన్నినాళ్లు పయి ♦ నించును కాళ్లు జనించినట్టి గ
ట్టొక్కటి యిట్లు వచ్చెనొకొ? ♦ యుద్ధము సేయఁగఁ గోరివచ్చు పెం
మొక్కలుఁ డంచెదం దలఁపఁ ♦ బోలదు ఘోర శరీరుఁ డెవ్వఁడో?.

మ॥ ఉదయాద్రిన్ మొలతెంచు భాను కిరణో♦ద్యోగంబు మట్టార్చి పె
ల్లిదమౌ చీకఁటి నించు వీని తనువున్♦లెస్సం బరీక్షించి నె
మ్మది భీతిల్లి ప్లవంగముల్ దెసలకుం♦బర్వెత్తె నీసైన్యమున్
జెదరం దోలఁగ రావణుండు గొను నా♦భీల క్రుధారూపమో?

—: విభీషణుఁడు రామునకుఁ గుంభకర్ణు నెఱింగించుట :—

మ॥ అని శ్రీరాముఁడు ప్రశ్నసేయ విని లం♦కాధీశు తమ్ముండు ప
ల్కును మాయన్న కృతాంతతుల్యుఁడు లయో♦గ్రుం బోలు వాఁడంబుజా
సను గన్నాతఁడు యోగనిద్ర మదిలోఁ జాలింప దైత్యాళి నీ
ల్గును; వేల్పుల్ మరణింతు రీయసుర కూ♦ర్కు న్వీడి కన్విచ్చినన్.

తే॥ లేప లేని కల్పముదాఁక♦లేవకుండు, నిదురపోతు గాలికి మించి♦కదలువాఁడు
యమునకు యముండు హరిహాయు♦నాజిఁ దఱిమె, రోషశీలుండు కుంభక♦ర్ణుఁడనువాఁడు.

సీ॥ పైనున్న యింద్రుండు♦పడకుండఁ జౌదంతిఁ, దేకుఁవ గిరగిరఁద్రిప్పినాఁడు
శ్వాసనుఁబట్టి నలంచి♦సారంబు దీయంగఁ, బిడుచువాఁడు జలధి♦నడచువాఁడు
చేవకుఁ దగు దృఢ♦చిత్తంబు గలవాఁడు, బ్రహ్మచే వరములఁ♦బడసినాఁడు
శూలిని మెప్పించి♦శూలంబు గొనినాఁడు, సురల వీఁపులె సదా♦చూచువాఁడు
తే॥ ప్రబలి తాటియాకుల గాలి♦పడగ వోలెఁ, దిరిగినాఁడు జగంబులఁ♦ద్రిప్పినాఁడు
ఇంతదాఁకను నిద్రయం♦దీతఁ డుంట, వలన జీవించియున్నది♦ప్రాణి వితతి.

తే॥ పాడితెరువు గాదిది దీని♦వలన మనకుఁ, బ్రాణహాని నిశ్చయమని♦యన్నతోడ
రెండు మాఱులు పలికె నీ♦తండు దాని, వెడఁగు దైత్యుండు పెడచెవిఁ♦బెట్టినాఁడు.

తే॥ సాధ్యమైనంతవఱకును♦సామముననె, హితము బోధించి తుదకింత♦యేని వినమి
వినుగుచెంది మృత్యువు శిరో♦వీధి నిలిచె, ననుచుఁబల్కి నీయెదుటికి♦నరుగుదెంచె.

తే॥ అని విభీషణుఁ డాడ వ♦నాటవిభుఁడు, వీనిఁ జంపిన లాభంబు♦గానఁబడదు
వచ్చునేని చేర్చికొని యు♦వ్వాల వలసిన, పనులు గావింత మిది నీకుఁ♦జనునకాదె?.

తే॥ అనుడు నతనియొద్దకుఁ♦బోవ నర్హుఁడెవ్వఁ, డనుచు రాముఁడు పల్క న♦ర్హుడన నేగి
కలుపుగోలుతనంబునఁ♦బలికి వచ్చు, నేని తోడ్తెత్తు ననె రావ♦ణానుజుండు.

తే॥ మంచిదని రాముఁడన దైత్య♦మాన్యుఁ డేగి, యతనిరాకను విని మోద♦మందుకుంభ
కర్ణు పాదముల్ తన మస్త♦కంబు సోఁకఁ, జాఁగి మ్రొక్క నతఁడు నెత్తి♦కౌఁగిలించె.

—: విభీషణ కుంభకర్ణుల సంభాషణము :—

చ॥ కనుల ముదశ్రు బిందువులు ♦ గాఱ శిరంబును మూరుకొంచు మె
ల్పున నురమానఁ జేర్చి యొడ ♦ లుం బలుమాఱులు దువ్వి దువ్వి స
జ్జన తిలకాగ్రగణ్యా! శుభ♦సంతతు లెల్ల నొకండ వొంది తం
చును ముదమందు నాతలఁపు ♦ శోషిల వచ్చితివేల యజ్ఞతన్?

ఉ॥ నీ వభయంబు నొందుటయు ♦ నిర్జరు లేనియుఁ జెందరాని సం
భావిత సౌఖ్యముల్ చెడని♦పద్ధతిఁ గాంచుట వీనులారఁగా
నే విని పొంగి పోయితి గు ♦ ణీ! జముపాతను చిక్కియున్న మా
తావున కేలవచ్చి తమ్మ ♦ తంబును రోసి వినంబుఁ గోరితే? ౧౨౦౬

చ॥ చెడి కృశియించుచున్న కుల ♦ శిష్ట గురుత్వము నీ కతంబునన్
దోడిఁబడకుండ వర్ధిలును ♦ తొల్లిటి కైవడి నంచు మోదనం
బడర వహించు నాతలఁపు ♦ లాఱడి వోవఁగ నాల్కయొండ ని
య్యెడ కరుదెంచితేల మది ♦ యెంతయుఁ దాపము నొంద నక్కటా!

మ॥ తనప్రాణంబులు వోవునట్టి దశ యు ♦ త్పాదిల్లినన్ లోక పా
వనుఁడౌ రాఘవుఁ డాశ్రితావళిని త్రో ♦ వన్ సాహసింపండు ము
న్నె నశించెన్ మరణంపుభీతి యిపుడా ♦ నిత్యాత్ము సేవించుటన్
జననోద్విగ్నత వోయె నింక నెదియో ♦ సాధింప నీ వచ్చుటల్?

సీ॥ సద్ధర్మమూర్తి శ్రీ ♦ జానకీనాథుని, కలిసి సేవించు భా ♦ గ్యంబు నోచి
పాపకారణములై♦పరఁగు నజ్ఞానంబు, నన్యథాత్వము సంశ ♦ యంబు ననెడి
మూఁడు దుర్గుణముల♦మూలంబుతోఁ ద్రెంచి, భవ దోషముల నెల్లఁ♦బాఱఁదోలి
నిర్మలమూర్తివై♦నెగడు నీవింకను, పరదారలను గోరు♦దురిత మతుల

తే॥ బంధువులఁగాఁ దలంతువే? బ్రహ్మవలన, నీతి ధర్మంబు జ్ఞానంబు♦నిర్మలతయు
నమృతజీవితమును పొంది♦యున్న! తుదకు, మన కులాచార వాసన♦మాన వేమి?

మ॥ దనుజధ్వంసి ధరాత్మజాధిపుఁడు కో ♦ దండంబు నెక్కించి హె
చ్చిన కోపంబున మాకుఁగా నటఁ బ్రతీ♦క్షించెఁ దదీయానుజుం
డును కీశాలియుఁ జంపనెంచిన యముం ♦ డు న్నిల్వఁ ద్రోవంగనే
రని మాదుర్విధి కాచియున్నది కుమా ♦ రా! యేల నీవచ్చుటల్?

తే॥ నీవు రాము శరణుచొచ్చి♦నిలువవేని, రాక్షసుల మేము రామ శ♦రవ్రజమున
నాశమొందంగ నుదక దా♦నమ్ము సేయ, నొక్కఁడైన లేకుండుట♦యొప్పునయ్య?

ఉ॥ లంకకు నీవు వచ్చుట క ♦ లంక వహించిన దైత్య వంశముల్
క్రుంకినమీఁద నెమ్మదిఁ గ ♦ కుత్థ్స మహాన్వయుతోడనే చుమీ
శంకిల నేల? యక్షయ య♦శస్కర సంపద లందుమయ్య! నా
కంకిలి పల్కఁ కింకఁ జను ♦ మా యన నన్నకుఁ దమ్ముఁ డిట్లనున్.

చ॥ వెడఁగగు నాయెడం గరుణ ♦వీ డని రాముఁడు నీవు వచ్చినన్
విడువఁడు ప్రేమఁజూపుఁ బగ ♦ వీడు భవాంబుధి దాఁటఁ జేయుఁ బెం
పడరఁగ నాకొసంగిన స ♦ మస్తము నిచ్చెద లంకతోడ నా
యెడఁ గరుణించి రమ్ము శుభ ♦ మింతకు మించియు నున్న చూడుమా?

ఉ॥ తప్పికొనంగ రాదు నయ ♦ ధర్మవిశారద! పాఱి దాఁగఁగా
నెప్పు గనంగ రాదు మర ♦ ణించుట నిక్కము రిత్త చావఁగా
నొప్పునదేది? సత్పథము ♦ నొందఁగఁదగ్గది నీకు నింతఁగాఁ
జెప్పెడి పాటి వాఁడనె? వి ♦ శిష్ట గుణాకర! యెంచి చూడుమా.

చ॥ చెడుగులె యెల్లవేళలను ♦ చేయుచునుండిరయేని వారు తోఁ
బొడమిన వారలంచు బుధ ♦ పుంగవులంచును బంధులంచు నె
గ్గడి పడి యోర్వనౌనె సత ♦ తంబును ధర్మ పథానువర్తికిన్?
బొడవగు నింటి దీపమని ♦ ముద్దిడ మూతిని కాల్పకుండునే? ౧౨౧౫

ఉ॥ ఉత్తమకార్యముల్ మిగుల ♦ నోర్పునఁ జేయఁగ నింద యబ్బునే?
క్రొత్తగు దుఃఖజాలములఁ ♦ గూర్చును సంసృతియంచు నిచ్చలున్
బొత్తులఁ దల్లిదండ్రులను ♦ పుత్త్రుల భార్యల వీడువారు పె
న్బత్తిని ధర్మమున్ విడరు ♦ వారికి నవ్వియ యిచ్చు మోక్షమున్.

చ॥ చెడు గొకరుండు సేయ నటు ♦ సేయని వారును వానితోడనే
యడఁగుట మేలో? కీడో? వెర ♦ వార వివేకిత గల్గువాఁడవే
నుడువుము కన్నతల్లి నెఱి ♦ నూఁకుటచేఁ గద భార్గవుండు చ
క్కఁడఁచె; భవుండు బ్రహ్మతల ♦ నక్కట! త్రుంచె దొసంగు గల్గుటన్.

ఉ॥ ఆఱడి యొంద నారకము ♦ నం దడఁగందగు చెడ్డ కార్యముల్
నీఱేఁడి చేయువాఁ డనుచు ♦ విజ్ఞులు చేయుదురే ? శరీరమం
దాఱని పుండునందు చెడు ♦ నంగముఁగోసి తొలంచి కారముం
దూఱిచి మాడ్పఁగాఁదగును; ♦ తోయధి నింగువ గల్పు టొప్పునే ?

ఉ॥ అన్నను కావఁదగ్గ వెర ♦ వారయ లేద యధర్మ వృత్తముం
గ్రన్నఁ దొలంతమన్న నది ♦ కాదిఁక దిక్పతులెల్ల నవ్వఁగా
బన్నము లొంది ప్రాణములఁ ♦ బాయఁగవచ్చును రౌరవంబునం
దెన్నిక నుండవచ్చు మఱి ♦ యేది యొనర్పఁగ వచ్చుఁ దెల్పుమా !

ఉ॥ లోకములెల్ల గెల్చితివి ♦ లోఁగొని పాలన నేయలేదు భూ
లోకమునందు నిద్దురను ♦ లోలతఁగొల్చితి నేఁటిదాఁక న
స్తోఁకలితోడ నాయువును ♦ యావనముల్ వృథగా గతించె నేఁ
డీ కరణిన్ ద్యజింపఁదగు ♦ నే యనువర్గ మధర్మవృత్తికై ? ౧౨౨౦

చ॥ నెనరున రాఘవుండు కరు ♦ ణింపఁగ నిద్రయు వీడి సౌఖ్య భా
జనమగు జీవితంబుగొని ♦ సార్వజనీనముగాఁగ రాజ్య పా
లన మొనరింప నర్హుఁడవు ♦ లభ్య పదంబిది కూడివచ్చె నా
మనవిని వ్యర్థపుచ్చక స ♦ మంచితరీతి ననుగ్రహింపుమా. ౧౨౨౧

సీ॥ ధర్మ సంస్థాపనా♦ర్థంబు విష్ణువు రాముఁ, డై జనించెను భాస్క♦రాన్వయమున
నాదిదేవుఁడె యీయ♦నపవాదు గల్గునే ?, యెల్లిదమానె? రా♦యిడియు నున్నె?
నీచుల పద్ధతుల్♦నీఁగి విబుధ సంఘ, నియమముల్ గొని నీవు♦ నెగడుదేని
రాక్షసాన్వయ మహా♦వృక్షంబునకు వేఱు, పురువు దశాస్యుండు♦ పొలియు పిదప

తే॥ నీ కుమారులతోడను♦నా కుమారు, లన్న కొడుకులు సౌఖ్యంబు♦లరయువారు
మన పులస్త్య వంశంబు ని♦ర్మలినమగును, తెలియవే యింతమాత్రంబు♦ధీరచరిత !

సీ॥ మునులు ప్రేమింతురు♦దనుజ విరోధులౌ, సురలు ప్రేమింతురు♦నూ డడంగు
శాత్రవులే నీకు ♦ జగతి లేకుందురు, పిందెలు పుట్టెడి ♦ వేళయందు
పూలు త్రుంచుట దొడ్డ♦పురుషుల పనియౌనె ? జానకీపతియె నై♦సర్గికమగు
కరుణచే నాయెడఁ♦గల ప్రేమచేత ని, న్నర్థించి పిల్వ న♦న్నంపినాఁడు

తే॥ రాముఁ జేరుట మేటి క♦ర్తవ్యమగును, కాన ధర్మంబుఁ గడపక♦కడఁకతోడ
వచ్చి మేలొందుమని వాని♦పాదములను, వినమితుండయి పట్టె వి♦భీషణుండు.

ఆ॥ శిరము భూమి సోఁక♦నెరఁగి కాళులు పట్టి, కొన్న పిన్నతమ్ముఁ♦గ్రుచ్చియెత్తి
యక్కు చేర్చి కనుల♦నస్రముల్ రాల్చుచుఁ, గుంభకర్ణుఁ డిట్లు♦కుదురఁబలికె.

చ॥ జల లిఖితంబు వంటి సుఖ ♦ సంపద లందఁగఁగోరి యెల్లవే
ళలఁ దగఁబెంచి పోరికి న ♦ లంకృతిచేసి జయేచ్ఛచేత న

న్నెలమిని పంపు నన్నుకు వ ♦ హించిన ప్రాణము లీయకుండ శ
త్రులకడఁ జేర నాకొనరు♦దుఃఖముఁ దీర్తువయేని పొమ్మిఁక౯. ౧౨౨౫

తే॥ చెడని ధర్మమార్గము చిరం♦జీవితయును, ధాత వరమునఁ బడసిన♦తండ్రి ! నీవ
జగములకుఁ బ్రభుండవు నీకె♦తగినదదియు, సమర మరణంబె నాకు య♦శస్కరంబు.

ఉ॥ యోచనలేని యొక్క ప్రభు♦నొప్పమిసేయఁ దలంచనేని యా
లోచన సెప్పి దిద్దు టది ♦ లోకమతంబు వినండయేని వీ
రోచిత వృత్తినుండి విభు ♦ నోరెము మెక్కిన వార లాజిలో
దాఁచక ప్రాణముల్ విడుట ♦ ధర్మము; వీడుట కీర్తిమార్గమే ? ౧౨౨౭

చ॥ చెలువుగ దేవదానవులు ♦ సేవలుసేయఁగ మూఁడు లోకముల్
బలిమిని గెల్చినట్టి రిపు ♦ వారణ సింహుఁడు రామబాణ ని
ర్దళిత తనూజ బంధు హిత ♦ తండముతో మరణించుచుండఁ ద
మ్ముల నొకరేని తోడ్పడక ♦ పూర్తిగ నీఁగుట భావ్య మౌనొకో ?

చ॥ ఎదురొక యింతలేక విజ ♦ యేందిర నెల్లెడఁ గొంటచే భయం
బెదగొనియున్న శాత్రవులు ♦ హేళనసేయ నుమా మహేశ్వరుల్
పొదలు నగంబు నెత్తిన ప్ర ♦ పుష్ట భుజంబులు కాలపాశ బ
ద్ధ దశ భజింప నొంటిగఁ గ్ర ♦ తాంతుని సద్మము సేరఁ బాడియే?

చ॥ బలితపు రాగికోటలను ♦ భాసిలు పట్టణ సంప దుద్ధతిం
దెలిసి మదగ్రజాసువులఁ ♦ దీసిన విద్విషు సంస్తుతించుచు౯
గలనిని మార్గణాహతిని ♦ కాయలుగాచిన యొమ్ముతో వడి౯
వలకడజేని దుర్మదముఁ ♦ బాపిన యేనును మ్రొక్కనేర్తునే ?. ౧౨౩౦

సీ॥ హనుమంతు నంగదు♦నర్కసుతుని వీర, మనుజులౌ రామల♦క్ష్మణుల నీలుఁ
గాయలు కసరుల♦కై ప్రాఁకులాడు వా, నర ఋక్షవరులను♦నుఱుముచేసి
ప్రాలేయహరుఁడైన♦భాస్కరుకై వడిఁ, గదన రంగంబునఁ♦బొదలువాఁడ
హాలాహలముఁ గన్న♦యమరులవలె వారి, సేనలు దెసలకుఁ♦జెదరిపాఱఁ

తే॥ గడలి స్థితిదప్ప నగ్నియు♦గాలి వఱవ, విలయమంచు జగంబులు♦విహ్వలింప
శూలమును కేలఁగొని తాటి♦గాలిపడగ, పదురునం దిరిగెదఁ జూడు♦మెదురులేక.

తే॥ కలఁగి పాఱక సమర రం♦గంబునందు, నిలుచు వా రెట్టివారైనఁ♦జెలగివైతు
నాదు పలుకుల మన్నించి♦వాదు విడిచి, భానుకులుల స్నేహంబు గా♦పాడుకొనుము.

ఉ॥ తమ్ముఁడ ! యేగు మాజి తుది ♦ దాఁకిన విమ్మట రాము వేఁడి త
త్సమ్మతి సంగరస్థలిని ♦ చచ్చినవారికి శాస్త్రయుక్తి నీ
తమ్ముగ నౌర్ధ్వదైహిక వి ♦ ధానముల న్నెఱవేర్చి మమ్ము వే
రిమ్మున నారకంబునకు ♦ నేగఁగనీయక యుద్ధరింపుమా. ౧౨౩౩

తే॥ కాకమానదు కాఁగల♦కర్మ ఫలము, నిలిచి కనువిచ్చి కాచిన♦నిలువఁబోదు
కలరె నీకంటె విజ్ఞాన♦ఘనులు? చింత, సేయవలదు మాయొడఁ; జిరం♦జీవి వగుము.

చ॥ అని మఱి చేరఁదీసి ప్రియ ♦ మారఁగఁ బ్రేమను బాష్పపూర్ణ వీ
క్షణములఁ జూచిచూచి పెలు ♦ చం దెగ నేఁటికి సోదరత్వ మి
ట్లని పనవంగఁ దమ్ముఁ డడ ♦ లాఁపఁగనేరక వ్రాలె నన్నపై. ౧౨౩౫

ఉ॥ నోరు మొగమ్ము డెందము క ♦ నుల్ వడినెండె శరీర జీవముల్
తాఱె తపించె నిర్వ్వరకుఁ ♦ దక్కక వాడు పెరుంగ మేలు చే
కూరదటంచు నగ్రజుని ♦ కోరి యనుజ్ఞను వేఁడి సేనలం
బేరిమిఁ గేలుమోడ్పఁగ వి ♦ భీషణుఁ డయ్యెడనుండి క్రమ్మఱెన్.

ఉ॥ చౌర్యము గల్గు మమ్ముఁ దన ♦ జాతి గుణంబులు వీడి వేద వి
ద్వర్యుఁడు మా విభీషణుఁడు ♦ బాల్యము సైతము ద్రోసెనంచు నే
చర్యయు లేక క్రుంగిన వి ♦ చారముతోఁ గనునీరు రక్త సాం
కర్యము నొంది వెల్లువలు ♦ గా నటనిల్చెను కుంభకర్ణుఁడున్. ౧౨౩౭

ఉ॥ వచ్చి విభీషణుండు రఘు ♦ వర్యుని పాద సరోజ యుగ్మమున్
హెచ్చిన భక్తి మ్రొక్కి ధర ♦ ణీశ్వర! చావఁదలంచువారికిన్
నచ్చునె ధర్మచింతనలు? ♦ న్యాయము సౌమ్యము నేర్పుచూపి పె
న్మచ్చిక చేసితిన్ మనసు ♦ మాఱదు పోదు కులాభిమానమున్. ౧౨౩౮

తే॥ అంచుఁబలుకంగ శిరము పం♦కించి రామ, చంద్రుఁడనియె నీయెదుట నె♦జాలిమాలి
యాజి నీయన్నఁ జంపు ట♦నర్హమనుచు, మంచి దేయంటి; విధికిని♦మాఱుగలదె?

—: కుంభకర్ణుని యుద్ధము :—

తే॥ అనుచు మెల్లన ననుచుండ♦నసుర సేన, వనచరావళిఁదఱిసి పో♦రునకుఁ దిగువ
నెగసినట్టి రజము నిండ♦నీరరాశి, ఘోష మడఁగె దద్విధము కా♦కుత్స్థుఁ డెఱిఁగె

ఉ॥ పాఱెఁ దురంగముల్ కరులు ♦ పాఱె రథంబులు పాఱెఁ గొండలుం
బాఱెను నెత్తు వెల్లువలు ♦ పాఱెఁ గబంధము లెల్లచోటులన్
మీఱి నటించె భూతములు ♦ మిక్కిలి గంతులు వైచెఁ డాకముల్
తాఱెను కంక గృధ్రములు ♦ తారె వియత్తల మెల్ల నిండుచున్. ౧౨౪౦

సీ॥ ఎముకలు మెదడు మాం♦సమ్ము రక్తము క్రొవ్వు, నలినలిగాఁగ దా♦నవులు పడిరి
శిరములు భుజములు♦తరులును గిరులును, పొడిపొడిగాఁ గపుల్♦కెడసి పడిరి
ఏసిరి రక్కసు ♦ లేసిరి వనచరుల్, విసరిరి దనుజులు ♦ విసరె హరులు
నలఁచిరి దైత్యులు♦నలఁచిరి ప్లవగులు, తిట్టఁ దిట్టిరి కొట్టఁ♦గొట్టినారు
తే॥ చీల్పఁ జీల్చిరి చెలగంగఁ♦జెలగినారు, క్రుమ్మఁ గుమ్మిరి కొఱుకంగఁ♦గొఱికినారు
హెచ్చుతక్కువ లేకుండ♦నెసక మెసఁగ, రణము సల్పిరి ఖేచరుల్♦భ్రాంతినొంద.

ఉ॥ వానను తోలు గాలియును ◆ వాయుపుత్రాఁకుస కోర్చు వానయుఁ
మానగు తారకాణగ స◆మంబుగఁ బోరెదు పోరుగాంచి శ్రీ
మానిని నిర్జరేంద్ర పుర ◆ మార్గముఁ ద్రొక్కఁగనీని శూలముం
బూనిన కుంభకర్ణుఁడు స ◆ ముద్ధతి వచ్చె సమిద్ధరిత్రికిన్. ౧౨౮౩

తే॥ విలయవాతంబునందుజీ◆వులుభ్రమించు,ననువుదోఁపధూళినిడగు◆ల్కొనియునేత్ర
కేఱులం జక్రముల వార◆ణేంద్రములను, తగులుకొని నేలఁగూలెను◆తరుచరాళి.

సీ॥ శైలముల్ వైచుచు◆స్యందనాగ్రమునకుఁ, బఱతెంచు వానర◆ప్రతతిఁ బట్టి
మొనసి యొండొకటితో◆మోఁదునుతన్నును, నలఁచును మ్రింగును◆నములి యుమియుఁ
ద్రెంచును చీల్చును◆త్రిప్పి యెగురవైచుఁ, బిడిచి రక్తము మేనఁ◆దడవికొనును
నేల నడఁచివైచి◆కాల రాచును నీట, ముంచును నిప్పున◆నుంచుఁ గ్రుంచుఁ

తే॥ దేరునకుఁ గొట్టు జలనిధిఁ◆జేరవైచు, దిక్తటంబులఁ దవులంగఁ◆దివిరివైచుఁ
బొదల మ్రాఁకులఁబడవైచుఁ◆గుదియవైచుఁ, బర్వతంబులఁ బడవైచుఁ◆బాఱవైచు.

ఉ॥ ఖేచరపాళి భీతిఁ గలఁ ◆ గెన్ మలఁగెన్ దొలఁగెన్ వియత్స్థలిన్
వేచెను కంకగృధ్రములు ◆ పీనుఁగులం దిన మూఁకమూఁకలై
మోచిన కొండలెల్లఁ బొలి ◆ వోయెఁ గృతాంతుఁడు సాధ్వసంబునం
జూచెను కుంభకర్ణుఁడు వ ◆ సుంధరఁ గోఁతులఁ జక్కడంపఁగన్. ౧౨౮౬

చ॥ విసరుట కొక్క త్రాయియును ◆ వృక్షముఁ జిక్కదు నేఁడె తెచ్చుకొం
డెసకమునన్ శుభంబు లుద ◆ యించెను రండని వానరౌఘముల్
వెసఁ గొని తెచ్చి కొట్టినవి ◆ వేసిన త్రాలు గిరుల్ కుజంబు ల
క్కసపడకుండ దైత్యు భుజ ◆ కాండము లోర్చె నహోయనన్ సురల్.

ఆ॥ విసరుత్రాలు మట్టి◆పెల్లలుఁ దరుగిరుల్, నుగ్గునూచ మగుచు◆మ్రగ్గిపడఁగ
వైవ నెవియులేక◆వానరుల్ పండ్లీల, కఱచి డాసి త్రుళ్లి◆తెఱలినారు. ౧౨౮౭

ఉ॥ కొందఱు గుంపుగూడి యొక◆కొండను వ్రాలెడి పిట్టలెట్టిలన్
చందమునంది వానిపయిఁ ◆ జయ్యన నెక్కుచుఁ గేలునొవ్వఁగాఁ
గందఁగ గ్రుద్ది ఱక్కి పెడ ◆ కాటులు వైచి ఫలంబులేక చే
యందగ నెద్దియుం గనక ◆ యంతటఁ బాఱిరి మూలమూలకున్.

తే॥ నీలుఁడొక గొప్పమల నప ◆ లీలనెత్తి, నిప్పు లురలంగ గిరగిరఁ◆ద్రిప్పివైవ
శూలమున దానిఁ బొడిచేసి ◆ లీలనవ్వెఁ, గుంభకర్ణుండు వానరుల్◆కుతిలపడఁగ.

తే॥ అవల నొకగిరివైచియు◆వ్యర్థమైనఁ, గపులు గలఁగుదురని శతాం◆గమున కెదురు
నడచి పిడుగును మించిన◆పిడికిలిగొని, కుంభకర్ణుని పొడిచెను ◆ కుతలమదర.

ఉ॥ చేతులు కాలునొచ్చి తన ◆ చేఁతలు వ్యర్థముగాఁగ నీలుఁ డు
ద్ఘాతము సెంద్రి కూలఁ దన ◆ దాపలి కేలను తాఁచె దైత్యుఁ డా.

ఘాతముచేత నీలు నను ♦ కొండము తల్లడమందె నాయుధో
పేతుఁడుగామి శూలమున ♦ వ్రేయఁడు నిర్జరవైరి పాడిమై. ౧౨౫౨

చ॥ అదిగని యంగదుండు రభ ♦ సాతిశయంబున వార్ధినుండి బె
ట్టిదమగు కొండఁదెచ్చి పుర ♦ డించి నిశాచరుఁ డీల్గెనంచు స
మ్మదమున వానరావళులు ♦ మానుగ గంతులు వెట్ట వైచె న
ప్పదిలుఁడు తాఁచె దానిఁ దన వామభుజంబున దైత్యు లార్వఁగన్.

తే॥ తాఁప నక్కొండ ముక్కలై ♦ ధరణిఁ బడియె, నేది తెరువని హతులు పెం♦పేది పఱవఁ
జెరిమె ముందుంచు పాదంబు♦వెనుకఁదివక, యక్కనును తానుగా నిల్చె♦నంగదుండు.

తే॥ కుంభకర్ణుఁ డంత నమోఘ♦ ఘోరనిశిత, వజ్రదండ మొడమచేతఁ♦బట్టివైచెఁ
బ్రాణములు వీడఁగలవని♦పలికి దాని, నంగదుడు పట్టుకొనె వేల్పు♦లభినుతింప.

క॥ పట్టిన దండముఁ ద్రిప్పుచు, దిట్టండగు కుంభకర్ణు తీపి ♦ యసుఱులన్
నెట్టన గొనియెదనని పిడు, గట్టులు మిడుఁగుఱులు సెదర ♦ నతనిం డాసెన్.

చ॥ కదిసిన వాలిపుత్త్రకుని ♦ కర్బురవర్యుఁడు గాంచి చావఁగాఁ
బదరెదు వానరేంద్రుఁడవొ? వాలిసుతుండవొ? లంకయందు ని
ప్పు దవులఁబెట్టి రాక్షసుల ♦ పొంకమడంచిన వాయుజుండవో?
కొడుకక తెల్పుమా? యనఁగఁ ♦ గోరిక నంగదుఁ డంత నిట్లనున్.

మత్త॥ వాలపాశముతోడ రావణుఁ ♦ బట్టి దిక్కులఁ ద్రిప్పు నా
వాలిపుత్త్రుఁడ రామభక్తుఁడఁ ♦ బంతమారఁగ నిన్ను నా
వాలమందునఁ జుట్టి రాఘవు ♦ పాదసన్నిధిఁ జేర్పఁగా
లీల వచ్చినవాఁడ నం చద ♦ లించి పల్కఁగ దైత్యుఁడున్. ౧౨౫౮

చ॥ మఱుఁగున నిల్చి నీజనకు ♦ ద్రుంచఁగఁజేయు మహాపకారికిం
బెరసిన సూడు దీర్చి మఱు ♦ మేలొనరింపవయేని లోకు లె
బ్బెఱికముతో హసింపరె? ప్ర ♦ వీణతఁ జేసితి మంచికార్యమే
తెఱఁగరు లైన శూరులు ను ♦ తింపరె దీనికి నిన్ను? బాలకా!

మ॥ వడి నీలావును వానరుల్ పొగడ నన్♦వాలంబుతోఁ జుట్టి వెం
బడిఁ గొంపోవఁగఁ గాదుగాని సుమనో ♦ వక్షస్థలుల్ గ్రుమ్మి వె
ల్వడు శూలాగ్రమునందు గ్రుచ్చికొని వ్రే♦లన్ మింటిపై కెత్తి ని
న్నడరన్ లంకకుఁ గొంచుఁబోవుటకె నీ ♦ యభ్యాగమం బర్భకా!

ఆ॥ అనుచు నుఱిమిచూచి♦యా కుంభకర్ణుండు, చేతవ్రేయ నూఱు ♦ చిదురలగుచు
వజ్రదండ మవనిఁ♦బడిన నంగదుఁడును, కినుక నాఁపలేక ♦ కేలుసాచి ౧౨౬౧

ఆ॥ పొడిచి కూల్తు ననుచు♦మెడవంచి దుముకంగ, నసురవరుడు శీర్ష♦మడఁగఁ బొడిచె
వానిపోటుతోడ ♦ వాలిపుత్త్రుఁడు సోలి, నేలఁగూలె నాంజనేయుఁ డడ్డె.

ఉ॥ వెండియుఁ గుంభకర్ణుఁడు క♦పిప్రభు పుత్త్రుని ఱొమ్ము గాఁడఁ జే
నుండిన శూలముల్ విసర ♦ నుజ్జనసేసెడు నంతలో నగం
బొండు వహించి వాని శిర ♦ ముగ్రత మోఁదుచు సింహనాద ము
ద్దండతఁ జేసి వాయుజుఁడు ♦ దాశరథి స్తవ మాచరింపఁగన్. ౧౨౬౩

క॥ తలపై మఱియొక తలవలెఁ, జెలఁగు మలను చేతఁగొనుచుఁ ♦ జిందఱతోఁ గ
ర్వలినుతు ఱొమ్మున నమ్మెట, వలెఁ దగులన్ వైచి దనుజ ♦ వర్యుం డార్చెన్

ఆ॥ అపుడు కీశవీరు ♦ లంజక యంగదుఁ, గొనుచుఁబోవ గొప్ప ♦ కొండఁ గొనుచు
హనుమ కుంభకర్ణు ♦ నదటున నీక్షించి, వన్నిదంబు చఱచి ♦ పలికె నిట్లు.

క॥ వైచెద నీపై దీనిని, నీచేవయు నెల్లవారు ♦ నియతి నెఱుఁగఁగాఁ
దోఁచితివేనియు నీతోఁ, నేచి దురము సలుప కవలి ♦ కేఁగెదఁ జుమ్మీ. ౧౨౬౬

క॥ అన విని దనుజాధీశ్వరు, ననుజుఁడు రదనముల కాంతు ♦ లడరఁగ నగి నీ
పెనుమల నను సోలించిన, నని గెలిచినవాఁడ వగుదు ♦ హనుమా! వినుమా!

చ॥ అనుటయుఁ బిన్ననవ్వు నగి ♦ యాశుగపుత్త్రుఁడు నీవు చేవ గ
ల్గిన దనుజుండవేని తమ ♦ కింపక నిల్వుము నిల్వలేనిచోఁ
జనుము రణస్థలిన్ విడిచి ♦ చయ్యనఁ బ్రాణముతోడ నంచు వై
చినఁ జలియింప కట్లె నిలి♦చెన్ భుజమొందఁగఁ జూపి దైత్యుఁడున్.

చ॥ తిరుఁడయి నిల్చి బాహుల వి♦దిర్చిన నమ్మల వేయి వ్రయ్యలై
ధరణిని రాలఁ గాంచి నయ ♦ దాంతుడు మారుతి వీని చేవకుం
బరిమితి లేదు రాఘవుని ♦ వాఁడి శరంబులె చీల్పఁజాలుఁ గ
ర్బురుని భుజాంతరంబు నని♦పోయెను దవ్వుగ వీడి యాస్థలిన్. ౧౨౬౯

సీ॥ డెబ్బది వెల్లువ♦లుబ్బునఁ దాఁకి చ, చ్చినవారు పోవ శే♦షించియున్న
వానరు లందొక♦రేనియు మిగులక, క్రూరుని శూలమున్♦కొట్టునందు
కెడయుదు రని యొక♦గడియలో జగములు, కలఁగునం చమరులు♦తలఁగినారు
తాఁకినవారిలో♦దర్పించి గెలిచిన, వారు నొప్పించిన♦వారులేరు

తే॥ కదనరంగంబునం గుంభ♦కర్ణుఁ డడరి, యొక్కకపిజాడయైన లే♦కుండఁజేసి
బట్టబయలున విహరించి♦పౌరుషమునఁ, గీర్తికిం గ్రొత్తఁదనము గ♦ల్గించె నాఁడు.

తే॥ దుర్దముండగు కపివీర♦మర్దనుండు, కుంభకర్ణుండు తిరిగిన♦గొప్పబయలు
మున్నగస్త్యుఁడు త్రావఁగాఁ♦జెన్నుతఱిగి, యుడఁగినట్టి పయోరాశి♦ననుకరించె.

మ॥ యమరాడ్భీకరుఁడైన దైత్యుఁడు మహా ♦ హంకారుఁడై కీశ బృం
దము చావంగని రామలక్ష్మణులు యు ♦ ద్ధక్రీడఁ గాంక్షించి రం
గమునందే కలరా? యొకేగిరి? మఱో ♦ క్కం డున్నదే లంక? ద
ర్పమునన్ రారోకో? యంచుఁ ద్రా భుజము లా ♦ స్ఫాలించుచుం గర్జిలెన్.

## —: లక్ష్మణ కుంభకర్ణుల యుద్ధము :—

తే॥ తరులు గిరులును జాలును♦తగ్గిపోయెఁ, గోఁతిమూఁకయు సగముపైఁ♦గ్రుంగిపోయె
ననుచు ఖచరులు చింతింప♦విని చిరాకు, గొనుచు సౌమిత్రి తన్ను పే♦ర్కొనుచుఁ దాఁకె

మ॥ రణరంగంబున నిల్చి లక్ష్మణుఁడు ధ ♦ ర్మం బెక్కు గావించుచున్
గుణరావం బొనరించె నూడిపడ ర ♦ క్షోదార కంఠస్థలీ
గుణ సంఘంబులు కర్ణభేరు లగలన్ ♦ క్షోణీధరంబుల్ ప్రతి
క్వణముల్ సేయఁగ భూతజాలము మహో ♦ త్కంపంబునం బొందఁగన్

చ॥ పరపిన లక్ష్మణ ప్రదర ♦ వారము నింగిని భూమిఁ గప్పుచున్
దెఱపి యొకింతలేక కడు ♦ తీవ్ర దురంత రుషా క్షుధార్తమై
యెఱకలతోడ నోట వడి ♦ నింగల ముమ్ముచుఁ బోయిపోయి య
మ్మొఱకుల రక్తమున్ వెగటు ♦ పుట్టఁగఁ ద్రావెను కెక్కు గ్రక్కుచున్.

తే॥ తలలఁ ద్రెంచుచు నవ్వాల♦దాఁటెఁ గొన్ని, తలల నొందిన రీతిని♦తనరికొన్ని
కడలకుం గొనిపోయెను♦కరుల దూసి, యసురులం దూసి యవ్వలి♦కరిగెఁ గొన్ని.

తే॥ మెఱుపుగుంపుల కైవడి♦మెఱయు పైఁడి, మొనలతూపులు పఱచి య♦మ్మొనను గలుగు
దనుజ ముఖ కంఠ భుజ భుజాం♦తర మహోరు, జాను జంఘా చరణ పృష్ఠ♦సమితినఱకె.

సీ॥ మొదలనుండిన వారి♦మోములఁ దూఱి వె, న్కలఁగలవారి వీఁ♦పులను దూసి
భేరుల కన్నులఁ♦దూఱి కాహళముల, నాళంబులం బాఱి ♦ కాళెపట్టు
వారి చేతులఁద్రుంచి♦వారణ కంఠముల్, తఱిఁగి తేరులఁ గూల్చి♦నఱికి హరులఁ
జూచిన కన్నులఁ♦జొచ్చి యేచిన కంఠ, ములఁ ద్రెంచి కడుపులఁ♦గలఁచి వ్రచ్చి

తే॥ దంతములు రాలవాలహ♦స్తములు వ్రీలఁ, గాళ్లువిఱుగఁగన్నులు వోవఁ♦గరులగిరుల
కరణి దొరలించి సౌమిత్రి♦కాండచయము, లెల్లెడం దామయై యిట్టు♦లేపుమీఱె.

ఉ॥ నేలను మింటిపై జరుగ ♦ నేర్చిన వారువముల్ నిరంతర
జ్వాలలు గ్రక్కుచున్ వెడలు ♦ బాణ పరంపర నాట బమ్మెరం
గూలెను కొన్ని చుట్టికొని ♦ కొన్ని మడంగెను చాఁపకట్టుగాఁ
దూలెను కొన్ని నెత్తుటను ♦ దోఁగుచు వ్రాలెను కొన్ని ధాత్రిపై

ఉ॥ పెక్కు శిలీముఖమ్ము లొగిఁ ♦ బెక్కు విధమ్ములఁ దాఁకి నొంపఁగా
స్రుక్కెను రథ్యపాళి రథ ♦ చోదకు లీల్గిరి స్యందన స్థితుల్
మ్రక్కిరి రక్తవాహినులు ♦ ప్రబ్బి రథమ్ములఁ ద్రోచుచుండఁగా
నొక్కటఁ బోవుఁ బోవ వొక ♦ యోజయుఁ దెన్నను లేక యయ్యెడన్.

తే॥ విధిని పోలిన నారాచ♦వితతి గ్రుచ్చు, కొన్నవియుఁ ద్రెంచినవియును♦కూల్చినవియు
రక్తఘటమువంటివి రక్త♦సిక్తమైన, తలలు మస్తిష్క పంకంబు♦పొలుపుదాల్చె.

తే॥ పొడిచి త్రోచిన♦వడువునఁ బడిన తలలు, తుడుములం బడు జల్లుల♦తోయ మొంది
సర్వ లోకనాయకుని వి♦జయ మహోత్స, వమున కుంచిన మొలకల♦పోలిక లన.

క॥ శిరములు నొసళులఁ దగులం, గిరగిర వడిఁదిరిగి కరులు ♦ గీపెట్టుచు వా
నరసైన్య మసురసైన్యము, నరయక యరిగినది పోక♦మై మెడచొచ్చెన్. ౧౨౮౩

ఉ॥ ఆమని మీనకేతనుని ♦ యందము నొందిన సుందరుండు శ్రీ
రాముని తమ్ముఁడేయు ప్రదర♦మ్ములు ద్రుంపఁగ యామినీ చర
స్తోమము లేసినట్టి పలు ♦ తోయము లందిన కైదువుల్ రజం
బై మహిరాలె రిక్కలు ర ♦ యంబున రాలిన చెన్ను దోఁపఁగన్.

తే॥ కటకటమ్ములు శ్రేణులై ♦కరుల హారుల, తలలఁ దూఁటి త్రోఁకలడుస్సి♦యిలనుగూల్చి
సిడము లూనిన దడములఁ♦ జెండి యరద, ములను దొలిచి జరీన న♦వ్వాలికినేగె.

మ॥ తలఁగించున్ సుఖదుఃఖ సంచితముఁ ద ♦ త్త్వజ్ఞాన మంచాడు పె
ద్దల వాక్యంబునఁ బాపముం దొలఁచు శు♦ద్ధస్ఫార వీరత్వమున్
లలితార్థం బుపలక్షణా విధిని సం ♦ లక్షింపఁగా నయ్యె దై
త్యులకు న్నాక వరాంగనా సుఖ విభూ♦తుల్ మించి చేకూరుటన్.

ఉ॥ పాపులు రక్కసుల్ భయద ♦ వాత్యవలెం జెలరేఁగి రాఁగ నా
తూపులు వహ్నిగుచ్ఛముల ♦ తోయమునం బురడించి పైఁబడం
గోపులుగాఁగఁ గూలిపడి♦కుత్సితులెల్లరుఁ జేరుచుండఁగా
నేపున నిండకుండు దివి ♦ కెచ్చుగఁ బల్క నొకండు గల్గునే? ౧౨౮౪

ఉ॥ ఒక్కరి పాదముల్ మఱియు ♦ నొక్కరి చేతులు వేఱు పొట్ట లిం
కొక్కరి శీర్షముల్ దొరకు ♦ నొక్కొక యంగము లక్ష్మణాస్త్రముల్
చిక్కిన యంతవట్టరులు ♦ చిక్కని యొద్దడిచే వడిం గొనెన్
ఒక్కొకచోట యాచకుఁ డొ ♦ కొక్క పదార్థముఁ గూర్చుకై వడిన్.

ఉ॥ కొందఱి ముక్కులన్ మఱియుఁ ♦ గొందఱి వీనులఁ గొంద ఱంఘ్రులన్
గొందఱి దీర్ఘహస్తములఁ♦గొందఱి కన్నులఁ గొన్న బాణముల్
పొందిక విద్యయున్ ధనము ♦ భూస్థలిఁ బెంచు కవిప్రకాండ సం
క్రందన వాగ్విరాజిత ని ♦ రంకుశ ధార విధాన వర్తిలెన్

చ॥ అనువుగ ధర్మదేవతకుఁ ♦ బ్రాణముఁ బోలిన లక్ష్మణుండు గు
ప్పిన విశిఖాలిచే నసుర ♦ వీరులు డాఁగి క్షణంబు నిల్చినన్
గనఁబడు మిత్తియే యని క ♦ కావికలై పరుగెత్తి సంగరా
వని విడిపోయి రవ్వలికి ♦ వారని నెత్తురు టేఱులం బలెన్. ౧౨౮౫

మ॥ సమరోర్విన్ మరణించినట్టి జనమున్ ♦ సౌమిత్రి దోర్వీర్య దు
ర్దమ పాండిత్యముఁ గన్నులారఁ గని యం ♦ తం గుంభకర్ణుండు లో

కములం దెన్నఁ బురాంతకుం డయిన శ్రీ ◆ కంఠుండు సౌమిత్రియే
సమతం బొందని మేటి ధన్వులని యి ◆ చ్చంబల్కెఁ బల్తోయముల్.

తే॥ గాలియెడఁదలకంటె వే◆గంబుగలది, జయ విలక్షణ సింహ ధ్వ◆జంబుగలది
అన్నిదిక్కుల కేగున ◆ దైన తేరు, వడిగఁ దోలించి లక్ష్మణు ◆ కడకువచ్చె.

క॥ అసురుఁడు రథ స్థితుండయి, కసిమసఁగిన నేలనుండి◆కయ్యము సేఁతల్
పొసఁగదని వాయుసూనుఁడు, కొసరి నిలిచి తనభుజములఁ ◆ గూర్చుండుమనన్.

తే॥ కొదమసింగము గిరినెక్కు◆కొమరుదోఁప, నెక్కె సౌమిత్రి వానరు◆లెలమి విజయ
నాదములుచేసి రమరులు◆మోదపడిరి, హనుమ మూఁపు రథముకంటె◆ననువుమీఱె

తే॥ వెండికొండపై బంగరు◆కొండయట్లు, హనుమమూఁపుపై లక్ష్మణుఁ◆డలరునంతఁ
గడిమికిం దగు విలు కుంభ◆కర్ణుఁ డూని, యెక్కువెట్టి గుణధ్వని◆ యొనఁగఁజేసె.

ఉ॥ రాముని తమ్ముఁడీవు మఱి ◆ రావణు తమ్ముఁడ నేను మింట సం
గ్రామము చూడ వేలుపులు ◆ కాంక్షను వచ్చిరి ధర్మపద్ధతిన్
హామిక మీఱ గౌరవ బ ◆ లాతిశయంబులు వెల్లడించుచున్
భీమగతిం దురంబు జర ◆ పింతము వీరులు మెచ్చునట్లుగన్. ౧౨౯౬

ఉ॥ మా కులభూషణం బయిన ◆ మానిని ముక్కును గోసినట్టి వీ
రా! కలుషాత్మ! యాచెలి న ◆ హంకృతిఁ గొప్పఁ గదించు హస్తమున్
గాకులు మెక్కఁద్రుంచెద న ◆ ఖండ పరాక్రమశాలి వైనచో
లోకులు మెచ్చఁ గాచికొను ◆ లోపములేకని కాఱులాడఁగన్. ౧౨౯౭

చ॥ బలమొ శరీర మందె నన ◆ భాసిలు లక్ష్మణుఁ డల్లనవ్వి నీ
పలుకులకున్ నదుత్తరము ◆ బాణము లిచ్చునుగాక ప్రల్లదం
బులకు సు వీర్యసంపదలు ◆ బ్రుంగఁగ నుత్తరమీయ మీవలెం
బలుకఁగ నేర్వలే దనుడు ◆ బాధ రుషా కలితాత్ముఁడై పడిన్.

ఉ॥ కన్నుల నిప్పుకల్ దొరఁగ ◆ గాటముగాఁ బరికించి ఖేచరుల్
మిన్నగలెం బెడిల్లు మని ◆ మేదిని కొండలు పిండియయ్యె నం
చెన్ని కలంగ వింటఁ బదు ◆ నెన్మిది తూపులు గూర్చి యేయఁగా
నన్నిటి నేసి కూల్చెఁ గమ◆లాప్తకులుం డచలాభ ధీరుఁడై. ౧౨౯౮

తే॥ అంతఁ గుంభకర్ణుఁడు నిర్జ◆రాంతకంబు, బ్రహ్మదత్తంబు బహుశరూ◆పకమునైన
ఘోరశర మభిమంత్రించి◆కూర్చియేసెఁ, జతురుఁడవ యైన మరలింపఁ◆జాలుదనుచు.

తే॥ కన్ను మేర దూరంబది◆కాండవృష్టి, గురియఁ గాంచిన సౌమిత్రి◆కొండొకవడి
నరసి యొక దివ్య శరమున◆నఱికివైవఁ, బెక్కు రూపులతో నది◆పుడమిఁబడియె

ఉ॥ వాఁడిమి వేగముం గలుగు ◆ బాణములం బదిరెంట మారుతిం
బోఁడిమి తగ్గనేసి యిరు ◆ ముల్కుల లక్ష్మణు నొవ్వఁజేయుచున్

వేఁడిమిమీఱ నూఱులుగ ♦ వేలుగ నొక్కొకసారి గూర్చి యా
తేఁడి మొలంకువం గనిన ♦ దిట్టరి కప్పె క్షణంబునన్ దిశల్. ౧౩౦౨

చ॥ దిశలను గప్పు బాణవిత ♦ తిం బ్రతి బాణములేసి లక్ష్మణుం
డసమునఁ దూల్చి నవ్వడి ర ♦ థాంగములన్ విఱుగంగఁ గొట్టి క
ర్కశ విశిఖంబులం బరపి ♦ రథ్యములైన పిశాచ వాజి సిం
హ శరభ వారముం జదిపి♦యయ్యసురోత్తముఁ గొట్టె నొవ్వఁగన్. ౧౩౦౩

మ॥ పరివేషంబు నశించి నట్టి తెఱఁగై♦భగ్నంబుగాఁ గూలె న
య్యరదం బప్పుడ చచ్చె సారథియు ని♦ష్పానంబు నింద్రాయుధ
స్ఫురణంబున్ మదిఁ గొల్పి త్రుంగె విబుధుల్♦పూరించి రథ్యంబులన్
శరముల్ త్రుంచెనొ? మంత్రమో? యనుచు నా♦శంకించి రప్పట్టునన్.

మ॥ విరథుండై విగతాస్త్రచాపుఁడయి య ♦ వ్వీరుండు దైత్యానుజుం
డురు కోపంబున రేఁగి లక్ష్మణు నను ♦ వ్యూహంబు సేఁ డాని నం
గరముం బూర్తి యొనర్తునంచుఁ గొనియెన్ ♦ దర్పించి ముల్లోకముల్
పరఁగన్ గెల్వఁగ నిల్పు చిహ్నమనఁగా ♦ భాసిల్లు శూలంబొగిన్.

క॥ వనధివలె రేఁగి రావణు, ననుజుఁడు లంఘించె ధరణి ♦ యదరఁగ వానిం
గని సౌమిత్రియు మారుతి, ఘన భుజములనుండి దిగియె♦గరువం బెలయన్.

తే॥ తమ్మునకుఁ దోడుగా మున్న♦దశముఖుండు, పంపుసేనకు నినుమడి♦పంపనపుడు
తత్ప్రతన సాయుధంబయి♦తరలివచ్చి, యల సుమిత్రా కుమారు ము♦న్నలమికొనియె.

క॥ వానరులు కలఁగఁబాఱఁగ, దానవ చక్రంబు వచ్చి♦తలపడఁ గని రా
మానుజుఁడు చొచ్చి కలఁచుచు, మానక యొసరేఁగె మారి♦మసఁగిన కరణిన్.

ఉ॥ మోదుగువంటి కేశచయ ♦ మున్ నయనంబులు నొప్పుచుండు క్ర
వ్యాదుల శీర్షముల్ కరుల ♦ హస్తములున్ దురగాంఘ్రులున్ రథాం
గాదులు దొర్లుచుండ రుధి ♦ రాపగలెల్ల శవంబు లడ్డు క
ట్టై దగులంగఁ ద్రెంచికొని♦యంబుధిఁ జొచ్చెను వన్నె మాఱఁగన్. ౧౩౦౬

తే॥ చక్ర తోమర శూలాది♦సాధనములు, యామినీచరుల్ వైవ రా♦మానుజుండు
నడుమనే కూల్పఁ దునకలై ♦పడిన వాన, విఱిగి కూలిన కైదువుల్♦పెక్కులయ్యె.

తే॥ హార కుండల మకుట కే♦యూర కటక, వితతి లక్ష్మణ సాయక♦విద్ధమగుచు
ఖండఖండంబులై మింటి♦కడకునెగసి,యినహిమాంశుబుక్షతతిమా♦ర్కొనివెలింగె.

క॥ సిడములు వింజామరములు, గొడుగులు కేడెములు పీలి♦గొడుగులు విండుల్
సుడిసెదు నెత్తురుటేఱులఁ, బడ నీఁదెడు భూతగణము♦ప్రక్కలఁ ద్రోఁచెన్.

## —: సుగ్రీవ కుంభకర్ణుల యుద్ధము :—

తే॥ లక్ష్మణునకు దానవసేన♦లకును మిగుల, ముమ్మరంబగు పోరిట్లు♦మొనయుచుండఁ
గుంభకర్ణుండు గని కిన్కఁ♦గొప్పరింప, భానుసుతుఁడు వానికి నడ్డు♦పడియెఁ గడిమి.

తే॥ అసురభుజములు విఱిగిన♦వని తలంపఁ, దగిన తీరున ఘన పర్వ♦తంబువైవ
దానినుండి భూమికి జాఱు♦నేనుఁగులను, సేనలోని యేనుఁగులు భం♦జింపఁదివిరె.

తే॥ కొండచిలువలు పెక్కులం♦దుండి జాఱి, మదకరులఁ గవ్వికొనె నట్టి♦మలను పట్టి
కరతలంబున నక్కుంభ♦కర్ణుఁడుంచు, కొనియె దాన రాకాసుల♦గుంపుమనియె.

తే॥ అలవిలేని బలుఁడు రావ♦ణానుజుండు, కోఁతిరేఁడ! నీవైచిన♦కొండ యిదియె?
యనిపరిహసించి పిసికి యు♦ప్ఫనుచునూఁదె, వేల్పు లదిగని మిక్కలి♦వెఱగొనంగ.

తే॥ భానుసూనుఁడు మఱియొక♦పర్వతంబు, వెదకుచుండ రావణుతమ్ముఁ♦డుదుటుతోడఁ
జంపుమనఁ దపస్వుల శాప♦సరణినదరు, తన త్రిశూలమ్ము గుఱిచూచి♦తాఁకవైచె.

ఉ॥ కాంచిన వారలెల్లఁ గపి ♦ కాంతుఁడు ద్రుంచెను ద్రుంచెఁ గావరే
యంచును మొత్తుకొట్ట వడి ♦ నాశుగపుత్త్రకుఁ డడ్డువచ్చి యే
తెంచు త్రిశూలముం దిగిచి ♦ తేఁకువ జానువునూఁది వంచి శా
వించెను తుండ్లుగాఁ; నిడుమ♦ద్రవ్వని దాసుఁడు దాసుఁడే భువిన్? ౧౩౧౯

తే॥ జానకీదేవి సౌందర్య♦మాని రామ, విభుఁడు మిథిలలో శివువిల్లు♦విఱచునాఁడు
పుట్టినట్టి రావమె నాఁడు♦పుట్టె గాడ్పు, పట్టి దైత్యుని శూలంబు♦పట్టి విఱువ.

మ॥ తన శూలంబు వృథాచనంగ హనుమ ♦ ద్దార్ఢ్యంబు చింతించి నీ
ఘన బాహాబల మన్నిచోటుల నమో ♦ ఘంబై మహాకార్యముల్
పొనరింపం దగియుండ నుద్భటుఁడవై♦పొల్పారుచున్నావు నీ
కెన యెవ్వారలు? పోరుదేని విను నీ ♦ యిష్టంబ కావించెదన్. ౧౩౨౦

తే॥ అనిన కుంభకర్ణుని గని ♦ హనుమ పలుకుఁ, గలఁకు గావింపనని తొల్తఁ♦బలికి పిదపఁ
బోరు నీతోడఁ బూనుట♦తీరుగాదు, వలదటంచుఁ దొలంగి యు♦వ్వలికిఁ జనియె.

క॥ శూలము విఱుగఁగఁ బెరకర, వాలము లేకయును కలఁత♦వడక నిలిచె హిం
సా లాలసుండు వానిం, దూలఁగఁ గపిరాజు వాడిచె♦దోర్బల మెసఁగన్. ౧౩౨౨

క॥ నొవ్వక రావణు తమ్ముఁడు, నవ్వి మదము నేఁటితో న♦ణంగు ననుచుఁ దా
నువ్వునఁ గేలం జాఁచుచు, నవ్వలికిం బోవనీక♦యడ్డముపట్టెన్. ౧౩౨౩

క॥ ఇరువురు వలయాకృతిగాఁ, దిరుగుచు దొరకుచును దొలఁగఁ♦ద్రిక్కుచును పర
స్పర ముష్టుల నోళ్లను నె, త్తురు గ్రక్కుచు సొలపులేక♦త్రుంగని కడిమిన్. ౧౩౨౪

క॥ అదలించుచు హుంకృతులం, గదలించుచు బలిమిఁ బోరు♦కడఁకం దనుజుం
డదిమెను సుగ్రీవు నతం, డెడ నొవ్వఁగ సొలసి సత్త్వ♦హీనుండయ్యెన్. ౧౩౨౫

ఆ॥ దురము ముగియు నేఁటి♦తో నాయకుఁడు లేని, సేన చెదరు ననుచుఁ♦జింతచేసి
వైశ్రవసుఁడు ప్లవగ♦వర్యుని గొని లంక, దెసకు నడచెఁ గపుల♦దిగులువడఁగ.
తే॥ ఒకటఁ దల్లిని డేగ త♦న్నుకొనిపోవ, నడలు పక్షిపిల్లలవలె ♦ హరిగణంబు
బెగ్గలించుచుఁ జేతుల♦పిసికికొనుచు, నూర్పుపుచ్చుచు నేడ్చె దై♦త్యులుచెలంగ.
తే॥ చెమటపోసి నాలుక యెండ♦నమరులెల్ల, విన్నఁబోయిరి మనసుల♦విసిగికొనుచు
నెడఁద లెరియంగ నుత్సాహ♦మడుగువట్టఁ, గ్రుంగి తపియించి కుమిలెఁ బ్లవంగకులము.
తే॥ మనసు నుడికించు కోపంబు♦గొనిన కుంభ, కర్ణు డప్పుడు రాహువు♦కరణి నుండె
భాస్కరసుతుండు గ్రసియింపఁ♦బడిన చంద్రుఁ,బోనివాఁడయి తేజోవి♦హీనుఁడయ్యె.
తే॥ దానవుని కఱిమేనిపై♦భానుసూను, మేను తగ్గుచు హెచ్చుచు♦మేఘమందు
డాఁగుచును వెలివడుచును♦డాలుచూపు,కలువఱేని బింబంబనఁ♦గానఁబడియె
క॥ తనతో దుర మొనరింపన, యని పంతము లాడినట్టి ♦ హనుమానుం డా
దనుజన్ముఁ బ్రతిఘటింపక, వెనుచనియెను మనసు పెక్కు♦విధములఁబోవన్.
క॥ వనచరవిభుఁ దనమూఁపు ప, యినుంచుకొని కుంభకర్ణుఁ♦డేగుచునుండన్
మనకింకఁ బ్రభుఁ డెవండని, యినకులు పాదముల వ్రాలి♦యేడ్చిరి ప్లవగుల్
తే॥ నీల నీరద శ్యాముఁడు♦నిప్పుకంటె, నెఱ్ఱనైన కన్నులతోడ♦నిషుధిఁ దొడిగి
ధనువు సజ్యంబు గావించి♦త్వరితగతిని, త్రుటిని పఱతెంచి నగరి వా♦కిటికివచ్చె.
క॥ నానెయ్యుని నాప్రాణము, జానునఁగొని కోటదాఁటి ♦ జరగిన మోనం
జౌనని రాఘవుఁ డమ్ముల, వానం గురియించి వాని♦పథ మరికట్టెన్. ౧౩౩౪
క॥ శరములు గగనము గప్పఁగ, మఱుఁగయ్యెను దిక్కు లెండ♦మలయదు లోనన్
జరుగఁగ లేవయ్యె వియ, చ్చరములు సైతంబు దాఁటి♦శర దుర్గమ్మున్. ౧౩౩౫
తే॥ నెవ్వడిం జను నయ్యామి♦నీ చరుండు, తెరువు విడువక కుప్పలు♦తిప్పలగుచుఁ
గడకు నిండిన బాణదు♦ర్గంబు చూచి, దీని దాఁటంగ నరుదని♦తిరిగి కాంచె.
తే॥ కాంచి పద్మాకరము కాలుఁ♦గేలు మొగము, కనులు కలుగఁ బూచి సొబగు♦ ధనువునూని
నడచి వచ్చెనా యన నొప్పు♦నలువుకాని, బురుష మోహను శ్రీరామ♦భూపుఁగాంచె.
ఆ॥ మూసియున్న నోరు♦పొగల వెళ్ళఁజిమ్మెను, పెదవు లదరెఁబొమలు♦వికృతి నందెఁ
గనులు నిప్పు లుమిసె♦గర్జనమునఁ గొండ, లగల మాఱుమ్రోఁగె♦నవని వడఁకె.
ఉ॥ వాలి కబంధులం జెనయు♦వాఁడని యెంచి కపీంద్రుఁ గావఁగాఁ
బోలును నన్నెదిర్చితివి ♦ పోరునఁ గీరితి రాదటంచు నే
మ్రాలుపలేదు నీయనుజు ♦ మారుతి వానరనాథు; నిన్నె యీ
యాలమునం జయించి యశ ♦ మందఁగ నారయుచుంటి నెల్లెడన్. ౧౩౩౬

చ॥ వెదకుచుండ నీబలము ♦ వీఁగి దిగంతము దాఁకఁబాఱె వే
యొదిఁగెను నీదుతమ్ముఁడు మ ♦ హోద్ధతితో నెదిరించి వాయుజుం
డదరెను వాలిపుత్త్రకుఁడు ♦ నంకిలినొందెను చేవడక్కి మూ
ర్ఛ దొరయ వీని నెత్తుకొని ♦ సాఁగఁగ వచ్చితి వీవు దిట్టవై. ౧౩౪౦

చ॥ వనచరుఁ గాపఁగాఁ దలఁచి ♦ వచ్చితివేమి? మదీయ భాగ్యమే
గొని యిటు తెచ్చెఁ గావలయు ♦ గొజ్జగ నిన్ను నలంచి యన్నకుం
జెనకిన వేదనం దొలఁగఁ ♦ జేసెద దివ్యులు చూచుచుండఁ గోఁ
తిని గొనియున్న పట్టు విడఁ ♦ దీసిన సీతయు వీడు బంధముల్. ౧౩౪౧

చ॥ అనవుడు రాఘవుండు దర ♦ హాస వికాసిత సుందరాస్యుఁడై
యను దనుజాధమా! వినుము ♦ ప్రాణహితుం గొనిపోవు బాహుపుం
దునుకలు సేయనేని ఘన ♦ దోర్బలమేటికిఁ? జాపమేటికిన్?
మొన వెనుదీయ వాఁడనయి ♦ ముట్టను కార్ముక మింతయేటికిన్?

తే॥ అనుచుఁ గుంభకర్ణుండంప ♦ యాఁకఁ ద్రోవఁ, బూనరెండమ్ములను నొసల్ ♦ పొడువనేసె
నుదుటి యమ్ములతో నెట్టి ♦ నొసలితోడ, దైత్యుఁ డరుణోదయముఁబోలి ♦ తనరె నపుడు

తే॥ ఫాలమున శోణితమ్ము ప్ర ♦ వాహమట్లు, కాఱఁ దడిసి చల్లనగాఁగఁ ♦ గపివరుండు
నిదుర మేల్కొన్న చందానఁ ♦ గదలి లేచె, దిమ్మదిరుగంగ దైత్యుండు ♦ సొమ్మసిల్లె.

మ॥ నొసట న్నాటి వెలుంగువాని రవి సూ ♦ నుం డొప్పవీక్షించి యి
య్యసమాస్త్రంబులు రామ సాయకము లం చాత్మన్ విలోకించి చు
ట్టొసలారంగని సర్వలోకములకున్ ♦ హేత్వర్థమై యున్న శ్రీ
వసుధాధీశ్వరుఁ గాంచి జేయనుచుఁ జే ♦ వం బొంది యా వెంబడిన్.

తే॥ అసురమానంబు లజ్జయు ♦ నడుగుతోడ, నూడ నాసికయును చెవి ♦ నూడఁబీకి
కొనుచుఁ గపిరాజు మింటత్రో ♦ వను బిరాన, వచ్చి తనవారలకు మోద ♦ మెచ్చఁజేసె.

క॥ రవణించెఁ గపి సమూహము, రవణించె మహాద్రు లంబు ♦ రాశియు మొగుళుల్
రవణించెను వేలుపుగమి, రవణించెను పాడివేల్పు ♦ రంజిల్లు మదిన్. ౧౩౪౨

క॥ వచ్చిన వానరనాథుని, హెచ్చిన మోదమున జాన ♦ కీశుఁడు కాంచెన్
గ్రచ్చుఱ మైథిలి చెఱవిడి, వచ్చిన తఱి నొందునంత ♦ పండుగు నొందెన్.

తే॥ నొసలు పగిలించి ప్రక్కల ♦ దుసికిలిచన, రాముఁడు శరంబులేయఁగ ♦ రాక్షసుండు
చేవచెడఁగ సుగ్రీవుండు ♦ చెవియు ముక్కు, నూడఁగొఱికి కొంచేగెఁ గా ♦ కున్నఁ దరమె?

తే॥ దనుజనసుజుండు తెలివొంది ♦ వనచరుండు, కరతలమున వాఁడవ్వాలి ♦ కరుగుటయును
చెవియు ముక్కుపోవు టెఱింగి ♦ చింతనొంది, చెలియలిఁ దలంచుకొని చాల ♦ సిగ్గునొందె

తే॥ నిర్ఝరముపోలె నొడలశో ♦ ణితము వెడలఁ, గుంభకర్ణుండు ధాతుయు ♦ క్కు ధర మొండు
వృష్టి గురియంగ నీదతో ♦ వెల్లువలను, బయలు పఱచిన చందాన ♦ బరిధవిల్లె.

తే॥ పరపతిని గోరి వంచన♦పఱచినట్టి, చెల్లెలికి ముక్కుచెవు లూడె♦సిగ్గుచెందఁ
బరసతిని గోరి వంచన♦పఱచువాని,తోడులకు నట్టు లౌటలో♦దోసమున్నె ?

తే॥ తనకుఁ గలిగిన దుస్థ్సితిఁ♦దలఁచుకొనుచు, రోసి దైత్యుండు చెంతరా♦కాసులఁ గను
నిక్కి ఖచరులఁగాంచును♦ముక్కుఁగాంచు, మునుపుగొన్న వాసినిగాంచు♦భూమిఁగాంచు

—: రాముఁడు కుంభకర్ణుని కూల్చుట :—

చ॥ చెలియలి ముక్కుపోయె నని ♦ చింతిలు జ్యేష్ఠుఁడు కాంచుమున్నె నా
చెలియలు తగ్గ యన్నవని ♦ సిగ్గఱి డగ్గఱి చూచుమున్నె నా
చెలువఱు మోము రాముఁడు హ♦సించుచుఁ గాంచెడు మున్నె వారికిన్
జెలువఱఁ గర్ణనాసికలఁ ♦జెక్కెదఁ గాకని యాగ్రహోగ్రుఁడై. ౧౩౫౪

చ॥ వడి నొక వాలు పల్కయును ♦ వారక కైకొని చేగ చాల దం
చెడముగఁ బొఱవైవ నుడు ♦ బృందము రాలెను ఖేచరాళి పే
రెడఁదలు ప్రేవులుం గలఁగె ♦ నేచిన యీసునఁ గర్ణ నాసికల్
వడవడ నెత్రు జార్చె బహు♦భంగుల దైత్యులు పల్లటిల్లఁగన్. ౧౩౫౫

తే॥ మూఁడువేల పిశాచముల్ ♦ మోచితెచ్చు, వజ్రఖడ్గంబు వలకేల♦వారుకొనియె
వేయి భూతముల్ మోచిన♦విపులఖేట, కంబు నెడమచేతం గొనెఁ♦గనలు తోనఁక.

తే॥ కొండఁబోలిన కుంభక♦ర్ణుండు కేడె, మెలమి నంకించి వైచి చు♦క్కలను రాల్చెఁ
గాల నేలను తాఁచి పా♦తాళభోగి, శిరములును ధరణియుఁ గ్రుంగఁ♦జేసెఁ బెలుచ.

క॥ వీచిన ఖేటక ముఖమున, లేచిన పెనుగాలి కపుల ♦ లేపి దెసలకుం
ద్రోచిన లోఁతగు కడలియు, నేచిన మిట్టయ్యె ఖచర ♦ బృందము పఱచెన్

క॥ ఇతరు లెఱుఁగుటకు మున్నె, మతిమంతుఁడు రామవిభుఁడు ♦ మరలంగొట్టెన్
శితశరమున నదియు మహా, ద్భుతముగఁ బఱలాశి హస్త ♦ మునకే మరలెన్

క॥ డాలును నడుమనె క్రమ్మఱఁ, గాలుం బో ల్దనుజవరుఁడు ♦ కాలం దన్నన్
గాలికిఁ గలఁగిన జలనిధి, పోలికఁ గపిసేన కలఁగి ♦ పొనుపడి చెదరెన్ ౧౩౬౦

క॥ పోరున నెదురై పడు కపి, వారంబును త్రుంచి రక్త ♦ వాహిను లడరన్
గూరిచి తిరిగెడు డాలును, శ్రీరాముఁడు విఱుగఁగొట్టె ♦ శిత భల్లమునన్

ఆ॥ పాఁపతేని యుచ్చి ♦ పంకంబు గావించు, డాలువోయె నదను ♦ డాయదింక
వీని నిపుడ చంపు ♦ విడువకుమని ప్రోత్స, హించె జాంబవంతుఁ♦డినకులేశు.

క॥ వానర సేనానాశము, దానవ విజయంబు బలము ♦ దర్పము భూజా
జాని గని యముని నేఁడే, వీనియెదుట నుంతు ననుచు ♦ వీఁకం దాఁకెన్

తే॥ వాఁడివడిగల పదుమూఁడు♦బాణములను, రాముఁ డేసెను రణవిశా♦రదుఁడు కుంభ
కర్ణుఁ డవ్వాని గ్రద్దయిఁ♦కల విధమున, రాలి పడఁగొట్టె దన కర♦వాలుచేత.

తే॥ బలిమిఁ దొడరిక వేసంగి ♦ భానుఁబోలు, తీక్ష్ణ శరముల రాముఁడు ♦ తివిరి యేయ
నవియుఁ దునుకలై చెదరంగ ♦ నసుర కొట్టెఁ, జేతివాలంపుఁ బిడితోడ ♦ హేతు లెసఁగ.

క॥ దరహసిత వదనుఁడై శ్రీ, వరుఁ డొకబాణమ్ము లాగి ♦ బలిమిని వీడన్
గరుడుఁడు సర్పముఁ ద్రుంచిన, కరణిని త్రుంచె నది ♦ వాని కర ఖడ్గంబున్. ౧౩౬౬

తే॥ విలయవహ్ని యాఱఁగ నూర్పు ♦ విడుచు కుంభ, కర్ణుఁ డప్పుడు తనచేతి ♦ ఖడ్గమల్లి
యున్నదన వేఱుఖడ్గంబు ♦ నూని ముగిసె, ముగిసె రాఘవుఁడని యెదు ♦ రుగను నడచె.

తే॥ చేతఁబట్టి పట్టక మున్నె ♦ శిత శరమున, నరిగ కరవాలు రెండును ♦ విఱుగఁగొట్టి
కంకటము చొరఁ గ్రూరాంబ ♦ కంబులేసి, యొడలు చలియింపఁ జేసె న ♦ ప్పుడమిఱేఁడు.

క॥ చారులచే జరుగు సమా, చార మెఱిఁగి రావణుండు ♦ సత్వరమున దే
వారులఁ బెక్కురఁ బంపెను, వారక తమ్మునకుఁ దోడు ♦ పడ నవ్వేళన్. ౧౩౬౭

తే॥ దానవుని చంప నిదె మంచి ♦ తరుణమనుచు, మదిని రాముఁడు తలఁచిన ♦ యదనునందె
వచ్చె సేనయుఁ; జెడుగులు ♦ వచ్చినపుడ, వచ్చి తోడ్పడు సత్కర్మ ♦ ఫలములట్లు.

తే॥ నాల్గు విధములొందినపదు ♦ నాల్గుకోట్ల, బలమువచ్చి దానవునికా ♦ పాడఁ దొడఁగె
వడిగ రండని రాముడు ♦ వారిఁ బిలిచి, తాఁకె మేను పూరింప ను ♦ త్సాహగరిమ.

తే॥ కాలమితియుఁ గాలుఁడు బహు ♦ కష్టము లను, మూఁడు మూలహేతువులె ము ♦ మ్మొనలుగాఁగ
మూఁడులోకంబుల జయింప ♦ మూలమైన, శూలమును కుంభకర్ణుఁ డ ♦ చ్చుగ ధరించె.

సీ॥ మండలీకరణ కో ♦ దండుఁడై రాముండు, భండనమున వీడు ♦ భల్లములకు
అట్టలు నటియించు ♦ టా కాదనుచు ద్రాని, మొద్దులనుచుఁ గొండ ♦ బ్రద్దలనుచు
నమరులు తలఁపంగ ♦ నాడెఁ గబంధముల్, శిరముల కుప్పల ♦ చ్చెరువు నించె
ద్రయ్యంగఁబడనివి ♦ రక్తంబుచే నీడ్వఁ, బడనివి తలలతో ♦ వెడలునవియు

తే॥ నిలిచియున్నవియును తూలి ♦ నిలుచునవియు, జీవములతోడ దురమునఁ జెలగు ♦ నవియుఁ
బాఱిపోవునవియుఁ గానఁ ♦ బడవు వెదకి, చూచినను మందునకు రణ ♦ క్షోణియందు.

తే॥ మొగము లగలంగఁ బ్రేవులు ♦ దిగఁ బడంగ, రదనములు వ్రీలమావటీం ♦ డ్రకను మించి
సుడిసి కూలునవియె కాక ♦ చూడఁజూడ, మదముతోఁబోవు హస్తు ల ♦ మ్మహిని లేవు.

తే॥ చక్రములు వ్రీలఁ డెక్కెముల్ ♦ జాఱ నిరుసు, లూడ ముఖభాగములు సొంపు ♦ ఏడ హారులు
గూల రక్త మేదో మాంస ♦ జాలమందు, మునిగినవి కాక తిరుగు స్యం ♦ దనము లేదు.

చ॥ పదములు కంఠముల్ తునిసి ♦ వ్రస్సిన పొట్టలతోడ హేషలుం
గుదివడ హత్తి పీనుఁగుల ♦ కొండల కొమ్ములఁబట్టు నెత్తు పె

ల్లిదముగఁ బొఱఁగా నుడుల ♦ లీనములై పరుగాడుఁ గాక యొ
ప్పిదముగ సంగరస్థలిని ♦ వెళ్లు తురంగము లేదు చూడఁగన్.

ఉ॥ రాముని యస్త్రనైపుణి తి ♦ రంబు నిరూపణ చేయు పెట్లగున్
నేమముతో రణంబుగను ♦ నిర్జరులున్ గలనం గనంగలే
కామెతసేయఁ జూచి రసు ♦ రాలికి స్వర్గమునందు, భర్తలన్
ప్రేమను రోయు కాంతలును ♦ వేసరి కాంచిరి నెత్రుటేళ్లనే. ౧౩౭౭

మ॥ తపనుం గాంచిన మంచుపోల్కిఁ జెడియెన్ ♦ దైతేయసైన్యంబు వే
లుపులున్ మిక్కిలి యుల్లసిల్లి రసురుల్ ♦ దుఃఖింపఁగా లోక సం
తపనుండౌ దనుజేంద్రు తమ్ముఁడొకఁడై ♦ దర్పంబుతో నిల్వఁగాఁ
గృప యేపారఁగ రాఘవుండు గని ప ♦ ల్కెం బెంపు దీపింపఁగన్

మ॥ వినుమా సాయుధసేన గూలె ననిలోఁ ♦ బెంపేది యొక్కండవై
కను మేలున్నదె? మా విభీషణునకుం ♦ గారంపుఁ దోఁబుట్టువౌ
టను గావించెద జీవదానమును నీ ♦ టం జేరెదో? క్రమ్మఱం
జనుదెంతో? మఱి యిప్పుడే రణమునం ♦ జత్తో? వివేచింపుమా!

ఉ॥ తక్కులు వీడలేక పిన ♦ తమ్మునిచేఁ బిలిపింప రాక లోఁ
జిక్కితి కాలు నానతికి ♦ జీవితకాలము రాజ్యభోగముల్
దక్కనివయ్యెఁ దెల్పి ఫల ♦ దంబగునే భువి మూర్ఖబుద్ధికిన్?
దక్కక నీమదిం గలుగు ♦ దానిని దెల్పుము రావణానుజా! ౧౩౮౦

చ॥ అనవుడుఁ గుంభకర్ణుఁ డను ♦ నక్కకులంబున నుద్భవించి పెం
పును జయ శీలముల్ నయము ♦ పోఁడియుఁ బాడియుఁ గల్గు మీరు మా
యనుజకు ముక్కు గోసితిరి ♦ యట్టులె నాకు నొనర్చినార లే
యనువున నీమొగంబు గొని ♦ ప్రాణముతో దుత నుందుఁ జెప్పరే?

శా॥ మాచే వేల్పులు దుస్థితిం బొరయ దు ♦ ర్మానంబు పాటించుచున్
నీచత్వంబిది సీత వీడుమనుచున్ ♦ నీతుల్ ప్రసంగించియున్
నాచే నన్నకు నొవ్వికూడదను వి ♦ న్నాణాంబుతో వచ్చియున్
మీచే నిట్లయి వెండియున్ మరలఁగా ♦ నేరన్ ద్రపాహీనతన్. ౧౩౮౨

శా॥ మీ మస్తంబుల దీర్ఘబాహువుల భూ ♦ మిం గూల్చి మాయన్నకుం
బ్రేమంబారఁగ సీత నిత్తు ననుచున్ ♦ బీరంబుతో వచ్చి సు
త్రామాదుల్ కని కేరడింప వినమ ♦ ద్వక్త్రంబుతోఁ జెల్లెలిన్
సోమింపం దనుజేంద్రు సన్నిధికి న ♦ క్రుల్ గార్చుచుం బోదునే?

శా॥ ఈవిట్లాడఁగనేల? ధీరుఁడవు గా ♦ వే? మానముం బొందవే?
నేవాధర్మ మెఱుంగవే? యలుపులుం ♦ జిత్తంబునన్ మెత్తురే?

నావాక్యంబులు విన్మ మీశిరములన్ ♦ ఖండించియుం బిమ్మటన్
దేవారాతి పురంబుఁ జేరఁదగునే ♦ తేజోవిహీనుండనై ? ౧౩౮౪

మ॥ అనుచున్ శూలము డాకరంబునకుఁ దా ♦ నంకించుచున్ ధాత్రి క
ద్దునఁ ద్రేవుల్ పెకలించులీల వలచే ♦ భూధ్రంబుఁ గైకొంచు రా
మునకున్ సూటిగ వైవ నాతఁడును దు ♦ ర్ముం జిందసీకుండఁగాఁ
దునియల్ చేసి త్రిశూలమున్ శకల సం ♦ దోహంబుగా వ్రీలిచెన్. ౧౩౮౫

మ॥ కడలిం ద్రావఁగ మిన్నుగూల్ప ఘన ని ♦ ర్ఘాతంబులం గాల్పగాఁ
బుడమిం జీల్పఁగ మేరువుం దొలువఁగా ♦ భూలోకముం దాఁటఁగా
నడర న్నేర్చిన రామబాణతతి యా ♦ ర్యానాయకుండిచ్చు నై
తొడుగున్ వ్రీల్పఁగఁ జాలదయ్యె మదికిం ♦ దొడ్డయ్యెఁ దచ్చిత్రముల్

ఉ॥ రాము నమోఘ బాణములు ♦ రాజ కిరీట నభేద్య వర్మమున్
స్థేమముచేతఁ దాఁకియును ♦ చీల్పని హేతు వెఱింగి యంత సు
త్రామనుతుండు రాఘవుఁడు ♦ రౌద్రమహాస్త్రము మంత్రయుక్తమై
భీమబలంబునం దిగిచి ♦ భేదిలనేసెఁ గపుల్ చెలంగఁగన్. ౧౩౮౭

క॥ ఆపగిది మఱువు చెడఁగాఁ, గోపంబున నినుపకట్ల♦గుదియంగొని యా
టోపమున రావణానుజుఁ, డేపడఁచెద నంచుఁ గాలి♦నిలకుం దాంచెన్. ౧౩౮౮

తే॥ పరవినవి వేయిపడునవి♦పరఁగ వేయి, తొలుచునవి వేయిపొడుచుచుఁ♦బొలుచు వేయి
యిషువు లీరీతి ముసర లె♦క్కిడక భీమ, బలుఁడు తిరిగెను తర్జన♦భర్జనముల.

తే॥ వీనిచే దండముండిన♦సేన బ్రదుక, దనుచు నొకపెట్టఁ బదియమ్ము♦లంటనేసి
తుండములుసేయ వాఁడుమా♦ర్తండుడాలు, గలుగుడాలునుకత్తియుఁ♦గడఁకఁదాల్చి.

తే॥ జడియఁజేయఁగఁగోఁతుల♦దడముకలఁగి, పిక్కబలముచూపిన రాము♦విభుఁడు కాంచి
దనుజు బాహుదండం బడి♦దంబుతోడఁ, దెగిపడఁగనేసెఁ బ్లవగులు♦ త్రేకమొంద.

తే॥ తుదకుదుష్కర్మములునించె♦దుఃఖములను, ముదమునిండించెసత్కర్మ♦ములునిజంబు
లంకకును రావణునకు బ♦లంబుపేరి, చేయి తెగ రాక్షసులు కాంది♦శీకులైరి.

తే॥ తెగని చేతితోఁ దెగిన చే♦తిని భరించి, గర్జనముతో నసురవైవఁ♦గపులు దాని
క్రిందఁ బెక్కండ్రు మడిసిరి♦కికురుమనక, దుష్టుచెంత నెట్లుండిన♦దోసమె కద ?

చ॥ కడఁకను రాముఁ డక్కపి ని ♦ కాయముఁ గాచుచునుండఁ గాలుఁడే
కడిగొనఁ జూఱలాడుక్రియఁ ♦ గ్రందుగఁ గూలుట గాంచి సైన్యముల్
మడియును వీనిచే నిమిష ♦ మాత్రములోనని త్రుంగకుండఁ బై
నడరిన చేతికంటెఁ దెగి ♦ నట్టి కరంబున కల్కి రెల్లరున్. ౧౩౯౪

ఉ॥ తక్కిన వానరుల్ చెదరి ♦ తాఱఁగ దూఁకెడి రక్తనిర్ఝరుల్
మిక్కిలి పీన్గులం దిగువ ♦ మింటఁ జరించు సురాళి భీతిమై

దిక్కఱి పాఱ లంకఁగల ♦ ధీరులుఁ దక్కినవారు దిగ్భ్రమం
జిక్కఁగ రక్కసుండు రఘు ♦ శేఖరుమీఁదికి దాఁటె గ్రద్దనన్. ౧౬౯౫

చ॥ మఱియొక చేయిగూడఁ దును ♦ మందగు నంచు సురాళి కోరఁగా
వెఱపున డాఁగియున్న జము ♦ బిమ్మిటిదీఱ విజేత రాఘవుం
డఱనెల తూపులన్ దనుజు ♦ హస్తముఁ ద్రుంచి పయోధిలోపలన్
మఱియొక సేతువో యనెడు ♦ మాడ్కిఁ బడం జనఁ గొట్టెదిట్టయై.

క॥ భుజకీర్తి పాఁపఱేఁడుగ, భుజమే కవ్వముగ వేలు♦పులు మును జలధిన్
గజిబిజిఁ జిలుకఁగఁ గొను నా, రజమగు మల యనఁగఁ గలఁచి♦రాయిడిచేసెన్.

తే॥ జలధిపై చుటచేతఁ బ♦క్షములతోడఁ, బరగువాఱుటచే రాము♦పంపుసేత
చేతి శరములు గరుడుని♦చనసెఁ గుంభ, కర్ణు భుజము మందరగిరి♦కరణినొప్పె.

మ॥ కనకాద్రీంద్రముఁ దాల్చి తమ్మటముగాఁ ♦ గావించి మేఘంబుఁ గొ
ద్ప్నుగాఁజేసి త్రివిక్రముండు కడఁకన్ ♦ బ్రమోఁగింపఁగా లేచు పెం
దొని నా గర్జిలు కుంభకర్ణుఁ డొగి మే ♦ దోమాంస చర్మాస్థు లొ
క్కనవై దమ్మగఁ జేయ వానర నికా ♦ యంబుం గలంచె న్వడిన్.

మ॥ కరువై యొక్కటఁ బంచభూతములు త్రుం ♦ గంజేయఁగా రాని పె
న్నురువుం గైకొని ఘోరమై యమరి ప్రా ♦ ణోత్క్షేపముం జేయు వాఁ
డురు కుప్యద్యముఁ బోలువాఁడు రిపుధై ♦ ర్యోత్సాహ సంహారి యా
సురవిద్వేషి పదంబొకండు తునిమెన్ ♦ సూర్యాన్వయుం డయ్యెడన్.

తే॥ దంతములు రిక్కలంబోలెఁ♦దనరివెలుఁగఁ, గ్రొన్నెలంబోలి వెల్లనై♦కోఱ లలర
నెత్తురున నెఱ్ఱనగు నోరు♦నిగుడఁదెఱచి, యొంటికాలను డాసెను♦కుంటు చసుర.

తే॥ ఒంటికాలితో నాకస♦మంటఁ బెరిఁగి, ప్రక్కవారిని నోటితోఁ♦బట్టి మ్రింగి
వాత్యవలె సుడియుచుఁ బైకి♦వచ్చువాని, రెండవపదంబు రఘువరే♦ణ్యుండు నఱకె.

చ॥ కరములతోడఁ గాళ్లు తెగి ♦ కాశ్యపి గ్రుంగఁగ దొడ్డకొండ వై
ఖరిఁ బడు కుంభకర్ణు ఘన ♦ కాయమునందున రెండువేల యం
పఱు వడిఁ దూఱిపోవ నొక ♦ మాత్ర చలింపక నోటనొక్క భూ
ధరముఁ బెకల్చి యూఁదె భయ♦దంబుగ వానరసేన నీల్గఁగన్. ౧౭౦౩

తే॥ పెద్దకొండను నాల్కతోఁ♦దద్దయెత్తి, పొలికలను మాఁడఁగా శ్వాస♦బలముచేత
విసరివైవ రాముఁడు కేలు ♦ విదిరిచికొనె, వీని బల మపారంబని♦వింతనొంది.

మ॥ దనుజుం డంతటఁ జింతనొంది యవురా ♦ దైత్యారి విల్విద్దె నే
ర్పునకున్ వేవురు రావణుల్ గలిగినన్ ♦ బొందారఁగాఁ జాల రే
నును కాల్సేతులు కోలుపోయితిఁ దుదిం ♦ దోడ్పాటు సూపంగ నే
యనువుం దోఁప దిఁకేమనంగ నగు దు ♦ ష్టాశా మహారోగముల్ ?

తే॥ అన్నకుఁ గీడు పడు నాస♦యడుగువట్టు, దిక్కులకుఁ జాఱు నెత్తురు♦దిక్కుచూచి
ఎదుట నిలిచిన శ్రీరాము♦నెనఁగఁ జూచి, కుంభకర్ణుఁ డిట్లని పల్కెఁ♦గోప ముడిగి.

మ॥ ఒక పారావత పక్షికై యొడలి మాం♦సోత్కృష్ట భాగంబు ను
త్సుకతం గోసి తరాజునం దిడు యశో♦ధుర్యాన్వయుంబందు పెం
దిక నొప్పారిన రామచంద్ర! విను దై♦తేయాపధర్మంబు లో
ప్పక మీ పాదము లాశ్రయించు ననుజుం♦బాలింపుఁడీ వేఁడెదన్.

ఉ॥ క్షత్త్రియరూపముం గొని జ♦గంబున స్రుక్కిన సత్యధర్మముల్
ధాత్రిని నిల్పఁబూనిన స♦దాతన దేవ! మదీయ జాతికిం
బాత్రములౌ నధర్మములఁ♦బాల్పడకుండిన నాదు తమ్ము నీ
పుత్త్రునిగాఁ గృపం దలఁచి♦పోషణసేయఁగఁ గేలు మోడ్చెదన్ ౧౮౦౮

ఉ॥ నిన్ను జయింప నెంచు రజ♦నీచరనాయకుఁ డీ విభీషణున్
బన్నుగఁ జెట్టఁగోరు పగ♦వాఁడని యెంచినవాఁడు తమ్ముఁడం
చెన్నక చిక్కనేని వధి♦యింపఁగలం డవధానబుద్ధిమైఁ
దిన్నగఁ గావుమంచు మఱి♦తేపకు వేఁడి నమస్కరించెదన్. ౧౮౦౯

తే॥ దుర్గుణుండు రావణునకు♦దొరకనీక, నీదు తమ్ముని హనుమంతు♦నియతితోడఁ
దోడుగానుంచి సతతంబు♦వీడనీక, యుండునట్లుగఁ గృపసేయు♦మో గుణాఢ్య!.

మ॥ వినువీథిం గను దివ్యులుం దపసులున్♦విగ్రుండు వీఁడంచు వే
డ్కను వీక్షింపకమున్నె నీశరమునన్♦గంఠంబు ఖండించు పృ
థ్విని ద్రోపాడక సాగరంబునఁ బడన్♦వేయింపు మీ యిద్దియే
నిను నేఁగోరు వరం బటంచుఁ గరుణా♦సిర్ణిద్రుఁ బ్రార్థింపఁగన్. ౧౮౧౧

మ॥ వరముం గోరఁగఁ ద్రోవరాదని యొకే♦భల్లంబునం ద్రుంచి త
చ్ఛిరమున్ సంద్రమునందు ద్రోచి మునుఁగం♦జేసెన్ రఘుస్వామి యా
శరధి స్నీరము నాల్గుదిక్కులకు హే♦చ్చన్ లేచెఁ దర్వాత నా
చెరమల్నిండ మునింగి కాడ్పుఱచె నా♦శీర్షంబు శైలంబు నాన్. ౧౮౧౨

క॥ పాడిరి రంభాదులు సుర, లాడిరి వీడిరి భయంబు♦నవనీ జనముల్
కూడిరి ప్లవగులు రాఘవు, వాడిరి రక్కసులు తోడు♦పాడగు కతనన్. ౧౮౧౩

౧౬ మాయా జనక పటలము. (౯౪)

మత్త॥ కుంభకర్ణుఁడు సంగరస్థలిఁ♦గూరు సక్రమ పద్ధతిన్
రంభఁ గూడఁగఁబోయె నయ్యెడ♦రావణుం డొక వంచనా
రంభుఁడై కడు కావరంబున♦రామ లోఁగొన నెంచి సం
రంభ మొప్పఁగఁజేసె మాయల♦రాశి యొక్కఁడు తోడ్పడన్. ౧౮౧౪

తే॥ పంక్తి మస్తకుండు రహస్య♦భవనమందు, కూరుచుండి మహోదరుఁ♦గూర్మిఁజూచి
నేఁడు సీతను పొందినా♦నెగులు దీర్చు, కొను నుపాయమొక్కటి దెల్పు♦మనుచుఁగోర.

ఉ॥ ఎంచి యుపాయమొండు వచి ♦ యించెద జానకి తానుగాఁగ మ
న్నించి వరించునట్లు జత ♦ నించెదఁ జూడు మరుత్తుఁబిల్చి కా
వించెద వానికిన్ జనకు ♦ వేషము వానిని కట్టితెచ్చి చె
ప్పించెద నంతమీఁదఁ జెలి ♦ తప్పక నిన్నుఁ గ్రహింపదే ప్రభూ! ౧౪౧౬

చ॥ అని యతఁడాడఁ బంక్తిముఖుఁ ♦ డాదట వానిఁ గవుంగిలించి నీ
వనినది లెస్స వాని వడి ♦ నచ్చటికిం గొని తెమ్మటంచుఁ దాఁ
జనియెఁ గుల ద్వయంబునకు ♦ జానగుదివ్వె పతివ్రతా మణిన్
జనకజ నిట్లు లోఁ గొనఁగఁ ♦ జాలెదనంచు విమోహచిత్తుఁడై. ౧౪౧౭

తే॥ మకుట పంక్తులు లేయెండ♦మలసికాయ, నిరులఁ దోలు నంగదముల♦దరుల మెఱయు
సరులు కఱిమల సెలయేటి♦సరణిఁ దోఁప, మదగజంబు సిగ్గిలఁ బంక్తి♦వదనుఁడరిగె.

ఉ॥ దీపము వేఱుదీపమును ♦ దెచ్చెడు లీలల నొప్పి చంచలన్
ద్రోపుడు నేసి మేఖలల ♦ తోడఁ గృశత్వము నొందు మధ్యముల్
తేపకు సంచలింపఁగ మ ♦ దించు పయోధర భారవేదనన్
దావున దేవకన్యకలు ♦ తత్పరతన్ వడిఁదేర దీపముల్. ౧౪౧౮

ఉ॥ రాగముతోడ మాట లధ ♦ రంబు ప్రవాళముతోడ స్త్రీల మే
ల్బాగుల నెల్ల నొక్కయెడ ♦ లాలితరీతిని దెచ్చి బ్రహ్మ సం
యోగము గూర్చె నా నలరు ♦ నుర్విజ కొక్క బెడంద గూర్ప ను
ద్యోగము నేసి దైత్యవిభుఁ ♦ డుగ్మలిఁ గాంచి మనంబు చల్లఁగాన్.

చ॥ అట నొకపైఁడి పీఁట నల ♦ రారి వెలందుల నొలకన్ని దో
స్తటములె లేమలంబలె నె ♦ సంగఁగ డాపలి యూరు పీఠి మీఁ
దటఁ గుడికాలు సేర్చి యడి ♦ దంబు నొఱం దగిలించి రావణుం
డిటులను వేఁడికో లెడఁద ♦ నేచి మొగంబునఁ దొంగలింపగన్. ౧౪౨౦

ఉ॥ ఎన్నఁడు నీదు లెంకపయి ♦ నీడిత సత్కృప యుప్పతిల్లు నిం
కెన్నఁడు భానుతోఁ జనక ♦ యిందుఁడు వేఱయి యుల్లసిల్లు నిం
కెన్నఁడు మారుబాణముల ♦ యేపు లడంగు మదీయ భాగ్యమా!
మన్ననసేసి కావు మను ♦ మానము మాను మనంబు లోపలన్. ౧౪౨౧

ఉ॥ వంచితుఁడైన యేను చెలి ♦ వాలకమై విమయుక్తమా సుధన్
మించి భుజింపఁ గోరితిని ♦ మీఁదట నాఁటికి నాఁటికింతో క్షీ
ణించి మనస్సు సర్వమును ♦ నీఁగెను నీపయిఁ జింతనంబు చా
లించి మరింప జంకెదఁ జ ♦ లించెద మాటికిఁ దత్తఱించెదన్. ౧౪౨౨

ఉ॥ పోలితి నోడితిన్ శరణు ♦ సొచ్చితి వేఁడితిఁ గావుమంచు నా
పాలిటి భాగధేయమయి ♦ వంతలఁ గూర్పఁగనేల ? చల్లనౌ
గాలియె కాల్చెఁ బుష్పములు ♦ కాటులు వైచెను చందనం బహిం
బోలెను కష్టముల్ తెలిసెఁ ♦ బోఁడిమి నెయ్యవి సేయఁజాలవో ?

ఉ॥ కోరిన స్త్రీలనెల్ల నొక ♦ కోమలిఁజేసి యభిఖ్య లెల్ల నీ
పేరుగఁ జేసి నా కనుల ♦ వేలొకచోటికిఁ బోకచేసి యా
మారుని రేఁచి తన్నిశిత ♦ మార్గణ ఘాతములెల్లఁ గూర్చి న
న్నారక యేల కాల్పుఱతు ♦ వో శరణంబని వేఁడుచుండినన్. ౧౫౨

ఉ॥ శంకరుఁ డాదిగాఁగలుగు ♦ సర్వజనంబులు భీతినొంద న
ల్వంకల గెల్చి లోకములఁ ♦ బాలనసేయు వలంతి నేను మీ
నాంకుని కగ్గమై యొకవ ♦ రాంగి పయిం దలకొన్న ప్రేమయే
డింకఁగఁ జేయ నాదగు క ♦ డింది మగంటిమి పొచ్చెమొందదే ?

ఉ॥ వాడి కృశించు జీవములు ♦ బాధల నొందుచుఁ బెక్కు నాళ్లుగా
నాడిక నొందఁ గుక్క బ్రదు ♦ కంచు వచింపదె లోకమెల్ల వె
న్నాడక ? పండిత ప్రభు ల ♦ సంగదశల్ పదియంచుఁ జెప్పరే
నోడక పల్కువాఁడ శత ♦ మో వెయియో యని యంబుజాననా !

మ॥ పరఁగన్ ధర్మమె ప్రేమచే నొసఁగు సౌ ♦ భాగ్యంబ! మజ్జన్మ నం
తరణీ ! నాయభిమానముం జెఱుప నీ ♦ తారుణ్యసంపత్తి యే
కొఱయున్ లేని శవంబుపోల్కినయితిన్ ♦ గుంభస్తనీ ! యింక నీ
వరదివ్యామృతసేవచే బ్రదుకఁగా ♦ వాంఛించితిం బ్రోవవే. ౧౪౩

మ॥ నిజమూహింతము తొర పెన్ వలపునన్ ♦ రేరాయనిం బొంది భా
వజ సౌఖ్యంబులఁ దేలదే ? చెడియెనే ? పాపాల పాలయ్యెనే ?
త్రిజగన్మోహిని ! నా మనోరుజల వే ♦ తీర్పంగదే ! వేరు మం
దు జగంబందునలేదు నీవెగతి వా ♦ దుల్మాని ప్రార్థించెదన్. ౧౪౪

క॥ అనుచు దశాస్యుఁడు వక్షం, బును బాహువులిర్వది పది♦ముకుటంబులు భూ
మినిచేరఁ జాఁగిలంబడి, యెను మడఁతుల కేరి కేని ♦ యెదలు ద్రవింపన్.

## —: సీత రావణుని దూషించుట :—

మ॥ మృదుశీలాత్మక సీత లేడి పులి బా ♦ రింబడ్డ యట్లై కడుం
బెదరెం గంపము నొందె మ్రానుపడియెం ♦ బెగ్గిలై నట్లయ్యె వీఁ
డదయుండై నను చంప వచ్చిన సరే ♦ యాఁగాక మద్భావముల్
పదినే దాఁపఁగఁ జాలనంచుఁ దృణముం ♦ మాటొడ్డి తానిట్లనున్.

శా॥ నీ చేష్టల్ కడునింద్యముల్ కృపణముల్ ♦ నిక్కంబు దుష్టాత్మ! యీ
నీచోక్తుల్ వచియింపఁగాఁ దగవు దు ♦ ర్నీతుల్ చెడంద్రోచురా
నీ చుట్టాలును నీవు నేఁటిదనుకన్ ♦ నిట్రాల్లు నా నుండఁగా
నాచెన్నారు పతివ్రతాత్వ ఫల ము ♦ న్నన్ మండనా? మాఁడనా?

మ॥ తరుణీ ధర్మము నేను కాచి ఫలమే? ధర్మంబు స్థాపింపఁగా
ధరణీభారము మాన్ప రామవిభుఁ డు ♦ ద్దండించియున్ లాభమే?
విరివారం బడినోళ్లు నీకుఁ గలుగన్ ♦ విద్దూరంపుం బల్కులన్
భరమయ్యెన్ విననుండఁగాఁ బలుకవో! బాధింపవో? చంపవో?

మ॥ తపనున్ వెన్నుని కార్తికేయు శివు ధా ♦ తన్ జిష్ణుఁ జండాంశు ని
త్రపులంజేసి జయించినాఁడనని ప్ర ♦ జ్ఞల్పల్కుచున్నావు నా
తపముల్ పండిన పండుఁ శ్రీరఘుకులో ♦ త్తంసంబు దుర్వార బా
ణ పథి న్నిల్వఁగ లేక పాఱితివి మా ♦ నంబొందు నీ కున్నదే? ౧౪౩౪

శా॥ బన్నంబందుచుఁ బస్తులం బడి యశో ♦ భావంబు వోనాడి నా
న న్నగ్గాడి నికృష్టనై నిలుచు దా ♦ నంగాను నిర్దుష్ట భా
స్వన్నానాగుణ భూషణుండగు రఘు ♦ స్వామిన్ మహా వాంఛతోఁ
గన్నారం గను భాగ్యమబ్బు నను వే ♦ డ్కం దాల్చితిం బ్రాణముల్.

శా॥ ధీరోదాత్తుఁడు లక్ష్మణుండు రణ ధా ♦ త్రిన్ నిన్ను వెన్నిచ్చి యీ
సారిం బాఱఁగనీక యడ్డి నిలుపన్ ♦ త్వన్మా భర్త నీ శీర్షముల్
వీరత్వంబునఁ గూల్చి నీయనుఁగులన్ ♦ వేఁటాడి యేకైక దో
స్సారుండై వెలయంగఁ గాంచు ఘనకాం ♦ క్ష న్నిల్పితిం బ్రాణముల్.

మ॥ కరుణాజీవము కంజనేత్రములు జో ♦ కంగల్గి హస్తంబులన్
శరముల్ విల్లు ధరించి యెల్లర హృద ♦ బ్జాతంబులన్ లాగు క
ర్బుర బృందార్క వనాంతక ప్రబల జీ ♦ మూతంబు గాఁ బొందు గాం
చి రహింబొందదు మానసాంబుజమునన్ ♦ సీతామయూరం బొగిన్

మ॥ కడఁకన్ జానకి యిట్లన న్నమలి క్రిం ♦ గం దగ్గ కోపంబుతోఁ
పుడమిం దాఁచుచుఁ బంక్తికంఠుఁ డను నో ♦ పూఁబోఁడి! నన్ గెల్చి నీ
పెడఁదల్ పాపిన మీఁద రాఘవునితోఁ ♦ బ్రేమంపు జీవంబు లో
క్కఁడుగా వాదెదుగాక యంచు నగ ని ♦ ర్ఘాతంబు చందంబునన్

చ॥ నరసుర నాగ తాపసులు ♦ నా క్రుధకుం గుఱి యైనవార లె
వ్వరు మని వారు? వెన్నునిగ ♦ భావన సేయుచు నీవు మోదముం
బొరయుచు నుండు మానవుఁడు ♦ పూర్తిగ నీమది నాటియుండుచో
మురియలు చేసి తీరుదును ♦ ముగ్ధవు నా బలమున్ గణింతువే? ౧౪౩౫

ఉ॥ కోఁతులు వార్ధిఁ గట్టినవి ♦ కోటను పట్టుగ ముట్టడించె దృ
గ్భృతిగఁ బోరె రక్కసుల ♦ గీటడఁచెం గొఱ యేమి యంచు నీ
చేతములోన సమ్మదము ♦ చెందెదవే? శలభంబు లగ్నిలోఁ
బాతము నెందు లీలఁ బడ ♦ వా? మఱి నాదు ప్రతాప కీలలన్. ౧౪౪౦

మ॥ చని సాకేతమునందు రాజకులముల్ ♦ సంపూర్తిగాఁ బట్టి బం
ధనముల్ సేసిరొ తెండు తప్పినఁ దలల్ ♦ దర్పించి ఖండించి తెం
డని యాదేశ మొసంగి పంపితిని దై ♦ త్యవ్రాతముల్ దద్విధం
బున నీతండ్రి వసించుచుండు పురికిం ♦ బుత్తెంచితిం గోమలీ! ౧౪౪౧

చ॥ అని యసురేంద్రుఁ డాడ జన ♦ కావని నాథుని పుత్త్రి నన్ను వం
చనమున నిట్లు సేయు గుణ ♦ శాలికిఁ జేయఁగ రాని దుండునే?
జననిని చంపు పాపికిఁ బ్ర ♦ జల్ సొరకాయలు గారె? యంచు న
గ్నిని వడి మ్రింగి క్రక్కు కర ♦ ణిం దపియించెను నిశ్వసించుచున్. ౧౪౪౨

ఉ॥ నన్నిటులార్చి త్రిప్పు విధి ♦ నమ్మిన బంట్లని మిమ్ము త్రిప్పఁగాఁ
బన్నఁగఁ గష్టజాలములఁ ♦ బాల్పడఁ జేసెదు మీ రలంతులే?
అన్ని యధర్మముల్ మదికి ♦ న్యాయముగాఁగనె మీకుఁ దోఁప నే
మెన్ని ఫలంబు నుంత వహి ♦ యించునె? దుష్టుల కేవి ధర్మముల్?

సీ॥ అని కన్నులందు ని♦రంతర ధారఁగా, బాష్పము ల్గార్చుచుఁ♦బరితపించు
నుగ్మలి యెదుట మ♦హోదరుండు మరుత్తు, జనకునిగాఁ జేసి♦వెనుక కీడ్చి
చేతు లిఱియఁగట్టి♦చేడ్పడఁ దెచ్చి ని, ల్పఁగఁ గాంచి సీత కే♦లను విదిర్చి
నేత్రముల్ మోఁదికొ♦నియె నిప్పు ద్రొక్కిన, విధిని పాదంబులు♦విహ్వలించ
తే॥ మానసంబు శరీరంబు♦మాడ్కి వేఁగె, నిలను పడియెను పొరలె గొం♦తెత్తియేడ్చెఁ
బలవరించెను వడఁకెను♦కళవళించె, నేమి సేయంగఁగలుగు న♦య్యిగురుఁబోఁడి?.

ఉ॥ హాయను దైవమా యను మ ♦ హాపద రాదగునా యనున్ వశం
బా యను ధర్మముం జెడియె ♦ నా యను సత్యము మాఁడి బూది యా
నా యను మాయతే బలిసె ♦ నా యను నాపద నుండి ముక్తి లే
దా యను లోకమెల్ల విల ♦ యంబు భజింప శపింతునా యనున్.

మ॥ జనకా! నాకొఱకై యనేక దురవ ♦ స్థల్ నీకుఁ బాటిల్లనే?
నను గన్నందుల కిద్దియా ఫలము? ధ ♦ న్యత్వంబు ప్రాప్తించె! నే
మనుదానన్ మనుదానఁ గాను బహుదుః ♦ ఖావాప్తి బంధువ్రజం
బునకుం గూర్చినదాన నాయభిజనం ♦ బున్ మెచ్చవచ్చుం గదా?

ఉ॥ పెట్టి భుజించినాఁడవు ని ♦ వేకముతోఁ గ్రమ ధర్మ పద్ధతుల్
నెట్టన యాచరించితివి ♦ నేర్చితి శత్రుల రూపడంపఁగన్

బట్టుగఁ బెక్కు జన్మములు ♦ పారము ముట్ట నొనర్చినాఁడ వీ
కిట్టని బాధలొందఁ బరి♦కించితిఁ గన్నులు కాలిపోవఁగన్ ౧౪౪౯

క॥ పలువిధముల నీరీతిం, బలవించుచు సొమ్మసిల్లి♦పడుచుఁ బొరలుచున్
దలఁకుచుఁ దలరుచుఁ గురరిం, బలెఁ గరుణంబుగను మరలఁ♦బలవర మొందెన్.

తే॥ పాడి దప్పని పార్థివ♦వంశమందు, పొడము నీవు పుత్త్రికలకుఁ♦బుట్టినింటి
వారు చేయంగఁదగు కార్య♦పద్ధతులకు, రామిఁ జూడఁగోరియొ యిటు♦రాక తండ్రి!

ఉ॥ మాయల మందిరంబగుచు ♦ ప్రమాల్చు చెఱం బురుడించు సంసృతిం
బాయఁగలేక యార్తులయి ♦ ప్రార్థన సేయఁగఁ గాచువాఁడు నా
రాయణుఁ డింద్రు విజ్ఞులు ధ ♦ రాస్థలి నా చెఱఁదీర్చి ప్రోచు వా
రేయెడలేరు నాకొఱకు ♦ నెయ్యిన నీ చెఱఁ దీర్చు టెవ్వరో? ౧౪౫౦

చ॥ చెడుగులతోడఁ జేరమిని ♦ చెందెను వైరము దీనికంటె నీ
కడిమిని వీరనాకమును ♦ కాంచిన మేలగు; రాజులందు గా
మిడి వను పేరుతో నడిని ♦ మీఱితి వియ్యాది నన్ను పుత్త్రిగాఁ
బడయు ఫలమ్ము సుమ్ము! సుత ♦ పట్టున నెవ్వరు ప్రమంది రీగతిన్?

చ॥ పలుపులచేతఁ గట్టువడి ♦ భారము మోయుచు దున్ని మోఁదులం
బలువుగఁ బొంది పంకమున ♦ మగ్నత నొందు వృషంబువోలె నే
నలయుచు నుంటిఁ బట్టువడి ♦ నప్పుడె చావమి విక్రయించితిన్
నలువుగ మిమ్ము నారకము ♦ నం బడి క్రమ్మఱ నాకుఁ గల్గునే?

చ॥ చెఱవడి శత్రునాశమును ♦ చేసి ముదంబును పొందుదాననా?
గుఱుతుగ రామపాదములఁ ♦ గోరిక సేవ యొనర్చుదాననా?
చెఱపన చేటనై చెడుగు ♦ చేసితిఁ దండ్రి కులంబుఁ గూల్చితిన్
గొఱవిగఁ గాల్చితిం బతి య ♦ కుంఠిత వంశ విశేష కీర్తులన్. ౧౪౫౩

చ॥ వనమున జీవితేశునకు ♦ వారని వైర మొకండు కూర్చితిన్
జనకుఁడు బంధితుం డయిన ♦ జానుగఁ జూచుచునుంటిఁ బాతకం
బున విలయంబులే కలిగెఁ ♦ బుట్టిన యింటికి మెట్టి నింటికిన్
బనుపడి జీవితంబు నెడఁ ♦ బాయ! నిఁకెవ్వరి కొంపఁ గూల్పనో? ౧౪౫౪

చ॥ క్రతువు లొనర్చి నన్నరుదు ♦ గాఁ గని పెంచిన తండ్రి బాహువుల్
క్షితిలపడంగఁ గట్ట భువిఁ ♦ గూలి యవస్థలఁ బొందుచుండ ని
శ్చితమతిఁ జూచు నేను రఘు ♦ శేఖరు జీవితనాథు నిట్టి దు
స్థితి గనకుండు మున్నగనె ♦ జీవములన్ విడఁజాలనే మొకో?. ౧౪౫౫

సీ॥ జనులారా! వృద్ధ♦జనులార! సోదరు, లార! జనకు దుర్వి♦చార మెఱుఁగ
రేమి? నావలె మీకు♦నిడుమలు గల్గెనే?, రారేల? మరణించి♦నారలేమి?

మేరువు నెక్కి స్వ♦ర్మేదినిఁ బట్టిన, సంకించి యీలంక♦యందు చొరఁగ
సుకరంబు గాదు త♦ప్పక వారు చంపిన, వంచనల్ చేసిన♦వార్తఁ దెలుపు
తే॥ వార లెవ్వరు గలరు మీ♦వలన వేఱు, హనుమయొక్కఁడున్నాఁడేని యె♦ట్లైనఁ దెలియ
వచ్చుఁ దెలిసియుఁ జేయంగ♦వచ్చునేమి? త్రిప్పి దుర్విధి యిట్లు వే♦ధించుచుండ

చ॥ జనకుని దెచ్చినట్టి నెఱ♦జాణ తపంబున మేనువాడఁ జి
క్కిన సుగుణాఢ్యు నబ్బరతుఁ♦ గీడ్పడఁ దెచ్చుటలోన శంకయుం
దనుకునె? యట్టులైన గుణ♦ధాముఁడు రాముఁడు చాలకాల మె
ట్లును బ్రతుకంగఁబోఁ డనుజు♦లుం బడిచత్తురు గుండె వ్రీలఁగన్.

ఉ॥ సేతువుగట్టి లంకఁ బరి♦చేసి యనేకుల దుర్నిశాటులన్
ఘాతకులన్ వధించెనని♦పల్కిన వార్తల నాలకించి నా
చేతమునం బ్రమోదమును♦జెందితి దుర్విధి యిట్లు చేసె వి
ఖ్యాత తపోవ్రతంబులకుఁ♦గల్గిన సత్ఫల మిద్దియే చుమీ! ౧౭౫

చ॥ అని పలవించి రామవిభు♦నర్మిలి ప్రాణము సొమ్మసిల్ల రా
వణుఁడును లోన సంతసిలి♦వారిజలోచన దుఃఖ మోర్వఁ జా
లనిదయి తండ్రి జీవితము♦లం జెడనీయక కోరి కాచి తా
నును సుఖమొందునంచు మది♦నూల్కొన జానకిఁ గాంచి యిట్లనున్

ఉ॥ సుందరి! నిన్ను బొందఁదగు♦చొప్పులకై తలఁపంగరాని యి
బ్బందుల నుంచినాఁడ మగు♦వా! యవి యెల్ల క్షమించి నన్ను నీ
కుం దగు బంటుగాఁ గఁగయి♦కొమ్ము విదేహ ధరాధినాథుఁ జం
పం దలపెట్ట నా భయము♦మానుము నమ్ముము నా వచస్సులన్.

ఉ॥ వంతల పాలుసేయు వల♦వంతలఁ బాపుదువేని చెప్పెదన్
జింతలఁ బాపి నీ జనకుఁ♦జేర్చెద నింద్రుని సింహపీఠిపై
నంతకు మించి కోరిన జ♦యంబునఁ గొన్న సమస్తరాజ్య మొ
ప్పింతును కాలఁ జూపు పని♦వేడ్క శిరంబునఁ జేయుచుండెదన్

చ॥ వలసిన లంక నిచ్చెదను♦వారని సేవధులెల్ల నిచ్చెదన్
లలిత విమానమిచ్చెదఁ గ♦లంగక యిచ్చెదఁ జంద్రహాసమున్
దలఁపునఁ గోరె దెయ్యవి ము♦దంబున నయ్యవి యెల్ల నిచ్చెదన్
గలికిరో! డెంద మిచ్చెదను♦కాదన నీదగు డెంద మిచ్చినన్.

చ॥ పవడముఁ బోలు నోట నొక♦పల్కు ప్రియంబుగఁ బల్కితేని నేఁ
దవిలి మహేంద్రు శీర్షక ము♦దగ్రత దివ్యులు గొల్వఁ దెచ్చి శా
స్త్రవిధి విదేహనాయకు శి♦రంబున నుంచెద సర్వ దిక్పతి
స్తవముల దేవ కామినుల♦దాస్యముఁ గూర్చెద మెల్మి నించెదన్.

ఉ॥ తండిరిఁగన్న తండ్రికిని ♦ తండ్రి విరించియె వచ్చి కూర్మి నీ
తండిరి కోరు కోరికల ♦ దాఁపక యిచ్చు యముండు దాన దా
నుండయి సేవసేయు సుధ ♦ సోదరి లక్ష్మివి నీవు కానిచో
నిండు మనంబుతో సిరియె ♦ నీకును దాస్యము సేయు నమ్మవే.

తే॥ తండ్రికిం గూఁతురైన మా ♦ త్రాన ఫలమె? పొందఁదగు మేల్మిజనకుండు ♦ పొందవలదె?
పరఁగఁ ద్రైలోక్య రాజ్య సం ♦ పదల నొసఁగి, యీవును సుఖింపుమన సీత ♦ యీసడించి.

శా॥ ఈ సౌభాగ్యములెల్ల నొందఁగలవాఁ ♦ డింద్రుండె నిక్కంబు లం
కా సామ్రాజ్యము నా విభీషణుఁడె పేఁ ♦ కంబొందు విధ్వంశమై
వాసిన్ భాసిలు రాము బాణముల నీ ♦ వక్షంబు భేద్యంబు నా
కా సర్వేశుని పాదపద్మములె సే ♦ వ్యంబుల్ జగన్నాశకా! ౧౪౯౯

క॥ బెడిదములగు రామాస్త్రము, లడరి యురముఁ జీల్చి యొడలి ♦ నంతయుఁ బెను జ
ల్లెడగాఁ బొడుచుచు ధర్మముఁ, గడు నేర్పంగలవు నీకుఁ ♦ గర్కశ హృదయా!

తే॥ కాకములు చంచువులతోడఁ ♦ గనులు పొడిచి, తోడఁగలవు; నీవక్షమ్మఁ ♦ దోయజాక్షు
శరము లగలింపఁగలవు; పి ♦ శాచ సమితి, తినఁగలదు నీ శవమ్మును ♦ తృప్తితోడ.

తే॥ క్రూర దంష్ట్రాయుతంబైన ♦ ఘోర మస్తకములు కలన రాఘవ సాయ ♦ కములవలనఁ
ద్రుంపఁబడియె రమ్మనుచు మా ♦ సతి వచించు, వార్త నేఁట జేపట విన ♦ వచ్చు నిజము.

ఉ॥ మాత సుమిత్ర వీర వర ♦ మాతగఁ జేసిన లక్ష్మణాస్త్రముల్
నీ తనుజాతు ప్రాణముల ♦ నీఱుగఁ జేయఁగ వాని మేను సం
ప్రీతిని కుక్కలీడ్వ ననిఁ ♦ ద్రెళ్లితె పుత్రక! యంచు నీవు దుః
ఖాతురుఁ డౌచు ఆోలుటయె ♦ యర్మిలి నే వినఁదగ్గ పల్కుగన్.

ఉ॥ క్రూరుఁడు రావణుం డటులు ♦ కోమలి పల్కుట లాలకించి పె
న్నీరసమెత్తి దంతముల ♦ నీడిచి గీఁటుచు సీతపైఁ బడన్
దారున లేవఁగా నెదురు ♦ దాసి మహోదరుఁ డీమె తండ్రియే
తూఱి వచింప నమ్మతిలుఁ ♦ దొందర యేలని క్రమ్మఱించుడున్

తే॥ చచ్చినట్టులుండిన మాయ ♦ జనకుఁ డపుడు, మెల్లఁ దలయెత్తి యిట్లను ♦ తల్లి! వీని
వేఁడికోలును త్రోవంగ ♦ నాడితేని, కులముతో నన్ను గూల్చిన ♦ కొలయగుఁ జుమి!

చ॥ సిరియును లోఁగి పెక్కురను ♦ చెందదె యుమ్మడిగొడ్డు పోలికన్
వెరవిఁడి! నీకునై యుసురు ♦ వీడుచునుంటిని బందినై వృథా
మరణము నొందనేల? మది ♦ మన్ననచేసి సురేంద్రనాథుఁడై
పరఁగిన వీనిఁ జేకొనుము ♦ పాలనసేయుము మమ్ము మేలుగన్.

చ॥ కరుణను నన్ను నాకులము ♦ గగ్గులకాడుగఁ జేయకుండ ని
బ్బరమునఁ బ్రోచి యగ్గలపు ♦ భాగ్యములన్ సమకూర్చి నీచెలిన్
విరియఁగఁ జేసికొంచు ఘన ♦ విశ్రుత సౌఖ్యము లెల్లవేళలం
బొరయుమ యంచు నయ్యలరుఁ♦బోఁడి పదంబుల వ్రాలె గ్రక్కునన్.

చ॥ చెవులకు హస్తముల్ కదియఁ ♦ జేరిచి జానకి నిశ్వసించి యె
క్కువ దిగులూని దుఃఖమును ♦ కోపముఁ బైపయి నగ్గలింప మై
రవులఁగఁ దండ్రియేని తన ♦ ప్రాణము లెచ్చుగ నిచ్చగించి యీ
పవిదిని పల్కఁ డియ్యది సు ♦ బద్ధము గాదను నిశ్చయంబుతో. ౧౪౭౫

—: సీత మాయాజనకుం బదరుట :—

చ॥ తగవు నశింప శీలము కొ ♦ దంబడ క్షాత్రము కూలిపోవఁగా
జగతిని నిందమోవ ఘన ♦ సత్యము చావఁగ సచ్చరిత్రముల్
తెగులుగొనంగ గౌరవము ♦ తీఱఁగ బుద్ధియు మాఁడఁగా నిటుల్
తగిలి వచించు నీవు నొక ♦ తండ్రివె? ధూర్తుఁడ వౌదు దుర్మతీ! ౧౪౭౬

చ॥ కులము నశించినన్ గతులు ♦ గూలిన నాపద లెన్నివచ్చి త
న్నలఁచిన గుండె వ్రయ్యలయి ♦ నం దలవోయినఁ బాడిపేరుముల్
వెలలఁగ మానముం జెడఁగఁ ♦ బేరును లోకులు తూరుపెత్త రా
జులు మనువారె? స్వీయకుల ♦ సూదన! యారయ నీవుఁ దండ్రివే?

చ॥ జనకుని యట్లు తోఁప నొక ♦ శ్వానము నీవు నిజమ్ము తండ్రివై
నను రఘురాము నింటికి ఘ ♦ నమ్ముగ దీవన లిచ్చి యాతఁడే
నిను విడిపించునేని చెఱ ♦ నీఁగుము తక్కనయేని చావు మ
న్య నియతి లేద యంచుఁ దగ ♦ నాడక యీగతిఁ గాఱులాడెదే?

ఉ॥ నీవును నీదు చుట్టములు ♦ నీ సకలంబును మాఁడి బొగ్గులై
పోవునుగాక నీతి పథ ♦ మున్ మతిఁదప్పి చరింపనేర్తునే?
శ్రీవరుఁడైన రామవిభు ♦ సేవకురాలగు నేను నీచనై
జీవములుండ రావణుని ♦ చెంగట మానమువోఁ జరింతునే?

ఉ॥ రామ విభుండు దక్క నను ♦ రాగముతో నను డాయువారు ర
క్షోమరులైన దీపశిఖఁ ♦ జొచ్చిన కీటములట్లు మాఁడరే?
యేమని యెంచితో నను? మృ ♦ గేంద్రుని గూడిన సింహి యెన్నఁడేఁ
ప్రేముడిఁ బాడుగుంటలఁ జ ♦ రించెడు నక్కను గూడియుండునే?. ౧౪౮౦

ఉ॥ క్రూరబలుండు రావణుఁడు ♦ కోమలి పల్కు కఠోర వార్తలన్
ఘోరవ్వఁ గిన్కతోడ విని ♦ తోయలి! నీవు తలంచినట్లె యీ

ప్పారుము కాఁగలట్టి దెస ♦ లారకపోవదు వీనిఁబట్టి నీ
వారయుచుండఁ ద్రుంతునని ♦ య త్తతి ఖడ్గము వేగ యెత్తుడుర్.

ఉ॥ చంపఁగ లేవు న న్నితనిఁ♦జంపఁగఁజాలవు నిన్ను నీవునుం
జంపుకొనంగ లేవు భువ ♦ నంబులఁ గూల్పఁగ లేవు రాముఁడే
చంపెడువాఁడు నీకు మొగి ♦ సాయపడంగల నీదుబంధులన్
లంపటులెల్లఁ బూర్తిగఁ దొ ♦ లంగఁగ నన్ గొనువాఁడు కీర్తితోన్.

చ॥ అని ధరజాత పల్కుతఱి ♦ నడ్డము వచ్చి మహోదరుండు పా
వనతర దేవభోగి! యొక ♦ పట్టున నీకయి వేఁడెఁగాక యీ
జనకుఁడు నీకొనర్చిన దొ ♦ సంగొక యింతయు లేదు వీనిఁ జం
పిన వెనుకైన సీత పల ♦ వింపదె నీకు నధీనయౌ తఱిన్ ? ౧౮౮౩

చ॥ అని మొన రామభద్రుఁ డెగ ♦ టార్పుము సర్వము నీకుఁ జక్కనౌ
నని వచియింప దైత్యవిభుఁ ♦ డప్పని మాని తొలంగె నంతలో
వనచరు లార్పుటల్ విబుధ ♦ వర్యుల కేకలతోడి చప్పటల్
విని మదిలోఁ గలంగె రణ ♦ వృత్తము తత్తఱపాటు గూర్పఁగన్. ౧౮౮౪

తే॥ ఇన కులేశుల గుణరావ♦మెక్కుఁడయ్యె, నమర వానర కలకల♦మతిశయించెఁ
గుంభకర్ణుని సైన్యంబు♦గూల నాతఁ, డొంటిమై యుండెనని దైత్యుఁ♦డుమ్మలించె.

—: రావణుఁడు కుంభకర్ణ మృతికై విలపించుట :—

ఉ॥ తొక్కులు గట్టికొంచు నెన ♦ రేఁగి వడిన్ వడి వచ్చి దూత లా
రక్కసితేని కర్ణ వివ ♦ రంబుల డాసి మహా రణంబునన్
మొక్కలులైన వానరుల ♦ మొత్తము మొత్తముగా వధించి పై
నుక్కఱి రామబాణముల ♦ నుర్వరఁ దమ్ముఁడు కూలెఁగా! యనన్.

తే॥ పరిధి గల భాస్కరుంబలెఁ♦బైఁడి సరుల, చే నలంకరింపఁబడిన♦శీర్షకములు
జగతిఁ బడఁ బెల్లగిలిన వృ♦క్షంబు పగిదిఁ, గూలె రావణుఁ డవ్వా ర్త♦కుములఁజేయ.

తే॥ ఉర్విఁ బుట్టుకఁదొట్టి వి♦యోగ దుఃఖ, మెన్నఁ డెఱుఁగని లంకా మ♦హీశ్వరుండు
తనకునై ఘోర రణమునఁ♦దమ్ముఁ డిలిగె, నంచు వినినంత నొంతె త్తి♦యుంగ నార్చె.

సీ॥ త్రిదశ పద్మాకర♦మద గజేంద్రమ! యింద్ర, వరకీర్తి పూర్ణేందు♦వారిదంబ!
అబ్జజపౌత్ర! శూ♦లాయుధహస్త! యీ, చెడువార్త నేఁడు నా♦చెవులు వ్రీల
విననయ్యె నిన్నంపి♦వెనుక నాప్రాణముల్, గాచికొఁ దలఁచిన♦ నీచు నేను
నీస్థితి విన్నచో♦నిర్జరనాథుఁ డై, రావణ మెక్కి న్వ ♦ ర్గంబు చొరఁడె?

తే॥ విమతి నన్ను నీవే యిట్లు♦విడిచి పోవ, నవరెవరితోడఁ బుట్ట ర♦హించువారు?
యెదుటి కీతేర భీతిల్లి♦యెదుఁగువారు, చూచి యొమ్మునపైఁ జేతు లుం♦చుకొని రారె?

తే॥ స్నాన మాడెడి తఱి నీకు♦స్వర్ణశిఖరి, మడమ రుద్దికొనెడు చిన్న♦పడుకె యగును
అట్టి నిన్నొక మనుజుని♦యలుఁగు కూల్చె, ననెడి మాటయే నామది♦కలఁతఁగూర్చె.
తే॥ శూల చక్ర వజ్రంబులు ♦ సోకి యొడలి, పైని రోమంబునేని రా♦ల్పంగలేదు
అల్ప మనుజుని మృదుల సా ♦ యకము త్రుంచెఁ, గుక్క సింగంబు నెదిరించి ♦
కూల్చె నౌర! ౧౪౯౧
సీ॥ తోడఁబుట్టువు ముక్కు♦త్రుంగ మారీచుండు, ద్రుంగ లంకయుఁ బట్టు♦గ్రుంగ భీమ
బలుఁడు తమ్ముఁడు ద్రుంగ♦బ్రదుకుచు నొకచెలి, సౌందర్యమున కాసఁ♦జెందినాఁడ
వినకులునైన నా♦తని తమ్ముఁడైన నే, నానినైనను గపి♦నాథునైన
నంగదునైన మ ♦ హాబల సుతునైన, జాంబవంతుని నేని ♦ చంపి తనుచు
తే॥ వినఁగ నోచనైతి నిదేటి♦వింతచావు, రాలు తేలెను బెండ్లు నీ♦రమున మునిగెఁ
నేమి చెప్పంగఁగలదింకఁ♦దామసింప, కరుగుదేరంగఁ దలఁతు ని♦న్ననుసరించి.
చ॥ అతివలు కాళులొత్త మల ♦ యానిల మొయ్యన వీవ నూన సం
గత తలిమంబున న్నిదుర ♦ గాంచెడు సోదర! ప్రేత భూత సం
తతులు నటించుచుం గటు రు ♦ తంబులు సేయు దురంబునన్ రజో
యుతమగు భూమి శయ్య నెటు ♦ లొందితి నిద్దుర మేను వ్రాల్చుచున్.
తే॥ దిక్కులందున నీవు కీ♦ర్తిని రహింపఁ, జేయ మధువాని భోగముల్♦చెందుచుంటి
నీవు వోవంగ నేనెట్లు♦నిలుచువాఁడ? వత్తు నీవెంటఁ దామసిం♦పను నిజమ్ము.
తే॥ అనుచు మిక్కిలి పలవించి♦తనదు కీర్తి, కారణంబెల్ల రిక్తయుఁ♦గంగఁ జేసె
సీత తననోరు చలియింపఁ♦జెంగలించి, మేనఁ బులకలు గ్రమ్మంగ♦గ్లాని విడిచె.
తే॥ గాత్ర ముప్పొంగెఁ గార్శ్యంబు♦కడకుఁ జనియె, మనను తెలివొందె జీవముల్ ♦
మరలివచ్చె
సిరియె సేవసేయఁగఁదగు♦శీలచరిత, సీత యొలమికిఁ బొలిమేర♦క్షితిని గలదె?
తే॥ కాంతు లలిత రూపము కుంభ♦కర్ణ ఘోర, తనువుగాంచి భీతిల్లి త♦త్తఱిలి యవలఁ
గెడసెఁ గుంభకర్ణుండను ♦ నుడువు విన్న, సీత పూరించె వేటొక♦సీత యనఁగ.
తే॥ లోకములఁ గూల్తు లోక పా♦లురను ద్రుంతుఁ, జావకున్నఁ ద్రిమూర్తులఁ♦జావకుందు
మందు దిన్న గీర్వాణుల♦బందివైతు, నని చిరాకు మిక్కిలి యొందె♦నసురవిభుఁడు.
మ॥ తనువున్ వీడిన నాదు తమ్మునకు ను ♦ ద్ధామక్రియన్ రామ ల
క్ష్మణ రక్తంబునఁ దర్పణంబు నొగి ము ♦ మ్మాఱుల్ మనశ్శాంతికై
యొనరింపంగలవాఁడ నంచు సమరో ♦ ద్యోగంబునం బోయె రా
వణుఁ డాచోటును వీడి మంత్రులు సఖుల్ ♦ వంటించి వెన్నాడఁగన్.
తే॥ కాక కంక గృధ్రంబులు♦కలయఁదిరుగు, పొలికలనఁ గుంభకర్ణుండు♦పొలిసె ననుచుఁ
గుంది యింద్రజిత్కుని వేఱు♦బంది నుంచు, డంచు నేగె మహోదరుఁ♦డార్తిమయుని.

తే॥ పూలు తావియు లేక దు♦ప్పుటలు లేక, యొంటి తిరియైన కేశంబు♦లొప్ప సీత
కడకుఁ గడఁకతో ద్రిజటయన్ ♦ కాంత వచ్చి, యూఱడించుచు నిట్లని♦ తేఱఁ బలికె.
తే॥ నీ జనకుఁడంచు నీదు స♦న్నిధికి వచ్చి, మలసి నతఁడు మరుత్తుఁడన్ ♦మాయలాఁడు
నిక్కమది యని నమ్మక♦నీరజాక్షి! దనుజ మాయలు పెక్కులఁ♦దలర నేల?
తే॥ త్రిజట పల్కులయందు మై♦థిలికి నమ్మ, కంబు గల్గుట నామె దుః♦ఖమ్ము వీడె
సందియము వీడె మనసునఁ♦గుందు వీడె, నెప్ప టట్టులు రామా ప్తి♦యెదురుచూచె.

## ౧౨ అతికాయ వధ పటలము. (౨౭౬)

తే॥ ఉగ్రమై వెల్గు విలయాగ్ని♦యుడుకునట్లు, మండుకోపంబుతో రావ♦ణుండు కొలిచి
యిరుకెలంకులవచ్చు మం♦తిరులఁ జూచి, రౌద్రమూ ర్తియై యిట్లు వా♦క్రువ్వఁ దొడఁగె.
తే॥ అనువుగలవారు పగఱయు♦క్కడఁచువారు, బలియురని పంప శాత్రవ♦బలమడంచి
మరలి రాలేక యూరక♦మరలివచ్చి, నిలుతురేల? సిగ్గిలరె? యా♦వలికిఁ బొండు.

చ॥ గతియొకయింత లేక ప్లవ ♦ గంబుల డంబుగఁ గూర్చుకొన్న దు
ర్మతులను చంపివత్తుమని ♦ మాఱట రుద్రులఁ బోలె నేగి పెన్
జతనముతోడఁ దమ్ముఁనకు ♦ సాయము సేయక పాఱివత్తురే?
యతగులు మీరు ప్రాణముల ♦ నంటి చరింతురె యెల్లకాలమున్?

చ॥ మునుపు జయించితిన్ జగము ♦ మొత్తము నేలితి శౌర్యసంపదన్
గొనకొని మీరు నాదు మఱుఁ ♦ గుం గొని గౌరవ సౌఖ్య కీర్తులం
గని చరియించినా రిపుడు ♦ కార్యము గల్గిన మీబలంబు వం
చన మొనరింపకుండ నసు ♦ జాతము లిచ్చియుఁ జేయు టొప్పదే?

తే॥ అంతకర్తుల మేముకా♦మందు రేని, యట్లు చెప్పఁడు నేనేగి♦యముఁడు లేక
ప్రాణ మానఁదగిన శక్తిఁ♦బరపి నరులఁ, వీఁపు చూపఁ జేసెద భూత♦వితతి యదర.
తే॥ మఱియు నొకమాటయరుదైన♦దురమునందు, గెలువఁగోరిన నేగుఁడు♦చలము మీఱ
నిలుగుటే నిజంబని మీరు♦తలఁతు రేని, వలవ దెయ్యది మీకోర్కి♦తెలుపుఁడనుడు.
తే॥ బ్రహ్మకోపించినను జయిం♦పంగ రాని, శూరు డతికాయుఁ డపుడు ని♦ష్ఠురతతోడఁ
గోపమును సిగ్గు మల్లడి♦గొనఁగఁ బలికె, రావణునితోడఁ దనపరా♦క్రమము మెఱయ.

ఉ॥ జంకిన జంకనీ నరులు ♦ జంభ విభేదియు నిర్జరావళుల్
జంకిన జంకనీ యజుఁడు ♦ చక్రియు రుద్రుఁడు తక్కువారలున్
జంకిన నీవు నీకయి వె♦సన్ బిడియంబు వహింతుగాక నే
జంకితినంచు నెంచుటయుఁ♦జక్కటి కాదు భవన్మనంబునన్. ౧౫౧౧

తే॥ దానవులయందు ఘనబల♦దర్పితులను, గెలిచి గెలుపును నీకుఁ గ♦ల్గింపలేదె?
నీవును వడంకఁ బోరిన♦నిర్జరులను, త్రుంచి సారెనాఁ ద్రిప్పి యా♦డించలేదె?

ఉ॥ కైదువు కేలనుండ ధరఁ ♦ గాల నలంపఁగఁబడ్డ యట్లుఁ డం
బేదల సాయకంబులకు ♦ బిద్దిన గద్దఱి కుంభకర్ణుఁడున్
బేదల సత్త్వకీర్తులను ♦ భీతిని నమ్మిన యా విభీషణుం
డో దనుజేంద్ర! నాకు సము ♦ లో? తలపోయుము నీమనంబునన్.

తే॥ నీదుతమ్ముని ప్రాణముల్ ♦ నీఱు సేయు, వానితమ్ముని జీవముల్ ♦ ప్రాఁతిదీసి
రాము వడఁకింపఁజాలిన ♦ భీమ రణము, సేయనేని నీకొడుకనఁ ♦ జెల్లు టెట్లు? ౧౫౧౪

క॥ ముమ్మరముగఁ బోరి ప్లవం, గమ్ములఁ ద్రుంగించి దళము ♦ కాండ్ర నలఁచి బీ
రమ్మున నిరువురు నరుల క, రమ్ము లిఱియఁగట్టి తెచ్చు ♦ త్రాణం గనుమా.

క॥ బంటులతోఁ బొమ్మందువొ, యొంటరివై పొమ్మటందు ♦ వో సెలవిమ్మా
పంటింపకేగి వారల, దంటతన మడంతు ననిన ♦ దనుజేంద్రుండున్. ౧౫౧౬

క॥ ముదమంది లెస్స పలికితి, కదనమ్మున లక్ష్మణాఖ్యు ♦ ఖండించినచోఁ
బదపడి మఱునాఁడే నే, సదమద మొనరింతు రామ ♦ చంద్రు దురమునన్. ౧౫౧౭

ఆ॥ మూఁడుకోట్ల క్రొత్త ♦ మొన రథ గజ తురం, గములు తోడ రాఁగఁ ♦ గదనతలము
సేరఁ బొమ్మటంచుఁ ♦ జీరి దీవించుచు, నెలస మతిశయింప ♦ సెలవొసంగె. ౧౫౧౮

తే॥ నిర్జరుల కసాధ్యులు మహా ♦ నిష్ఠుర బల, ఘనులు కుంభ నికుంభు లఁ ♦ గంపనుండు
తేరి రక్షకులుగ వచ్చు ♦ వారు పవన, జవన హయ శతాంగంబుపై ♦ సరగఁ జనుము.

తే॥ తేరు లొకవేయి యొకకోటి ♦ వారణములు, కోటి వారువములు తోడఁ ♦ గూడి వచ్చుఁ
గదలుమన నతికాయుండు ♦ ముదమునంది, కార్ముకముపూనిపసిఁడి కం ♦ కటముదొడిఁగె.

తే॥ కఠినరావముల్గల వీర ♦ గణము బలయ, వివిధ సాధనముల కాంతి ♦ వింత గొలుప
వీథులెల్లఁ గ్రిక్కిఱియంగ ♦ వెడలె దండు, పాదరేణువుల్ రోదసిఁ ♦ బరవి నిండ.

సీ॥ గిరిదరీ సుప్తకే ♦ సరులు మేలుకొనంగ, గజ బృంహితంబు ల ♦ గ్గలముగాఁగ
కపి నికాయంబుల ♦ కర్ణభేరులు వ్రీల, భేరీ రవంబులు ♦ బోరుకొనఁగ
జీవసంతతి గుండె ♦ చెదరంగఁ బంచధా, రాగత హయహేష ♦ లలమికొనఁగ
స్రుక్కి శేషు నొడలు ♦ మిక్కిలి బడలంగ, స్యందన నేమి ని ♦ స్స్వనము లులియ

తే॥ కాలిబంటుల ఘనఘోర ♦ గర్జనముల, దారణస్థితి గగనంబు ♦ బూరటిల్లఁ
బాదవిక్షేపముల భూమి ♦ పల్లటిల్ల, నడచె వడిగాఁగ దైత్య సై ♦ న్యంబు లనికి.

తే॥ మున్ను మదగజంబులు వడిఁ ♦ బోవుచుండ, వెంటఁబడి పోవుచుండెడు ♦ పిడులునాఁగ
ధ్వజము లొలయు శంపాయుత ♦ వారిదములు, కదలుచుండెను వెనువెంట ♦ గములు గట్టి.

తే॥ అంకుశము పోటుగొన్న సా ♦ రంగములకుఁ, బ్రక్కలన్ మదతోయంబు ♦ పాఱుకతన
దారి బురదయై దిగఁబడఁ ♦ దత్తడములు, నేనుఁగులు నేగ నట్టేట ♦ నీఁదుపోల్కి.

తే॥ భానుతోడఁ బరిధి యేగు♦పగిది నడచె, స్యందనంబులు తోయద♦చయమువోలె
నడచె వారణములు నేల♦నడవవయ్యెఁ, బరుగువాఱుచునుండెను♦తురగసమితి.

క॥ గిరి సముదయములు నడచిన, తెఱఁగునఁ దఱుచగుచుఁ బెద్ద ♦ తేరులు నడవన్
గరువంబున నతికాయుం, డిరవుగ నని సేయఁదగిన♦యిక్కువ చేరెన్. ౧౯౨౬

క॥ శ్రీరామ మదగజేంద్రము, వీరవిహారంబు సలుపు♦పృథివిని గని వె
వ్వేత్రై పదములు తునిఁగిన, వీరుని పినతండ్రిఁ గాంచి ♦ విలపించెఁ గడున్.

క॥ ఇది యమ్ములచేఁ దిప్పయి, పొదలినయదిగాదు దిగిభ♦ముల తనువు స్నీ
రదమును శరనిధియును గా, దిది తండ్రి శరీరమనుచు♦నేడ్చెం బెలుచన్. ౧౯౨౮

తే॥ అకట యిట్టిదుస్స్థితిఁ జూడ♦నరుగుదెంచి, నాఁడ నసుఱులతో నున్న♦నరుల మున్నె
తునుమకుండుటచే నింత♦దొసఁగువచ్చె, నూరకుండుట నాకింక ♦ నొప్పుగాదు.

క॥ అని కినిసి యిట్లు కావిం, చిన రామునితమ్మునిన్ని ♦ చెలగి చెలగి రా
ముని దుఃఖము గనినం గద, మన యంగద సీఁగు ననుచు♦మదిఁ జింతించెన్.

తే॥ మహిషుఁడను దూతఁ బిల్చినా♦మాటగాఁగ, లక్ష్మణునికడకేగి యీ♦లలిని పలుకు
తమ్ముఁకై దురపిలు తన♦తండ్రినెగులు, దీర్ప నతికాయుఁ డాజి కే♦తెంచెననుము.

తే॥ చింతచే మదికలఁగి కృ♦శించుచున్న, తండ్రి నిందుసభను రాము♦తమ్ముఁ డాజిఁ
గాల్లు తెగి యురలంగఁ దాఁ♦గాంచునట్లు, శపథములు పల్కి వచ్చెను♦సరగ ననుము.

క॥ దురిత మిదియని తలంపను, వరశూరుల కిదియె ధర్మ♦పద్ధతి యనుచుం
దెఱఁగొప్పఁ బలికి యతనిని, దురమునకుం దెమ్ము పొమ్ము♦తొరంపు వడిన్.

క॥ నరులును యయుత్సువులు నగు, నిరువుర వడిఁజేరి కలన♦నెదిరించెడు వా
రిరవుగ జను నోటంజొరఁ, బరుగిడువారనుచుఁ దెలియఁ♦బలుకుము మహిషా!

క॥ వానిఁ గొని తెచ్చి విడిచితి, వేని ముదమునంది నీకు♦నిచ్చెదఁ బ్రతిగాఁ
జీనాంబరములు మేలగు, మాణిక్య విభూషణములు♦మహియు నొసఁగెదన్.

క॥ సౌమిత్రిఁ దోడితెచ్చినఁ, బ్రేమంబున ఖచర నాగ♦విద్యాధర కాం
తామణుల నిత్తు నీవలె, కీమహిఁ ద్రావని సురాదు ♦ లిచ్చెద నీకున్. ౧౯౩౬

క॥ రవిమండలముంబోలిన, యవి వేల్పులు కానుకవెట్టి ♦ నవి యక్షేశుం
డవిరళముగ నిచ్చినయవి, తివిరి యొసఁగువాఁడ రత్న♦దివ్యవిభూషల్. ౧౯౩౭

సీ॥ దానధారలఁ దుమ్మె♦దలు మూఁగు మదగజం, బులు నూఱువేలు నీ♦కెలమినిత్తు
రత్నకాంచనమయ♦రథములు పదివేలు, వన్నెవన్నెల వారు♦వముల నిత్తు
ధనరాశి నించిన♦ఘనశకటంబులు, కోరికమీఱఁగాఁ ♦ గొనరకిత్తు
ధానదాసీజన♦తండంబు లొకవేయి, వలసినచోటఁ గా ♦ వలసినంత

తే॥ నేల యేలంగనిచ్చెద♦నీవుపోయి, లక్ష్మణుని దోడితెమ్ము నీ♦సూక్ష్మమతిని
దగిన తెఱగునఁ బలికి క♦ర్తవ్యమెట్లుఁ, జెడకయుండఁ జూడుము పొమ్ము♦శీఘ్రగతిని.

తే॥ అనుడుమహిషుడొంటరియయి♦యరిగియెదురు, వచ్చురామునిగనినంత♦వానరవరు
లలుక లేవ నుత్సాహంబు♦గొలుపునర్థ, మొందు గలదని మహిషాసు♦రుండుపలుక.

తే॥ రాయబారియైవచ్చె ని♦రాయుధుండు, రేఁగవలదని వారి వా♦రించి విభుఁడు
వానిఁగని నీవువచ్చిన♦పని విశేష, మయ్యేనేని తెల్పుమ యన♦నసుర చూచి.

తే॥మాప్రభుఁడు దెల్పఁబంపిన♦మాటయొండు,గలదు లక్ష్మణుతోఁ బల్క♦వలయుననిన
వినెద వాక్రువ్వుమని రామ♦విభునితమ్ముఁ, డనుడు మహిషాసురుండును♦వినిచెనిట్లు.

శా॥ నిన్నే ఘోరరణంబునం జెనక న ♦ న్వేషించుచుఀ వచ్చి యిం
దున్నాఁడం బ్రతియోద్ధ శౌర్యమది నీ ♦ కున్నేని వే రమ్ము తం
డ్రిన్నొప్పించిన నొవ్విదీఱ నిను గం ♦ డ్రింతుం దురంబందు మీ
యన్నం బిమ్మట నొంతుఁ బంతమిది ప్ర♦త్యగ్రంబుగాఁ జేసితిఀ. ౧౫౪౭౩

మ॥ అనినఀ రాముఁడు నవ్వి యిట్టులను దై♦త్యశ్రేణితోఁ బోర నా
యనుజుం డెప్పుడు సజ్జుఁడై యలరు ధై ♦ ర్యస్ఫూర్తి శోభిల్ల నా
నినకా దాతనితండ్రి వచ్చినను మ ♦ న్నించుఀ రణంబిచ్చు ర
మన్నమా మానము శౌర్యముఀ భుజ బల ♦ వ్యాపారము ల్గల్గినఀ.

మ॥ అన నాతోడనె పంపుఁడంచు మహిషుం ♦ డాడంగ మేలంచు ల
క్ష్మణుఁ బ్రేమంబునఁ గౌఁగిలించికొని రా ♦ మస్వామి పొమ్మన్న స
ద్గుణభూషుండు విభీషణుం డనియెఁ గా ♦ కుత్థాన్వయా! యిత్తఱిన్
మనతోఁ గూడియె తమ్ముఁ డాదనుజుఁ జం ♦ పం దగ్గ కార్యంబగున్.

సీ॥ సత్యవిక్రముఁడగు♦సౌమిత్రితోన యు, ద్ధంబుసేయఁబ్రతిజ్ఞఁ♦దాల్చినాఁడు
తపమొనరించి వి♦ధాతచే వరములు, గాంచి వేలుపుల జ♦యించినాఁడు
కైలాసమెత్తిన♦ఘనుఁడు మేరువునెత్తఁ, బ్రేమతో వీనిని♦పెంచినాఁడు
వలయు సాధనములు♦పనిలేక యే కేలఁ, బాలవెల్లిం జిల్కఁ♦జాలినాఁడు

తే॥ విలయమునను నశింపక♦వెలయుచుండు, ప్రథిత దిగ్గజములఁ ద్రోచు♦బాహుబలము
తోడఁ జక్రవాళంబునే♦త్రోవఁజాలు, దోర్బలము సమానమె? దశ♦రథాయజాత!

తే॥ చిరము ఫాలాక్షుతోడను♦దుర మొనర్చి, శూల మతఁడు వైవఁగ దానిఁ♦గేలఁబట్టి
యీవు విడిచిన శూలమా♦యిది? యటంచు, నుల్లసములాడె నెఱఁకుల♦నుచ్చిపాఱ

తే॥ పగఱ లోకంబు వేల్పుల♦నగరిఁగాల్చు, తఱిని విష్ణువు వైచు సు♦దర్శనంబు
నిష్ఫలముగా నొనర్చిన ♦ నేర్పులాఁడు, వీని సామాన్యుగాఁగ భా♦వింపరాదు.

తే॥ అమరులేసిన వివిధ ది♦వ్యాస్త్ర సమితి, పంబి రాకుండ నుగ్గునూ♦చంబుచేసి
వారి సామర్థ్యముల వ్యర్థ♦పఱచినట్టి, చండ కోదండ విద్యా వి♦శారదుండు,

తే॥ శంకరుని శిష్యుఁడనితర♦సాధ్యనవ్య, మహితశస్త్రాస్త్రవిదుఁ డధ♦ర్మంబు దక్క
వేఱెఱుంగఁ డశూరుల♦వీఁకదాఁకఁ, డసమకీర్తికాముఁడు మాయ♦లాజిఁగొనఁడు.

సీ॥ మాయా విశారదుల్♦మధుకైటభులు తొల్లి, సురలోకమును చొచ్చి♦చూఱలాడి
విబుధుల హింసించి ♦ విధివశంబున నొక్క, దినమున శ్రీరమా ♦ ధిపునిగాంచి
సమరమిమ్మనికోరి ♦ సమ్మతింపఁగ వారు, బహురూపములఁ గొని ♦ వచ్చిపోరఁ
జక్రియు వారితోఁ ♦ జాలకాలంబు మ, ల్లాడంగ వారలు ♦ హరినిగాంచి

తే॥ మమ్మెదిర్చి పోరిచ్చిన ♦ మహితధైర్య, శాలి జగముల నీవలెఁ ♦ జాలువాఁడు
లేఁడు మేమేడులోకాల♦లీల(మింగి, (క్రక్కఁగల బలియుర మాజి♦కర్కశులము.

తే॥ ఇరువురను మమ్ము డీకొని♦యిన్ని నాళ్లు, పోరితివి మెచ్చితిమి నీవు♦కోరు వరము
నొసఁగువారము కోరి మే♦లొందు మనినఁ, జక్రి కోరె వారల గెల్చు♦నరవిఁ దెలుప.

ఉ॥ సీతొడయందు చత్తుమని ♦ నిర్జరవైరులు తెల్పునంతఁ గం
జాత విలోచనుండు భువ ♦ నంబు సమస్తము నొక్క యూఁపువం
దే తెఱఁగొప్పఁ జేర్చ నసు ♦ రేంద్రులు వేర్పడి లొంగినారు త
ర్వాత గదా(ప్రహారమున ♦ (మందిరి లోకము లుల్లసిల్లఁగన్. ౧౫౫౭

మ॥ మధుమేధస్సు ధరాతలంబు నెఱయం ♦ బర్వంగ నిద్ధాత్రి త
ద్విధిచే మేదినియయ్యె ధర్మపథముల్ ♦ (ద్రిక్కాడకున్నట్టి య
మ్మధు వే యవ్వలఁ గుంభకర్ణుఁడగుచున్ ♦ మాఁడెన్ భవత్సన్నిధిన్
మధుతమ్ముం డతికాయుఁడయ్యె రఘురా ♦ మా! దీన చింతామణీ!

ఆ॥ తగ విభీషణుండు ♦ దైత్యుల చరితంబు, తెలుప నిట్లు మోవుఁ ♦ దేటపఱచు
మొలకనవ్వుతోడ ♦ జలజాతనేత్రుండు, పలికె జలద నినద ♦ భాషణముల.

సీ॥ కోటిరావణులైనఁ ♦ గూడ సురాసురుల్, వచ్చి లక్ష్మణుఁదాఁకి ♦ (బ్రదుకువారె?
యితఁడు కోపించిన ♦ నేనేల? హరియేల? హరుఁడేల? యింద్రామ ♦ రాదులేల?
దివ్యాస్త్రములుఁ తప ♦ స్తేజోబలంబులు, సౌమిత్రి కినుకకుఁ ♦ జాలునవియె?
కేల విల్లందిన ♦ నీలోకములనెల్ల, క్షణమున నివుఱుగఁ ♦ జలుపఁగలఁడు

తే॥ మేదినీసుత మాటలు ♦ మీఱలేక, తొలఁగిపోవుటచేఁగదా ♦ దుష్టరాక్ష
సుండు నేటికి జీవించి ♦ యుండువాఁడు, కాకయున్న నాఁడే జముఁ♦గాంచువాఁడు.

చ॥ తొనఁకకపొమ్ము నీవితని ♦ తో నతికాయు శిరంబు తూపుతోఁ
జని గగనంబుఁదాఁకి పడఁ ♦ జయ్యన గ్రద్దలు కాకులుం దినం
గనియెదుగాక కంబువులఁ ♦ గంబులతో నెదిరింపఁ బోలునే?
దనుజుల గెల్వవచ్చినది ♦ తక్కక యెవ్వరితో నెఱుంగవే? ౧౫౫౮

మ॥ తలఁపన్ రుద్రుఁడొ చక్రపాణియొ సుమి ♦ (త్రాసూనుఁడో కాక యి
య్యిల నెవ్వా రతికాయుఁగూల్పఁగలవా ♦ రెన్నంగ వేవేల నే

నను దైత్యానుజుతోడ రాఁ జదిపె నిం ♦ కం జంపువాఁ డీతఁడే
గెలుపుం గాంచెడువాఁడు నీతఁడగు శం ♦ కింపంగ నీ కేటికిఁ ? ౧౫౫౮

తే॥ కదలుమన రాఘవునకుల ♦ క్ష్మణుఁడు మ్రొక్కి, దీవనలుగొని తనతోడ ♦ ధీరులైన
కపివరులు విభీషణుఁడును ♦ కడఁకె నడవఁ, గదలి యతికాయుఁడున్న రం ♦ గంబుఁ జేరె.

తే॥ దక్షిణపయోధిమీఁది కు ♦ త్తరపయోధి, వచ్చి చొచ్చినతీరునఁ ♦ బ్లవగ సేన
మోహరించిన పోఁకుల ♦ మొగ్గరమును, చీల్చుకొని చొచ్చి యురవడిం ♦ జెంగలించె.

తే॥ వచ్చి నెత్రుచేఁ దేమయై ♦ పంకమైన, తలము సింహనాదమ్ములు ♦ చెలఁగ రేఁగు
సైన్యఘట్టన దుక్కయై ♦ సరగ లేచు, రజము నింగి నెఱ్ఱనచేసి ♦ ప్రబ్బికొనియె. ౧౫౬౦

తే॥ శంఖ కాహళ దుందుభి ♦ స్వనములెల్ల, వీర సింహనాదములతోఁ ♦ జేరి యవల
శింజినీధ్వనితోడను ♦ చెలఁగి జలధి, నోరు మూసికొనఁగఁ జేసె ♦ బోరు కలఁగి. ౧౫౬౧

ఆ॥ రక్కసులు నశింప ♦ రక్తంబు సెలయేళ్లు, మాడ్కిఁ బఱవ నాకు ♦ మ్రాఁకులట్లు
కేతనములు త్రుంగఁ ♦ గీశులు కొండల, నెక్కుపోల్కిఁ గరుల ♦ నెక్కినారు. ౧౫౬౨

తే॥ శాఖలనెడు దంతమ్ములు ♦ క్షాద్రమనెడు, మదజలంబును విలసిల్లు ♦ క్ష్మాధరంబు
లనెడు నేన్గుల వైవఁగ ♦ హస్తిహస్తి, పోరు చందమై మదకరుల్ ♦ పుడమిఁ గూలె.

తే॥ గట్టిగాఁ బట్టిఁ బొడిచెను ♦ కఱచె రక్కఁ, ద్రుంచెఁ గపినికాయంబులు ♦ తురగములను
రక్తపూరంబులో మెడల్ ♦ వ్రాలఁ గాళ్లు, పైకిఁ దిరుగఁ దన్నుకొనుచుఁ ♦ బడియె హరులు

తే॥ వనచరాఖేటమున మద ♦ వారణములు, వాత్యచేఁ దూలు వారిద ♦ పంక్తులట్లు
తూలి వ్రీలిన దంత నం ♦ దోహమందు, ముత్యములు పటపట రాలి ♦ పుడమిఁ జెదరె.

తే॥ వజ్రపుం గంబములఁ బోలు ♦ పాదహతులఁ, గేలఁ గాలపాశముఁ బోలు ♦ వాలహతుల
దానవగణంబు లురలెను ♦ తత్కఠోర, కుంతఘాతంబులం గపి ♦ కులము దొరలె.

తే॥ చేతులకుఁ జిక్కు మ్రాఁకులు ♦ శిలలు పాము, లేనుఁగులు గుఱ్ఱములు గద ♦ లీఁటెలు రథ
శకలములు విసరుటచేత ♦ సాంద్రమగుచుఁ, బరవెఁ గాంతారమట్లు పై ♦ భాగమెల్ల.

క॥ వనచరవీరులు వైచిన, పెనుగిరితరు లంబరమునఁ ♦ బెలుచై వన రా
శిని దిగు మొగుళ్లుల వడువున, దనుజబలముమీఁదఁ బడి స ♦ దమదము సేసెన్.

తే॥ పాఱి యీవలావలకును ♦ జాఱిపడిన, పాఱుఁ బోతు రాకాసుల ♦ పరశు ఖడ్గ
ముద్గరాదిసాధనముల ♦ మురియఁ జేసి, రుధిరపూరంబులం బడఁ ♦ ద్రోచినారు. ౧౫౬౯

తే॥ వీరులగు వానరులు రక్త ♦ పూరమందు, యీఁదులాడుచుఁ దిప్పలై ♦ యొలయు కరుల
నెక్కి రవియు నీడ్వఁగఁ బడి ♦ యేటి తేనిఁ, జేరి దరిగానలేక గా ♦ సిల్లినారు. ౧౫౭౦

తే॥ కాళ్లు నిలువనీకిద్ద్రు ర ♦ క్తప్రవాహ, మందు పొడుగుకోలల నూని ♦ కొందఱేగ
వారితోఁ గలఁ డక్కిన ♦ వనచరాళి, పట్టికొని యీఁదు చవ్వలి ♦ పట్టుచేరె.

తే॥ సోఁకులును విజృంభించి ము♦సుండి శూల, ముద్గరాదుల మోఁదంగ♦ మొగపు దక్కి-
దిక్కు-లకుఁ బొఱ నదిగని♦లక్కు-మనుఁడు, కనలుగొని వారి కుత్సాహ♦గరిమఁ గూర్ప.

క॥ జము నుద్యోగంబునకుం, దమయత్నమ్మునకుఁదోఁడు ♦ తనరిన తన చా
　పము గుణమును బలువిడి లా, గి మహారావంబు లేపెఁ ♦ గీడ్పడ జగముల్.

తే॥ పంచభూతముల్ తమ తొలి♦ప్రకృతియందు, లీనమైనను బ్రహ్మయి♦ల్గినను విలయ
　కాలమందును నాశంబు♦ గానకుండు, ప్రణవముంబోలె నాధ్వని♦పరిఢవిల్లె. ౧౫౭౪

తే॥ వాఁడితూపులువిడువంగఁ♦బడియెఁబడిన, యమ్ములసురుల పెనుమేను♦లందుమఱిఁగెఁ
　గుణపములు సందు లేకుండఁ♦గుప్పలుపడె, వానినుండి రక్తముపాఱి♦వార్ధిఁజేరె.

తే॥ కరుల కరముల ఖురువుల♦కాళ్లద్రెంచి, రథిక శిరములఁ ద్రుంచి వ♦ర్గములు పెంచి
　వివిధచిత్ర రూపంబులఁ♦వెలయఁజేసె, లక్ష్మణాస్త్రముల్ విధిపోల్కి-♦లాఘవమున.

తే॥ పిండ్లు తుండించి శక్తుల♦విఱుగఁ గొట్టి, గవచములఁ జీల్చి విపులవ♦క్షములఁ దొల్చి
　గుఱ్ఱముల వ్రాల్చి తేరులఁ♦గూల్చిఁ యేనుఁ, గులను పీనుఁగులంజేసి♦కోల లడరె.

తే॥ దంతిదంతముల్ తెగి నభో♦ంతరము చేరి, విదియచంద్రుల పగిదిని♦ వెలయుచుండెఁ
　గరములూడినయవి రక్త♦శరధినుండి, భూమిఁ బైకెత్తెడు వరాహ♦మూర్తినెనసె.

తే॥ రెండు నెల రేకలను నోటఁ♦ద్రెంచికొనుచుఁ, గుండలములను రిక్క-ల♦గుంపుతోడ
　గగనమండలమే దిగు♦కరణిఁ దోఁచె, రక్క-సుల తలల్ వడఁగ ధ♦రాతలమున.

తే॥ రథికబృందంబు మరణింప♦రథములురలి, పడియెఁ బదవి చెడం గర్మ♦ఫలముచేత
　మింటనుండి యొడ్డగిలంగ♦మంటఁజాఱి, పడు విమాన సమూహంబు♦పగిదిఁదోఁప.

తే॥ పీడఁగారాని సుఖదుఃఖ♦వితతిఁద్రెంచి, యమరలోకంబు గైకొంటి♦మని తలంచి
యధిక కౌతుకంబున నొడ♦ల్లాడె ననఁగ, నట్టలాడెను రణభూమి♦నిట్టలముగ. ౧౫౮౧

తే॥ ఒక్క-పదివేలు మరణింప♦నొక కబంధ, మాడునను శాస్త్రసూక్తి స♦త్యంబయైన
నాఁడు కోటికి నెక్కు-డై♦నర్తనంబు, చేసె సౌమిత్రి చాతురి♦చెప్పఁదరమె! ౧౫౮౨

క॥ కరి భట తురగాదుల నె, త్తురు సెలయే ళ్లట్లుపాఱి ♦ తోయధిఁజొచ్చెన్
　అఱవఱలై యఱిముఱియై, పఱిపఱియై యున్న పరియఁ♦బలుచంబాఱెన్.

సీ॥ గొలుసులలోఁ దగు♦ల్కొ-న్న కాళులతో ద్వి, పమ్ములఁదోలు క♦బంధవితతి
　తురగంబులు నటింప♦దొరలక వానిపై, శీవి నర్తించు మొం♦డెముల గుంపు
　తలలూడినను గుఱి♦తప్పక యెప్పటిఁ, బ్రదరంబులను వీడు♦రథిక చయము
　పరుగులెత్తుచునుండ♦శిరములు తెగిపోవఁ, బరుగు వీడని వీర♦భటకులంబు

తే॥ సీత పేరిటిమృత్యువుఁ♦జెడఁగఁగోరి, తెచ్చుకొన్న దైత్యులు తండ్రి♦ తెరలఁగొడుకు
　మఱియ నల్లుండు గూల మ♦న్మండుఁ చావ, నన్నదమ్ము లురలఁ♦దాము నడఁగినారు.

క॥ శరములఁ దునుఁగుచుఁ ద్రుళ్లెడు, శిరములఁ గవ్వికొనిపోవఁ♦జేరిన గ్రద్దల్
　చరణాయుధములపోల్కిఁ, జరియించెం గొంచుఁబోవ♦సాధ్యము లేమిన్. ౧౫౮౫

క॥ వేలై కోల్తె యగ్ని, జ్వాల లుమియు లక్ష్మణాఖ్యు♦శర సంచయ మా
భీలంబై పడుచుండఁగఁ, గాలభటుల కపుడు పొడమెఁ♦గాళుల తీవుల్ ౧౫౮౬

క॥ మేరువుఁ గదలింపంగల, వీరులు జ్వాల దస్త్రములను♦విగత ఘన తనూ
భారులయి దివికి దుముకఁగ, వారలఁగని పొందినారు♦ప్రమదంబు సురల్ ౧౫౮౭

సీ॥ దారుకుండను వాఁడు♦దర్పించి తేరు దో, లించి లక్ష్మణు నెది♦రించి నిలిచి
శరవృష్టి గురిసి యం♦బరమెల్లఁ గప్పిన, వాని నన్నింటి నె♦వ్వడిగఁ ద్రుంచి
సౌమిత్రి ఘోర ని♦శాత శరంబున, వాని శిరము ద్రెంచి♦వసుధఁ గూల్చె
కాలుఁడు కలికుండు♦కాలజంఘుఁడు మరు, త్తుండు మాలియను నైదుగురు రేఁగి

తే॥ పాశ శూల పరశు భిండి♦పాల ముసల, ముద్గరాదుల నైవ నా♦పురుషపుంగ
వుండు వానినన్నిటిఁ దగఁ♦జెండి వారి, తలల నొక్కొక్క యమ్ముచేఁ♦దఱిఁగివైచె.

సీ॥ అదిగని రోషించి♦యతికాయు సేనాధి, పతులు వారణ కదం♦బంబు రేఁచి
పరిగొని కైదువుల్♦పఱపి వానరతతి, నటునిటు పోనీక♦యాఁచి నలఁప
వనచరుల్ చేతి క♦బ్బినవానిఁగొని వైవఁ, బొలసుదిండులు లోనఁ♦బూఁడినారు
సౌమిత్రి శరములు♦సారంగ యూథంబు, నవలీలఁ జననీక♦యలఁచి కొట్ట

తే॥ నంగములు పెక్కుతుండ్లుగాఁ♦ద్రుంగిపడఁగఁ, జదికిలంబడె నొకకొన్ని♦చచ్చెఁగొన్ని
దిరిగి గిఱ్ఱునఁగొన్ని మ♦స్తిష్కపంక, మంద రొఱవలుగాఁగూలి♦యడఁగెఁగొన్ని.

తే॥ ఒక్కతొడుగున వెడలుమ♦హోగ్రశరము, లొక్కపెట్ట సామజముల♦నుర్విఁగూల్చె
మావతుల జీల్చెఁజోడోళ్ల♦మహిని దుల్చె, రక్షకుల మాల్చె బంట్లబీ♦రముల వ్రాల్చె.

తే॥ కైదువులు విఱిగెను యోధ♦గణము తఱిఁగె, కంకగృధ్రజంబుకముల♦కఱవు దీఱె
మావటీంద్రఁగోల్పోయిన♦మదగజములు, కలఁగి యొండొంటితోఁ బోరు♦నలుపసాగె.

ఉ॥ కొన్నిటి పాదముల్ తునుఁగఁ ♦ గొన్నిటి తుండము లైదు తుండ్లుగాఁ
గొన్నిటి వాలముల్ తెగఁగఁ ♦ గొన్నిటి ప్రేవులు జాఱఁ గన్నులుం
గొన్నిటి కీఁగఁ గొన్నిటికిఁ ♦ గ్రొవ్వు దిగంబడ వచ్చు దంతులుఁ
గ్రన్ననఁ జచ్చుదంతులును ♦ గా బవాలు భీకరమయ్యెఁ జూడఁగన్.

తే॥ కరిఘటలు గూలుచుండ రా♦క్షసబలమ్ము, లించుకయుఁ బుయిలోడక♦యెడము లేక
యాయుధంబుల వైచుచు♦హస్తివితతి, ననువుగా నడ్డుగొని పో♦రనగ్గలించి ౧౫౯౩

తే॥ శరదములు భాస్కరుని గప్పు♦చంద మొందె, సామజంబులు లక్ష్మణు♦సరవి ముట్ట
శక్రధనువుఁబోలిన శరా♦సనమునుండి, యతఁడు కురియించె వెడిదంపు♦టంపవాన.

సీ॥ మోములు చీల వీఁ♦పులు వ్రీలఁ దుండముల్, పఱియలై ధారణిఁ♦బడియెఁ గొన్ని
పొరలుచు దొరలుచుఁ♦దెరలుచు ఘీంకృతుల్, నెఱపుచు ధాత్రి పైఁ♦దెరలెఁ గొన్ని
అర్ధచంద్రాస్త్రంబు♦లలమిన ఫాలభా, గములతో మేదినిఁ♦గదసెఁ గొన్ని
వనధిలోఁ జొచ్చెఁగొన్ని♦వనమునఁ బడెఁగొన్ని, పర్వతముల మీఁదఁ♦బడియెఁగొన్ని

తే॥ ఘోరశరములు కన్నుల♦గ్రుమ్మ స్వపర, భేదమెఱుఁగక తమవారి♦విఱిచెఁగొన్ని
లక్ష్మణుఁడు దంతులం గూల్చు♦లక్ష్యశుద్ధి, లాఘవము వేల్పులకును తె♦ల్పంగఁగాదు.
తే॥ ఏనుఁగుల కళేబరముల♦నెనఁగు నెత్రు, టేఱు లావీన్గు తిప్పల♦మీఱ లేక
కరులవీరులఁ దేరుల♦హరుల నెల్లఁ, ద్రోచికొనిపోయె నిలువక♦తోయనిధికి.
తే॥ లక్ష్మణాస్త్ర చయంబుచే♦లక్షకరులు, గడియలోఁ గూలఁ దెలిసి లం♦కా విభుండు
మిగిలియుండిన కోటి యే♦నుగులఁ బంపె, నతనిమీఁదికి నీరస♦మతిశయింప.
తే॥ ప్రాణములతోడఁ ద్రాణయు♦నధికమదము, గలవియగుసామజంబులు♦కపిసియతని
మీఁది కుఱికిన దొకటియు♦మిగులలేదు, డాయఁగా లేదు డాసియుఁ♦బాయ లేదు.
తే॥ముప్పదాఱు యోజనములు♦పొలసివచ్చు,కరిఘటలు రాఁగ లోకంబు♦గజమయంబ
యయ్యెనని వేల్పులనిరి వి♦హాయసంబు, ధూళిమయమయ్యె భూమి ని♦ర్ధూళియయ్యె.
తే॥ శాకినీ ఢాకినీ భూత♦సంచయంబు, తుదియు మొదలును గనరాని♦మదగజేంద్ర
రాశిఁ గని మునుమిడక తూ♦ఱంగ దొరకు, వానిఁగొనిపోయెఁ గొండల♦పగిది మోచి.
క॥ ఒకశరమున కొక కరి తె, క్కుకురాఁ బదివేల కరులఁ♦గడిమిం ద్రుంపన్
గిరు లదరె మొగుళ్ళు లడలెను, శరనిధులుం గలఁగె దిగ్గ ♦ జములును వడఁకెన్.
తే॥ గుణరవము లేచెఁ బర్వత♦గుహాలయందు, నిదుర సెందు సింగంబుల♦మొదలు గలఁగఁ
బిడుగు లడరిన వడువున♦విశిఖవితతి, పడియె వేదండ తండ కుం♦భంబు లగల.
శా॥ ఆవేళన్ దనుజేంద్ర నందనుని సై♦న్యంబెల్లనొక్కుమ్మడిన్
వేవే కేకలు వెట్టుచున్ మిగులు కుం♦భివ్రాతమున్ రేప రౌ
ద్రావేశంబున గాంచి వీరవిహృతి ♦ వ్యాపార లోలాత్మకుం
డై వచ్చెన్ వయిశంబ కేసరి సుతుం♦డా లక్ష్మణాస్త్రంబనన్. ౧౬౦౩
మ॥ నరసింహుం డితఁడంచు కాంచిన సురల్♦నక్తంచరుల్ భీతిలన్
హర కోదండ విభంజనాంఘ్రియుగమున్♦హత్తించి చిత్తంబునన్
హరిదండంబును బోని తాళవిటపిన్♦హస్తంబునం దాల్చి హుం
కరణం బొప్పఁగఁజేసె దానవుల కు♦త్కంపంబు నిండారఁగన్.
మ॥ యముఁడున్ భూతములున్ మొగుళ్లు నొకరూ♦పై వచ్చెనా నొప్పి శై
లములం గూల్పఁగ వాలు వజ్రమను లీ♦లన్ వాలి సంహార కా
లమునన్ రేఁగెడు రుద్రుమాడ్కి రిపు వి♦క్రాంతి క్రమాభీలుఁడై
చమరెన్ గాలను గేలఁ దాళమున నా♦సారంగ యూథంబులన్.
సీ॥ త్రొక్కుటచేఁగొన్ని ♦ ఆక్కుటచేఁగొన్ని, కాలను గొన్ని మో♦కాలఁగొన్ని
వాలమ్మునంగొన్ని ♦ తాలమ్మునంగొన్ని, ఘాలమ్మునంగొన్ని ♦ కేలఁ గొన్ని
నలఁచి కొన్నింటిని ♦ మలఁచి కొన్నింటిని, విఱిచి కొన్నింటిని ♦ కఱచి కొన్ని
యీడ్చి కొన్నింటిఁ దో♦లూడ్చి కొన్నింటి వే, చీల్చి కొన్నింటి మై♦నుల్చి కొన్ని

తే॥ త్రుంచికొన్ని వంచుచుఁగొన్ని♦ కుంచికొన్ని, యొక్కటొక్కటిపై నేసి♦ యొక్కకొన్ని
హుంకృతింగొన్ని సమయించి♦ యుత్సహించెఁ♦ గేసరిసుతాఖ్య సార్థక♦ మై సనంగ.
తే॥ నేలకుం దాఁచికొన్ని వా♦ర్నిధినిగొన్ని, లంకలోఁగొన్ని దెసలకుఁ గుంకఁగొన్ని
ప్రేవుప్రోవు లురలఁగొన్ని♦ ద్రిప్పికొన్ని, నదమదము నేసి యెస రేఁగె♦ శ్వసనసుతుఁడు.
తే॥ వాలమున కొండ చిలువనా♦ వంచువంచి, హూవటేంద్రతోఁ గరుల నం♦బరము సేర్చు
విలయకాల రుద్రుండన♦ వీఁకఁ దనరి, శవమయముచేసె నా రణ♦స్థలముఁ ద్రుటిని.
తే॥ కలఁచిమాంసమేదోద్రసపం♦కంబునందు, పెక్కుగజములఁ గడిమిమై♦ద్రొక్కివైచె
మిగత తన భాగమనుచు సౌ♦మిత్రి వాని, ఘోరసాయకరాజిచేఁ♦ గొందివైచె.
తే॥ అన్ని దెసల నేన్గులు పీన్గు♦లగుచు నురలఁ, జిక్కి రక్కసుల్ సుక్కిరి♦ సుక్కుకుండు
వారలిఱుకుకొనిరి తక్కు♦ వారు వెన్ను, చూపుచును చూచుచును పాఱఁ♦ జొచ్చినారు.

—: దేవాంతకుండు హనుమచేఁ గూలుట :—

తే॥ అసురులక్లాటఁ గన్న దే♦వాంతకుండు, తేరుఁ దోలించి కిన్కమై♦ మారుతిపయి
వాఁడి యమ్ము లురమ్మునఁ♦ గాఁడనేసి, సింహనాదంబు దనుజులు♦ చెలఁగఁ జేసె
క॥ పావని యొకతరువుంగొని, వైవఁగ నసురుండు దానిఁ♦ బఱియ లొనర్చెన్
దీవరముగ మఱియొక గిరి, వైవ నతఁడు దాని నడుమ♦ భగ్నము సేసెన్ ౧౬౧౨
తే॥ గరుడుమాడ్కి నదాటున♦ నరదమునకు, దాఁటి మారుతి దైత్యుని♦ ధనువు నూడఁ
దీసికొని రెండుగాఁగ ఛే♦దింప వాఁడు, మరల హనుమని గొట్టెఁ దో♦మరముతోడ.
తే॥ తివిరి యనుమఁ డూడిసి పట్టి♦ ద్రిప్పివైవ, దానిచే సారథియుఁ దేరు♦ ధరణిదొరలె
యవల శూలంబుఁగొన్న దే♦వాంతకు శిర, మూడఁబెటికివైచెను కపు♦లుల్లసిల్ల.
చ॥ అది తన కన్నులారఁగని ♦ యా యతికాయుఁడు రౌద్రదృష్టితో
నదలిచి తేరుదోలుమని ♦ యాముని మారుతిఁదాఁకె నేసలున్
జెదరినవెల్ల నిల్కడను ♦ చెంది పదంవడి వచ్చె దైత్యుఁడుం
బదరుచు నాంజనేయుఁగని ♦ పల్కె బయోధర భీషణధ్వనిన్. ౧౬౧౩
మ॥ అసమాన ప్రతివీర నిర్మథన బా ♦ హా దత్తు మా యత్తు ని
వ్వసుధన్ రాచి పయోధిదాఁటి చని నీ ♦ ప్రాణంబు దక్కించుకొం
టి నమిద్ఘోరతలంబునన్ గడిమిమై♦ డీకొన్న దేవాంతకున్
వెనఁ దున్మాడితి వద్దిగాంచి యని గా ♦ వింపంగ విచ్చేసితే. ౧౬౧౪
శా॥ నేఁడే మృత్యువు దాపరించె వినుమా ♦ నీపాలికిన్ నిక్కమీ
నాఁడే పూని వధింపకున్న మఱి యే ♦ నాఁడున్ సమీపింపఁ బె
క్కేడాగోడము లాచరించితివి ని ♦ న్నే డాటలాడింపకే
పీడంజాలను పాఱిపోక నిలుమా ♦ వీరుండవే నైన-చో. ౧౬౧౫

ఉ॥ మేరు సమాన ధీరుడు స ♦ మీరసుతుం డతికాయు వార్తకుం
గేరుచు నవ్వి వీరుఁడవు ♦ క్రించుఁదనంబు లిఁకేల? నామెడ౯
గ్రూరత చూపఁగాఁ ద్రిశిరుఁ ♦ గూడ సహాయత గోరుకొమ్ము నీ
యూరసముల్ ఫలింపవని ♦ యొల్లిదమాడఁ ద్రిశీర్షుఁడు౯ వడి౯. ౧౬౧౮

చ॥ తెరలక నిల్వుమం చరుగు ♦ దెంచి మరుత్సుతుఁడాఁక నాతఁడు౯
దురమొనరింప మీరె వలఁ ♦ తుల్ వెడఁగుల్ చపలాత్ములంచు సం
బరముగఁ బల్కి దానవుల ♦ పాలి యముండగు వాయుసూతి భీ
కరగతి వచ్చెఁ దానరుగు ♦ గాలికి వారల నాల్కలెండఁగ౯. ౧౬౧౯

ఆ॥ వచ్చి వాని తేరి♦పైకి లఘించి చే, వమెయి వానిఁబట్టి ♦ వసుధఁ ద్రోచి
కాలరాచి ప్రతిన♦పాలించి పడమటి, గవనుచేరె సేనఁ♦గాచుకొఱకు. ౧౬౨౦

మ॥ త్రుటిలో దాఁటె నిఁకేమిచేయనగు నీ ♦దుష్టాత్మ నంచాత్త సం
కటుఁడై యయ్యతికాయుఁ డ్రశువులు వే ♦ కాఱంగ నిశ్చేష్టుఁడై
కటముల్ కేలువడంక నిల్చి యితఁ డు ♦ గ్రక్రోధుఁడై నిల్వఁగా
నిటలాక్షుండు నెదుర్పఁజాలఁడని ని♦ర్ణీతిం బ్రశంసించుచు౯. ౧౬౨౧

మ॥ ఒకకార్యంబునఁ పూని వేఱొకఁ డెద౯ ♦ యోచించుచు౯ నిల్కగా
ళ్లకు మేల్చిన్నియగాదు లక్ష్మణు నన ♦ ల్ప స్థైర్య శౌర్యాదులం
బ్రకటోగ్రాజిని గానఁగోరి యిటు లో♦ప్ప౯ వచ్చితిం దేరు ని
ల్పక పోనిమ్మని తూణయుగ్మ మొకశే ♦ వ౯ దిద్దుచుం గన్నన౯.

—: అతికాయుఁడు లక్ష్మణుచేఁ గూలుట :—

శా॥ నేమిధ్వానము వార్ధి ఘోషమును గ్రే ♦ ణింప౯ ధనుర్నాదముల్
జీమూతధ్వనిఁ గ్రిందుసేయ దెసలుం ♦ జేడ్పాటుగా శంఖ భే
రీముఖ్యస్వన మొత్తరింప రణధా ♦ త్రి న్నిల్చు నక్తంచరున్
భీమప్రోద్ధతి లక్ష్మణుండు చెనకె౯ ♦ వేల్పుల్ ప్రశంసింపఁగ౯. ౧౬౨౩

తే॥ త్వరితగతి డాసి వాలిపు♦త్త్రకుఁడు దనుజుఁ, డరదముననుండ నిల నిల్చు♦టనువుగాదు
క్రించుఁడన మైన నాపై ర♦హించి యెక్కు, మనుచు వేఁడఁగ సౌమిత్రి♦యనుమతించి

తే॥ వానిభుజములపైఁ దన♦పదములుంచి, యెక్కి నిల్చె; వెన్నుని మోయు♦నెక్కరింత
యూడితనికంచు వేలుపు♦లిచ్చ మెచ్చి, విరులు కురియించి పొగడి దీ♦వించినారు.

తే॥ వాలికొడుకు పెందేరగు♦వలని కేగుఁ, బెరుఁగఁ బెనఁగు వింటికి నేగ♦వింటి కేగు
నడఁగ నడఁగు నెల్లెగిన♦నట్టులేగుఁ, బ్రభుని హృదయం బెటేంగి త♦త్పద్ధతిఁ జను.

తే॥ అంగదునినేర్పుఁగని వాన♦రాధిపతులు, సంతసించియార్చిరి సము♦త్సాహ మెసఁగ
కరిఘటలమీఁద రథ తురం♦గముల మీఁదఁ, గురిసె లక్ష్మణసాయక♦కుంభవృష్టి.

తే॥ మురజములు మ్రోసె రథనేమి ♦ మ్రోఁగెఁ దురగ, హేషలెసలారె శింజినీ ♦ ఘోషమడరె
కరుల ఘీంకృతుల్ హెచ్చె శం ♦ ఖములు మొరసెఁ, గ్రందెఁ దర్జన భర్జన ♦ గర్జనములు.

ఉ॥ కూలెను వారణంబులును ♦ కూలె రథంబులు కూలె నశ్వముల్
కూలెను కాల్బలంబులును ♦ కుప్పలు దిప్పలుగాఁగఁ గాలుఁడుల్
సోలెను తద్రణస్థలిని ♦ చూడఁగలేక సుమిత్రపట్టి దృ
గ్జాలము పోవుచోటులకు ♦ సాయకబృందము పోయి నాటఁగన్. ౧౬౨౯

మ॥ అతికాయుం గని లక్ష్మణుం డనియె వి ♦ ల్లమ్ముల్ దగంబూని ద
ర్పితబుద్ధిన్ సమరంబు సేయ నిటకున్ ♦ వే వచ్చి యిట్లుంటకున్
గత మేదో తెలిపింపుమా యొకఁడవై ♦ కయ్యంబు గావించెదో?
పృతనావారము గూలఁ దండ్రి పగిదిన్ ♦ భీతుండవై పాఱెదో? ౧౬౩౦

మ॥ అన ధీరుం డతికాయుఁ డిట్టులను సై ♦ న్యం బెల్ల నా కేల? నీ
వును నేనే యనిసేయువార మిట వే ♦ ల్పుల్ దక్కువారున్ రణం
బును వీక్షించుచునుండ నాకడిమి పెం ♦ పున్ సొంపు శోభిల్లఁగా
నిను గూల్పంగలవాఁడ నందులకె గా ♦ నేఁ డిట్లు పిల్పించుటల్? ౧౬౩౧

ఉ॥ రాముఁడె కావనిమ్ము త్రిపు ♦ రద్విషుఁడే నిను గావనిమ్ము సు
త్రాముఁడె కావనిమ్ము సిరి ♦ రాయనితోడుగ లోకసత్తకం
బోమగనిమ్ము నీయసువు ♦ లుద్గతి నొందును నేఁడు ఘోర సం
గ్రామమునందు నిల్వుమని ♦ గర్వమయుండయి యొత్తె శంఖమున్

చ॥ అదివిని లక్ష్మణుండు దర ♦ హాసము చేయుచు నీవు పల్కు బె
ట్టిదు లిటరారు గెల్చినను ♦ డిందిన నేనొకరుండనే చుమీ
వదరక నన్ను గెల్వఁ బెర ♦ వారల గెల్చినవాఁడవౌదు నా
యెదురను నిల్వుమం చొక మ ♦ హేషువు వక్షము నాటనేయఁగన్

చ॥ వెదురయియున్న కాలునకు ♦ వేగ గుణంబు దగిల్చి దైత్యుఁ డా
ప్రదరము నంతరంబుననె ♦ వ్రయ్యలుచేసి సహించి కాచుకొ
మ్మదరక యంచుఁ గ్రూర గర ♦ ళాగ్నులు గ్రక్కు శిలీముఖంబులన్
బదియును నూఱుగాఁగఁ దన ♦ వారలు సంతసమంద నేయుడున్. ౧౬౩౪

తే॥ వాని శరముల నడుమనే ♦ వ్రక్కలించి, లక్ష్మణుండేసె నాఱుకో ♦ లలఁ గుబేరు
నోర్చి వెలసిన యతికాయుఁ ♦ డుగ్రుఁడగుచు, నన్నితూపులతో వాని ♦ నడఁచివైచె.

మ॥ పురుషశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు గుణ మా ♦ పూర్ణంబుగా లాగి రౌ
ద్ర రసావేశము మీఱి తోఁపఁ బది నా ♦ రాచంబులం జొన్పి మై
మఱువుం జించి నిశాతసాయకములన్ ♦ మైసోఁకఁగా నేసి య
త్తతిఁ దత్సేనల రూపుమాపె నొకఁడుం ♦ దక్కంగ నీకుర్వడిన్. ౧౬౩౬

ఉ॥ వెంటనె తేఱివాఁడు తన ♦ వీరకదంబము తూఫుమాయుటన్
గంటికి బర్వఁగాఁగ నెడ ♦ గానక యమ్ములు పర్వి నిండుటల్
మంటలు గ్రక్కఁ గాంచి బహు ♦ మాత్రముగా శరవృష్టి మించి ము
క్కంటి యుగాంతవేళ నెస ♦ కంబుగ నేచినమాడ్కి రేఁగఁగన్. ౧౬౩౭

ఉ॥ ఆకసమెల్ల నమ్ములు ది ♦ గంతము లమ్ములు భూమినమ్ము ల
మ్మాఁకలమేన నమ్ములు స ♦ ముత్కటమై యెటఁజూడ నమ్ము ల
స్తోకముగాఁగ నిండి వడిఁ ♦ ద్రోవఁగసాగెఁ బరస్పరంబు ని
శ్శ్రీకములయ్యె నన్ను లద ♦ రెన్ గగనంబు ధరిత్రి శైలముల్. ౧౬౩౮

చ॥ మునిఁగిన తోకమూఁక తుది♦ముట్టకయే తలయెత్తనేర్చునే?
కినిసిన లక్ష్మణుం డితని ♦ గెల్చునె? యీయతికాయుఁ డంత్యకా
లునికడ నేర్చెనో కోల సి ♦ ఱంగులు కూర్చుట? వీనినేర్పు నే
మనఁదగు? నంచు భీతిలి వి ♦ యచ్చరు లేగిరి దవ్వు దవ్వుగన్.

ఉ॥ అంగదు బాహులందు మెడ♦యందును వక్షమునందు నంప పిం
జం గతి గానరా బహుళ ♦ సాయకముల్ వడి నాటి లక్ష్మణున్
ముంగలి గాననీక శర♦ముల్ నిగిడించి దరంబునొత్తి మిం
టంగల వేల్పుమూఁకలు వ ♦ డంక నొనర్చె మృగేంద్రనాదమున్.

తే॥ సెలయనంగనంగదు మేన♦ సెలలు గ్రుచ్చి, సెలయుటలు లక్ష్మణుండు వీ♦క్షించి రౌద్ర
మూర్తియై శరవర్షంబు♦ముసర వాని, ధనువు విఱిచి సారథిని ర♦థ్యములఁ జంపె.

ఉ॥ వేఱొక తేరిపై కుఱికి ♦ వేఱొకవిల్లు ధరించి తాఁకు నా
కారి కుమారుపై రఘు వ ♦ రానుజుఁ డగ్నిశరంబు నేయఁగా
మాఱుగఁ గర్బురుం డనల ♦ మార్గణమేసి సహించుకొమ్ము పొం
గాఱఁగనీయకంచు దుర ♦ హంకృతి నార్చెఁ గవు ల్గలంగఁగన్. ౧౬౪౨

ఉ॥ హెచ్చును కుందు గానఁబడ ♦ నీయక రెండును పోరుచుండఁగా
హెచ్చిన లక్ష్మణాస్త్రము ల ♦ హీనజవంబున దైత్యు వక్షముం
గ్రుచ్చుచు వీఁపునవ్వెడలఁ ♦ గుప్య దుదంచిత సింహమో యనన్
రెచ్చి సురారియున్ దిటవు ♦ ప్రీలక మాఱొనరించెఁ జేవమై. ౧౬౪౩

చ॥ మఱియును లక్ష్మణుండు శిత ♦ మార్గణముల్ వెననేసి వాని ముం
దఱ గలవారి వెన్కఁగల ♦ దైత్యులు చూడఁగదగ్గయట్లు చిం
దఱలుగఁ జేయఁగా నసుర ♦ ధైర్యము వీడక బాణవర్షముం
గురియుచునుండె వానరుల♦కూటము డగ్గఱఁ జెంగకుండఁగన్. ౧౬౪౪

ఆ॥ అపరిమితముగాఁగ ♦ నస్త్రంబులను వారి, విడుచు రాముతమ్ము ♦ వీనులకడఁ
జేరి వీని శమనుఁ♦జేర్పుము బ్రహ్మాస్త్ర, మునన యనుచు ననిలుఁ♦డనియె నల్ల

తే॥ మంచిదని సంతసించి ల ♦ క్ష్మణుఁడు కడఁగి, తొడిగి మంత్రపూర్వకముగ ♦ ద్రుహిణశరము
నేయ నది యుగ్రుఁడగునతి♦కాయు శిరము, మింటఁగొనిపోయె సంతకు♦నింటికడకు

క॥ కష్టములు తొలఁగెనని సుర, లిష్టంబున విరులు గురిసి ♦ యెసఁగిరి చింతన్
దుష్టులు దైత్యులు పాఱిరి, శిష్టులుఁ గీశవరు లుల్ల ♦ సిల్లిరి మిగులన్ ౧౬౪౭

చ॥ జయము గడించి లక్ష్మణుఁడు ♦ సమ్మతి నంగదునుండి క్రిందికిన్
రయమున డిగ్గ నాతని ప ♦ రాక్రమలాభముఁ గాంచినట్టి ప్ర
త్యయమున నింద్రజిత్తు నిఁకఁ ♦ దప్పక నాశమునొందు నన్న ని
శ్చయమున నవ్విభీషణుఁడు♦చాలఁ బ్రశంస యొనర్చె నయ్యెడన్. ౧౬౪౮

—: నరాంతకుఁ డంగదుచేఁ జచ్చుట :—

ఉ॥ సుందరవక్షుఁడైన సుర ♦ సూదన పుత్త్రకుఁ డీల్గెనంచు నీ
చందన గంధిలంబగు వి ♦ శాల సువక్షముఁ జూచికొంచు వి
ల్లందముగాంచి పొంగుచు న ♦ యంబున నెచ్చటికేగెదింక నీ
యందము చందము న్నిలువ ♦ వంచు నరాంతకుఁ డగ్గలించుచున్.

చ॥ మిడుగుఱు లక్షులందు మిఱు ♦ మిట్టులు గొల్పుచు రాలఁ గిన్కయుం
దొడిఁబడి లేవ ధారణికి ♦ దూఁకి నరాజియు ఖేటకంబుఁ బెం
పడరఁగఁ దాల్చిరాఁ గపు ల ♦ గాఘము వ్యోమము గప్పవైవఁ బు
ప్పొడివలె దూదిపింజలటు ♦ పోఁడిమిఁ దూల్చుచు డాయవచ్చినన్

చ॥ కని యొక వృక్షరాజముఁ బె ♦ కల్చి కరంబునఁ బూని వాలి నం
దనుఁ డెనరేఁగి రామవిభు ♦ దారుణ సాయకమట్లు తాఁకెఁ దాఁ
కిన క్షణమందె యంగదుని ♦ కేలధరించిన వృక్షమున్ నరా
లునఁ దెగనేసె నొక్కత్రుటి♦లోనఁ బరుల్ గనలేని నెవ్వడిన్. ౧౬౫౧

తే॥ అంత రిక్తహస్తుండయి♦యంగదుండు, వెనుక కేగుట పాడికా♦దని తలంచి
పైకి లంఘించి చేరిచి♦పట్టె వాని, కాలు గే లడిదంబును♦కదలనీక.

ఉ॥ పట్టినవాని సాహసము ♦ పట్టుగ వేల్పులు కాంచి చేతులం
దట్టుచు నార్చి రంగదుఁడు ♦ దారుణముష్టి వధింపకే వెసం
బట్టెము లాగి కొంచుఁ దెగ♦వాఱఁగ దేహము నిట్ట నిల్వునం
బట్టుగఁ జీల్చివైచెఁ గను ♦ పడ్డ సురారులు విహ్వలింపఁగన్. ౧౬౫౩

—: ఉన్మత్తుఁడు నీలునిచేఁ గూలుట :—

తే॥ పిడుగులనుఁ ద్రుంగఁజాలిన♦బెట్టిదుండు, పేర నున్మత్తుఁడనువాఁడు♦పిలువ రేఁగి
తప్పఁద్రావి యున్మత్తదిన్న♦మొప్పు పగిది, మత్తుఁడై మత్తకరి నెక్కి♦యుత్తరించె.

సీ॥ గాలిగాకున్న నీ♦లీల వేగమదేడ ?, జలధి గాకున్న నీ ♦ శబ్దమేడ ?
శమనుండె గాకున్న♦జనహింస యెటులగుఁ ?, బిడుగు గాకున్న నీ♦చెడుగుగలదె ?
కోపమేరూపు గై♦కొనక యీ వడియేడ ?, జలదంబుఁ గాకున్న♦ స్తనిత మేడ ?
అల గజాసురుఁడె గాఁ ♦ డైన భీకరమేడ ? నడగొండగాకున్న♦నడచుటేడ ?

తే॥ అనుచుఁ గనుగొన్న వానరు♦లడలి బడలి, జడిసి బెడిసి పడుచు లేచి♦కడల దాఁకఁ
బరుగువాఱ విజృంభించి♦తిరుగఁదొడఁగె, మత్తుఁ డున్మత్తుఁ డెక్కిన♦మదగజంబు.

తే॥ వానరులువైచు పర్వత♦పంక్తులెల్ల, మావఁతుల యొడిసెలలకు♦మాఱుగావు
కపులువైచు పెందరువు లీఁ♦గలను దోలఁ, బనికిరావయ్యెఁ జెఱకుగాఁ♦బనికివచ్చెఁ.

సీ॥ కాళ్లక్రిందంబడి♦కసకసయైనవి, వాలంపు వ్రేటున♦నీలిగినవి
తుండంపు విసరునఁ♦గొండలఁబడినవి, కొమ్ముల క్రుమ్మునఁ♦గూలినవియు
నై మలమనుకులు♦సౌమిత్రిశరముల, దనుజు లొందినపాట్లు♦తప్పకొందఁ
గాంచి నీలుఁడు పెను♦కాంతాళమున నొక, సాలవృక్షముగొని♦లీలఁద్రిప్పి

తే॥ కొనుచురాఁగ నున్మత్తుఁడు♦కోలలైదు, పరపి సాలమ్ము ఖండించి♦వైవ వేఱు
కొండయొండు నీలుఁడు గుఱి♦గూడ నేయఁ, దునుకలుగఁజేసెఁ బదునైదు♦తూపులేసి.

తే॥ మరలనొక కొండవెదకంగ♦మరలునంత, మరలనీయక నాగంబు♦మందరమును
చుట్టినట్టులా నాగంబు♦చుట్టెనీలు, నట్టు లిట్టులు కదలనీ♦యక కడింది. ౧౬౫౮

ఉ॥ సాహసముఁ బలంబు వ్యవ ♦ సాయము కౌతుకముఁ దిటంబు ను
త్సాహము ధైర్యముం గడిమి ♦ సర్వ మడంగెన యంచు సేన సం
దేహము నొందునంతఁ గపి ♦ ధీరుఁడు దారుణముష్టి దేవ సం
దోహము మేలుమేలని నుతుల్ పొనరింపఁగ వ్రచ్చె శీర్షముఁ. ౧౬౫౯

తే॥ నేలకుం దాఁటి నీలుండు♦నిలుచునంతఁ, బొరలునెత్తుట నేనుంగు♦వ్రాఁడిపోవ
మింటనిలిచి యున్మత్తుండు♦మించియర్ధ, చంద్రసాయకంబులను వ♦ర్షముగ గుప్పె.

తే॥ నీలుఁ దూడఁదీసిన వజ్ర♦నిభ రదముల, నసురసేయ నాతఁడు నొక♦యమ్ముచేత
వానినడఁచి వేఱొకతూపు♦తోన నీలు, నురము నాటఁగనేసి బి♦ట్టఱచి యంత.

తే॥ వేఱు దంతిపై నెక్కి యొ♦ప్పారవచ్చె, వచ్చినం గని నీలుండు ♦ వానిమీఁది
కెగసి వింటితోఁడను వానిఁ♦దిగిచి యిభము, ముందునుంచె నుంచఁగ♦నది♦మును మ్రించి.

తే॥ క్రుచ్చి కొమ్ములతోఁ గాలఁ♦ద్రొక్కి కరము, తోడనెత్తి విసరివేయ♦దుండగీఁడు
తప్పి చావక కోపంబు♦తటమటింపఁ, దనగజంబును తానె చిం♦దఱలుచేసె.

తే॥ అంత నీలుఁ డున్మత్తు ను♦రోంతరమున, బలిమిఁ బొడువంగ నెత్తురు♦బొళుకు బొళుకు
మనఁగఁ గ్రక్కుచు గ్రుడ్లుముం♦దునకునుఱుక, విలవిలందన్ని కొనుచును♦పృథివినొఱఁగె.

—: బలమత్తుఁడు ఋషభునిచేఁ జచ్చుట :—

సీ॥ అన్నచావుంగని♦యత్యుగ్రహంబున, బలమత్తుఁడను మహా♦బలుఁ డొకండు
మృత్యువె తన్నిద్వ♦మించి యనత్యంబు, కంటె ఘనంబైన♦యొంటితోడ
సరభసమునఁ బిశా♦చములు పూన్చిన తేరి, పైనెక్కి జగములు♦భయమునొంద
నఱచుచుఁ బిడుగుల♦తెఱఁగున వడివడి, శరములేయుచు వన♦చరులఁ దఱుమ
తే॥ ఋషభుఁ డెదిరించి కడు హుంక♦రించి నిలువు, మనుచు నదలింప దైతేయుఁ♦
డాలిగొనుచు
నీవు పిన్నవాఁడవు చేవ♦నిన్ను గెలిచి, కలుగు దొడ్డపేరెయ్యది♦తొలఁగుమనుచు.
తే॥ మంతుకెక్కిన యాహను♦మంతుఁ బిలువు, రాముతమ్ముని పిలువుమా♦రణజితులను
చంపు పిదప మీపైఁగోప♦గింపఁదగును, పొమ్ముపొమ్మన ఋషభుండు♦పోలఁజూచి.
చ॥ పీనుఁగులన్ భుజించి మను♦పీనుఁగులంగొని నోటిక్రొవ్వుతో
మానుగ గెల్వవచ్చితివె? మందుఁడ! రోగమునొంది మందు సుం
తేనియు రోయకుండు మతి♦హీనుఁడ! లక్ష్మణుఁడేలరా? మరు
త్సూనుఁడునేల? నన్గెలుచు♦దోర్బలముండినఁ జూత మవ్వలన్. ౧౬౬౭
ఉ॥ పాఱక నిల్వుమంచు వెఱ♦పాఱక పల్కఁగఁగాంచి దైత్యుఁడున్
పాఱెదవంచు నెంచితిని♦పాఱక ధీరునిమాడ్కిఁ గాఱులన్
మాఱుగఁ బల్కుచుండిన న♦మానుషలీలల నాటలాడెదన్
మోఱకు! పోకుమంచు విలు♦మోపును బొమ్మలు లీల వంచుచున్.
సీ॥ పది తొమ్మి నాటంగఁ♦బరపి పదింట దే, హంబెల్ల రక్తమ♦యంబునేయ
ఋషభుఁడు కడుఁజెల♦రేఁగి రక్కసుతేరు, బలిమిమై జలధిలోఁ♦బడఁగవైవ
బలమత్తుఁడును నీటఁ♦దలక్రిందుగాఁబడి, యిలుగక కలనికి♦నెగసిరాఁగ
నెగడెదవే యని♦నిశి నెదిరించిన, పగలు నా ఋషభుండు♦వానిఁబట్టి
తే॥ బాహుబలమునఁ నలఁపంగఁ♦బచ్చిరక్త, మొడలనవరంధ్రముల వెలు♦వడియె; వాఁడు
మిడుక కట్టులే జీవముల్♦వెడలఁ బుడమిఁ, బడియె ఫిల్లందిన నగంబు♦పడిన పగిది.

—: సుగ్రీవుఁడు కుంభుని చంపుట :—

మ॥ కినుకన్ వేఱొకచోటఁ జేవమెయి సు♦గ్రీవుండు కుంభుండు త
ద్రణ రంగమ్మునకే వినూతన మహా♦ద్ధత్యంబు సేకూర్చుచున్
దనుజుల్ వేల్పులు వానరుల్గని ప్రమో♦దంబుం భయంబొంద నీఁ
కను పైపై విజిగీషులై పెనఁగి రం♦కంపింప భూభాగమున్. ౧౬౭౦
క॥ కేసరులఁబోలి కిట్టుచు, మాసరముగ రుధిర మడర♦ములయుచు గాసిన్
వేసరక స్థిరగుణములు, భాసురముగఁ బోరి రుగ్ర♦బల దర్పములన్. ౧౬౭౧

క॥ కుంభుఁడు దండము ద్రిప్పుచు, నంభోరుహ మిత్రసూను♦నడిచె నతఁడు నం
రంభమున నొక్కతరువున, స్తంభింపఁగనేయ రెండు♦ధర విఱిగిపడెన్   ౧౬౭౩

క॥ సహింయింపక చంపెదనని, మిహిరసుతుం డదను పొంచి ♦ మీఱి నిలువ తే
ని హితము కోరిన నీలుఁడు, మహీరుహము నొండు తెచ్చి♦మానుగ నిచ్చెన్.

క॥ దానిఁగొని పూన్కితోడను, వానరనాయకుఁడు వాని ♦ వక్షము పగులం
గానడిచె బలముకోలఁదిని, దానవతతి కలఁత చెంది♦తడఁబడి పాఱన్.   ౧౬౭౪

క॥ దెబ్బదినిన కుంభుఁడగిని, గుబ్బతిలన్ వజ్రహతిని♦గూలు నగము నా
గొబ్బునఁ బడెనని వానరు, లుబ్బినతఱి లేచి దనుజుఁ♦డుడుకుచు నెదలో.

క॥ భుజములపైఁ గొట్టిన నం, బుజమిత్ర సుతుండు నొచ్చి♦పోఁడిమిమై బా
ణ జవంబునఁ బఱచుచుఁ గ్రతు, భుజువైరియురంబు ముష్టి♦బొడిచెం బెలుచన్.

క॥ అలపును సొలపును కానక, గెలుపోటము తేర్పఱించి ♦ కించిత్తేనిం
బెలుప నశక్యంబగుక్రియఁ, జలమున విజయాభిలాష♦జగడించి రొగిన్.   ౧౬౭౭

క॥ పిడికై మదగజములు రెం, డెడయక పోరెడి వితాన♦నిరువురుఁ బెలుచన్
బొడుచుచుఁ బొడువుమనుచు నెడ, విడుపింతయు లేకయుండ్రి ♦ విజయశ్రీకై.

క॥ అమ్మాడ్కి ని నుమ్మరముగఁ, గ్రమ్మిన సమరమ్ము జరుగఁ ♦ గమ్మరి దిమ్మన్
నమ్మెటపోటన దనుజు ను, రమ్మును కపిరాజు గ్రుమ్మె ♦ వ్రయ్యలుగాఁగన్

తే॥ అపుడు నారక్కసుండు న ♦ న్నాలిగొండు, వా యనుచు నవ్వ సుగ్రీవు ♦ నైదుతలల
పాముబోలిన హ స్తమ్ము♦వానినోటఁ, జొచ్చి యసువులెడల నాల్కఁ ♦ బుచ్చివైచె.

—: నికుంభుని హనుమంతుండు కూల్చుట :—

తే॥ అన్నగతిగాంచిన నికుంభుఁ♦డాగ్రహించి, కదలె దెచ్చటికని కపి♦కాంతుఁ గదియ
నంతవానికి నంగదుఁ♦డడ్డుపడియె, నిరువురకు ఘోరముగఁ బోరు♦జరగె నపుడు.

క॥ శూలముగొన్న నికుంభుని, వాలిసుతుఁడు తాఁకెఁ దాల ♦ పాదపకరుఁడై
నీలగిరిపైకిఁ గాంచన, శైల మ్మురవడిని దూఁకు♦చందము దోఁపన్.   ౧౬౮౩

క॥ శూలము దనుజుండెత్తఁగ, నాలో నంగదుఁడు మడియు♦నని జడియుచు వా
తూలసుతుఁ డేచి జ్వాలా, మాలా భీలాగ్ని కరణి♦మండుచుఁ దాఁకెన్.

క॥ తాఁకి మరుత్సుతుఁ డమరా, నీకప్రభు వజ్రమనఁగ ♦ నెగడిన ముష్టిన్
రాకాసి నికుంభుని తల, జోకం గదుపునకు డిగ్గఁ ♦ జొప్పించి చనెన్.   ౧౬౮౪

క॥ మిగిలిన దనుజులకుఁ గపులఁ, దగిలెడి సత్త్వంబులేమిఁ ♦ దత్తఱపడుచున్
దిగులూని పఱవ వెనుకం, దగిలి కపీశ్వరులు సదమ♦దము చేసిరొగిన్.   ౧౬౮౫

క॥ పరుగిడి గవని నరుగు తొం, దరచేఁ ద్రొక్కుళ్లువడుచు♦దనుజులు పెక్కం
డ్రురలిరి శిబిరములకుఁ జని, కెరలిరి పెక్కండ్రు పుండ్లు♦కెలయుట కతనన్.

క॥ నోరెండఁగ నిలుకడచెడి, నీరిండని వేఁడి యసువు♦నీగినవారల్
దారి గనలేనిక్రియఁ గ, న్నీరొలుకఁగఁ జచ్చు యామి♦నీ సంచారుల్. ౧౬౮౭

క॥ నింగికెగసి చని యసువులు, క్రుంగఁగ నటనుండి మలల ♦ కోపునఁబడు వా
రంగము లవియఁగఁ బ్రేవులు, తొంగ ధరకు వ్రాలు నపశ♦దులు పెక్కండ్రుల్.

క॥ పరిచితులఁగాంచి దయ నీ, శరములఁ దీయుఁడన వారు♦సడలింప ననూ
త్కారము విడుచువారలు నం, దిరముల బంధులకు గుర్తు♦తెలియనివారల్.

క॥ హారు లురలఁగఁ దడఁబడుచుం, గరులు దొరల ధరణిఁబడుచుఁ♦గాలెడు మలల
శ్లైరిసెడు నరదంబులలోఁ, దిరుగుడువడి తిచ్చవడుచుఁ♦దెరలెడివారల్. ౧౬౯౦

సీ॥ గాయమ్ములొందిన♦కాయమ్ముల బరువు, మోవఁగాఁజాలక♦మూల్గువారు
వానరవేషులై ♦దానవు లరుదేరఁ, దమవారి మోఁదఁగా♦సమయువారు
కనువిచ్చి యిండుల♦కడ దిగువారు చు, ట్టల జల మిమ్మని ♦ తెలచువారు
త్రాగి చచ్చినవారు♦త్రాగ నుంకించి యు, శ్లే తేటిచూచుచు♦నిలుగువారు

తే॥ పుత్త్రులను మోచికొని వడిఁ బోవువారు, ప్రాణములు త్రోవలో విడఁ♦బాటివైచి
కనులు చెడ దారిదప్పి త్రో♦క్కటము పడుచు, నడవలేక యట్టులె పడి♦ముడుఁగువారు

క॥ ఆ తెఱఁగుగాంచి పాటిన, దూతలు తడఁబడుచు వడిగఁ♦దో తెంచి సురా
రాతి పదంబులపైఁ బడి, యేతీరునఁ దెలుపుటనుచు♦నేడ్చిరి పెలుచన్. ౧౬౯౨

క॥ జరిగిన దేమని రాక్షస, వరుఁ డడుగన్ వారు మీరు ♦ వంపిన సేనన్
మరలిరి కొంద ఱనంగాఁ, దెఱఁగు వడదు నీదు సుతులు♦తీఱిరి దేవా! ౧౬౯౩

తే॥ అనుడు బాష్ప ప్రవాహ మ♦నర్గళముగ, విడిచి దుఃఖంబు మానంబు♦వీర మధిక
చింత కరుణ మదము కిన్క♦చిక్కుగొనఁగ, రావణుఁడు భంగమున వారి♦రాశిఁబోలె.

చ॥ కడలనుగాంచు వేలుపులఁ ♦ గాంచును వచ్చిన నిందఁ గాంచుఁ జే
యడిదముఁ గాంచు నగ్గలిక ♦ హస్తముల న్నలఁచున్ ముఖంబు చే
ద్పడ వడినూర్చు నేడ్చు నగు ♦ వందురు సిగ్గిలుఁ గుందుఁ గూలు బ్రమా
న్పడు వెగడొందు బెండువడు ♦ వాపిడుచున్ వనరుం గుమారిలున్.

చ॥ పుడమిఁ బెకల్పఁగాఁ దలఁచు♦వ్యోమముఁ గూల్పఁ దలంచుఁ బ్రాణులన్
బొడిపొడి సేయఁగాఁ దలఁచు♦బోటుల నెల్లరఁ ద్రుంపనెంచుఁ బె
న్జిడిముడిపాటుగాంచు మఱి ♦ చేష్టలుదక్కును వుంటిమీఁద ని
ప్పిడిన తెఱంగునన్ మది వ ♦ హించును పొక్కును బోలు బెగ్గిలున్

## —: ధాన్యమాలిని రావణు నిష్ఠురోక్తులాడుట :—

ఉ॥ అచ్చట నున్నవారు పలు ♦ కాడక యూర్పులువుచ్చ కడ్డలో
ముచ్చిరుచుండ నచ్చటికి ♦ మూర్తి వహించిన దుఃఖమో యనన్

వచ్చిన ధాన్యమాలిని స్వ ♦ భర్తృపదంబుల వ్రాలె గ్రక్కునం
బొచ్చెములేని ప్రేమమయుఁ ♦ బుత్త్రకుఁ గోల్పడు కుందు నోర్వమిన్.

ఉ॥ గాజులు హారవల్లులును ♦ కంకణముల్ మొరయంగ ఫుల్ల పం
కేజ సుగంధి వక్షమును ♦ కేలఁ దొడింబడ బాఁదుకొంచు ని
స్తేజపు మోముపైఁదుఱుము ♦ శీర్ణతనొంది పడంగ జాలికే
భాజనమైతి నంచు ధర ♦ పైఁ బొరలాడె భుజంగికైవడిన్. ౧౧౯౮

చ॥ ఇతరులకేని దుఃఖమది ♦ యెట్టిదొ నేరని కోమలాంగి దుః
ఖితయయి సర్వలోకములు ♦ కీడ్పడఁ గ్రుంగినరీతి నెంచుచున్
బతి వదనంబు గాంచుఁ దన ♦ పట్టిని మ్రింగితివంచు నేప్చు నా
వెత లుడుపంగ నేరు పృథి ♦ విం గలరంచుఁ దపించు నార్తిమై. ౧౧౯౯

మ॥ బలవద్వీరుల దోర్బలం బని నడం ♦ పన్ లేవొ? నీవీర్యమున్
జలధిం బూఁడెనొ? నీబలంబు చెడెనో? నాపల్కు లింతేని వీ
నులఁ జొప్పింపవొ? నమ్మతింపవొ వినన్? నూయిన్ విచారింపవో?
కలఁకంబాఱిన కంటిపాప మరలం ♦ గాన్పింపవో? కానవో? ౧౨౦౦

మ॥ పురుహూతుం బవరంబునం గెలుచు న ♦ త్పుత్త్రుం గన్న ధన్య యీ
తరుణీరత్న మటంచు నెల్లరును స్తో ♦ త్రం బొప్పగాఁ జేయఁగా
గరువంబొందినదాన నాకొడుకు లో ♦ కంబెల్ల హాహా యనన్
నరుఁ డొక్కండు వధించెనే? విధియు దు ♦ ర్న్యాయంబు పాటించెనే?

చ॥ కడచనె మున్నె యక్షుఁ డతి ♦ కాయుఁడొ యిప్పు డడంగె వీరులున్
మడిసిరి కుంభకర్ణుఁడును ♦ మ్రందెఁ గుమారులలో సజీవియా
కొడుకొక యింద్రజిత్తె యిఁకఁ ♦ గూలును రేపట నంతమీఁద నొ
త్తిడి యొకరుండవే కడిమి ♦ దిగ్విజయం బొనరింప కుందువే? ౧౨౦౨

తే॥ గిట్టినట్టి సోఁకుల బ్రతికింపఁగలవె? బుద్ధిచెడి కామివగు నీవు♦పుడమిమీఁద
బట్టగట్టుక యింకను♦బ్రదుకఁగలవె? సీతవలన మిగిలియున్న♦చెట్ట గలదె? ౧౨౦౩

చ॥ అనుపమ నీతిశాలి సుగు ♦ ణాకరుఁడైన విభీషణుండు ప
ల్కిన పలుకుల్ గణింప కవ ♦ గీర్ణ బలాఢ్యుని కుంభకర్ణు నా
తనయుని శత్రు శాత కర ♦ తండము పాలొనరించి నెమ్మదిం
గని పయి రాజ్య మేలుదువె? కాకులు గూబలు కూయుచుండఁగన్.

చ॥ అని పలురీతులం బలికి ♦ యన్నువ పిట్ట విధంబునన్ విలా
పన మొనరించి కేపు నెడఁ ♦ బాసిన ధేనువుభాతిఁ గుందుచున్
వనరెడు ధాన్యమాలినిని ♦ నాక శుభాంగులు కేలమీఁద నొ
య్యనఁగొని రాణివాసమున ♦ నాదటఁ జేర్చిరి కుస్తరించుచున్. ౧౨౦౫

తే॥ లంకలోఁ గల యసురు లె♦ల్లరును స్త్రీయు, పుత్త్రుఁ డీల్గిన చందానఁ♦బొగిలినారు
వేల్పు చెలులును నెనరున♦వెక్కినారు, తక్కువారల చింత లె♦త్తంగనేల?
తే॥ కోసలము వీడి కానకుఁ♦గౌసలేయు, డేగుతఱి జనించిన దుఃఖ♦మెనసె లంక
నగరమందు గల్గిన దుఃఖ♦నాద మపుడు, పున్నమను నార్థి ఘోషంబు♦పోల్కి నెగడె.

౧౭ నాగపాశ పటలము. (౩౦౦)

తే॥ తలకు నొక వేసముగ దైత్య♦తరుణు లేడ్వఁ, గాంచి కారణ మెఱుఁగక♦కళవళించి
యింద్రజిత్తుఁడు శంకించి దై♦త్యేంద్రుకడకు, నడచె నురవడి నళని ఘం♦దమున నపుడు.

మ॥ దెసలం గెల్చిన రావణుం డిపుడు కీ♦ర్తిం బూర్తి గోల్పోయెనో?
అసువు ల్వీడెనొ? మున్ను వచ్చి పుర దా♦హం బొప్పఁగాఁ జేయు గా
డ్పు సుతుం డంబుధితోడ లంక నివు డు♦న్మూలింప యత్నించెనో?
అసమానంబగు దుఃఖ మొందుటకుఁ గా ♦ ర్యంబేమి పాటిల్లెనో? ౧౭౦౯

ఉ॥ ఏమి ఘటిల్లె నేఁడు వచి ♦ యింపుఁడి యం చెదురైనవారలన్
వేమరు ప్రశ్న సేయఁ బల ♦ వించి వడంకిరి కాని తెల్పమిన్
దామది సంకటంపడుచు ♦ దారుణవేగముతోడఁ బోయి క
న్నా మెతగాఁగఁ గాంచె మది ♦ యంతట నెమ్మది చెంద రావణున్.

ఉ॥ కాంచి కలంకఁ జేత కర ♦ కంజములన్ ముకుళించి యీ తట
స్థించిన దుఃఖ కారణము ♦ తేటపడం దెలుపుండియన్న న
క్తంచర నాయకుం డనుఁ గృ ♦ తాంతుఁడు నీయనుజుం గ్రహించె ని
ష్కంచితులైన కుంభుఁడు ని ♦ కుంభుఁడు నయ్యతికాయుతోఁ జనన్.

మ॥ వర ధానుష్కుఁడు మేఘనాదుఁ డటఁ ద ♦ ద్వార్తన్ వినం గన్నులం
గురు కోపాగ్ని నివిస్ఫులింగములు గ్ర ♦ క్కన్ వాతెఱన్ మూఁకొనన్
దురపిల్లున్ విదిలించు హస్తములఁ గుం ♦ దున్ దూపిలున్ గర్జిలున్
సురుగం దిక్కులు చూచుఁ జంపె నెవఁ డం♦చుం గాలఁ దాఁచున్ భువిన్.

ఉ॥ రాముని తమ్ముఁడుం బ్లవగ ♦ రాజు మరుత్సుతుఁ డంచుఁ దెల్పఁగా
నేమని పంపినాఁడవు న ♦ కేంద్రుల శక్తి యెఱింగియుండి యు
ద్ధామ బలుండనైన నను ♦ దార్కొనఁ బంపక వారిఁ బంపి నీ
వే మరణంబు గూర్చితివి ♦ ద్వేషులు చంపి రనంగఁ జెల్లునే? ౧౭౧౩

మ॥ సమరాజేయుని నాదు తమ్ము ననిలోఁ ♦ జక్కాడు క్రూరాత్ము ర
క్తము తద్రంగమునందు తద్ధరణియే ♦ త్రావంగనీకున్నచో
సమరాధీశున కైదుమార్లు బల శౌ ♦ ర్య స్థైర్యముల్ వీడి యు
ద్ధమునం దోడుచుఁ బాఱువాఁడ నగుదున్ ♦ దైత్యేంద్ర చూడామణీ!

ఉ॥ క్రూర నగౌకసావళి స ♦ కుంఠిత శూరతఁ గొందికొంది సా
మీరి శిరంబు వ్రచ్చి కసి ♦ మీఱఁగ లక్ష్మణు కాలుసేతులం
గోరికఁ ద్రుంచి చిత్రవధఁ ♦ గ్రొవ్వక తక్కిన సమ్ముఖంబునన్
మోరల నెత్తి జంకు సుర ♦ ముఖ్యులు మిక్కిలి నవ్వకుందురే? ౧౭౧౫

చ॥ కడలిని దాఁటి జానకిని ♦ గాంచి వనంబును పాడుచేసి నీ
కొడుకును నేలరాచు నొక ♦ కోఁతిని దూతయటంచుఁ జంపకే
వెడఁగరి వాచు వీడితివి ♦ వీడుట యింతకుఁ దెచ్చె బంధులం
గొడుకులఁ గోలుపోయితివి ♦ గోడివడెన్ సుఖ జీవితాయువుల్. ౧౭౧౬

—: ఇంద్రజితుఁడు శపథ వాక్యము లాడుట :—

మ॥ ఇఁకఁ జింతించియు లాభమేమి? మఱి ని ♦ న్నేమన్న మేలేది? వా
రక యాలోచన చేసియున్ ఫలమె? సంగ్రామంబునం దమ్ము నం
బక సంఘాతము పాలుచేసిన గుణ ♦ భ్రష్టాత్మ సౌమిత్రిఁ జం
పక లంకాపురిఁ జేర నే బ్రదుకు నం ♦ భావింపఁ జిత్తంబునన్. ౧౭౧౭

శా॥ నాగాస్త్రంబును ఖడ్గ పాశుపతముల్ ♦ నాణెంబుగాఁ గాచుచున్
భోగంబుల్ గొని కాలముం గడపు నా ♦ ఘోరం దదస్త్రంబు లు
ద్యోగ ప్రోద్ధతి నాకుఁ గానివయినన్ ♦ దుర్మృత్యువుం గొందు నీ
రాగ ప్రక్రియ సర్వమున్ విడిచెదన్ ♦ బ్రాయోపవిష్టుండనై. ౧౭౧౮

మ॥ అతికాయ ప్రియజీవ హారకు సుప ♦ ర్వాదు ల్గనన్ సంగర
క్షితిలోనుండి వియత్ప్రధాన యమరా ♦ ద్దేహంబునం బ్రీతిమై
నతిథి ప్రక్రియ లందఁగాఁ బనుపకే ♦ వ్యర్థుండనే నైన నీ
సుతుఁడం గానిఁక విల్లు మోఁతకొఱకో? శోభాకృతిం జూపనో?

చ॥ అని శపథంబులాడు సుతు ♦ నక్కునఁ జిక్కఁగఁ జేర్చి రావణుం
డనునయ మార నిట్టులను ♦ నయ్యావు నీకు నసాధ్య కార్యముల్
పనిగొని చూచినం గలవె? వారని పుత్త్రక చింత దీఱ నీ
వనిఁ బగఱన్ వధింపఁగల ♦ వంచు హృదంతరమందు నమ్మితిన్. ౧౭౨౦

తే॥ అనుచుఁ బలికిన తండ్రికిఁ ♦ దనయుఁ డెఱఁగి, తూణములు నభేద్య కవచ ♦ బాణ ఖడ్గ
దృఢ శరాసనాదికములు ♦ తీరుగాఁగఁ, దాల్చి బయలుదేఱెను భయ ♦ దంపు ఠీవి.

తే॥ కమలజుఁడు చింత యించుక ♦ గలుగకుండ, వజ్రగిరిగొని కావించి ♦ వజ్రి కిచ్చె
నాధనువు వాని గెల్చిన ♦ యదనునందు, మేఘనాదుండు గొనియె న ♦ మోఘగరిమ.

తే॥ ఇంద్రుఁ జెఱనుంచినప్పుడె ♦ యింద్రజితుఁడు, కడఁకఁ గైకొన్న వే నిమం ♦ గములుగూడఁ
దఱుఁగుఁగాక యంబుధి యవి ♦ తఱిఁగిపోవు యమునిగుహఁ బోలి నట్టివా ♦ యంపదొనల

తే॥ తొల్లి యమరు లొనర్చిన♦దురమువేళ, కొండ విలుకాఁడు నలువ త♦క్కుంగలట్టి
యధికు లొసఁగిన పెక్కుది♦వ్యాయుధముల, నపుడు కైకొనె రావణి♦యనువుకొఱకు.

తే॥ పొలుచు క్రొత్తలంకాపురిఁ♦బోలినయది, శరభములు వేయివేయి కే♦సరులుపూన్పఁ
బడినయది వేల్పులకు భంగ♦పఱుపరాని, దైన తేరెక్కె దైత్యేంద్రు♦నగ్రసుతుఁడు.

తే॥ కనక రథమన్నఁజాలునే? గరుడునకును, వృషభమునకును భయదమై♦వెంట నడచెఁ
గాక యొక్కనాఁడును ముజ్జ♦గంబులందు, ముందునడచిన యదికాదు♦పొడవు తేరు.

తే॥ చతురతం జూపి బవరంబు ♦ సలిపి వజ్రి, బలముక్రుంగ బంధించిన ♦ వలఁతివచ్చి
వచ్చెనని పిశాచాదులు♦వలచియాడు, గుఱుతువడ్డ టెక్కెంబుచేఁ ♦ గొఱలు తేరు.

చ॥ బలయుత కాలకేయ వర♦వాహిని గగ్గులకాడుగా వడిం
న్నలఁచిన చక్రముల్ త్రిదశ♦నాయకు పృష్ఠము గాయమొందఁగాఁ
జలిపిన మొగ్గలం గలిగి ♦ జానగు తేరది, దిగ్గజంబులం
గలఁచుచుఁ బొఱఁదోలినది ♦ గా వివరించుట గౌరవార్హమే! ౧౭౨౮

తే॥ అఖిలసురుల వీఁపుల గాక♦యాననములఁ, గనని యింద్రజిత్తట్టి స్యం♦దనము నెక్కె
తేరు లొక వేయి చుట్టిరా♦వీరసమర, దోహలత తేటమోమునఁ♦దోఁప నరిగె.

తే॥ వానితో నడచిన సేన ♦ వరుసలెక్క, పెట్టి తెలుపంగఁ దరమౌనె ♦ వినుతచరిత
విదుఁడు వాల్మీకి నల్వది♦వెల్వలనుచుఁ, దెలిపె వేతేరు లెక్కించి♦ తెలుపువారు?

సీ॥ ధూమ్రనేత్రుఁడు రణ♦దోహలుండగు మహా, పార్శ్వుండు తేరి కా♦వలియొనర్ప
ఛత్రంబు పైనొప్ప ♦ శంఖాది రవములు, ఘనభోంతరముల ♦ బోరుకొనఁగ
లక్ష తేరులు చుట్టి ♦ రక్షయై రా వాని, కినుమడి గజములు♦వెనుక నడవ
మోహరించిన గుఱ్ఱ♦ముల గుంపు వెంటరాఁ, గాలిబంటులు ముందు♦గాఁగ నరుగ

తే॥ వీరవర్యుండు లంకాధి♦విభుని కొడుకు, శస్త్ర విజ్ఞాని మాయా వి♦శారదుండు
దురము లం దారితేఱిన♦దోర్బలుండు, జిత దిగీశుండు సంగ్రామ♦సీమఁజేరె. ౧౭౩౧

మ॥ అతికాయుండు వధింపఁగాఁబడిన ప♦ల్కాలించి కోపంబుతో
దితిజాధీశుఁడొ గోత్రభిజ్జితుఁడొ యే♦తెంచెం రణ క్షోణికిం
గృతహస్తుల్ రణకర్కశుల్ రిపుఁ గా ♦ రింపగ నానంచెదం
గుతుకంబారఁగ లక్ష్మణుండు నిలిచెం♦ఘోరాహవ స్థానలిం.

శా॥ వీరశ్రేష్ఠుఁడు లక్ష్మణుండు కని దో♦ర్వీర్యోద్ధతిం భూరి తూ
ర్యారావంబులతోడ వచ్చె నెవఁడా♦హంవీరుఁడన్నం మహా
దారుండైన విభీషణుండను మహా♦త్మా! ధీరమల్లుండు పా
కారిం గెల్చిన శూరుఁ డింద్రజితుఁడం♦ఖ్యాతాభిధానుం డిలం. ౧౭౩౩

ఉ॥ వాహిని నాయకుల్ ప్లవగ♦వారము రక్షణసేయ నెల్లరం
వ్యూహముగాఁగ నిల్పి బల♦యుక్తిని పోరుటమేలు నేఁడు నం

దేహములేదు విగ్రహము♦తీవ్రతరంబగు నిర్ణయించి ని
ర్వాహక పద్ధతి న్నడప ♦ భావ్యమగుం దలపోయు లక్ష్మణా! ౧౭౩౪

సీ॥ కీర్తిభూషణ! మన♦కీశ నాథుండును, జాంబవంతుండు కే ♦ సరి సుతుండు
వాలిపుత్త్రుండును ♦ నీలుండు తదితరుల్, నీతోడ నిలువంగ ♦ నిర్ణయింపు
లెక్కలేని సురలు ♦ ప్రక్కబలము గాఁగ, నిలిచిన యింద్రుండు ♦ నిలువలేక
యమృత బలంబున ♦ నసువుల దక్కించు, కొని బైటఁబడి బ్రది♦కెను నిజమ్ము
తే॥ వాసవుని రెట్టలం గట్టు♦వాఁతలిఁకను, మాయలేదు మాయవు హను♦మంతుఁగూడఁ
గట్టినాతండు తగ వాని♦కార్ముకంపు, విద్దె నేర్పును వర్ణింప♦వీలుగలదె? ౧౭౩౫

తే॥ అనుచుఁబలుకంగలక్ష్మణుఁ♦డనుమతించె,నంతమతిమంతుఁడగుహను♦మంతుఁడెదను
చింతచేసి సౌమిత్రిపై ♦జిష్ణుజితుఁడు, వచ్చెనని పదటంబున♦బయలుదేఱె ౧౭౩౬

తే॥ శమనుఁడును కనులార్పయంగఁ♦జాలియున్న, దనుజ సేనా భయంకర♦త్వంబు గాంచి
యింద్రజితుని సాహసకార్య♦మెఱఁగి గాలి, పోలికనె వచ్చి చేరెను♦గాలికొడుకు.

తే॥ అచ్చటనె మున్నె యుండినాఁ♦డంగదుండు, తక్కు దళపతు లచటికి♦దాసినారు
సేనలం ద్రిప్పఁ గపిరాజు♦చేరినాఁడు, వరుసలుగఁ దీరి నిలిచెను♦వనచరాలి. ౧౭౩౮

క॥ కోపావేశము పొంగఁగ, నేపారుచు నెదుర నెదుర ♦ నేగెడి సేనల్
దీపించు రెండు జలధులు, కోపున యత్నించి తాఁకు♦కొమరై తోఁచెన్. ౧౭౩౯

క॥ కనులు మనసు గలిగిన ఫల, మును సంపూర్తిగనె నేఁడు♦పొందఁగనగు నం
చనువుగ స్వర్గము బీడుగ, వనితలతో నిండి రమర ♦ వర్యులు నింగిన్. ౧౭౪౦

తే॥ రెండువాఁగు లొండొంటితో♦రెచ్చి తాఁకు, నెడల వీరగర్జనలు ఘీం♦కృతులు హేష
లబ్జఘోషముల్ వివిధ తూ♦ర్యమ్ము లడరి, వేలుపుల మూసికొనఁజేసె♦వీనుదోయి.

క॥ పట్టుఁడు కట్టుఁడు కొట్టుఁడు, తిట్టుఁడు నఱకుండు తినుఁడు♦త్రెంపుఁడు పొడువుం
డిట్టులముగ నేయుం డను, నిట్టి రవము శింజతో జ♦గము వడఁకించెన్. ౧౭౪౨

క॥ తగులుటచే నంగంబులు, పగులుటచే మేన నుచ్చి ♦ పాఱుటచేతన్
నొగులుటచేఁ గూలుటచే, నెగులునఁ జలియించె ధాత్రి ♦ నిలుకడ చెడఁగన్

తే॥ మునల ముద్గరాదులచేత♦మురియు తలలు, ఖర శరాసులచేఁ దెగి♦దొరలు తలలు
కదనరంగంబు నిండంగఁ♦గపుల వపువు, లురలె నటియించె విలవిల♦ధరణిఁదన్నె.

క॥ పచ్చడియగు మస్తకములు, విచ్చిన మేనులను నెత్రు♦వెల్లువలం దా
కచ్చుగ మండెడు నడవిని, పచ్చి విటపములను పోలి♦పఱపైయుండెన్ ౧౭౪౫

తే॥ కఱకు ఠాకాసులంబట్టి♦కాలఁదన్ని, కేలనెత్తి నేలకుమోఁది♦తోఁళు లొలిచి
మెడలు కొఱికి త్రోఁచియు రాచి♦నడుము విఱిచి, యతిశయోత్సాహ మంది
పె ♦ ల్లార్చెఁ గపులు. ౧౭౪౬

తే॥ తలలు ద్రెంచి కాళ్ళు ద్రుంచి♦ తఱిమి నఱకి, యూఁచెలం దూఁటిపోటుల♦ నెసక మడఁచి
కోఁతిమూఁకలఁ బెక్కంటిఁ♦ గూలఁ ద్రోచి, పొలసుదిండుల తండముల్♦ చెలఁగియార్చె.
తే॥ కోఁతులను పేరఁ జను యమ♦ దూతలపుడు, వాలపాశంబు లురివైచి♦ ప్రేలనెత్తి
ప్రాల మోఁది దిర్దిరఁ ద్రిప్పి♦ నేలఁ దాఁచి, పెక్కువిధముల వారి యూ♦ పిరులఁ గొసిరి.
తే॥ కాంతి నిలయమై నిప్పులు♦ గ్రక్కు కనుల, కోఁతిమూఁకలు తరులతోఁ♦ జేతులు తెగ
మేన బాఁకులు తూఱంగ♦ మిడిసిపడియె, వారికుత్తుకల్ గొఱుకుచు♦ వారితోడ
తే॥ పడవ సేయు భల్లుకములు♦ పిడుగులట్లు, మెఱసి చని యేనుఁగులఁ జీల్చి♦ మెదడుసాని
తృప్తిగా శోణితము ద్రావి♦ ప్రాప్తలాభ, మున ముదంబంది జఠరాగ్ని♦ నణఁచికొనియె.
తే॥ రూపమున బలమున విని♦ రూఢినొందు, ప్లవగములు దొడ్డ తేరుల♦ పైకి మత్త
కరులపైకి హరులపైకి♦ శిరులపైకి, నాయుధములపైఁ దలలపై♦ నరసి దుమికె.
తే॥ పీనుఁగుల తిప్పలందుండి♦ వెడలు రుధిర, వాహినులు పీనుఁగులఁ గొని♦ వనధిఁ జేరి
యచటి జలచరములకు నా♦ హార మొసఁగెఁ, దెచ్చియిచ్చు నుదారుని♦ తెఱుఁగునూని.
తే॥ హనుమ కరములఁ గిరులచే♦ నఱవఁ దైన, యసుర సేనలోఁ జక్కముల్♦ హరులు విండ్లు
గదలు కుంతముల్ తేరులు♦ కరులు ముక్కు, మొగము గనరాని తీరున♦ మురిసి ప్రవస్సె.
తే॥ అంగదుఁడు వృక్షముల మోఁద ♦ నడుమునందు, పూఁడు కరులును హరులును ♦ పొలసు దిండ్లు
నైన యెడ యముఁ డింతయు♦ నదరులేక, తప్పినా జీవులని కేలఁ♦ ద్రవ్వి చూచె.
తే॥ నాల్గు విధముల సేనలు♦ నలఁగి కుప్ప, గూరిన రణస్థలిం గని♦ గొప్పబుధులు
పూర్వ దేవాసురాజితోఁ♦ బోల్చి చూచి, దీని కది సరిగాదని♦ తెలిపినారు. ౧౭౫౫
చ॥ ఎడయక సోఁకుమూఁక తల ♦ యెత్తెను వానరసేన వీఁపులం
దడవుచుఁ బాఱఁజొచ్చెఁ గపి ♦ నాయకు లడ్డము వచ్చి పోరినం
జడిసినవారు క్రమ్మఱని ♦ జాడను గాంచి హసించి దూఱినం
బెడమఱలేదు వెళ్లినదె♦ వేడ్కగఁ బోయినతీరె పోకగన్. ౧౭౫౬

—: వానర సేనా నాయకుల సమరము :—

క॥ శూలము పరశువు చేకొని, వాలిన లయ రుద్రుఁబోలి♦ పాదప కరుఁడై
నీలుఁడు నిలిచిన చోటను, కాలుఁడు పాశము గడించి♦ కడఁక న్నిలిచెన్. ౧౭౫౭
మ॥ జముఁ డధికార కార్యమును ♦ జాడగ వీడితినంచు భీతిలన్
గుముదుఁడు శత్రుసైన్యములఁ ♦ గుప్పలుగూల్చె నతండు వాయువో
యమృతమొ యగ్నియో యనఁగ♦ నార్చెను ముంచెను మాడ్చె రెండు హ
స్తముల నొనర్చె నిట్టులన ♦ సారెకు వర్ణన సేయ నెట్లగున్ ! ౧౭౫౮

చ॥ ద్రుమముల రాముతూపు తొలి ♦ తూపరవుంచిన దేడుచెప్లి; లో
కమునఁ బ్రసిద్ధిచెందిన న ♦ గమ్ములు నేడె; యడంచి మోఁదుటల్
తెమలక ఉప్పుటల్ తలఁపు ♦ తీపగు నా ఋషభుండు వైచు వృ
క్షములకుఁ బర్వతంబులకుఁ♦గాంచఁగ లెక్కయె లేదు భూస్థలిన్. ౧౭౯

చ॥ కరులును తేరులున్ హరులు ♦ గల్గి భుజంగముఁబోలి క్రూరులై
వఱలిన రేయి ద్రిమ్మరుల ♦ వర్గములెల్ల నశించు నేఁడనం
దరువులు ద్రిప్పిద్రిప్పి బెడి ♦ దంబుగఁ జంపెను జాంబవంతుఁ డ
ద్దిర ! ముదిరొందియుం బులుసు♦తింత్రిణి వీడునె ? చేవ హెచ్చదే ౧౮౦

మ॥ కరి పాఠీనములున్ దురంగమ తరం ♦ గంబుల్ చలత్స్యందనో
త్కర నౌకల్ బహుళాయుధ ప్రకర మ ♦ త్స్య గ్రాహముల్ గల్గు క
ర్బురవార్ధిన్ బనసాఖ్య మందరమొగిం ♦ గ్రోధాహి పాశంబుతోఁ
దరువంజొచ్చె జయేందిరా వర సుధా ♦ ద్రవ్యానుభోగాప్తికై. ౧౮౧

సీ॥ వనదంబులం జీల్చి♦కొని యూర్ధ్వలోకముల్, డాయు సంపాతి జ♦టాయువులన
మైందుండు ద్వివిదుండు♦మలసిరి డేగలు, పావురంబులఁ జంపు♦పగిది దోఁప
గవయుండు కోలఁకును♦కలఁచు గజంబునా, దనుజసైన్యంబు ను♦ద్ధవడిఁ గలఁచె
నిల్పిన కాలు గ♦దల్పక కేసరి, దైత్యేభ కుంభముల్♦ద్రవ్వుచుండెఁ

తే॥ గపికులేంద్రులు కదన మీ♦కరణిఁ జలుపఁ,♦బాఱినట్టికోఁతులు వచ్చి♦పోరఁదొడఁగె
నిర్జరారుల సైన్యంబు♦నిలుకడ చెడె, నింద్రజిత్తదిగని కోప♦మినుమడింప. ౧౮౨

—: ఇంద్రజిత్తు వానరులపైఁ గసిమసఁగుట :—

తే॥ బాహులుప్పొంగదిక్కులు♦పర్వతములు,చెవుడుపడనార్భ్రమాయించి♦చిందమొత్తి
వేలుపులు జగములు కపుల్♦వెగడు పడఁగ, సింహనాదంబు నేసె ను♦త్సేకమొప్ప.

తే॥ అశనులును సిగ్గిలఁగ మ్రోఁగు♦నహి విషాభ,శరము లిన్నియంచెన్నంగ♦నెఱుకపడని
యట్లు మితిమీఱి పరపి వి♦యత్తలంబు, నవనితలమును బాణమ♦యంబు చేసె

క॥ కపివరు లేసిన తరువులు, నుపలంబులు విఱిగి పొడిగ♦నుర్విని రాలెన్
గపుల తల లెగసి పడియెం, దపతపమని ధరణిమీఁద♦దండడి యగుచున్. ౧౮౩

క॥ మితిమీఱి వెడలు శరములు, కుతికల నురముల నొడళ్లఁ♦గూరుచు దుయ్యన్
దత బలులగు వనచరపతు, లతిశ్రమము నొంది తూలి♦రవనిం బడుచున్. ౧౮౪

తే॥ ఒక ముహూర్తకాలములోన♦నొక్క వెల్వ, చితికి చెదరి బీభత్సమై♦చెడుట తోడఁ
గొండలందేరఁ బోయిన♦కోఁతుల తల, లురల మలల వైచుచు మేను♦లుర్విఁబడియె.

తే॥ తలలుద్రెంచిదాఁటినబాణ♦తతులు ఫణుల,కరణిఁ బాతాళమునఁ జేరె♦ధరణియెల్ల
మిట్టపల్లము సమమను♦మేర లేక, బట్టబయలుగా రక్తంబు♦పఱచె పడిని. ౧౮౫

చ॥ తొలఁగక చూచుచోఁ గనులఁ♦దూఱుచు నిల్వఁగ ఱొమ్ము గ్రుమ్మచుం
దొలఁగఁగఁ దాఁటుచోఁ బదులఁ♦ద్రుంచు చదల్చిన నాల్క లూడ్చుచుం
దొలఁగిన వీఁపు గ్రుచ్చుచు వి ♦ దుర్చు శరీరములెల్ల వ్రచ్చుచున్
దలఁచు నెడందపైఁ బడుచుఁ ♦ దార్కొనె నింద్రజి బాణ సంహతుల్.

మ॥ శరవర్షంబున మధ్య నేర్పడిన దృ♦శ్యశ్రేణి నొందైన ని
ర్జరులున్ రీతిగఁ జూడలేరయిరి నా♦రాచంబులంగూర్చి యే
యు రుతుల్ దక్క వినంగలేరయిరి మృ♦త్యు క్రూర భీతిన్ వనే
చరు లల్లాటముతోడఁ బాఱుటలె కాం♦ చంజాలి రంతంతటన్. ౧౨౨౦

మ॥ ఎదురైనట్టి వనేచరుల్ తునుకలౌ ♦ టీక్షించి యుత్సాహులై
యెదిరింపంగలవారు లేమిఁగని లం ♦ కేశాగ్రసూనుండు దు
ర్మదుఁడై యూరక నిల్చె దూరగతుఁడై ♦ మార్తండపుత్త్రుండు బె
ట్టిదుఁడై సాలమొకండు చేకొనుచు మ ♦ ట్టిన్ వానరుల్ మోదిలన్.

మ॥ తమసేనం జెదరించుచుం దొలఁగు నిం ♦ ద్రద్వేషిఁ దా డాసి ప్ర
య్యని రక్షావిధిఁ జుట్టుఁ గ్రమ్ముకొను క్ర ♦ వ్యాదుల్ భయభ్రాంతులై
వెనుకం ద్రొక్కఁగ సాలమున్ విసరెఁ ద ♦ ద్వీర్యంబు మేలంచుఁ బా
ఱిన శాఖామృగ పూగముల్ మరలి పే ♦ ర్చెన్ సంగరోద్వృత్తిమై.

మ॥ తన చుట్టుంగల సైన్యముల్ చెదరుటన్ ♦ దైత్యేంద్ర పుత్త్రుండు రేఁ
గిన కిన్కంగని మేలుమేలనుచు నా ♦ ర్గింటం బదింటం బలం
బున ఫాలంబును వక్షము న్నొగులఁగా ♦ మూర్ఛిల్లఁ గా నేసి చే
తి నగంబున్ బలుముక్కలై యెగురఁ గ♦త్రించెన్ బ్రకర్షమ్ముగన్.

ఉ॥ అయ్యెడ వాయునందనుఁడు ♦ హాలహాలంబు విధాన రేఁగుచున్
జయ్యన నప్పళించుచు భు ♦ జంబుల నెట్టెదురం గడంగి యీ
కయ్యము దీనితో ముగియుఁ ♦ గా! యని వేలుపు లార్వ రక్కసుల్
బ్రుయ్యఁగ నేసె నొక్కగిరి ♦ భూతము లార్వఁగఁ గోఁతు లుబ్బఁగన్.

మ॥ ఇభజి ద్విక్రముఁ డింద్రజిత్తు నగి భూ ♦ భృద్రాజమున్ దూల్చి యా
రభటిన్ మారుతిఁ గాంచి యిట్లను శర ♦ వ్రాతంబుఁ బాటింపకే
రభసంబార శిలా ద్రుమంబుల సమి ♦ ద్రంగంబునం గెల్తువే
ర! భళీ! చంపకమాన నిన్నన జగ ♦ త్ప్రాణాత్మజుం డిట్లనున్. ౧౨౨౫

మ॥ వెడఁగా! మాకడ నున్నవారలు ధను ♦ ర్విద్యా ప్రవీణుల్; మలల్
పడుకుల్ ప్రాఁకులతోడఁ బోరుటకు నేఁ ♦ బ్రాపించితి న్నీకు; నీ
కడు క్రౌర్యంబును నేఁట రేపట నడం ♦ గంబాఱుఁ గ్రొవ్వేలరా?
కడఁక న్నేర్చిన కొన్ని పద్ధతు లిటం♦గాన్పించెద న్నిల్వరా. ౧౨౨౬

శా॥ నాతోఁ బోరెదా? లక్ష్మణ ప్రభునితో ♦ నాశంబుగాఁ బోరెదో?
నీ తండ్రిం దలదన్న వచ్చిన జగ ♦ న్నిత్యాత్ముతోఁ బోరెదో?
నీతంత్రమ్ములు సాగవింక ననిలో ♦ నిర్విణ్ణత న్నిల్చి పైఁ
బ్రేతాధీశుని చూడఁబో మ్మిదియె ప్రా ♦ ప్తించు న్నిజం బియ్యెడన్.

మ॥ అనుడున్ శక్రజితుండు రోషమున నో ♦ రా! ప్రల్లదీఁడా? వృథా
చనఁ డీ రావణి నాదు తమ్ము ననిలోఁ ♦ జక్కాడి దర్పించు ల
క్ష్మణు నాజిన్ వధియింతు నన్న ప్రతినన్ ♦ సాధింపఁగాఁ బూనినాఁ
డను నాతో నెదిరించుటన్న నిలఁ జె ♦ ట్లుం గట్లఁ బోరాడుటా?

మ॥ విలు చేఁబూని యొకండనే నిలిచి మీ♦విర్వీరులన్ మిమ్ముఁ గా
కులకుం బారణ చేసెద న్నిజము మీ ♦ కున్ శక్తి లేదేని వే
ల్పులఁ బాతాళ నివాసుల న్నరులఁ బ్రో ♦ వుం గూర్చుకొం డాజి మీ
తలలం ద్రెంపక గెల్పుగైకొనక నా ♦ తండ్రిం గనం బోదునే? ౧౭౯

తే॥ అనుచు విలుగొని డెబ్బది ♦ యమ్ములేయ, మేన గుత్తులుగా నవి ♦ మేపుకొనఁగఁ
గొండవలెఁ జలింపక వాయు♦జుండు నిల్చి, కేల నొకగిరి గొని పల్కె♦గేలిగాఁగ.

చ॥ మదకరు లెన్నియేని యొక ♦ మాత్రపు సింగముమ్రోల నిల్చునే?
పదరక లక్ష్మణుం డిటకు♦వచ్చెడు దాఁకను పోరుదేని నీ
ప్రదరము రాకమున్నె యిది ♦ వచ్చును నీయురమున్ వలంతివే
నదరక కాచికొమ్మనుచు♦నార్చుచు వైచె దశంబు ఘూర్ణిలన్. ౧౮౧

చ॥ అలవు జలంబు గల్గిన మ♦ హాబల నందనుఁ డేసినట్టి య
మ్ముల పొలదిండి వక్షము న ♦ మాంతముగా వడిఁదాఁకి వ్రయ్యలై
పలపల రాలె దిక్కులను ♦ వహ్ని ని గ్రాఁగిన యుక్కుదుంప దా
కలి పయి వ్రేయు సమ్మెట వి♦ఘాతమునం బలెవోవు కైవడిన్.

తే॥ అత్తఱిని మాయియగు నింద్ర♦జిత్తు రేఁగి, హనుమ యొమ్మన భుజముల♦నంటిదూసి
పోవ విషలిప్తమైన తూ♦పులను వేయి, పరపి డాయనీయక చలిం♦పంగఁ గొట్టె.

తే॥ పవనుఁ డడరి కలంపఁగాఁ♦బైఁడికొండ, లోపలనె కలగుండైన♦కోపుదోఁప
వెడలి మేనిపై రక్తంబు♦వెల్లిగాఁగ, నించుకంత సామీరి యో♦చించునంత.

తే॥ నీలుఁ డెడసొచ్చి జాల్వాలు♦నింగినంట, నురవడిని సూటిగా వైచె♦నొక్కకొండ
నడుమనే దానిఁ దుండ్లుగా♦నఱకివైచి, శక్ర విద్వేషి వికటహా♦సంబు చేసె.

ఉ॥ ప్రాణముతోడనున్న పెర ♦ వానరు లాసలు వీడఁగా సుప
ర్వాణులు భీతినొందఁ గపి ♦ వాహిని నాథుని దేహ మెల్లెడన్
బాణ విపాత ఘాతమున ♦ వారక రక్తము గ్రమ్మ నాతఁడున్
ద్రాణ యొకింత లేక ♦ ధర ♦ వ్రాలె నడుంకుచు విహ్వలించుచున్.

ఉ॥ మేరువె యంచుఁ గాదనుచు ♦ మీఱి వచింపఁగఁదగ్గ కొండలన్
వారక తెచ్చి యంగదుఁడు ♦ వైచెను రావణిమీఁదఁ జేతి వి
ల్లారకయుండునే ? చెనక ♦ నొప్పునె ? తుండులుగాక యుండునే ?
తోరపు వింటిచే నవియు ♦ దుగ్గయి నుగ్గయి పిండియై పడెన్. ౧౭౮౭

ఉ॥ పుట్టలఁజేరు నాగముల ♦ పోలికఁ దీవ్రతరాస్త్ర సంహతుల్
గట్టిగ ఱొమ్మున న్నానట ♦ గాళులఁ జేతులఁ గాఁడఁ దత్తుఱన్
బట్టుగఁ బండ్లు గిట్టికొని ♦ బాధ సహింపఁగలేక యంగదుం
డట్టె ధరిత్రిపై సొలపు ♦ నందఁగఁ గాంచి సురారి యంతటన్. ౧౭౮౮

తే॥ తక్కు వానర వీరుల ♦ తనువులంట, బాణవర్షము గురియించి ♦ పఱవఁ దోల
నిలుచు నిలువున వడఁకుచు♦నిలిచినారు, తక్కువారలు దెసలలోఁ♦దూఁరినారు.

## :— ఇంద్రజి ల్లక్ష్మణ యుద్ధము :—

చ॥ అదిగని లక్ష్మణుండు కడు ♦ నల్క విభీషణుఁ గాంచి వాహినుల్
సదమదమయ్యె నాయకులు ♦ సుగ్గిరి కార్యము మించె యత్నమా
యదవదలయ్యె నింద్రజితు ♦ నాజికిఁ బిల్చి వధింపకున్న చో
నిదివఱకైన పాట్లు ఫలి ♦ యించునె ? వీనర వోవదే యనన్. ౧౭౯౦

ఉ॥ వీనిని తాఁకి వేలుపులు ♦ వీఁపులు చూపిరి కాని యొక్కరుం
బూని జయింపలేద జగ ♦ ముల్ కడు కష్టములొందె వీనిచే
మానక వీని నిప్పు వరి ♦ మార్చి జగంబులఁ గాచి లోక స
మ్మానితకీర్తి నొందుమని ♦ మాని విభీషణుఁ డాడు నంతటన్. ౧౭౯౧

ఉ॥ ఇంద్రజితుండు లక్ష్మణుని ♦ యొట్టెదుటం గని వాఁడె వీఁడు నేఁ
డింద్రపదంబు గోరె నిపు ♦ డిచ్చెద వీనిని చుట్టు ముట్టుఁడీ
సాంద్రతరంబుగా ననుడు ♦ సైన్యము శీఁగి ధరిత్రిఁ జుట్టు నా
సంద్రము పోల్కిఁ జుట్టె రభ♦సంబున నార్చుచు నొక్క పెట్టునన్.

చ॥ బ్రదుకికలేదు నీకని కృ ♦ పారహితాత్ములు స్యందనంబులన్
మదకరులన్ గుఱ్ఱాలను క్ర ♦ మంబున శీఁపుచు మీఱి నన్నిటిన్
జిదురుపలై పడంగ వెసఁ ♦ జించుచు లక్ష్మణుఁ డస్త్రరాజి బె
ట్టిదముగ నేసి వారల ప ♦ టిష్ఠతఁ ద్రుంచె సుపర్వు లుబ్బఁగన్.

చ॥ పడఁకె జగంబు ధారణియు ♦ బ్రద్దలువాఱె శర ప్రకర్షముల్
పిడుగులఁ గేరెఁ బీనుఁగుల ♦ పెంటలు మీఱె నసృక్ప్రవాహముల్
జడనిధిఁదూఱె రాక్షసుల ♦ సత్త్వము తాఱె బలీముఖంబు ల
య్యెడ శ్రమ దేఱె నింద్రజితు ♦ నెడ్డ బిడెంబును కూరె దండిగన్.

చ॥ ఎడపక లక్ష్మణుం డలుఁగు ♦ లేయ నురంబుల నాటి డాఖులక
బుడమిని రాల్చె రక్తమున ♦ ముంచె గజమ్ములఁ గ్రుచ్చె వాజులక
గెడపెఁ బదాతి వర్గమును ♦ కేలును కాళ్లను ద్రుంచెఁ గాలుకై
వడి లయకాల రుద్రువడిఁ ♦ బార్థివ నందనుఁ డేచె నాజిలోక. ౧౭౯౫

చ॥ మితిచెడి కూలు వీనుఁగుల ♦ మేకొని లెక్క యిడంగ నిర్జరుల్
మతిఁ దలపోసి కాదనుచు ♦ మాని శిలీముఖ వృష్టిఁగాంచి యి
వ్వితమును చూడఁ గాదనుచు ♦ వీరుని కార్ముకమందు సప్త సూ
రుతములు సప్తమేఘములు♦రూఢిఁ జెలంగు నటంచ్రదు వింతగక. ౧౭౯౬

తే॥ ఒక్క యేనుఁగు మోమున♦నొక్క కోల,యొక్క గుఱ్ఱము మోమున♦నొక్క యలుఁగు
ఒక్క కాల్బంటు ఱొమ్మున♦నొక్క శరము, గాఁగఁ దెలిసె లక్ష్మణ నృప♦తక్కమ్ములచట.

ఉ॥ పుట్టుకతోడ గొప్ప యురు ♦ వుక బోలదిండియుఁ గల్గి చెక్కలుం
బుట్టినవొటఁ గంకముల ♦ పోఁడిమి లక్ష్మణ బాణరాజముల్
నెట్టన యొక్క యొక్క రజ ♦ నీచర సంస్థిత గాత్రమందు ము
క్కొట్టఁగ ద్రావియుండె మఱి ♦ యొక్క నిశాచరు పోల్కి యొందఁగక.

తే॥ ఇంద్రజిత్తు రోషమునఁ బో♦రెసఁగఁజేయ, ముప్పదై దువెల్లువల క♦పులు మరించె
లక్ష్మణాస్త్ర జాలమున నా♦లమునఁ గూలు, నసుర శవములలో నవి♦యడఁగిపోయె.

ఉ॥ చేతులు ద్రెవ్వి కాళ్లు తెగి ♦ చిందఱ వందఱ యయ్యె బొందడాల్
మూతులు వోయి యాంత్రములు ♦ ముందట జాఱి బలంబు తూఱి క
ట్టేతులు మాలి యాయుధ వి ♦ హీనములై పడఁ దక్క నిర్జరా
రాతులు పాఱి రానలకుఁ ♦ ద్రాణము తీపను పల్కు నిల్పుచుక. ౧౮౦౦

తే॥ నీరువట్టిన కడలిలో♦నిలిచినట్టి, మందరమువలె నొకఁడేని♦మాట తోడు
లేని మేఘనాదుఁడు తత్త♦ళించి బొమలు, ముడిచి తేరిపై లక్ష్మణు♦మొనయవచ్చె

ఉ॥ మారుతి డాసి వీఁడు రథ ♦ మధ్యగతుండయి యుండ నేల నీ
వారుట యొప్పు చూపదు మ ♦ దంసగతుండవు గమ్ము నీవనం
గారవలీల లక్ష్మణుఁడు ♦ గాడుపుపట్టి భుజంబు నెక్కె బృం
దారకు లుల్లసిల్ల జల ♦ ద ధ్వయమో యనఁ దాఁకి రిద్దఱుక. ౧౮౦౨

ఉ॥ కాళికఁబోలి యొక్కరుఁడు ♦ కాలుని పోలి యొకండు భూరి భూ
గోళము దద్దఱిల్లఁ గుల ♦ గోత్రము లల్లలనాడఁ డంకృతుల్
మేళన మొందగా విశిఖ ♦ మేదుర నాదము పిక్కటిల్లె న
వ్వేళ ముఖమ్ములం గొఱికె ♦ భీకర లీలల నమ్ము లమ్ములక. ౧౮౦౩

క॥ పిడుగులఁ బోలిన బెడిదపుఁ, దొడుగులు మఱి తొడుగు లేయఁ♦దునుఁగుచురాలక
దొడిఁబడి జగములు వడఁకుచుఁ, గడలి నడిమి నావవోలెఁ♦గళవళమంద

క॥ అరదంబును మారుతియును, పొరిపొరిఁ దిరుగంగ లంక♦పూర్తిగ నదరెన్
శరములు క్రమ్మటచేఁ దెలి, యరు లక్ష్మణుఁ డింద్రజిత్తు♦నమరుల శరయన్. ౧౮౦౫

చ॥ శర శర లాఘవంబు లొక ♦ కైవడి నుండవు స్థేమమున్ మహో
ద్ధురమగుఁ బోరు తీరు బహు ♦ దుస్సహమౌఁ గనఁజాలమంచు ఖే
చరులు వచింప నేత్రగత ♦ చర్యకు సైతము శంకగూరె నే
కరణి వచింపనౌ జరుగు ♦ కార్యము లిట్టివ యంచు గట్టిగన్. ౧౮౦౬

చ॥ జరిగిన దొక్కటే నెఱుఁగఁ ♦ జాలక యేమి ఘటిల్లె? నెవ్వరీ
కరణి దురంబు పూర్వము జ ♦ గంబునఁ గాంచిరి? మున్ను లే దనం
తరమును కల్గఁబోదు కను ♦ దమ్ములు ఱెప్పలు లేనివయ్యుఁ గాం
చు రుటము గానమైతి మని ♦ స్రుక్కిరి వేల్పులు వారిఁ గానమిన్. ౧౮౦౭

ఉ॥ వేలకొలంది భల్లములు ♦ వీరుఁడు రావణి మీఱి యేయఁగా
వేలకొలంది భల్లముల ♦ వేగమ లక్ష్మణుఁ డేసి త్రుంచెఁ బై
వేల ఫణీంద్ర బాణముల ♦ వెంటనె రావణి యేసె మాఱుగా
వేల ఫణీంద్ర బాణములు ♦ వీకున లక్ష్మణుఁ డేసి త్రుంచుడున్. ౧౮౦౮

తే॥ లక్ష యమ్ముల నింద్రారి♦లాగి యేయ, లక్షతో వాని నడఁచెను♦లక్ష్మణుండు
కోటి తూపుల రావణి♦కూర్చి పరపఁ, గోటితో వాని సౌమిత్రి♦కొట్టివైచె.

సీ॥ కంకపత్త్రమ్ములఁ♦గఱకు రక్కసుఁడేయఁ, గంకపత్త్రములె రా♦ఘవుఁడు వైచె
నర్ధచంద్రాస్త్రమ్ము♦లసుర యేయఁగ నర్ధ, చంద్రాస్త్రములనె ల♦క్ష్మణుఁడు వైచెఁ
గోఱలఁబోలిన♦కోల లతండేయ, నీతండు నట్టివే ♦ యేర్చి యేసెఁ
బొఱల మొనలున్న♦ప్రదరంబు లమరారి, యేయ నట్టివ యేసె♦నృప సుతుండు

తే॥ తమ్మి మొగ్గలఁ బోలు న♦స్త్రముల దైత్యుఁ, డేయ నట్టివ సౌమిత్రి♦యేసి త్రుంచె
వజ్ర ముఖ బాణములను క్ర♦వ్యాదుఁ డేయ, నట్టివే యేసి యడఁచె రా♦మానుజుండు.

సీ॥ త్రిశిరశ్శరంబులొ♦త్తిలి యిద్ద జేయంగ, నవి తాఁకి పొడియయ్యె♦నంబరమున
నంజలి యనెడి సా♦యకముల నిరువురు, వేనవే లేయంగ♦విఱిగె నవియుఁ
గుంజర శ్రవములన్♦పింజకోలల నిర్వు, రేసి రయ్యవి తాఁకి♦యిల నడంగె
రావియాకులఁ బోలి♦రాజిల్లు తూపుల, నిరువు రేయఁగ నవి♦యెడలి దొరలె

తే॥ నిట్టులేయుచు విఱుచుచు♦నెసక మెసఁగ, లోకములె యంపగములకు♦లోనుగాఁగఁ
జేసి యార్చిరి పొంగిరి♦చెలఁగి రుబ్బి, రడరి రలరి రొప్పిరి తని♦వందనైరి. ౧౮౧౧

ఉ॥ రావణి కల్ప మేఘములు ♦ ప్రాదినులం గురియించి ముంచు నా
కైవడి నేసి వాఁడి గొర ♦ కల్ వడిఁ గర్కటి ప్రీలునట్టు ల
ప్పావని మేను చేసి నర ♦ వర్యుని కంకటమందు గ్రుచ్చె బా
ణావలి వేవవేలుగ వి ♦ యచ్చరు లందఱు పిచ్చలింపఁగన్. ౧౮౧౨

తే॥ హనుమ యొడలి రక్తముగాంచి♦యమరులెల్ల, నింద్రజితు చేయి మించిన♦దంచు నెంచి
వదనములఁ ద్రిప్పికొని కేలు♦విదిరిచికొని, వెగడుపడి రీతఁ డేకైక♦వీరుఁ డనుచు.

మ॥ రణ పాండిత్యము మీఱఁ గ్రూర విశిఖ ♦ వ్రాతంబులం గూర్చి ల
క్ష్మణుఁ డశ్వంబులఁ గూల్చి దైత్యు సిడముం ♦ ఖండించి కేరించి రా
వణి మైమర్వను చించి సారథిని చం ♦ పంగొట్టి వెన్వెంటనే
గణనాతీతములైన బాణములఁ ద ద్గాత్రంబు భంజించుచున్. ౧౮౧౪

క॥ సారథి గూలినఁ డెక్కెము, వారువములు పడిన మేను♦వ్రస్సిన రణ దు
ర్వారుండై లంకేశ కు, మారుఁడు చలియింప కిట్లు♦మదియించె మదిన్ ౧౮౧౫

మ॥ నరుఁడే యీతని సాటి; కాదయినచో ♦ నారాయణుండే యగున్
గిరిశుండో పరమేష్ఠియో; దృఢమతిన్ ♦ గీశాళితో డిగ్గి మా
పురిలో మమ్మెదిరించి నిల్చి మనుజుం ♦ డున్నెన్నఁడుం గాన మ
చ్చెరువీసాహస మీచణత్వము రణ ♦ స్థేయత్వ మీ బీరమున్. ౧౮౧౬

తే॥ అనుచు వేఱొక తేరెక్కి♦యసురవరుఁడు, నిప్పు లురలంగ నిట్టూర్చి♦నేయి పోయు
నిప్పువలె మండి మిక్కిలి♦నెగడి క్రూర, విశిఖతతి దండడిగ గుప్పె♦విన్ను నిండ.

తే॥ శ్రేణులై కుప్పలై పాఱ♦శితశరముల, లక్ష్మణుం డేసి వానిఁ ద్రో♦లంచి వేయి
నారసము లింద్రజితు మేన♦నాటనేయ, వాఁడు వడిఁ గ్రుచ్చె సౌమిత్రి♦ఫాలమందు.

తే॥ నొవ్వ కించుకంతయు లక్ష్మ♦ణుండు వాని, ఱొమ్ము రంధ్రమ్ములడర నూ♦ఱమ్ములేసి
నొంప మేఘనాదుఁడు మేను♦కంప మొంద, నొఱఁగెఁ దేరిపై నుంత వి♦ల్లూఁతగాఁగ.

తే॥ కాలుఁడే యదాటునఁదూఁకు♦కరణితోఁప, హనుమ పురణించి యింద్రజి♦త్తరద మవనిఁ
గ్రుంగ వారువంబులు నలి♦గులిగఁ గూలఁ, దన్నె వాఁడును వేఱు స్యం♦దనము నెక్కె.

తే॥ ఇంద్రజితుఁడు పెక్కగు తేరు♦లెక్కుచు వడిఁ, గూల్చుకొనుచుండెఁ గాని యొ♦క్కొటియుఁ గాచి
కొని రణంబు సేయఁగ లేక♦కుములు చుండె, గడియలో వేయి రథములు♦మడఁగిపోయె.

క॥ దేవత లనుమని లక్ష్మణు, దీవించిరి విరులు గురిసి♦ తేట మొగములన్
బ్రోవయి రాడిరి పాడిరి, పై వస్త్రము లార్చి రధిక ♦ పరితోషమునన్. ౧౮౧౭

తే॥ అంత నింద్రజిత్తునకు న♦త్యంత హితులు, సమ సుఖాన్న పానులు వెన♦శత సహస్ర
సంఖ్యగల రక్కసులు మి♦త్త్రిసరన కీడ్వ, వచ్చి చేరి రచ్చటికిఁ గా♦వరముతోడ.

తే॥ హస్తిపకులును రథికులు♦నాశ్వికులును, కాల్బలంబులు కేల ఖ♦డ్గములు గదలు
దాల్చి గర్జలతోడ వా♦ద్యములు నిగుడ, ఖడ్గదీప్తులు కెలఁకులఁ ♦ గ్రమ్మ వచ్చె.

తే॥ శరభ సింహ వారణ పిశా♦చముల ధ్వనులు, శింజినీ రవములు దెసల్♦చెలఁగఁ బరవెఁ
బుడమి శవముల మయమయి♦యడరు కతన, స్యందనములచేఁ బెంధూళి♦క్రందుకొనదు

తే॥ అప్పుడు రావణు కొడుకొక్క♦యరదమెక్కి, దిశలు నిండ నారసములు♦దివిరి కురిసె
సాంధ్యరాగంబు లలిని ల♦క్ష్మణుఁడు మెఱసి, వాని నన్నిటిఁ దొలఁగించి♦వైచియేచి.

తే॥ చుట్టుముట్టి రాకాసులు♦గ్రుక్కవైచి, నవియు మోఁదినయవి యేసి♦నవియు నుగ్గు
నూచమయ్యెఁ బైపై లక్ష్మ♦ణునిశరములు, గుదులుగాదైత్యశిరములఁ♦గ్రుచ్చుచుండె.

తే॥ ప్రేవులు భుజంగములు దంతి♦బృంద మగము, లురలు తేరులు పగిలిన♦తరణి నికర
మాయుధీయులు వారిచ♦రావళులుగ, రణధరిత్రి యొప్పారె సం♦ద్రంబు పగిది.

తే॥ కంటసరులు కుండలములు♦కటకములును, కవచములు వీరఘంట లం♦గదచయంబు
లురలి విలయవాతమున నం♦బరమునుండి, దొరలు నక్షత్రములవలె♦మెఱసిపడియె.

తే॥ లక్ష్మణుం డింద్రజిత్తు నా♦లంబులోన, నూపిరాడనీయక శర♦వ్యూహమమరఁ
జేసి దితిజుల మేనులఁ♦జించివైచెఁ, గుప్ప కుప్పలుగా నలుఁ♦గులను గూర్చి.

తే॥ లక్ష్మణుని వాహనంబు వా♦లమునఁ జుట్టి, నేలఁదాఁచును మెడనల్పుఁ♦గాలరాచుఁ
ద్రొక్కుమింటికివైచును♦ద్రోచుఁబొడుచు, విఱుచుఁగఱచును బెదరించి♦తఱుము రిపుల

తే॥ ఉఱిమిచూచునదల్పుఁబై♦కుఱుకుఁగొఱుకుఁ, గరులఁబట్టివిసరివైచుఁ♦గడలిఁబడఁగ
గుజ్జుముల పొట్ట లగులఁగాఁ♦గూలఁదన్నుఁ, దేరు లొకటిపై నొకటి ఛే♦దిల్లఁద్రోచు.

క॥ హరులఁ గరుల నసురాళుల, విరులంబలె గిల్లు విఱుచు♦విటపములక్రియన్
సరసర దూయును దళముల, వెరవునఁ బండ్లవలె రాల్పుఁ♦బినుకుం బిండున్.

క॥ పన్నగములె దారములుగఁ, బన్నఁగఁ గట్టంగఁబడిన ♦ పఱపగు తేరుల్
గ్రన్ననఁ గూల్చెను వేయిటి, నెన్నఁగ నొక గడియలో న♦హీనబలమునన్.

తే॥ విసము దిని మత్తుగొన్న మా♦నిసులు పిదప, మంచిమందుచే లేచిన♦మాడ్కిఁ బెక్కు
చోట్లఁ బడియున్న వానర♦స్తోమ మపుడు, తేఱి లేచి ప్రకోపంబు♦మీఱిపోరె.

తే॥ ఉగ్రకోపులై కవియుచు♦హుంకరించి, యింద్రజిత్తుపై శిలలు మ♦హీజములును
గిరులు వందలు వేలుగాఁ♦దెరలవైచి, యార్చి రొక్కపెట్టున వ్యోమ♦మగలు పగిది.

తే॥ వ్రేయ నవయవములు ఛిన్న♦భిన్నములయి, గంట లులియశతాంగముల్♦శార్మిశాళి
యుఱగొఱగఁ బనిచేసిన♦యరదములను, పోలి సంగ్రామమేదినిఁ♦గ్రాలుచుండె.

ఉ॥ అంగదుఁ డొక్క సాలము న♦హాంకృతిఁ గైకొని తెచ్చి యింద్రజి
త్తుం గని చచ్చితోరి భుజ♦దుర్దమ సత్త్వము గల్గనేని త్రో
వం గలవాఁడ వంచు వడి♦వైవఁగ నయ్యది దైత్య గౌరవం
బుం గొఱసేయు భంగి రథ♦ముం దొరలించెను నుగ్గునూచగన్. ౧౮౩౮

చ॥ తలఁపున వేల్పు లుల్లసిలి ♦ తాతకుఁ గల్గిన బన్న మియ్యెడన్
దొలఁగఁగఁజేసెఁ బౌత్త్రుఁడని ♦ తోషము పొంగఁగ నార్చి రంత దో
ర్బలమున నుప్పరం బెగసి ♦ రావణి వేఱొక తేరి మీఁదికిన్
[illegible] దాఁటి నిల్వఁగని♦చూఁడి యలుంగుల నేసె వానిపై. ౧౮౩౯

ఉ॥ జీవము గొందునంచు మొగి ♦ నేయఁగఁ దక్కిన వానరావళుల్
రావణిఁ జుట్టుముట్టి బవ ♦ రంబునఁ జచ్చిన వారి శీర్షముల్
వావురముల్ శతాంగములు ♦ వారణ తుండము లందినట్టి వే
వేవిరయొ తెచ్చి వైచి శర ♦ వృష్టి నడంచిరి మించి యార్చుచున్. ౧౫౪౦
ఉ॥ అంతటఁ బ్రాభవ స్థితియు ♦ హార్మ్య నివాసము నిద్రవీడు ధీ
మంతుఁడు పోరుచున్న చెడు ♦ మానిసిదిండుల నొక్కఁడేని కా
న్పింతేను యన్నఁ గాని కర ♦ ణిం బరిమాఱుప నింద్రజిత్తు దు
ర్దాంత రుపా పరీతుఁడయి ♦ తార్కొనె నోర్వఁగ రాక గ్రక్కునన్.
తే॥ సేనలం జొరుకొని యండ♦శిఖరమంటి, నట్టి రక్తజలధి యీడ్వ♦ననువు దప్పి
రక్షణము చేసికొను చక్ర♦రక్షకులను, ధూమ్రనేత్రు మహాపార్శ్వఁ♦దొడరి కాంచె.
తే॥ పీనుఁగులు కొండలంబలెఁ♦బెరిఁగియుండ,జలదములు ధాఁటలేదు భా♦స్కరరథంబు
దాఁటలేదు పక్షులుగూడ♦దాఁటలేదు, నిలుచు నిల్చిన వారలు♦నిలిచిరల్లి.
తే॥ వారిమోములఁ గాంచి రా♦వణియుఁ గడిసి, వింత! మనసేన నలువది♦వెల్లువలను
లక్ష్మణుం డింతలోన స♦గ్గలపుఁ గినుక, నాశ మొనరించుటలు కాంచి♦నారె మీరు.
తే॥ అనుడు వార లింద్రారి! నీ♦వంతకంబె, నెక్కుడగు కపిసేన మా♦యింపలేదె ?
సముఁడ వట్టి సంగ్రామమే♦సలిపితయ్య, చింతయేల యటంచు వ♦చించునంత.
తే॥ ఇంద్రజి ల్లక్ష్మణులు వెండి♦యేపుమీఱి, పోరఁదొడఁగిరి సౌమిత్రి♦మేరమీఱి
వేలకొలఁది శరములేయ♦విబుధవైరి, వేయుకొలఁదిఁ దున్మ్రుచునుండె♦వివిధగతుల.
తే॥ ఐదుపది నూఱు వేయి ప♦దాఱువేలు, ముమ్మరముగఁ గోలల నేసి♦మూర్ఛదేఱి
పోర వచ్చిన వానర♦వీరవరుల, మరల దశకంఠ సూనుండు♦ధరణిఁద్రోచె.
తే॥ వనచరేంద్రుండు మున్నగు♦వారు సోలి, పడఁగ నెదుట నిల్చిన సుర♦వైరి తూల
నెదురుటడవిఁగాల్చెడి జాత♦వేదు కరణి, మండు శరముల గుప్పె ల♦క్ష్మణుఁడు కడిమి.
తే॥ ఇంద్రజిత్తు మూర్ఛిల్లె స♦హింపలేక, కొమ్మలంబలె నిల్చుసో♦కులు నిరువురు
దాఁగియుండిన రాకాసి♦దళము కొంత, తోడుగాఁ బోరఁదొడఁగి రు♦త్సుకతవిడక.
తే॥ రథగజాదికములు లేని♦రాక్షసాలి, మీఱి త్రుటి మాత్రలోన సౌ♦మిత్రి కురియు
బాణవర్షంబున మునింగి♦ప్రాణములను, విడిచినారు కొందఱు పాఱఁ♦దొడఁగినారు.
తే॥ నీరువట్టుచేఁ గొందఱు♦నీరదముల, కెగసి నీర్ద్రావి వ్రణములఁ♦దగిలి నీరు
చొరఁగఁ జచ్చిరి కొందఱు♦దొరకకుండ, నాల్క లెండంగఁ జచ్చిరి♦నవసి నవసి.
మ॥ శరసంఘాత విదారితాంగులగు దో ♦ షాచారులం గొంద ఱ
ప్సరముం జేరి వికీర్ణ కేశలయి సో ♦ మ్ముల్ రాలఁ జింతార్తిమైఁ
బరిచర్యల్ పొనరించు కాంతలఁ బరి ♦ ష్వంగమ్ము గావించి త
ద్వర జీవమ్ములతోడఁ జేరి రమల ♦ స్వర్గీయ తల్పమ్ములన్. ౧౫౪౨

మ॥ శర నిర్ఘాత విశీర్ణ వక్షులు నిశా ♦ సంచారులం గొంద ఱు
ద్ధుర వేగంబున నిండ్లు సేరి హితులన్ ♦ దుఃఖంబుతోఁ గాంచి యీ
చరణాబ్జంబులఁ జుట్టుగొన్న సుతులన్ ♦ సోఁకుండి యంచాంద్ర బా
లుర మోముల్ తనివారఁ గాంచుతఱిఁ గా ♦ లుం గాంచి రంత్యస్థితిన్.

శా॥ ఈసౌమిత్రి విజృంభణంబు క్షణ మి ♦ ట్లేయున్న వెయ్యేల లం
కా సామ్రాజ్యము నాశమొందు నిజ మిం ♦ కన్ మేఘనాదుండు వి
శ్వాసుండౌటకు మున్నె డాఁగుఁడు గిరి ♦ ప్రాగ్భారమందంచు వి
శ్వాసాత్మీయుల కాడి కొందఱు గత ♦ శ్వాసాత్ములై రయ్యెడన్.

చ॥ నెఱఁకుల నాటియున్న శర ♦ నిర్గత శోణిత దిగ్ధ దేహు లు
క్కఱి యిలుసేర బంధులు న ♦ యంబునఁ దూపుల నూడ్చఁబూన ని
ట్లురివినఁ జత్తుమంచుఁ గడు ♦ నూర్పులు పుచ్చుచు మూర్ఛచెంది చే
మిరి యిడుపాలఁ బోలె విర♦మించిరి సర్వము మానులంబలెన్. ౧౭౫౫

ఉ॥ తేరులపై వడిం జనక ♦ తేజులమీఁదను బోక కాల్నడం
బోఱక దంతిమూఁపులను ♦ పాఱక సిగ్గున లంకలోనికిం
జేరక యందు వెల్వల వ ♦ సింపక ప్రాణములందు తీపిచేఁ
దాఱిరి కొందఱా శవ వి ♦ తానము క్రింద నొదింగి యూర్చుచున్.

చ॥ కురిసిన చోటనే కురియు ♦ క్రొమ్మొగులుంబలె లక్ష్మణుండు దు
ర్భరముగ నాయముల్ నలఁచి ♦ రావణిఁ జంపుదు నంచుఁ గ త్తళం
బరవర సేసి వాని వివ ♦ శాత్ముఁగఁ జేయఁగఁ దేఱుదాఁక నం
గర మొనరింత మంచుఁ గలు♦కావలి వారలు డాసి యుగ్రులై. ౧౭౫౬

చ॥ అరదములన్ గడించి పోలు ♦ పారి ప్రభంజన సూను లక్ష్మణుం
గుఱిగొని బాణజాలముల ♦ గుప్పఁగ లక్ష్మణుఁ డాగ్రహించి చి
చ్చుఱ పిడుగట్టి నారసము ♦ లొక్కట నూఱుల నేసి తేరులన్
ఖురువులఁ దేరి చోదకుల♦ఖండము ఖండము సేయు నంతటన్. ౧౭౫౭

చ॥ విరథులు వారు పెన్ గదల ♦ వీఁకను కైకొని మారుతాత్మజున్
దరమిడి మోఁదఁబోవఁగ ను ♦ దగ్రత నాతఁడు వాని లాగుడున్
వెరవున వీన వీఁడు కడు ♦ వీఁగి వధించున యంచుఁ బాఱి రి
ద్దఱుఁ దిను నన్నమేని యొడఁ♦దం దలపోయక ప్రాణ రక్షకై. ౧౭౫౮

ఉ॥ కాలము తీఱమిన్ మఱియుఁ ♦ గాలున కింతయు బాడ తోఁపమిన్
గాలియుఁ జల్లఁగాఁగఁ దమ ♦ కాయములం జెనకంగ నిద్దురం
దేలి శ్రమంబునీఁగి మిహి ♦ తేఁకువ చేవయు నొంది వాలముల్
పోలఁగఁ ద్రిప్పుచుం గపులు♦మూర్ఛలఁ దేఱిరి లేచి యుద్ధతిన్. ౧౭౬౦

తే॥ గవయ గంధమాదన గజ♦ద్వివిద మైంద, పనస జాంబవ దంగద♦ప్రముఖులెల్ల
వేలుపులు భద్రవాక్కులవినుతి సేయఁ, దరుల గిరుల మోచికొని తెచ్చిరి కడంక.
తే॥ అంద ఱొక్క మొగినిమై వ♦సురవరుఁడు, ప్లవగ వీరులఁ గని కోప♦వివశుఁడగుచు
నింతయే గద మీచేవ♦లేవు లనుచు, నవ్వి ఖండఖండములుగఁ♦ద్రెవ్వనేసె.
క॥ వినువక కోఁతులు జాలను, వినరుచు మునరుటను కాంచి♦విల్లును శరముల్
మసలని తోడుగ నిలిచిన, యసురుని యెడ సదయుపగిది♦నడఁగె నిసుండుర్.
క॥ శ్రుతులును స్మృతులును సత్యము, తత ధర్మము లెవని మహిమఁ♦దలపించునో త
త్ప్రతి నెఱుఁగని వెడఁగుల యెద, వితమున నిరు లన్ని దెసల♦విరివిగఁ గ్రమ్మెన్.
ఉ॥ పాతిక కాష్ఠలో నితని ♦ ప్రాణము తీసినఁ దీయవచ్చుఁ గా
కీతఁడె తప్ప దానవుల ♦ కిమ్మగు కాలము వచ్చు వచ్చుచో
నాతఁడు మింట సంచరిలు ♦ నట్లయినం గెలుపొందువాఁడు సు
మీ ! తడవేల యంచనుగ♦మించి విభీషణుఁ డాడు నయ్యెడన్. ౧౮౬౫
క॥ తనుచుట్టిన ప్లవగులపై, హనుమనిపై లెక్కలేని ♦ యంప గముల నే
సిన రావణిఁ దునుమఁగ స్యం, దన మొక నారసముతోడ♦ధరఁ బడఁగొట్టెన్.

—: ఇంద్రజిత్తు నాగపాశముచే లక్ష్మణాదుల బంధించుట :—

చ॥ రథమును లక్ష్మణుం డొక శ♦రమ్మునఁ గూలుచు నంతలో వియ
త్పథమున కేగి వీరి నహి ♦ పాశముచేఁ బడఁద్రోయ జీవముల్
వ్యథగొని వీడు వారలని ♦ యారసి రావణి మబ్బుఁ జేరె దు
ష్ప్రథితునిచే నిఁకెయ్యది పో ♦ సంగునో యంచమరుల్ వడంకఁగన్.
క॥ విల్లును తూణీరంబులు, పెల్లగు కోపంబు క్రౌర్య ♦ విధులుం గల యా
ప్రల్లదుఁడు మింటఁ జీకటి, నల్లని మేఘములలోఁ గ♦నంబడకుండెన్. ౧౮౬౮
తే॥ పంక్తికంధరసుతుఁడు త ♦ పఃఫలమున, వరబలంబునఁ గులగోర ♦ వంబువలన
మంత్రబలముచేత నణువు♦మాడ్కి నూక్ష్మ, గాత్రుఁడై కానరాక మే♦ఘముల
నడఁగె. ౧౮౬౯
తే॥ అబ్జభవునైన హరినైన, నభవునైనఁ, గట్టిత్రోచిగా కూరక♦క్రమ్మజాలని
భుజగపాశంబు నభిమంత్ర♦పూర్వకముగఁ, గేలఁగైకొని వంచనా♦శీలుఁడంత. ౧౮౭౦
తే॥ అచటి వానరులును మాయ ♦ నరయలేక, కదనమున జంకి పాఱెన ♦ కాఁదలంచి
యుబ్బియార్చి గంతులువై చి♦రుత్సహించి, లక్ష్మణుఁడు నట్లయెడఁదఁ ద♦లంచి నవ్వె.
తే॥ జరుగునది కనలేక ల♦క్ష్మణుఁడు హనుమ, మూఁపునుండి ధాత్రికి దిగి♦చాప మంగ
దుని కరంబున నిడి మేనఁ♦దూఱియున్న, శరము లూడఁగఁదీసి వి♦శ్రాంతిగొనియె,

క॥ రావణి నాగాస్త్రంబును, తీవరమున వదలె వదల ♦ దిశలెల్లను తే
జో విలసనముగఁ జేయుచు, నోవగ వడిఁ జుట్టె లక్ష్మ ♦ ణుని బాహువులన్
మ॥ సకల ప్రాణు లెదిర్చినన్ మనమునన్ ♦ జంకింతయున్ లేని య
య్యకలంకాత్ముఁడు లక్ష్మణుం డిటియఁ ద్రో ♦ యంగట్టు నిక్కట్టు నం
చకు మాయాబల మంచెఱుంగక యుదం ♦ చత్సత్త్వ హీనస్థితిన్
నికటా భీల రణస్థలిన్ గగనమున్ ♦ వీక్షించె వే వల్మొఱుల్. ౧౮౭౪
శా॥ ఈమాయల్ పొనరించు దొంగను త్రుటిన్ ♦ హింసించి బంధింతు వాఁ
డే మార్గంబునఁ బోవువాఁడనుచు ♦ న ్రగేక్షుండు సామీరి వే
వ్యోమప్రేక్షణుఁడైన యంతట దశా ♦ స్యున్ వాలి వాలంబు ప్రో
ద్దామ ప్రక్రియఁ జుట్టినట్టులు తద ♦ స్త్రంబంటి చుట్టెన్ వెసన్. ౧౮౭౫
తే॥ క్రూరదంష్ట్రలుగల పృదా ♦ కువులు తక్క, వనచరులఁగూడ బంధించి ♦ వైచునంత
బాహుబలముక్కి యేమియుఁ ♦ బాలుపోక, భ్రాంతి నొందిరి సమర భూ ♦ భాగమందు
ఉ॥ బంధితులైన కీశులొక ♦ పట్టున లేచుచు వ్రాలు చుగ్రులై
కంధిని గాంచి కంధరముఁ ♦ గాంచుచు వాలము నేల మోఁది పా
ణింధమమేచఁ గాంచుచు గ ♦ ణించుచు లక్ష్మణుతీరు దుఃఖులై
యంధుల పోలె నుండిరి ర ♦ ణావని నేమియుఁ దోఁపకుండుటన్. ౧౮౭౭
క॥ ముడుఁగుదురు సత్త్వహీనత, నడుగుదురు విభీషణుఁ గని ♦ యరయఁ బ్రతిక్రియన్
మడుఁగుదురు నడుము నిలువక, యుడుగుదు రసువుల్ చలింప ♦ నుగ్రేక్షణులై.
ఆ॥ సంకటంబు దీర్చ ♦ చతురు లెవ్వరు గాలి, కన్న కొడుకు బ్రదికి ♦ యున్నవాఁడె?
యనుచుఁ గలఁగి మలఁగి ♦ మనువంశ్యుఁ డీస్థితిఁ, గనిన నెంతచింత ♦ గాంచునొక్కొ!
ఆ॥ అనుచుఁ బసవుచుండ ♦ నంబరమున నింద్ర, జిత్తు నిలిచి చూచి ♦ శితశరముల
వైచి కట్టువడిన ♦ వానరవీరుల, నొంచి కూల్చె నేమి ♦ యెంచఁగలదు? ౧౮౮౦
ఆ॥ కరువపైన వ్రాలు ♦ కరిమొగుళులు మహా, వాతమునను వ్రీలు ♦ వైనమొప్పఁ
దూపులొడలఁ జొచ్చి ♦ దూసిపోవఁ బ్లవంగు, లురలి వోలి నేల ♦ దొరలి నారు
క॥ శరములు వేలకొలఁది తన, శిరమున నురమునను నాటఁ ♦ జింతింపక యా
కరువలి కొడుకు సుమిత్రా, వరపుత్త్రుని స్థితికిఁ జాల ♦ వగఁ జెందె మదిన్. ౧౮౮౨
క॥ తక్కినవీరులు బాణము, లుక్కఱఁజేయంగఁ గూలి ♦ రుర్విని గాత్రం
బొక్కెడ నమ్ములు మిక్కిలి, గ్రుక్కించిన నంగదుండు ♦ సోలకయుండెన్. ౧౮౮౩
తే॥ గచ్చకాయలవలె మేను ♦ గదుములైనఁ, గారుచిచ్చునఁ గాలు కాం ♦ తారమట్లు
మనసు మేనును మండఁగా ♦ మలసెఁ బ్లవగ, రాజు రక్తాబ్ధిఁబొడము మా ♦ ర్తండుఁడనఁగ.
చ॥ అనము ఫణీంద్ర పాశమున ♦ నర్దితుఁడై రయొడలెల్ల దొడ్డ నా
రసములు గ్రువ్వ నొచ్చియు భ ♦ రంబగు కష్టములోర్చి సంస్మృతిన్

విసివియుఁ ద్రోవఁజాలిన వి ♦ వేకము దార్ఢ్యము గల్గి కర్త్రలన్
వసమయి యాత్మ చిక్కువడు ♦ బాగున లక్ష్మణుఁ డుండె నయ్యెడన్.

సీ॥ శరములు కిరణ సం♦చయముగాఁ బోలు మై, యెడలఁ గాఱెడి నెత్తు♦రెండగాఁగ
దెసలఁ బేర్చిన రా♦క్షసులను చీఁకట్లఁ, జెలఁగిన లక్ష్మణ ♦ జలజ హితుఁడు
ఉదయాచలేంద్రంబు ♦ పదురున విలసిల్లు, సామీరి భుజ నభ ♦ స్థలిని పొలిచి
విమధరాక్రాంత స♦ద్బింబంబుతో మింటి, నుండి మంటఁ బడిన♦యొఱపు దోఁచి

తే॥ పోలెఁ దక్కిన వీరులు ♦ స్రుక్కిపడిరి; యిషువు లోడలెల్లఁగప్పిన ♦ యింద్రజిత్తు
దుస్సహంబైన బాధతోఁ♦దూలిపడుచు, నోట నెత్తురు గ్రక్కుచు♦నొచ్చి క్రుస్సి.

ఉ॥ చెప్పిన యంతవట్టు పని ♦ చేకుఱె నామది సంకటంబు వోఁ
జెప్పెడిదేమి రేపె యవ ♦ శిష్టము పూర్తి యొనర్తు నేఁటితోఁ
దప్పకతీఱె లక్ష్మణుఁడు ♦ తత్పృతనావళి మాసెనంచు నిం
పొప్పఁగ గెల్పు దెల్పు బహు ♦ ళోన్నత రావ మెదుర్కొనం జనెన్.

ఉ॥ ఈనెలు క్రమ్మిన ట్లతిశ♦యించిన యమ్ములవాన నించు రా
ట్టూనిన పయోదముం దఱిమి♦చొక్కపు రావణియన్ విధుండు లం
కా నగరంబు సొచ్చి పుర ♦ కాంతల మేటి కటాక్ష వీక్షణా
నూన పయోజ తోరణ వి♦నూత్న కృతస్థలిఁ జేరె వెంబడిన్. ౧౮౮౮

తే॥ రత్న దీపముల్ కైకొన్న♦రాజముఖులు, స్వరయుతంబుగ విజయంబు♦పాడుసఖులు
ముందు వెనుకల రా దశ♦ముఖసుతుండు, తండ్రియున్న శుద్ధాంతసౌ♦ధంబు సేరె.

తే॥ చేరి కైమోడ్చి జరిగిన♦తీరుదెలిపి, చింతవిడు మలసితి శ్రమ♦కొంత దీఱఁ
బిదప వచ్చి విశదరీతి ♦ విన్నవింతు, సెలవె యని వడివడిఁ దన♦నెలవు సేరె.

—: విభీషణుఁడు లక్ష్మణు నవస్థం గని దురపిల్లుట :—

మ॥ అటఁ జింతాకులుఁడై విభీషణుఁడు కా♦ర్యాలోచనంబంది చి
ల్కుటచేనైన దధింబలెం గలఁగి పొ♦ల్పుం దెల్వియుం దక్క య
క్కట క్రూరాత్ముఁడు చంపఁడయ్యె నను లో♦కంబందు దుఃఖంబు లా
రటపెట్టం గడు నింద పాలయితి నా♦రాయంచు దూపిల్లుచున్. ౧౮౯౧

మ॥ చని కట్టంబడి యున్న లక్ష్మణుని రా♦జద్రాజభక్తిన్ సమి
త్తున జీవంబుల నప్పగించు కపి సం♦దోహంబులం గాంచి యే
మన లోకుల్నను నేమిగాఁ దలఁతురో♦ప్రాణంబులన్ మేనఁ బూ
నిన పాపంబున నిందపాలయితిఁ జ♦న్నే? యంచుఁ గుందె న్మదిన్.

శా॥ చెంతన్ వర్తిలి సంచుపొంచి వధముం ♦ జేయించినాఁ డందురో?
వంతంగూర్పఁగఁ దోడితెచ్చి వధియిం♦పంబూనెనా యందురో?

పొంతంజేరెఁ బ్రతారణంబు సలుపన్ ♦ ముఖ్యుండుగా నందురో?
చింతింపంగలవారు తోఁచు కరణిన్ ♦ జిత్తంబులన్ మానవుల్. ౧౮౯౩

శా॥ పోరంజొచ్చిన యింద్రజిత్తు సపుడే ♦ పొంగెల్ల వే తూలఁగన్
దేరున్ సారథి గుఱ్ఱముల్ దొరలఁగాఁ ♦ దీంద్రించి మర్దించి భీమ
ద్వీరత్వంబును చూపనైతి నని మి ♦ త్రిం బొందఁగా నైతి. వే
సారం జింతిలి యేమి? నాకరణి ప♦శ్చాద్బుద్ధియుం గల్గునే? ౧౮౯౪

మ॥ దురమం దీ కపిసేనతోడ గెలుపో ♦ దుఃఖంబో చావో ముదం
బో రహిం బొందుచు నా తలంపు విశదీ ♦ భూతంబు చేయింప కి
ట్లరికింగాక శరణ్యమైన పతికిన్ ♦ వ్యర్థుండనై ధాత్రిలోఁ
గొఱవిం బోలిన వాఁడనైతి నిరు వాఁ ♦ గుల్ నష్టమై త్రుంగఁగన్.

మ॥ అనుచున్ వ్యాకులితాంతరంగుఁడయి శో ♦ కాక్రాంతుఁడై దిక్కులోఁ
పని దీనస్థితు నవ్విభీషణుని తా ♦ పంబెంతయుం గాంచి వా
రని చింతం బరిహారపద్ధతుల నా ♦ రంజేయ సాధ్యంబె? యుం
చనలుం డేగి వచించె రామునకు నా ♦ ద్యంతంబు వృత్తాంతమున్

చ॥ కుమిలి తపించి లోన మఱొ ♦ క్కొండు నెఱుంగక పల్కక కన్నులన్
నిమిషము లేక చూడకయు ♦ నీరును కార్పక కిన్కతోడ లో
కములను కాల్ప కాద కలఁ ♦ గం బలవింపక రాఘవుండు చి
త్తమునఁ దలంచె లక్ష్మణుఁడు♦తప్పక జీవియె యంచు ధీరతన్. ౧౮౯౭

చ॥ కలఁగక రామచంద్రుఁ డిఁకఁ ♦ గార్యము వేఱొకరుండు లేదటం
చలఘుమతిం దలంచుచు ర ♦ యంబున లేచి గమించి వేగ శే
వెలఁదుక నీలిచీర తడి ♦ పీడఁగఁ బిండఁగ నిండెనన్న యా
నలువునఁ గప్పు కప్పు కద ♦ న స్థలిఁ జేరె మనస్థి రీకృతిన్. ౧౮౯౮

ఉ॥ చేరి యిరుల్ తొలంగి విల ♦ సిల్ల ధనంజయు కాండమేయ వే
దోరెను చీఁకటుల్ పగటి ♦ తోయము నొందె రణస్థలంబు పెం
పార యుగాంతవేళ నిట ♦ లాక్షునిచే భువనంబులెల్ల నే
తీరు భజించు నట్టి పగి ♦ దిం గనుపట్టె సుదుస్సహంబుగన్ ౧౮౯౯

తే॥ దుర్గికావాస యోగ్యమై ♦ దుష్టగంధ, మైన రణరంగమునఁ గుణ♦పాద్రి పొంత
రుధిర పంకిలాంతర గతా♦యుధ పరీత, దేహుఁ దమ్ముని కాంచె ధా♦త్రీ విభుండు

తే॥ కాంచి పైఁబడి తనదు వ♦క్షంబడంగఁ, గౌఁగిలింగొని నిట్టూర్చి♦కనుల నీరు
గార్చి రవియొద్ద జలధార♦గార్చు కారు, మొగులనఁగ నొప్పె రఘుకుల♦పుంగవుండు.

ఉ॥ పుట్టియుఁ బుట్టు వొందని ప్ర ♦ ఫుల్ల సరోజదళాక్షుఁ డూర్చు నీ
ర్వట్టఁగ నేడ్చుఁ గుందుఁ బ్రద ♦ రంబుల నూడ్చును లక్ష్మణా యనున్

ముట్టును ముక్కురంధ్రముల ♦ బుద్ధి కలంగఁగ సోలు దూపిలుచ్
గొట్టుచు నున్న విప్పుడును ♦ గుండె లటంచు ముదం బెదం గనున్.

ఉ॥ మేచకదేహుఁ డక్కునకు ♦ మేనొఱఁగించుచు దువ్వ వ్యోమముం
జూచును నేలఁజూచు విలుఁ ♦ జూచు భుజంగమ పాశ బంధముం
జూచు సురేంద్రవైరి చను ♦ చొప్పును చూచు జగంబుఁ గూల్పఁగాఁ
జూచుఁ గడింది నొడు కఱ ♦ చుచ్ మహనీయుల పల్కులం గొనున్.

తే॥ నెఱిఁ బ్రమాణంబులం దాఁటి♦నిల్చినట్టి, రామవిభుఁడు వానర నిక♦రమును గాంచు
విధినిగాంచు నమ్ములఁ గాంచు♦వింటిఁగాంచుఁ, దహతహంబొందుఁ జిత్తంబు♦తత్తళింప.

ఉ॥ పిల్చి వచించియుండిన వి ♦ భీషణ! యప్పుడె నాగపాశముం
దాల్చిన చేతులుచ్ శిరము ♦ ధారణి దుల్లఁగ నేయకుందునే?
కాల్చితి నామనంబు పని ♦ గానక పాడొనరించి తివ్విధిన్
నిల్చి ఫలంబె ప్రాణములు ♦ నీఁగిన పిమ్మట దేహ మున్వరన్. ౧౯౦౪

ఉ॥ రాముని పల్కులన్ విని క ♦ రంబు వడంకు విభీషణుండు సం
గ్రామ భయంకరా! వినుము ♦ రావణి పోరొనరించువేళ నీ
ప్రేముడి తమ్మునే గెలుపు ♦ వేఁడెన కాఁ దలపోయుచుంటి మీ
బూమియ నాగపాశ బల ♦ ముం గొని పుట్టినదయ్య! వింటివే. ౧౯౦౫

సీ॥ అతికాయు మస్తక♦మట్టకు నెడఁబాపి, నట్టి లక్ష్మణుఁడు ద♦శాస్యుఁ డిటకు
పుత్త్రకారణ రోష♦మున వచ్చువాఁడని, తలఁచి యిచ్చోటనే♦నిలుచునంత
నలువది వెల్వాల♦దళముతో నింద్రజి, త్తేతెంచి రణమున ♦ నేపు మీఱి
నలువది వెల్వాల♦బలిముఖ సైన్యంబు, గండించి త్రోచి ల♦క్ష్మణుని గదియ

తే॥ నతఁడు నల్వదివెల్వాల♦పృతనఁగూల్చి, వేయి తేరుల విఱిచి త♦ద్విక్రమంబు
చావు వఱకును తెచ్చి య♦స్త్రము లసంఖ్య, ములుగ గుప్పించి శోణిత♦మొలుకఁజేసె.

తే॥ దడము లవిసెను నొచ్చి యొ♦క్కఁడుగ నిలిచె, దప్పెనేని మాయలు సేయు ♦ దనుజుఁ డనుచుఁ
దమ్ము నెచ్చరించితి నంతఁ♦దమ్మి నంటు, చరమగిరిఁ జేరె ననువుగా♦నిరులుమీఱె.

తే॥ మాయియగు నింద్రజిత్తు వ్యో♦మమున డాఁగి,నాగపాశంబుచేత సై ♦న్యములతోడ
లక్ష్మణుని కట్టివైచె జా♦లంబుచేసి,బద్ధులైనారు వీరు చా♦వంగలేదు. ౧౯౦౧

తే॥ పెనచికొనియున్న పాశంబు♦వీడునేని, వీరు లేవఁగలరు స్వల్ప♦విశిఖములకు
జీవముల వీడువారె? రా♦జీవనేత్ర! పాపములు ధర్మమును గెలు♦వంగఁగలవె?

తే॥ అనుడు రాముఁడీ పాశంబు♦నరుదుగాఁగ, నెవ్వఁడిచ్చె దీనికిఁ బ్రతి♦కృతియుఁ గలదె?
తెలిసినంత తెల్పుమ యనఁ♦బలుకు నా వి, భీషణుండు సద్గుణ గణ♦భూషణుండు

తే॥ బ్రహ్మయాగఫలంబుగాఁ♦బడసె దీని, శంకరుఁడు కొని జగమున♦జయమునొందె
భవునిగూర్చి చేసిన తపఃఫలముగాఁగ, నతఁడె వీనికి నొసఁగె నె♦య్యంబుకతన.

తే॥ దీనిచేఁ దొల్లియింద్రు బం♦ధించివైచె, దీనిచేతనే మన హను♦మానుఁగట్టె
నిర్జరులు స్వర్గపాలన♦నీఁగినదియు, దీనివలనన సుమ్ము వై♦దేహినాథ! ౧౯౧౩

తే॥ పట్టినట్టి వారల ప్రాణ♦వాయువులను, పీల్చికొనికాక యూరక ♦ వీడిపోదు
అజ హరాదులకును త్రో♦వ♦నలవికాదు, తక్కువారల సంగతి♦తలఁపనేల? ౧౯౧౪

మ॥ అన నైరాశ్యముచెంది రాఘవుఁడు రో ♦ షాక్రాంత చేతస్కుఁడై
కని యీపాశము నిచ్చి నాతని శిరః ♦ ఖండంబు గావింతునా?
మును లోకంబులఁ గాల్చి బూది జలధిం ♦ బూడ్చింతునా? లంక నీ
వనధిన్ ముంతున? యేమిచేసినను పా ♦ పంబింత చేకూరునే? ౧౯౧౫

చ॥ వరముల నిచ్చి యీభుజగ ♦ పాశము నిచ్చిన వారె వచ్చి నం
బరమునఁ గాతురేని తగు ♦ మన్ననఁ గాంతురు కావరేని శం
కరుఁడు పురంబు లేర్చిన తెఱఁ ♦ గం ద్రిజగంబు లొనర్తు బూదిగాఁ
బురహరుఁ డడ్డమైన సుర♦పూజ్యుఁడు ధాతయు నడ్డు నిల్చినన్. ౧౯౧౬

శా॥ నాతమ్ముండె మృతిం భజించిన భువిన్ ♦ మన్నింప నాకేది? వి
ఖ్యాతిం గూర్చునదేది? నిందయని ప ♦ ల్కండగ్గదేదీ? జగ
త్ఖ్యాతంబై తగు ధర్మ మేది? కన మ ♦ ర్త్యుల్ దివ్యులున్ నాయెడన్
బ్రీతిం జేరి భజించుచున్న ప్లవగ ♦ వ్రాతంబుతో సాటియే? ౧౯౧౭

మ॥ అని రోషాకులితాత్ముఁడై పలికి మా ♦ యన్నిచుఁ డొక్కండు చిం
తను కల్గింపఁగ నాగ్రహించి జగముల్ ♦ నాశంబు గావించుటల్
మను వంశేంద్రులకున్ హితంబె యని సం ♦ భావించి నిట్టూర్చు ముం
దున నూయిన్ వెను గోయి యయ్యె ననుచుం ♦ దూపిల్లు సందేహులన్.

తే॥ రెండు తుండంబు లున్న వే♦దండ మొందు, లోత్రమునకు భయంబంది♦తూలి తలరు
సరణి రాముఁడు ధర్మపా♦శమ్ముఁదడవి, నన్నుఁ జంపదొ యిదియని♦విన్ననొందె.

—: గరుడుఁడు రాఁగా నాగపాశము వీడుట :—

తే॥ ఈస్థితి యిఁకెట్టి పరిణతి♦నెనయునొక్కొ, యని వియచ్చరుల్ చింతించు♦నదనునందు
ప్రక్కనే యున్న గరుడుండు♦బ్రాఁతివలనఁ, గరఁగి చీఁకటిలో నటుఁ♦గానవచ్చె.

సీ॥ కలఁగని హృదయంబు♦కలఁగుటచేఁ జింత, తగని డెందంబున ♦ నొగులువాఁడు
లంకేశుఁ గాంచిన ♦ లలి జగంబులఁ గాంచు, వడువున కారాట♦పడెడువాఁడు
పక్ష మారుత వేగ♦బలమున దిగ్దంతి, నేత్రముల్ మూయంగ♦నెగడువాఁడు
తన మేనికాంతి భూ♦తల వియత్తలములఁ, బట్ట పగలు చేయు♦పటిమవాఁడు

తే॥ దూరదర్శిచక్షువులతోఁ♦దోయజాక్షు, మేనుగాంచియుత్సాహంబు♦మీఱువాఁడు
కడలి తరఁగలు చెదరఁ జీఁ♦కటులు బెదర,వచ్చువాఁడు నభశ్చరుల్♦మెచ్చువాఁడు.

సీ॥ పాపజాతి కలఁగఁ♦బాఁపజాతి నలఁగ, దర్శన స్పర్శనో♦ద్ధతి గలాఁడు
అరులు గిరులఁ దూఱ♦నిరులు దరులఁ జేర, బలువు చెలువు మేనఁ♦గలుగువాఁడు
అలరు లత్తుక మేను♦వెలరు కుత్తుక జాను, గలుగు వెలుఁగుతోడఁ♦జెలఁగువాఁడు
గుణ భూషణముల భా♦షణ భూషణముల స, న్మణి భూషణమ్ముల♦మలయువాఁడు

తే॥ ఒడలివలన వెన్నెల లెండ♦లొలయుచుండఁ, గనకగిరిమీఁది భానుని♦కరణి నొప్పి
శీర్షమున రత్నమకుటమ్ము♦చెన్ను గులుక, వైనతేయుండు జానకీ♦జాని డాసె.

సీ॥ కాలమేఘములీలఁ♦గ్రాలు మేనినిగాంచి, చిరము నమస్కృతుల్♦సేయకుంట
ధ్వజముపై నుండి స♦ర్వ జగంబు లనువొందఁ, గావించు వినుతులు♦గానకుంట
వాహనమై లోక♦వంద్యత్వము చిరమ్ము, మఱచిపోవఁగఁజాలి♦నలయుచుంట
తల్లిని పాసిన♦పిల్లకై వడిఁ జాల,కాలంబు ప్రభుఁబాసి♦క్రాఁగుచుంట

తే॥ తలఁచి తలఁచి మెత్తనగఁ జి♦త్తంబుకరఁగ,లోక మూలకారణ రమా♦లోల! వరద!
బ్రహ్మరుద్రాది దేవతా♦వంద్యనామ! రామ! చింత యేలనుచుఁజే♦రంగవచ్చె.

తే॥ మాయ జగమిది సర్వంబు♦మాయ నీవు, మాయకాఁడవు నీదగు♦మాయ నెఱుఁగ
నెవరు వలఁతు లీమాయ ని♦న్నేమి సేయు? విశ్వజనక! విశ్వోదర! విశ్వసాక్షి!

సీ॥ ఆద్యమై కాంచి మ♦ధ్యమ్మయి పోషించి, యంత్యమై పరిమార్తు♦వరయ జగము
లన్నిట నుందు వి♦స్తాప్తి యొనర్తువు, నరుఁడవై యొరులచే♦వరముగొందు
సీసములుగఁ గమ♦లాసన రుద్రులఁ, జేసి వారలతోడఁ ♦ జెలఁగుచుందు
తలఁపున సృష్టింతు ♦ తలఁపున విలయంబు, నెసఁగింతు వీవు ల ♦ యింపకుందు

తే॥ విట్టి పద్ధతి యినుమంత♦యెఱుఁగఁగోర, సంధులంజేసి చీఁకటి♦యందు నిలుతు
వహావా! జాణతనంబొ? పి♦న్నాటయేమొ? యరసి పలుకంగ నేరికి♦నైతిగాదు.

సీ॥ జీవితమొసఁగుదు ♦ చెడక నైజస్థితి భావియం దుందువు ♦ వాంఛగొనవు
దొరకనిత్తువు కొన్ని♦దొరకనీయవు కొన్ని, దొరకిన యవికూడ♦దోఁతు కొన్ని
పసిబిడ్డ నేడ్పించి♦పండిచ్చు కరణి దుః, ఖంపఁజేయుదువు సు♦ఖంపనిత్తు
వాహారమగుదువు♦ప్రాణంబు నగుదు దో, బూచులాడుచునుందు♦తోఁచకుందు

తే॥ కానబహురూపుఁడనుచు నే♦కంబయనుచు, నందరానివాఁడంచుమా♦యావియంచు
జ్యోతియంచు నానందమ ♦ యుండవంచు, శ్రుతులు బహువిధంబులుగ వా ♦
క్రుచ్చుచుండు. ౧౯—౨౬

సీ॥ ఆస్తికు లౌనన ♦ నాస్తికుల్ లేదన, నెసఁగు నేర్పులకు దా ♦ విత్తువేల?
బహుళశంకలకుఁ దా ♦ వలమిత్తు వదియేల? మాయలతోడ నే ♦ మలయుటేల?

పలువిధ మతములు ♦ ప్రబలనిచ్చుట యేల? జనులు తన్నుఁ గలాడఁ♦గనుట యేల?
పాపంబులను తోల్తఁ ♦ బండనిచ్చుట యేల? మొలకలో గిల్లుట ♦ తెలియ వేల?
ఆ॥ మొలవ నిచ్చు టేల? ముదుర నిలుపు టేల? శ్రమలఁబొంది తుదకుఁ♦జదుప నేల?
తెలిసి తెలియకుండు♦ తెరచాటు బ్రదు కేల? స్పష్టపఱుపకిట్లు♦చంపు టేల? ౧౯-౨౮
సీ॥ మఱచిన తెఱఁగేలఁ♦మఱవని వెర వేల? యెఱుగకుండుట యేల?♦యెఱుఁగు టేల?
వదలియుండుట యేల? వదలకుండుట యేల?♦యంటియుండుట యేల? యంట మేల?
ఒక్కరూపం బేల; పెక్కు రూపము లేల? తిను టేల తిండికై ♦ తిరుగు టేల?
పుట్టించు టది యేల? పాలియించు టది యేల? నడుమఁ జిక్కులు పెట్టి♦నలఁచు టేల?
తే॥ దేహమును పొందు టేల? యీ ♦ త్రిప్పు టేల? ధర్మ సంస్థాపనమునకో? ధరణిజనుల
కెల్ల నాదర్శనమునకో? యేమి తెలియు? నీదు మాయలు కల్లలో? నిక్కువములో?
సీ॥ కర్మఫలంబుల ♦ కై జన్మ మొసఁగెదు, కర్మల నంటక ♦ కదలువారి
కానంద మొసఁగి త♦న్మానసంబుల నుందు, మునులకు మొదలి ము♦మ్మూర్తులకును
జ్ఞానులౌ వారి క ♦ జ్ఞానులౌ వారికి, నెల్ల వారికిఁ దెల్ల ♦ మెఱుఁగఁబడవు
పెనఁగినవారు చ ♦ చ్చినవారు కని దుఃఖ, మొందువారలయందు ♦ నుందువనుట
తే॥ యిప్పు డిచ్చట నీయొద్ద♦నెఱుఁగనయ్యె, వెడఁగు వెడఁగు వివేకి వి♦వేకమీవు
నీది స్థిరగుణం బెయ్యదో? ♦ నిశ్చయముగ, నెఱిఁగి కొఱలేక యెఱిఁగింప ♦
నెవరి తరము? ౧౯-౨౯
తే॥ కార్తికేయకందము నొల్వఁ♦గడఁగునంత, లోన నేమియు లేకుండు♦జానుదోఁప
నీ వవతరించియును నిజ♦మెఱుఁగనీవు, నీదు మాయలఁ దెలియంగ♦నేరమయ్య!
తే॥ అని నుతించుచు గరుడుండు ♦ తనువుదీప్తిఁ, దమముఁ దోలుచు రాఁగాంచి ♦
దాశరథియు
వింతవాఁడెవఁడని చూచు♦నంతలోన, వచ్చి చెంగట నిలిచె న♦ద్భక్తి తోలఁక.
†చ॥ నిలిచినయంత నాగములు ♦ నెమ్మదిగా ధనముల్ గుణంబు ని
ర్మల యశముల్ గలట్టి విభు ♦ మన్ననఁ జెందిన వారి యొంగదల్
తొలఁగిన చంధమై కలువ ♦ తూఁటికి సన్నని దారమంతయుం
దెలియఁగ రాక మాయమయి ♦ తీఱె జగంబులు సంతసిల్లఁగన్. ౧౯-౩౦
క॥ ఎఱకల కతువలిచేఁ దమి, పఱచుటయే గాక మేనఁ♦బ్రబ్బిన యలుఁగుల్
తొఱఁగెను దద్దులతోడను, నెఱి తెలివరి కంటఁగట్టు♦నిందయుఁ బోలెన్
తే॥ క్రూరకర్మ లధర్మ లిం♦ద్రారులందు, మందునకు నొక్కఁడే నను♦బొంద లేదు
క్రొత్తసృష్టిలో జీవుల♦కొమరు దాల్చి, వానరులు లేచి యుత్సాహ♦వంతులైరి.

---

† ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగములు తిరువళ్లువర్ సెల్లూరున నుదారుండగు జటప్ప తమ్ముని కరతామని గాంచిన యాచకులయు బంధులయు ఆఁకలివలె తొలంగినవి. అనియూహము.

ఉ॥ నీతివిదుండు రాఘవుఁడు ♦ నెమ్మది లేచి నమస్కరించు వి
ఖ్యాత చరిత్రు లక్ష్మణుని ♦ గాటముగాఁగఁ బరిష్వజించి యి
ట్లీతఱి బాముగూర్చు విధి ♦ యే తొలఁగించె నటంచు వానర
వ్రాతముఁ బ్రాణముం బలెఁ గ♦రంబున దువ్వుచుఁ బల్కెఁ దార్క్ష్యుతోన్.

మ॥ స్థిర దోషాకరు లీల నొప్పు నఖ రా♦జింబొల్చు పుణ్యాత్మ ! దు
ర్భర దుఃఖాంబుధినుండి తేల్చితి తపః♦ప్రాప్తార్థ పుణ్యంబు నాఁ
గరుణామూర్తివి నీకుఁ బ్రత్యుపకృతిం ♦ గావింప నేముందు ? స
త్పురుషుల్ ప్రత్యుపకారముం గొనఁగ సం♦తోషింతురే యెయ్యెడన్ ?

శా॥ ఏమిం దోఁపక వేఁగుచున్న యిటకీ ♦ వేతెంచి మాప్రాణముల్
ప్రేమన్ వెండి యొసంగి కాచుటలతో ♦ విజ్ఞోపచారోక్తు లి
ట్లామోదంబుగఁ బల్కుచుంటివి మహా ♦ త్మా ! దీనికిన్ సాటిగా
మేమే కానుక లీయఁగాఁగలము ? మా♦మేరల్ మహాల్పంబులౌ. ౧౯౩౮

శా॥ సందేహించుచునున్న ప్రాణముల ని ♦ చ్చంగూర్చు పూజ్యాశయా !
ముందెన్నండును చూడలేదు చెలిమిం ♦ బొల్పార దొక్కండు మా
యందుంగైకొనలేదు నీకుఁ గొఱయే ♦ యందంబునన్ లేదు మా
చందంబారసి తెల్పు చేయఁదగు క ♦ ర్జం బెద్దియే నున్నచో. ౧౯౩౯

మ॥ అను శ్రీరాముని ప్రేమపూర్ణ విమల ♦ వ్యాహార మాలించి య
వ్వినతాపుత్త్రుఁడు కేలుమోడ్చి యనఘా ! విద్విడ్వధానంతరం
బున వత్తున్ మన ప్రాఁత చుట్టఱికమున్ ♦ మోదంబుతోఁ బూర్తిగా
విన వాక్రుచ్చెద పీడుకోలె యనుచున్ ♦ విచ్చేయుడుం గాంచుచున్.

చ॥ పిలువక వచ్చి జీవములఁ ♦ బ్రీతి నొసంగె నుదారుఁ డీతఁ డే
వలనను మాఱుమేలు మన ♦ పాల గ్రహింపఁడు లోకమందు పు
ణ్యులు తమయంత వచ్చి జని ♦ నొవ్వులఁ దీర్తురు గొప్పలాభముం
దలఁచియొ వారిదంబు జన ♦ తా ఘన తాపము పాపుచుండుటల్ ?

చ॥ అని రఘురాముఁ డాడఁగ మ ♦ హాబల సూనుఁడు దేవ ! లక్ష్మణుం
డని మరణించె నంచు మిథి ♦ లాధిప నందన కుందు నొందుఁ గా
వున విజయోద్ధతి న్నిదురఁ ♦ బొందిన రక్కసిమూఁక భీతిలన్
గొనకొని సింహనాదము న ♦ కుంఠిత రీతి నొనర్తమా యనన్. ౧౯౪౦

మ॥ ధరణీజాపతి మంచిదే యనఁగ స ♦ ప్తద్వీపముల్ సప్త సా
గరముల్ సప్త కులాచలంబులు కలం ♦ గన్ సప్త మేఘంబులున్
బరపై తాళుల రాల్ప దిక్కు లగలన్ ♦ బ్రహ్మాండ భాండంబు చిం
దఱగా వానరవీర సంతతి మహా ♦ ధ్వానంబు గావింపఁగన్. ౧౯౪౧

మ॥ అకలంకాత్మ ధరాత్మజాత మదిలో ♦ నారాటముం గూర్పఁ ద్ర్యం
బకు వక్షంబునఁ గాఁడు మారుశరముల్ ♦ వక్షంబుఁ దొల్వంగ స
జ్జక సెజ్జం బొరలాడు పంక్తిముఖుఁ డా ♦ శబ్దంబు నాలించి యిం
చుక యోచించి నిజస్థితిం దెలియఁగాఁ ♦ జూచెన్ విలోలాత్ముఁడై. ౧౯౪౩

మ॥ జనకాజ్ఞన్ జడలూని ధర్మమును సం ♦ స్థాపించి దుష్ప్రాప వ
ర్తనులం గూల్పఁగఁ గంకణంబు గొను శ్రీ ♦ రాముల్ మనంబందు చిం
తన గావించుచు నున్న సీతయును సీ ♦ తాదేవిపైఁ బ్రేమ ని
ల్పిన యూధుండును తక్క నిద్రిలని జీ ♦ వింగాన మాలంకలో. ౧౯౪౪

మ॥ ఆ శబ్దంబును విన్న రావణుఁడు కో ♦ పావిష్టుఁడై లేచి యా
కీశవ్రాతము లక్ష్మణుండు ననిలోఁ ♦ గీడొందిరన్నట్టి సం
దేశం బెంతటి సత్యమో? యనకులా ♦ ధీశాన శింజాన మా
కాశం బంటెను వానరావళుల పె ♦ న్గర్జా నినాదంబుతో. ౧౯౪౫

తే॥ రామ కోదండ మొసఁగె ని♦ర్ఘాతరవము, లక్ష్మణుని ధను వండగో♦ళముఁ బగిల్చె
హనుమ గర్జ శ్రవణభేరి♦యుగలఁ జేసెఁ, దరణిసుతు గర్జనంబు రో♦దసిని నించె.

తే॥ అంగదుం డార్చుచుండె నీ♦లాది కీశు, లుత్సుకత్వంబుచేఁ జేయు♦నుగ్రరవము
బ్రహ్మగోళంబులోన వె♦ల్పలను నిండెఁ, గాశమున నుండి వారు వీ♦ద్వడిరి నిజము.

క॥ అనిలేచి పంక్తి కంఠుఁడు, చనియెను వడి నింద్రజిత్తు ♦ సదనంబునకున్
మునువెనుకల ఖడ్గులు దీ, ప నికరములు వట్టి దనుజ♦వనితలుఁ నడవన్. ౧౯౪౮

తే॥ చేలములు జాఱుచుండఁగఁ♦గేలఁబట్టి, నెఱి కురులు వ్రేల మత్తెక్కు♦నిదురకనులు
వ్రాలఁ దడఁబడు నడకతో♦వచ్చినారు, మధ్యమధ్యఁ దూఁగుచుఁ దటి♦న్మధ్యలపుడు.

తే॥ మద్యపానంబు కూర్కు నా♦మధ్యఁ గలఁచు, కనుల బరువును తోఁచితోఁ♦పని విధమ్ము
పాట లందెల కొలఁది శ♦బ్దమ్ము గలుగఁ, దడఁబడుచు నడచిరి దేవ♦తరుణులపుడు.

తే॥ మొగులునకు నల్పు గల్పించి♦పొగలు నించి, పూలు తుఱిమినట్లుండు కొ♦ప్పులును నీల
నయనములును కెంబెదవులు♦నౌరు గలుగు, పడఁతు లూఁగుచుఁ దూఁగుచుఁ♦
బడుచుఁ జనిరి. ౧౯౫౧

సీ॥ మధురసాలామృత♦మాధుర్యములఁ జేర్చి, కలుకుల పలుకులు♦గాఁ గదించి
హరిణ మత్స్యాబ్జంబు♦లందలి సౌందర్య, ములఁ దీసి సోగ క♦న్నుల నమర్చి
తక్కు సుందర వస్తు♦తతినుండి కొన్నట్టి, మురువున నవయవ♦ములు సృజించి
చిత్రసృష్టిగ బ్రహ్మ♦చేసిన చెలువలు, దశముఖు నిరుదెస♦దవిలి రాఁగఁ

తే॥ ప్లవగ భీకర రవములు♦చెవులఁబడుడుఁ, బిడుగు రొద విన్న భుజగుల♦వడువుగాఁగఁ
సింహ గర్జనమును విని♦చెదరి గొదవడుఁ, వారణముల చందము దైత్య♦వరులు పొంద.

తే॥ త్వరగఁ జని పెద్దకొడుకు సౌ♦ధంబుచేరి, గాయములనుండి నీచూరఁ♦గ్లమము సెంది
సింహఘాతంబుచేఁ జేవ♦చెడిన గజము, చెలువునను బెగ్గిలెడి యింద్ర♦జితునిగాంచె.

ఉ॥ లేచి నమస్కరించు దిట ♦ లేక కరంబులు శక్తిహీనతం
దోఁచు విధంబునన్ వినతి ♦ తో మెలమెల్లన మ్రొక్కు పుత్త్రకున్
జూచి యిదేమి చాల శ్రమ ♦ స్రుక్కితి? వేమి ఘటిల్లెఁ? జెప్పుమా
దాఁచక యంచుఁ బల్మఱు లె ♦ దంగొని వేఁడఁ గుమారుఁ డిట్లనున్.

చ॥ కవచము పట్టు వీడినది ♦ గాటపు ఱొమ్మునఁ జెప్పరాని లా
ఘవమున దూసిపోయినవి ♦ కాండచయమ్ములు మేరమీఱి దా
నవకుల చంద్ర! మిక్కిలిగ ♦ నల్లయు వెల్వడె మేనుసోలె మా
య వలన లక్ష్మణుండు మృతి ♦ నందకయుండిన నేమియౌదునో! ౧౯-౫౫

చ॥ హరిహయుఁడున్ హరుండు హరి ♦ యర్కుఁడు మున్నగువారు సేయు సం
గరముల నింతగా నలయి ♦ కం గొనలే దిపు డాడునట్టి దీ
న రవము మున్నొకప్పుడుఁ గ ♦ నంబడ దమ్మనుజేంద్రు బల్మి యు
జ్జరె! వివరించి తెల్ప నొక ♦ చాపముతోడిది గాదు నాయనా! ౧౯-౫౬

చ॥ అనుజుని శక్తియిట్టి దగు ♦ నగ్రజు శక్తి తలంచి చూడఁగా
మనకది తెల్పఁగా వలఁతి ♦ మాత్రము గాదు సయిన్ మతేమిగాఁ
జనునొ వచింపఁగాఁ దలఁపు ♦ చాలదు చూచెదుగాక గెల్వమే
మనకగు నంచు నిక్కటలు♦మా పొరపాటగు మాను నాయనా! ౧౯-౫౭

ఉ॥ వానరవీరులం దునిమి ♦ వారక లక్ష్మణుఁ గూల్చి గెల్వమున్
నేను గడించుటల్ వినుము ♦ నిక్కము మాయను నాగపాశముం
బూనుటచేతనే; యిఁకను ♦ భూమిజభర్త యొకండ నిల్చెఁ బైఁ
గా నగు కార్యమెల్ల జరు ♦ గందగు నంచు వచించు నంతటన్. ౧౯-౫౮

ఉ॥ రావణుఁ డిట్లనున్ గుణ వి♦రావము లక్ష్మణు వింటినుండి పై
తావులు బ్రద్దలౌ నటులు ♦ తర్కొనె వానర సింహనాదముల్
మేవుకొనెం దివంబు రణ ♦ మేదినిఁ బుట్టిన గొప్ప ఘోషముల్
నీవు వినంగలేదొ యన ♦ నివ్వెఱఁగొంది కుమారుఁ డిట్లనున్. ౧౯-౫౯

ఉ॥ వారలు నాగపాశమున ♦ బంధితులైరి మొగంబులందు తే
జో రమ డిందెఁ జావక య ♦ స్రువజ మొందుట సత్యమౌనొకో?
యేరికి దానిఁ దప్పిఁకొన ♦ నిమ్మగుఁ? దప్పిన దైవశక్తికిం
దూఱు ఘటిల్లదే? యనుచుఁ ♦ దూఱి తలంచుచు నుండు నంతటన్.

ఆ॥ వేగు లరుగుదెంచి ♦ విభునకు మ్రొక్కంగ, నాతఁ డాత్రపడుచు♦నడుగునంత
వారలిట్టు లర్థ♦వంతమౌ వాక్కులఁ, బలికి రధిక నయము♦భయము గదుర.

ఉ॥ పాశ నిబద్ధులై శర వి ♦ పాటిత దేహులునై రణంబునం
గీశులుఁ దమ్ముఁ డుండఁ బరి ♦ కించి యలంగి తపించి యేడ్చి సీ
తేశుఁడు మిక్కిలిం గినిసి ♦ యిత్తఱి లోకములెల్ల నొక్కటన్
నాశ మొనర్తునంచు జత ♦ నం బొనరించుచు నుండునంతటన్. ౧౬౩

చ॥ గరుడుఁడువచ్చె వాని యెస ♦ కంబగు రాకను గాంచి నాగముల్
తురతురఁ గట్లువీడి చిఱు ♦ తున్కలుగా నశియించె వారి ము
న్నరమగు మేనిగాయములు♦మాసెను మున్పటికంటెఁ దేటయున్
దిరము బలంబు గల్గి యటు ♦ తేఁకువ నార్చిరి వార లయ్యెడన్.

ఉ॥ నావుడు రావణుం డనియె ♦ నాదు కుమారుని నాగపాశ మీ
శేవను నైన తేయుఁడు ఘ ♦ టిల్లఁగ నాశిలెనేమి? వానికిం
గావర మింతగల్గెనె? వి ♦ కావిక లయ్యెను నా ప్రయత్నముల్
నా విధులిట్టులై వెలుఁగ♦నా గరువంబును మంటఁ గల్పనే? ౧౬౪

సీ॥ పదునాల్గు లోకంబు ♦ లుదరంబున నడంచి, వీడుచుండు ననెడి ♦ వెడ్డుకీర్తి
పడసిన వెన్నుండు ♦ బవరంబు నాతోడ, నొనరించు నాఁడు భీ ♦ తిని వహించి
జగములన్నియుఁ బెక్కు♦సార్లు చుట్టిననాఁడు, డాఁగురించి కడలి♦డాఁగునాఁడు
అల్ల వైకుంఠంబు ♦ కొల్లవెట్టిననాఁడు, నాశరమ్ము లురమ్ము ♦ నాటునాఁడు

తే॥ బరియలును వీఁపు బాహువుల్ ♦ నెఱఁకులంటఁ, గ్రుచ్చి త్రెఱిమిననాఁడు నీ ♦ గ్రుడ్డిగరుడి
చూడదో? శక్తిలేదో? పి♦చ్చుకలమీఁది, కేగెనో! నాఁటి కడిమి నేఁ♦డెఱుఁగదేమొ?

తే॥ కాఁగలది కాకమానదు♦కడచి బ్రదుకు, వారి నెట్లయినం జంప♦వలయుఁగాదె?
యీవ తగుదు చేయుము తార్క్ష్యుఁ♦డీలనొంద, ననుడు మేఘనాదుఁడు తండ్రి ♦ కనియె నిట్లు ౧౬౬

తే॥ నేఁడు మాత్రము శ్రమనీఁగ♦నిలిచి తొల్లి, వెడలి బ్రహ్మాస్త్రమున మనో♦వేదనంబు
నీకుఁ దొలఁగింతు ననిపల్కి♦నిర్జరారి, మంచిదని చేరెఁ దన తల్ప♦మందిరంబు.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రామ.

# కంబరామాయణము.

## యుద్ధకాండము :: ఉత్తరభాగము

---

### ౧౯ సేనానాయక వధ పటలము. (౧౦౨)

తే॥ మిన్నులము పెడబొబ్బలు♦విన్న దైత్యు, లడరి శంఖ భేర్యాది వా♦ద్యములు చెలఁగ
సమర కౌతూహలంబు డెం♦దములఁ బొడమ, నసురవిభుఁ జేరి యానతి♦యడుగునంత.

తే॥బవరమునకీవునమ్మహా♦పార్శ్వతోడఁ, బొమ్ముధూమ్రాక్షయను దశ♦ముఖుని గాంచి
విన సహింపక దూతలు♦వీరుచేయు, చేఁత లించుక వినుఁడని♦చెప్పిరిట్లు. ౨

చ॥ రథములు వోవ వారణ తు♦రంగములెల్ల నశింప రాక్షసుల్
క్రుధగొని పోరునేసి యనిఁ ♦ గూలఁగ నింద్రజి యొంటి నిల్చుచో
వ్యథగొని లక్ష్మణాస్త్రములు ♦ వచ్చెనదో యిదొ యంచుఁ గొంకుచున్
బథము దొలంగి వావిడిచి ♦ పాఱినవారలు ధీరులే యనన్. 3

తే॥ క్రూరకర్మంబులను జంకు♦కొంకు లేక, చేసి యలవాటు పడినట్టి♦చేయిగాన
దశముఖుం డదివిని ఘోర♦దావవహ్ని, కరణి మండుచు వారలఁ♦గట్టఁబనిచి. ౪

#### —: రావణుం డింద్రజితునిచక్రరక్షకుల ముక్కులుగోయ నాజ్ఞాపించుట :—

తే॥ వీరిసేవ యిట్టిది యంచు♦నూరివార, లెఱుఁగ నాసికగోసి యూ♦రెల్లఁ ద్రిప్పి
విఱువుఁ డంతియచాలును♦వేఱువలదు, పొండనఁగఁ గింకరులు కోయఁ♦బూనునంత.

ఆ॥ వలదు వలదటంచు♦వారల కడ్డంబు, వచ్చి యాఁపి పంక్తి♦వదనుఁ గాంచి
యేమిసేయఁదలఁచి♦తిది ధర్మమే? యంచు, మాల్యవంతుఁ డనియె♦మఱియునిట్లు.

చ॥ గెలిచినవార లోడుటయు ♦ గెల్వనివారలు వెండి గెల్చుటల్
తలఁపఁగ నైజమై పొసఁగు ♦ ధారణియందు మగంటిమిన్ సదా
చలనములేక నిల్చుకొనఁ ♦ జాలినవాఁ డొకరుండు కల్గునే?
వలపులఁ గూర్చుచుండు జయ ♦ పంకజగేహిని దాంతచిత్త యే? ౭

తే॥ పరబలం బించుకేనియు♦నరయవలదె?, తొల్లి నిర్జరసేనలు♦వెల్లివిరిసి
వచ్చి యోడవె? యంతతో♦వాసవుండు, జతనమును మానుకొనియెనే♦జగమునందు?

చ॥ వరుణుఁడు కంపితాంగుఁడయి ♦ పార్థివ వీరుని చేరవచ్చి తా
శరణమునొంది జీవముల ♦ జానుగ నిల్పుకొనంగఁజాలె నీ
పురువులు చూడ లెక్కకును ♦ పోల్పఁగఁజాలినవారె ? ఘోర సం
గరమున వారితో నెదురఁ ♦ గా వశమే ? యిది నీవెఱుంగవే ? ౯

క॥ పొలిసె నలువది వెల్లువల్ ♦ కలనియందు, వీరు మువ్వురే ప్రాణమ్ము ♦ లార నిలుపు
కొన్న వారు గావున వీరి ♦ కన్న నెవరు, ప్రథన చాతుర్యమును బయ ♦ ల్పఱచినారు ?

చ॥ చెడియెను నాగపాశమును ♦ చేడ్పడి యర్థముకంటె హెచ్చుగా
మడిసె బలంబు నీవు నని ♦ మానవనాథుల నేర్పు పెంపు ను
గ్గడువుగఁ గాంచివచ్చితివి ♦ గాదె కుమారునితోడ నుండమిన్
జెడుగుగ నెంచి ముక్కలను ♦ చెక్కదె ? యియ్యది యుక్తకార్యమే ?

తే॥ లక్ష్మణుని పేరుసెప్ప నీ ♦ లంకలోని, జనులు తమతలుపుల మూసి ♦ కొనెడివారు
ఎవరినాసిక గోసెదో ♦ యెంచిచూడు, జగము కలదాఁకఁ గోసిన ♦ సమయునేమి ? ౧౨

తే॥ దూతయై వచ్చినట్టి వా ♦ తూలసుతుని, ధాకకోడి ప్రెుక్కినవారు ♦ సోఁకులందు
పెక్కురున్నారు వాతలు ♦ ముక్కలొంది, యున్నవారలు కోయక ♦ యుంటివేల ?

ఉ॥ సీతను వీడమింగలుగు ♦ చిక్కులచే మనవీరు లెందఱో
యీతల శత్రురాజి వధి ♦ యింపఁ బ్రతిజ్ఞలు చేసిపోయి రా
రీతిగఁ జేసివచ్చు నొక ♦ రింగనమింతకు రామలక్ష్మణుల్
నీతలఁద్రొక్కి నిల్చిరిఁక ♦ నెవ్వడి నెల్లర ముక్కలూడ్చెదే ? ౧౪

చ॥ అనవిని వారు డెందముల ♦ నంజిక యించుక మాని కేలు మో
డ్పును గదియించి దైత్యకుల ♦ ముఖ్యుని గాంచి క్షమింపుదేవ! మా
మనముల నెందు రోసినను ♦ మాయలు మోనము లేదు సంగరం
బున ఘటియించు దుస్థితులఁ ♦ బూర్తిగఁ దెల్పెద మాలకింపుమా. ౧౫

మ॥ విరథుండై తనయుండు శక్రజితుఁడే ♦ విన్వీథి కేతెంచి శం
బర మాయల్ పచరించి ప్రాణములతో ♦ బైల్పడ్డవాఁడయ్యె మా
తిరముల్ సెప్పఁగనేల? దేవ! యిఁక ధా ♦ త్రీనాథ శీర్షంబులన్
జరణాబ్జంబులచెంత నుంచెదము ని ♦ చ్చల్ నీవు మోదింపఁగన్. ౧౬

ఉ॥ పంపుము పంపితేని యన ♦ వద్య రణంబున నేఁట రేపటన్
చంపిర యంచో చంపఁబడి ♦ చచ్చిర యంచునో విందుగాని వం
శంపు గురుత్వమే చెడఁగ ♦ జాఱిరి తోఁటిరి పాఱిరంచు నీ
చంపు వచస్సులన్ వినఁగఁ ♦ జాలవు మన్ననచేసి పంపవే. ౧౭

చ॥ అని శపథంబు సేయుటయు ♦ నాయుధపాణుల బంతి వెల్వలన్
దనుజవరేణ్యుఁ డంపె రథ ♦ దంతి తురంగము లన్నితోడుగా

సనుపుచు యజ్ఞశాత్రవు న ♦ హర్పతి శత్రుని మాల్యవంతుతో
ఘనుఁడగు వజ్రదంష్ట్రుని ని♦కాయముఁ గాయఁగఁ బంపు నంతటన్. ౧౮

అ॥ నింగి ప్రింగె ధూళి♦నిర్జరేంద్రులు కనుల్, గప్పుసేన మేర♦గాంచలేక
కనులు మూసికొనిరి♦శరముల నెవరికి, నైతిగాక యుండె♦నరసి తెలుప. ౧౯

తే॥ కాళ్లు గలిగిన కొండల♦కరణినొప్పు, హస్తిఘటలపైఁ డెక్కెంబు♦లలల వీవఁ
గైదువులు జలచరముల♦గతిఁ జలింప, నేమి రవముతో సేన వా♦ర్నిధిని పోలె.

క॥ శరనిధికై వడి భేరులు, మొరసెను కరు లిరులతో స ♦ ముద్రముతో మ
చ్ఛరికముగొని గీపెట్టెను, హరులును సకిలించె మిత్తి♦యఱచినభంగిన్. ౨౧

క॥ నడఁగంద్రు నడచు జడుమున, నడవక సిడి లెక్కగొనక ♦ నాగంబులు పై
జడదముల జలముఁ బీల్చుచు, నడుగిడకయె నిలుచు నడచు ♦ నామిక తోడన్.

తే॥ కైదువులకాంతి భూషణ♦కాంతితోడఁ, దురగ వారణ స్యందన♦స్తోమములకుఁ
గల యలంకార కాంతితోఁ♦గలిసి పరవి, దశదిశల నున్న యిరులను♦తఱిమి చంపె.

తే॥ వచ్చు సేననుగని ధరా♦వరుఁడు కినిసి, దనుజచమువుతో వచ్చెడు♦ఘనుఁడు శక్ర
జితుఁడో కాఁడో తెల్పుమ యన♦శిష్టగుణ వి, భూషణుఁడు విభీషణుఁడు రా♦
మునకు ననియె. ౨౪

మ॥ గుహలోనుండి క్షుధాగ్ని రేఁపఁ బెలుచన్ ♦ ఘోషించుచున్ దుర్భయా
వహ రోషంబున నిప్పులం గురియుచున్ ♦ బాలేందు రేఖా సమో
న్నహ దంష్ట్రా రుచులొప్పఁ దూణములు క్రొ♦న్నందాల్చి కైవింటితో
బహుళాభీలత వచ్చునాతఁడు మహా ♦ పార్శ్వుండు రాజోత్తమా!

క॥ జ్వాలాభీలములగు క్రూ, రాలస నేత్రములతోడ ♦ నలరారుచుఁ బె
న్నాలుక నార్చుచు వడి వా, తూలగతిన్ వచ్చువాఁడు ♦ ధూమ్రాక్షుఁడగున్.

ఆ॥ వదరుబోతు శూల♦పాణి! యీతల నీది, యా యటంచు డాయ♦నరుగువాఁడు
కాళులొప్పు కొండ♦కరణి వచ్చెడువాఁడు, వజ్రదంష్ట్రుఁ డనఁగఁ♦బరఁగువాఁడు

క॥ పెదవులఁ గొఱికెడు నాతఁడు, నెద గాలిని గెలుచు తురగ♦మెక్కినవాఁ డు
న్మదుఁడు రణభయద రూపుఁడు, సదసద్జ్ఞ విహీనుఁడగు పి♦శాచుఁడు రాజా!

ఆ॥ వనధికంటె రవము♦వహ్నికంటెను వేఁడి, గలుగువాఁడు రథము♦గలుగువాఁడు
సూర్యశత్రు వనఁగ♦శోభిల్లువాఁడు త, త్ప్రాంతగతుఁడు యజ్ఞ♦వైరి యధిప! ౨౯

ఉ॥ ఎట్టని శాలి సస్యముల ♦ యెన్నులఁబోలు తురంగ సంఘముల్
బెట్టుగఁ గల్గువాఁడు రణ ♦ భీకర కర్ముఁడు నెట్టి కార్యముల్
దట్టుగఁ జేయఁగాఁ దగు త ♦ పః ఫలయుక్తుఁడు దూరదర్శియున్
గొట్టున శూలినెత్తెడి య♦కుంఠిత సత్త్వుఁడు మాల్యవంతుఁడా. 30

ఆ॥ అనుచుఁ దెలుపుచుండ♦నినకుల వరునకు, జయము జయ మటంచు♦సవ్వడించి
ప్లవగవరులు దనుజ♦బలములపై రాలు, తరులు గొనుచుఁ బోరఁ♦దఱిసినారు. 3౧

ఆ॥ ప్రళయజలధినుండి ♦ వడగండ్లు రాలిన, కరణి విండ్లనుండి ♦ శరచయమ్ము
వెడలుచుండ శిరము♦లెడలి కోఁతులు పెద, వులను కొఱుకుచుట్టె♦యిలకుదొరలె.

ఆ॥ తరులు గిరులువైవఁ♦గరులును తురగంబు, లరదములును వీర♦వరుల శిరము
లాదిశేషు పడఁగ♦లడఁగంగఁ గుప్పలు, గూలిపడియెఁ గదన♦కువలయమున. 33

తే॥ అమరవైరులు వైచు చ ♦ క్రములు త్రెంప, బాహువులు పాదములు పెను ♦ వాలములును
విఱిగి మోచిన గిరులతోఁ♦దరులతోడ, నడఁగి గ్రుక్కుమిక్కురనక♦పడియె హరులు.

తే॥ పరువడిం దెసలకు దాఁటు♦పాటవంబు, నెలయ ఘోటకరాజి నా♦శ్వికులు రేఁచి
వీచినట్టి తోమరములు♦వీరవర శ, రీరములఁ గ్రొచ్చి పుడమిని♦ద్రెంచి చొచ్చె.

తే॥ బిఱ్ఱుబిఱ్ఱున వనచరుల్ ♦ వీచు శిలలు, పడగ నురలంగ యోధుల ♦ పండ్లురాలఁ
దలలు ప్రీలఁ బాతకుల గొం ♦ తులును తునుఁగ, నేనుఁగులు వీనుఁగులుగాఁగ ♦ నిలను గూల్చె. 3౬

తే॥ కరక లురలంగ గుహలకుఁ♦బరుగులిడెడు, చిలువలంబోలియాశ్వికుల్♦చెలఁగవైచు
శూలములు కుంతములు వాన♦రాలి యొడళు, లందుచొచ్చి యుచ్చును సొమ్మ♦యలఁత యొసఁగ. 3౭

తే॥ వారణములు తోఁకల మోఁదు♦వానరులను, దొలఁగివారలు కాళులఁ♦ద్రుంచుచువాని
కొండ అవ్వాని నెత్తి ర♦క్షోగణంబు, చదియవైచి యార్తురు రణ♦క్ష్మాతలమున.

తే॥ ముందునకుఁ ద్రోచికొని వచ్చి♦పొందనేయు, కపుల రాలచే నసురలు♦కలఁబడిరి
వారి విండ్లనుండి వెడలు♦నారసములఁ, దునిసి పండ్లిగిలించి కోఁ♦తులును కూలె. 3౯

మ॥ ధర నౌత్సుక్యముఁగూల్చ హేతువగు దు ♦ ర్దారిద్ర్య చింతా ప్తి యం
తరమం దెక్కుడుగల్గ వేదనను వం ♦ తంగుందు ఖిన్నాత్మ ము
క్కారయుంబట్టఁగ నూపి రూడునను లో♦కో క్తి క్రమంబంది వా
నర శైలంబుల స్యందనాశ్వములు భి ♦ న్నంబొంద నిల్చెన్ హరుల్. ౪౦

తే॥ మరణమొంద నాధోరణుల్♦మత్తకరులు, రక్తనదములఁ డెక్కెముల్♦రాజిలంగఁ
దిరిగె మాలుము లందఱుఁ♦దెల్లనంతఁ, గడలి స్వేచ్ఛతోఁ దిరుగాడు♦కలములట్లు.

క॥ పోఁడిమి చెడి యాశ్వికతతి, పాడఱ బంకమునఁ బడుచు ♦ వాంతుల రక్తం
బోడిగిలఁ గ్రక్కుచుండెడు, బాడబములు బాడబమ్మ ♦ పగిదిందోఁచెన్ ౪౨

తే॥ వానరులు వైచు కొండల♦వలన నలఁగి, రూపుమాసిన దనుజుల♦కోపుచూడఁ
జిరము కూడిమ్మాడిన వారి♦చెలులె వచ్చి, చూచి గుర్తింపరానట్టి♦చొప్పు గలిగె.

తే॥ హనుమ యెదిరించె ధూమ్రాక్షు♦నంగదుండు, మాఱుకొనియె మహాపార్శ్వు♦
　　　　　　　　　　　　　　　　　　　　　　　　　మాల్యవంతుఁ
జెనకె నీలుండు పనసుండు♦మొనసితాఁకె, మాఱియగు పిశాచుని రణ♦క్ష్మాతలమున

తే॥ సూర్యశత్రుని మార్కొనె♦సూర్యసుతుఁడు, యజ్ఞశత్రుఁ డీడాడె రా♦మానుజన్ము
వీరుఁడగు వజ్రదంష్ట్రుండు♦ బారిసమరు, చున్న ఋషభుని డీకొనె♦నుత్సహించి. ౪౫

ఆ॥ దనుజ నాయకులును♦వనచర నాయకుల్, కదనమందు దాఁకి♦కసిమసంగి
యొకరి నొకరు గెలువ♦నుత్సహించుచుఁబోరి, రుగ్రగతుల వేల్పు♦లుదరి బెదర.

ఆ॥ అట్లు పోరుచున్న♦యయ్యెడఁబదిలోన, నాఱువెల్లువలను♦హరిచయంబు
నలఁచె మిగిలినట్టి ♦ నాలుగు వెల్వాల, వెదకి లక్ష్మణుండు ♦ వేఁటలాడె.　　౪౭

తే॥ కలిసినట్టి చందంబునఁ♦గాక యుదధి, రక్తజలధియే యుదియును♦రాణనొప్పె
ముత్తెములు గురిగింజల♦పోలుపుదాల్చె, మత్స్యములు పగడంబుల♦మాడ్కినలరె.

తే॥ జలధియెల్లను రక్తమై♦వెలుఁగుచుండ, పలువిధంబుల రత్నముల్ ♦ పద్మరాగ
సరణిఁ గనుపట్టఁ గుంభిమ♦స్తముల శుక్తులందుగలముత్తెములునొక్క♦యంగమయ్యె.

తే॥ ముమ్మరంబగు పోరిట్లు♦మొనయుతఱిని, మాఱుకొన్న చీఁకటులను♦మదగజములఁ
దునిమి నెత్తుటఁ దోఁగి యె♦ఱ్ఱనయి లేచె, ననఁగ భానుండు తోఁచె బూ♦ర్వాద్రిమీఁద.

తే॥ రాక్షసాంధకారముఁదోలి♦రామరవియు, నిరులఁ దోలిన తరణియు♦నిరువు రొప్ప
జగము తమమను పేరు నా♦శంబు నొంద, నుల్లసిల్లిన గతిఁ గాంతి♦యొప్పమీఱె.

తే॥ తమము తొలఁగ రుధిర సాగ♦రమును కరులు, తెప్పఁ దేలిన జలధియుఁ♦గుప్పలైన
కుణప గణములు మితిమీఱె♦రణతలమున, నచ్చెరువుగఁ దోఁచెను భీతి♦పిచ్చలింప.

చ॥ ఉదయ గిరీంద్రమందు రవి ♦ యొప్పఁగ నెత్తురు వెంచలందునన్
మెదడుల పంకియం దొదిఁగి ♦ మిక్కిలి చుక్కలు ఱెక్కలున్న యా
ప్రదరములన్ శిలీముఖ వి ♦ వారము వ్రాలఁగఁ జచ్చువారివా
వదనములన్ జలేజములు ♦ వారక పూచిన చంద మేర్పడెన్.　　౫౩

తే॥ కరులు హరులును తేరులు♦కలిసిపడిన, తలము విలయవాయువు వీవఁ♦గలఁగఁబాఱి
యంబుదములు నక్షత్రంబు♦లమరరథము, లురలి ధరణిని కూలిన♦యొప్పదోఁచె.

తే॥ విరియుకురులతో దనుజసుం♦దరులువచ్చి, యలమికొనఁ దమపతుల మే♦నులు రణోర్వి
వల్లులలమిన పెను వృక్ష♦వాటి కూలి, యున్న తెఱఁగునఁ గానంగ♦నొప్పెనపుడు.

తే॥ తమకు కౌనులు పీనస్త♦నములు రక్త, దీర్ఘ కుంతలములు గల♦ తెఱవలు తమ
వరుల మస్తముల్ గొన కటఁ♦దిరుగుచుండు, భూతములఁబట్టి చీల్చిరి♦పొడము కినుక.

తే॥ ప్రియుని యవయవములఁ గూర్చి♦ పెట్టి యొకతె, గుండెలను వ్రేవులను నక్క♦
　　　　　　　　　　　　　　　　　　　　　　　　　గొనుచుఁబోవ
దఱుము త్రాణయులేక సం♦తాపమంది, కూలి జీవంబులను పాసి♦కూడెఁ బతిని. ౫౭

చ॥ పతుల భుజంబులం గొనుచుఁ ♦ బాఱెడు నక్కలఁ గాంచి దీన వా
క్ప్రతతుల వేఁడియుఁ విడక ♦ పర్విడ వెంబడినేగి కైదువుల్
కుతికిలఁగూలునట్లు వడిఁ ♦ గ్రుచ్చుకొనం గడునొచ్చి యేడ్చుచుఁ
వెతగొని ప్రాణముల్ తమకి ♦ వీడిరి చేడెలు కొంద ఱయ్యెడన్. ౫౮

తే॥ కుణపరాసులలోఁ దగు♦లొ్కన్న పతుల, గాత్రముల వెదకుచునుండు♦కలువకంటు
లడవులం దమనంటులు♦విడిచిచనఁగఁ, దిరుగులాడు నాఁడు నెమిళ్ల♦కరణి నుండ్రి.

తే॥ మడిచియున్న యాడులతోడఁ♦గెడసియున్న, చెలువులంగ నిజారత్వ♦చిహ్నములను
మఱుఁగుపఱుచుచున్నారను♦మౌగ్ధ్యబుద్ధిఁ, గినుకగొనిరి కొందఱు గోల♦వనితలచట.

తే॥ పతులమేనుల గుఱుతిడ♦వలనుగాక, జీర్ణ కవచంబులం దీసి♦చెట్టలపయిఁ
దమ నఖక్షతములఁ గని♦తలరి తలరి, పనవి కొందఱు జీవముల్♦పాసినారు. ౬౧

తే॥ అశ్రుపూరిత నయనలై♦యంబుజాస్య, లొక్క కొందఱుపతుల రో♦యుచుఁగడంకఁ
బీనుఁగులనుండి వెలువడు♦వెల్లులందు, పడి మునింగి జీవంబులఁ♦బాసినారు. ౬౨

—: ధూమ్రాక్షుండు హనుమంతునిచేఁ గూలుట :—

క॥ హనుమయు ధూమ్రాక్షుఁడు ముం, దునకు వెనుక కడరి యడఁగి♦తూఁకొనుచును పై
కొనుచును సములై పోరిరి, వినుద్రిమ్మరు లెల్లఁగాంచి♦విస్మయపడఁగన్. ౬౩

క॥ అసురయు నిరువది తూపుల, వెస మారుతి ఱొమ్ము దాఁక♦వీడిన నతఁడున్
విసిగి కసిమసఁగి పైఁబడి, పసచెడ నద్దనుజు తేరు ♦ భగ్నము చేసెన్. ౬౪

క॥ తే రవియ నింగి కెగసిన, వీరుని కైనున్న విల్లు ♦ విఱిచెను రామ
స్మారమణు తమ్ముఁ డురవడి, మారుతియును వాని నీడ్చి♦మహిఁ కిం దార్చెన్. ౬౫

తే॥ ఈడ్చి కడలి దాఁటినకాల ♦ నెగసి తన్ని, నిప్పు లుమిసెడు శిరమును♦ద్రిప్పిద్రిప్పి
యీడ్చి కడలిలోఁబడనూకి♦యుబ్బరించి, యార్చె వానరావళులు మే♦లనుచుఁబొగడ.

—: మహాపార్శ్వుఁ డంగదునిచేఁ జచ్చుట :—

క॥ కోపము కన్నుల మిక్కిలి, దీపములవిధాన మండఁ♦దివిరిన పొగలున్
ధూపములఁబోల నొదవిన, తాపములను లెక్కగొనక♦దర్పితమతులై. ౬౭

క॥ సాహసముమీఱ విజయో, త్సాహంబున నొకరికొకరు♦తగ్గక శర సం
దోహమున గిరుల సమర, ద్రోహి మహాపార్శ్వుఁ డంగ♦దుండును పోరన్. ౫౮

క॥ కరిపై నుండ విసరుగతి, శరవింశతి నంగదుని భు♦జము నాట నిశా
చరుఁ డేయ రేఁగి రాక్షసు, నరదముఁ బైకెత్తి తిరుగ♦నవనికి వైచెన్ ౬౯

తే॥ విరథుఁడై వింటి నావల♦విసరివైచి, మొనసి కుప్పించి దైత్యుఁ డ♦మోఘమైన
శూలముం గొని ప్లవగరా♦ట్సూను వక్ష, మునకు సూటిగా గుఱిచూచి♦పూని యేసె.

క॥ మది సాధారణ శూలం, బిది గాదని యెంచి రామ♦నృపవరుఁడు మహా
ప్రదరంబునఁ దుత్తుమురై, చెదరిపడఁగ నేసె సురల♦చిత్తము లలరన్ 20
తే॥ శ్రీరఘుప్రవరునకు జే♦జే యటంచు, నంగదుండు మహాపార్శ్వ♦నడఁచి త్రొక్కి-
పదములంబట్టి మిక్కిలి♦పంగటింపఁ, జెలఁగి నడిమికి రెండుగాఁ♦జీల్చివైచె. 2౧

—: నీల మాల్యవంతుల యుద్ధము :—

తే॥ మాల్యవంతుండు నీలుండు♦మాఱుపడక, కదన మొనరించుచుండంగ♦గాంచిసురలు
తొల్లి యింద్రుఁడు పంక్తి వ♦క్త్రుండు పోరు, సరణి నున్నది యని విరుల్♦చల్లినారు.
తే॥ నీలుఁ డొక్క శైలము వైవ♦మాలియన్న, విల్లు విఱిగె వాఁడును విల్లు♦విడిచి వాలు
పలక గొని యదలించుచు♦నిలువుమనుచు, నేలకుం దాఁటె యుక్కున♦నీలుఁ దాఁకె.
ఆ॥ వారలట్లు పోరు♦వడిఁగాంచి యెడసొచ్చి, కుధర మొక్కఁడెత్తి♦కుముదుఁడేసె
నుగ్గునూచ మగుచు ♦ భగ్గున మండుచు, నసుర తేరు గూలె ♦ నంతమీఁద. 28
తే॥ వృక్ష మొక్కండు నీలుండు♦విసర దాని, మాల్యవంతుండు వాలున♦మాల్చివైచి
నీలు తలఁద్రెంప నెత్త నా♦కేలుతునిఁగి, నేలఁబడఁగూల్చె సౌమిత్రి♦నిశితశరము.
తే॥ శంపవంటి ఖడ్గముతో భు♦జంబు తెగియుఁ, గ్రమము చెడక దురము నేయు♦కఱకు
సోఁకుఁ
గాంచి యిది యర్ధరథుతోడి♦కయ్యమనుచు, నవలఁబోరక సౌమిత్రి♦యవలికేగె. 22
తే॥ ఘనభుజుని రామునొద్దకుఁ♦జనుచునున్న, లచ్చుమనుఁ గాంచి యమరులు ♦
మెచ్చిపొగడి
రెవ్వ రీరీతి వీరత్వ♦మెసఁగియున్న, సమరధర్మంబు పాటించు♦చతురులనుచు. 2౯
తే॥ యజ్ఞశత్రుండు వచ్చిరా♦మానుజన్ము, నిలిపి పొఱకుమని శర♦నికరమేయ
నాతఁడొక వాఁడియమ్ముచే♦నక్కవగుల, నేసి, కూల్చి యవ్వల రామ♦నృపుని చేరె.
తే॥ యజ్ఞశత్రుఁడు విలుఁ బ్రీల ♦ నవనిఁగూలె, గండుమీఁటి కాలంగేలఁ♦గ్రతువులందు
జార్చుశిలలు లేవయ్యె వై♦శ్వానరుండు, స్వేచ్ఛగాఁ గుండములయందు♦వెలుఁగ సాగె.
తే॥ తనదు జనకుని మున్నొక♦తడవ యడ్డ, గించి పేరొందు రవిశత్రు♦గీఁటడంచి
తండ్రికిం దగు పుత్త్రుఁడన్♦తరము గాంచె, సూర్యపుత్త్రకుఁ డారణ♦క్షోణియందు. ౯౦

—: ఋషభ వజ్రదంష్ట్రుల సమరము :—

తే॥ అగ్గలంబుగఁ దనతోడ♦నని యొనర్చు, వజ్రదంష్ట్రుని పెను తేరు♦వసుధఁగూల
హరులు సారథియును చది♦యంగ నొక్క, భూధరేంద్రమ్ముగొని ఋష♦భుండు వైచె.
తే॥ తేరుచదియఁ గార్ముకమును♦పాఱవైచి, దండముంగొని నేలకు♦దాఁటి పిడుగు
కరణి వజ్రదంష్ట్రుఁడు వాని♦శిరము మోఁదెఁ, జచ్చెఁ జచ్చెన యని కపుల్♦పిచ్చలింప

తే॥ వ్రేటుగొన్నట్టి ఋషభుఁడు♦పీక చెడఁగ, మరణవేదన నొందుచు♦మఱుఁగుచుండ
హనుమఁ డెడసొచ్చి యాదైత్యు♦నసురులంటఁ, బొడువవాఁడునుదండానఁ♦బొదివికొట్టె.
తే॥ కొట్టి చను వజ్రదంష్ట్రుని♦గూర్చిపట్టి, దండమును లాగికొని వాని♦పండు లూడఁ
గొట్టి శిరమును మోఁది యా♦క్రూరుపేరు, వ్యర్థముగఁ జేసి శమనుని♦పాలికనిపె.

—: పిశాచుని యుద్ధము :—

తే॥ పనసుఁ డేయఁగ ఱివ్వనఁ♦బలుకుఱాలు, మేనిఁజీఱఁ బిశాచుండు♦మిగులఁ గినిసి
తోమరముగొని వైవ ను♦త్తుంగభుజుఁడు, నెత్తు రొలుకుచుఁ బనసుండు♦నేలఁ బొరలె.
సీ॥ జలదమం దున్నాఁడొ ? జలధిపై నున్నాఁడొ ?, నేలపై నున్నాఁడొ? నింగిఁగలఁడొ?
వేలకొలంది గు♦ఱాలు పాఱెడి నన్న, వడువున వాని త♦త్తడియుఁ దిరిగె
నేలఁ గాలూనక♦తేలికఁ దిరుగాడుఁ, గంటిచూపులకంటెఁ♦గన్న నేగు
నెదకంటె వడినేగు♦నెచటనో గలదను, నంతలో డాయుచుఁ♦జెంత నిలుచు
తే॥ గరుడుకన్నను వడినేగు♦తురగముపయిఁ, దిరుగుచున్న పిశాచుని♦తీవ్రశక్తి
నొఱగికూలెఁగుప్పగఁబ్లవం♦గోత్కరంబు,తత్కృతముగాంచియుటనుమి♦త్రా సుతుండు
ఉ॥ చండతరోగ్రుఁడై యనల♦సాయకముః బలువింటఁ గూర్చి యు
ద్దండ భుజాబలంబు శైగఁ ♦ దార్చి పిశాచుని ఘోర శీర్షముం
జెండిన యంతఁ జేష్టడక♦చేఁగల శూలము వీడకుండ నా
మొండెము మున్న చేయు కొలఁ ♦ బూని నటించెను కొంత సేపటః.
తే॥ క్షేమవార్తలు సీతకుఁ♦జెప్పకరణిఁ, దుమ్మెదలు రొదచేసెను♦దిమ్ముపుట్ట
ధర్మదూతలు చేరిరి♦దక్షిణమున, నసుర దూతలు లంకకు♦నరిగినారు. ౮౯
ఆ॥ అరిగి విభుని చేరి♦యంజలి ఘటియించి, విజయవార్త దెలుపు♦వీలులేమిఁ
జింతతోడ జవము♦చేవయుఁ గల మన, సేన మడిసె ననుచుఁ♦జెప్పినారు. ౯౦

## ౨౦ మకరాక్ష వధ పటలము. (౩౮)

క॥ చారుల వార్తలు విని లం, కా రమణుఁడు సంతపించి♦కాలాహి క్రియః
దోరంపు టూర్పు పుచ్చఁగ, నారసి మకరాక్షుఁ డిట్టు♦లనియెం గడిమిః. ౯౧
మ॥ అనిలోఁ దండ్రి ఖరుః వధించిన మహా ♦ హంకారులం ద్రుంపఁగా
నను పంపం దలపోయు కుంటివి తగ ♦ న్నాశౌర్యముం గాంచవో ?
యనుపంగాఁ గలవంచు నోర్చితిని చిం ♦ తావాప్తి నీకేల ? భూ
జనులా నన్నెదిరించువారు ? సుమన ♦ స్సంఘంబులుః లెక్కయే ? ౯౨
ఉ॥ కన్నుల నీరు ధారలుగఁ ♦ గార్చుచు నేడ్చుచుఁ గన్నతల్లి దా
ఖిన్నత నొంది భర్త నడఁ ♦ గించిన వాని శిరమ్ము ద్రొక్కి గా

కెన్నఁగ నూత్రముం దొఱఁగ ♦ నేనని పంతము పూనియున్న దా
జన్నియ పూర్తి గావలదె ? సాధ్వికి వీరకుమారుఁ డుండియున్. ౯౩

చ॥ పనుపుము నన్ను పోరి కని♦ప్రాంజలియై మకరాక్షుఁ గాంచి యా
దనుజవరేణ్యుఁ డిట్టులను ♦ ధైర్యమె తోడగుఁగాక నీచిరం
తనమగు వైరముం దొలఁగ ♦ దానవవైరుల మస్తకంబులం
గొని యిటు తెమ్ము పొమ్మనుడుఁ ♦ గోరికమీఱఁగ వాఁడు పొంగుచున్.

చ॥ విలుగొని తేరునెక్కి కడు ♦ వేడుక వాహిను లైదుకోట్లు చం
డ లలిత రీతిఁ దన్నొలయ ♦ డంబుగ దానవనాథుఁ డంపు వె
ల్వాలు మఱి యిర్వదిం గదిసి ♦ వారిధి పొంగిన భంగి దోఁపఁ గా
హాళములు దుందుభుల్ చెలఁగ ♦ నమ్మకరాక్షుఁడు పోయె నుద్ధతిన్. ౯౫

శా॥ రాజద్రీతిని చక్రరక్షకులుగా ♦ రక్తాక్షుఁడున్ శంఖుఁడున్
దేజోవంతులు తోడరా నడుగఁగా ♦ ధీశుంబలెన్ వాహినీ
రాజిం దన్మకరాక్షుఁ డొప్పెను రజో ♦ రాగంబు వర్ధిల్లె ది
గ్రాజి ల్గన్నులుమూయ వేలుపుల మా♦ర్గంబు న్నిరోధించుచున్. ౯౬

తే॥ ధ్వజపటంబులు రవి కర♦ప్రతతిఁ గప్ప, మదకరుల శీకరంబులు♦మలయుచుండఁ
గదలు దానవసేనచేఁ♦గపిచయంబు, శ్రమము పూర్తిగాఁ దొలఁగె నా♦సమయమందు.

తే॥ గీఁకలును సకిలింపులు♦కేకలొలయఁ, బణవ కాహళ దుందుభి♦స్వనము లులియ
సింహనాదంబు లెల్లెడఁ♦జెలఁగి యుండ, గోళములు నిండ జీవులు♦గొవరువోయె.

ఉ॥ వాఁడియు వేఁడియుం బొగడు ♦ పాడియుఁ బోఁడియుఁ గల్గు సైన్యముల్
వేడుక వాడుకల్ విడిచి ♦ బీరము చూపుచుఁ బోరు సేయుచున్
వీడక వాడుకన్ బఱపు ♦ విండ్లునుకండ్లును పూని యేయఁగా
నీడువ సాగె రక్తనదు ♦ లీడిగిలంబడు వారణంబులన్. ౯౯

ఉ॥ వానరులేయు శైలముల ♦ వారక చేతులఁబట్టి వెండియున్
దానవులేయ మేఘములు ♦ తారకలున్ భువిరాల భూతముల్
పీనుఁగులన్ భుజించు పెను ♦ వీఁకను గేకలువెట్ట భూమిపై
వానర సైన్యముల్ తలలు ♦ వ్రయ్యఁగఁ గూలెను కుప్పతిప్పలై. ౧౦౦

చ॥ దనుజుల కేలనున్న యడి ♦ దంబులు లాగి తదీయ శీర్షముల్
తునుమఁగ వారి కేలఁగల ♦ తోరపు ప్రాఁకులఁ బర్వతంబులన్
దనుజులు లాగికొంచు బెడి ♦ దంబుగ జివ్వునఁ బోవవైచుచున్
వనచర వార వక్షముల ♦ భగ్నము సేయుచుఁ బోరుచుండఁగన్. ౧౦౧

—: మకరాక్షుఁడు రామునితోఁ బోరి మడియుట :—

మ॥ మకరాక్షుం డెదురైన వానరతతిన్ ♦ మాయించి తత్సైన్య నా
యక గాత్రంబుల యంత్ర నిర్గళిత ఘో ♦ రాశ్మంబులంబోలు సా
యక రాజంబుల డుల్చుచున్ బహుళ కో ♦ పాటోప మేపారఁ బా
వకులీలన్ రఘుచంద్రముం గదిసి గ ♦ ర్వస్ఫూర్తిమై నిట్లనున్. ౧౦౨

చ॥ సమరమునందు నాజనకుఁ ♦ జంపిన యప్పటినుండి నీతలన్
దుమురుగఁ జేసి నాకుఁగల ♦ దుర్దమకోప మడంపనుంటి; మా
నము చెడునంచు భీతిగొని ♦ నాయెడ వైరము పూనరైరి యా
సుమనసులుం ద్రిమూర్తులును ♦ నూటిగఁ బూసితి వీవు మానవా!

చ॥ అనవుడు మందహాసరుచి ♦ యాననమందునఁ దోఁప రాఘవుం
డనుఁ గసిదీర్చుకోఁ గడఁగి ♦ యక్కఱతోడను వచ్చినాఁడవా!
జననముతోడ వీరులకు ♦ క్షాత్త్రము వచ్చుట సాజమేకదా!
మొనసితి యుక్తవాక్యతులఁ ♦ బూర్వవిరోధము మాన్చుకొమ్మనన్.

మ॥ అనలజ్వాలలు కన్నులం బఱవ నీ ♦ హంకారమున్ మాన్తుఁబొ
మ్మని యంతన్ మకరాక్షుఁ డుగ్రుఁడగుచున్ ♦ జ్యారావముంజేసి క్ర
న్నన నిర్నొక్కనిఁద్రుంచి కాక కసి మా ♦ నంబోవదంచున్ మహా
శని కల్పాశుగ వర్షముం గురిసె ర ♦ క్షఃపాళి యుగ్గింపఁగన్. ౧౦౫

మ॥ జలజాతేక్షణుపై మరుత్సుతునిపై ♦ సౌమిత్రిపై మార్గణం
బులు నూటాఱుల నేసి దుస్సహ తర ♦ ప్రోత్తేజుఁడై సంగర
స్థలి నారాచ మయంబుగాఁ బఱపి గ ♦ ర్జానాద గంభీరుఁడై
జలముం జేవయుఁ జూప రాముఁడు శరా ♦ సారంబుచే మాన్చుచున్.

చ॥ ఒక విశిఖమ్ము రాక్షసుని ♦ యుక్కఱ నక్కున నాటనేయఁగాఁ
దకపికలాడి వాఁడు కను ♦ దమ్ముల నిప్పులు రాల్చి లోక పా
వక యశు రామచంద్రు కవ ♦ చమ్మునఁ దూఱఁగఁ బెక్కు వాఁడి సా
యకముల నేసి యార్చెను వి ♦ యత్తలమందలి వేల్పు లల్కఁగన్. ౧౦౭

ఉ॥ రాముఁడు మందహాస రుచి ♦ ర స్థితి మోమునఁదోఁప సంగరో
ద్దామ కరంబునం దిగిచి ♦ దారుణ బాణము లేసి సారథిన్
నామ మడంచి రథ్య చర ♦ ణ స్థ ఖురంబులఁ ద్రెంచి చాపమున్
సాముగఁజేసి వక్షమునఁ ♦ జయ్యన నాఁటగఁ జొన్పె నంతటన్. ౧౦౮

చ॥ అరదము చాపముం ♦ జెడఁగ నమ్మకరాక్షుఁడు సొమ్మవోక స
త్తురు వడిఁ ద్రొక్కుచున్ ధరణి ♦ దూఁకక వింటికిఁబోగి మేఘు సం

వరణ శరీరుఁడై విలయ ♦ వర్షము దాపురమయ్యెనో యనన్
విరివిగ రాల్చెఁ జిచ్చులుకు ♦ పిడ్గులు జాలును గాలి వానగన్. ౧౦౯

చ॥ పిడుగులు లెక్కలేక పడ ♦ భీకర వాయువు వీవ మేఘముల్
మిడుకులఁ జిందఁగా సమర ♦ మేదినిలోఁ గల వానరావళుల్
మిడుకుచుఁ బోరలేక తమ ♦ మేనులు చిందఱ వందఱై పడన్
మడిసిరి తక్కువార లసి ♦ మాని పలాయితులైరి భీతులై. ౧౧౦

ఉ॥ పాతిన చెక్కులం బొగలు ♦ వాతి కనుంగవ గానరామి ను
క్కాఱఁగ మేఘముల్ గవిసి ♦ యంతట నిప్పులవాన జాలతో
మీఱఁగ వానరుల్ మడియ ♦ మేడ్పడ రాముఁడు కాంచి వీనికీ
తీరు వరమ్ము చేనొ? మఱి ♦ తెక్కలిమాయనొ గల్గెఁ జెప్పవే! ౧౧౧

చ॥ అనుడు విభీషణుండు కరు ♦ ణాకరు రాముని గాంచి దేవ! యీ
దనుజున కీ బలంబు ఫల ♦ దంబుగ వాయు సముద్రరాజు లి
చ్చినయది యన్న రాఘవుఁడు ♦ చేడ్పడ దానిఁ దదస్త్రపాళిచేఁ
బొనుపడఁజేయ మాయలును ♦ పోయెను వార్ధిని వైచు నింగువై.

క॥ అదిగని మకరాక్షుఁడు తోఁ, యదము నెనయు రూపుగొని వి ♦ యత్పథమందే
యొదిఁగి వనచర కదంబము, గుదిగ్రువ్వఁగ శూలములను ♦ గుములుగ నేసెన్.

చ॥ అగపడకుండ డాఁగు మక ♦ రాక్షుఁ గనుంగొను చొప్పుగాన కే
వగఁ దెలియంగ వచ్చునని ♦ వారిజనేత్రుఁడు చింతతో మదా
శుగ హతి నొల్క నెత్తు రొక ♦ చోఁ గనుపడ్డది యిద్ది మాయచే
గగనమునందు దానవుఁడు ♦ గల్గిన తావని నిశ్చయించుచున్. ౧౧౪

ఆ॥ ఒక్క వాఁడియమ్ము♦నొగిఁగూర్చి పటపఁగా, వాని శిరము తునిఁగి♦వసుధఁ బడియె
నొడలు పుడమి దొరలు♦చుండిన యంత న, మ్మాయ స్వప్నమట్లు♦మాసిపోయె.

—— : రక్తాక్షుఁడు శంఖుఁడు నల పనసులచే నంతమొందుట : ——

తే॥ మకరనేత్రుండు తెగిపడి♦మడియఁగాంచి, రథముపై గ్రీష్మభానుని♦రాణనొప్పి
శరదముంబలె శరములఁ♦గురిసి గాలి, వీఁకవచ్చు రక్తాక్షుని♦దాఁకె నలుఁడు. ౧౧౫

ఉ॥ తాఁకి శరోత్కరంబులు వి ♦ తావితమై చన సాలసాలముం
గైకొనివీచి త్రోచుచును ♦ గ్రక్కున నేనుఁగుఁ గాంచి యుర్వడిం
బైకొను సింగమో యనఁగ♦భాసిలి దూఁకఁగ దైత్యుఁ డుగ్రుఁడై
వీఁకను తుండ్లుచేసి పెను ♦ వీకున నార్వ నలుం డదాటునన్. ౧౧౬

ఉ॥ ఱొమ్మును వంచి నక్కి తల ♦ త్రుంచి గుభాలున రక్తనేత్రు శీ
ర్షమ్మున దూఁకి నాసికను ♦ చక్షువులం జెవులందు వేఁడి ర

క్తమ్మును గ్రొవ్వు బైలుపడఁ ♦ గాఁ బెనుముష్టిని తాఁచి కాలితోఁ
గ్రమ్మన ద్రొబ్బె నేలకుఁ బు ♦ రందర ముఖ్యులు మెచ్చి యుబ్బఁగన్.

ఆ॥ కొండమీఁదఁ బడిన ♦ కొరడు విధంబున, నలుఁడు రక్తనేత్రు ♦ తలను దుమికి
చదియఁబొడువఁగన్న ♦ శంఖుండు లయకాల, రుద్రుభంగిఁ బొంగి ♦ క్రుద్ధుఁడగుచు.

చ॥ నిలునిలుమం చదల్చి నలు ♦ నిక్కనఁ దాఁకఁగ నేగఁ గాంచి పే
రలుకను దాఁటుచుం బనసుఁ ♦ డా సురవిద్విషు నడ్డగించెఁ జే
యలుఁగులు తొమ్మిదింట నుడి ♦ యన్ వడి శంఖుఁడు గొట్ట నేతిచే
వెలిఁగెడి యగ్నిపోలెఁ గపి ♦ వీరుఁడు మండి చనెం గుభాలునన్. ౧౨౦

చ॥ పరువిడి తేరితో నసుర ♦ బాధ బలంబున నెత్తె నెత్తినన్
నురుఁగక శంఖుఁ డిమ్ముగ వ ♦ సుంధరకుం దిగునంత వానిపై
నరదమువైవ వాని యొడ ♦ లయ్యెడ ఘట్టని వచ్చి క్రొత్త నె
త్తురు ప్రవహింపఁగా నసుఱు ♦ దోరెను వేలుపు లుబ్బి యార్వఁగన్.

ఆ॥ చక్రవర్తి సుతుల ♦ శరములచేతను, హరుల నఖర శైల ♦ తరులవలన
నసురబలము చెడ ని ♦ రాయుధులగు దూత, లరిగి రమరవైరి ♦ కంత దెలుప. ౧౨౨

## ౨౧ బ్రహ్మాస్త్ర పటలము. (౨౩౧)

మ॥ అనిలోనన్ ఖరపుత్త్రుఁ డీల్గుటయు ర ♦ క్తాక్షుండు శంఖాఖ్యుఁడున్
దనుజానీకముతోడఁ గూలుటయు నా ♦ దైత్యేంద్రుఁ డాలించి యిం
ద్రుని గర్వం బడఁగించు పుత్త్రు నిటకుం ♦ దోడ్తెండనన్ లెంక లు
వ్వున నేతెంచి తదాజ్ఞఁ దెల్ప నతఁడున్ ♦ బుద్ధిన్ విచారించుచున్. ౧౨౩

ఉ॥ పోయినవార లాగతిని ♦ పోయిరొకో యనఁ జారు లోప్రభూ!
పోయిన వారలెల్ల మఱి ♦ పోయిన వారలె గాక నీవలెన్
గాయముతోడ లంకకును ♦ క్రమ్మఱి నట్టిరు లేరు సుమ్మనన్
హా యని లేచి యింద్రజితుఁ ♦ డంతకుపోలిక వచ్చె నుగ్రుఁడై. ౧౨౪

ఉ॥ వచ్చి దశాస్యుఁజేరి గరు ♦ వంబున వందన మాచరించి నీ
చెచ్చెర నంపు సేనలు న ♦ శించెన కాయని విన్నవాఁడ నా
మచ్చరులైన రాఘవుల ♦ మస్తకముల్ ప్లవగాళి శీర్షముల్
గ్రచ్చుఱఁ దెత్తు మోదమును ♦ గాంచెదు నీవును సీత యుండటన్. ౧౨౫

చ॥ అమరుల కోర్కెలెల్లను హ ♦ తాశలు గావుత నేఁడు పోయెదన్
దమకళ యుండుమా యనుచుఁ ♦ దండిరి యాజ్ఞను పూని వేయి సిం
గములు వహించు తేరిపయిఁ ♦ గ్రాలుచు వెల్వడె వెంబడిం దురం
గమ రథ దంతి సద్భట ని ♦ కాయము లర్వది వెల్వ లేగఁగన్ ౧౨౬

తే॥ పటహ కుంభికా మురజ త♦మ్మట హుడుక్క, దుందుభులును తుత్తుంభికల్ ♦ తుడుము ఢక్క
కొమ్ములును తిమిలలును సం♦కులును కలిసి, చెలఁగ నెల్లవారి చెవులఁ♦ జెవుడు చేసె.

ఉత్సా॥ ద్విరద చయము మీఁద నులియు ♦ భేరిరవముతోడ నుత్త
బరఁగె వాని ఘీంకృతులును ♦ పట్టెడలను ఘంటికల్
తురగ హేషతోడ మొరసెఁ ♦ దోలుపట్టె గజ్జియల్
విరిసె నేమి రవముతోడ ♦ వీర కటక రావముల్. ౧౨౮

సీ॥ శంఖ కాహళ తూర్య♦శబ్దముల్ జలద ని, స్వనముతో డీకొని♦జయము నొందె
కరి హయ రథ సింహ♦గర్జనములు పిడు, గుల ఘోషమును మీఱి♦గెలుపునొందె
శ్రావ్యవాద్య ధ్వనుల్♦సంగీత రవములు, పీయూష రుచులపై♦విజయమందె
నారి రవంబులు♦సవ్య లదల్పులు, కడలి మ్రోఁతను క్రింద♦పడఁగఁ జేసె

తే॥ నాల్గు సంభ్రమంబులంబోలి♦నాల్గు తెగల, యొట్టపోగు లేపిన ధూళి♦యీఁదుకడచి
సైన్యవారాశిఁ గను సుర♦చంద్రముఖుల, యశ్రువారాశి నొక్కట♦నడఁచివైచె.

తే॥ ఇంద్ర సౌధము లనఁదగి♦యొసఁగ మెసఁగు, నరదములు వేలకొలఁది త♦న్నలమి రాఁగ
గ్రహము లెల్లను కొలువసా♦గరము మీఁదఁ, జెలఁగు గ్రహరాజు నా నింద్ర♦జితుఁడు వెలసె.

తే॥ మెడయు ముక్కును కన్నులు♦కడుపు కాళ్లు, టెక్కలును గోళ్లు తోఁకయుఁ♦
జొక్కపడఁగఁ
గొంచ మొగ్గరముం దీర్చి♦మించి ప్లవగ, సేన నొరయ రావణియు సం♦సిద్ధుఁ డయ్యె.

తే॥ జంభభేది యిచ్చిన కల్ప♦జలదరవము, నెసయు వలమురి చిందంబు♦దనుజవిభుని
తనయుఁ డొత్తె సుపర్వులు♦తల్లడిల్లఁ, గలఁకనొంది ప్రాణులు కకా♦వికలు గాఁగ.

తే॥ తద్రవము చెవిఁబడ నుప♦ద్రవమునొంది, సింహ గర్జన మాలించి♦చెదరి పాఱు
వారణంబులక్రియ ఱాత♦వైచినట్టి, కుండ పెంచిక లట్లయ్యెఁ♦గోఁతిమూఁక. ౧౩౩

తే॥ శింజినీరవమున వాని♦చెవులు వ్రీలె, మనసు కలఁగె నుత్సాహంబు♦మంటఁ గలిసెఁ
బరుగులిడఁ గాళ్లు తడఁబడెఁ♦గరములందు, పొదలు సాధనములు జాఱెఁ♦బెదవులెండె

క॥ పవన సుతుఁ డంగదుఁడు రా, ఘవులు విభీషణుఁడు సైన్య♦గణ నాయకులున్
రవిసుతుఁడు తక్కఁ దక్కిన, ప్లవగులు తత్తఱిలి విఱుగఁ♦బాఱిరి భీతిన్ ౧౩౫

క॥ సేనాపతులును రాక్షస, సేనలు ముందునకు సాఁగి ♦ జీమూతంబుల్
పూనిక నలమిన యనువున, వానరులం జుట్టెఁ గడఁక♦వర్ధిల్లంగన్ ౧౩౬

క॥ హనుమని భుజములపై శ్రీ, వనజదళాక్షుండు వాలి♦వరతనయునిపైఁ
గొనకొని లక్ష్మణుఁ డెక్కెను, ఘన సమరోత్సాహ విధము♦కడలుకొనంగన్.

క॥ వారల భుజములపై న, వ్వీరవరులు విండ్లుదాల్చి♦విశ్రుత ఖగరా
డ్ఘోరాజులపై రాజిలు, నారాయణ రుద్రులనఁ ద♦నర్చిరి కలనన్. ౧౩౭

క॥ బలిముఖ సేనావీరులు, మలలు తరులు గొనుచు మూఁక♦మలయఁగ దారిం
దిలకించి రాఘవుఁడు వెను, కల నుండఁగఁగోరి పలికెఁ ♦ గారణఘణితిన్. ౧౩౯

ఆ॥ క్రూరుఁ డింద్రజిత్తు ♦ ఘోరాస్త్రములు వీడ, సాగునేని మీర♦లాఁగ లేరు
చోటు మాకు విడిచి♦చూచుచునుండుఁడు, విమతు లొందుమార్పు♦వింటినేర్పు.

ఆ॥ అనిన రాము పలుకు ♦ లాలించి కపివరు, లట్లనిలిచి రంత ♦ నధిపసుతులు
నిశిత విశిఖ నిచయ♦నిర్ఘాత వర్షంబు, కురిసి రమరవైరి♦కోటిమీఁద. ౧౪౧

మ॥ త్రుటిలోఁ దమ్ము గవించు నా దనుజ సం ♦ దోహమ్ము నాశమ్ము సెం
దుటకై చూపిన రామ లక్ష్మణ ధను ♦ ర్దోర్దండ పాండిత్య సం
ఘటనం బేమని చెప్పవచ్చుఁ గనక ♦ క్ష్మాభృ ద్ధనుర్ముక్త ధూ
ర్జటి బాణ త్రిపురాసురాలిక్రియ నా ♦ శంబయ్యెఁ దత్సైన్యముల్.

—: తన సైన్యముపాటు నింద్రజితుఁడు కాంచుట :—

చ॥ శవములు కుప్పలై పడెడు ♦ చందముఁ దెల్పఁగవచ్చుఁగాని వీ
రు వడిరి వారు కూలిరని ♦ రూఢిగఁ జెప్ప నశక్యమైన రా
ఘవుల పరాక్రమ క్రమము ♦ కంటికిఱెప్పలు పెట్టకుండ నా
హవమునఁ గాంచుచుండె నమ ♦ రారి శరాసన మూని తేరిపై. ౧౪౩

చ॥ కరులు మరించె నంచుఁ దుర ♦ గంబులు గూలినవంచు స్యందనో
త్కరములు నుగ్గులయ్యెనని ♦ కర్బురవర్గము నీల్గెనంచు నా
యరదము పోవఁ ద్రోవ గన ♦ దంచు నభస్థ్సలి నంటు ప్రేత భూ
ధరములఁగాంచి హా యని వి♦తాకు గడించుఁ దపించు దూపిలున్. ౧౪౪

చ॥ సమరము సేయుచున్న నెఱ ♦ జాణలొ యిద్దఱె చచ్చువారొ ని
క్కముగ వచింప నాఱుపది ♦ కాఁదగు వెల్వలు; శాపశక్తిచే
సమరవిరోధి సేనల ల ♦ యంబొనరించిరి చాపశక్తిచేఁ
దుమురొనరింపలేద యిది♦దోర్బలమో? మఱి యింద్రజాలమో? ౧౪౫

మ॥ శరవర్షమ్మును గాంచు రక్తనదులం♦జక్కంగఁ జూచుం గళే
బర శైలమ్ములఁ గాంచుఁ గూలిన కరి ♦ వ్రాతంబు నీక్షించు నొ
డ్డొఱకంబై పడు వాజిరాజిఁగని ని ♦ ట్టూర్పుచ్ రఘుస్వామి సుం
దర బాహు ద్వయిఁ గాంచు దానవ మహాం♦తంబున్ విలోకించుచున్.

చ॥ శిరముల కొండలం గనును ♦ చెండిన ముండములన్ గణించుచున్
గొఱవులపోల్కి నాల్కలిడు ♦ కోలలఁగాంచు మరించువారలం
బొరిపొరి గాంచుఁ దేరుల స ♦ ముద్ధత దంతుల వాజులన్ భటో
త్కరముల వేయ్యిటిం ద్రొలిచి ♦ దాఁటు శరాళిగ పద్ధతిం గనున్. ౧౪౭

చ॥ అఱువది వెల్లువల్ వయిచు ♦ నమ్ములు చక్ర గదాసి కుంతతో
మరములు ఫెల్లుఫెల్లుమని ♦ మ్రగ్గుచుఁ వేణువనంబు గాలు వై
ఖరిగొని తారసిల్లకయ♦కాడ్పడుచుండుట దైత్య సైన్యముల్
ధరణిని వ్రాలుచుండుటయుఁ ♦ దక్కక రావణి కాంచె నాజిలో. ౧౪౮

చ॥ కడుపులు మోఁదికొంచుఁ జని ♦ కాంతులపైఁ బడి దానవాంగనల్
తడఁబడ నేడ్చుచుండు నిన ♦ దంబు వినెన్ రదపంక్తి గీఁటుచున్
బుడమి శిరంబు లూడిపడ ♦ మొండెములాడుచు నుంటఁజేసి య
క్కడ దిగ వీలులేమిఁ బయిఁ ♦ గ్రాలు ఖగంబులఁ గాంచె నయ్యెడన్.

ఉ॥ సింగము లెట్టు లట్టడరి ♦ చెచ్చెర నాజిఁ జరించుచుండు నా
యంగద మారుతాత్మజుల ♦ యాశుగపద్ధతిఁ గాంచలేమి నిం
దంగద వాయుజుల్ బహు స ♦ హస్రగణంబులు క్రుమ్మరంగ ని
ల్వంగను చోటులేదు నరు ♦ లం గన నిద్దఱొకో కలారనన్.

ఉ॥ మోదరవంబు సేయు సుర ♦ ముఖ్యులఁ గాంచును వారికేల నిం
పాదిగనున్న పుష్పముల ♦ నారయు స్వీయ భుజంబులం గనున్
జాదుగఁ జూచు మేర గనఁ♦జాలిన పీనుఁగు తిప్పలం గనున్
వేదుఱుగన్న వాని క్రియ ♦ వీక్షణసేయును దిక్కు లన్నిటిన్. ౧౫౧

తే॥ లెక్కకును మీఱి కూలిన♦రక్కసులను, కోరి కాంచియుఁ బాఱిన♦కోఁతిమూఁక
శక్రజిద్భీతి కలఁకయు♦జాఱుకునికి, దురము పొనరించు నాసతో♦మరలదయ్యె.

—: హనుమని సింహనాదము :—

ఉ॥ బృందములైన యాఱుపది ♦ వెల్వాలు నాల్గువిధాల సైన్యముల్
మ్రందఁగ రాఘవేంద్రుల ప ♦ రాక్రమ పద్ధతిఁ గాంచి యంజనా
నందనుఁ డుల్లసిల్లి జత ♦ నంబున బాహువు లప్పళించి యా
నందముతోడ భీకర ని ♦ నాదమొనర్చె రిపుల్ దిగుల్గొనన్. ౧౫౩

ఉ॥ గొందఱు గుండియల్ వగులఁ ♦ గొందఱు గూబలు వ్రీల ధాత్రికిన్
స్యందనమందునుండి దిగఁ ♦ జాఱిరి కొందఱు కేలఁ గైదువుల్
క్రిందికి జాఱ విహ్వలతఁ ♦ గీడ్పడి వ్రాలిరి లంకలోని వా
రెందఱొ నెత్తుగ్రక్కి గతి ♦ యించిరి మారుతి సింహ గర్జనన్. ౧౫౪

ఉ॥ కోఁతి యొకం డొనర్చు పెను♦కూఁతకు జంకిన పందలార! మీ
చేఁతలు తెల్లమయ్యె నిఁకఁ♦జెప్పెడిదేమి? నశించినారలే;
ఈఁతకు మించి లోఁతుగల ♦ దే? యని రావణి ముందువోవఁగా
బ్రాఁతిగలట్టి కొందఱొగిఁ ♦ బ్రాపుగ వచ్చిరి ధీర చిత్తులై. ౧౫౫

—: లక్ష్మణుఁడు రాము ననుజ్ఞ గొని యింద్రజితునితోఁ బోరుట :—

శా॥ కేలన్ సజ్య శరాసనంబు వెలయం ♦ గీలించి సౌమిత్రి య
వ్వేళన్ రాముని గాంచి మ్రొక్కి సురజి ♦ ద్వేగుండు ఘోరాహి పా
శాలిం గట్టుడు సత్త్వహీనతను సై ♦ న్యశ్రేణిఁ గావంగలే
కాలంబందున నోడినాఁడనను పే ♦ రయ్యెం ద్రిలోకంబులన్. ౧౫౭

శా॥ ఈవే కన్గొనుచుండ నాశరముచే ♦ నీదైత్యు మస్తంబు నీ
దేవవ్రాతము మెచ్చఁ ద్రుంచి పెను ధా ♦ త్రిం జేర్పకున్నన్ భవ
త్సేవాకార్య మదెట్లు సార్థకమగున్ ? దివ్యద్గతుల్ దక్కునే ?
నా వంకం గల నిందయుం దొలఁగునే? నాణెంబు సిద్ధించునే ? ౧౫౮

క॥ ఈ సోఁకుఁ జంపనేనిన్, నీ సేవాఫలము నాకు ♦ నెగడదు నరకా
వాసంబు చెందువాఁడను, నీసదమల పదములాన ♦ నిక్కము రామా ? ౧౫౯

తే॥ అనిన పల్కులు విని సుర♦లలరినారు, జగములెల్లను మిక్కిలి♦సంతసిల్లె
ధర్మదేవత మోదించె♦ధర్మరాజు, పొంచి మించి యదను పరీ♦క్షించుచుండె.

చ॥ అనఘుఁడు సుందరస్మిత ము ♦ ఖాంబుజుఁడై తన తమ్ముఁగాంచి యీ
దనుజ వరేణ్య సూనుని వ ♦ ధంబునకుం దొరకొన్న వాఁడ వి
ప్పుని కనువైన బుద్ధి బల♦భాగ్యము లందితి రక్షణంబు శి
క్షణ మొనరించు విష్ణువును ♦ శంభుఁడు నీకిల సాటి యౌదురే ? ౧౬౦

తే॥ నయము నీకగునట్ల యో♦నర్పుమనుడుఁ, జెలఁగి సౌమిత్రి కడఁకతోఁ♦జంద మొత్తె
నంగదుఁడు రథ్య సింహంబు♦లడలిబడల, బొబ్బవెట్టె శంఖమ్ము రా♦ముందు నూఁదె.

తే॥ శూల కుంత గదా భింది♦పాల ముసల, ముద్గరాదిక సాధన♦ములను వాన
కరణిఁ గురిసి దైత్యులు భూమి♦కళవళింప, మునరికొని లక్ష్మణుని చుట్టు♦ముట్టినారు.

తే॥ లక్ష్మణుని శిత ఘోర భ♦ల్లములవలన, నింగినుండి రాలెడి ఋక్ష♦నికరమట్లు
పలపలన రాలి తునియలై♦పడ రణాస్త్ర, లంబు సాధన ఖండ మ♦యంబ యయ్యె.

తే॥ ఒక్క తొడుగున నేయు శ♦రోత్కరమున, వేయి యరదంబు లిరుసులు♦విఱిగి కూలు
తురగములు చచ్చు సారథు♦లురలుచుంద్రు, రథిక శిరములు నవయు వా♦రణములవియు.

తే॥ విఱుగుఁ జట్టముల్ చక్రముల్ ♦ విఱుగు విండ్లు, విఱుగు సైంధవముల కాళ్లు♦విఱుగు డాళ్లు
విఱుగు గొడుగులు బొమిడికల్ ♦ విఱుగు మురజ, భేరి కాహళాదికములు♦విఱుగుచుండు.

తే॥ ఇట్టి యరదంబు లివి వీరు♦లిట్టి వారు, వాజులిట్టివి యిట్టివి♦వారణమ్ము
లనుచు నేర్పఱుపఁగ రాక♦యవని ఛిన్న, భిన్నములుగఁ దార్మాఱియి♦విఱిగి కూలె.

తే॥ తెగి శరంబులతో నింగి♦కెగసి చన్న, యువక శిరములు తండ్రుల♦యొడులయందు
పడియె జనకుల శిరములు♦కొడుకులున్న, యరదములయందు వినిమయ♦మందఁబడియె.

తే॥ శర శరాసన యుత హస్త♦సముదయంబు, త్రెవ్వి రక్త హ్రదంబులఁ♦దేలియాడ
శృంగములతో జలధి సంచ♦రించుచుండు, చొట్టమీలు ప్రకాశించు♦చొప్పుదోఁచె.

తే॥ క్రూర నారాచములు త్రుంచి♦త్రోయుచుండఁ, గెరలి పడు గొడుగులును జె♦క్కెమ్ము లడిద
ములును రక్తవాహినిలోన♦మునుఁగుచుండు, పలు వగల జల పక్షుల♦పగిదిఁదోఁచె.

తే॥ కంబళమ్ము లమ్ములు విండ్లు♦కైదువులును, సిడము లింధనములుగాఁగఁ♦బడసి వీర
వర రుషా దృశాగ్ని నుడికి♦పక్వమైన, ప్రేతములఁ బ్రీతితోఁ దినె♦భూత గణము.

తే॥ కొన్ని చక్రముల్ విఱుగంగఁ♦గూలెఁ గొన్ని, త్రాళ్లు తెగ గుఱ్ఱములు జాఱి♦రక్త పంక
మందు మునిఁగెను సారథుల్♦క్రందఁ గొన్ని, పరుగులిడె నరదము లిచ్చ♦వచ్చు పగిది.

తే॥ మినుకుచుండు మణుల కాంతి♦నెనసి రక్త, పంకమునఁ బూఁడి యెఱ్ఱని♦ప్రభలు చిమ్ము
రథ నికాయముల్ మారుతి♦రాఁజఁ బెట్ట, మండు లంకలో భర్మ హ♦ర్మ్యములఁ బోలె.

క॥ శ్రీరాముఁడు హనుమంతుని, ప్రేరేఁచుచు నపుడు బాణ♦వృష్టిం గురియన్
దేరులు పొడిపొడియై భువిఁ, దీఱఁగ రావణికి నొక్క♦తేరే మిగిలెన్ ౧౭౩

క॥ పలు మెకములఁ బూన్చిన రథ, ములు రథికులతోడఁ గూడఁ♦బుయిలోడిన వా
రలఁ గని కుత్సించుచు నో, టిలక దనుజ విభు సుతుండు♦టెక్కునఁ బలికెన్ ౧౭౪

చ॥ ఇరువురు కూడి పోరెదరా? యేపున నొక్కరె వత్తురో? చమూ
త్కరములతోడుతం దొడరి♦కాలుని ప్రోలికిఁ బోవఁ జూతురో?
యిరవుగ నిచ్చగించినది♦యేదియొ తెల్పిన నట్టి తీరునన్
దుర మొనరింతు నంచలుక♦తో నన లక్ష్మణుఁ డంత నిట్లనున్. ౧౭౫

చ॥ అడిదమొ కార్ముకమ్మొ మఱి♦యాయుధ మెయ్యది యిమ్మొ దానినే
వడిఁగొనిరమ్ము నిన్నదిరి♦ప్రాణము తీయఁ బ్రతిజ్ఞ చేసితిన్
జెడు తెరువైన మాయలిఁకఁ♦జెల్లవు నిక్కువు బీరమున్నచో
బడిబడి డాఁగ కెచ్చటికిఁ♦బాఱక నిల్వుము నీచ! నావుడున్. ౧౭౬

చ॥ జనకుని తమ్ములం దొలుతఁ♦జంపిన రాముని వెన్కఁ జంపెదన్
దునిమెద నిన్ను మున్నగనె♦దోర్బల సంపద మీఱ నట్టు లేఁ
జెనకి వధింపనేని దశ♦శీర్షుని పుత్త్రుఁడ నైతినన్న యా
ఘనతయు నాకుఁ దక్కునె? జ♦గంబులు దీనికి నమ్మతించునే?. ౧౭౭

క॥ లక్ష్మణ! నాశరములకున్, లక్ష్మణముగఁ జేసి నిన్ను♦లలిఁ గూల్చినచో
లక్ష్మి వరించునె నన్నున్, లక్ష్మణ నామంబు సార్థ♦లక్ష్మం బగునే?. ౧౭౮

క॥ అఱువది వెల్వాల సైన్యము, లఱిముఱి గావించు మీఱ♦లడలుచుఁ జూడన్
నుఱిమెద డెబ్బది వెల్వాలఁ, గొఱవడు మీ జీవములను♦గ్రోలెద నవలన్.

ఉ॥ కాను ఖరుండ దూషణుఁడఁ ♦ గాను త్రిశీర్షుఁడఁ గుంభకర్ణుఁడన్
గాను జగంబు గెల్చు దశ ♦ కంఠుని పుత్త్రుఁడ వీరసింహుఁడన్
మానవులార! తమ్ములకు ♦ మా పినతండ్రులకున్ ద్వదీయమాం
శోణితమందు తర్పణము ♦ సుద్దిగఁ జేయఁగఁ బూని వచ్చితిన్. ౧౮౦

ఉ॥ నావుడు లక్ష్మణుం డను మ ♦ నంబునఁ దర్పణ చింత నూని తే?
చావఁగనున్న వారికిని ♦ చచ్చిన వారికి నెల్ల వారికిన్
సీవొనరించు వారలకు ♦ నీకు విభీషణుఁ డున్న వాఁడిటన్
జీవన తర్పణంబు దయ ♦ సేయఁగఁ దద్వ్యసనంబు మానుమా. ౧౮౧

సీ॥ అనుడు మనసు మండ ♦ నసురేంద్ర సూనుండు, పాలకడలిఁ బోలి ♦ పరవియున్న
యగచర వరులపై ♦ నంగదుపై మారు, తాత్మజుపై లెక్క ♦ కడఁగ రాక
చిటచిటఁ బెటపెటఁ ♦ జిటిలుచుఁ బోవు మా, ర్గణముల నేసి సం ♦ గ్రామ భూమి
శరమయంబుగఁ జేసి ♦ సౌమిత్రిపై రామ, విభునిపై బెడిదంపు ♦ విశిఖ తతుల
తే॥ నాటనేసి గర్జించె న ♦ ప్పాట వాని, కార్ముకము మండలాకృతిఁ ♦ గాంచియుండెఁ
గేలుదోయి వడిం గాంచి ♦ ఖేచరులును, అనిమిషాక్షుంబులం గేల ♦ నదిమికొనిరి.

తే॥ లక్ష్మణుండు ప్రత్యస్త్ర బ ♦ లంబువలన, వాని శరవర్ష మడఁగించి ♦ వ్యర్థపఱచె
వెడఁగువాని యసత్యవా ♦ గ్బృందములను, ప్రాడ్వివాకుండు నేర్పున ♦ వ్రాల్చు పగిది.

ఉ॥ ధర్మముకాని హేతువు ను ♦ దారుఁడు రాముఁడు గౌరవించుచున్
గార్ముక మెత్తఁడయ్యె దశ ♦ కంఠకుమారుని పైని; లక్ష్మణున్
వర్మముపోల్కిఁ గావ నెడఁ ♦ బాయక ప్రక్కన నిల్చియుండె దు
ష్కర్మము సాధుకర్మమును ♦ సంగరరంగము నాక్రమింపఁగన్. ౧౮౪

ఉ॥ వాఁడి శరంబు లొండొకటి ♦ వారక తాఁకి జ్వలించుచుండుటన్
మాఁడెను శైలవర్గములు ♦ మాఁడెను చాల్పుగఁ బైఁడి మేడలున్
మాఁడెను సాగరంబులును ♦ మాఁడెఁ జరాచర జీవరాసులున్
మాఁడెను దానవావళులు ♦ మాఁడెను వానర సైన్య సంతతుల్. ౧౮౫

మ॥ శరవర్షంబు నడంచి లక్ష్మణుఁడు పం ♦ చాస్యంబులన్ డెక్కముల్
మురియల్ సేయఁ గళావిహీన రవినాఁ ♦ బొల్పొంది యింద్రారి య
య్యరదంబందున నిల్చి శత్రు బల సం ♦ హారంబు గావించుచున్
మొఱయించెం దన చింద మంగదు మరు ♦ త్పుత్త్రుల్ వెఱారించుచున్.

శా॥ చిందం బొత్తిన వాని కంకటము వి ♦ చ్ఛేదంబు గావించుచున్
జిందం బొప్పఁగ లక్ష్మణుండును ధను ♦ ష్టంకారముం జేయ నా
నందాశ్రుల్ తొలఁకాడఁ జిర్నగవునన్ ♦ గాకుత్థ్సవర్యుండు సైఁ
గం జెల్వన్ భువనంబులెల్లఁ బగులం ♦ గర్జించి రవ్వానరుల్. ౧౮౭

శా॥ జీమూతంబుల డాఁగి రావణి కడుఀ ♦ శీఘ్రంబునఀ రాఘవ
స్వామిం గాంచి సుమిత్రపట్టి యితనిం♦జక్కాడకే వీడినఀ
నేమం బింతయులేక వానరతతిఀ ♦ నిర్మూలమే సేయు నీ
పాముం బోలిన క్రూరుఁ ద్రుంచెదను నా ♦ బ్రహ్మాస్త్ర యోగంబునఀ.

మ॥ అని పల్కఀ రఘురాముఁ డిట్టులను బ్ర♦హ్మాస్త్రంబు సంధించి యే
సిన లక్ష్యం బెదిలేమి లోకముల ని♦శ్శేషంబు గావించుఁ గా
వున నస్త్రేయుట పాడిగా దొకనికై ♦ పూనికఀ జగన్నాశముఀ
బొనరింపం దగునయ్య? మానుమన నా ♦ పుణ్యాత్ముఁడుఀ మానుడుఀ.

చ॥ మొఱఁగిన మేఘనాదుఁడును ♦ భూపతి పుత్త్రుల భావనంబు లో
నెఱిఁగి విరించనాస్త్రమునె ♦ యేయఁదలంచి యధర్మయుక్తిఁ జా
గఱ యొనరింప నీకరణి ♦ కాదని యచ్చటు వీడి లంకకుఀ
వెఱచిన చందమొంది కపి ♦ వీరులు చూడఁగఁ బాఱె నవ్వడిఀ.

చ॥ చదలఁ బురంబుత్రోవ వెస ♦ జాఱిన రావణిఁ గాంచి వానరుల్
కదనము సేయజంకి తన ♦ కాళ్లకు బుద్ధి వచించెనంచు స
మ్మదమునఁ గేకవెట్టి రప ♦ మార్గము వట్టిన కీశవర్గముఀ
బదపడి వచ్చి యాడుచును ♦ పాడుచు గెల్పు వహించె నుద్ధతిఀ. ౧౯౧

చ॥ చిలికిన పాలసందరము ♦ చెన్నునఁ జాలఁ గలంక నొంది కీ
శుల రఘువర్యులఀ దునుమఁ ♦ జూచి విధాతృశరంబు మున్నుగాఁ
దలపడి వీడఁగాఁ దలఁచి ♦ దైత్యుఁడు పోవు టెఱుంగలేక యా
జలజ హితాన్వయుల్ దనుజ♦సంగతి యేమఱి సంగరస్థలిఀ. ౧౯౨

తే॥ వాహనంబులపై నుండి♦వసుధకు దిగి, తూణ కార్ముక కవచముల్♦తొఱఁగి విశ్ర
మంబు గొనిరి వారల విక్ర♦మంబు మెచ్చి, చదలనుండి వేల్పులు పూలు♦ చల్లినారు.

తే॥ కపుల కోలాహలము మింటిఁ♦గలఁతవెట్ట, నచట నుండుటకును నిర్జ♦రారి తొడఁగి
నలువశర మేయుటకు సహా♦నంబు సేయ, లేనివానికై వడిఁ గ్రుంకె♦ భానుఁడపుడు.

తే॥ అగ్గలిక బవరము నేసి♦యలసియున్న, దడములకు వలసిన యంత♦కుడుపు లేదు
కణఁకఁ దెప్పింపుమా విభీ♦షణ! యటంచు, జానకీజాని చేసె నా♦జ్ఞాపనంబు.

తే॥ చిత్తమని తగువారలఁ♦జేర్చికొనుచుఁ, గడలి దాఁటిచనియె నొక్క♦గడియలోన
ధాతృకుల కలశాబ్ధి చం♦ద్రముఁడు; పిదప, రామచంద్రుండు లక్ష్మణ♦స్వామిఁ గాంచి.

తే॥ ఒనర దివ్యాస్త్రములను వి♦ధ్యుక్తవిధుల, నర్చనము నేసి యేయుట♦యంచితమగు
నరిగి వచ్చెదఁ బూజకు♦నంతదనుక, సైన్యములఁ గావుమని రణ♦స్థలిని వీడె. ౧౯౩

తే॥ జనకుఁగని యింద్రజిత్తాజి♦జరగుటయును, వారు బ్రహ్మాస్త్రమును విడు♦వంగనుంట
తెలుప నిశ్చిష్టుఁడై చేయఁ♦దలఁచినట్టి, కార్యమెదియని తను దశ♦కంఠుఁ డడుగ.

తే॥ చంపనెంచిన శత్రులఁ♦జంప వలను, గలుగ మానకుమంచు వి♦జ్ఞులు వచింత్రు
అట్లుచేయుట మానవు♦లరయరాక, నలువశర మేయఁబూనితి♦నయముతోడ.
ఆ॥ వార లెఱిఁగి రేని♦ప్రత్యస్త్రమున నడఁ, గింత్రు చంప నిచ్చ♦గింత్రు వేల్మి
చేసి మఱుఁగునుండి♦చెడు తపోబలుల జీ, వముల క్షణములోనఁ♦బాపు టురవు.
క॥ నను వారు మఱచునట్లుగ, దనుజ నికర మంపు దేని♦తరువాతనె నా
పని తడలేక ముగియునన, ననియె మహోదరునితో ద♦శాస్యుండు వెసన్. ౨౦౧
క॥ ఘోరాకారులు త్రిశూల, ధారు లకంపనుని దోట్టి♦దైత్యగణముతోఁ
బోరికిఁజని నరవానర, వీరుల జీవములఁ గొల్ల♦వెట్టుము కడిమిన్. ౨౦౨
తే॥ గొప్పమాయలు పన్ని ర♦క్షోగణమున, కిమ్ముగాఁగ గాఢాంధకా♦రమ్ముగూర్చి
సంగరస్థలి రాముల♦క్ష్మణులఁ గూల్చి, నాకుఁ దోడ్పడి పెక్కు మ♦న్ననలఁగొనుము.
తే॥ అనుడుఁ దన్నెప్పుడంపునా♦యనుచునుత్స, హించుచున్న మహోదరుఁ♦డెక్కెఁ దేరు
కొండఁజుట్టిన గారుల♦కొమరు దాల్చి, సోఁకుమూఁక దైత్యాన్వయుఁ♦జుట్టి వెడలె.

—: మహోదరుని యుద్ధము :—

తే॥ కన్నుమేర దూరము కరి♦ఘటలుపోయెఁ, బరుగువాఱెఁ దేరులు లెక్క♦పక్కలేక
త్రోవ యశ్వమయంబయి♦తోఁచె సుభట, వర్గమా నేలయీనిన♦పగిది నుండె. ౨౦౫
తే॥ సాధనములును నిశితదం♦ష్ట్రలును భూమ, ణములు వెన్నెల లెండలు♦క్రమము చెడక
కాయఁ గోడెల గుంపుల♦కరణి నడచె, దైత్యగణములు కలనికి♦ధాత్రి యదర.
తే॥ క్రిక్కిఱిసిన టెక్కెంబులు♦నిక్కి గగన, మెల్లఁగప్పుచు గాలికి♦మెల్లఁ గదలి
జలదములు పలపల రాలఁ♦గలఁచివైచె, నజుని కన్నులఁ గప్పెను♦రజము రేఁగి.
తే॥ ద్విరదపర్వతములనుండి♦దిగుచునుండు, మదఝరంబులుహయ ఫేన♦మహితములయి
వెడలి యడవుల తరుశిలా♦వితతిఁ ద్రోచి, కొనుచుఁ బాఱి కలసిపోయె♦వనధియందు.
క॥ మెఱపులు మెఱసెను పెదవులు, గొఱుకు కఱకు సోఁకుమూఁక♦కుడిచేతులలో
నెఱసిన యాయుధములు నెఱిఁ, గఱకఱ మిడుఁగుఱుల రాల్చి♦క్రందుకొనంగన్.
తే॥ అసురవిభుఁడు పంపిన చతు♦రంగ బల గ, ణంబు లంకాపురంబు ద్వా♦రంబుమెల్ల
వెలివిడుట చూడఁ దొల్లి స♦బ్ధిజలమెల్లఁ, ద్రావి తఱిచూచి విడిన♦తపసిఁబోలె.
తే॥ శంఖ కాహళ భేరికా♦స్వనము వీర, నినదమును గుణరుతి రథ♦నేమిరవము
గీఁకలును సకిలింపులు♦కెరలి లోక, గర్భవలె వడంచికొన జ♦గంబునెల్ల ౨౧౧
ఉత్సా॥ నేఱ ముమ్మరముగఁ గలను ♦ చేరెఁ బ్లవగబృందముల్
బూని యతిశయించి డాసెఁ ♦ బోరుసేయ దైత్య సం
తాన మేయు నంపగములఁ ♦ దరుల గిరుల నడ్డుచున్
వానరాలి కినిసి కెరలి ♦ వారి కడఁక మానిచెన్. ౨౧౨

ఉత్సా॥ శిలలను గుఱిచూచి వైచి ♦ చెలఁగు కపుల ఱాతికిన్
నలుగు రైదుగురుగ నలఁగి ♦ నాశమైరి రక్కసుల్
కలభములు గుఱ్ఱాలు గూలెఁ ♦ గఱకుసోఁకు కైదువుల్
మలయుదాఁకఁ గీశచయము ♦ మడిసి పడియెఁ గుప్పలై. ౨౧౩

ఉత్సా॥ పరశు శూల ముసల భిండి ♦ పాల దండ వలయ ము
ద్గర ముసుండి కుంత ఘన గ ♦ దా పృషత్క పాశ తో
మర నికాయములును మించి ♦ మర్కటములు వైచు పెం
దరుల గిరుల నుగ్గుచేసి ♦ ధరణిఁ ద్రోచెఁ గీశులన్. ౨౧౪

ఉత్సా॥ మెఱుఁగు టాయుధముల నొడుపు ♦ మీఱ వైవఁ బ్లవగముల్
కఱకు సోఁకు మూఁక యెదుటఁ ♦ గడఁగి నిలువ నోపమిన్
వెఱచి పాఱె రక్త నదులు ♦ వీన్గ తిప్ప లడ్డమై
తఱుమ వీలు గాకపోయె ♦ దైత్య జనుల కయ్యెడన్. ౨౧౫

తే॥ సమర భూమిని మరణించి ♦ యమరభూమిఁ, జొచ్చి వేలుపులైన కీ♦శులను గూడి
చిర మభిలషించు కోర్కులు♦చెల్లె ననుచు, నలమిఁగొని తిరిగిరి మేన♦కాదు తెలమి

తే॥ క్రూర హింసయే నైజమౌ♦గుణము గాఁగ, ధర్మమార్గంబు ద్రొక్కని♦దనుజవరుల
మేటి సురలుగఁ జేయు సౌ♦మిత్రిశరము, కంటెఁ బావన వస్తు వొ♦క్కండు కలదె?

తే॥ విక్రమంబున నూర్మిళా♦విభుఁడు దురము, సలిపి యామ్యాస్త్రమున దైత్య♦సంఘ
స్వర్గమున కంప నచ్చట♦స్థలము లేక, నింగియెల్లను వారలై♦నిండినారు. [ములను

—: ఆంజనేయుండు కుంభకర్ణుని వజ్రదండము గొని దైత్యుల నుఱుమాడుట :—

క॥ అమరులఁ దఱిమిన యది లో, కముల నలఁచినదియుఁ గుంభ♦కర్ణునిచేతన్
సమరముల వెలయునది యగు, సుమహిత దండమును వాయు♦సూనుఁడు గొనియెన్.

ఉ॥ మేరు సమానధీరుడు స ♦ మీర కుమారుఁడు వజ్ర దండమున్
దీరుగ హస్తమందున గ ♦ దించి మహోద్ధతి విక్రమించె దు
ర్వార కృశాను కేతుఁడో ప్ర ♦ భంజనుఁడో లయకాల రుద్రుఁడో
వారని కోప భీకరత♦వచ్చిన కాలుఁడొ యన్న కైవడిన్. ౨౨౦

క॥ వీరుల శీర్షంబులపై, వారణ కుంభముల మీఁద♦వారువములపైఁ
దేరులపైఁ జెలరేఁగెను, మారుతి యెల్లెడలఁ దాన ♦ మలసి హరిక్రియన్. ౨౨౧

క॥ అడరిన వారల నగ్గము, పడువారల నలఁచి త్రొక్కి ♦ బవరపునేలన్
గడు బీభత్సం బొనరిచి, పొడవడఁచెఁ ద్రివిక్రమేశు ♦ పోల్కిఁ జెలఁగుచున్. ౨౨౨

చ॥ కనుల శిరంబులం జెదరి ♦ కాంతులు చిందిన మౌక్తికంబులన్
దిటమగు మేని కళ్కు వడి ♦ దేర నభంబును దాఁకు నున్నతిన్

బరఁగె మరుత్సుతుండు లయ ♦ వాయువు వీవఁగ ఋక్షజాలముల్
తరణి విధుండు సంతతము♦ తారెడి మేరువుమాడ్కి నొప్పుచున్. ౨౨౩

చ॥ బలితపుఁగేల దండమును ♦ బాఢముగా ధరియించి మేదినిన్
బలముగ మోఁదు చాడ్పునను ♦ బాఁదుచు దైత్యులు చాఁపకట్టుగన్
నలఁగి ధరిత్రిఁ దాఱఁగ గ ♦ ణంబులుగా రథ దంతి వాజులన్
నలినలి నజ్జు నజ్జుగ నొ ♦ నర్చి చలం బెసలార గర్జిలెన్. ౨౨౪

క॥ నదులైన శోణితంబున, మద గజముల బురదచేసి ♦ మారుతి కాలన్
మదయుతులం దాటించుచు, మదమెత్తిన దిగ్గజంబు♦మాడ్కిం దిరిగెన్. ౨౨౫

ఉ॥ కోడెల చందమొంది రథ ♦ కుంజర వాజుల మీఁద వచ్చుచున్
బోఁడిమి చూపి పెక్కురణ ♦ ముల్ ఘొనరించి జయేందిరా సతిం
గూడిన వారలన్ దనుజ ♦ కోటుల దండముతోడ మోఁది యిం
కేడది లంక లంకె యని ♦ యెత్తుఱఁ బంపెను స్వర్గ సీమకున్. ౨౨౬

తే॥ భానుపుత్ర కుముద నీల ♦ పనస జాంబ, వద్గజాంగదాదులు రణా♦వనిని చొచ్చి
దైత్య సేనాపయోధిలోఁ♦దవిలి యీఁదు, చుండి రెఱుఁగక తమలోన♦నొకరి నొకరు.

తే॥ లెక్కలేని రక్కసులను ♦ చిక్కినంత, వఱకు దుక్కిదుమారంబు ♦ నెఱయఁజేసి
యుగ్ర నరసింహుక్రియ రేఁగి♦యున్న గాలి, పట్టి యారణస్థలి నకం♦పనుని గాంచె.

—: హనుమంతుఁ డకంపనుం జంపుట: —

తే॥ గాడిదలు వేయిపూన్చిన కనకరథము, పైని విలుపూని వెలుఁగొందు♦దానవుం డ
కంపనుఁడు పూర్వమున జగ♦త్కంటకుండు, తారకుండు కుమారుచే♦దోరినతఁడు.

తే॥ ముగురు మూర్తులు మఘవుండు♦మొనసివచ్చి, తాఁకినన్ప్రాణములఁగొను♦దంట
గలుగు నీకోఁతి కనుచు న♦కంపనుండు, వీనిఁ దెగటార్పఁగా నేడి♦వెరవటంచు. [తనము

తే॥ అడ్డుపడకున్న చో రాక్ష♦సాంతకుఁడయి, వసుమతి నదైత్యముగఁజేయు♦వాఁడు
చంపవలయున యనుచు న♦కంపనుండు, దర్పమున నంపవానతోఁ♦దారసిల్లె. [వీఁడు

తే॥ మొగులుతో నగ్గియును గాలి♦తగులుపగిది, బలముతో నకంపనుఁడుత♦న్నలమునంత
వజ్రబాహుండు మారుతి♦వజ్రదండ, మమరఁద్రిప్పెను దనుజ మ♦ధ్యంబునందు.

ఆ॥ అసురు లేచి యేసి ♦ విసరి పొడిచి త్రెంచు, వీరసాధనములు ♦ విఱిగిరాల
దనుజ తనువు లురల♦దండంబు ద్రిప్పుట, హనుమ కపుడు చాల♦నలవుపడియె.

ఆ॥ విలయ పవన హతికి♦వీఁగని మేరువు, కరణి నిలుచు హనుమ ♦ కలఁకుసోఁకు
మూఁక చూచుచుండఁ♦బోకార్చెఁ దుంగమా, తంగ తురగ రథ క♦దంబకముల.

ఆ॥ నేఁడు వీని సురల ♦ నెలవున కనిపి రా, ఘవుల నోర్చి పంక్తి ♦ కంధరునకు
జయము గూర్చి యమర ♦ జాల కష్టమ్ములు, నిలుపువాఁడ ననుచు♦నిక్కె యసుర.

ఆ॥ కటము లదరఁ బండ్లు♦పటపటఁ గొఱుకుచుఁ, గనులఁ బొగలు నగ్ని♦కణము లురల
రథము తోలఁ బంచి♦రాక్షస వీరుండు, హనుమఁ జేరుచుండ♦నతఁడు డాసె.
ఆ॥ పిడుగు గముల యట్లు♦మిడుఁగుఱుల్ కెలఁకుల, రాల్చునవి సురాళి♦రక్తములను
చవి యెఱింగినట్టి♦శరరాజముల నకం, పనుఁడు హనుమ యురము ♦ వగులనేసె.
ఆ॥ వాతనెత్తు♦రొలుక వాయుపుత్త్రుఁడు సొమ్మ, సిల్లి యించుకంత♦నేపులోనఁ
దేఱి తేరితోడ♦సారథిఁ జదిపిఁ గా, డిదలఁ ద్రొక్కి త్రొక్కి♦ప్రిదుల నలఁచె.
ఆ॥ వీనితోడఁ బెనఁగి♦వింటితో గెలుచుట, కడిఁది యనుచు నయ్య♦కంపనుండు
విశ్వకర్మ యొసఁగు♦వీరదండము కేలఁ, గొనుచు దూఁకి డాసె♦హనుమపైకి.
క॥ ఇరువురుఁ గుడియెడమలుగాఁ, దిరుగుచు డాయుచును పొంచి♦తెగువకు వెరవుం
బరికించుచుఁ బాయుచు బడిఁ, దఱియుచు దండములతోడఁ♦దాఁకిరి పెలుచన్.
క॥ తడవిరి తట్టిరి నిక్కిరి, యడఁగిరి వ్రేసిరి తొలంగి♦రార్చిరి భుజముల్
మడిచిరి విడిచిరి పొడిచిరి, కడిమిని ప్రకటించి సమము♦గాఁ బోరిరొగిన్. ౨౮౧
తే॥ కల్లతో వైరముంగొన్న♦గాడ్పుపట్టి, యంజనాద్రితోఁ బగగొన్న♦యసురయురముఁ
దాఁప దండంబుతో దానిఁ♦దట్టివైచెఁ, గాని వలకేలు తునిఁగి రం♦గమునఁబడియె.
తే॥ తలరియును పిఱుతివియక ♦ దైత్యుఁడంత, నెడమచేతఁ బావనిఁ బొమ్మఁ ♦ బొడిచెఁ బొడువఁ
బోటు వజ్రగిరిం దాఁకు♦వాటమగుచు, దనుజు కేల్మొగ్గె మారుతి♦కినిసి రేఁగె.
ఉ॥ దండధరాభుఁడౌ హనుమ ♦ దండధరుండయి విస్ఫుర ద్భుజా
దండ విహీనుఁడై కరము ♦ దండ విహీనత నుంటఁ జూచి యు
ద్దండ భుజాంతరంబు భుజ ♦ దండముచే వడి మోఁద దైత్యుఁడున్
గండలతోడ శోణితము ♦ గ్రక్కెను గ్రాగుచుఁ గ్రక్కు నై వడిన్.
తే॥ పిదప నాచేతితో గూబ ♦ లదర మోఁది, వాని వీరనాకమునకుఁ ♦ బంపునంత
హనుమనిం గని సింగముం♦గనిన హరిణ, వితతి యట్టు లసురసేన♦విరియఁబాఱె.
పంచ॥ అకంపనుండు గూలఁగా ను ♦ రారిసేన గ్రమ్మఁగా
అకంపితాంగులై ప్లవంగు ♦ లార్చి పేర్చి యాడఁగా
నకాలకాలుఁ బోలి లక్ష్మ ♦ ణాఖ్యుఁడేయు తూపులన్
వికావికల్ గడించి పాఱె ♦ వీరదైత్య సంఘముల్. ౨౮౬

—: మారుతి లక్ష్మణుని వెదకుచుఁబోవుట :—

తే॥ ధీరుఁడగు లక్ష్మణుని వింటి♦నారిమ్రోఁత, వినని కతన నెవ్వరికేమి♦పౌనశరిన్నొక్క
కదనరంగంబునందని♦కరువలి సుతుఁ, డెడఁదఁ దలఁచి కొందలమందె♦నింద్రపడియె.

తే॥ దితిజసేనలో నాగ్నేయ♦దిక్కునుండి, అంగదుం డేడు యోజనా♦లరిగియుండె
వాని కవ్వల నుండెను♦భానుసూనుఁ, డతని కాతల లక్ష్మణుఁ♦డడరుచుండె. ౨౮౯
తే॥ ఒకరికొకరికి నాల్గేసి♦యోజనములు, దూరమయ్యెను కపులకు♦దురమునందు
నీటిపైఁ బోఁచినా సేన♦నెగడ లక్ష్మ, ణునకు హనుమకు మూఁడు యో♦జనములుండె
తే॥ లక్ష్మణాఖ్యుని గను నభి♦లాష తన్ను, పురికొలుపఁ జండమారుత♦సరణిఁ జనుచుఁ
జింత వీడంగఁ దగు యుద్ధ♦చిహ్నములను, కొన్నిటిని గాంచి మారుతి♦కొంత తనిసె.
తే॥ దంతి దంతముల్ ఛత్రబృం♦దములు రత్న, హారములు మీలవలెఁ ద్రుళ్లు♦నాయుధములు
కలిసి పరువిడుచుండు ర♦క్తప్రవాహ, ములను కాంచెను హనుమ యా♦స్థలములందు.
ఆ॥ ముట్టిపోరు పగఱ♦మూఁకపై వైచిన, శరచయంబు శీర్ష♦సమితితోడఁ
జదలఁజేరి మరలఁ♦జెదరి శిలావృష్టి, పగిదిఁబడుచు నుండు♦వానిఁగాంచె. ౨౯౨
ఆ॥ దనుజులేయు నాయు♦ధములు లక్ష్మణశర, వితతి వలన విఱిగి♦ప్రతతరవము
తోడ ఋక్షచయము♦దొరలిన చందానఁ, బ్రభలతోడ నురలి♦పడుటగాంచె.
తే॥ ఎడపడక సుమిత్రాసుతుఁ♦డేయు విశిఖ, బృందమెల్లెడఁ దామయై♦జేసికంటి
ఘన జటామండలంబనఁ♦గ్రాలువాని, నంజనానూనుఁ డయ్యెడ♦నలరికాంచె. ౨౯౪
తే॥ మేనిపై రక్తధారలు♦మేవుకొనఁగ, నంధతమసంబ రేయిరా♦జని యెఱింగి
కాలమెత్తిన దీపపుఁ♦గంబములనఁ, దనరి తిరుగుచున్న కబంధ♦వనముఁగాంచె.
ఆ॥ వీరవరులు మడియఁ♦దేరులు కరులును, హరులుఁ గాళ్లు నొవ్వఁ♦బరుగువాఱి
రక్షలేని రాజు♦రాజ్యమందలి ప్రజ, వలె నశించుచుండు♦వానిఁగాంచె. ౨౯౬
తే॥ అతిశయంబుగ లక్ష్మణుఁ♦డడరి పోరఁ, గలనఁ గూలిన క్రూరరా♦క్షసుల రక్త
సాధన శరీర తతులను♦సాగరవన, పర్వతంబులఁ బావని♦పరఁగఁ గాంచె ౨౯౭
తే॥ విలయవాయువువలె నేగి♦వెదకిరుధిర, వాహినుల దాఁటియండక♦టాహ మగలె
నగలె ననఁదగు సౌమిత్రి♦యల్లెనాఁడు, విని ముదంబున హనుమ గ♦ర్జనము సేసె.
ఆ॥ ఎల్లవారి సేమ♦మెఱుఁగంగ నగునని, హనుమ డాసి వినతుఁ♦డైనయంత
విజయశీలి రాజ♦వీరుండు సౌమిత్రి, యెలమిఁ గౌఁగిలించి♦యిట్టులనియె. ౨౯౮

ఉ॥ ఎక్కడ నున్నవారు కపు♦ లెక్కడ నుండె దినేశ పుత్త్రకుం
డెక్కడ వాలి ముద్దుకొడు♦ కెక్కడ తక్కినవారు సేనలో
నొక్కటియేని యేనెఱుఁగ♦ నొయ్యన మారుతి! తెల్పుమయ్య యె
య్యెక్కడ నేమియేమి ఘటి♦యించె వినంగఁదలంతు నవ్వడిన్. ౩౦౦

తే॥ రణముఁబోలెనైంద్రవ్యాక♦రణముదనుజ, గణము భూవరణము మేర♦గాంచుహనుమ
యతని పలుకులు విని యిట్టు♦లను దురాన, నొకరి నొకరు గానరు నుంత♦యును నిజమ్ము.

తే॥ తెలియఁదగునుపాయంబొండు♦గలదునీవు, చేయఁదగుదురక్కసి మాయ♦చేతలెల్లఁ
దొడరి పాశుపతమ్మునఁ♦దొలఁగఁదోల, నీదు సేవకు లెల్లరు♦నిన్ను గాంత్రు.

తే॥ అనుడు సౌమిత్రి లెస్సయా♦ననుచు రామ,విభునిమదిమ్రొక్కి శరమును♦వింటఁగూర్చి
పాశుపత మంత్రము పఠించి♦పావులపయి, నేయ నయ్యస్త్రరాజ మ♦జేయమగుచు.

తే॥ అదరి వెదురుటడవిఁ గాల్చు♦నగ్గివోలె, నెదుటఁబడు వస్తువులతోడ♦నెల్ల దనుజ
గణము వీడక క్షణములోఁ♦గాల్చివైచెఁ, దొలఁగె నిరులును కపులకుఁ♦గలఁకువడఁగె.

తే॥ పాశుపతముచేఁ బెనుమాయ♦నాశమందు, టెఱిఁగి యమ్మహోదరుఁ డని♦మఱుఁ
గుపడియె

భ్రమము తొలఁగంగ సకల ప్లవంగు లలరి, పాడుచాడుచు లక్ష్మణుఁ♦గూడినారు.

తే॥ కపులలో నెవ్వరును నొవ్వి♦గాంచకునికి, శంకవీడి సౌమిత్రి హ♦ర్షమ్మునొందెఁ
జుట్టి యార్చిరి ప్లవగు లు♦త్సుకతమీఱ, సురలు విరులను కురిసిరి♦పౌరవులేక.

క॥ దూతలు దశకంఠునకు వి, నీతులగుచుఁ దెలుప నతఁడు♦నిజమా? యన వి
ఖ్యాతమగు పాశుపతమున, నా తెఱఁగయ్యె నని పలుక♦నగుఁగా కనుచున్. ౨౬౭

క॥ తనయునకుఁ దెలుపుఁడన వే, చనివారలు తెలుప నతఁడు♦చకితుండగుచున్
హనుమఁడు విభీషణుఁడు రవి, తనయుం డినకులజు లెచటఁ♦దగిలి రనంగన్. ౨౬౮

ఉ॥ రాముఁడు సంగరస్థలికి ♦ రాఁడొకకొండను చేరినాఁడు మా
యా మహిమముండు నీదు పిన ♦ యయ్య వనాటుల కోగిరంబుకై
యీమహి దాఁటిపోయెఁ బర ♦ మేశ్వరు నస్త్రము వీడు మున్నుగా
వ్యోమమునందు డాఁగెను మ ♦ హోదరుఁ డియ్యది వార్త నావుడున్.

చ॥ ఇది యదనంచు నెంచి దను ♦ జేంద్రసుతుం డొకమఱ్ఱిఁ జేరి యా
పదపడి బ్రహ్మరక్షసులు ♦ పట్టుగఁ దోడ్పడఁ బూని వేలిమిన్
జిదుగులు నేయి నూవులును ♦ చియ్యయు నల్లనిమేఁక నెత్తురుం
జిదుముచు శాస్త్రయుక్తముగఁ ♦ జేసి ముగించెను శ్రద్ధపెంపునన్. ౨౭౦

తే॥ దహనకీలలు మంచిగం♦ధంబుతోడ, వలదిరిగి శుభసూచన♦వఱలఁజేయ
సహజ దుర్గుణనిధి యగు♦శక్రజిత్తు, జయము మనదని కడు సంత♦సమున లేచె.

క॥ మాయాధిమేటి శంబర, మాయం బచరించి గగన♦మార్గమ్మునదై
తేయులె కనరాకుండఁగఁ, బోయి యడఁగె మొగుళులందు♦పొంచి యదన్కై.

క॥ అత్తఱి మహోదరుం డొక, క్రొత్త మతక మూని యింద్రు♦కోలము గొని యు
న్మత్త చతుర్దంతి పయిన్, మొత్తము వేలుపులఁగూడి♦మొనసెను పోరన్. ౨౭౩

క॥ దనుజు లమర వేషంబుల, మనుజులతో వనచరేంద్ర ♦ మండలములతో
నని సేయఁ దొడఁగ భీతిలి, కనుకని సైన్యంబులెల్ల ♦ గడగడ వడఁకెన్. ౨౭౪

క॥ వెలిగారు నెక్కి యింద్రుఁడు, వెలలెరణము నేయ మునులు♦ వేల్పులు మనతోఁ
జలమూన హేతువేమని, మలఁగిరి వానరులు దిగ్భ్రి♦ మంబునఁ గలఁకన్. ౨౭౫

క॥ రాముని తమ్ముఁడు హనుమని, మోమునఁ గని మునులు సురలు♦ మోహారమున రా
నేమి కొఱగామి జరగెనొ, సామీరీ! తెలుపఁగలవె ♦ శక్యంబేనిన్. ౨౭౬

—: ఇంద్రజిత్తు లక్ష్మణాదులపై బ్రహ్మాస్త్ర మేయుట :—

క॥ అని యడుగుచుండు తఱి రా, వణి నిర్మానుషము నిష్ప్ల♦వంగం బగుఁ గా
కని బ్రహ్మాస్త్రం బేసెను, కని వేల్పులు మనములందు ♦ కళవళపడఁగన్. ౨౭౭

తే॥ పులుఁగులట్టులు వెలుఁగుల♦యలుఁగుగములు, లక్ష్మణుని మేననాట ని♦ల్వార ముతప్పి
తెలివి తొలఁగంగ మత్తేభ♦మిలను పడిన, చందమున సొమ్మసిల్లి భూ♦స్థలిని వ్రాలె.

తే॥ ఇంద్రుఁడిట్టి యకార్యంబు ♦ నేలచేసె, వీని నేనుఁగుతో నెత్తి ♦ విసరివైతు
ననుచు లేచిన హనుమపై ♦ నలుఁగు లడర, నలుగులంపడి యాతండు♦నవని వ్రాలె.

తే॥ కనకగిరియందు మోదుగు♦ననిచినట్లు, నెత్తు రొడలెల్లఁ బరవంగ♦నిశిత సాయ
కములు నాటుటచేఁ దెల్వి♦కలఁకవాఱ, నెలవు దప్పి భాస్కరనూతి♦నేల వ్రాలె.

తే॥ పిడుగుపాటుచే మగసింగ♦ముడిగినట్లు, పోలుపుచెడి వాలిసూనుండు♦పుడమి వ్రాలె
జాంబవంతుని కనుల వ♦క్షమునఁ జెక్కు, కోలలంట నాతఁడు రణ♦క్షోణి నొఱఁగె.

తే॥ వేయిశరము లురముచొచ్చి♦దూయునంత, నలుఁడు సమవర్తి ముఖదర్శ♦నంబుచేసె
ముదితుఁడై వచ్చి యముఁడు కు♦ముదుని పిల్వ, నాతఁ డాతని వెనువెంట♦నరిగినాఁడు.

సీ॥ ఋషభుండు స్వర్గపు♦రిం జేరి నీలుండు, రంభతోఁ గూడంగ♦రాణ నేగెఁ
బెద్దనిద్దుర చెందె ♦ వినతుండు మైంద ద్వి, విదులు నాకము చూడ♦వెడలినారు
కేసరి యిహమును ♦ వేసరి వీడెను, గవయుండు భూమిని ♦ కౌఁగిలించె
శతబలి శతమఖు ♦ సన్నిధి కరిగెను, పేణుండు కైలాస ♦ శిఖరిఁ జేరె

తే॥ తొలఁగి తప్పించుకొన వీలు♦గలుగకునికిఁ, జాఁపకట్టుగ నా రణ♦స్థలిని పడిన
కపులు వెదపైచు నాఱు మొ♦ల్కలను పోలి, ధరణి సందులే కొత్తుగా♦నెఱసియుండె.

తే॥ దేవసుందరుల్ వ్రాలి ని♦ద్రించుపోల్కి, భూమిపైఁ బడ్డ ప్లవగ స♦మూహమపుడు
క్రమ్మి రక్తమెల్లెడలఁబ♦ర్వఁగఁ బ్రవాళ, వనముగల క్షీర వారాశి♦పగిదిఁ దోఁచె.

తే॥ కపులు స్వర్గంబు చేర వే♦లుపులు గాంచి, యతిథిపూజ లొనర్చి య♦నామయంబు
లడిగి యలరించి పదపడి ♦ యవని కిపుడ, పదఁడనుచు వేగ బలవంత♦పఱచినారు.

తే॥ అర్చనంబు చేసితిరి బ్ర♦హ్మాస్త్రమునకు, మీరు మరణింపఁదగినట్టి♦వారు కారు
రామదాస దాసులును క♦ర్మములఁ గట్టు, పడక స్థిరముక్తి వరియించు♦వారు నిజము.

శా॥ మాకార్యం బొనరించుపొంటె భువి జ ♦ న్మంబందియున్నారు మీ
రా కాకుత్స్థుని తోడు వీడకుఁడు మీ ♦ ప్రాణంబె మాప్రాణముల్

మీకే హానియులేదు రాముకొఱకై ♦ మీ జీవముల్ వీడుటల్
మాకు న్యాయకులైతి రాకతన మా ♦ మర్యాదలం బొందుఁడీ. ౨౮౮
మ॥ అనివారల్ పరిచర్యచేసి రిట జ ♦ న్యక్షోణి సౌమిత్రి కా
నన సంచారులతోడ నీగ్లై ధరజా ♦ నాథుండు రాఁడయ్యెఁ దా
మనఁగా నేర్చునెయంచు నింద్రజితుఁ డు♦న్మత్త ప్రలాపంబుతోఁ
జని లంకేశున కంతయుం దెలుప నా♦శంకించి వాఁడిట్లనున్. ౨౮౯
ఉ॥ రాముఁడు చావలేదు గద ♦ రా జయమెట్లగు నీకు నన్న ను
ద్దాముఁడు మేఘనాదుఁ డనుఁ♦దండ్రి! భయంబున రాఘవుండు సం
గ్రామధరిత్రి వీడె నెటు♦గాంచినఁ దమ్ముఁడు మిత్రవర్గముల్
భూమిని కూలియుండఁ గని ♦ పోఁడిమి నిల్వఁగలాఁడె దిట్టయై! ౨౯౦
తే॥ అని సమాధానపఱచి లం♦కాధిపతిని, తన గృహంబునకేగె రా♦వణి మహోద
రుండు తన యింటికేగె వీ♦రుండు రామ, భూవరుఁడు వేఱుచోఁ బని♦పూనియుండి

—: శ్రీరాముఁడు మరలివచ్చి పొలికలనిం గాంచుట :—

మ॥ కరపంకేజము లెత్తువాఱ నిలుకల్ ♦ గల్పొ క్తరీతిన్ మహా
శరజాలంబులఁ బూజసేసి యవలన్ ♦ సంగ్రామ రంగంబు గాం
చు రహిన్ జీఁకటిఁ దోలఁ జేకొఱవిగా ♦ శోభిల్లు నాగ్నేయమా
శరముం గైకొని వచ్చి కాంచెఁ గలనన్ ♦ సైన్యస్థితిం దత్తఱన్.
చ॥ శవమయమైన రంగమును ♦ సంశయ రోష విషాద దిగ్భ్రమల్
మివులఁగ నొక్కటొక్కటిగ ♦ మీఱఁగఁ గాంచుచు రక్షణంబునం
దవులక యప్రమత్తులయి ♦ తారియుఁ దాఱిన కీశరాజి రా
ఘవుఁడట నొక్క నొక్కనిగఁ ♦ గాంచె మహాకులితేక్షణస్థితిన్. ౨౯౩
శా॥ సుగ్రీవుం దన కన్నుదామరల న ♦ శ్రుల్ గాఱ వీక్షించి యీ
ప్రగ్రీవంబిటు వ్రాలఁగాఁ దగినదే ♦ భావింపఁగా నంచు న
వ్యగ్ర స్వాంతముతోడ నవ్వలన వి ♦ ద్వద్వంద్య భక్తావన
ప్రాగ్రీయున్ శ్వసనాత్మజుం గనియె నే♦త్రంబుల్ తుమారిల్లఁగన్. ౨౯౪
మ॥ వనధిందాఁటి నిశాచరావళుల గ ♦ ర్వక్షోభముంజేసి యీ
జనక క్ష్మావిభు పుత్త్రి సేమమును వి ♦ జ్ఞాపించి నాప్రాణముల్
తనియంజేయుట యిట్టులౌటకొ? మహా♦ధన్యాత్మ! నీవక్షముల్
దనుజ క్రూర శరంబు దూసి చనియెం♦ద్రాఁచోర్చె నాగాంతకున్. ౨౯౫
మ॥ మును బ్రహ్మాద్యమరుల్ మునీశ్వరులు న ♦ మ్మోదంబుతో నిచ్చు దీ
వనలున్ జానకి యిచ్చు దీవనలు ని ♦ ర్వ్యర్థంబులై బీటఁబో

సిన బీజంబుల చందమై చెడియె నర్ ♦ సేవించి నాకొండు నిం
దను పాపంగలవాఁడనై పడితె నా ♦ దౌర్భాగ్య సంపత్తిచే? ౨౯౬

శా॥ రాజ్యాంతే నరకం ధ్రువమ్మనెడి వా ♦ ర్తన్నేర్చియున్ లోభినై
రాజ్యాకాంక్షను తండ్రిఁ జంపుకొని యా ♦ రణ్యంబులం జొచ్చియున్
బూజ్యుండైన జటాయు జీవముల నేఁ ♦ బోకార్చితిన్ బ్రాభవ
ప్రాజ్యశ్రీ నను పొందునే? యధిక దౌ ♦ ర్భాగ్యుండ నిక్కంబుగన్. ౨౯౭

ఉ॥ అన్నను చంపి తమ్మునకు ♦ నా కపిరాజ్య మొసంగినట్టి యే
నెన్న సమస్తముం జెఱుప ♦ నెంచిన వాఁడన నైతి మీకిలన్
బన్నము గూర్చితిన్ భువన ♦ భారముగా బ్రదుకంగఁబుట్టితిన్
బన్నగ నంచు నవ్వలికిఁ ♦ బాఱఁగఁజూచె మనంబు కందఁగన్. ౨౯౮

మ॥ వృషవర్గంబునఁ గోడెమాడ్కిఁ దనుపై ♦ వీక్షింప నొప్పారు హ
ర్యృషభున్ వాలికుమారుఁ జూచి కడు ని ♦ ర్వేదించి దండంబునన్
విషముం దిన్న విధిం దపించి యిఁక నే ♦ విల్లందె నిల్చుండి యి
వ్విషమావస్థను మాన్పలేనయితి నా ♦ విక్రాంతులం గాల్పనే? ౨౯౯

—: శ్రీరాముఁడు లక్ష్మణుం గని పరితపించుట :—

ఆ॥ అనుచు నవలికేగి ♦ యట నంపశయ్యపై, నీఁగ గములు మేన ♦ మూఁగు కరణి
విశిఖతతులు గ్రువ్వ ♦ వశమతి యహికాయి, పగిదినున్న తమ్ము ♦ నొగిలి కాంచె.

ఆ॥ ఎడఁద యుడికె నొడలు ♦ వడఁకె బిడుగుపాటు, వలనఁగూలు తరువు ♦ పగిదిఁ బడియె
గడియదాఁక నూర్పు ♦ విడువఁ డేమెఱుఁగఁడు, కాలుచేయి కనులు ♦ కదలలేదు.

ఉ॥ తమ్ముని కౌఁగిలించికొని ♦ ధారణి వ్రాలిన తన్ను నెమ్మదిం
గొమ్మని పల్కువారలును ♦ కొండలమందకు మన్న వారలున్
లెమ్మని పల్కువారలును ♦ లేరొక మిత్రుఁడుఁ బ్రాణయుక్తుఁడై
యమ్మహి లేఁడ యొంటి జని ♦ యంగద నెవ్వఁడు తీర్చువాఁడొకో?

ఆ॥ మొండెములు పిశాచ ♦ ములు భూతములును నక్కలును పతుల వెదకు ♦ కామినులును
మిగిలియుండెఁ గాని ♦ మేనఁ బ్రాణములున్న, వాఁడొకండుఁ గాన ♦ రాఁడు కలన.

ఆ॥ అమరసతులు వగచి ♦ రమరులు వెగచిరి, మహితజగము విష్ణు ♦ మయము గాన
రాము చింత గని చ ♦ రాచర తతియేడ్చె, నేడ్వకుండు నెద్ది ♦ యిహమునందు? ౩౦౪

ఆ॥ వలువమోము వాడె ♦ దల వ్రాల్చెఁ బశుపతి, బంధుచింత దెలిపి ♦ ఫలముగలదె?
పగయు వెక్కి యేడ్చెఁ ♦ బాపదేవత యేడ్చె, దుఃఖమయము గాఁగఁ ♦ దోఁచె జగము.

ఆ॥ ఇంతకంత తెలివి ♦ నినసి శ్రీరాముండు, కనులు తెఱచి యనుజుఁ ♦ గాంచి కాంచి
దివముఁ జేర నిశిఁ దిరుగఁ ♦ దనుచు నెదఁ, బొగిలె నొగిలెఁ గ్రుంగె ♦ బ్రుంగె గ్రుంగె

చ॥ ధరణిఁ దృణంబుగాఁ దలఁచి ♦ తమ్మున కిచ్చితిఁ దండ్రి మాటుచోఁ
దెరలకయుంటి జానకియు ♦ దెప్పరమందఁగ నోర్చియుంటి నో
క్కరుఁడవు నీవుగల్గిన సుఖమ్ము సమస్తముఁ గల్గునంచు నీ
కరణిని నన్నువీడి చనఁ ♦ గాఁ దగవే? నిను వీడియుందునే? ౩౦౭

ఉ॥ తల్లియుఁ దండ్రియుం దపముఁ ♦ దమ్ముఁడుఁ బుత్త్రుఁడు సంపదాలి నా
కెల్లను నీవకావె? యెది ♦ యేగిన నీవు కలాఁడవంచు నా
యుల్లమునం గుమారిలక ♦ యుంటి సమస్తము నేఁడువోయె న
న్నొల్లవ యేమి? కాదు కడు ♦ నుగ్ర శిలా కఠినాత్ముఁ డేనకా?

చ॥ వ్రణమయమైన కాయమునఁ ♦ బ్రాణముఁ గానము చావకుంటి నా
కణఁక యదెట్టిదైన నగుఁ ♦ గాసల నన్నుభజించి కష్టముల్
తొణఁకక యోర్చి యోగిరము ♦ తూఁగును మానిన ధీరచిత్త! యీ
రణభువి నేఁటికిట్లు నిదు ♦ రం గొన నేటికి? లెమ్ము నాయనా! ౩౦౯

ఉ॥ ఎండకు వానకోర్చి శ్రమ ♦ యింతయు లెక్క యొనర్పకుండఁ గో
దండము నూని కాచు గుణ ♦ ధామ! రణస్థలి నొంటివీడి తె
న్నుండుట నాయమేమి? ననునూల్కొని యెవ్వరుకాచువారు? నా
గుండియ లెట్టివంచుఁ గనఁ ♦ గోరితె? పంతములేల? నాయనా! ౩౧౦

చ॥ హృదయము జీవ మొక్కటని ♦ యెంచిన పల్కు నిరర్థమైనచో
నెద ననరున్నదంట నిజ ♦ మే యగునేమి? విశుద్ధమూర్తి! నీ
పిదపను జీవముల్ విడక ♦ వెక్కుచునుంటిని నీకుఁ జుట్టమై
వడలకయున్నదీ తనువొ? ప్రాణములో? కనరాదు నాయనా? ౩౧౧

ఉ॥ యాగముగాచి శంకర శ ♦ రాసన మెక్కుడి ప్రీల్చి యచ్చటన్
భోగములొంద నౌనను కు ♦ బుద్ధిని గొంటిని కాలకూటమున్
రాగము దానిపై నునిచి ♦ రాజును బంధులనెల్లఁ గాల్చితిన్
ద్యాగము లేమిచేసితిని? ♦ తక్కక మృత్యువు మీకుఁ గూర్చితిన్. ౩౧౨

ఉ॥ భూమిపయిన్ వహించు పెను ♦ మోహముచే ననలంబు పుంటిపైఁ
బ్రామినరీతిఁ దల్లికొక ♦ బాధను కూర్చితి నంతమాత్రమా?
రాముపయిన్ వహించు ఘన ♦ రాగముచే నిటువంటి చెడ్డ ఘో
రాములు మీకుఁ గూర్చితిఁ గ ♦ రంబుగ నెల్లరబోఁటి వాఁడనే?

చ॥ మరణము నొందితీవు కసు ♦ మాలపు మేనును నేను వీడెదన్
భరతుఁడు రాజ్యమేలఁ డిఁక ♦ బంధులు తల్లులు దుఃఖవారిధిన్
దరలి నశించువార లొక ♦ ధర్మముకై వెలిపొంది వీఁగఁగా
జరగిన దింత యొడ్ఢొలవ ♦ జన్మము నాయది యెంత ధన్యమో? ౩౧౪

క॥ జననీ జనకుల బంధుల, ననుఁగుల నాఖోఱకు విడిచి ♦ యడవుల వెంటన్
నను వీడకుండు తండ్రీ! నిను పాసియు నిలువఁగలనె♦నిముసంబేనిన్. ౩౧౫

ఉ॥ ఉత్తమ కామినిం బలిమి ♦ నొక్క దురాత్ముఁడు కారవైవఁగా
నత్తమ సన్నుతంబయిన ♦ చక్కటి వాని వశంబుచేరుచో
నిత్తఱి నూరకుంట తగ ♦ వే? త్రిజగంబుల ప్రాల్పకున్న నే
నెత్తిన జన్మమేల? ధరి ♦ యించిన చాపమునేల? కాల్పనే? ౩౧౬

క॥ ఖరునకుఁ గాకాసురునకు, విరాధునకు సప్తసాల ♦ వృక్షమ్ములకున్
శరధికి వాలికి మాత్రమె, సరగున నా శరము తూఱి♦చనఁజాలినదో? ౩౧౭

చ॥ ప్రతినను నిర్వహింపుమని ♦ పంపితిఁ దోడుగ నుండనైతి నీ
జత విడకుందునేని దను ♦ జప్రభుపుత్త్రుని మేని రక్తమున్
క్షితిపయిఁ జిందఁజేసి నిను ♦ చేకొని రక్షణసేయకుందునే?
గతజల సేతుబంధనము ♦ గాఁ దలపోసిన నేమి యబ్బెడిన్? ౩౧౮

ఉ॥ తమ్ములు బంధులుం బ్రజలుఁ ♦ దల్లులు నేగతి నున్నవారొ యం
చుమ్మలికించుచుందురు మ ♦ హోత్సుకతం గనఁబోదమయ్య తే
లెమ్మ యయోధ్యయందు బహు ♦ లీలల మస్మకుటాభిషేక మి
ష్టమ్మునఁ జేయువార లది ♦ నమ్మతమే కద రమ్ము చూడఁగన్. ౩౧౯

తే॥ నాగపాశంబుచేఁ గట్టి♦నలఁచినపుడు, ప్రాణముం దీసినపుడు నీ♦పజ్జలేక
హా! సుహృద్ద్రోహి పద్ధతి ♦ ననుసరించు, నన్నుగని లోకులెల్లరు♦నవ్వకుండ్రె?

శా॥ లంకారాజ్య రమన్ విభీషణుని కు ♦ ల్లాసంబుతో నిచ్చి ని
శ్శంకం దచ్ఛపథంబు దీర్చ కిపుడే ♦ చావంగనున్నాఁడ నే
వంకం గల్పితి నాదుకీర్తి మఱియున్ ♦ వంశంపు సత్కీర్తికే
యంకంబొందు గడించినాఁడ జను లా ♦ హా యంచు నిందింపఁగన్.

క। అని పరిపరి విధముల వా, పోనుచు లోనఁ గుమిలి కుమిలి♦క్రుంగుచు నాలిం
గన మొనరిచి తను మఱచుచు, మునిఁగెన్ మైథిలి విభుండు♦మూర్ఛానిద్రన్.

## —: వేలుపుల విలాపము :—

క॥ ఇనకులుని గాంచి ఖచరులు, కనఁగవఁ గరములఁ గదించి ♦ కళవళపడుచున్
గొనకేమి పరిణమించునో? యని చింతాకులితు లగుచు ♦ నారటపడుచున్.

సీ॥ సుఖదుఃఖరహిత! నీ♦శుద్ధస్వరూపంబు, దెలియంగ శక్తిమం♦తులము గాము
నీ యుదరంబున ♦ నిఖిల జగంబులు, నమరియున్న తెఱంగు ♦ నరయలేము
జరిగిన యదియును ♦ జరుగుచున్నదియును♦జరుగనున్నది నంత♦యెఱుఁగలేము
నిను వినుతించి నీ♦నిర్దేశపద్ధతి, మెలఁగుట దక్కొండు ♦ తెలియలేము

తే॥ దితిజవధఁజేసి దుఃఖముల్ ♦ దీర్పుమనుచు, వేఁడఁ గరుణించి యారీతి♦వెలసితీవు
ధర్మమును గాచు పూన్కిని♦దాఁగి నిలిచి, మాయనాటక మాడుచు♦మమ్ముఁ గలఁతె!

ఉ॥ కందుల మైన మాకొనరు ♦ కష్ట పరంపర దీర్తువంచు నా
నందము గూర్తువంచుఁ గడు♦నమ్మికతోడను గంపెడాసతో
సుందరరూప! నిన్నెపుడుఁ ♦ జూచుచునుందు మదేమి మాయ? నీ
చందము విస్మరింపఁ బెడ ♦ జాడలఁ ద్రిప్పఁగ నుత్సహించెదే? ౩౨౭

మ॥ పరమేష్ఠీ! బహుళాండముల్ నిఖిల జీ♦వస్తోమముం జేసి యం
దిరవారన్ వెలి లోపల న్నిలిచి లో ♦ నిందించుచున్ వీడుచున్
బరిపోషించుచు వేఱుగా నిలుచుచున్ ♦ భావింప సాలీఁడు మై
నురవౌ నూలున గూఁడు గట్టు క్రియ సం ♦ యోజింతు సర్వేశ్వరా?

మ॥ ఇది దుఃఖంబులఁ గూర్చు లీల లనుచో ♦ నేచింత నిన్నంటు? ని
య్యది సమ్మోదనలీలలే యగును చు ♦ మ్మల్లంటకుం జాల మా
పద మేమొందిన నీదు ప్రేమయు దయా ♦ భాగ్యంబు నిండారు ధీ
యొదలు న్నీవయి తేఱకున్న నిట ని♦న్నోదార్పఁగా నేర్తుమే? ౩౨౮

చ॥ కనఁబడుపోల్కిఁ దోఁచి ♦ మఱి కానకయుందు నమేయరూప! మే
దిని నవతార మొందితని ♦ తేఁకువ నుంటిమి నీవు దుఃఖముల్-
మనమున నొందఁ దాళఁగల ♦ మా? జగదీశ్వర! నీవ మానఁగా
మొనయుదుగాక మే మొకట♦మోతుమొ? విత్తుమొ? నీదు మాయలన్.

మ॥ అజసూనున్ ఘను నంబరీషు భవుఁ బ్ర ♦ హ్లాదుం దశాస్యానుజున్
గజరాజుం గని కాచినట్టి కరుణా ♦ కల్యాణ వీక్షా రుచుల్
నిజ మీపాటికిఁ జూప కిట్టు లడలన్ ♦ నిశ్చింతమై నుందుమే?
భజనానందుల మైన మాకు విమల ♦ ప్రజ్ఞాన మీయంగదే! ౩౨౯

క॥ పలువిధుల నిట్లు వేల్పులు, పలవించిరి మనుజభావ ♦ బంధురగుణుఁ డ
జ్జలజాక్షుఁడు తమ్మునిపైఁ, గల ప్రేమమువలన మూర్ఛ♦గని యట్లుండన్. ౩౩౦

ఉ॥ చారులు గాంచి రావణుని ♦ సన్నిధి కేగి యెఱింగి శక్రజి
త్క్రూరశరాళిచేఁ బ్లవగ ♦ కోటియుఁ దమ్ముఁడుఁ గూలియుండుటల్
వారకచూచి శోక వన ♦ వహ్ని దహింప గతించె రాఘవుం
డా రణభూమియందె పగ ♦ యాఱెను సంతసమందుమా యనన్. ౩౩౧

## ౨౨. మూర్ఛిత రామలక్ష్మణ సందర్శన పటలము. (౩౨)

ఉ॥ దూతలు కల్లలాడరని ♦ దుష్ట నిశాటుఁడు రావణుండు మో
దాతిశయంబుచేఁ బురము ♦ నందు జయంబును చాటఁబంచుచున్

నేతి వసంత మాడుఁడని ♦ నిచ్చలు ద్రవ్యముచల్లి దూతలం
బ్రీతులఁజేసి వేగ పిలి ♦ పించి మరుత్తుని గాంచి యిట్లనున్. ౩౩౨

తే॥ కలనఁ జచ్చిన దనుజుల ♦ గాత్రములను, త్వరగ నంబుధిఁ బడవైచి ♦ మరలు దీని
నొరు లెఱింగిన నీతల♦ నుత్తరింతు, ననుడు వాఁడట్లు కావించె♦నాక్షణమున. ౩౩౩

చ॥ దురమున రామలక్ష్మణుల ♦ దుస్థితి మైథిలి కన్నులారఁగా
స్థిరముగఁ గాంచి కాక తన ♦ చిత్తము మార్చదు నమ్మదంచు నా
సుర వనితావళిం బనుపఁ ♦ జుట్టఱికంబున గేలిచేయుచున్
దురితముగా విమానమునఁ ♦ దోడ్కొనిపోయిరి వారు జానకిన్. ౩౩౪

మ॥ పతి సౌందర్యముదక్కనొండొకటి భా ♦ వంబందు నెక్కొల్ప కీ
క్షితమును జేయని ధాత్రిజాత పతి ని ♦ స్థ్సేమస్థితిన్ సంగర
క్షితిఁ దార్కాణగ నుండఁ గాంచి తనువుం ♦ జిత్తంబు విజ్ఞాన జీ
వితముల్ స్రుక్క జలేజ మగ్నిఁబడు న♦ వ్వీకం గుమారిల్లుచున్. ౩౩౫

సీ॥ విలపింప వేల్పుల ♦ వెలఁదులేడ్చిరి హారు, సామేననున్న యీ ♦ శ్వరియునేడ్చెఁ
గమలవాసిని యేడ్చె♦గంగ బోరున నేడ్చె, బ్రాహ్మియేడ్చను ముని♦పత్నులేడ్చి
రదయతో సోఁకుల ♦ యతివలు నేడ్చిరి, జనకజ జనని మే ♦ దినియునేడ్చె
శ్రుతులేడ్చె ధర్మదే♦వత యేడ్చెఁ బాపంబు, నెల్లవారలకంటె♦ నెక్కుడేడ్చెఁ

తే॥ దక్కువారలయేడ్పులఁ ♦ దడవనేల? ఎచటనుండిన వారచ్చ ♦ టచట నిలిచి
యేడ్చినారలు వైదేహి♦యేడ్చియేడ్చి, యుల్లమెరియ నిల్వక సొమ్మ♦సిల్లి వ్రాలె.

ఉ॥ చేరువనున్న యద్దనుజ ♦ చేటిక లత్తఱి తేవనత్తి వ
స్నీరు మొగంబునం జిలికి ♦ నేర్పుమెయిం జలిసేవ సేయఁగా
ధారణిజాత కన్దెఱచి ♦ తల్లడమందుచుఁ గంపమొందుచున్
నీరద దేహుఁ గాంచి తన ♦ నేత్ర యుగంబును మోఁదెఁ బల్కెఱుల్.

తే॥ వహ్నిఁబడిన వల్లికవలె♦వాడు నుడుకు, వడఁకు విహ్వాలించును వెక్కు♦నడఁగు మడఁగుఁ
బ్రుల్లు గద్గదకంఠయై రోదనంబు, సేయు జీవంబు లురియాడఁ♦జిక్కు స్రుక్కు.

తే॥ పడును పొరలుఁజెమర్చు బె♦గ్గడిలుఁ నడలుఁ, దెలివిదప్పును లేచు వి♦దిర్చుఁ గేలు
దీనదృష్టుల దిక్కులు♦ తేఱిచూచుఁ, దలరు! దపియించు మొఱవెట్టుఁ♦బలవరించు.

ఉ॥ నీతొడఁ బ్రేమగల్గి నిను ♦ నిత్యము గొల్చెడువారిఁ గాచుచున్
నీయెడ వైరమూను రజ ♦ నీచరపాళులఁ ద్రుంచుచుండు మ
న్నాయకు నండనుండకిటు ♦ నాశము గోరినవారిఁ జేరితే?
నీ యువలక్షణంబు గమ ♦ నింపఁగ నిట్టిదె? ధర్మదేవతా! ౩౪౦

తే॥ ధర్మపద్ధతులం గాక ♦ తక్కుత్రోవ, లందు పోని యుత్తముల క ♦ డిందిసేగి
చూడ నిచ్చగించితె? యిది♦వేడు కేమి? దుర్విధీ! నీవు దీనిచే♦దొడ్డవగుదె?

ఉ॥ పాపినినైన నేను నిటు ♦ వంటి పరిస్థితిఁ గాంచి సైఁపఁగా
నోపను ధర్మరాజ! దయ ♦ యుంచి ననుం గొని పొమ్ము పుణ్యమా
నాపతి నన్నుఁ బావుటలు న్యాయమొ? రావణుతోడఁ జేరితే?
పాపఫలంబు నాకుఁ గుడు ♦ పంగఁ దలంచిన త్రోవ యిద్దియే? ౩౮౪

చ॥ తొలఁగని యంధకారమునఁ♦ద్రోచుట న్యాయమె? నాథ! యోకృపా
జలనిధి! నాతపఃఫలమ! సత్యదయాపర! యిన్నినాళ్లు లీ
సిలుగు సహించియుండినది ♦ చెన్నఱు నీస్థితి గాంచు కోసమా?
తలఁగని నా దురాగతమె ♦ తార్చెను నీకు నకాలమృత్యువుల్

మ॥ అమరప్రార్థితజన్మ! ఆగమ సువే♦ద్యా! దేవ దేవేశ! జ
న్నము గావం జనుదెంచి యంత మిథిలా♦నాథానుదేశంబునన్
ప్రమథాధీశ్వరు చాపముల్ విఱిచి నా ♦పాపాలపుట్టైన హ
స్తముఁ జేపట్టుట యిట్టి యాపదకు ల ♦ క్ష్యంబాటకా? రాఘవా!

మ॥ కడుపుం గాల్చెడువార్త కన్నకడుపౌ ♦ కౌసల్య విన్నంతనే
విడుచుం బ్రాణము లంత నాయనుజలుల్ ♦ వీక్షింతురే జీవికన్?
చెడుగుల్గోరిన కైక యియ్యదియె తాఁ ♦ జింతించి కావించెనో?
చెడితిన్ సర్వవిధంబులం జెడితి ని♦స్సీ! నా భవం బెట్టిదో? ౩౮౫

మ॥ వలదన్నన్ వెనువెంట వచ్చితిని క్ర ♦ వ్యాదాలితో సూడు నా
వలనం గల్గెఁ బసిండి లేడికయి ని ♦ ర్బంధించి నిన్నంపితిన్
గెలన న్నిల్చిన లక్ష్మణుం గఠిన వా ♦ గ్దగ్ధంబులం గ్రుచ్చి యా
వలికిం బంపితి సర్వ మాపదలకే ♦ పాల్సేయనే యయ్యోఁగా? ౩౮౬

ఉ॥ పాపఫలంబుచే నడవ ♦ భావ్యముగాని యరణ్యసీమకే
మోపిక నేగునాఁడు ప్రియ ♦ మొందగఁ బిల్చి కుమార! రాఘవుం
డాపదనొందునే నతని ♦ కన్నను మున్నె మరింపుమంచు నా
జ్ఞాపనసేయు తల్లి నుడి ♦ జాడనె కూలితె? తండ్రి! లక్ష్మణా! ౩౮౭

చ॥ చివుళులు పువ్వులుం బఱపి ♦ చెన్నరు తల్పమునందు నిద్దురం
దవిలి త్యజించినట్టి గుణ ♦ ధన్యుఁడ! లక్ష్మణ! నిత్యశీల! దా
నవ ధను రుగ్ర ముక్త శర ♦ నవ్య సుతల్పమునందు చల్లనన్
మివులఁగఁ గూర్కి సెంద మది ♦ మేకొని వ్రాలితి వేమి? నాయనా!

తే॥ మఖము లొనరించి సద్ధర్మ♦మార్గమునను, ధరణిపాలన మొనరింపఁ♦దగిన నీవు
నన్ను చేపట్టి సత్యవా♦జ్ఞ యము ధర్మ ఫలము కృశియింప వగలఁ బా♦ల్పడితి నాథ!.

తే॥ కులిశమునన్నైనఁ బగులని♦గుండె గలిగి, పనవి ఫలమేమి ఖేదంబు♦పాయునట్లు
నీరజాక్షుపైఁబడి మర♦ణింతుఁగాక, యనుచుఁ బడఁబోవఁ ద్రిజట తా♦నడ్డువచ్చె.

—: త్రిజట సీత నూఱడించుట :—

తే॥ తన తపఃఫల రూపమై♦తనరు త్రిజట, సాంత్వనంబులు పలుకంగ♦సాహసించి
సకుల నవలికిఁ ద్రోసి జా♦నకిని డాసి, కౌఁగిలి నెపంబునం జెవి♦గఱచి పలికె.

తే॥ మాయజింకను పంపుట♦మాయ జనకు, ననుపుటయు నాగపాశ బం♦ధనవిముక్తి
యించుకేని విచారింప♦కిట్లు జీవ, ములను వీడఁ దలంచితే? ముద్దుతల్లి!. ౩౫౨

ఉ॥ గన్యాతపఃఫలంబు కల ♦ గన్న ఫలంబును మీరు దండకా
రణ్యమునం జరించుతఱి ♦ రాజిలు చేఁతలు ధర్మదేవతా
పుణ్యఫలంబునం బొడము ♦ పూరుషవర్యుని రాము వీర్య సా
ద్గుణ్యములుం దలంప నొక ♦ దుర్మరణం బతనిన్ జయించునే?. ౩౫౩

మ॥ ముగుదా! రాముని మేన నొక్క విశిఖం ♦ బున్నాట కున్నట్టి యా
పగిదిం గానవొ? నీ మఱంది మొగముల్ ♦ భావింప మూర్తాందు రీ
తిగ భాసిల్లుచునుండె లక్ష్మణుఁడు మి♦త్తిం బొందలేదమ్మ! రి
త్తగ దుఃఖమ్ముల నొందకమ్మ! యిది స ♦ త్యం; బేల సందేహముల్?

మ॥ మరణంబే భజియించునేని త్రిజగ ♦ న్మాన్యుండు రాముండు దు
ర్భరమై లోకము లన్నియుం జెడవె? భా ♦ స్వచ్చంద్ర బింబంబులున్
ధరణిన్ వ్రాలవె పట్టుదప్పి? పురజి ♦ ద్ధాత్రాదులు న్నిల్తురే?
స్థిరమై ధర్మము లోకముల్ నిలువఁగాఁ ♦ జింతింప నీకేటికిన్? ౩౫౫

ఉ॥ నీవరశక్తిచే హనుమ ♦ నీరసజీవుఁడు గాఁడు వ్యర్థమై
పోవదు నీసతీత్వమున ♦ పోఁడిమి యూరక చింతసేఁతయున్
భావుకరీతిగాదు సుర ♦ వర్యుల కోర్కులు రిత్తగావు రా
జీవ భవాస్త్రము పీడయు వి♦శీర్ణము కాఁగలదమ్మ! జానకీ! ౩౫౬

చ॥ మునుల నిలింపులం గనఁ ద్రి ♦ మూర్తులఁ గాంచిన పోల్కి రామల
క్ష్మణులను కాంచి హస్తముల ♦ మస్తములం దొదవించి మోద భా
వనముల నున్నవారు భయ ♦ పద్ధతి మానుము సాగరంబు నూ
తను వడిఁజొచ్చి నీరములఁ ♦ ద్రావుట చూడము మేదినీసుతా? ౩౫౭

చ॥ పతి మరణింప సూత్రమును ♦ పాయఁగనున్న సతీ మతల్లులన్
హితమతి! యీ విమానము వ ♦ హింపదు జార్చును తారకాణ లి
ప్పితమునఁ జెక్కు లున్నయవి ♦ వేఱేఁడి చందము నొందకమ్మ! నీ
పతి సుఖయుక్తుఁ గొందలము ♦ పాయుము నమ్ముము నన్ను తల్లిరో!

చ॥ అనుడు ధరాత్మజాత హృద ♦ యంబున నించుక తేఱి యాసతిం
గని నిను తల్లిగాఁ దలఁచి ♦ కాలము ద్రోచితి నీదుపల్కు లె
ప్లును వృథగావు నేఁటి నిసి ♦ పోయెడుదాఁక భరింతు జీవముల్
నిను మది తెప్పగాఁ దలఁచి ♦ నిల్చితినమ్మ! శుభమ్ము నీకగుఁన్. ౩౫౯

చ॥ సతులకు భూషణంబు లగు ♦ సాధుగుణంబుల నీటఁ గల్పియున్
బతి ముఖదర్శ నాశ నను ♦ బాధలఁ బెట్టఁగ జీవముల్ భరిం
చితి నెటులెట్టులో గురుత ♦ చెడ్డ శరీరము వీడుటన్నఁ గ
ష్టతరముగాదు తల్లి! త్రిజ ♦ టా! యని మైథిలి నెమ్మదిం గనెన్. ౩౬౦

చ॥ స్థిరుఁడగు జీవు నివ్వసుమ ♦ తిన్ విడిపించి బలంబుచేత న
స్థిరమగు దేహమున్ భ్రమము ♦ చేఁగొని యంబరవీథిఁ గాల కిం
కరులు గమించులీల జన ♦ కప్రభు పుత్త్రిని రాక్షసాంగనల్
కరముల మీఁద నుంచికొని ♦ క్రమ్మఱినారు బిరాన లంకకున్. ౩౬౧

## ౭౩ సంజీవన శైల పటలము. (౧౧౭)

క॥ ఇనకులుని యాజ్ఞ వనులకుఁ, జనిన విభీషణుఁడు భోజ్య♦సామగ్రులు చే
కొని మరలి పాళెమునకుం, బనిచి యవల వచ్చి సమర♦వసుధం గాంచెన్ ౩౬౩

తే॥ బ్రహ్మశాపంబుచే మృతిఁ ♦ బడసినట్లు, వనచరావలి యెల్లను♦వ్రాలి నేలఁ
జాఁపకట్టుగఁ బడియుండు♦సరణిఁ గాంచి, హా! యనుచు నేమిఁ దోఁచక♦యట్టె నిలిచె.

క॥ జరిగిన సంగతి సుంతయు, నరయని దనుజేంద్రుఁ డంత ♦ నటమట పడుచున్
బరుగునఁ జని లక్ష్మణుతో, ధరణిని వ్రాలిన నృపాల♦తనయుని గాంచెన్. ౩౬౪

ఉ॥ ప్రేమకుఁ బ్రాణ మస్థులు శ ♦ రీరము ముఖ్యములంచుఁ గాదటం
చీ మహిఁ బల్కవచ్చు రహి ♦ యించు పదావలిఁ గూర్చి నేర్పుచేఁ
బ్రేమకు సాటియైన దొక ♦ పేర్మిగుణంబు జగానఁ గల్గునే ?
ప్రేమగుణమ్ము మేర గని ♦ పెట్టిరె వేల్పులు నేఁటికేసియున్ ? ౩౬౫

ఉ॥ ఓరువలేని సంకటము ♦ నొంది తపించియు నెమ్మనంబునన్
వీరికిఁ జేటు లేదను వి ♦ వేకము నమ్మక ముంటఁజేసియే
యూరక ప్రాణముల్ విడక ♦ యొప్పుగ శీలన మాచరించి కం
గారుపడంగఁ దగ్గ దొక ♦ కాఱియ లేదని నిమ్మళించుచున్. ౩౬౬

తే॥ అజ శరంబుచేఁ గలిగిన ♦ దనియు నదియు, నింద్రజిత్తుచే సౌమిత్రి♦కినసె ననియు
నతనికై రాముఁ డీరీతి♦నడలి సోలె, ననియుఁ దలపోసి ప్రతికృతి♦యరయసాగె.

ఉ॥ శోక నిపీడితాంగుఁడయి♦శోషిలు రాముఁడు తేఱువెన్క న
స్తోకమతిం దలంతమనఁ ♦ దోడగు తమ్ముఁడు చావఁ బిమ్మటన్

జాక సహించి నిల్వఁ డటు ♦ సాగిన ధూర్తులకే జయంబిలన్
జేకుఱునంచుఁ గన్నుఁగవ ♦ చిత్తడి నొందఁగ నించె నశ్రువుల్. ౩౬౮

మ॥ ఫణిపాశంబు తొలంగినట్టి కరణిన్ ♦ బ్రహ్మాస్త్రమున్ వీడు ల
క్ష్మణ నాశంబును లేదు ద్రెళ్లిపడు నీ ♦ శాఖామృగ వ్రాతమున్
బ్రణుతిన్ జీవము లొందు ధర్మము స్థిరన్ ♦ వర్ధిల్లు మాయావి రా
వణ దుర్మానికి రాక్షసాలికి జయ ♦ ప్రాశస్త్యముం గూడునే? ౩౬౯

క॥ తేఱుటకు మున్నె యాపద, తీఱఁగఁ దోడ్పడెడి వారు ♦ ద్రెళ్లక యెవ రు
న్నారో వెదకెదఁగాకని, కోరికతో నెమకెఁ జేతఁ ♦ గొఱవిం గొనుచున్.

ఆ॥ పెదవి మడిచి కేలు♦పెనవైచికొని వేఁడి, వాఁడిచూపు జంకె♦పోఁడి మెఱయు
వారణముల కుప్ప♦పైఁబడియున్న సా, మీరిఁ గాంచి కనుల♦నీరునించి. ౩౭౧

ఆ॥ అసువు లున్నవనుచు♦నరసి రక్తమువెల్లు, వ్రణములందు గ్రుచ్చు♦కొన్న శరము
లొక్కటొకటిగాఁగ♦నొయ్యన వెడలించి, మొగులు జలము చల్లె♦మొగముమీఁద.

ఆ॥ ఒడలు గగురు పొడిచె ♦ వెడవెడ నావియు, వచ్చె నావులింత ♦ వచ్చెఁగనులు
విచ్చెఁ దెలివివచ్చె♦నుచ్చరించెను రామ, రామ యనుచు మంత్రి♦రాజ మతఁడు.

చ॥ అలరుచు దుఃఖముం బెనఁగు ♦ లాడ విభీషణుఁ డంజనా సుతుం
జెలువుగఁ గౌఁగిలించికొన ♦ శ్రీరఘువీరుని యవ్యయంబు నిం
పెలయఁగఁ బ్రశ్న సేసి సుఖి ♦ యే యను వాక్యము వీనుదోయికిన్
గలివిడి గూర్ప జే యనుచుఁ ♦ గేలు మొగిడ్చె మరుత్సుతుం డటన్.

ఉ॥ తమ్మునిమీఁది ప్రేమ బలి ♦ తమ్మగు చింతఁ దపించి సోలినాఁ
డిమ్మగఁ దేఱ రామవిభుఁ ♦ డేమగునో యని సంశయించెదం
బమ్మని దైత్యనేత యనఁ ♦ జూచుచు మారుతి భల్లుకేశ్వరుం
డిమ్ముల నున్నవాఁడె యతఁ ♦ డెచ్చటనుండు వచింపవే యనన్. ౩౭౫

చ॥ అతనిని గాంచ లేదు స్మృతి ♦ నందెనొ యేమొ యెఱుంగ జానకీ
పతి విషయంబు చూడుమనఁ ♦ బావని భల్లుకరాజు నిత్య జీ
వితుఁడు వివేకి మేలు నొద ♦ వింపను నేఁగెదొ లంప దక్షుఁడో
బ్రతికితిమయ్య పోదమన ♦ వైశమ యిర్వురు చేరి రోయుచున్. ౩౭౬

తే॥ పోవుచుండఁగ నొకచోట♦ముసలితనము, వలన సెలలునాటిన నొప్పి♦వలనఁ గలఁక
వలన మైక మొందియు జాంబ♦వంతుఁ డిరువు, రరుగుదెంచుచుండుట నడి♦యరసి
యెఱిఁగి.] [తిరిగిరారు

తే॥ రాముఁడో హనుమంతుఁడో♦రాక్షసుండొ, సురలొ మునులొ పగఱు పోయి ♦
కాన వచ్చువారలు కావఁ♦గడఁగువారె, కావలయునని సెమ్మది♦గాంచె నతఁడు.

తే॥ వచ్చి చేరువ నిలిచిన♦వారిఁ గనులు, తెఱచి కనలేక యెవ్వరో♦ తెలుపుఁ డీర
లనుడు బ్రతికితిమను విభీ♦షణుని పలుకు, సవ్వడింబట్టి యూగసి♦సంతసించి.
తే॥ అవలివాఁ డెవఁడని మారు♦తాత్మజుఁడను, నుత్తరము విని జయము మ♦రుత్తనూజ!
మంటిమిఁకఁ బునర్జన్మంబు♦గొంటిమయ్య, యనుచు మెల్లనఁ గనువిచ్చి♦యతనిఁగాంచి.
చ॥ ఒడలి శరంబు లూడ్చికొని ♦ యుబ్బి యెలుంగుల జేఁడు పావనిం
గడుకొని కౌఁగిలించికొని ♦ కంజ భవాస్త్రమయయ్యు రాఘవుం
దొడరి కలంపఁజాల దని ♦ దొడ్డగ నమ్మిగ గద్దునాకు నా
పుడమి కుమారిభర్త పని ♦ పూని యొనర్చినదేమి చెప్పుమా? ౩౮౧
చ॥ అనుడు మరుత్సుతుండను మ ♦ హాత్ముఁడు లక్ష్మణు పాటుగాంచి మూ
ర్ఛను మునిఁగెన్ స్మృతింగొనినఁ ♦ గ్రమ్మఱ నేమగు నో యెఱుంగఁజా
ల ననిన జాంబవంతుఁ డను♦లక్ష్మణుఁదేర్పఁగ నే వచించు త్రో
వను చని మందు తెమ్ము కపి ♦ వర్గమె కాదు జగమ్ము నూల్కొనన్.
సీ॥ ఉదధిని దాఁటి తొ ♦ మ్మిదివేల యామడ, లరిగినఁ గాంతు హి ♦ మాచలమ్ము
నొగి నది ద్విసహస్ర ♦ యోజనాయతినొప్పు, నదిదాఁటి యోజన♦మరుగునంత
హేమకూటము వచ్చు ♦ శ్రీ మహితంబది, వెనదాఁటి తొమ్మిది♦వేల యోజ
నము లేగ నిషధశై♦లము గల్గు దానిని, కడచి యవ్వల నంత ♦ నడవ చనిన
తే॥ కనకశైలంబుఁ గానంగ♦గలవు దాని, విరివియుండు ముప్పదిరెండు♦వేల యోజ
నాలు పిమ్మటఁ దొమ్మిది♦వేల యోజ, నములు కడచిన నీలశై♦లమును గాంతు.
సీ॥ ఆమల రెండువే♦లామడల పొడవు, విలసిల్లు దాని క ♦ వ్వలను నాల్గు
వేల యామడలేగ♦లీలను గాంతువు, మందులుగల నల్ల♦మలను నీవు
గాంచినంతనె మన♦కడగడ్ల కడలికిఁ, బొరంబు గాంతువు♦వాయుపుత్త్ర!
అందు ప్రాణము లిచ్చు♦మందొండు మఱియొండు, చెదరు సంగంబుల♦జేర్చునొండు
తే॥ చెడిన రూపంబుఁ గ్రొత్తగాఁ♦జేర్చునొండు, వికలమగు నస్థు లతుకు మూ♦లికయు
దనరు సంజీవకరణి సం ♦ ధానకరణి, శస్త్ర సౌవర్ణకరణి వి♦ శల్యకరణి [ననఁగఁ
చ॥ త్రిదశులు క్షీరవారిధి మ ♦ థించిన యత్తఱిఁ బుట్టె నోషధుల్
పదిలము గాఁగ నుంచి రట♦ వారలు విష్ణువు ముక్ త్రిలోకముల్
పదములఁ గొల్చునాఁడు కడు ♦ భక్తిఁ బ్రదక్షిణ మేనుసేయు న
య్యదనున దాని తత్త్వము మ ♦ హర్షులు తెల్ప నెఱింగితిన్ సఖా!
ఉ॥ వానిని కాచువారు సుర ♦ వర్యులు పెక్కురు వారిఁ జక్రముం
బూనికఁగాచు నీవరిగి ♦ ప్రొద్దుదయింపక మున్నె తెచ్చుచో
భానుకులేశులుం బ్లవగ ♦ వర్గము జీవములొందు ధర్మముఁ
మూనుగ నూల్కొనున్ జగతి ♦ మూఁడును దైత్యకులంబు నావుడున్.

—: ఆంజనేయుండు సంజీవనిం దేఁబోవుట :—

మ॥ ఇది కర్తవ్యమ యింతలో రఘుకులా ♦ ధీశుండు తబ్బిబ్బు నం
గదయుం బొందకయుండఁ దేరుపుఁ డుమగి ♦ కాలంబు గాకుండఁ దె
చ్చెద దివ్యౌషధు లెట్టులేని యని పెం ♦ చెన్ దేహ మాకాశ మొ
ప్పిదమౌ శీర్షకభాతి దోఁపఁగ జగ ♦ ద్వీరుండు సామీరి తాన్. ౩౮౭

మ॥ గ్రహ ఋక్షంబులు తారహారముల వీఁ ♦ కందోఁచెఁ గ్రుంగారెఁ బా
దహతిం భూమి భుజాంతర ప్రథిమ సా ♦ ధ్యంబే ప్రమాణింపఁగన్ ?
గ్రహియింపందగె బాహువుల్ దిశల లం ♦ కాద్వీప మందింక నె
వ్వహిఁ దా రెండవ పాదముంపఁ దల మే♦పాటిం గనన్ లేదుగా ! ౩౮౮

ఉత్సా॥ వాలువంచి కేలుసాచి ♦ వాయి మడిచి పాదమున్
నేలనూని ఱొమ్ము విఱిచి ♦ నిక్కపొడువ రోమముల్
లీల మెడను ద్రుంచి రామ ♦ లీల నంస్తుతించుచున్
గాలి కొడుకు నింగి కెగసెఁ ♦ గామచారియై చనన్. ౩౮౯

ఉ॥ లంక పయోధి మున్గిన క ♦ లంబన నొప్పఁగ నుప్పరంబునన్
వంకలు చిన్నతిప్పలును ♦ పాదపముల్ వడితోడ లేచె ని
ర్వంకలఁ దూలి సంద్రమునఁ ♦ బడ్డది దేవ విమాన పంక్తి య
భ్రంకషమై మహాబ్ధి దిగి ♦ భంబుల బోరుకులార్చె నత్తఱిన్. ౩౯౦

చ॥ ఒఱగిన పూరువేగమున ♦ నుత్తర దిక్కునకున్ మహీధ్రముల్
శరదములుం గలంగెఁ దరు ♦ జాలము కానల మండె రాపిడిన్
గరువలియుం బయోధి వెను ♦ కంబడఁ జిత్తములున్ వెనుంబడన్
గురుగతి వాయుసూతి చనఁ♦గోయని యార్చిరి వేల్పు లుబ్బుచున్. ౩౯౧

మ॥ జలముజ్మండలి దాఁటి చంద్రపథమున్ ♦ సంధించి యుగ్రాంశు మం
డలమున్ మీఱి తరించి ఋక్షపథమున్ ♦ డాకొంచు దద్భోగ భూ
ములతో నబ్జజు లోకముం గడచి చూ ♦ పుల్ పోవఁగా రాని య
గ్గలికన్ మారుత నందనుండు చనియెన్♦గాకుత్స్థ కార్యార్థియై. ౩౯౨

సీ॥ వైనతేయుఁడు వడి♦వైకుంఠమున కేగు, వాఁడని కొందఱు♦పలికినారు
తెలిపిట్టపై నెక్కి♦నలువ స్వలోకంబు, నందువాఁడని కొంద♦ఱాడినారు
శూలిగాకున్న నీ♦లీల నెవ్వఁడు చనఁ, గలఁడని కొందఱు♦తలఁచినారు
తలఁచిన రూపంబు♦దాల్చి లీలలు సల్పు, వెన్నుఁడే యని కొంద♦ఱెన్నినారు
తే॥ బాగుగాఁ జూతమని కొంద♦ఱేగి వెంట, ననుసరింపఁజాలక వృథా♦యాసమంది
శ్రమణఁజని పునరావృత్తి♦రహితమైన, మోక్షపద మందువాఁడని♦మ్రొక్కినారు.

తే॥ రూపమున్నది యని జ్యోతి♦రూపమనుచు, జ్ఞానరూపుఁడనుచుఁ బర♦మానరూపుఁ
డనుచు సర్వకారణుఁడగు♦హరియటంచుఁ, బలువిధంబుల విజ్ఞులె♦తలఁచినారు.

తే॥ పరవి బ్రహ్మాండమెల్ల నం♦బరముగప్పి, నట్టి హనుమని వడిచేత♦నడరినట్టి
శబ్దయుత వాతమున దిగీ♦శాన శిరము, లల్లలాడె నజాండంబు♦తల్లడిల్లె. ౩౯౫

క॥ బలి ధారవోయ జగములఁ, గొలువఁగ హరి గొప్పరూపు♦గొన మునులును వే
ల్పులు సంతసిలిన తెఱఁగున, నలరిరి హనుమని మహోద♦యాకృతివలనన్ ౩౯౬

క॥ సుర సిద్ధ కింపురుష కి, న్నర విద్యాధరులు చల్లు♦ననలును గందం
బిరవార నెఱయ విరిసిన, హరిచందన మట్టులొప్పె♦హనుమంతుఁ డటన్ ౩౯౭

క॥ హిమవంతముఁ జేరఁగ నం, దమరిన తపసులును విబుధు♦లలరుచు నీకా
ర్యము ఫలియించుత మని రటఁ, బ్రమథవరుని నగముఁ గాంచి♦పావని యుబ్బెన్

క॥ ఈశాన్యాధీశుఁడు కై, లాసంబును గని కరంబు♦లను మొగిచిన యా
కీశవరుఁగాంచి ప్రేమా, వేశంబున నుమకుఁజూపి♦వేడుకపడుచున్. ౩౯౯

క॥ ఇతఁడేగుచేల యను నా, సతికి హరుఁడు రామ దూత ♦ సంజీవనికై
హితమతిఁ జనియెడు లంకా, పతి నాశము రేపుచూడఁ♦బదమా యనియెన్.

క॥ హరిచక్రమువలెఁ జనియెడి, కరువలికొడు కచటు కడచి ♦ త్రుణికంబగు కా
మ రతులఁ దనిసెడు సురగణ, మిరవుగొనిన హేమకూట ♦ శృంగము కాంచెన్.

క॥ మననునకు జ్ఞాననేత్రం, బునకు విధికి నందకుండు♦పొలమునఁజను పా
వని కనియెఁ బైని భువనము, లను గొలిచెడి కట్టినా న♦లరు కనకాద్రిన్. ౪౦౨

క॥ అనిమిషులేమియుఁ దోఁపక, కనుచుండఁగఁ గీశవరుఁడు♦కాంచనగిరిపైఁ
జని కనె నీదీవికిఁ బే, రెనయించిన జంబువును స ♦ మీప్సితమతియై ౪౦౩

ఆ॥ మేరుశిఖరమందు♦సౌరైన యజపురిఁ, గాంచి దాని నడుమఁ♦గనక పీఠి
నలరు నలువఁగాంచి♦యలరారు మనముతో, వందనంబు సేసె♦వాయు సుతుఁడు.

క॥ సురతరు వనమున భక్తులు, పరవశులై వినుతిసేయఁ♦బ్రణవ రవమునన్
హరి శ్రీభూ తరుణులతోఁ, దిరుఁడయి వెంచేయఁ గని ను♦తించుచు నవలన్.

తే॥ అంద యీశాన్యభాగంబు♦నందుకోటి, భానుసంకాశ ఘృణి భాస♦మానుఁడగుచు
భక్తు లర్చించు పూల కు♦ప్పలకు నడుమఁ, గ్రాలు భవ భవానులఁగాంచి♦ కేలు మోడ్చె.

తే॥ చంద్రువలెవెలిగొడుగుశీ♦ర్షమ్మునీఁద, వెలయ సుందరుల్ చామరల్♦వీచుచుండఁ
ద్రిదశు లలరి కొల్వఁగ నొప్పు♦ దేవ విభుని, కాంచి ముదమంది కేలెత్తి♦కడచిచనియె.

తే॥ విరిసియున్న కల్పకతరుల్♦వెలయ రుచిర, కాంతు లొప్పారు నిర్ఝరా♦గారమైన
కనకగిరి శిఖరమున ది♦క్పతులఁ గన్ను, లలరఁ గని యాంజనేయుండు♦హర్షమందె

—: ఆంజనేయుండు సంజీవనిం దేఁబోవుట :—

మ॥ ఇది కర్తవ్యము యింతలో రఘుకులా ♦ ధీశుండు తబ్బిబ్బు నం
గదయుం బొందకయుండఁ దేరుపుఁ డుమశీ ♦ కాలంబు గాకుండఁ దె
చ్చెద దివ్యౌషధు లెట్టులేని యని పెం ♦ చెన్ దేహ మాకాశ ము
ప్పిదపా శీర్షకభాతి దోఁపఁగ జగ ♦ ద్వీరుండు సామీరి తాన్. ౩౮౭
మ॥ గ్రహ ఋక్షంబులు తారహారముల వీఁ ♦ కందోఁచెఁ గ్రుంగారెఁ బా
దహతిం భూమి భుజాంతర ప్రథిమ సా ♦ ధ్యంబే ప్రమాణింపఁగన్?
గ్రహియింపందగె బాహువుల్ దిశల లం ♦ కాద్వీప మండింక నె
వ్వహిఁ దా రెండవ పాదముంపఁ దల మే♦పాటిం గనన్ లేదుగా! ౩౮౮
ఉత్సా॥ వాలువంచి కేలుసాచి ♦ వాయి మడిచి పాదమున్
నేలనూని ఱొమ్ము విఱిచి ♦ నిక్కవొడువ రోమముల్
లీల మెడను గ్రుంచి రామ ♦ లీల సంస్తుతించుచున్
గాలి కొడుకు నింగి కెగసెఁ ♦ గామచారియై చనన్. ౩౮౯
ఉ॥ లంక పయోధి మున్గిన క ♦ లంబన నొప్పఁగ నుప్పరంబునన్
వంకలు చిన్నతిప్పలును ♦ పాదపముల్ వడితోడ లేచె ని
ర్వంకలఁ దూలి సంద్రమునఁ ♦ బడ్డది దేవ విమాన పంక్తి య
ప్రభంకషమై మహాబ్ధి దిగి ♦ భంబుల బోరుకులార్చె నత్తఱిన్. ౩౯౦
చ॥ ఒఱగిన పూరువేగమున ♦ నుత్తర దిక్కునకున్ మహీధ్రముల్
శరదములుం గలంగెఁ దరు ♦ జాలము కానల మండె రాపిడిన్
గరువలియుం బయోధి పెను ♦ కంబడఁ జిత్తములున్ వెనుంబడన్
గురుగతి వాయుసూతి చనఁ♦గోయని యార్చిరి వేల్పు లుబ్బుచున్. ౩౯౧
మ॥ జలముజ్మండలి దాఁటి చంద్రపథమున్ ♦ సంధించి యుగ్రాంశు మం
డలమున్ మీఱి తరించి ఋక్షపథమున్ ♦ డాకొంచు దదూర్ధ్వగ భూ
ములతో నబ్జజు లోకముం గడచి చూ ♦ పుల్ పోవఁగారాని య
గ్గలికన్ మారుత నందనుండు చనియెన్♦గాకుత్స్థ కార్యార్థియై. ౩౯౨
సీ॥ వైనతేయుఁడు వడి♦వైకుంఠమున కేగు, వాఁడని కొందఱు♦పలికినారు
తెలిపిట్టపై నెక్కి♦నలువ స్వలోకంబు, నందువాఁడని కొంద♦ఱాడినారు
శూలిగాకున్న నీ♦లీల నెవ్వఁడు చనఁ, గలఁడని కొందఱు♦తలఁచినారు
తలఁచిన రూపంబు♦దాల్చి లీలలు సల్పు, వెన్నుఁడె యని కొంద♦ఱెన్నినారు
తే॥ బాగుగాఁ జూతమని కొంద♦ఱేగి వెంట, ననుసరింపఁజాలక వృథా♦యాసమంది
రమణఁజని పునరావృత్తి♦రహితమైన, మోక్షపద మందువాఁడని♦మ్రొక్కినారు,

తే॥ రూపమున్నదియని జ్యోతి♦రూపమనుచు, జ్ఞానరూపుఁడనుచుఁ బవ♦మానరూపుఁ
డనుచు సర్వకారణుఁడగు♦హరియటంచుఁ, బలువిధంబుల విజ్ఞులె♦తలఁచినారు.

తే॥ పరవి బ్రహ్మాండమెల్ల నం♦బరముగప్పి, నట్టి హనుమని వడిచేత♦నడరినట్టి
శబ్దయుత వాతమున దిగీ♦శాన శిరము, లల్లలాడె నజాండంబు♦తల్లడిల్లె. ౩౯౫

క॥ బలి ధారవోయ జగములఁ, గొలువఁగ హరి గొప్పరూపు♦గొన మునులును వే
ల్పులు సంతసిలిన తెఱఁగున, నలరిరి హనుమని మహోద♦యాకృతివలనన్ ౩౯౬

క॥ సుర సిద్ధ కింపురుష కి, న్నర విద్యాధరులు చల్లు♦ననలును గందం
బిరవార నెఱయ విరిసిన, హరిచందన మట్టులొప్పె♦హనుమంతుఁ డటన్ ౩౯౭

క॥ హిమవంతముఁ జేరఁగ నం, దమరిన తపసులును విబుధు♦లలరుచు నీకా
ర్యము ఫలియించుత మని రటఁ, బ్రమథవరుని నగముఁ గాంచి♦పావని యుబ్బెన్

క॥ ఈశాన్యాధీశుఁడు కై, లాసంబును గని కరంబు♦లను మొగిచిన యా
కీశవరుఁగాంచి ప్రేమా, వేశంబున నుమకుఁజూపె♦వేడుకపడుచున్. ౩౯౯

క॥ ఇతఁడేగుచేల యను నా, సతికి హరుఁడు రామ దూత ♦ సంజీవనికై
హితమతిఁ జనియెడు లంకా, పతి నాశము రేపుచూడఁ♦బదమా యనియెన్.

క॥ హరిచక్రమువలెఁ జనియెడి, కరువలికొడు కచటు కడచి ♦ క్షణికంబగు కా
మ రతులఁ దనిసెడు సురగణ, మిరవుగొనిన హేమకూట ♦ శృంగము గాంచెన్.

క॥ మనమునకు జ్ఞాననేత్రం, బునకు విధికి నందకుండు♦పొలమునఁజను పా
వని కనియెఁ బైని భువనము, లను గొలిచెడి కట్టినా న♦లరు కనకాద్రిన్. ౪౦౨

క॥ అనిమిషులేమియుఁ దోఁపక, కనుచుండఁగఁ గీశవరుఁడు♦కాంచనగిరిపైఁ
జని కనె నీదీవికిఁ జే, రెనయించిన జంబువును స ♦ మీప్సితమతియై ౪౦౩

ఆ॥ మేరుశిఖరమందు♦సౌరైన యజపురిఁ, గాంచి దాని నడుమఁ♦గనక పీఠి
నలరు నలువఁగాంచి♦యలరారు మనముతో, వందనంబు సేసె♦వాయు సుతుఁడు.

క॥ సురతరు వనమున భక్తులు, పరవశులై వినుతిసేయఁ♦బ్రణవ రవమునన్
హరి శ్రీభూ తరుణులతోఁ, దిరుఁడయి వేంచేయఁ గని ను♦తించుచు నవలన్.

తే॥ అంద యీశాన్యభాగంబు♦నందుకోటి, భానుసంకాశ ఘృణి భాస♦మానుఁడగుచు
భక్తు లర్చించు పూల కు♦ప్పలకు నడుమఁ, గ్రాలు భవ భవానులఁగాంచి♦ కేలు మోడ్చె.

తే॥ చంద్రువలె వెలిగొడుగుశీ♦ర్షమ్ము మీఁద, వెలయ సుందరుల్ చామరల్♦వీచుచుండఁ
ద్రిదశు లలరి కొల్వఁగ నొప్పు♦దేవ విభుని, గాంచి ముదమంది కేల్మోడ్చి♦కడచి చనియె.

తే॥ విరిసియున్న కల్పకతరుల్♦వెలయ రుచిర, కాంతు లొప్పారు నిర్ఝరా♦గారమైన
కనకగిరి శిఖరమున ది♦క్పతులఁ గన్న, లలరఁ గని యాంజనేయుండు♦హర్ష మందె

ఉ॥ మేరువుదాఁటి వైళమ స ♦ మీఱ కుమారకుఁ డుత్తరస్థలిన్
జేరి దినేశుఁ డస్తగతిఁ ♦ జెందమి నొక్కక్షణంబయేని రే
వాఱక యుంటఁ జేసి యది ♦ భానుఁడు పుట్టినకాఁ దలంచి దై
వాఱిన చింత మున్గెఁ దన ♦ పట్టిన కార్యము భంగమౌటకున్. ౩౦౯

ఉ॥ భూపతి మూర్ఛదేఱుటకు ♦ మున్నుగ నోషధు లిచ్చి లక్ష్మణున్
లేపగ నెంచి వచ్చితి మ ♦ లీమస బుద్ధిని పాడుచేసితిన్
రేపడు మున్నె మారుతి జ ♦ రీలున వచ్చున యంచుఁ గాచువా
రేపగిదిం జరింతు? నిఁక ♦ నెయ్యదికార్యము? సర్వముం జెడెన్. ౪౧౦

చ॥ అతుల వివేకశాలి యగు ♦ నాహనుమానుఁడు మానసంబునం
దతితర చింతనొందియు ర ♦ యంబునఁ దేఱి యుదీచియం దహ
ర్పతి యుదయించునే? కనక ♦ పర్వతమున్ రవి చుట్టునంచుఁ బం
డితులు వచింతు వారలని ♦ డెందము కుందు తొలంచె నత్తఱిన్. ౪౧౧

చ॥ మరణము లేక చింతయను ♦ మాటయు లేక సతంబు భోగమే
యురవుగనొప్పి యాలుమగ ♦ లొక్కశరీరమ యొంది ప్రేమ మో
గిరముగ నిష్టగోష్ఠిఁ దిల ♦ కించుచు జీవులు సంచరించు ను
త్తర కురు భూములం గనుచు ♦ దాఁటె మరుత్సుతుఁ డుగ్రవేగుఁడై.

తే॥ అటఁగపర్ది యు హారికమ ♦ లాసనుండు, నెలవుకొన యోగ్యమై త్యాగి ♦ నిశ్చలుండు
నైన ధర్మప్రభుని రాజ ♦ ధానిఁబోలు, పట్టనములఁ గాంచుచుఁబోయెఁ ♦ బవనసుతుఁడు.

తే॥ మేరువునకంటెఁ బొడవుగ ♦ మీఱి యజుని, పట్టముం గొనువాఁడును ♦ భవము లేని
వాఁడు నగు కపివీరుండు ♦ పోఁడిమిని త్రి, విక్రముని పోలు నీలాద్రి ♦ వెలయఁ గాంచె.

తే॥ ఇరులఁ జోతులు జిమ్ము న ♦ గ్గిరిని దాఁటి, జాంబవంతుఁడు తెలిపిన ♦ శైలమును మ
హౌషధీ దీప్తులను మింటి ♦ నధిక కాంతి, మంతముగఁ జేయు చిన్నియం ♦ బట్టి కాంచె

తే॥ కాంచి దిగె దిగినంత న ♦ క్కరువక్రుంగె, దానిఁ గాచు దేవతలును ♦ తటమటపడి
నిలుకఁ జెంది సన్నిధి నిల్చి ♦ నీవెవండ, విటకు వచ్చిన కారియ ♦ మేది? యనుడు.

ఉ॥ వచ్చిన కార్యముం త్రిదశ ♦ వంద్యుఁడు మారుతి సాలుమూల వా
క్రుచ్చిన వారలున్ మదిని ♦ కొంకక గైకొనిపోయి పిమ్మటన్
దెచ్చి యథాస్థితి న్నిలుపు ♦ ధీవర! యంచు నదృశ్యులౌ తఱిన్
దిచ్చుమొగంబు చెందెఁ బొడ ♦ తెంచి సుదర్శనమున్ రయంబునన్.

చ॥ ఉడుగక యోషధుల్ వెదకు ♦ చుండినఁ గాలము మీఱుఁ గార్యమున్
జెడు నటుగాన నీశిఖరిఁ ♦ జేకొని పోవుట యుత్తమంచు నె
వ్వడిఁ బెకలించి యెత్తికొని ♦ వాయుకుమారకుఁ డంబరస్థలిన్
బెడిదపు టమ్ముపోలెఁ గడు ♦ వేగమ ఱివ్వన వచ్చుచుండఁగన్. ౪౧౨

—: జాంబవ ద్విభీషణులఁ గాంచి రాముఁడు పరితపించుట :—

చ॥ వెరవరి జాంబవంతుఁడు వి ♦ వేకి విభీషణుఁ డేగుదెంచి దా
శరథి పదాంబుజంబు లెల ♦ సంబున నొత్తె నెలర్చె భామినీ
వర హృదయాంబుజాత మధు ♦ పమ్ములు సత్కరుణా స్వరూపముల్
వరదములుం బవిత్రములు ♦ పంకజసామ్యములైన నేత్రముల్. ౪౧౮

చ॥ కనుగవ నీరునించుచు వ ♦ గర్చెదు వారలఁ గాంచి నీవు పో
యిన పనిమేలె? జీవము వ ♦ హించెె? విభీషణ! బ్రహ్మపుత్ర! నీ
కును శుభమేకదా? సమసి ♦ కూలె నమస్తబలంబు తమ్మితో
నొనరుపఁ దగ్గదొండు తెరు♦వున్న వచింపుఁడు మీరు క్రచ్చఱన్.

చ॥ పుడమికుమారి వల్ల మతి ♦ పోయిన నాస్థితి చెప్పనేల? యీ
పుడమి కలంతకాలమును ♦ పోవని నిందను మోచినాఁడఁ ద
మ్ముఁడు నను మాయజింక యిది ♦ పోవలదన్నను నాఁడుదాని ప
ల్కుడపక పోవుటం గద వ♦హించితిఁ గూర్చితి నిన్ని చెట్టలున్. ౪౨౦

ఉ॥ రావణుఁగాంచి చేవను దు ♦ రం బొనరించితిఁ జంపనైతి నా
జీవములైన యిందఱకుఁ ♦ జేటొనఁగూర్చితి బొమ్మతూపుచే
రావణిఁ గూల్తునన్న నమ ♦ రస్థలి ధర్మముగాని పద్ధతిం
బోవకుమంచుఁ దమ్మునకుఁ ♦ బోయితి నడ్డము కీడు దెచ్చితిన్. ౪౨౧

ఉ॥ తమ్మునితోడ నుండక వె ♦ తారము దుర్విధి గూర్పఁబోలు న
న్నమ్ముల పూజసేయ నెడ ♦ కంపెను సోదరులెల్ల రాజి రం
గమ్మునఁ గూలి రింద్రజితు ♦ గండడఁగింపక లక్ష్మణుండు నా
కమ్మను చేరె నావెడఁగు ♦ కర్జము కూర్చె మహార్తి వీరికిన్. ౪౨౨

ఉ॥ ఇచ్చట నిట్టి పల్కు వచి ♦ యించుచు నిల్చు టపేక్షణీయమే?
ముచ్చల రావణాదులను ♦ పోర వధించి సురాలికిన్ ముదం
బచ్చుగఁ గూర్చి వారుకొను ♦ నయ్యది యెయ్యది లేదు వీరలన్
హెచ్చిన ప్రేమఁగూడ దివి ♦ కేగుటయే తగుఁ త్రోవ నాకగున్. ౪౨౩

ఉ॥ ఏటికి సీత? రాజ్యరమ ♦ యేటికి? నేఁటికిగీర్తి? ధర్మమిం
కేటికి? బంధు లేమిటికి? నేటికి ♦ శౌర్యము? సత్యమేటి కి
క్లేటికి? వాకి లేమిటికి? నేటికి ♦ సత్కృతు? లేల వైరముల్?
సాటి యొకింత లేని యను ♦ జన్ముఁడు స్వర్గము చేరు పిమ్మటన్. ౪౨౪

చ॥ నెనరు వినిష్ఫలంబు గన ♦ నెయ్యవుఁ దమ్ముఁడు లేని పిమ్మటన్
దనుజులనెల్లఁ బోకడచి ♦ దర్పము చూపుదునేని చౌర్య వం

చనములు గల్గువాఁడనై ని ♦ జం బగుదుర్ మజిరాదయేని బ
చ్చెనబొమనౌదు నిత్తఱిని ♦ జీవము వీడుటె యుక్తకార్యమా. ౪౨౫

ఉ॥ తండిరిఁ గోలుపోయి పెద ♦ తండ్రి యనందగు నజ్జటాయువుఫ్
దండకయందు కోలుపడి ♦ తమ్ముని మిత్రుల నక్కవాలికిం
గండగ నిచ్చి సౌఖ్యములఁ ♦ గామినితోఁ గొనెనంచుఁ గర్ణముల్
పుండయి పుచ్చి విచ్చి పురు♦వుల్ పడఁ దిట్టదె సాధులోకముఫ్. ౪౨౬

ఉ॥ తమ్ముఁడు లేక సీతఁ గొని ♦ ధారణినేల నయోధ్యకేగుచోఁ
దమ్ముని వీడివచ్చితె సు ♦ తా! యనుతల్లి సుమిత్ర మోము నే
నెమ్మొయిఁగాంచి యేమి వచి ♦ యింతును? రక్కసివాతఁ బెట్టితిం
బొమ్మని పల్కకంటె నసు♦వుల్ విడుటెంతయు మేల కాదొకో? ౪౨౭

తే॥ అనుచుఁ బలువిధంబుల నిట్టు♦లడలుచున్న, పుండరీకాక్షు జాంబవం♦తుండు కాంచి
దేవ! విలపించుచుండినఁ♦దెలివి మాయుఁ, దెన్నుదోఁపదు వినుమొక్క♦విన్నపంబు.

—: జాంబవంతుఁడు రాముని తేర్చుట :—

తే॥ అరిది సద్గుణావళులకు ♦ నాటపట్టు, వైన నీవు నిన్నెఱుఁగవు ♦ గాని నేను
నిన్ను మున్నె యెఱుంగుదుఁ♦దెన్నుదప్పి, సంభ్రమించిన సురల యా♦సలు నశించు.

ఆ॥ కదనమందు కీశ♦గణములఁ దమ్ముని, ప్రాణములను గొన్న♦ప్రదర మత్య
మోఘమైన యజుని ♦ ముఖ్యాస్త్ర మనియెడు, నాతలంపు నిజము ♦ నలిననేత్ర!

తే॥ పరఁగ బ్రహ్మాస్త్రమే యేయఁ♦బడునయేని, సమరమున దేవదానవ♦సమితినేని
చెలగియే తీరు నిన్నేమి♦చేయలేక, వదలినది యింతకంటె మో♦దదము గలదె?

తే॥ ధీరుఁడగు హనుమానుండు♦తెలివినంది, పసవుచో నది తగదని♦పంపినాఁడ
నోషధులు గొని తెచ్చుట♦కు త్తరమున, కాతఁడిప్పుడ వచ్చు నీ♦లాబ్దదేహ! ౪౩౧

తే॥ హిమగిరిని మేరువుం దాఁటి♦యేగియున్న, యాంజనేయుండు వచ్చిన♦యాక్షణమున
నీ మనశ్చింత లెల్లను♦నీఁగు నిజము, నిమున మూఁజడుమా! జగ♦న్నియతచరిత!

ఉ॥ మార జితాంగ! యేను నజ ♦ మాధవ శంభులు తక్క నెవ్వరుఫ్
దీరుగ నోషధి స్థితులఁ ♦ దెల్పఁగలేరు సుపర్వ దానవుల్
క్షీరపయోధిఁ ద్రచ్చుతఱిఁ ♦ జిక్కిన వానిని విష్ణుచక్రమే
వారక కాచుచుండు నవి ♦ వర్ధిలు నక్కురుభూమి కవ్వలఫ్. ౪౩౪

తే॥ ఇందనుక నేరిచే స్పృ శీ♦యింపఁబడవు, నలువకైనఁ బ్రాణము లీయఁ♦గలిగినయవి
పరఁగు సంజీవకరణి సౌ♦వర్ణకరణి, యన విశల్య సంధాన క♦రణు లనంగ. ౪౩౫

తే॥ ఓషధులు నిక్కముగ వచ్చు♦నుమ్మలికము,వదలు ధర్మమే ప్రోవచూ♦పంగ హనుమ
వచ్చుఁ దేగలఁ డతనికి♦వలనుపడని, పనియుఁ గలదే? యోచింపుమా! భవవినాశ!

తే॥ అనుడు శ్రీరామభూపతి♦యతని పలుకు, విని ముదంబందుచుండున♦త్తనె మహార
వం బుదీచిని పుట్టె సం♦ద్రంబు పొరలెఁ, జండమారుత మేతెంచె♦జవము మెఱయ.

తే॥ ఉడుగణంబులు వడిదప్పి♦యురలె సూర్య,మండలము పోయి ద్విజరాజ♦మండలమును
చేర నందలి జింక కృ♦శించె దగను, మొగుళ్ళు లొండొంటిఁ దేటుల♦ మొగిని తాఁకె

తే॥ వేళ్లు పూగుత్తులును విను♦వీథి కెగసె, భూధరమ్ములు మ్రాఁకులఁ♦మునుపటివలెఁ
గడలి లోఁబడె మారుతి గర్జనంబు, చేసె రామాదుల యెడంద♦చింత దొలఁగ.

ఆ॥ భువియు దివియు మేఘ♦ములు సాగరంబులు, తక్కినవియు నొక్క♦తరుణమందె
గొప్ప రవము చేయు♦కొమరున నుండెను, గాడ్పుపట్టి సేయు గర్జనంబు. ౪౪౦

ఆ॥ పాలవెల్లిఁ జిలుక♦వైకుంఠు నాజ్ఞ మం, దరముఁ దెచ్చుచున్న♦గరుడుకరణి
నొప్పె నురుజవమున♦నోషధీశైలంబుఁ, బరఁగఁ దెచ్చుచున్న♦వాయుసుతుఁడు.

ఆ॥ పవనుఁ డా త్రికూట♦పర్వతంబుఁ బెకల్చి, తెచ్చుకరణి హనుమ♦ తెచ్చెఁ దెచ్చె
ననుచునుండ నతఁడు♦నవనికి దిగియె న, మ్మల నభంబునంద♦నిలిచె దిగక. ౪౪౨

ఆ॥ మంద మారుతమ్ము♦మందులతో వీచి, యెల్లవారియెదలు♦పల్లవింప
భానుసుతునితోడ♦వానరావళి యార్చ్చ, నట్లుచేసె విబుధు♦లలరుచుండ. ౪౪౩

ఆ॥ విబుధ వినుతు లగుచు♦విందులై యుండిన, కపులు మందుగాలి♦కలయ వీవ
సొగసు చేవ దిటవు♦నెగడఁ గాలు జయించి, నక్కవాత మట్టి♦గ్రుక్కినారు.

ఆ॥ అసుర తనువు లెల్ల♦నంబుధిఁ బడుటచే, బ్రదుకవయ్యెఁ దక్క♦పడవలును చి
గిర్చి ప్రాణమొందఁ♦గీశుల విషయంబు, విప్పి చెప్పవలెనె♦విశద ఫణితి! ౪౪౫

ఆ॥ అలుఁగు లూడె గాయ♦ములు చల్లనై పూఁడెఁ, గలయ నేత్రతార♦కలు చలించె
జగము వినుతి సేయ♦సౌమిత్రి తెలివందెఁ, గూర్కునుండి మేలు♦కొన్నమాడ్కి.

ఆ॥ సప్త సాగరములు♦సంక్షోభ మందంగఁ, గపులు సేయు వీర♦గర్జనముల
లేచె లక్ష్మణుండు♦లేఖుల భద్రగీ, తముల లేచు శేష♦తల్పుభంగి. ౪౪౭

ఆ॥ లేచినట్టి యనుజు♦లేఁచిన భుజములఁ, గౌఁగిలించుకొన్న♦కంజ నయను
చింతతోడ సురల♦చింతయు జగముల, చింత తఱిగి విఱిగి♦చెదరిపోయె. ౪౪౮

క॥ చెన్నుగ నాడిరి వేలుపు, టన్నులు కిన్నరుల గీతి♦కా రవ మింపై
మిన్నలమె మునులు నిగమపుఁ, బన్నములు పఠించి రవని♦పండువు సేసెన్ ౪౪౯

క॥ వేదంబులు ఘోషించెను, వేదవిదుల విజ్ఞతయును♦వికసించెను స
మ్మోదము నొందె జగము సం, భోదము లంభోధు లుఱిమి♦పొలుపుం బొందెన్

క॥ కోల తొలఁగిన యాపిమ్మట, నలువశరము జానకీ మ ♦ న స్సదనునకున్
వలగొని కరుణించితివని, పలికి వినతిమై సదృశ్య ♦ భావమునందెన్ ౪౫౧

చ॥ ఎడఁద దురంత చింత నశి ♦ యింప ముదశ్రు పరీత నేత్రుఁడై
పుడమికుమారి భర్త కపి ♦ ముఖ్యుని వాయుతనూజుఁ గౌఁగిటన్
దడవి మదీయ వంశమును ♦ ధారణిలో యశమంద నిల్పి నా
యొడలిని విక్రయించికొని ♦ యుంటివి వేఱొకఁ డున్నె చేయఁగన్.

ఉ॥ మా కుల పూర్వులెల్లరు క్ర ♦ మంబునఁ బెంచిన ధర్మపద్ధతుల్
నాకతన న్నశింప మర ♦ ణంబె భజించితి మేము నీవ యి
క్ష్వాకుకులంబు నిల్పితివి ♦ ప్రాక్తన ధర్మములెల్ల నెక్కొనన్
నీ కరుణం బదంపడి జ ♦ నించిన వారము సుమ్ము పావనీ! ౧౫౩

ఉ॥ ప్రాణము పోవువేళ నొద ♦ వంగల పుణ్యులు తా మొసంగు నా
ప్రాణముతోడ వారలకుఁ ♦ బ్రత్యుపకారముచేత సామ్యమే?
ప్రాణము లిచ్చు మాత్ర మన ♦ భావ్యమె యిప్పని? ముందటన్ జగ
త్ప్రాణ కుమారకా! యరుల ♦ ప్రాణము లూడ్చితి దూఱు వోవఁగన్

ఉ॥ సోదరుమీఁది ప్రేమమున ♦ స్రుక్కితి లోక మెఱుంగ నిట్టి యా
మోదము నీవు గూర్చుటను ♦ ముందటి దుఃఖము మిక్కిలిన్ సుఖ
శ్రీదముగాఁ దలంతుఁ జిర ♦ జీవివి సాయము యుక్తవేళ నా
కాదటఁ గూర్చినాఁడ వటు ♦ లౌటనె నిల్చె జగంబు మేలిమిన్. ౧౫౫

ఉ॥ ఎల్లరు ప్రాణముల్ విడక ♦ యిమ్మగు సౌఖ్యము లందునట్లు మే
లుల్లసిలంగఁ జేసి తొక ♦ యుమ్మల మందక శాశ్వతుండవై
చెల్లుమ యంచుఁ బల్కెఁ గపి ♦ శేఖరు లుత్కట వీరనాద సో
ద్యల్లసితాస్యులైరి పవ ♦ నాత్మజుఁ డుబ్బున ప్రొక్కె యిట్లనున్. ౧౫౬

ఉ॥ తమ్ములవైరిఁ బిడ్చి యమ్ము ♦ తమ్మును తమ్మున కీయఁజాలనే?
క్రుమ్మి దివమ్ము నందమృత ♦ కుంభము దెచ్చి యొసంగఁజాలనే?
యిమ్ముగఁ బాలవెల్లి మథి ♦ యించి సుధం గొని తేరఁజాలనే?
బమ్మను పట్టి తెచ్చి తల ♦ వ్రాఁతను మార్పఁగఁజాలనే? ప్రభూ! ౧౫౭

చ॥ గురుతరమైన నీకరుణ ♦ గూడిన నియ్యది కార్యమే? యనన్
నిరవధి సత్త్వసంయుత వ ♦ నేచర సింహమ! యొంతకెంతకే
నరువాఁడవైన నీవు కల ♦ యంతకు నాపద మమ్ము చేరునే?
బెరసితిమేము సౌఖ్యములు ♦ పేరిమితోనని రాముఁ డాడఁగన్. ౧౫౮

చ॥ అతులితశౌర్యశాలి! పవ ♦ నాత్మజ! యిమ్ముల యింద యుండినన్
దితిజకులంబు చావదు వ ♦ ధింపనుచాలము కావునన్ యథా
స్థితి నట దీనినుంచి చను ♦ దేరుమ వైళమ యంచు భల్లుక
క్షితిపతి పల్కెఁ బావని వి ♦ శిష్టమతిం గొనితోఁగె శైలమున్. ౧౫౯

## ౨౪ హాలాపాన నటన పటలము (౨౧)

క॥ ఇట నిట్లు జరుగుచుండఁగ, నట రావణుఁ డుబ్బి కుతుక♦మంది వినోద
స్ఫుట హాలా జనిత విశం, కట యువతీ నటన లీలఁ♦గాంచుచు నుండెన్ ౪౬౦

తే॥ అమరకాంతలు విద్యాధ♦రాంగనలును, దైత్య వనితలు నాగ సుం♦దరులు యక్ష
మధురవాణులు సిద్ధ బం♦భర సువేణు, లెల్లఁ దెందేఁపలై వచ్చి♦రుల్లసిల్లి. ౪౬౧

తే॥ రంభయును తిలోత్తమయు నూ♦ర్వశియు మేన, కయు ఘృతాచియు బహువిధ ♦ కమ్ర నినద
వాద్యములతోడ లయరాగ♦భావ సరణి, చెడక పాడుచు నాట్యంబు♦చేసినారు.

చ॥ ప్రచలిత కుండలంబులు ప్ర ♦ భా తిలకంబులు లోలనేత్రముల్
విచికిల దంతముల్ మధుర ♦ పేశల క్రమ సుధాధరంబులున్
ప్రచుర మనోహరాలక వి ♦ భాసిత తన్ముఖ చంద్రబింబముల్
రుచిరముగా వెలింగె ముఖ ♦ రోచులు రాగము నొందుచుండఁగన్.

ఉ॥ తేటలు వాఱు చిర్నగవు ♦ తెల్పును భూమల లేఁతమొండయున్
మూటలుగట్టు దీప గణ ♦ ముల్ వెలిఁగింపఁగఁ జాలు మేని డా
ల్పాటులు జీరువాఱఁ గను ♦ వారల తెల్విని పోలి మీటుచున్
బాటలుగా నిరుల్ మరుల ♦ పాలయి క్రుంగఁగసాగె నయ్యెడన్. ౪౬౪

చ॥ చదువులచేత సత్ప్రథిని ♦ చాఁగుచు భావి నెఱుంగు పెద్దలన్
ముదమున నాశ్రయింప గుణ ♦ మున్ దెలివిం గడు విస్తరించు న
ప్పుదురున మీఁదు గాన కిల ♦ బ్రక్కలఁబైఁ బ్రసరింపఁజేయు దు
ర్మదుల పరాక్రమంబు వలె ♦ మైకము నెవ్వడిఁ బర్వె నెల్లెడన్. ౪౬౫

ఉ॥ నవ్వులు మించె దంతముల ♦ నాణెము వెల్వడె స్వేదబిందువుల్
మవ్వముగా నెలర్చె లఘి ♦ మంబుగ వాతెఱలుం జలించె నే
నివ్వటిలెం గనుంగొనల ♦ నీటగు రక్తిమ నిక్కఁ గన్బొమల్
కవ్వికొనెన్ మొగంబులను ♦ గాటపుఁ దెల్లఁదనంబు వారికిన్. ౪౬౬

చ॥ తలముడులెల్ల వీడుచు ని ♦ తంబములం దగదాఁటి వ్రేల మే
ఖలలు పటాలితోడుత ది ♦ గంబడ మానముఁగాచెఁ గేశముల్
తులువలు దుండగంబులకుఁ ♦ దూకొన నుత్తము లడ్డువచ్చి దీ
నుల కగు బన్నముల్ తొలఁగ ♦ నూకఁదలంచుట యుక్తమేకదా ?,

తే॥ మదన మృగయుండు పొది నుంచు♦ప్రదరమనఁగఁ, దగిన కన్నులతో నున్న♦ మగువ లప్పుడు
శ్రుతిని కలియక వెఱ్ఱిప♦ద్ధతులతోడఁ, బాడి రవ లయతో నప♦స్వరముతోడ.

తే॥ వేణునాదంబును జయించు♦విమలరవము, గలుగు చెలువలు పాటల♦గతులుదప్పి
కాకి యఱపుతో సుధయందు♦కల్లుచేర్చు, తీరు తోఁపంగఁ బాడిరి♦ తెలివిచెడఁగ.
తే॥ కాంచ నింద్రజాలమె యను♦కరణిఁదోఁచు, భావ విస్ఫూర్తి నభినయ♦పద్ధతులను
తెలుపు జాణలు నోటితో♦ద్విపముఁ బలికి, తేరు కరములతోఁ జూపు♦వారలైరి.
తే॥ ఆడుదురు పాడుదురు నవ్వి♦యేడుతురును,తూలఁదురుసోలుదురుచాలఁ బ్రేలుదురును
సీలుగుదురు తూఁగుదురును♦మూలుగుదురు, మ్రొక్కుదురు స్రుక్కుదురు మీఱి♦
నిక్కుదురును.
తే॥ మదిని గలదాని నంతయు♦మఱుఁగుపఱుప, లేక వెలిఁగ్రక్కినారలు♦లేమ లట్టి
తెఱఁగుఁగాంచి నిల్చిన జితేం♦ద్రియుల రోమ, కూపముల నెల్ల మదనుల♦కోఁగు లడరె.
చ॥ భ్రమరములంబలెం జలన ♦ భావము నొందెడు కన్నులెఱ్ఱనై
యమరెను రక్తిమంబగు ము ♦ ఖాంబుజముల్ తెలుపొంద దైత్య వం
శమునకు భావినాశమును ♦ జాడఁగఁ దెల్పెడిపోల్కిఁ గన్పడెన్
ద్రుమ మొకటైనఁ బుష్పనికు ♦ రుంబను వేఱుగఁ బూచెనో యనన్.
తే॥ యముని కుంతంబు మదనుని♦యలుఁగు నుపమ, గాఁగఁ జెప్పిన నొప్పని♦కన్నులుగల
చెలులు హారంబులను రశ♦నలను వస్త్ర, ములను కొప్పులలోపల♦ముడిచికొనిరి.
తే॥ మందహాసరుచుల్ గల♦మందగమన, లిట్టి గతులొందఁ గని మోద♦మొనయుచున్న
రావణాసురు శ్రవణరం♦ధ్రములఁ జొచ్చెఁ, గపి సమూహంబు చేసిన కలకలంబు.
తే॥ పాట లాటలు కేకలు♦వాద్యరవము, లలుక లూఱటల్ కొతుకు మా♦టలు కటాక్ష
ములును తక్కుచేష్టలు బలి♦ముఖుల గర్జ, వలన వేఁడికిఁ బువులట్లు♦వాడిముడిఁగె.
తే॥ కట్టుఁగంబములందె నా♦గములు సోల, వాజులుం దూల నసురుల♦పసిమి మాల
రామలక్ష్మణ శింజినీ♦రావ మడరె, వార్ధిఁ ద్రచ్చిన నాఁటి ర♦వంబుకరణి. ౪౭౭
చ॥ తరుణుల కూటముల్ కపి క ♦ దంబమువోలెఁ గనంబడంగ మం
దరము కలంప నొప్పు భయ ♦ దంబగు నంద్రమునాఁగ మానసం
బఱిముఱి సెంద నత్తఱి ని ♦ శాంతమ యయ్యె దశాస్యమోము చం
దురునకుఁ ద్రోవరానిదయి ♦ తోఁచెను పట్టపగ ల్విధంబునన్. ౪౭౮
చ॥ విసవిస బంభరాకృతిని ♦ వేగులు వచ్చి దశాస్య కంఠ పు
ష్ప సరము లందుచేరి పగ ♦ వారలు ప్రాణములొంది చాల నం
తసమున నున్నవా రన నె ♦ డం దిగులొంది లతాంత శయ్యపై
మసలుట మాని తత్తఱను ♦ మంత్ర నిశాంతము చేరె గ్రక్కునన్. ౪౭౯

౨౫ మాయాసీతా పటలము (౯౭)

తే॥ చేరి వృద్ధులాప్తులు నింద్ర♦జితుఁడు సైన్య, పతులు విన జరిగినదెల్లఁ♦బలుకునంత
మాల్యవంతుండు చింతమై♦మనసువాడఁ, దెలిపె నిట్లు రావణునకు♦ధీరమతిని.

చ॥ చెడు తలఁపూని దానవులఁ♦జెచ్చెర నంబుధి వైవకున్న ని
య్యెడ ననువుల్ నిజంబుగ వ ♦ హించియె యుందుసు తప్పె నీదు దుం
దుడుకునఁ బంకజాసనుని ♦ తూపె నిరర్థకమాట వానరుల్
కడఁకొని పైపయిం దొడరఁ ♦ గా నొకయద్దును లేదు రావణా! ౪౮౧

చ॥ కలఁక యొకింత గానని జ ♦ గత్పరిపాలు కటాక్షదృష్టిచేఁ
జెలంగి క్షణంబులోనఁ జని♦చేవ మహౌషధి భూధరేంద్రముఁ
బలిమిఁ బెకల్చి తెచ్చిన య ♦ వార్యబలుండు మరుత్సుతుండె కా
వలయును తక్కువారలకుఁ ♦ బల్కఁ దలంప నొనర్ప శక్యమే? ౪౮౨

చ॥ మలఁగొని పోయినట్టి యల ♦ మారుతి మేరు ధరాధరంబు ని
ట్టలముగఁ దెచ్చి వైచిన న ♦ డంగమె? లంకను కెల్లగించి భూ
స్థలిఁ దిరుగంగ వైచిన ని ♦ శాచర వర్గము సిల్వనేర్చునే?
ములుచఁదనంబు మాని తల♦ పోయుట కార్యము నిర్జరాంతకా!. ౪౮౩

చ॥ జగముల నెల్ల నొక్కపరి ♦ చావఁగ మోఁదఁగఁ జాలువాఁడు సా
ధుగుణమునం ద్రిమూర్తులకుఁ ♦ దోడుగ నాల్గవమూర్తియంచు నెం
చఁగఁ దగువాఁడు మారుతి ని ♦ జంబిఁకఁ జావకయున్నవారలఁ
నెగడఁగఁ జూచుటల్ తగవు ♦ నెమ్మది నీవ తలంచిచూడుమా. ౪౮౪

శా॥ వాలిం గూలఁగనేసి గొప్ప జలధిఁ ♦ బంధించి లంకాపురీ-
గాలుంబోలిన కుంభకర్ణు ననిలో ♦ ఖండించు శ్రీరామ భూ
పాలుఁ బుద్బుద సన్నిభుల్ దనుజు ♦ లా? బాధించి చక్కాడు వా
రేలా యీ యడియాస? రాఘవునకుం ♦ బృథ్వీజ నర్పింపుమా. ౪౮౫

చ॥ పొలిసిరి వార్ధిఁద్రావి దివి ♦ భూమిని పేర్చి వహింపఁజాలు శూ
రులు; రణధాత్రినుండి యసు ♦ రుల్ చనుదెంచినవారు నీవు నీ
తొలమి సుతుండు దక్క మఱి ♦ యెవ్వరు? గెల్చుట సున్న! వట్టి యా
సలఁబడి ప్రాణముల్ విడువఁ ♦ జాఁగుట యెన్నఁగ శూరకార్యమే?.

చ॥ అనుటయుఁ బంక్తికంఠుఁడు భ ♦ యంకరరీతి నదల్చి నీదు వి
న్ననువులు మేలుమేలు పలు ♦ కాడకు రాక్షసులెల్లఁ గూలినఁ
బనుపడకుండఁ గైదువులు ♦ వ్యర్థములైనను నాసికాగ్రమం
దనువుగ నావి యున్న వఱ ♦ కంబుజనేత్ర నొసంగ నెట్టులుఁ. ౪౮౭

ఉ॥ జీవితముల్ వినాశమొగిఁ ♦ జేసికొనఁ ధరణీతనూజ న
త్యావిలబుద్ధిఁ దేను మది ♦ నవ్యయ సౌఖ్యము లందఁగోరియే
యీవగఁ దెచ్చితిఁ బ్రదుక ♦ నిచ్చయె యున్న నిరర్థకంబులౌ
జీవితముల్ భరించుచు వ ♦ సింపుఁడు నేన జయింతు నెల్లరఁ. ౪౮౮

చ॥ అనుడుఁ గుమారుఁ డిట్టులను ♦ నబ్జభవాన్వయ వార్ధిచంద్రమా!
విను మొకమాట యేను రఘు ♦ వీరుఁడు తక్కఁగఁ దక్కువారిపై
వనజభవాస్త్రముల్ విడుచు ♦ వాఁడను కానది వాని దేహముల్
జెనకకయే తొలంగినది ♦ చిత్రము దీనిఁ దలంపఁగా నగుల్. ౪౮౯

ఉ॥ తీరుగఁ జర్చసేయ నిది ♦ తేలికగాదు రఘుప్రభుం డసా
ధారణ మానవుండు పిన ♦ తండ్రి వచించిన గర్వ మోహ ని
స్తారులు యోగు లెల్లపుడు ♦ ధ్యానము సేయుచునుండు నా జగ
త్కారకుఁడే యటంచుఁ గొతు ♦ కం బనిలేక యెఱుంగనయ్యెడిల్.

చ॥ అది యటులుండని మ్మరుగ ♦ నైనది యైనది చింతయేల? నీ
మది ప్రమదంబు నొంద నొక ♦ మార్గము చూతు నికుంభిలాస్థలిల్
గుదిరిక నొక్కవేలిమిని ♦ కూరిచి పూర్తియొనర్తు దుర్గుణా
స్పదుఁడు విభీషణుం డెఱుఁగ ♦ భంగము సేయున యంచుఁ గుండెదల్.

సీ॥ ఐన విభీషణుఁ♦డరయకుండెడు భంగి, సీత యాకృతి యొండు♦సృష్టిచేసి
యువతీస్థితిం గాంచి ♦ యున్నతి నందిన, హనుమంతు నెదుట దా ♦ నిని వధించి
పరఁగ నయోధ్యపై♦కరుగుచుంటిన యని, పలుక వారలు ప్రమాను♦పడి యలంగు
వారు జానకి చచ్చె♦ఫలమేమి యుండని, తమ్ములు హితులు బాం♦ధవులు పురము
తే॥ తెరలి నాశమొందున యని♦మరలువారు, మరలకున్నను హనుమంతుఁ♦బురికిఁ బంపి
యెఱుఁగు దాఁక దుఃఖముభరి♦యింపలేర, యంతలో నాదు వేలిమి♦నట ముగింతు.

చ॥ ముగిసినయంత వచ్చి కపి ♦ ముఖ్యుల రాఘవులల్ వధించి నీ
కు గెలుపు గూర్తునంచుఁ దన ♦ కూరిమి పుత్త్రుఁడు పల్క సంతసం
బు గలుగఁ బంక్తికంఠుఁ డను ♦ మోదము చూపెను మేఘనాదుఁడుల్
జిగమిష మాయసీతను సృ ♦ జింపఁగ నుత్తరువందె నంతటల్. ౪౯౩

## —: వానరులు లంకం గాల్చుట :—

మ॥ అట సుగ్రీవుఁడు రాఘవుం గని మహా ♦ త్మా! దైత్యు లున్నట్టి యీ
పుటభేదంబు దహింపఁగావలయు నా ♦ మోదంబు చూపింపవే
యటులైనల్ రిపురాజి వచ్చునన గం ♦ జాక్షుండు యోచించి కా
ల్చుటయే యొప్పని యాజ్ఞయీయఁ బ్లవగుల్♦కోలాహలోత్సాహులై.

మ॥ కొఱవుల్ చేకొని తన్మయంబుగ రణ ♦ క్షోణీ తలంబెల్ల నొ
త్తరమై కన్పడనేగి దైత్యనగర ♦ ద్వారంబున న్నిల్చి వీ
చిరి శంపాలతపోల్కి నుల్కలటు ల ♦ చ్ఛిద్రంబులై యెల్లచో
వఱలెల్ దైత్య వినాశసూచకముగా ♦ వారింపరాకుండఁగల్. ౪౯౫

ఉ॥ లంకను కీశు లేసిన య ♦ లాతము లెల్లెడఁబర్వె మున్న నా
యంకుఁడు వార్ధిపైఁ బఱపు ♦ నగ్ని శరంబు విధాన రేఁగి న
ల్వంకలఁ గాల్చెఁ బక్షుల ర ♦ వంబులు దానవకోటి కూకలున్
సంకటపాటులుం దెలుప♦శక్యమె ? కోఁతులు పిక్కులై చనన్. ౪౯౭

మ॥ ఒక ప్రాన్ద్రిమ్మరి మున్నువచ్చి యొగి ని ♦ య్యూరెల్ల, దుర్వార వ
హ్నికి నాహారము సేసిపోయె నివుడో ♦ యున్నంచుఁ దెల్పంగ లె
క్కకు రానట్టి వలీముఖావళులు లం ♦ కం జొచ్చె నింకెట్లు చా
వక జీవించెడు వారమంచు భయ ది ♦ గ్భ్రాంతాత్ములై రందఱున్.

ఆ॥ లోక వినుతుఁడైన♦కాకుత్స్థ తిలకుండు, వహ్ను లుమియు బాణ♦వర్గమేయ
గోపురంబు విఱిగి ♦ కూలి త్రికూటంబు, పైనిఁబడియెఁ గపులు ♦ ప్రమదమంద.

తే॥ మందు మలఁ గొనిపోయిన ♦ మారుతి వడి, వచ్చి కంఠీరవ రవంబు♦ వఱలఁజేయ
విన్న లంక గరుడపక్ష ♦ భీషణరుతి, వినిన నాగలోకస్థితి.♦ నెనసె నపుడు. ౪౯౯

శా॥ మాయాకార్య విశారదుండు జముతో ♦ మాఱొడ్డి గెల్పొందు దై
తేయేంద్రాత్మజుఁ డుద్ధతుండయి మరు ♦ ద్వీథిన్ మహారంభుఁడై
మాయాజానకి కొప్పు వట్టికొని భీ ♦ మప్రౌఢి ఖడ్గంబుచే
వ్యాయామంబు వెలుంగఁ దివ్వుచు జగ ♦ త్ప్రాణాత్మజున్ డాయుచున్.

శా॥ మీరీ జానకికై దురంబు కడుఁజే ♦ ద్శ్రం జేయుచున్నారు ర
క్షోరాజన్యుఁ డుపేక్షచే విడిన నీ ♦ క్రూరాత్మ నేఁజంపెదన్
దీరున్ సర్వము మీకు మాకు నన భీ ♦ తిన్ వాయుపుత్త్రుండు మా
యారంభంబులు సర్వముం జెడియె నేఁ ♦ డంచున్ మదిన్ స్రుక్కుచున్.

శా॥ తప్పింపంగ నుపాయమేదియును చి ♦ త్తంబందు కన్పట్టమిన్
నిప్పుం ద్రొక్కిన రీతిఁ దత్తఱిలి స ♦ న్నీతిం బ్రశంసించు లే
యొప్పంబోలు నటంచు నిట్టులను గ ♦ ణ్యోదార ! యీపద్ధతుల్
మెప్పా! నీతియొ? యోగ్యమో? తగవొ? మే♦ల్మింగూర్చునో? తెల్పుమా?

మ॥ అరవిందాసన వంశ్యుఁడై సకల శా♦స్త్రార్థంబుల న్నేర్చి యీ
కరణిన్ స్త్రీని వధించుటల్ పరమ దు ♦ ష్కార్యంబుగా నేర్వవో?
ధరణీ వ్యోమములే వడంకునవి చి ♦ త్తంబందు భావింపవో?
కరుణన్ దీనిని మానితేని కని లో ♦ కంబెల్లఁ గీర్తింపదే? ౫౦౩

మ॥ కరుణాదూరత యేల? వంశ గురుతల్ ♦ కాలుష్యముం జెందు దు
ర్భరమౌ నింద వహింతు నైచ్య మబలన్ ♦ బాధించి చక్కాడుటల్
స్థిరమౌ కీర్తి నశించు రౌరవము ప్రా ♦ ప్తించున్ మహాపాతకం
బురవే సేయఁగ రాచపుట్టువునకున్ ♦ యోచింపుమా రావణీ! ౫౦౪

మ॥ అన నా రావణి నవ్వి యిట్టులనుఁ బ్ర ♦ వ్యాదుల్ సుఖంబంద నా
ప్పని పేరాసల నొందు దుర్మతులు గీ ♦ ర్వాణుల్ నిరాశం జనన్
దనుజవ్రాతము తండ్రియుం జెడఁగ నా ♦ ద్యంబైన బీజంబు దీ
నిని వేఁటాడుటకంటె నన్నమగు పుం♦ న్నెంబున్న యొడ్డై యిలన్.

శా॥ ఈ రే తెంచిన చేత ద్రుళ్లినది నేఁ ♦ డే మీఁ యయోధ్యన్ సుదు
ర్వార క్రోధము మీఱఁ గాల్చెదను కా ♦ వన్ శక్యమైయున్న నా
నారాచంబుల పాలుగాక ధరణీ ♦ నాథానుజుల్ తల్లులున్
బౌరుల్ జీవిత మందఁ జూచుకొనుఁడీ ♦ వాగ్వాద మింకేటికిన్ ? ౧౦౬

:— ఇంద్రజిత్తు మాయాసీత తలఁదఱుఁగుట :—

తే॥ ఇపుడ యీపుష్పకంబున♦నేగువాఁడఁ, బ్రార్థనమున ఫలములేదు♦ప్లవగ ! నీచ !
సకలలోకంబు లెదురైన♦నగ్గువాఁడ, నే ? యనుచు సీత కంఠంబు♦నేయఁ దిరిగి.

క॥ కరుణింపుము నజికకు మని, తరుణియుఁ బ్రార్థించుచుండ♦దయగొనక నిశా
చరుఁడు సరాలునఁ గైతవ, ధరణిజ శిర ముత్తరించి♦తటుకునఁ జనియెన్. ౧౦౮

తే॥ తెరలి పుష్పక మెక్కి యు♦దీచి దిశకు, నింద్రజితుఁ డరుగఁగఁ దపి♦యించి హనుమ
పృథివిఁ బడియెను వజ్ర ప్ర♦భిన్నశైల, లీల సర్వచేష్ట లుడిగి♦తూలి సోలి. ౧౦౯

తే॥ పోయినట్టులె పోయి యా♦పుణ్యజనుఁడు, మరలి చేరి నికుంభిల♦మఖము సేయ
మనసు సురుఁగంగ మారుతి♦మాఁడి వాడి, కలఁగి మలఁగి నలఁగి తేఱి♦పలవరించె.

మాలిని॥ బలముచెడఁ గృశించున్ ♦ భామినీ దీపమంచున్
దలరి మదిఁ గలంచున్ ♦ దైవమే లేదె యంచున్
తలఁచి తలఁచి యూర్పుం ♦ దల్లి యంచంగలార్పున్
అలఁగి దెసలఁ గాంచున్ ♦ హా చెడెం గార్యమంచున్ ౧౧౧

క॥ కింకగొని యసురపై బడ, నుంకించును వగపుత్రోవ♦నుర్విం గూలున్
శంకగొను జంకు వడఁకుఁ ద, లంకుం దలమోఁదికొను ని♦లంబడి పొరలున్.

తే॥మా కతలుముగిసినవి ము♦ల్లోకములకుఁ, దమము తొలఁగినదని మదిఁ♦దలఁచునంత
మరల నిసివచ్చె దుష్ట క♦ర్మములు ప్రబలెఁ, జెనఁటి కత్తిచే లక్ష్మిని♦తునిమె నకట !

శా॥ కారాగారమునం దగుల్వడిన లో ♦ క ప్రార్థ్య సౌజన్య లం
కా రక్షోధిపునుండి వీడ్వఱచు వీఁ ♦ కన్ వచ్చి శోకంపుఁ గీ
కారణ్యంబున నేఁ దగుల్వడితిఁ బా ♦ పాత్ముండు వై దేహి న
ట్లారాటింపఁగఁ జూచుచుండితిఁ గదా ♦ వ్యర్థుండనై బిమ్మిటిన్. ౧౧౪

చ॥ పరమ తపస్వినిన్ ముగుదఁ ♦ బావన నన్నులమిన్న జానకిన్
కౌఁగి విడిపింపగా నిటకుఁ ♦ జేరినవాఁడను కాను దానవా

త్కరముల నాజిలోఁ దునుమఁ ♦ గాఁ జనుదెంచిన వాఁడఁగాను దు
ర్మరణము తల్లి యొందఁ బవ ♦ రంబున కిందఱఁ దోడి తెచ్చితిన్. ౧౦౧

ఉ॥ జానకిఁ గానలందు కనఁ ♦ జాలక చింతిలుచున్న రామ భూ
జానికి లంకలో జనక ♦ జాతను జూచితినంచుఁ బల్కి స
మ్మానము నొందు నోటనె కు ♦ మారుఁడు రావణి చంపఁజచ్చె నం
చేనె వచింపఁగా వలసె ♦ నేటికిఁ గాల్పని నాదు జన్మమున్ ?. ౧౦౨

చ॥ కడలిని దాఁటి లంక నొగిఁ ♦ గాలిచి సేతువుగట్టి మేరువుం
గడచి మహౌషధీ శిఖరి ♦ గౌరవమారఁగఁ దెచ్చి నీసముల్
పుడమిని లేరు లేరనెడి ♦ భూరి యశంబు గడించినట్టి నా
యుడిగము బీఱు వోయెను ప ♦ యోనిధి నింగువ గల్పు కైవడిన్. ౧౦౩

ఉ॥ సీతను కత్తిచేఁ దునుము ♦ చెన్నటి నప్పుడ చంపనైతి న
బ్జాతముఖిన్ సమక్షమునఁ ♦ జంపుచునుండఁగఁ జూచుచుంటి నీ
పాతక జీవితంబు నెడఁ ♦ బాయఁగ జంకుచు నుంటి నింక నా
నీతకముల్ జగంబులు గ ♦ ణించి హసింపకయున్నె ? యక్కటా!. ౧౦౪

మ॥ అని చింతించుచు రావణాత్మజుఁ డయో ♦ ధ్యాపట్టణం బేర్పఁగాఁ
జనియెన్ వానిని వెంబడించిన రఘు ♦ క్ష్మాభర్త నాజాడ యే
మిని కాన్పింపమి నేమిగా వగచునో ? మీఁదేమి కానున్నదో ?
కనకున్నాఁడను తెల్పఁగాఁజనుటె యో ♦ గ్యంబైన కార్యంబగున్. ౧౦౫

చ॥ జరిగినదెల్లఁ దెల్పెదను ♦ జానకిభర్తకు నాతఁ డయ్యెడన్
మరణము నొందునేని యట ♦ మాఁడెద నట్టులు కాక యాతఁడే
కరణి వచించు నానరణిఁ ♦ గార్య మొనర్చెద రిత్తచింత నే
నొరయుట యేల ? యంచిన కు♦లోత్తము చెంగట వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ వ్రాలి తపించి మానసము ♦ ప్రాణము దేహము వాడ నూర్చుచున్
సోలుచుఁ దూలుచున్ మిగుల ♦ స్రుక్కుచు వెక్కుచు నేలఁగూల నం
శీలుఁడు రాముఁ డాతనిని ♦ చేరఁగఁజేరి వచింపుమయ్య ! యి
ట్లేల తపింప ? హేతువది♦యెయ్యదొ గొప్పది యుండు మారుతీ ! ౧౦౭

చ॥ నుడువుమ యన్న నాతఁడు క ♦ నుంగవ నశ్రులు గ్రమ్మ మేఘ నా
దుఁడు జనకాత్మజ న్నఱకి ♦ త్రోచెన యంచు వచించి యాపయిన్
నుడువ కొడల్ గదల్పక క ♦ నుంగవ యార్పక యూర్పువుచ్చ కు
గ్గడువగు చింతనొంది యొక♦కైవడి మ్రాన్పడి యుండె నత్తతిన్. ౧౦౮

ఉ॥ ఆ పలుకుల్ చెవింబడిన ♦ యంతనె కీశవరేణ్యు లెల్లరున్
రాపడి వాతఘాతమున ♦ మ్రాఁకులు గూలినయట్లు రామ దా

మా! పరమాత్మ! యేదిగతి ♦ మాకని రాముని పాదసన్నిధిన్
దాపముచేత బెగ్గిలి వి ♦ తాకునఁ గూలిరి ధారణీస్థలిన్. ౫౩

ఉ॥ చిత్రమువోలె సూర్యకుల ♦ శేఖరుఁ డొక్క క్షణంబు నిల్చి సౌ
మిత్రికి మాఱుపల్కడక ♦ మిత్రులఁ జూడక మత్తుఁడేనియున్
ధాత్రిని నుంతయైన మదిఁ ♦ దాళఁగలే నభిమాన మక్కనం
దోత్రము మాడ్కఁగ్రుమ్మ నసి ♦ దూలి ధరాస్థలి వ్రాలె గ్రక్కునన్.

ఉ॥ అగ్రజు చింతఁగాంచి తమ ♦ కైన సుదుస్థితిఁ గాంచి కార్య మ
వ్యగ్రతనుండి యిమ్మవడి ♦ వచ్చియు నాశము చెందఁగాంచి వీ
రాగ్రణి లక్ష్మణుండు హృద ♦ యంబును మేనును వాడఁ దల్లి ప్ర
త్యగ్రత వీడు క్రేపువలె ♦ నారటమందుచు వ్రాలె మేదినిన్. ౫౫

చ॥ మదిని విమర్శపైఁ బ్రతి వి ♦ మర్శ యొనర్చి విభీషణుండు త
న్నెద కుదియింప నార్తిగొని ♦ యేమియుఁ దోఁపక గెల్పులేమి దు
ర్మదుఁడగు మేఘనాదుఁడు ధ ♦ రాసుతచే దనుజాలికెల్ల నా
పద ఘటియించె నంచుఁ గర ♦ వాలునఁ ద్రుంచెనో యంచు జంకుచున్.

ఉ॥ చల్లనినీరు మోముపయిఁ ♦ జల్లి పదంబులు మేను నొత్తఁగా
మెల్లనఁ గన్నువిచ్చి రఘు ♦ మేదినినాథుఁడు చూచి లక్ష్మణుం
డుల్లము నంచలింప నన ♦ నొయ్యనఁ గాంచి యితండు జీవముల్
తెల్లము వీడుపాఁ డనుచుఁ ♦ దేర్పఁదలంచి సహించి యిట్లనున్. ౫౭

ఉ॥ అల్పులు దెప్పరంబు తఱి ♦ నార్తిని గ్రుంగి కృశించువార ల
య్యల్పవిధంబు నీకుఁ దగు ♦ నా? పగవారలు నవ్వఁ జిత్త నం
కల్పము మాని యన్యయపు ♦ గౌరవముం దిగనాడి ధర్మపుం
బొల్పును వీడి యిట్లు దిట ♦ ముంజెడఁ జింతిలఁగాదు రాఘవా!. ౫౮

మ॥ అనహాయన్ బతిదేవతన్ సుజన లో ♦ కారాధ్య వైదేహి నొ
క్కనురుం డంటి వధించె నంచు నిటు శో ♦ కాక్రాంత చిత్తుండవై
మసలంజెల్లునె? యక్ష నాగ మఖభు ♦ క్సామీంద్రు లైరేనియున్
వసుధన్ సజ్జన హింససేయ వడి న ♦ వ్వారిన్ వధింపందగున్. ౫౯

మ॥ జగముల్ చేడ్పడకుండుటా? దనుజ దా ♦ ర్జన్యంబు లిల్లేచుటా?
నిగమ వ్యాపృతి సాగుటా? తగవు పు ♦ న్నెంబుల్ ధర న్నిల్చుటా?
తెగి సాధుల్ నశియించుటా? మనము నా ♦ ర్తింగుంది శోకించుటా?
పగవారల్ బ్రదుకొందఁగా మన ధను ♦ ష్పాండిత్య ముక్కాఱుటా?

మ॥ త్రుటిలో లంకను బూదిచేసి దనుజుల్ ♦ త్రోఁద్రోపుతోఁ బోవు ది
క్కటముల్ గాల్చి దివంబు గూల్చి మది శాంతంబందుటల్ మానిత్రో

క్కటపాటొంది శిరంబు వ్రాల్చికొని దుఃఖంబందుచుండేని య
క్కట! యీవేదతనంబు వీరజగము ♦ ఖ్యాటించి యగ్గించునే? ౫౩౧

చ॥ పురమున నిట్టి ధర్మమును ♦ పూనియె రాజ్యమువీడి కానలం
జొరఁబడి దేవిఁ గోలుపడి ♦ స్రుక్కుచు లంకకుఁ జేరి యిందు దు
ర్భరమగు దుఃఖమొంది వసి ♦ వాడుచు ధర్మము ధర్మమంచు ని
బ్బరికము గొందుమేని యుడి ♦ వంబున కీడ్వరె కట్టి శాత్రవుల్. ౫౩౨

చ॥ వగవు భరింపలేక మన ♦ ప్రాణము వీడితిమేని లోకముల్
పగతుఁడు పట్టి తెచ్చి తన ♦ భార్యను ముందల వధింప రాముఁడా
పగతుని కొందికొంది కసి ♦ వాయఁగఁ జంపెడి శక్తిలేక సి
గ్గు గొని మరించె నంచు నిను ♦ గువ్వాకరింగొని నిందనేయవే? ౫౩౩

మ॥ తగ నీవైఖరి వీరధర్మము సుమి ♦ త్రా పుత్రకుం డాడుచో
వగలో మున్గిన సూర్యసూతి యొక స్వ ♦ ప్నంబంది మేల్కన్న సో
యగమై లేచి పరాకులేల వడి దీ ♦ పాగ్నిం బతంగక్రియన్
నెగయం జూచు దశాస్యు ఱొమ్మువయి లం ♦ ఘింపంగ రండో వెసన్.

శా॥ లంకా పట్టణముం బెకల్చి వడి నే ♦ లంగూల్చి యిల్లాండ్రతోఁ
జంకం బిడ్డలతో సుహృజ్జనులతోఁ ♦ జక్కాడి యన్యాయ మీ
పొంకంబంచు నిలింపు లడ్డుపడినం ♦ బొంగార్చి లోకం బద్రై
త్యాంకంబై చనఁజేసి తీఱవలెఁ గా ♦ ర్యంబిద్ది రండో వెసన్. ౫౩౫

శా॥ ధర్మంబే యగుఁగాక యారసిన దు ♦ ర్ధర్మంబె యౌఁగాక దు
ష్కర్మారంభుల దుంపద్రెంప కిటు శో ♦ కస్వాంతులై యుంట న
త్కర్మం బెట్లును కాదు రండనుచుఁ మా ♦ ర్తండాత్మజుం డాడఁగా
నిర్ముక్తంబులఁ బోలి లేచి రతనిన్ ♦ వెన్నంటి శాఖాచరుల్. ౫౩౬

శా॥ ఉత్సేకించుచు లేచు వానరుల యు ♦ ద్యోగంబు వీక్షించి సం
విత్సంయుక్తుఁడు వాయుసూతి యిఁక మీ ♦ విన్నాణముల్ చాలు దు
ర్మాత్సర్యంబునఁ గోసలంబు పయి కిం ♦ ద్రద్వేషి దండెత్తె మీ
యుత్సాహంబులు వ్యర్థమయ్యె నని దై ♦ త్యోద్దేశముం దెల్పుడున్.

—: ఇంద్రజిత్తయోధ్య కేగెనని విని రాముఁడు చింతించుట :—

తే॥ తల్లులును తమ్ములు మహా ర్తిఁ ♦ దపము చేయుచున్న కోసలంబునకు దై ♦ త్యుండు పోయె
ననెడు వార్త చెవింజొర ♦ ననఘు మనము, కలఁగినది మఱి మిక్కిలి ♦ కలఁగఁ బాఱె.

శా॥ క్షీరాంభోనిధి యోగనిద్ర విడి వ ♦ చ్చెన్నాఁగఁ జింతా మహా
పారావారము తీర మొంది త్రుటియుం ♦ బంటింప కూటాడు సీ

త్తా రామా రమణుండు చిత్తమునఁ గాం ♦ తాళంబు కంపంబు దు
ర్వారంబై చన నిల్చె సంక్షుభిత వా ♦ రాశిక్రియన్ గాసియై. ౫౩౯

శా॥ నాయీ దుర్విధి సీతతోఁ గడచి యం ♦ తం దీఱదయ్యెం గదా?
మాయం జేయఁగఁ బూనె మాకులము ని ♦ మ్మాత్రాన శాంతించునే?
యేమెవ్వారలఁజేరి యింకను మహిన్ ♦ హింసింపఁగా నున్నదో?
యీయార్తిం దొలఁగించు త్రోవ గలదే? యేమౌదురో తమ్ములున్?

శా॥ చేతోవేగ విమాన మెక్కిచను నా ♦ చెన్నంటి యొక్కింత శా
లాతీతం బొనరింపకుండ నవలీ ♦ లన్ సర్వ నాశంబుగా
భూతిం గల్పును దుర్భగుండ నగు నా ♦ భూభార జన్మంబుచే
సీతం గోల్పడి యుండునందు జన ని ♦ శ్శేషంబు గావించితిన్. ౫౪౧

మ॥ మరణం బింకను నాకు రాదుగద నన్ ♦ మన్నించు నా తండ్రులున్
ధరణీజాతయు తాఁకుసాళివలనం ♦ దల్లుల్ సుహృద్బాంధవుల్
పురవాసుల్ మరణింపఁజూచినది యీ ♦ పుణ్యంపు జన్మంబు నా
కరణిన్ మున్నెవఁ డుద్భవించె కుల ని ♦ ర్ఘాతంబుగా మేదినిన్. ౫౪౨

మ॥ ఇట వర్తిల్లిన దేదియుం దెలియలే ♦ కింద్రంబుఁ బొందంగ వా
రట నాతమ్ము లెఱింగి తారసిలినన్ ♦ యామ్యాటుఁ జేపారి యు
త్కట దర్వీకర పాశబద్ధులనుగాఁ ♦ గావింపఁ బక్షీంద్రుఁడా
దట నే తెంచునె? మందుఁ దేరఁగ జగ ♦ త్ప్రాణాత్మజుం డుండునే?

మ॥ అనఘా! వ్యోమమునన్ వడిన్ జను సుపా♦యం బున్నచోఁ దెల్పుమా
కన నీ యున్నవి యుండనీ వదలనీ ♦ క్రవ్యాదయుద్ధంబు గం
గనె పోనిమ్ము దురాత్ముఁ డింద్రజితు న ♦ క్షుంబుల్ చిరంజీవు లి
చ్చను చంచూపుటిఁ దోఁడి తిన్న యవలన్ ♦ సాధింతు నన్యేచ్ఛలన్.

మ॥ అన సౌమిత్రి నిరోధియై పలుకు నా ♦ ర్యా! సంగరంబందు మా
ర్కొని కైకేయి తనూజుఁ గట్టుటకు నా ♦ క్రూరాత్ముఁడా మేఘ గ
ర్జనుఁడే కాదు త్రిలోకముల్ చనకినన్ ♦ జాకుండఁగా నిల్చునే?
ననుగా నెంచితివేమి యాభరతు? న ♦ న్నా! బుద్ధి తార్మాఱుగన్.

మ॥ యను నా రావణి తానె ప్రేమమున నా ♦ హ్వానించి కొంపోయి సై
న్యముతో ధారణిఁ ద్రెళ్లియుండుటయె నీ ♦ వచ్చోట వీక్షింతు ని
క్కము సందేహము లేల చింత విడుమా ♦ కానున్న కార్యంబు పం
క్తిముఖున్ వాని కళత్రముల్ మిగుల దుగ్♦ఖింపంగఁ జెండాడుటే. ౫౪౬

మ॥ అని సౌమిత్రి వచింప వాయుసుతుఁ డా ♦ హాహోహాముల్ సేయఁగాఁ
బనియే? మద్భుజ పీఠనెక్కుఁడు మనో ♦ భావంబులోఁ జేరదన్

బనుపన్ శాత్రవులన్ వధించి త్రుటిలో ♦ వత్తున్ మహాసేనతో
డనె ధాత్రిం బెకలించికొంచుఁ జనువాఁ ♦ డం దెల్పుఁ డేదిష్టమో?

శా॥ చంపన్ వచ్చిన మేఘనాదునకు భూ ♦ సంజాత గిట్టింపు ద
ప్పింప న్నీతులు పల్కుచుంటి నవలన్ ♦ బిర్వీకునన్ గెల్చి బా
ధింపన్ మూర్ఛిలినాడఁ గాదయినచో ♦ దేవిన్ దురాత్ముండు దాఁ
జంపన్నేర్చునె? చంపి జీవములతో ♦ సాగంగ వాఁడోపునే? ౧౦౯

మ॥ కడఁకన్ వాయు మనో జవంబులు కలం ♦ కం బొంద వెన్నంటి యా
దుడుకం డీల్గఁగ నెత్తిపై దుమికెదన్ ♦ దుర్దాంత నిర్ఘాతమన్
వడి ముందేగి యయోధ్యఁ జేరెదను సం ♦ భావింపుఁ డేదర్పమో
తడయన్ లాభమె? యన్న దాశరథు లు ♦ ద్దామక్రియన్ లేవఁగన్

మ॥ కని దైత్యేశ్వరుఁ డొక్కవిన్నపము ని ♦ ల్కం బొందుఁడీ దుఃఖినై
మన సేమాత్ర వశంబుగాక యపు డ ♦ మ్మాడ్కిన్ భ్రమం బొందితిన్
దనుజుం డా ధరణీజఁ జంపుట యన ♦ త్యంబంచు నూహించెదన్
జనసంస్తుత్యను తాఁకి వాఁడు బ్రతుకం ♦ జాలండు నిక్కంబుగన్. ౧౧౦

—: విభీషణుఁడు తుమ్మెదయై జానకిం గాంచి వచ్చుట :—

చ॥ పరమ పతివ్రతం జెనక ♦ భస్మము గాదె జగత్త్రయంబు? ని
బ్బరమున నట్లయైన నొక ♦ పాట నయోధ్యకుఁ బోక చూడ న
చ్చెరువగు నన్నియుం జిటిక ♦ సేపున సత్య మెఱింగివత్తుఁ జె
చ్చెరవులు మాని యుండుఁడని ♦ చివ్వునఁ దుమ్మెద రూపుతోఁ జనెన్.

ఉ॥ తుమ్మెద రూపుగొంచు గుణ ♦ ధుర్యుని రాఘవవర్యు ధీర చి
త్తమ్మువలెన్ వెనం బఱచి ♦ తాల్మి నశోక వనంబుఁ జేరి చి
త్రమ్ము బలెన్ వినిశ్చలతఁ ♦ దాల్చి తపించెడు రాముదేవి నా
త్రమ్మునఁ గాంచెఁ గాంచఁ గను ♦ దమ్ములు హృజ్జలజమ్ము శాంతిలెన్.

శా॥ నా దుఃఖమ్ములు మేనితోడనె తొలం ♦ గంబోలు నంచూర్చు రా
మా దీపాభము నోర్పుమై త్రిజట స ♦ మ్మానోక్త్యుత్తులం దేర్పఁ జిం
తా దాహంబును మాని వానర మృగేం ♦ ద్ర ధ్యాన మాలించి స
మ్మోదం బందుచు జీవముల్ నిలుపు న ♦ మ్ముగ్ధం గనె భక్తిమై ౧౧౩

తే॥ మాయయని దిగులునుచింత♦మానియవ్వి,భీషణుండు రావణి నికుం♦భిలకుఁ గ్రతువు
సేయఁ జనెనని బహుళ దై♦తేయసేన, లరుగుచుండుటయును మది♦నరసి కాంచె.

చ॥ క్రతువున యజ్ఞియంబులు, క ♦ రంబుగఁ దృప్తి యొసంగు మాఱుగాఁ
గ్రుతిల యొసంగఁ జేయునని ♦ కూర్చు నధోగతి నంచుఁ గుందుచున్

గ్రతుభుజులెల్ల గాసిలుట ♦ గాంచి విభీషణుఁ డింద్రజిత్తు కు
త్సితమది దొడ్డదంచుఁ జను ♦ దెంచి రఘూత్తముఁ గాంచి యిట్లనున్,

ఉ॥ దేవి సుఖాన నున్నయది ♦ తేర్చెదు వారలు నున్నవారు ని
ర్జీవితగాదు క్రొత్తడికిఁ ♦ జేటును కల్గునె? మాయచేసి యా
రావణి శత్రు దుర్జయ క ♦ రంబగు వేలిమి సేయఁబోయినాఁ
డావిధిఁ బూర్తిచేసి మన ♦ యందఱఁ జంపఁ దలంచె రాఘవా! ౫౫౬

తే॥ అని విభీషణుఁ డాడిన♦యంత నేడు, జగము లేడుదీవులు నేడు♦సాగరములు
చేరి ఘోషించు చందాన ♦ నారవంబు, చేసి రాడిరి పాడిరి♦చెలఁగి కపులు.

## ౨౬ నికుంభిలా యాగ పటలము. (౧౮౩)

శా॥ శ్రీరాముండు విభీషణుం దడవి యా ♦ శ్లేషించి మిత్రంబ! యీ
మారాముల్ వివరించి కష్టముల నా ♦ మం బార్ప నీవుంటి ధీ
శూరుం డంజని పుత్త్రుఁ డుండెఁ బరమే ♦ శుం డుండెఁ గావించు పు
ణ్యారంభంబును కద్దు తక్కు బల ధై♦ర్య స్ఫూర్తు లున్నట్టివే. ౫౫౮

చ॥ అని వినుతింపఁగా శిరము ♦ నాతఁడు వంచి మహీశ! యాగ సి
ద్ధిని గొననేని వానిని వ ♦ ధించుట దుష్కరమౌను గెల్వియున్
దనుజులకే లభించు నట ♦ దక్షత లక్ష్మణుతోడ నేగి వే
ల్మిని చెడఁజేసి దైత్యు నవ ♦ లీల వధింతు మనుజ్ఞ యిమ్మనన్. ౫౫౯

ఉ॥ మంచిది యట్లె చేయుఁడని ♦ మన్నన చేసి సుమిత్ర పుత్త్రు వీ
క్షించి గరాను కైతవము ♦ చేసి విరించి శరంబు నేయఁ గో
పించి తొలంతు గాని ప్రతి ♦ భీషణభంగిఁ దదస్త్రమే ప్రయో
గించిన లోకజాలములు ♦ గీడ్పడు నవ్విధి చేయఁబోకుమా. ౫౬౦

ఉ॥ పాశుపతంబు వైష్ణవము ♦ పాయక యేయునయేని వానితో
నే శమియింపఁజేయు మరి ♦ నేర్చిన మాయలు పన్ననేని త
న్నాశము ధర్మపద్ధతి నొ ♦ నర్పుము ముమ్మరమైన పోరున
గ్లేశము దైత్యుఁడొందఁ బరి ♦ కించి వధింపుము లావు పెంపునన్. ౫౬౧

శా॥ రోసంబారఁగ బాణవృష్టి నొగి శ ♦ త్రుండొప్పఁ గుప్పింప బా
ణాసారంబునఁ ద్రోవఁజేసి యరి హ ♦ స్తాధిక్యముల్ తగ్గుచో
గాసింబొంద నెఱుంకు లంట నిశితో ♦ గ్ర స్ఫార నారాచముల్
చేసుద్దిం జతగూర్చి యేసి శమనుం ♦ జేర్పింపుమా లక్ష్మణా! ౫౬౨

తే॥ ఎదిరి విడుచు దివ్యాస్త్రంబు♦లెఱిఁగి వాఁడు, విడుచునంతలోఁ బ్రత్యస్త్ర♦వితతి నేసి
యడ్డుపెట్టుము వాని యూ♦హముల నాస్య, చిహ్నములచేఁ బరీక్షించి♦చేయు పోరు.

తే॥ అనుచుఁబెక్కుపాయములువ్యూ♦హములమర్మ,ములను తెల్పిజగద్భ_క్త♦సులభుఁడైన
విష్ణుచేతి కార్ముకమిది వేడ్క దీనిఁ, గొనుము శత్రులఁ గూల్పుమ♦యనుచు నొసఁగె.
తే॥ దీనిఘనమహిమమగస్త్య♦మౌనిమున్ను, తెలుపమనసుననాటంగఁ♦దెలియుదుకద!
ఈ సహస్రశీర్షుని యంబ♦కాసనము వి, రించనుఁడు తొల్లి వేల్మి కా♦వించిపొందె.
తే॥ తోయజాక్షుండు తాల్చిన♦తూణమిద్ది, యక్షయ శరంబు గొనుమని♦యలరనిచ్చి
యలమి యుత్సాహవాక్యంబు♦లెలమినాడి, సెల వొసంగెను జానకీ♦చిత్తహారి.
తే॥ మునులు ఖేచరులుబ్బిదీ♦వనలు సేయ, సంగరోత్సాహుఁడగుచు ల♦క్ష్మణుఁడుత్రిపుర
ముల దహింపవెడలు రుద్ర♦మూర్తివోలెఁ, బ్లవగబలములతో నష్డు♦పయనమయ్యె.
తే॥ పవనసూతి ప్రభృతి వీర♦వరులతోడ, వెడలు మనుచుండు శ్రీరామ♦విభునిపాద
జలజములు మదిలోన నై♦ల్పలను తోఁపఁ, దలను దాల్చి నడచె వీర♦ధర్మధనుఁడు.

ఉ॥ రాముఁ బ్రదక్షిణించి నమ ♦ రంబునకుం జను లక్ష్మణుండు ప్రో
ద్దామక వామహస్తమున ♦ దార్ఢ్య శరాసనముఁ ధరించి సు
త్రామ భయాపహారియగు ♦ దక్షిణహస్తమునన్ శరంబు సొ
రై మెఱయంగఁ బట్టి పగ ♦ యాదలఁ దచ్చెద నంచు వెల్వడెన్ ౯౧౯

ఉ॥ తన్నడఁబాయకుండు తన ♦ తమ్ముఁడు వీడి చనంగఁ గాంచుచున్
మున్ను మునీంద్రుతోడ మఖ ♦ ముం బరిరక్షణసేయ నేగుచోఁ
దన్నను తమ్ముఁ బో విడిచి ♦ తాళక తండ్రి వహించు తల్లడన్
గ్రన్ననఁ నొందె జీవములు ♦ కాయము వీడఁగ లేని కైవడిన్. ౯౨౦

ఉ॥ కేల నలాతముల్ గొనుచుఁ ♦ గీశులు కొండలు కోనలున్ వడిన్
జాలుగ దాఁటి లోకముల ♦ జానుగఁ గద్పునఁ దాల్చుచుండు సం
శీలుఁడు మట్టియాకుపయిఁ ♦ జేరి యడంగిన వైనమొంది వై
త్యాలి రవంతచోట నడఁ ♦ గారు నికుంభిలఁ గాంచి రెల్లరున్. ౯౨౧

సీ॥ ఆ మేఘనాదుని ♦ హోమాగ్నికుండముఁ, జక్రాయుధము వరు ♦ నలుగఁ జుట్టి
కాపాడుచున్నట్టి♦యేపున బడబాగ్నిఁ, గడలిచుట్టిన యెన ♦ కమున సైన్య
సమితి వ్యూహమువన్ని♦చక్రవాళమునంటి, జగమెల్లఁ జుట్టంగఁ♦జాలియుండెఁ
బొడవైన నల్లని ♦ యొడళులపై నెత్తు, వెంద్రుకల్ మిన్నంది ♦ వెలుఁగుచుండ
తే॥ రామవిభుఁడు కోపమున వా♦రాశిమీఁద, వహ్నిసాయకమేయ నం♦బరమునంటి
కడలి మండుచుండినమాడ్కి♦గానఁబడుచు, నుండె దానవబలములు♦గండుమీఱి.
తే॥ గుణరవములేని వింధ్యేంద్ర♦ధనువుఁబోలెఁ, జిందములునంద్రముననుండు♦చెన్నుదోఁచ
ఖేరు లులియని మబ్బుల♦తీరుదాల్చి, హారులుఁ గరులును చాంచల్య♦మరయకుండె.
క॥ చలియింపని జలధివలె, న్నిలిచి మొరయకుండు యామి ♦ నీచర సేనం
దిలకించి వనచరావళి, తులకించి రవించె మిన్ను ♦ తూంట్లు పడంగన్. ౯౨౪

క॥ గర్జించిన కపులకుఁ బ్రతి, గర్జన మొనరించె దనుజ♦గణములు భేరుల్
గర్జించె రెండు మొయిళులు, గర్జలతో జాల నంబ♦కంబులఁ గురిసెన్.

క॥ క్రోలఁకున హంసలు వ్రాలెడు, పోలుపునఁ దళతళల కైదు♦వులు వనచర సే
నలపైఁ బరవెను ధరపైఁ, బలపలమసి తలలుఁ గేలుఁ♦బదములు రాలెన్.

క॥ వానరులు జాలు ప్రూఁకుల, నూనముగా మునర విసర♦నొత్తుగఁ దలలున్
మేనులు పండ్లును కైదువు, లానకములు తునిఁగి విఱిగి♦యవనిని రాలెన్ ౧౭౭

క॥ పరశు కరవాల తోమర, శర కుంత గదా ముసుండి♦సాధనముల ని.
ర్జరవైరు లేయ వనచర, శిరములు కడుపులును వ్రస్సి♦చిందెను ధరపై. ౧౭౮

తే॥ ఎప్పుడీసేన సమయుట?♦యెపుడు వేల్మిఁ, జెఱుచు? టిప్పని యెడ సేయఁ♦జెడునమస్త
మని విభీషణుఁ డారాము♦ననుజుఁ గాంచి, పలికి లెమ్మని తొందర♦పఱచె నపుడు.

తే॥ అచటి కింద్రాదులును చతు♦రాననుండు, యక్ష కిన్నర కింపురు♦షాదులెల్ల
వచ్చి నింగి నిండిరి రాని♦వారులేరు, లక్ష్మణేంద్రజిత్తుల నేర్పు♦లావు చూడ.

చ॥ రథముల గుంపు వారణ వ♦రంబుల పెంపు జ్వలించు దంష్ట్రికా
యుధముల వంపు వార్వముల♦యుద్ధతిసొంపును సోఁకు తెంపు సం
గ్రథితములైనభంగి మొగ♦రంబున నిల్చిన జంపు సంగర
క్రథనము సంపు వాద్యముల♦అంపును తెల్ప నశక్య మయ్యెడన్.

శా॥ సేనంజొచ్చి సుమిత్రపట్టి శర వృ♦ష్టింగూర్చి యేపారఁగా
నానానేకప యూథముల్ రథ విమా♦న వ్రాతముల్ సుందరా
జానేయంబులు దానవ ప్రకరముల్♦సంఘంబులై కూలి లం
కా నీవృత్పథమందయేగి యమ లో♦కంబందె నొక్కుమ్మడిన్. ౧౮౨

చ॥ శరములచేఁ దునింగిన గ♦జంబుల దేహ మహోదరంబు లా
దురమునఁ గొండలం దొనల♦తోయము తోఁపఁగఁజేసె రాక్షసో
త్కర శిరముల్ మదేభములు♦త్రవ్విన పల్లములందు గూలి ని
ర్జర రిపు యజ్ఞ కుండమున♦రాఁజిన ద్రవ్యములట్లు రాజిలెన్. ౧౮౩

శా॥ ధూళిం గ్రుంగిన హారి సన్మకుట నం♦దోహంబు భల్లూక దం
తాళుల్ గ్రుమ్మఁగ మిన్కుమిన్కుమని రం♦గై వెల్గు వల్మీకముం
బోలెన్ గ్రువ్విన బాణజాలములతోఁ♦బొల్పారె రక్తాపగల్
వేలన్ మీఱి పయోధిఁజేరెఁ గుణపా♦భీల ప్రపంచంబుతో. ౧౮౪

క॥ గొడుగులు కాఁడలు విఱుగం, బుడమిని రక్తప్రవాహ♦మున మునఁగుటచే
నుడుపతి విధుంతుదునిచే, వడి మ్రింగంబడి వెలుంగు♦పగిదిం దోఁచెన్. ౧౮౫

క॥ తుండంబులతో మదగజ, తండంబులు త్రుంగి రుధిర♦తటినింబడి యు
ద్దండగతి నడచు నౌకా, కాండంబుల పగిదిఁ దరలి♦కడలిం జేరెన్. ౧౮౬

తే॥ కుణపములఁ దినగోమాయు♦గణము నిండెఁ, గాకులును గ్రద్దలునుచేరెఁ♦గడుపునింప
బోరువలు వచ్చె రాబందు♦పులుఁగు లడరె, లక్ష్మణుని విలువిద్దియ♦లావుమెచ్చి.

తే॥ చిచ్చులుమియు శరంబులు♦వ్రచ్చిమండఁ, జేయఁ గప్పుడుబొంతలు♦చేర్చి కాల్ప
వెదురుటడవులు మండిన♦విధము దనర, మండిచెడెఁ గొంత వేదండ♦తండమపుడు.

క॥ భల్లుక నఖములు రాక్షస, మల్లుర శిరములను గ్రొచ్చి ♦ మలయించుట పె
న్గోళ్లం బుట్టల గములం, బెల్లగిలం ద్రోచు పగిది ♦ విలసిల్లె నటన్. ౬౮౯

తే॥ సింహ విక్రములగు నింద్ర♦జితుని భటులు, రథికు లాధోరణులును తో♦రంగికులును
క్రమ్మి వర్షమ్ము వోలె నా♦యమ్ములందు, క్రుమ్మ నమ్ములతోడనే♦కూలె వారలు.

క॥ అటనటఁ దునిఁగిన యంగము, లటనటఁ దినఁగోరి పులుఁగు♦లటనట బెరయం
జొటజొటమని కాఱిన నె, త్తుటఁ బుటుకున మునిచి కడిగెఁ♦దుటుముల శిరముల్

క॥ ఒకటి వెనుక నొకటిగ నట, నకటావికటముగ వ్యూహ♦మమరిన సేనా
నికటమునఁ బెటిలఁ దేరులఁ, బ్రకటంబుగఁ గూల్చె రాఘు♦వశ్రేష్ఠుఁ డొగిన్.

క॥ విలయానిల హతిచేఁ గొం, డలు మొయిళులు పాటవముచె♦డం దుల్లిన యా
పొలుపునఁ దలలును మేనులు, గులగులలై నెగసి హోమ♦కుండమునఁ బడెన్.

క॥ నక్తంచర శిరములు తను, ముక్తములై సంతతంబు♦మోఁదుటచే శా
స్త్రోక్తముగ నిలుపు కుంభ మ, లక్తక ఘటమట్లు మురిసి♦లవలవ యయ్యెన్ ౬౯౪

క॥ కరి తురగ భట శిరంబుల, నరుదారఁగ నీడ్చికొని ర♦యంబునఁ జని నె
త్తురుటేళ్లు యాగశాలం, బరవి మఖానలము చల్లఁ♦బడి చెడ మునిచెన్. ౬౯౫

క॥ అడిదములతోడి కరములు, పిడుగులవడువునఁ బడంగఁ♦బీనుఁగు లయ్యెన్
దడఁబడి యెనుములు మేఁకలుఁ, కడు నాహుతికొఱకుఁ గట్టు♦కంబంబులతో.

క॥ తమ మదగజములు గూలఁగఁ, దమ మేనులు చినుఁగకున్న♦దాశరథి మహా
స్త్రములకు జడిసి నిరుత్సా, హమున రుధిర తటినులంద♦యడఁగిరి సోఁకుల్.

క॥ పదములు శిరములు నొవ్వఁగఁ, బ్రదరంబులు గ్రువ్వ నిలిచి♦వడఁకెడువారున్
పిదపిద ప్రేవులు వెలివడ, నదవదలై సోలువారు ♦ నైరి సురారుల్. ౬౯౮

క॥ కినుకగొని రణము సలుపుచుఁ, దనువులు వ్రీలంగ సోలు♦దనుజుల స్కంధం
బున మోచుచుఁ బ్రేవులు వీఁ, పున వెలివడఁ ద్రోచికొనుచుఁ♦బోయిరి దనుజుల్

క॥ జన్నపుఁ బాత్రంబులు వి, చ్ఛిన్నములై వస్తువితతి ♦ చెదరఁగ నట్టిల్
పన్నుగ నాడెను ద్రవ్యో, త్పన్నంబై యజ్ఞశాల♦సదమదమయ్యెన్. ౭౦౦

క॥ గాలివలె వినముకై వడి, సాలింద్రుర కదురుగతి రు ♦ జా సన్నిభమై
పాలంబడు చేమిరివలె, నాలంబునఁ గలఁగి దాన♦వావలి సమసెన్. ౭౦౧

ఆ॥ గొప్పగాలివలనఁ♦గూలిన వృక్షజా, లంబు గల వనంబు♦డంబు పంబి
కూలియున్న సైన్య♦కోటిని రావణి, పొగిలి నొగిలి ఖిన్నుఁ♦డగుచుఁ గాంచె.

ఆ॥ కరుల హరుల కుణప♦గిరులును విచ్ఛిన్న, రథచయంబు దనుజ♦రక్తనదులు
మృతభటాళి తక్క♦మేదిని వేఱొండు, బయలు గనఁడు పంక్తి♦వదన సుతుఁడు.

ఆ॥ వేలకొలఁది దనుజ♦వీరుల నొకమాన, వుని శరాలి పీఁచ♦మణఁచి త్రుంపఁ
గుప్పలైన పీన్గు♦తిప్పలు గాకను, ఊనియున్న యొకనిఁ♦గానఁడయ్యె. ౬౦౪

ఆ॥ నాల్కలెండ మేను♦నడుఁకంగ నేతెంచి, కొంద ఱసురు లతనిఁ♦గూడినారు
నడవలేక తోడు♦పడయక కొందఱు, త్రోవలందె కూలి♦దొరినారు. ౬౦౫

ఆ॥ కుండమాఱిపోవఁ♦గుండలు పగులంగ, నాఱుచుండ ధూమ♦మడరు నగ్ని
చెన్నునంది యింద్ర♦జితుఁడు జపించు మం, త్రమ్ము మఱచివచ్చె♦రంగమునకు.

ఆ॥ అట్టివేళ యందు♦హతశేషులైన రా, క్షసులు భీతులగుచు♦శక్రజితుని
డాయ వెంట మిత్తి♦డాసినపగిది వా, నరులు వెంబడించి♦యరిగినారు. ౬౦౭

ఆ॥ శతసహస్ర పద్మ ♦ సంఖ్యయౌ సైన్యంబు, నిమిషమాత్ర సీల్గి♦సమయునంత
లక్ష్మణుని ధనుర్వి♦లాసంబు చింతయు, నలుక యతని మదిని♦కలఁతపఱచె.

ఆ॥ భూమి యొడలు వడఁకి♦పొగులు చందంబైన, రణ పరాక్రమంబు♦రాక్షసమృతి
కనిన సురలు మునులు♦కరములు తట్టుచు, నవ్వుచుంట గాంచి♦నానయొందె.

క॥ మానముచెడ యజ్ఞమ్మున, మానముచెడ మంత్రగతియు♦మాఁడగ సేనా
మానముచెడ వంశము న, మ్మానముచెడఁ గుంది పంక్తి♦మస్తకసుతుఁడున్.

క॥ సేనలు పొలిసెను మిగిలిన, దానవులుం బొలియ శంక♦దగులఁగనేలా?
పూనిక చెడె యాగము నిఁక, మానక నెఱవేర్త మనుట♦మాంద్యమె కాదా!

ఆ॥ వేల్మికుండమందు ♦ వేల్చిన యగ్నియుఁ, బొగలతోడ నడఁగెఁ♦బోరుసేయ
వచ్చి యరులు దనుజ♦వరులను చంపిరి, తెల్లమయ్యెఁ జెడుగుఁ♦దెలుపు నన్న.

ఉ॥ ఎన్నఁగ వైరి దాపునని ♦ యిట్లు మగంటిమి క్రుంచనేల! కా
నున్నది కాకమాన దిది ♦ యోధుల పద్ధతి గాదు తుచ్ఛులౌ
నిన్నర వానరావళుల ♦ నొక్కటి గెల్వఁగలేని దోర్బల
స్కన్నుఁడ నైతినే! పగఱఁ ♦ జంపఁ గడంగక క్రుంగి యుందునే!

ఉ॥ వేలిమి కోలుపోయె నని ♦ వేఁగుచు నూఁగుచు నుండ ఖేచరుల్
మేలిమి దూల్చి నీబలము ♦ మించుట యింద్రునియొద్దనే చుమీ!
మూలెనె యిందటంచు నవ ♦ మానవిధంబున గేలిసేయరే!
బాలిశులన్ వధింతునని ♦ పట్టుగ రావణి లేచునంతలో. ౬౧౪

క॥ మురిసిన కరి తురగంబులు, విరిసిన సైన్యములు నగుచు విటతాటముగా
ధరఁగూల్చి రగచరులు త, న్నొరసిన దనుజాలును భీతి♦నొంది పడంకన్. ౬౧౫

క॥ తాఱుచు నొదుఁగుచుఁ గ్రిందికిఁ, దూఱుచు నడఁగిన సురారి♦తుటుములు వాఁడిం
దేఱిన లక్ష్మణశరముల, నాఱెన్ జఠరములు వ్రస్సి♦యాంత్రము లురలన్. ౬౧౬

క॥ నరవరు శరములతో వా, నరు లేసిన తరులు గిరులు ♦ నక్తంచర సా
గరమున గాలియు నుఱుములు, మెఱుములతో దిగిన మొగులు♦మెయివడిఁ దోఁచెన్.

క॥ చెల్లాచెదరై సేనలు, త్రుళ్లఁగఁ దరువొండు వీచి ♦ దుష్టుల యసువుల్
గొల్లగొను పవనసూనుం, డుల్లసమున నింద్రజితున ♦ కొగి నిట్లని యెన్. ౬౧౮

—: హనుమంతుఁ డింద్రజితు నుపాలంభించుట :—

ఉ॥ మాయ లసత్యముల్ పెరుఁగ ♦ మాఁగిలియైన దురాత్మ! నీచ! నీ
మాయలు చెల్లెనేమి? జన ♦ మాన్యను చంపకు మన్న త్రోడనే
కోయుదువే శిరంబు? మఱి ♦ కోసలదేశము కొల్లలాడఁగాఁ
బోయితె పుష్పకంబుపయి? బొంకులమారి! నరాశనాథమా! ౬౧౯

శా॥ చక్రవ్యూహముతో నికుంభిలను నీ ♦ చా! చొచ్చుటల్ కాంతుమే?
వక్ర క్రూరతఁ గోసలంబునకుఁ జా ♦ వం బోయితే? వారలన్
విక్రాంతిం బరిమార్చి వచ్చితివె? నీ ♦ వేల్పుల్ కొనల్ సాగెనే?
యక్రోధంబున బుద్ధి సెప్ప విను నా ♦ యంజేని లేదయ్యెనే? ౬౨౦

మ॥ ఉరగాధీశుని మించి భూభరము ను ♦ ద్యోగించు సద్ధర్మయా
భరతుం గాంచి బలంబు చూపి యతనిన్ ♦ బంధించితే? శంబరా
సురు నిర్జించిన చక్రవర్తి తనయున్ ♦ సుజ్ఞాని శత్రుఘ్ను ని
ర్భర ధైర్యంబునఁ జేరి నీదగు ధను ♦ ష్పాండిత్యముం జూపితే? ౬౨౧

మ॥ అనల జ్వాలలఁ జిమ్మ చష్టదిశలన్ ♦ వ్యాపించు సౌమిత్రి మా
ర్గణముల్ నీయురమున్ శిరంబు బరులుం ♦ గంఠంబు లంఘ్రుల్ కటిన్
దునుమంగా నవరంధ్రముల్ రుధిర మే ♦ దో మాంసముల్ గ్రక్క లం
కను డాకొంచు నొనర్చు జాలములు ని ♦ క్కం బేగెడి న్నేఁటితో.

మ॥ ఫణిపాశంబో యమోఘ పాశుపతమో ♦ బ్రహ్మాస్త్రమో మాయలన్
గనియా వెన్నుని చక్రమో యెదియొ మీ ♦ గౌరవ్య మద్దానిఁ గై
కొని వేంచేయుఁడి చేయుఁడీ యముఁడు మీ ♦ కోసంబు తా వేచియుం
డెను తట్టాడుచుఁ దామసించుటలు నాఁ ♦ డెంబొసె మీబోఁటికిన్?

చ॥ వరములు మాయలందు నెఱ ♦ వాదితనంబు బలాత్కరించి ని
ర్జరులకడం గ్రహించిన శ ♦ రమ్ములు దేహబలమ్ములున్ యథా
స్థిరముగ నున్న వేకద? గ ♦ సింతుము భ్రమింగుమ మన్న మాత్ర ని
ష్ఠురగాని పాఱినారమె? శ ♦ వింపక త్రుమక్కడి ఫక్కి యేలరా?

మ॥ నిటలాక్షుండు విరించనుండు హరియున్ ♦ నిర్భీతులై డాసి యొ
క్కట నిన్ గాచిననైనఁ జచ్చుటయె ని ♦ క్కంబయ్యె నీనాఁడు డా
పటి ప్రక్కల్ చలియింపకున్నవియె ? మీ ♦ ప్రాణాలకున్ ముప్పు సం
కటపాటుం గొని తెచ్చుకొంటి రిఁకఁ ద♦క్కంజూచినం దప్పునే? ౬_౨౫

మ॥ నినుచంపన్ శపథంబు చేసె నిట ము ♦ న్నే లక్ష్మణార్యుండు డా
సెను నీసేనల వేఁటలాడె నిను పి ♦ ల్చెం గాచియున్నాఁడు నీ
వొనరింపంగల వేల్మికిన్ గుణరవం ♦ బోంకార మంత్రంబుగా
వినిపించెం దడవేల రమ్ము బలి గా ♦ వించుం దదీయాగ్నికై. ౬_౨౬

మ॥ జగదీశుం డొనరించు ఘోర రణ య ♦ జ్ఞంబందు వేల్వంగ బా
గుగ యోచించితివె ని న్నుపాకృతముగాఁ ♦ గొంపోవ సౌమిత్రి యా
శుగుఁడై యాశుగపాణియై వెడలె న ♦ స్తోకానుమోదాత్ములై
నెగడం బర్విరి నిర్నిమేషులును హా ♦ నిశ్శేషులున్ మింటిపై. ౬_౨౭

—: మేఘనాదుఁడు హనుమనికిం బ్రత్యుత్తర మిచ్చుట :—

మ॥ అని సామీరి వచింప మండిపడి నై ♦ ఋత్యాధిప సూనుం డనున్
హనుమా ! నాకడ నిట్లు చప్పిడిగ వ్య ♦ ర్థాలాపముల్ సేయఁగాఁ
జనునే ? సంగరమందు చచ్చి మరలన్ ♦ సాధించి ప్రాణంబులన్
మును చావొందుట విస్మరించితిరె ? మీ ♦ ముగ్ధత్వ మిట్లుండునే ?

శా॥ ఆ సౌమిత్రియె వచ్చుఁగాక ధరజా ♦ నాధీశుఁ డే వచ్చుఁగా
కేసంజీవనియేని మీకమరుఁ గా ♦ కేమైన నౌఁగాక నా
చే సంగ్రామమునందు వానర నర ♦ శ్రేణుల్ నిరుత్సాహులై
వేసారం బడుపాటులెల్ల నమరుల్ ♦ వీక్షింపకే యుందురే? ౬_౨౯

శా॥ చేతం గార్ముక మొప్ప నుందర భుజ ♦ స్తేమంబు పొల్పార నీ
కోఁతుల్ మానవులున్ మనోగతులు సం ♦ క్షోభింప నాకంబు దు
ర్భీతిం జొచ్చిన వెంబడించి బహుళా ♦ స్త్రిం గూర్చి హింసింతుఁ బై
పూఁతల్ మంచులు మాఁకులున్ వితగఁ ♦ బోవున్ జావు నిక్కంబుగన్.

మ॥ క్రతువిఘ్నం బొనరించి వీరజయముం ♦ గైకొంటిమం చుబ్బుచున్
బ్రతుకుం బొందితిమంచుఁ బ్రేలు ఘన వీ ♦ రమ్మన్యులారా ! వృథా
మతి రజ్జుల్ చదురాడుచుండుఁ డిదె మీ ♦ మస్తంబు లీ సంగర
క్షితిపై దుల్లఁగఁజేయు నాశరము లా ♦ క్షేపించు వాక్యమ్ములై. ౬_౩౦

ఉ॥ మీావతె నోటితో వదరి ♦ మించి జయించెడు వాఁడు గాఁడునూ!
రావణి రెండు ఘూకులు దు ♦ రంబున నోడితి రింత సంభ్రమం

బేవిధి గెల్వఁగూర్చు ? నని ♦ నేతురొ? నిల్తురొ? చత్తురో? వడిం
జేవ దొలంగి పాఱుదురొ? ♦ చిందఱ నేఁ గొనునట్టి వేళకున్. ౬౩౨

చ॥ నిలువుఁడు నిల్వుఁడం చడరి ♦ నిప్పులు రాలఁగఁ జూచి కంకటం
బొలయ ధరించి తూణముల ♦ నొప్పుగఁ దాలిచి వీరకంకణం
బులు గల కేలఁ గార్ముకము ♦ పూని శతాంగమునెక్కి శింజినిం
బలువుగఁ గూర్చి టంకృతి సు ♦ పర్వ భయంకర లీలఁ జేయుచున్.

ఉ॥ చిందమునొత్త ఖేచరులు ♦ చిత్తములన్ జడుపొంది గొప్పయా
క్రందు దురంబు నేఁటికి భ ♦ రంబుగఁ గల్గెను వేల్మి విఘ్నముం
బొందుటచేత లక్ష్మణుని ♦ భూరి శరంబున నింద్రజిత్తు నేఁ
డొందును చావు నంచు మది ♦ నుబ్బుచునుండిరి చూచువేడుకన్. ౬౩౪

ఉ॥ వాని గుణధ్వనిన్ విని ప్ల ♦ వంగులు లావును విస్మరించి చే
నూనిన పర్వతంబులు త ♦ రూత్కరముల్ దిగజాఱఁ దాలిమిన్
లేని కతంబునం బడుచు ♦ లేచుచుఁ బాఱిరి కల్పవేళ ఝం
ఝూనిల వేగ ఘాతమున ♦ నంబుధి నీరము విచ్చుచందమై. ౬౩౫

ఉ॥ కాలుని జీవితంబునకుఁ ♦ గాలుఁడు రావణి లేచి యోరి వా
తూలసుతా ! ప్రతాపవిధి ♦ తోఁపఁగ నాడుచు దొడ్డచేతులన్
ఱాలు ధరించి నిల్చితి దు ♦ ర♦ బొనరింపఁగ మేలుమేలు నీ
చాలిక సాహసంబును ప్ర ♦ శంస్యము లోడక నిల్వుమీ వెసన్. ౬౩౬

ఉ॥ వీరుఁ డిటుల్ వచించి బలు ♦ విల్లు ధరించి యొసంగ నంజనీ
దారకుఁ డూనియున్న వసు ♦ ధాధరమున్ వడిఁద్రిప్పివైచె నిం
ద్రారి మహాజవంబున వి ♦ యత్ స్థలి ఱివ్వున వచ్చు శైలమున్
దూరమునన్ విశీర్ణమయి ♦ తూలఁగఁ గొట్టెను వాఁడి కోలలన్.

చ॥ మఱియొక శైలముం గొని య ♦ మానుష సత్త్వము వెల్లడించుచున్
గిరగిరఁ ద్రిప్పు మారుతిని ♦ కేలు పదంబు లురమ్ము కంఠమున్
శిరము శిలీముఖ ప్రతతి ♦ చే నొగిలించె వియచ్చరుల్ నిశా
చరు కర లాఘవంబు గనఁ ♦ జాలక యద్భుతమంద నయ్యెడన్. ౬౩౭

క॥ ధరణీధర నికటంబున, నిరులం దొలఁగించు నెత్రు♦టెఱుపున బాణో
త్కర కిరణంబుల మారుతి, తరుణారుణ తరణి సరణిఁ♦దద్దయు వెలసెన్. ౬౩౮

క॥ హనుమఁడు సోలఁగఁ గినుకం, గొని యంగదముఖ్యు లెదురు♦కొనిరి వివస్వ
త్తనయుం డచటికిరా వ, చ్చిన వారలఁ గాంచి యసుర♦చిడిముడిపడుచున్. ౬౪౦

ఉ॥ శక్రజితుండు పల్కు నొగిఁ ♦ జావఁదలంచి యొదిర్చె నేనియున్
విక్రమధామమైన హరి ♦ వీరత ధంతులఁ గూల్చుఁగాని దు

ర్వక్ర ముఖంబులౌ పిఱికి ♦ పందలఁ గోఁతుల జంపఁజూచునే ?
సక్రమ కీర్తిగల్గునొకొ ♦ చంపియుఁ ? జావక తెందు లక్ష్మణుల్. ౬౪౧

ఉ॥ పావని ధైర్యశౌర్య బల ♦ పారము లీర లెఱింగియుంటి ర
ప్పావని పడ్డపాటు గని ♦ వానికి మించిన వారిఁబోలె నీ
రావణి పైకి వత్తురె ? చి ♦ రంతన కీశులె కారె మీరు ? క్రొం
జేవ గడించి వచ్చితిరె ? ♦ చేరుఁడు కానల జీవితార్థులై. ౬౪౨

చ॥ మనుజుల నాకుఁ జూపి బహు ♦ మానము లందుఁడీ యంచుఁ బల్కి నా
దనుజు వనేచరుల్ కినిసి ♦ తార్కొని భూధర భూజ బృందముల్
గొని వయివంగ రావణి య ♦ కుంఠిత సాయక వృష్టిఁజేసి య
వ్వనచర వారముల్ బల జ ♦ వంబులు క్రుంగి ముడుంగ నేసినన్. ౬౪౩

చ॥ బలిముఖ మేదినీధ్రముల ♦ పై దనుజాశుగ కల్పమేఘ ము
క్త్యలఘు తరంబుగాఁ గురియ ♦ నద్రిచర ప్రతతుల్ నశించె నా
బలియుని వేల్మియుం జెడియె ♦ వానిని వెండియుఁ బోఱిపోవ నీ
కొలసి వధింపుమా యని ర ♦ ఘూత్తముతోడ విభీషణుం డనెన్. ౬౪౪

చ॥ వడివడి లక్ష్మణుండు దశ ♦ వక్త్రకుమారుని డాయునంత సొ
ల్మిడి విడఁదేఱి మారుతి సు ♦ మిత్రనుతుం గని నాభుజంబులం
దొడిఁబడకుండ నెక్కుమని ♦ తోడనె మూఁపునఁదాల్చి పేర్మిఁ జె
న్నొడిదము బేడిదమ్ము వడి ♦ యుం గొనఁబేర్చె విచిత్రరీతులన్ ౬౪౫

—: ఇంద్రజి ల్లక్ష్మణుల యుద్ధము :—

ఉ॥ వేయి మొయిళ్లు లొక్కటగు ♦ పోఁక నెసంగిన మేఘనాదుఁడున్
వేయి గుఱాలఁ బూనిచిన ♦ పేరిమి గల్గిన తేరి నెక్కఁగా
వేయి వెలుంగు పోఁడిమిని ♦ వీరుఁడు లక్ష్మణుఁ డాజి రాజిలెన్
వేయి మొన ల్నరాజి యన ♦ వేడ్కఁ బ్రవర్తిలె నాంజనేయుఁడున్. ౬౪౬

చ॥ నిదుర తొలంగినట్టి గుణ ♦ నీరధి లక్ష్మణుఁ డగ్నులుమ్ముచున్
భిదురములట్లు పోవునవి ♦ పీడని కర్మము లట్టు లేచు నం
గదయను రోగముం గలవి ♦ కంక నిభంబులు చిత్తవేగమై
పొదలెడు కొన్ని తూపులను ♦ పూనిక నేసె సురారి సూనుపై. ౬౪౭

ఉ॥ అట్టివ యన్ని యమ్ముల న ♦ రాద సుతుం డరివోసి యేసి తా
నెట్టన సాగరంబు లవ ♦ నీధ్రము లంబరముల్ దిశాతటుల్
పట్టుగఁ గానరాక యుఁక ♦ బాణములే భువి తేవనంగ మే
ముట్టఁగ నంపవానఁ దగ ♦ ముంచి గుణధ్వనితోడ నార్చెఁగన్. ౬౪౮

ఉ॥ పిచ్చుక పింపులట్లు మొగి ♦ వెల్వడు తూపుల లక్ష్మణుండు తాఁ
జెచ్చెరనేసి వాని నిర ♦ సించుచుఁ ద్రుంచె; శిలల్ మలల్ తరుల్
పచ్చడిగాఁగఁ ద్రొక్కెలయు ♦ వాయువుఁబోలిన బాసవాళ్ల పి
న్నచ్చరి స్యందనమ్మును స ♦ మంచిత మారుతి పాదయుగ్మముల్.

క॥ ఇరువురు తమయొడఁ గొఱఁతల, నరయంగానీక సమత ♦ నందుచుఁ బోరన్
బెరలేరు లేరు వీరికి, దొర యని సిర్జరులు వెఱఁగు ♦ దొరసిరి తమలో. ౭౫౧

మ॥ శర సందోహము లంబర స్థలమునన్ ♦ జన్నున్నవో లేవొ ని
ర్జర నేత్రంబులు చూడవయ్యె మనసుల్ ♦ జడ్డయ్యె లెక్కింపఁగా
బరిమాణంబున కందవయ్యె నడుమన్ ♦ భంగించి యీఁదేనియున్
జొరదయ్యెన్ వ్రణరాజి దక్క నెదియుం ♦ జూపట్ట దమ్మేనులన్.

తే॥ నెఱసి శింజినీధ్వని నిండు ♦ నింగియందు, పిడుగులంబలె నెగడిన ♦ వేఁడివాఁడి
సెలలు దెసలెల్లఁ బొగ్రమ్మఁ ♦ జిమ్మిరేఁగెఁ, జుక్కలును మింట నల్లనై ♦ సురిఁగి పోవ.

చ॥ దిశల దిశాంతరంబుల వి ♦ దీర్ణ మొనర్చుచు శింజినీ రుతం
బశనుల కై వడిన్ మొరసె ♦ నంచులుచేరిన విండ్లనుండి క
ర్కశ విశిఖమ్ము లుగ్రగతిఁ ♦ గ్రమ్మెడు నెవ్వడి వ్యోమభూమియున్
వశమఱఁగా మిడుంగుఱులు ♦ వర్తిలఁజేసె భయంకర స్థితిన్. ౭౫౩

చ॥ శరధియు వట్టి తున్గిపడు ♦ సాయక బృందము నిండ నెండియున్
శరధియ యయ్యెఁ బ్రొద్దు శశి ♦ చందముతోఁ జెను రక్తముం జెడన్
తరువులు బొగ్గులయ్యె జల ♦ దంబులు మాఁడెను చుండు కంపు దు
ర్భరముగఁ బిక్కటిల్లె నిరు ♦ వాఁగుల సేనలు పాఱె భీతివై. ౭౫౪

ఉ॥ పీనుఁగులయ్యె నేనుఁగులు ♦ ప్రేతములయ్యెఁ దురంగ జాతముల్
జానుతొఱంగి యంగములు ♦ వ్రగ్గి మడంగె శతాంగ జాలముల్
మానము తగ్గఁ దగ్గ నను ♦ మానము వర్ధిల మానవాద సం
తానము ప్రాల్చె సాయక వి ♦ తాన మరుల్ విసుమాన మొందఁగన్

సీ॥ కొన్ని పంగుచుఁ బోయెఁ ♦ గొన్ని పొంగుచుఁ బోయెఁ, గొన్ని కూడుచుఁ
బోయెఁ ♦ గొన్ని మాఁడెఁ
గొన్ని వ్రాలుచుఁబోయెఁ ♦ గొన్ని వ్రేలుచుఁబోయెఁ, గొన్ని మెరిసిపోయెఁ ♦
గొన్ని విరిసెఁ
గొన్ని కుడిచినేగెఁ ♦ గొన్ని యెడమకేగె, సౌమిత్రి యేసిన ♦ శరచయములు
కొన్ని యనిలుఁ బోలెఁ ♦ గొన్ని యనలుఁ బోలెఁ, బిడుగులఁ బోలెను ♦ జడధిఁబోలె

తే॥ కొన్ని ధారాధరంబును ♦ కొని ధరాధ, రంబుఁ గొన్ని రుద్రాట్టహా ♦ సంబుఁగొన్ని
స్వేదజలమును పోలెఁ ద్ర ♦ వ్యాద సుతుఁడు, వైచు తూపులు రణభూమిఁ ♦ బరవువేళ.

క॥ వెల ముగుదల కడచూపుల, వలె నుక్కు జిరాలమీఁద ♦ బాహులపై మో
ములపైఁ బదములపై శర, ములు వ్రాలెం బీల్చి పిప్పి♦పొనరుచు నార్తన్. ౬౧౭

శా॥ లోకంబుల్ పరికంపమొందఁ గ్రతుభు ♦ గ్లోకంబు వీక్షించి యి
ట్లే కాలంబున దేవదానవ రణం ♦ బేచోట వర్తిల్లె? న
జ్యాకృష్టిధ్వని దిగ్గజంబుల వడం ♦ కాడించెఁ గల్పాంతమా
జోకల్ గానంగవచ్చెఁ దప్పిరి గతుల్ ♦ సూర్యుండు శుభ్రాంశుఁడున్.

చ॥ కులగిరులుం జలించె నని ♦ కుందుచు వేల్పులు చూచుచుండ సోఁ
కుల మెకిమీని పట్టి విలు ♦ కోపులు చేరఁగ లాగి కొన్ని య
మ్ముల రఘువర్యు వక్షమునఁ ♦ బూనిక నాటఁగనేయ నాతఁడున్
దలఁకక వాని బొందడము♦తచ్చన లాడుచుఁ జించె వ్రేల్మిడిన్. ౬౧౯

క॥ ఐరావతమును నిర్జర, వీరుల నేఁచిన నిశాత ♦ విశిఖమ్ముల న
మ్మారుతి భుజములఁ గ్రువ్వ బ, లారి జితుం డడరి యేసి♦యటమట పఱచెన్.

క॥ హనుమానుఁ డస్తగిరిపై, దినకరువలెఁ గానిపింపఁ ♦ దెలిసి కినుక ల
క్ష్మణుఁ డెటుఁ బోనీయక మా, ర్గణములఁ బఱపించి దైత్యు♦రథముం గూల్చెన్

క॥ అమరులు ముమ్మూర్తులు మో, దము నందిరి వేఱు తేరు♦దనుజుఁడు గొని రో
సమునఁ బది విశిఖములు మ, ర్మము లంటఁగనేసి సింహ♦రవ మొనరించెన్.

చ॥ వివశత నొంది యొక్కత్రుటి ♦ వీకునఁ దేఱిన లక్ష్మణుండు దా
నవు ననరుల్ చుఱుక్కుమన♦నారసముల్ వడినేసె నాఁతడుం
బొవరునఁ ద్రోవఁజూచియును ♦ పోతర మంది గిరీశు తన్నుచే
నవమతి నొందు కాలుగతి♦నక్కట! యక్కునఁ బోటు చేకొనెన్. ౬౨౩

మ॥ శిత నారాచ మొకండు వానిమఱువున్ ♦ ఛేదించి వక్షంబు ను
ద్ధతిఁ దూఁటాడుచు దుస్సెఁ బృష్ఠమున ను ♦ ద్దం డాశుగం బొండు సం
గతిగా బాహువు గ్రుచ్చె నొక్కఁడు పతా♦కం గూల్చె మూర్ఛాస్థితిన్
దితిజాధీశ కుమారుఁ డొందె క్షణ మా ♦ దిత్యుల్ ముదంబందఁగన్.

ఉ॥ శోణిత ధార లుప్పతిల ♦ శోణగిరిం బలెఁ గొంతసేపు గీ
ర్వాణ విరోధి యుండి పిద ♦ పం దగఁ దేఱి రుషాతిశాయితన్
బ్రాణయు నిన్నడింపఁ బ్రబద♦రంబు లసంఖ్యము లేసి తత్తను
త్రాణముఁ జింపఁబూన నవి ♦ తాఁకుచు నెట్టగయుం గలంగుచున్.

చ॥ మఱియును కొన్ని బాణముల ♦ మారుతి నేయఁగ వాని లక్ష్మణుం
డఱిముఱినేసి రావణి వ ♦ రాంగము వక్షము నొవ్వనేసి వి
ట్టఱ నొక కోలచే దనుజు ♦ నల్లెను ద్రెంచి మహోగ్రలీల బి
ట్టుఱవుగ హుంకరించెఁ బురు ♦ హూత విరోధి మనంబు స్రుగ్గగన్.

ఉ॥ మాన్యత వీఁడు దాల్చినది ♦ మాధవువిల్లొ? గిరీశువిల్లొ? సా
మాన్యుఁడు గాఁడు కత్తళము ♦ ప్రాఁలదు వీనిని గెల్వశక్యమే
జన్యమునందు నాకని వి ♦ శంకితుఁడై దనుజేంద్రసూతి చై
తన్యము దక్కి నిల్చుట యె ♦ దం దలపోసి విభీషణుం డనున్. ౬౬౭

చ॥ హరిహయు గెల్చి పొల్చిన ద ♦ శాస్య కుమారుని గెల్చితీవు చి
త్తరువుగ నిల్చెవాఁడు మది ♦ తల్లడమందె నిమేషమేని జా
పిర మొనరింప కియ్యకొన ♦ పెంపరలాడుమ యంచుఁబల్కి హె
చ్చరిక యొనర్ప లక్ష్మణుఁడు ♦ సమ్మతిఁజూపుచు నుండు నంతలో. ౬౬౮

సీ॥ కాలునిలీలఁ గాం♦తాళంబు గొనిరేఁగి, యసురపుత్త్రుం డని♦లాస్త్రమేసె
లక్ష్మణాఖ్యుండు చె♦లంగి నవ్వుచు వాయు, దేవతాక శరానఁ♦దిగిచె దాని
ననలాస్త్రమును దైత్యుఁ♦డరివోసి పరపంగ, దాని నాతండు న♦ద్దాన నడఁచె
వారుణాస్త్రంబు బ♦లారిజితుం డేయఁ, దచ్ఛరంబున దాని♦త్రాణ నణఁచె

తే॥ భాస్కరాస్త్రంబు రావణు♦పట్టి విడువ, మిత్రశరముతో దాని సౌ♦మిత్రి త్రుంచె
చచ్చితివ చచ్చితివ యని♦మచ్చరించి, దనుజసుతుఁడు బ్రహ్మాస్త్రంబు♦ మొనసియేసె

తే॥ భవుఁడుమఘవుఁడునలువతా♦పసులుసురలు,తలరిసౌమిత్రికిఁజిరాయు♦వౌలయుఁగాత
మంచుఁ బలుక నాతఁడు విజృ♦భించిమిడుఁగు,లడరఁగుప్పుచువచ్చున♦య్యస్త్రముఁగని.

ఉ॥ చేవ తొలంగి వీఁడు మును ♦ చేసిన పోరునఁ గంజజాస్త్రముఁ
ద్రోవఁ దొలంగియేయఁ గడ ♦ ద్రోవఁగ లేక యడంగె నంచు నీ
కైవడి నిప్పుడుం దొడఁగెఁ ♦ గావున నూరకయుంట పాడి గా
దీ వనజాస నాస్త్రమున ♦ నే యుపసంహరణంబు చేసెదన్. ౬౭౧

చ॥ జగము సుఖించుఁగాక యెల ♦ సంబునఁ బోరొనరించు రావణిన్
దిగువకయుండఁ గా కితని ♦ దివ్య శరం బుపశాంతి నొందుఁగా
కగుత జయంబు ధర్మమున ♦ కంచు నజాస్త్రము వీడె వేల్పులా
సుగుణ గణంబులం గుఱిచి ♦ శూరుని లక్ష్మణు సన్నుతించుచున్. ౬౭౨

చ॥ జగము సుఖించుఁగాక యని ♦ చాటి వచించె దురాత్ము రావణిన్
దెగ వచియింపఁడయ్యె రణ ♦ ధీరుఁ డితండు విరించనాస్త్రమున్
దగ నుపసంహరింపు మనెఁ ♦ దక్కఱ బుద్ధిని చూపఁడయ్యె నీ
సుగుణ గణంబు లెయ్యెడలఁ ♦ జూడమ యంచు నుతించుచుండఁగన్.

చ॥ అనలముతోడ డీకొనఁగ ♦ హ్రాదిని వచ్చినభంగి వచ్చి ల
క్ష్మణుని శరంబు దైత్య విశి ♦ ఖంబు నడంచి నభంబు సర్వమున్
బొనుపడ నొక్క జ్వాలగ న ♦ ముద్ధతి నేచిన వేఱుతూపుచే
నణఁచె విషాత్తవేదన వి ♦ షాంతరయుక్తి నడంచుకైవడిన్. ౬౭౪

ఉ॥ లక్ష్మణు శౌర్య సాహస బ ♦ లంబులఁ గాంచి నిలింపు లష్టు ధీ
లక్ష్మి నెలర్చు రాఘవుల ♦ లావు దలంప నశక్యముల్ భువిన్
బక్ష్మము పాటియేని గల ♦ వా ? యన శంభుఁడు పల్కె మీరలున్
సూక్ష్మమతిన్ గణింప కిటు ♦ స్థూలమతిం దలపోయఁ జెల్లునే ? ౬౭౫

మ॥ నర నారాయణు లీ నరాకృతులు వి ♦ జ్ఞానేశ్వరుల్ దుష్ట సం
హారణార్థం బవతారమందిరి జగ ♦ ద్వ్యాపారు లాద్యుల్ జగ
ద్భరణ ప్రాభవు లవ్యయాత్ములు జగ ♦ త్కల్యాణ సంధాయకుల్
కరుణాపూర్ణులు వీరలం గలఁచునే ♦ కంజాననా ద్యస్త్రముల్ ? ౬౭౬

శా॥ సామాన్యాకృతులొందియుం బ్రకృతి సం ♦ సర్గంబు లేకుండి మా
యామేయావరణాంతరస్థులయి పూ ♦ ర్వాకారముల్ తోఁప నీ
కీమాడ్కిం జరియించు వా రఖిల భూ ♦ తేశాను లీయర్థమున్
మీమీ చిత్తములంద యుంచుకొనుఁడీ ♦ మీకయ్యెడున్ భద్రముల్.

ఉ॥ చేమిరి పాలలోఁ గలియు ♦ చెల్వున జీవులయందు భక్తహృ
త్తామరసంబులే యవన ♦ థంబుగఁ గొన్న మృణాలభోజి ని
త్యామల పూర్ణతత్త్వము ధ ♦ రాత్మజభర్త నిజమ్ము ధర్మమున్
భూమిని కాచుపొంటె నిటు ♦ పుట్టె మహాత్ముల వేఁడికోలునన్. ౬౭౮

చ॥ అని శశిమౌళి పల్కఁగ వి ♦ యచ్చరు లచ్చెరువంది శంకరా !
విని కని యుంటి మయ్యు నవి ♦ వేకమునం దన మాయచే నెఱుం
గని వహి నందియుంబుగొని ♦ కానటబీసట నొందుచుందు మా
త్మను గల శంకలెల్లఁ గడు ♦ దవ్వుగఁ బోయిన వంచు నుండఁగన్. ౬౭౯

శా॥ మాయాశీలుఁడు రావణాత్మజుఁడు దు ♦ ర్మానంబు పాటించి నీ
యాయుష్కాలము నేఁటితో ముగిసె నో ♦ య్యం బ్రోడవే యైనచో
నాయీ యేటును కాచికొమ్మ యనుచున్ ♦ నారాయణాస్త్రంబు మం
త్రాయత్తంబుగఁ జేసి యేసె జగ మా ♦ హాకారముల్ సేయఁగన్. ౬౮౦

చ॥ శిరములమీఁదఁ గేల్మొగిచి ♦ సిద్ధ మునీంద్ర సురాదు లెల్లరున్
హరిహరి యంచుఁ గాచికొన ♦ నారవముం బొనరించి రమ్మహా
శరము కరమ్ములన్ మొగుచు ♦ జంతు కదంబము నంటదన్న టీ
రరసిన లక్ష్మణుం డదుర ♦ నచ్యుతుఁ డేనని నిల్చె నెంచుచున్. ౬౮౧

మ॥ జ్వలన జ్వాలల వెల్వరించుచు జగ ♦ జ్జాలంబులం గాల్చు మం
దల నేతెంచు మహాస్త్రముం దొలఁగి పోఁ ♦ దప్పించుకో నెంచ కం
చల నున్నట్టి సుమిత్రి పుత్త్రుఁగని వై ♦ ష్ణవ్యాంబకం బంటకే
తలఁగం బాటి ప్రదక్షిణంబు గొని యం ♦ తర్ధాన మందెం ద్వరన్. ౬౮౨

చ॥ వనచరు లుల్లసిల్లిరి త ♦ పస్వులు లోకము గాచితంచు మో
దనమున గంతులేసిరి ము ♦ దంబున వేల్పులు దేవ సుందరుల్
మనమున నుబ్బి గొబ్బున సు ♦ మంబులు చల్లిరి బ్రహ్మయున్ భవుం
డును వినుతించి రాడిరి క ♦ డుంగడు సంతసమంది రెల్లరున్. ౬౮౩

మ॥ బలహీనంబయి వైష్ణవాస్త్ర మడఁగెన్ ♦ భావింప వీఁడెవ్వఁడో ?
జలజాక్షుండొకొ ? యెవ్వఁడేని యగుతన్ ♦ శంకింప నేలా ? జగ
ద్విలయంబుం గలిగించు పాశుపతమున్ ♦ వేకూర్చి యీబాలిశున్
జలమారన్ వధియించువాఁడ నని యెం♦చం జిత్తమం దుద్ధతిన్ ౬౮౪

ఉ॥ రావణి నిశ్చయంబును స ♦ రాలున దివ్యలెఱింగి యేదిరా
త్రోవ ? జగంబు జీవ నిక ♦ రుంబముతో నశియించునేమొ నేఁ
డీవహి వీనిచేత ? నెదు ♦ రెయ్యది ? దీని సహించు వారలీ
దేవతలందు గల్గరని ♦ దీనత నొంది కలంగుచుండఁగన్. ౬౮౫

చ॥ ఇతరు లెఱుంగకుండినది ♦ యీడును లేనిది మున్ను వానికిన్
జితమదనుండు సత్తపము ♦ సేయఁగ మెచ్చి యొసంగు నయ్యమో
ఘ తర మహాస్త్రమున్ మది న ♦ ఖండితభక్తి భజించి లక్ష్మణున్
మృతునిగఁ జేసి క్రమ్మఱుము ♦ మేవడి నంచు వచించి యేయుడున్.

సీ॥ అయ్యస్త్ర మంత గ ♦ దాసి తోమర కుంత, పరశు ముద్గర శూల♦వాల నాగ
గరళ భూత ప్రేత♦కాల నిర్ఘాతాది, బహుళ రూపంబులఁ ♦ బరఁగి విలయ
కాలాగ్ని సప్త సా♦గరములు చండ మా, రుతమును తోడరా♦క్షితి మునుంగ
తఱిఁ గప్పు చీఁకట్లు♦నెఱసిన వననొప్పి, సౌమిత్రి యురము ల♦క్ష్యంబుగాఁగఁ

తే॥ గెరలిలోకత్రయము గిర♦గిరనఁదిరుగు, కరణిఁ దోఁపంగ నుడియుచుఁ♦గడఁగిరాఁగ
వానరులు వేలుపులు ముని♦వరులు జడిసి, మొగిసి కనలేక కన్నులు♦మూసికొనిరి.

సీ॥ గడగడ వడఁకుచు♦నొడలు చెమర్పంగఁ, గని విభీషణుఁడు ల♦క్ష్మణ ! యిదేమి ?
దీనిఁ దొలంగించు♦తెరువెయ్యదియు లేదె ? యన నుత్తరముగ హా♦సంబొనర్చి
వానర వీరులు♦పాదసన్నిధి డాసి, యభయ మభయ మంచు♦నఱచునంత
నలుకకుఁ డలుకకుఁ♦డని చేయి వీచుచు, జగము లల్లలనాఁడు♦చందముగని

తే॥ పాశుపతమును ధ్యానించి♦భావమందు, దీని నడఁపుము వేఱొండు♦తెగువ వలవ
దనుచు నొకశర మరివోసి♦మొనసి విడిచి, త్రుటిని తన్మహాస్త్రముబలో♦ద్యోగమడఁచె.

మ॥ దివిఁ గోలాహలముల్ చెలంగె మొరసెన్ ♦ దివ్యానక స్తోమముల్
భువి శాఖామృగముల్ మదించె వెస నం ♦ భోరాసు లుప్పొంగె నా
ర్జవ ఘోషంబుల నించె మేఘములు ధ ♦ ర్మా బుబ్బె మోదించి రా
ఘవుఁ గాంచెన్ జయలక్ష్మి శిక్షిత కటా ♦ క్ష శ్రీల హేలాగతిన్.

మ॥ లయకాలంబున సర్వలోకములు నై ♦ క్లబ్యంబుగా జీవ సం
చయము న్నాశము సేయు రుద్రుని మహా ♦ త్రుగ్ర క్రూర వేగంబు నీ
రయమై వ్యర్థముగా నొనర్చిన సుమి ♦ త్రాపుత్రక స్థైర్యము
దయివాఱం గని దిగ్భ్రమించి నిలిచెన్ ♦ దైత్యేంద్ర సూనుండటన్.

శా॥ దివ్యాస్త్రం బుడివోయె నంచు మది సం ♦ దేహంబు నైకోక యా
క్రవ్యాదుండు ప్రయోగ చాతురిమ ము ♦ గ్రంబై ప్రకాశింపఁగా
నే వ్యాపన్నత నొందనేల యని కై ♦ నేర్పొప్ప సౌమిత్రిపై
నవ్య స్థేమము మీఱనేసె నిభజి ♦ న్నాదంబు గావించుచున్. ౬౭౧

శా॥ సుగ్రీవాదులు వేసరిల్లక మహా ♦ క్షోణీధ్రముల్ దెచ్చి సం
వ్యగ్ర ప్రక్రియ నున్న రావణిపయిన్ ♦ వైవన్ విజృంభించి పం
క్తిగ్రీవాత్మజుఁ డంపఱం గురిసి త ♦ ద్వేగంబు వారించి యు
త్యుగ్రుండై కని తత్పితృవ్యుఁ బలుకున్ ♦ సోత్ప్రాసి వాక్యంబులన్.

—: మేఘనాదుఁడు విభీషణు నిందించుట :—

శా॥ జాతి భ్రష్టునిమాడ్కి నన్వయ యశ ♦ స్సౌశీల్యముల్ జార్చి దు
ర్ఖ్యాతి ప్రీతిని మర్త్యమాత్రుల తదం ♦ ఘ్రుల్ పట్టి సేవించుచున్
ఖ్యాతిం దోరిచి వారి పాటలకు వె ♦ న్కం దాళముల్ వైచుచున్
నీతిన్ మాలి చరించు నీదుశిరమున్ ♦ నేలం బడం గూల్చెదన్. ౬౭౩

శా॥ పిత్రాజ్ఞామాత్రన కంపమొంది క్రతుభు ♦ గ్బృందంబు సేవించినన్
నిక్షేపంబులు కూడినన్ భువన ని ♦ ర్ణేతృత్వమే యబ్బినన్
శిక్షామాన పరాక్రమ స్థిరగుణుల్ ♦ సీత్కారముల్సేయు నీ
కుక్షిక్షుద్భవ నీచ జీవితము నో ♦ క్రూరాత్మ! వాంఛింతురే? ౬౭౪

మ॥ జలముల్ గల్గినచోటనే గలుగు మ ♦ త్స్యశ్రేణి దైత్యేశ్వరుం
డెలమిన్ భాసిలుచోటనే దనుజులున్ ♦ దృష్టింపఁగా నుంద్రు వా
రలు చేటొందిన వేళలన్ బ్రభునకై ♦ ప్రాణంబు లర్పింత్రు నీ
వలెఁ గాఁజాలరు ; లంక నే యసురులం ♦ బాలింతువో మీఁదటన్?

ఉ॥ పూర్వము వేల్పుపెద్దఁ దన ♦ బొడ్డునఁ గాంచిన మాయి కేశవున్
గర్వము సర్వముంజెడ వ ♦ గర్చుచుఁ బాఱఁగఁదోలి యొక్కచే
శర్వుని పర్వతంబు గొనఁ ♦ జాలిన మత్పిత రాజ్యభారమున్
నిర్వహణంబు సేయుటలు ♦ నీవిటు కోరుటకా? కులాధమా? ౬౭౬

మ॥ అరవిందాసన వంశమందు జననం ♦ బందంబుగా నందుటన్
సురలున్నిన్ను భజింత్రు పుణ్యజన దూ ♦ ష్యుండైన నీవిప్పుడో

నరులం గొల్చుచు నన్నసంపదల క్రిం ♦ గం జూచుచున్నావు నీ
కరయన్ మానమనంగ నున్నదియె? మా ♦ యంబౌను మాతోడనే.

శా॥ నిందం గూరిచి నిందచేసి కులమున్ ♦ నీచెల్లెలిం బట్టి యా
క్రందింపం దయమాలి ముక్కుసెవులన్ ♦ ఖండించు దుష్టాత్ములన్
సందేహింపక తెచ్చినాఁడ వికఁ జ్యే ♦ ష్ఠభ్రాతఁ జంపించి లం
కం దైవాఱఁగ నేలుకొందువు గదా? కష్టాత్మ! వంశాదనా! ౧౯౮

చ॥ గురు హిత బంధుమిత్రులను ♦ కూలిచి కైకొను మేల్మికంటెఁ బే
దఱికమె మేలుకాదె? రణ ♦ ధారణిఁ గూలిన యన్నతోడనే
పొరలుచు నేడ్తువో? ముదముఁ ♦ బొంది బలే! యని కేకవెట్టెదో?
నరు గెలుపు న్నుతించెదవొ? ♦ నారక మందెదొ? వంశ దూషణా!

మ॥ పరుగుల్ వాఱిన కాల కింకరుల గె ♦ ల్వంజేయువారా నరుల్?
తెరలన్ మందులచేత జీవములు సం ♦ ధిల్లంగ నిల్చుండు వా
రరయన్ గెల్తురె? యన్న సంపదల నీ ♦ వందంగ నర్హుండవే?
శిరముం ద్రుంపక వీడితిన్ జగము నన్ ♦ సెగ్గించునన్ శంకమై. ౨౦౦

శా॥ భ్రాతృద్రోహివి నీ మొగంబు గనినం ♦ బాపంబు సిద్ధించు నీ
నేతృత్వంబు సహించునే జగము? నీ నీ ♦ తంబు లాలించునే?
రోఁతల్ చేఁత లటంచు దూఱు ప్రభుపు ♦ త్త్రుం గాంచి చిర్నవ్వునన్
నీతి ప్రౌఢి విభీషణుండు పలికెన్ ♦ నిర్ణీత చిత్తస్థితిన్. ౨౦౧

ఉ॥ ధర్మమె తోడగున్ మహి న ♦ ధర్మము తోడుగఁ గొంచుఁ బెక్కు దు
ష్కర్మము లాచరించి నర ♦ కంబునఁ గూలఁగ జాలకుంటి న
త్కర్మముఁ జిక్కఁబట్టితిని ♦ కల్లలు వీడితిఁ బంక్తిమస్తకుం
డర్మిలి నిందితంబులకు ♦ నాన వహించిన దాఁకఁ దమ్ముఁడన్. ౨౦౨

మ॥ కలుద్రావన్ బరదారఁ గోర గిలుబున్ ♦ ద్రవ్యంబు నాశింప మూ
ర్ఖులఁ జేరన్ బెరసొత్తులం బలిమిఁ గై ♦ కోఁబోవ సత్కర్ములన్
గలహింపన్ బరనిందనంబు తలఁపన్ ♦ గావింప నింద్యమ్ములన్
ఖలులన్ దుర్వ్యభిచారులన్ విడుచుటల్ ♦ కారాని కార్యంబొకో?

మ॥ త్రిజగంబుల్ వినుతించు తత్త్వమగు నా ♦ దేవేశు నర్ధాంగి పూ
త జగన్మాత పతివ్రతా తిలకమున్ ♦ ధర్షించి బాధించుటల్
త్యజియింపం దగునంటి దీననగు నా ♦ తప్పేమి? నీ తండ్రి య
ల్క జనింప న్ననువెళ్లఁ గొట్టనట ని ♦ ల్వంబోలునే తెల్పుమా?

ఉ॥ క్రొవ్వున ధర్మముం గనక ♦ కోపము కామము వేల్పుగా మదిన్
నివ్వటిలం దలంచు మిము ♦ నిత్యసుఖంబులె యొందనిమ్మ మ

మ్మోవ్విధినేని నింద యెల ♦ యింపఁగ రౌరవ మందనిమ్మోలన్
ద్రివ్వలు సాగు దుష్కృతము ♦ త్రెవ్వక యుండునె? ధర్మమోడునే?

ఉ॥ జ్ఞానులకున్ సుగమ్యుఁడగు ♦ సత్యవిహారుని రాముఁ జేరితిన్
మానుగ సర్వలోకములు ♦ మన్నన సేసెదుఁ గాక నిందయే
పూని యొనర్చుఁగాక భువిఁ ♦ బొందుఁడు మీరలు మేలునేని కీ
డేనియు నంచు మారుమడి ♦ యిట్టటు నార్చుచుఁ బల్కు పిమ్మటన్.

ఉ॥ రావణి పల్కు సీతలఁచు ♦ రాజ్యము మేలునులెల్ల నిల్చునే?
నా వలకేలనున్న యొక ♦ నారసమంటినఁ దీఱుఁగాక నేఁ
డావలి కెట్టులేగె దని ♦ యల్కను తార్క్ష్యుని పోలు బాణమున్
జావుము యంచు వీడెఁ దన ♦ చాపముఁ జక్రముఁ బోల లాగుచున్.

తే॥ కీలయనఁ బిడుగన భవు♦శూలమనఁగ, వచ్చుటను కాంచి మిత్రుండు♦చచ్చెఁ జచ్చె
ననుచుఁ బ్లవగు లాక్రోశింప♦నమరులెన్న, మించి సౌమిత్రి నడుమనే♦త్రుంచె దాని

క॥ తన విశిఖము తునియఁగ రా, వణి వెండియు భల్ల మొండు♦వడిసేయ విభీ
షణుఁ దాఁకనీక నడుమనె, తునుకలుగా లక్ష్మణుండు♦తుండించె వెసన్. ౨౦౯

శా॥ తన్నుం జంపఁగ నుద్యమించె నను కాం♦ తాళంబునన్ సత్య సం
పన్నుండైన విభీషణుండు ఘన భా ♦ స్వ ద్దండనుం బూని యా
పన్నుండైన బలారి జిద్రథము న ♦ శ్వశ్రేణితో సారథిన్
ఛిన్నాభిన్నము చేసి యార్చెఁ బ్లవగ ♦ శ్రేష్ఠుల్ ప్రమోదింపఁగన్.

చ॥ చెడిన రథంబుపై నిలిచి ♦ చిందఱగొన్న దశాస్యసూతి నె
వ్వాడిని సుమిత్రపట్టి పయి ♦ వానరపాళిపయిం బిత్రృవ్యుపై
జడిగొను పోల్కి శాతశర ♦ సంఘములేసి రణస్థలంబు నె
త్త్యోడఁగన రక్తసిక్తముగ♦నేడ్తెఱఁజేసి మదించి యార్చుచున్. ౨౧౧

చ॥ మరియని తేరులేక వెస ♦ మున్మురమైన దురంబు సేయఁగా
నరిది యటంచు మానసము ♦ నందు దలంచి క్షణంబులోన నం
బరతల వీథికేగె నను ♦ వార్తకవీశ్వర వర్గమందు తీ
వరపడి పర్వఁ బంక్తిముఖు ♦ భర్మ గృహంబున కేగె నత్తఱిన్. ౨౧౨

## ౨౭ ఇంద్రజి ద్వధ పటలము (౨౧)

మ॥ గగనంబందు మొయిళ్ల డాఁగె నను శం ♦ కంబొంది మున్నోవలెఁ బె
ల్లుగ మాయల్ పచరించు నంచుఁ బ్లవగుల్ ♦ మోమోడి కన్పుండ నా
శుగ వేగంబున మేను రక్తమయమై ♦ స్రుక్కింపఁగా వచ్చి తా
చ్చగు పుత్త్రుంగని రావణుండు చలిత ♦ వ్యాపారుఁడై యుల్లసన్. ౨౧౩

ఉ॥ పూనిన నీముఖంబు పరి♦పూర్తి వహించి యొనంగదంచు నీ
మేని వ్రణంబులే తెలిపె ♦ మిక్కిలి గ్లాంతిని పొంది కంపముం
బూని ఖగేంద్రుఁడన్న యహి ♦ పోలిక నుంటివి కారణంబు నా
వీనులు మానసంబు విన ♦ వేగిరపాటు వహించెఁ దెల్పవే. ౨౧౪

చ॥ అనవుడు నిట్లనున్ దశము ♦ ఖాత్మజుఁ డూనిన మాయలెల్ల నీ
యనుజుఁడు దెల్ప వారలొగి♦ యజ్ఞము విఘ్నము సేసి రంత నేఁ
గనలి పరాక్రమంబు నొడి ♦ కంబును తెంపును చూపి పోరితిన్
వనజజ విష్ణు రుద్ర శర ♦ వారము లక్ష్మణుఁ డోర్చె నేమనన్ ! ౨౧౫

చ॥ అతులిత వైష్ణవాస్త్ర మొగి♦నా రఘువర్యుఁ బ్రదక్షిణించి కుం
చితగతి నేగెనన్న విర ♦ చింపఁగ వెండి మహాస్త్ర మొక్క డం
చితముగ నున్న దేమి ? కడు♦చేటు మనంబునఁ గోరి కోరి యీ
వితమునఁ దెచ్చికొంటి విది♦వీడున యెన్నివిధాలఁ జూచినన్ ? ౨౧౬

చ॥ కడఁగి విరించినాస్త్రము జ ♦ గమ్ము నశించున యన్న భీతిచేఁ
దొడుగఁడు దాన నే గెలుపు ♦ తోఁ జనుదెంచితి మున్ను నేఁడు నా
కడఁకలు సాగవయ్యెఁ జలు ♦ కన్ స్వబలంబున నన్ను గూల్పఁగాఁ
దొడఁగె జగంబు లొక్కరుఁడె ♦ దోరుప శక్తుఁడు లక్ష్మణుం డనా !

ఉ॥ జంకితినంచు నెంచకుము ♦ జానకిపైఁ గల యాస వీడినన్
గింకను వీడి శాంతి నవ ♦ గీర్ణ చరిత్రులు రాఘవప్రభుల్
లంకను వీడువారు మన ♦ లన్ క్షమియించెదు వారు నీ సుహృ
త్కింకర పుత్త్రబంధు బల ♦ కీర్తులు మాయక నిల్చు నావుడున్. ౨౧౮

చ॥ భుజములు సంచలింప రద ♦ ముల్ నవచంద్రికలన్ వెలార్ప శే
రజముగ నవ్వి రావణుఁడు♦రాజన మొప్పఁగ నింక నీవు భూ
భుజుల పయిన్ దురంబునకుఁ♦బోవవు భీతియుఁ జింత యేల ? యు
క్కుజముగ నేన యేగి యెన ♦ కంబున వారలఁ జంపి వచ్చెదన్. ౨౧౯

ఉ॥ ఉండినవారు గెల్తురని ♦ యుండెడువారు జయింతురంచు నీ
దండితనంబు నాకు నుచి ♦ తంబుగఁ దోఁచెడు నంచు నమ్మి యీ
కొండిక యొంటరమ్ము మది ♦ గోరి పొసంగ వహింప లేదు మ
చ్చండ భుజాబలంబు నెల ♦ నంబున నమ్మియె కొంటి నీవగన్. ౨౨౦

ఉ॥ పేదతనంబు తెల్పితివి ♦ పేరిమి వింశతి చండబాహు సం
పాదిత కీర్తి గేయములు ♦ పాడుకొనన్ జగమందు నిర్జరుల్
మోదిలి చూచుచుండ నని ♦ బుద్బుద దేహము పాతుఁగాక యీ
పైదలి వీడువాఁడ ననుఁ♦వార్తయుఁ బుట్టునె నోట ? బాలకా ! ౨౨౧

చ॥ ఇలను జయంబు నేను గడి ♦ యింపక పోయిన రామ నామముఁ
నిలుచునయేని నాయభిధ ♦ నిల్వకపోవునె? యీల్గు టెన్నఁడేఁ
గలదియ కాదె? యెల్లరను ♦ కాలము మ్రింగుచు నున్నదే కదా?
కలదు లయంబు జీవులకుఁ ♦ గల్గదు కీర్తికి నాశ మెన్నఁడుఁ. ౭౨౨

చ॥ విడిచితి సీతనన్న నుడి ♦ వీనులఁ బడ్డ క్షణంబులోపలం
బొడవునఁ గిట్టి కట్టికొని ♦ పోదురుగాక నిలింపు లింతకుఁ
జడియుదురే? జగంబులఁ బ్ర ♦ శస్త బలంబున గెల్చి కీరితిం
బడసిన యేను నప్పితికి ♦ పందలు పొందెడు చావు చత్తునే? ౭౨౩

ఉ॥ పెక్కు లిఁకేల? నీవరిగి ♦ వేశ్మముచేరి శరీర మెల్లెడం
దక్కక గ్రుచ్చుకొన్న నిశి ♦ త ప్రదరంబులఁ బుచ్చివైచి నీ
త్రొక్కటపాటు దీర్చికొని ♦ దుఃఖము వోవఁగ నిద్రసేయు మే
నొక్కడ నేగువాఁడ నని ♦ యుగ్రత లేచుచుఁ దేరు లెమ్మనఁ.

చ॥ జనకుని పాదపద్మములఁ♦జాఁగిలి చేతులు మోడ్చి నాపయిం
గనలకుమీ క్షమింపుమి జ ♦ గజ్జన విశ్రుత గేయ! యిప్పుడే
చనియెద సంగరంబునకు ♦ శాంతిలు మే మరణించు వెన్క నై
నను కలరూపు నాదు ♦ వచనంబుల నీకు నెఱుంగ నయ్యెడుఁ. ౭౨౫

చ॥ అని రథమెక్కి పద్మజ భ ♦ వాదు లొసంగిన యాయుధంబులం
గొని తగ నర్థి కోటులకుఁ ♦ గోరికలెల్ల నొసంగి బాష్పవారి
కణములు నిండినట్టి కడ ♦ కన్నులఁ దండ్రిని చూచి చూచి నె
మ్మనము దృఢంబు చేసికొని ♦ మార్తుర మీఁదికిఁ బోవ వెల్వడఁ.

ఉ॥ లంకను గల్గు దైత్యులు క ♦ లంగుచు నిన్నడఁబాయలేము మ
మ్మంకిలి సేయఁబోకు మిదె ♦ యండనె వత్తుము చత్తుమంచు న
ల్వంకలఁ జుట్టిరా జనకు ♦ వారక కన్నిడి కావుఁడీరు నా
యంకులతోడ శాత్రవుల ♦ నంతకు ప్రోలికి నంపి వచ్చెదఁ. ౭౨౭

మ॥ అని యూరార్పఁగ దైత్యకామినులు చిం ♦ తాక్రాంతలై కాంచి నా
యన! నీముద్దుమొగంబు చూడకెటులీ ♦ ప్రాణాలతో నుందుమో
చనుదెంచెం గదె కాళరాత్రియయి యా ♦ త్మనృపుత్రి యీలంకకుఁ
జనువారలే చనువారలే గద! వినా ♦ శం బిట్లు రాఁగూడునే? ౭౨౮

చ॥ అని విలసింప వారల క ♦ టాక్షు పరంపర దాఁటిపోయె; మా
యను గొని దాఁగి యింద్రజితుఁ ♦ డావలికేగెనొ? మోసచేయఁడే
మనదు విభీషణా! యనుచు ♦ నాడుచు లక్ష్మణుఁడుండ వాని న్యాం
దన విరవం బకాండ జల ♦ ద ధ్వనినాఁ గవిసెఁ శ్రవంబులఁ. ౭౨౯

సీ॥ పసిఁడి కంబములతోఁ ♦ వఱలు టెక్కెంబులు, పిడుగులఁబోలిన♦బిట్టు రవము
వరరత్న ఖచితమై♦మెఱపుల కిల్లయి, ముల్లోకముల కేగ♦మొనయునదియు
జలధులు గలఁగంగ♦జగములు వడఁకంగ, దిగ్గజంబులు తెల్వి♦స్రగ్గి ప్రుగ్గఁ
ప్లవగబలము గుండె♦లవియఁ గులాద్రులూ, టాడ ధూళియు శేఁగ♦నవసి వీఁగ
తే॥ శేషు శిరములు చలియింపఁ♦జేసె రథము, రాక్షసులగర్జనంబు ఘో♦రముగఁ జెలఁగె
నింద్రజితుఁడు క్రూరాస్త్రంబు♦లేసి యార్చె, లక్ష్మణుండు ప్రత్యస్త్రంబు♦లం గవించె.

ఉ॥ మాయలు దుస్తరంబు లతి ♦ మానుషముల్ గల వీని నిప్పుడే
మాయఁగఁ జేయవేని జయ ♦ మార్గము నవ్వలఁ గాంచలేవు న
న్మిమ్మాయను నవ్విభీషణుని ♦ మేలి వచస్సుల నాదరించి దై
తేయునిమీఁద లక్ష్మణుఁడు♦తేపలుగాఁ గురియించె బాణముల్. ౨౩౧

చ॥ ఇరువురు నెచ్చుకుందు కన♦ నేర్పడకుండఁగ దూపులేయఁగా
శరమయమయ్యె బెట్టిదపు ♦ శబ్దముతోఁ రణరంగమెల్ల వా
నరులును దానవుల్ చెదరి♦నక్కిరి పల్లములందు మబ్బుల
ట్లిరువురు మీఱి మీఱి కురి ♦ యించిరి దొడ్డుగ బాణ వర్షముల్. ౨౩౨

చ॥ నడుమనె దానవాస్త్రములు ♦ నాశము సెందఁగ రాఘవాస్త్రముల్
తొడరి యతిక్రమించి కొని ♦ తూఱుచు రావణి మేనిరక్తముం
గుడిచెను దానవాస్త్రములు ♦ కొన్ని మరుత్సుతు మేనఁ బుట్టలో
నిడుపని పోల్కిఁ దూఱ గమ ♦ నింప కుపేక్ష యొనర్చె నాతఁడున్.

మ॥ విషముంబోలిన తూపులం బఱపి పృ ♦ థ్వీనాథపుత్త్రుండు రా
క్షసనాథాత్మజు బొందడంబు సురలెం ♦ చం ద్రుంచె దైతేయు నా
రసముల్ లక్ష్యము దప్పుచున్ గుఱికిఁ జే ♦ రం బోక క్రుంగారుచున్
బసమాలెం గ్రథనక్రియల్ చలుపు త్రో ♦ వన్ సత్త్వహీనంబులై.

మ॥ విలువిద్యం దన నేరుపుం బలము గా♦న్పింపంగ వీలుండమిన్
బలభిద్ద్వేషి పులస్త్యమౌని తనకున్ ♦ వాత్సల్య సంపూర్ణుఁడై
కలనం దోడని యిచ్చు కుంతమును వీ♦ కన్ వైవ మానీంద్ర వా
గ్బల సంకాశ శిలీముఖంబున నడం ♦ గం ద్రుంచె సౌమిత్రియున్. ౨౩౩

ఆ॥ మేకు లూన్చినట్లు♦మేన లక్ష్మణ శరా, వళులు పొడువ నింద్ర♦వైరి మరల
నలుఁగు లేయుచుండ♦నాతని తూణంబు, తునిఁగిపడఁగ రాము♦ననుజుఁ డేసె

ఆ॥ తేరు గలుగ వీఁడు♦తెరలఁడు లొంగఁడు, ననుచు హరుల నేసి♦యడఁగకునికిఁ
బగ్గములును తెగమి♦పరికించి సారథి, శిరము ద్రుంచి వైచె♦జిత్రగతుల. ౨౩౪

ఆ॥ ఇంద్రియములు కలఁచి♦యేఁపఁ దపించు త, పస్వి మనముపోలెఁ♦బడుపుఁ జెలి ప
తివ్రతాత్మ సరణిఁ♦దీండ్రించి స్వేచ్ఛను, పూనెఁ జోదకుండు♦లేసి తేరు. ౨౩౫

తే॥ పరుగువాఱుహరులఁబట్టి♦పఱపి తానె,తనయురంబెతూణముగఁగ్రు♦చ్చినశరముల
వారివారి లక్ష్మణుపయి♦మారుతిపయిఁ, బెరలపై నేసి చేసెను♦వీర రవము. ౨౩౯

శా॥ వీరాగ్రేసరుఁ డీతఁ డీతని మహా ♦ వీరత్వ మెందేనియుం
బేరుం గాంచిన శూరవార విలస ♦ ద్వీరత్వ మాత్రంబొకో?
పోరన్ మృత్యువు డాసినన్ గడఁకయుం ♦ బ్రోద్ధత్వముం వీడ రె
వ్వారో వారలె శూరులంచు విరులన్ ♦ వర్షించి రాఖేచరుల్. ౨౮౯

శా॥ నాయమ్ముల్ తనమేనఁ దీసి పఱపెన్ ♦ నామీఁదనే చెల్లరే!
యీయమ్ముల్ మనముం గలంగువడి నా ♦ యమ్ముల్ ప్రసారించినన్
గాయమ్ముల్ గణియింపఁడుం సురుఁగఁ డు♦త్కంపింపఁడుం సోలఁడుం
మాయమ్మా గడ వీనితోఁ గడిమి సా ♦ మర్థ్యమ్ము లిబ్భూమిపై. ౨౮౧

మ॥ అని సౌమిత్రియు మెచ్చి యాడఁ గని వీఁ ♦ డాకాశముం జేరునో
ఘనమాయల్ పచరించునో పగటనే ♦ ఖండింపు మీదైత్యు దం
దన వల్దంచు విభీషణుండు పలుకన్ ♦ దర్పంబు క్రుంగారు నీ
దనుజుం డెక్కడి కేగువాఁడని సుమి ♦ త్రాసూతి మందస్మితిన్. ౨౮౨

చ॥ ఎచ్చటికేగినన్ విడక ♦ యేగి మదీయ శిలీముఖంబు లీ
ప్రముచ్చును గ్రుచ్చి చంపు? బల ♦ ముం జలముం దిగఁబాఱ వీఁడికన్
జచ్చెడువాఁడ కాక మఱి ♦ చావక తప్పి చనంగ నేర్చునే?
చిచ్చుఱ పిడ్గులట్టి కడు ♦ చేవ చెలంగు నలుంగు లుండఁగన్. ౨౮౩

తే॥ అనెడు నంతట రక్తకా♦యంబుతోడ, శరము లను వేయి కరములు♦పరపుచుండఁ
గనకరథముపై నభమున♦జనఁగ లేచు, నింద్రజితుమాడ్కి రవి యుద♦యించె మింట.

తే॥ తెల్లవాఱె మింటను వెల్గె♦దినకరుండు, రక్కసులఁబోలు జీఁకటుల్♦గ్రుక్కి సమర
వంచనము లెల్లఁ బొలియ రా♦వణియుఁ గూలె,ననుచు నఱచిరి వేలుపు♦లంబరమున.

తే॥ కీర్తికర భుజబలశూర! కృత్తివాసుఁ, డొసఁగు తేరుండఁ గేల వి♦ల్లెసఁగు చుండ
వీఁడు చావఁడయ్య! యని వి♦భీషణుండు, లక్ష్మణుని హెచ్చరించె నా♦లంబునందు.

మ॥ శర సంధాన చతుర్ముఖుండయిన యా ♦ సౌమిత్రి యీ పచ్చనౌ
ఖరువుల్ చావవు పక్షిమట్లుగల చ ♦ క్రంబుల్ తునాతునకలై
మురియంబోవని నిశ్చయించి చణతన్ ♦ మూలంబు గుర్తించుచున్
విరియంగాఁ గడచీలలన్ విఱిచె వై ♦ వ్వేఁతాఱె పడం జక్రముల్. ౨౮౪

తే॥ చీలలూడఁ జక్రంబులు♦చెదరి వేఱు, పడగ నరదంబు చెడె వారు♦వములు తరువు
గొడ్డటం బడఁగొట్టఁ బ♦క్షులు కలంగు, కరణి సత్త్వహీనంబులై♦ధరణిఁ వ్రాలె.

క॥ రథ మవియఁగ నందలి యా, యుధముల నొండొండ వైచి♦యుడివోవ వియ
త్పథి కరిగి యసుర జగములు, నిధన భయం బంది కలఁగు♦నటు గర్జించెన్. ౨౮౯

క॥ మేఘనిభ దేహుఁడగు నా, మేఘరవుఁడు ఘోంచి దొడ్డ♦మేఘములందే
మేఘముకై వడి శిలల న, మోఘముగా గురిసె వరము♦పోఁడిమివలనన్. ౭౫౦
తే॥ దిక్కు దోఁపక వానరుల్♦స్రుక్కి శిరము, లురము లగలంగ ధారణి♦నురలఁ గాంచి
లక్ష్మణుఁడు త్రివిక్రము మేని♦లలి నభంబు, విశిఖ కాయమానంబు గా♦వించివైచె.
తే॥ వైశ్రవణి మొదిరించు స♦త్త్వము కృశించె, నల్లనైన యాకాశంబు♦నడుమ నొక్క
యెత్తుమొగులు నా నుండిన♦యింద్రజితుని, మేనిజాడ లక్షించె సౌ♦మిత్రి యపుడు.
క॥ ధనువు తునుఁగకుండిన నా, ధనువుగొను కరంబు తునిఁగి ♦ ధరణిం బడదే
యని తలఁచి త్రెవ్వనేసెను, ఘనకరముఁ గంకణాది ♦ కముతో నురలన్. ౭౫౩
ఆ॥ విలయ మారుతంబు ♦ వీవ మేఘంబింద్ర, ధనువుతోడఁ బడిన♦యనువుదోఁప
వానిచేయి వడియె ♦ నూనిన ధనువుతో, మణి విభూషణములు♦మలసి వెలుఁగ.
తే॥ బాలచంద్రుఁ శేషుఁడు పట్టు♦పగిది నొప్ప, వ్రేళ్లతోఁ జుట్టి పట్టిన ♦ వింటితోడఁ
దరులు శిలలు కపులు నల్గ ♦ దనుజుకరము, ధాత్రిఁ బడి తకపికలాడి ♦ తల్లడిల్లె.
తే॥ సూర్యుఁ డురలక చంద్రుఁడు♦స్రుక్కకుండఁ, మేరుగిరి దొరలక శక్ర♦వైరి కరము
పడుటగని యంత్రముంబోలు♦బ్రతుకునందు, మోహ మేలని విబుధ స♦మూహమనియె.
ఉ॥ అంచిత పుణ్యు లక్ష్మణుని ♦ యస్త్రిముచేత నసత్య మల్పమా
నంచుఁ దలంచు రావణుని ♦ యుగ్రసుతుండు కలంకచిత్తుఁడున్
వంచకుఁడైన యింద్రజితు ♦ బాహువు త్రెవ్వి ధరిత్రిఁగూల రా
త్రించరులెల్లఁ గాంచి తల ♦ ద్రెవ్విన తీరునఁ గుంది రయ్యెడన్. ౭౫౭
ఉ॥ వానరనాయకుల్ చెలఁగి ♦ వారక సింహరవంబు సేయుచున్
దానవసేనలం దఱిమి ♦ దంత నఖావలిచేఁ బదాహతిన్
బీనుఁగు పెంటచేసి యుల ♦ వేల్పుల లోకము క్రొత్త సంస్కృతుల్
జానుగ నిండి మెండుకొను ♦ చక్కటి తక్కక చేసి రత్తఱిన్. ౭౫౮
ఉ॥ నీలగళుండు మున్ను కరు ♦ ణించి యొసంగిన గొప్పశూలమున్
గేల ధరించి శత్రు నవ.♦ గీర్ణచరిత్ర మెఱుంగలేని నిన్
నేలకుఁ ద్రోఁచి కాక మఱి ♦ నీలుగనంచు మహోనటుండనన్
గాలియనంగఁ జిచ్చనఁగఁ♦ గ్రాలి దశాస్యకుమారుఁ డేఁచఁగన్. ౭౫౯
మ॥ పరమార్థం బగునేని రాఘవుఁడు న ♦ త్త్వం బూఁదియున్నని యు
ర్వర ధర్మంబు జయించునేని బలభి ♦ త్ప్రత్యర్థి శీర్షం బిలన్
దొరలుంగాకని లక్ష్మణుండు విలస ♦ ద్దోస్సార మేపారఁగా
శర మాకర్ణము లాగి వీడె జగముల్ ♦ సంతోషముం బొందఁగన్. ౭౬౦
తే॥ చక్రశూలబ్రహ్మాస్త్ర వ♦జ్రములు సిగ్గు, నొందనమ్మహాశర మగ్ను♦లుమియుచుఁజని
యింద్రజితుని శిరము ద్రుంచి♦యిలను కూల్చి, వేలుపుల పూలవానలో♦ వెలసిమలసె.

సీ॥ తెగిన శిరంబు పై♦కెగిరి పడకమున్నె, విలయు మారుతముచే♦విఱిగి పడిన
పిడుగులు మెఱుపులు♦బెడిదంబులగు కాల, మేఘమున్మ్రక్కై వడి ♦ మేఘనాదు
నొడలు శూలముతోడఁ♦బొడుచుకొన్నట్టియు, మ్ములతోడ బరువయి♦పుడమిఁబడియె
దంష్ట్రలనెడు విధు♦ద్వయముతో గురు శుక్ర, లను కుండలములతో♦ఘన విశీర్ణ
తే॥ కేశ పాశమనెడి రక్త♦కిరణవితతి, తోడ రవిమండలము కాల♦ధూతమగుచు
ధరణి కొఱఁగిన తెఱఁగునఁ♦దనరి వాని, తలయు దబ్బునఁ బడియె ను♦ద్దండభంగి.

ఉ॥ జీవుఁడు దేహ సంస్థితిని ♦ చెందక యవ్వలి కేగినంత నా
త్రోవనె యంతరింద్రియ త ♦ తుల్ చనునట్లు వడి రాక్షసావళుల్
రావణి కూలునంత సమ ♦ రస్థలి నాయుధరాజి వీడుచున్
త్రోవ మెఱుంగ రాక పలు ♦ త్రోవలఁబోయెను దిక్కు తోఁపమిన్ .

శా॥ అస్త్రాభ్యాస విశారదుండయిన హ ♦ ర్యశ్వారి యుక్కాఱఁగా
నిస్త్రింశంబగు దైత్యపాలనము వ ♦ న్నెల్ మాసె వంచార్చుచున్
వస్త్రంబుల్ వెస వీచుచున్ సురలు వై ♦ వశ్యంబునన్ ప్రేమమున్
శస్త్రం బూనిన జైనదేవతల యో ♦ జం బూని రప్పట్టునన్. ౭౮౪

మ॥ అరవిందాసనుఁడున్ మహేశ్వరుఁడు కం ♦ జాక్షుండు నింద్రాది ని
ర్జరులున్ దిచ్చుమొగంబుగాక నర వ ♦ ర్గంబుల్ వనాటావలుల్
పెరిమం జూడఁగఁ జాలకాలము నభో ♦ వీథిన్ మనోమోద సం
భరిత ప్రేమను నిల్చినారలు మహా ♦ పర్వంబు నందించుచున్. ౭౮౫

మ॥ అనిలో రావణిచే నిశాచరులచే ♦ నంత్యస్థితిం బొంది మా
లిన కీశావలులెల్ల జీవముల నో ♦ లిం గాంచి పూర్వంబు కం
టెను సత్త్వం బొదవంగలేచిరి విరా ♦ డ్గేయాను కంపాప్తి స
ద్గుణులం బీడ లలంపవన్న సుజనో ♦ క్తుల్ కల్లలౌనే ధరన్ ? ౭౮౬

తే॥ అసుర తలగొని ముందుగ♦నంగదుండు, జరగె వేలుపు లొత్తుగఁ♦జల్లుచున్న
విరుల పందిరిక్రింద వా♦నరుల నడుమ, హనుమపైఁ జన సౌమిత్రి♦యన్నకడకు.

క॥ పొనుపడు ఖేదంబును మఱి, పెనుపడు మోదంబు గలుగు ♦ పృథ్వీపతి నం
తనపడఁ గేలం దలఁగొని, మునుపడ నరుదెంచు వాలి♦పుత్త్రుం గనియెన్ ౭౮౭

క॥ చందురు కలఁకంబలె నా, కుం దనరిన నింద తొలఁగ♦గురుతర కీర్తిం
జెందితి ధర్మము కరుణిం, పం దలఁగని కీడు రాని♦భాగ్యముఁ గలదే ? ౭౮౯

క॥ లంకాధిపతి కుమారు వి, శంకటగతి లక్ష్మణుండు♦చంపఁగఁ గరమం
దంకించి శిరము దెచ్చితి, వింకే నెత్తితిని శిరము♦నెనసితి జయమున్ ౭౯౦

సీ॥ వేలుపుల్ దలయెత్త♦వేదముల్ తలయెత్త, ధర్మంబు తలయెత్తఁ♦దపములెత్త
మఘవుండు తలయెత్త♦మానులు తలయెత్త, సత్యంబు తలయెత్త♦సత్త్వమెత్త
జగములు తలయెత్త♦జనములు తలయెత్త, దయయును తలయెత్త♦నయమునెత్తఁ
క్షేమంబు తలయెత్త♦నేమంబు తలయెత్త, శాంతియుఁ దలయెత్త♦దాంతి యెత్త
తే॥ సత్పథంబులు తలయెత్త♦సాధులెత్త, ముక్తిచింతయుఁ దలయెత్తఁ♦బుణ్యమెత్త
నంగదా ! తలదెచ్చితి♦వధిక ముదము, హత్తినాఁడవు నేఁ దల♦యెత్త ననుచు.

ఉ॥ ఏమగునో యటంచును జ ♦ యింపదె ధర్మమె యంచు లక్ష్మణ
స్వామియె గెల్చునంచు విసు ♦ వాసముతోఁ దనరాక సంతత
ప్రేమను వేచు నాభరతు ♦ వీఁకను తమ్మునిరాక వేచు నా
రాముఁడు కన్నులార నెదు ♦ రం గనె డాయుచునున్న లక్ష్మణున్.

మ॥ పగవానిం దెగటార్చి వచ్చిన ప్రియ ♦ భ్రాతన్ ప్రతీక్షించుచో
మిగులం గన్నుల రాలు నశ్రువులు నె ♦ మ్మిన్ వచ్చెనో? నెమ్మదిం
బొగులన్ వచ్చెనో ? మోదధారలొకొ ? యె♦మ్ముల్ నీరుగాఁజేయు జా
లి గదింపన్ వెలివడ్డ ధారలొకొ? శ్రీ ♦ లింపన్ సుసాధ్యంబొకో ?　౨౨౩

శా॥ సంతోషామృతధారలున్ ప్రబిమలో ♦ త్సాహంబు నుత్కంఠ వి
క్రాంత స్ఫూర్తి వెలుంగ నన్నిహితుఁడై ♦ రామాంఘ్రి సాన్నిధ్యమం
దంతగ్రీతి నమర్పణంబు సలిపెన్ ♦ ప్రాణాంతమందైన వి
క్లాంతిం బొందని వీర లక్షణ విధా ♦ క్రాంత ద్విష న్మస్తమున్.　౨౨౫

మ॥ తలఁజూచున్ జయలక్ష్మిఁ దాల్చిన భుజా♦స్తంభంబుఁ జూచున్ మహా
బలసూనుం బరికించు లక్ష్మణ ధను ♦ ర్బాణంబులన్ గాంచు వే
ల్పుల చేష్టల్ దిలకించు లక్ష్మణుని తేం ♦ పుం దేటి చూచున్ ముదా
కలనన్ మీఱిన రాముఁ డేమియు నెఱుం ♦ గన్ లేక మాధ్ర్యంబునన్.

సీ॥ అసదృశుఁడును సుగు ♦ ణాంభోధి రాముఁడు, తనపాదములకు వం♦దన మొనర్చు
తమ్ముని కాలాంబు♦దమును సంధ్యారాగ, మొనసిన చందాన♦నిమ్ము మెఱయ
నీలాచలముమీఁద♦బాలభాను మయూఖ, ములు ప్రసరించిన♦పోలుపు వెలయ
ఱొమ్మున భుజమునఁ ♦ గ్రమ్మిన రుధిర క, ణమ్ములు తనమేనఁ ♦ బమ్ముకొనగ
తే॥ గాటముగఁ గౌఁగిలించి నా♦కడకు జనక, పుత్త్రి వచ్చి చేరినదని♦ముదము గొంటి
ధరణిఁ దమ్ములఁ గలుగు వాఁ♦డరుల కలుకఁ, డనెడు వాక్యంబు నెలకొల్పి♦తయ్య నేఁడు.
తే॥ అనుచుఁ దమ్ముని భుజముల♦నలరుచున్న, తూణములఁ దీసిభుజ తను♦త్రాణములను
విడిచి వ్రణముల మెల్లనఁ♦దుడిచి యొత్తి, శ్రమముపోకార్చి తాను మో♦దము వహించె.
తే॥ పురుషపుంగవ! యీ గెల్పు♦పౌరయుటరయ, నీవలనఁ గాదు హనుమంతు♦నేర్పువలనఁ
గాదు దైవంబుచేఁ గాదు♦కాదు నిజము, మన విభీషణుచే నని ♦ వినుతిచేసె.

## ౨౮. రావణ శోక పటలము. (౬౧)

తే॥ దరులు గలరక్త జలధిని♦దాఁటి దైత్య, దుఃఖసాగరమును దాఁటి♦దూత లపుడు
గుహను చొచ్చు మచ్చునఁ బెను♦గోపురంపు,ద్వారమునఁ జొచ్చి రావణు♦దరికిఁ జనుచు

క॥ ముంగిళ్లను నిలిచిన దైత్యాంగన లతిదుఃఖజలధి♦యడుగునఁబడి క్రుం
గంగని నేఁటికి లంకయె, క్రుంగె మహాంభోధి ననుచుఁ♦బోయిరి దూతల్.

ఆ॥ పండ్లు నోరు మనసు ♦ ప్రాణంబులును కాలుఁ, గేలు వడఁకుచుండ ♦ గిలి కుదింప
సీకుమారకుండు ♦ నేఁటికి లేఁడయ్యె, ననిరి చారు లా ద ♦ శాస్యుఁజేరి. ౭౮౧

ఆ॥ అచట నుండినట్టి ♦ యమరులు నమర మా, నినులుఁ దక్కువారు ♦ నేఁడు జగమె
నాశమందు ననుచు♦నడుఁకుచు దెసలకుఁ, బరుగులిడిరి పంక్తి ♦ వదనుఁ బాసి.

ఆ॥ కినుకఁ గనులనుండి ♦ కిత్తి కణంబులు, రాల నటమిమిచూచి ♦ రావణుండు
కత్తిదూసి చరుల ♦ కంఠముల్ తెగనేసి, కేలు వడఁక నేలఁ ♦ గూలినాఁడు.

ఆ॥ పుత్రశోకవహ్ని ♦ ముఖములఁ బుట్టి ని, శ్వాసమునఁ బెరింగి ♦ చక్షులందు
వెలిఁగి దెసలఁ బరవి♦విలయాగ్ని యే దశ, వదనుఁ జేరె ననఁగఁ♦బ్రజ్వరిల్లె. ౭౮౪

ఆ॥ ఒడలు వడకఁ బుడమిఁ♦బడి యడలుటచేత, నవని శేషుఁ డదరి♦యలుఁగులపడ
వెలలు కోపవహ్ని♦వలన బాడబమె పై, కుబుక జడధి యుడుకు♦నోజ నుడికె.

తే॥ తాపవహ్నియుఁ బైపయిఁ♦దనరు ప్రేమ, వనట యడరఁగ నిరువది♦కనులనుండి
యురలు బాష్పప్రవాహంబు♦కరఁగి యుబికి, పరవి పరుగిడు తామ్రద్ర♦వంబుఁబోలె.

క॥ కటకటపడి రదనంబులఁ, బటపట గీఁటుచును పిడుగు♦వలె బెడిదముగా
నటమటపడ నిల మోఁదెను, తటపటమని జీవతతి యె♦దల్ నుడివడఁగన్. ౭౮౭

ఉ॥ కాలిన పుంటిపైఁ గరఁగఁ ♦ గాఁచిన శూలముఁ దూర్చినట్లుగాఁ
దాళఁగలేక స్రుక్కి వసు ♦ ధంబడు సోలును లేచుఁ గ్రుంగుఁ జిం
తాలసుఁడై కలంగుఁ దన ♦ యా! యను హా! యను విహ్వలించు నిం
కేల జగంబు జీవధన ♦ మేగిన పిమ్మట దేహమేలనున్. ౭౮౮

ఉ॥ నాయన! యింత చెట్ట యగు ♦ నా యను నింద్రవిరోధ మింతయే
నాయను నన్నువీడఁదగు ♦ నాయను వేల్పులు సంతసింపఁ జ
న్నాయను నేను నిల్వఁగల ♦ నాయను శౌర్యము మంటిపాలు గా
నాయనుఁ బౌరుషం బడఁగె ♦ నాయను జీవము పాసెనాయనున్. ౭౮౯

క॥ శూలియుఁ గిలియు నవ్వన, మాలియు నెదిరింపలేక♦మలఁగినవారల్
లీలగ హేలగ గెలిగ, మేలుగ విహరించువారు♦మీఁద మదమునన్ ౭౯౦

క॥ ఖేచరుల విమానంబులు, గోచరమే కాకయుండుఁ♦గోటి కోకండున్
నీచుల రణ విజయంబున, నేచల! యీలంకమీఁద♦నెగయవె యింకన్! ౭౯౧

క॥ దూతలు పలికిన తీరున, నాతులువ యొకండు తునుమ♦నడఁగితివే ? నీ
చేతలనే తలపోయఁ గి, రాతులు యమదూత లెగచి♦రా నిన్నలమన్ ? ౯౨

తే॥ అనుచు లేచును నాయనా♦యనుచుఁ బిలుచుఁ, బడును పలవించుఁ దూలును♦పుడమిఁ బొరలు
నుడుకుఁ బరితపించుఁజెమర్చు♦నుఱుమిచూచుఁ,గనులుమూయునులోలోనఁ♦గళవళించు.

క॥ ఒకశిరము పుత్త్రకా! యను, నొకశిర మిఁక రాజ్యభార♦మోపుదునె కటా!
యకటా వికటంబగు నను, నొకశిర మరినోట నిన్ను♦నుంచితినె ? యనున్. ౯౪

క॥ ఒకశిరము పోయితే! యను, మొకమొకటి మృగేంద్రుఁ జంపి♦మించెనె యను వే
ఱొక శిరము రాఁగదే యను, సుకముగ నను తడవకున్న♦సుకుమారుగ దనున్.

క॥ ఒకశిరము హరి గిరీశ, స్వకరాయుధములకు నపయ♦శముగూర్చి వికా
విక నవ్వు నీమొగము చూ, పక పోయితె యింకఁజూడఁ♦బనుపడునె ? యనున్

క॥ ఒకశిరము నీవు చన్నం, గకవికయగు నామనంబు♦కష్టించుచుఁ దో
డొకయింతలేక మలఁగును, సుకుమారా! తండ్రిఁ దేర్పఁ♦జూడవొకో ? యనున్

క॥ ఒకశిరము నిర్జరేంద్రుని, మకుటముఁ దివియంగ నలరి♦మగువలు సుమముల్
ప్రకటించి చల్ల వెలసిన, మొకమును పోలికలనిఁ గాంతు♦మో? యని పొగులున్

క॥ ఒకశిరము యక్షవనితలు, వికట భవద్గుణ రవంబు♦విని తమతమ కు
త్తుకలఁ గల సూత్రములఁ దడ, వికొనుట నిఁకమీఁద లేక♦విహరింతు రనున్

క॥ ఒకశిర మపార బలద, ర్పక! నీ సన్నిధికి వచ్చి ♦ వైవస్వతుఁ డం
దిక నసువులు గొనఁజాలం, డిఁక నసువిడి యేజగమున♦కేగితివో! యనున్ ౧౦౦

క॥ అని యిటు పనవుచు రావణుఁ, డనిలజవంబునను సంజ ♦ యాకన మనఁగాఁ
జను పోలికలనికిఁ జని తన, తనయు కళేబరము నచటఁ ♦ దడవంజొచ్చెన్.

క॥ సేవకులగు సుర లసురలు, రావణుతోఁ బరుగులిడిరి ♦ రణరంగమునన్
భూవలయంబుఁ జరాచర, జీవవితతితోడ నేమి ♦ సేయునొ? యనుచున్. ౧౦౨

ఉ॥ క్రన్ననఁ బంక్తికంఠుఁ గని ♦ కంక పిశాచ గణంబు లయ్యెడన్
ఖిన్నతనొందినట్లు పరి ♦ కించి ప్రలాపముసేసెఁ గొన్ని పెన్
విన్ననయొందెఁ గొన్ని పల ♦ వించి పదంబులవ్రాలెఁ గొన్ని యా
పన్నతఁ గొన్నిచేరె శవ ♦ వారణ కాయ నికాయ మధ్యమున్. ౧౦౩

చ॥ కొడుకు కళేబరంబుఁ గనఁ ♦ గోట్లకొలందిగఁ జచ్చి కుప్పలై
పడిన తురంగ సంఘముల ♦ వారణవారములన్ భటాలి సం
గడముల శీర్ణమైన ఘన ♦ గాంగ శతాంగములందు నంతటన్
గడఁకను త్రోచిత్రోచి వెద♦కందొడఁగెన్ దినమెల్ల నయ్యెడన్. ౧౦౪

చ॥ తరుణ శశాంకుఁబోలెఁ బ్రబమ్మ♦ దంబుగ వర్ధిలునాఁడె వానవుల్
గరువమడంచి తెచ్చుటను ♦ కాంచఁగ నోచిన యేను మొండెమున్
బరువుగఁ జూడఁ బొల్పడితిఁ ♦ బాప కలంకిత చిత్తఁ గావునన్
మురువగు నీదు మోము గను ♦ పుణ్యము నంతయు నోచనైతిగా!

ఉ॥ చక్రిని శంకరుం జెనకి ♦ సంకటపెట్టితి వల్లనాఁడె దో
ర్విక్రమవర్య ! నీయలరు ♦ విన్ననువొప్పు మొగంబుఁ జూడకే
శక్రభయంకరా ! మనఁగఁ ♦ జాలుదునయ్య ? యనంగరూప ! నే
నీక్రియ వీరమాత నని ♦ యేట్లెఱ నొందుట దీనిఁజూడనే ? ౧౨౩

ఉ॥ కాళ్ళుల గల్లుగల్లుమని ♦ గజ్జెలు మ్రోయఁ జరించునాఁడె సిం
గాలను పట్టి యీడ్చికొని ♦ కాఱియవెట్టుచు మేడ ముంగలన్
లీలగఁ గట్టివైచి పలు ♦ లీలలఁ దేలుచు నుంటఁ జూడఁగాఁ
జాలుదునయ్య ! యింక మరు ♦ జన్మము నెత్తిన నోము నోచినన్. ౧౨౪

ఉ॥ హస్తముచాఁచి పిల్వఁగ శ ♦ శాంకుఁడు భీతిలి వచ్చి నిల్వ నీ
శస్త్ర కరంబుతో నతనిఁ ♦ జల్లగ దువ్వుచు భీతి మాన్చి సం
ప్రస్తుతమౌ కలంకముఁ గు ♦ రంగముగాఁ దలపోసి పట్టఁగా
నిస్తుల హస్తముం బఱపు ♦ నీటు గనుంగొన నెంతు రాఁగదే !. ౧౨౫

చ॥ స్కందునిబోలు సుందర ! ని ♦ శాచర పన్నగ యక్ష దేవ కి
న్నెరుల ముఖుల్ విలాసముల ♦ హేలల లోఁగొననెంచి పుష్పశ
య్యం దఱివేచి నిల్వ శ్రమ ♦ నంది సుఖంబుగ నిద్రసెందితో ?
క్రందగు కయ్యమం దొనరు ♦ క్లాంతి తొలంగఁగ విశ్రమించితో ? ౧౨౬

క॥ ముల్లోకంబుల గెలిచిన, బల్లిదుఁడగు సుతుఁడు నేడు♦బవరంబున ని
ర్బల్లిదుఁడగు నొక మానవు, భల్లంబునఁ దెగియె నకట ! పాపపు విధిచే.

ఉ॥ దూది వాలుతాళిలో వలెన ♦ దుర్దమ మానవ బాణ వహ్నిఁ గ్ర
వ్యాదులు చన్నవారు చని ♦ నట్టుల చచ్చెదువార క్రమ్మఱన్
లేదొక ప్రాణియైనఁ గబ ♦ ళించె దశాస్యుఁడు ధాత్రిజాత యన్
స్వాదు విషంబు రేపటికి ♦ సాధ్యము యిట్టులు కాక తక్కఁగన్ ? ౧౨౭

మ॥ మది సంతాపము నిట్లు వెల్వఱచు న ♦ మ్మందోదరిం గ్రవ్యభు
క్సుదతుల్ చేతులమీఁద నెత్తుకొనుచున్ ♦ శుద్ధాంతమున్ జేర సం
గద వర్ధిల్లఁగ రాతిగుండెగల యా ♦ త్మాజాతయే హేతువౌ
హృదయం చుగ్రగతి న్వధింపఁ జనె లం♦కానాథుఁ డత్యార్భటిన్ ౧౨౮

మ॥ పరుగుల్ వాఱుచునున్న రావణుని భా ♦ వంబున్ విమర్శించి ని
ర్భరమౌ కీర్తి నశించునే యనుచుఁ ద్రో ♦ వన్ డెంపు తోడన్ మహో

దరుఁ డడ్డంబయి చాఁగిలంబడి యనుఁ ♦ దైత్యేంద్ర! కోపంబుచే
స్థిర కీర్తిం గొనిపోయి గంగఁ గలుపం ♦ జింతించెదే తొందరన్ ? ౮౩౦

ఉ॥ కీరితి యుత్తమం భువన ♦ గేయముగాఁ గొను రాక్షసేశ్వరా!
కోరితి లోకనాయకత ♦ గొంటివి కోరిన కోర్కె చెల్లఁగన్
జేరితి చెందరాని సుర ♦ సిద్ధ పదంబులఁ బల్మి పెంపునన్
మీఱితి వెల్లభోగముల ♦ మేకొనెదేలఁ స్థిరాపనిందకున్? ౮౩౧

మ॥ సురసంఘంబులపై దిగీశ్వరులపై ♦ సుత్రాముపై వాలిపై
వర దిగ్వారణరాజిపై ధనదుపై ♦ నర్తిల్లు యుష్మచ్ఛరా
చర భీతిప్రద చంద్రహాస మొక కం ♦ జాతాక్షిఁ దుండింపఁగాఁ
బరపన్ సిగ్గిలి క్రుంగుఁగాక వనితా ♦ ప్రాణంబులం గ్రోలునే? ౮౩౨

మ॥ అబలన్ గోల లతాంతకోమల ననూ ♦ ర్యంపశ్య వైదేహిఁ గో
ప బల స్ఫూర్తి గడల్కొనం దునుముచో ♦ బ్రహ్మాదు లింద్రాదు ల
ల్పబలుం డల్పగుణుండు నీచకులుఁడున్ ♦ వ్రాత్యుండు భీతుండు మా
న బల స్థైర్య విహీనుఁడం చనరు లం ♦ టం గేలి గావింపరే? ౮౩౩

ఉ॥ కాదిది రాజనీతియును ♦ కాదు సురావళి ధర్మరీతియున్
గాదిది సాధుపద్ధతియుఁ ♦ గాదు జయాంకము కాదు మోదమున్
గాదిది యిష్టసిద్ధియును ♦ కాదిది మేలిమి విక్రమస్థితిం
గాదు పులస్త్యవంశ్య! కొఱ ♦ గాని యపప్రథఁ దెచ్చికొందువే? ౮౩౪

ఉ॥ రామను కత్తితో నఱికి ♦ రాముని వెండి జయించి లంకకున్
రా మతియించెదో? చెలువ ♦ మ్రందిన, వారలు చింతతోడ సం
గ్రామము మానువారలను ♦ కారణమో? యది వీరధర్మమో?
రాముని గెల్వలేకుడిగె ♦ రాక్షసరాజను గోను మోసెదో?. ౮౩౫

ఉ॥ నావుడు రావణుండు లల ♦ నన్ వధియించుట మాని రోసి వా
లావలఁ బాఱవైచి తన ♦ యర్మిలి పుత్త్రు శిరంబుతోడ రా
జీవవినోది వంశజుల ♦ శీర్షములన్ గొని కాక క్రమ్మఱన్
రావణి గాత్ర మందనుక ♦ రంగఱ కుంచుఁడి తైలమం దనన్. ౮౩౬

## ౨౯ సేనా సందర్శన పటలము. (౫-౨)

చ॥ కొడుకు శవంబుఁ దైలమున ♦ గప్పి యొనర్చిరి దైత్యవైద్యు ల
య్యెడ దెనలెల్ల నిండి వసి ♦ యించుచు నుండిన రాక్షసావలిన్
గడుకొని పిల్వఁగాఁ జనిన ♦ కర్బురదూతలు వచ్చి లంకలో
నడ మొకయింత నిల్చుటకు ♦ నేవి కనంబడ దయ్యె నావుడున్, ౮౩౭

ఉ॥ ఎచ్చటనున్నదంచు దను ♦ జేసుఁడు ప్రశ్నరయొనర్ప దేవరా!
అచ్చుపడంగ నిందె కల ♦ దంచు వచించుట కెట్లు చెల్లు ? వా
తోచ్చలితాంబుధిప్రకర ♦ ముల్బణమంద జగంబు చాల కు
న్నచ్చున నెల్లెడం బరవి ♦ యార్చుచునున్నది సేన మత్ప్రభూ! ౮౩౭

క॥ పదరజము నిండి యంబర, పదమునఁ గాలూని విబుధ♦వర్యులు నడవ౯
గదిరిచి మితిమీఱిన మన, చదలము గన నరుదుగాఁగఁ♦జనుదెంచె విభూ! ౮౩౮

సీ॥ కత్తులు మెఱుపుల♦కరణిఁ బ్రకాశింప, మేఘసందోహంబు♦మెఱయమాన
భేరీరవమునకు♦మాఱొడ్డి జలదముల్, చెలఁగి యెక్కుడను గ♦ర్జింపవయ్యొ
నా సేనవలె నల్ల♦నై యుండలేమి జీ, మూతముల్ వెల్లనై ♦ముడిఁగి యొదిఁగెఁ
జతురంగ బలమెల్ల♦జలధిపై నడతెంచె, నన నొక యుపమాన♦మరయఁగలదె!
తే॥ బలము మితిమీఱి పైపయిఁ♦బరవుచుండ, నూర్ధ్వజగము లొండొంటిలో ♦
నొదిఁగి తూఱెఁ
జంద్ర తారకల్ నెలవుల♦జాఱ విడిచెఁ, దరణి విధిలేక తనత్రోవ♦దాఁటి చనియె.

చ॥ గగనము ముట్టి మేరుగిరి ♦ కైవడి వెల్గుచుఁ దీసియున్న నా
ల్గు గవఁకులందు చొచ్చిన య ♦ కుంఠితసైన్యముచూడఁ గాలుఁడే
జగము భరింపఁజాలదని ♦ సాగరసప్తకము౯ మఱొక్కచో
మొగపడి చేర్చుచుండె ననఁ ♦ బొల్పు వహించి రహించె నయ్యెడ౯.

చ॥ గవఁకులయంద యిక్కటము ♦ గాఁ జొరఁగాఁ దడవౌన యంచు దా
నవ బలముల్ విలంఘున మొ ♦ నర్చుచుఁ గోటను దాఁటె నన్నఁ దాఁ
దవిలి పయోధి సప్తకము ♦ ధారణి నొక్కటఁ జూడఁగోరు మా
నవువలె నెల్లసేనలు గ ♦ నంబడ గోపురమెక్కఁ జూడఁగ౯. ౮౪౨

మ॥ పరమార్థంబును విస్తరించి నిగమ ♦ వ్రాతంబు భాషించు పై
ఖరి దూతల్ విభజించి పల్కి రొక ది ♦ గ్భాగంబునందుండి యే
డ్తెఱ వేఱొక్క వలంకుదాఁకఁ బరిపూ ♦ ర్తిం బొందు సంద్రంబునాఁ
బఱపైనట్టి చమూ సమూహముల నా♦పౌలస్త్యుతో నిమ్ముగ౯. ౮౪౩

ఉత్సా॥ వీరు కుశదీవివారు ♦ వేల్మిఁ బుట్టినారు బృం
దారకులను మోహజలధిఁ ♦ దార్చి ముంచినారు పై
వారిదములఁ దాఁకు నంత ♦ వారు మేని పొడవునం
దారి తేఱినారు మాయ ♦ నార్చు సంగరంబులన్. ౮౪౪

ఉత్సా॥ వీరు దబ్బదీవివారు ♦ విక్రమమున నంతకుం
గేరువార్ల విజయలక్ష్మిఁ ♦ గేలఁబట్టువార లీ

వీరివలన స్వర్గలక్ష్మి ♦ వీడినారు వేలుపుల్
శూరవరులు సమరమందు ♦ శూలికేని యోడరున్. ౮౪౫

ఉత్సా॥ వీరు బూరుగనెడు దీవి ♦ వెలయువారు వాసవుం
బోరఁ గెలిచి పాకవైరి ♦ పురము కొల్లగొట్టినా
రార భవుని వరబలమున ♦ నధికసత్త్వ గౌరవుల్
కారుచిచ్చువంటి కినుక ♦ కనలు గల్గు వారలుం. ౮౪౬

ఉత్సా॥ వీరు కొంచదీవివారు ♦ వేల్పు కాణయాచియౌ
మేరువును సముద్రమందు ♦ మించి త్రోయఁబూనఁ బా
కారి మొదలుగాఁగ నమరు ♦ లదరి బెదరి వీరలం
జేరి వేఁడికొనుచు నట్టి ♦ చేఁత మాన్చి రొక్కెడం. ౮౪౭

తే॥ వీరలు ప్రవాళగిరి నుండు♦వారు శుక్రు, నికి నిశాచరాంగనకు జ♦నించినారు
కలశ వారాశి వరటిపోఁ♦గలఁచినారు, బలము పదికోట్లు లెక్కకుఁ♦గలుగువారు.

తే॥ వీరు చిఱుగాలి సతతంబు♦వీచుచుండు, గంధమాదన వానంబు♦గలుగువారు
హాలహాలమున కిరులకు♦నన్నలనఁగ, నొప్పువారు లెక్కకు మీఱి♦యుండువారు.

తే॥ మలయమను గొప్ప మల జల♦మధ్యమందు, గలదు వీరలందలివారు♦నలువ వీరి
వలన జగములు నశియింపఁ♦గలవటంచుఁ, దలఁచి ప్రార్థించి యచ్చోట♦నిలిపినాఁడు.

తే॥ వీరు సప్తాంబుధుల కధి♦కారులైన, పుష్కరదీప్వవానులు♦భూరి బలులు
సమ్మెటలు శూలములు గదల్♦చక్రములు ము, సుండులును విండ్లు ధరియించి ♦
యుండువారు. ౮౫౧

తే॥ వీరు జువ్విదీవిని కల♦వారలు తమ, తల్లిపనుపున ధారణీ♦దాఁటి చక్ర
వాళగిరియందు జముగెల్చి♦బంధనమున, వైచి నలువ కోరికపయి♦వదలినారు.

తే॥ మీరు వసియింప నవని వి♦స్తారమైన, చోటులేదు పాతాళంబుఁ♦జొరుఁడి యని వి
రించి పంపఁగ నందుండి♦ప్రేమచేత, వచ్చు బేతాళహస్తులౌ♦వారు వీరు. ౮౫౩

తే॥ నిర్ఋతివంశజుల్ వీరలు♦నీకు హితులు, సురలతోనుండి త్రావనె♦త్తురులు లేమి
విసిగి వచ్చిరి సప్తపృ ♦ థ్వీధరముల, నెత్తువా రంబుధులఁ ద్రావ♦నేనఁగువారు.

ఉ॥ వీరలు తొల్లి క్రోడమయి ♦ వెన్నుఁడు కోఱల నెత్తునంత నీ
ధారణి మోహముంగొను క ♦ తంబున జాతిన కోణికంబు బం
గారముగాఁగ దానిఁగొని ♦ క్రచ్చుఱఁజేసిన వీరఘంటికల్
సారుగఁ దాల్చి రష్టదిశ ♦ లం దమ గారుల నిల్పినారలుం. ౮౫౫

క॥ ఈక్రవ్యాదులు భూరి ప, రాక్రమమునఁ గొఱఁతలేక ♦ రాజిలుదురు పా
దక్రాంతి శేషుఁడును ని, ద్రాక్రమమును వీడి యలయఁ♦గ్రాలెడువారల్. ౮౫౬

ఉ॥ కాళిక యోడునట్లు కళ ♦ కంఠుఁడు నృత్యముసేయుచుండఁ గాం
తాళమునొందు నామె కను ♦ దమ్ముల వెల్వడు కోపవహ్నిలోఁ
గాలతరాకృతుల్ భవము ♦ గాంచి రపార బలాఢ్యులెన్న బే
తాళ సహోదరాళి యనఁ ♦ దగ్గ నిశాటులు వీరు రావణా! ౧౫౭

చ॥ ఉరవడి వింధ్య శైలఁగొని ♦ యుత్తరదిక్కునఁ జేరుచున్న యా
వరబల శౌర్యవర్తనులు ♦ పాపము పుట్టిననాఁడె పుట్టి నా
రరయఁగ దివ్వె లుంచిన గు ♦ హా ద్వితయంబన నొప్పు కన్నులం
బెరసిన వార లల్లునెడ ♦ వీడరు చంపక తల్లిసేనియున్. ౧౫౮

తే॥ వీర లుగ్ర నిటలనేత్ర♦వీతిహోత్రు, నుండి పుట్టినవారు మ♦హోగ్రగుణులు
వార లూఁతగా మృత్యుదే♦వతకు ముందు, పుట్టినట్టివారలు♦చండ భూరిబలులు.

ఉ॥ శూలములం ధరించి మును ♦ చొప్పడ నిల్చిన యామినీచరుల్
శూలి పదమ్ము వక్షమున ♦ సోఁకఁ గృతాంతుఁడు క్రక్కు నెత్తుటన్
బోలఁగఁ బుట్టినారలు న ♦ మూహ బలాఢ్యులు వీర లబ్ధిలో
హాలహలంబు పుట్టుతఱి ♦ నన్నలుగా జనియించు రాక్షసుల్. ౧౬౦

ఉ॥ వారలు వార్ధిఁద్రచ్చుతఱి ♦ వాసుకి క్రక్కు విసంబు నెత్తి నే
ర్పారఁగ నుంచు బాడబము ♦ నం దుదయించిన ఘోర దేహకుల్
వారిద మంటు నగ్నిశిఖ ♦ వంటి శిఖల్ గల వీరు శర్వు దు
ర్వార శరాగ్నికీలఁ ద్రిపు ♦ రంబులు గాలఁ జనించి రందులన్. ౧౬౧

ఉత్సా॥ ఇందఱని గణించి తెలుప ♦ నిట్టి వార లసురకున్
డెందమునకు నూహయే క ♦ డింది యగును మాయలున్
బొందు వర బలంబులున్ ద ♦ పోబలంబులెల్లఁ జె
ల్పం దలంప యుగములెన్ని ♦ పట్టునో? ప్రభూత్తమా! ౧౬౨

ఉ॥ ఒక్కఁడొకండె వానరుల ♦ నుర్వరనాథకుమారు లిర్వురన్
జిక్కఁగఁ జేయఁజాలుదురు ♦ సంఖ్య వచింపఁగఁబూనువారలున్
గ్రక్కున వేయివెల్లలన ♦ గట్టిగ నవ్వారె విన్నవారలున్
లెక్కయొనర్ప మానమును ♦ లేదు జగంబున రాక్షసేశ్వరా!. ౧౬౩

మ॥ అని దూతల్ వచియింప రావణుఁడు నే ♦ త్రానంద సంపూర్ణుఁడై
కని నాదీపనలన్ వచించి తగు న ♦ త్కారంబులంజేసి యా
దనుజాధీశులఁ దోడితెండనఁగ దూ ♦ తల్లెల్ల సేనాను ల
త్యనురాగంబునఁ బూలు సల్లుచు తదీ♦యాంఘ్రిద్వయిన్ ద్రొక్కఁగన్.

మ॥ అసురాధీశ శిరస్తతీ మకుట ర ♦ త్నాంకూర రాగప్రభా
ప్రసర ద్దివ్య పదారవిందుఁడగు త్ర ♦ వ్యాద ప్రభుం డంతటం

గుశలప్రశ్నముచేసి మీకతన మా ♦ కోర్కుల్ ఫలంబందె సం
తసమయ్యెన్ భవదాగమంబు విజయో ♦ దర్కంబుగా నెంచెదన్. ౨౬౫

మ॥ అని వాక్రువ్వఁగ వారలున్ దనుజ నా ♦ థా ! మాకు నీవుండఁగా
ఘన దోస్స్థైర్య తపోబలంబులును గ ♦ ల్గం బొందు దుస్సాధ మెం
దు నొకండేదియులేదు మీరలును దై ♦ త్యుల్ దార మిత్రాదులున్
మనముల్ వాడి తపింప నేదొనఁగు సం♦ప్రాప్తించెనో తెల్పరే. ౨౬౬

మ॥ అన ధాత్రీజ నిమిత్తమై తన కయో ♦ ధ్యాధీశుతో వైరమున్
జెను కయ్యంబును తత్ఫలంబు తెలుపన్ ♦ బీభత్సగావించిరా
వనచారుల్ ? పదచారులైన మనుజుల్ ♦ భంజించిరా ? కుంభక
ర్ణుని వీరోత్తము నింద్రజిత్తు ననుచున్ ♦ రోషోద్ధతిన్ నవ్వుచున్. ౨౬౭

మ॥ మము పిల్పించుట శేషునుండి ధరణిన్ ♦ మార్పింపఁ గా దబ్ధి నీ
రములం ద్రావఁగఁగాదు సప్తకుల భూ ♦ ధ్రంబుల్ విపాటించి పా
న్తములం దోర్వఁగఁగాదు కాయ గసరుల్ ♦ సాపాటుగాఁ గానలన్
దమి వర్తించు ప్లవంగకోటి దునుమన్♦దైత్యేంద్ర ! రప్పించితే ? ౨౬౮

ఉ॥ ఏపు విమర్శయేల యని ♦ యేచి కరంబులు తట్ట మేలుమే
లీపని మెచ్చువచ్చె నని ♦ హేలగ దైత్యులు నవ్వఁ బుష్కర
ద్వీప నిశాచరేంద్రుఁ డతి ♦ ధీరుఁడు వహ్ని కరంబులెత్తి మీ
కైపులు కూడవం చడఁచి ♦ కర్బురనాథుని గాంచి నమ్రుఁడై. ౨౬౯

చ॥ దనుజవరేణ్య ! వీరల వి ♦ ధంబును సైఁపుము శాంతమూను మా
మనుజ వరేణ్యులొందు బల ♦ మానములం దెలియంగ వేఁడెదన్
జనవునఁ దెల్పుఁడీ యనుచుఁ♦జక్కటి యంతయు మాల్యవంతుఁ డి
ట్లని వచియించెఁ దేటపడ ♦ నర్కకులేంద్రుల విక్రమంబులన్. ౨౭౦

—: మాల్యవంతుఁడు సేనాపతులకు రామ విక్రమాదులు తెలుపుట :—

చ॥ మిగిలిన విక్రమాఢ్యులగు ♦ మీరలు వాలి నెఱింగియున్నవా
రు గద కులాచలంబుల ని ♦ రోధముగాఁ దనకాలఁ దన్ను న
న్నగచరు రామమార్గణ గ ♦ ణంబున నొక్కఁ డురంబుఁ జీల్చి యా
శుగగతి జీవవాయువుల ♦ జుఱ్ఱుట యచ్చెరువందురే కదా ?. ౨౭౧

మ॥ మడిసెం గాన విరాధుఁడున్ గడచనెన్ ♦ మారీచుఁడున్ బేరు ప్రా
ల్పడ నండే ఖరదూషణ త్రిశిరులున్ ♦ స్వర్గంబుఁ బ్రాపించి రొ
క్కఁడ యొక్కండగు వింటితోఁ గడపె ర ♦ క్షస్సైన్య సంతానమున్
గడెలోనన్ రఘువర్యు బాహుబల ము♦ద్ఘాటింపఁగా నేటికిన్ ?. ౨౭౨

చ॥ ఇచటికి వచ్చి మీరదుగ ♦ నేల? మహోదధి మండి మాఁడియుం
టచటనె త్రోవలోఁ గనరొ? ♦ యారయరో? వినియుండరో? వృథా
వచనము లేల? పిన్నపుడె ♦ భర్గునిచాపము ద్రుంపఁ బుట్టు నా
ప్రచుర రవంబు మీచెవుల ♦ వ్రాలదొ? నిద్దుర వోయి యుంటిరో?

తే॥ లంకయెల్లలో దైత్యబ♦లంబు వేయి, వెల్వ లుండిన వాసేన♦వీరవరుల
రెండు విండ్లె సంయమనిని♦నిండునట్లు, చేసినవి వివరంబుగఁ♦జెప్పనేల? [యింద్ర

తే॥ కుంభకర్ణుండు మీప్రభు♦కొడుకులును ప్ర, హస్త ముఖ్య నాయకులు మా♦యావి
జితుఁడు తక్కువీరులు మృతిఁ♦జెందినారు, నేఁటిదనుక నుంటి మిచట♦నేను నితఁడు.

ఆ॥ మూలబలము గలదు♦మున్నూఱు వెల్లువల్, దానివంతు నేఁడు♦తనరుచుండెఁ
గాలవశత మీరుఁ ♦ గదలివచ్చితి రిఁక, వారి వీరవరుల♦బలము వినుఁడు. ౭౬౯

ఆ॥ ఒక్కకోఁతి వచ్చి♦ రొగి లంకఁగాల్చి దా, నవుల దునిమి యక్షు♦నవని రాచి
ధరణివిభుఁడు పంపు♦దౌత్యంబు నెఱవేర్చి, దంటయగుచు జలధి♦దాఁటిపోయె.

చ॥ కరువలఁ బేర్చి వారినిధిఁ ♦ గట్టి దశాస్యుని ప్రోలుసొచ్చి దు
ర్భరముగఁ బోరుసేయు కపి ♦ వారము గట్టిన కట్ట త్రోవలో
నరయరొ? మేరుశైలమున ♦ కవ్వల నొప్పెడు మందుకొండఁ జె
చ్చెర నొకకోఁతి తెచ్చెఁద్రుటి ♦ సేపున నట్టివి వారిసైన్యముల్ ౭౭౦

ఆ॥ ఈ దురంబు గలుగు♦హేతువు సీతనాఁ, బరఁగు గరితయగును♦పరమసాధ్వి
మీరె గెలిచి రండు♦వారె గెల్వఁగనిండు, వినిచినాఁడఁ గన్న♦విన్న తెఱఁగు.

తే॥ అనుడు వహ్ని దశాస్యుని♦గని బలములు,మడియుచుండ నాజికిఁ బోవ♦మానుటేల?
యనఁగ నది యెల్లిదంబని♦యరుగకుంటి, ననుచు దైత్యేశుఁ డాడంగ♦నతఁడు మఱియు.

మ॥ అది మాపాలికి నుంచినారలొకో? వృ ♦ ద్ధాచార సంవేదియున్
ముదుకండౌ మన మాల్యవంతు పలుకుల్ ♦ ముఖ్యంబుగా నెంచి యొ
ప్పిదమౌ తద్విధి సంధిచేసికొనుచో ♦ బింకంబుగా నుండు న
య్యది మించెన్ జులుకందనం బగును చే♦యంబోవ నీమీఁదటన్. ౭౭౧

ఉ॥ జానకి వీడినంత ననిఁ ♦ జచ్చిన యక్షుఁడు మేఘనాదుఁడున్
దానవవీరులున్ మనకు ♦ దక్కెడువారలె? యట్టిచేఁతయున్
మాన విహీనకార్యమగు ♦ మానక యుద్ధముచేసి యుద్ధతిన్
మానవవీరులం బిలుకు♦మార్చుట యుత్తమకార్య మిద్యోదన్. ౭౭౨

చ॥ అని వచియించి వహ్ని కల ♦ యం గని లేవఁగ రాక్షసాలి నీ
వనికిఁ జనంగనేల? చని♦యల్పుల రక్తము గ్రోలి క్రమ్మఱన్
గనియెదమయ్య మి మ్మటులు ♦ గాక దురంబున నోటగాంచుచోఁ
బిమ్మఁగు కులంబునం బొడము ♦ పీన్గులమే యని బావ లాడఁగన్. ౭౭౩

## ౩౦ మూల బల వధ పటలము. (౨౩౭)

తే॥ నేను నొకప్రక్కనేగి యా♦నీచ కపుల, యావిద్రావెద మీర లా♦యర్కకులుల
నొక్కమొగిఁగ్రమ్మి జీవవా♦యువులఁ గ్రోలి, శిరములం దెండనుచు దశ♦శీర్షుఁడనియె.

క॥ మొనగాండ్రు మొనలతో వెసఁ, జనుటంగని ముందుగాఁగఁ♦జనుఁడీ యనుచున్
దన మూలబలము నంపుచు, దనుజాధీశుండు లేచెఁ ♦ దమి మదిఁ బొదలన్.

క॥ పరికరములు నిండిన తన, యరదమ్మున నెక్కి మునులు♦నమరులు కలఁగన్
వనచరులమీఁది కొక ది, క్కున నేగెను యాతుధాన ♦ కుంజరుఁ డలుకన్.

తే॥ వీరవర్యులు ప్రస్థాన♦భేరి వ్రేయఁ, బనిచి కేకలువెట్ట మిం♦టను ధరిత్రి
దెసల నిండారియున్న య♦ద్దితిజ బలము, కలఁగి లేఁగిన జలనిధి♦కరణి నేగె.

క॥ పరమేష్ఠియండమున స్థా, గర భూ భూధర పయోద ♦ గగనచర చరా
చరకోటిఁబోలె సైన్యము, పురి యొప్పెను పొట్టివడుగు♦పోఁడిమివోలెన్. ౨౨౨

తే॥ పాడిఁగబళించి కరుణను♦పంటఁగఱచి, క్రౌర్యమునఁ బాపముల నొడి♦గట్టుకొన్న
వారు రంగుచే నెడఁదచే వారిదములఁ, గేశములచేతఁ గీలలఁ గేరువారు. ౨౨౯

తే॥ జలధి జలము పాఱఁగఁ జల్లి♦జలచరముల, మ్రింగి పిడుగులఁ గుండలా♦కృతిగఁదాల్చి
కంధరములొల్చి వలువలు♦గా ధరించి, తిరుగుక్రూరులు యమభయం♦కరులు వారు.

ఉ॥ కొండలు దమ్ము దాఁటుటకుఁ ♦ గ్రుక్కిన ఱాలుగ నొప్ప వారిము
క్కండము కాలియందెలుగ ♦ గజ్జెలుగాఁగ భుజంగబృంద ము
ద్దండతఁ జుట్టి వాయువును ♦ తార్క్ష్యుని చేరిచి కట్టికొంచు భే
రుండ పదక్రమంబు పదు ♦ రుంగొని యేగెడువారు ధీరతన్. ౨౩౧

సీ॥ ఆఁకలివేళ కా♦హారంబు లేనిచోఁ, గ్రుంగ కేనుంగుల♦మ్రింగువారు
వేళకు నీరు ల♦భింపదేని మొయిళ్లఁ, బిడిచి జలంబులఁ♦గుడుచువారు
కొండ లెగురవైచి♦దండంబుతోఁ గొట్టి, యలవున గడిదేటి♦నట్టివారు
జిల యెత్తెనేని క్రొ♦న్నెలఁ బట్టి తమమేని, దురద వోవంగ రు♦ద్దుకొనువారు

తే॥ శిలలఁ బొడిచి చేశక్తి వీ♦క్షించువారు, చెలఁగి పిడుగులఁబోలె గ♦ర్జించువారు
చక్రశూల దండ ప్రాస♦సాధనముల, హరిహరాంతకగుహుల గె♦ల్పందువారు.

తే॥ ఒక్క రొక్కరు జగముల♦నొడుచువారు, కలిసిరేని జగంబులఁ♦గలఁచువారు
తిరిగిరేనియు జగములు♦తిరుగుఁదోడ, నడతురేనియు జలధులు♦నడచుఁదోడ. ౨౩౩

తే॥ ఎన్ని మొగుళులు గలవన్ని♦యేన్గులుండు, నెన్ని యేన్గులుండు రథమ్ము♦లన్నియుండు
నెన్ని తేరులో గుఱ్ఱంబు♦లన్నియుండు, నెన్నిగుఱ్ఱాలో భటసంఖ్య♦యంతయుండు.

తే॥ గజ తురగ సేన మణిగణ♦ఖచిత కనక, భూష ణాలంకృతంబులై ♦పొలుపుమీఱుఁ
గాని కైసేయకున్న దొం♦డేనిలేదు, స్యందనములఁ దెల్పఁగ నవ♦సరము లేదు.

తే॥ ఎఱ్ఱధూళి యాకాశంబు♦నెల్లఁగప్ప, నీరదంబుల నల్పు గా♦న్పింపదయ్యెఁ
కరుల మదజలధారలు♦గలియుకతన, జలధులందలి యుప్పన♦సమసిపోయె. ౮౯౬

ఉ॥ మూలబలంబు నొక్కపరి ♦ పూన్కి వెలార్చెడు కోట వాకిళుల్
పోల జగంబులెల్లఁ దన♦పొట్ట నడంచి యనంతర స్థితిన్
గోళములోలి వెళ్ళఁజుచు ♦ కొండిక యా వటపత్త్రశాయి లీ
లా లసితాస్య పద్ధతిఁ జె ♦ లంగె మహాద్భుతరీతి నత్తఱిన్. ౮౯౭

ఉ॥ ఆచతురంగ సైన్యముల ♦ హోవడి సైఁపఁగ లేక శేషుఁడున్
మోచు భరంబు దొడ్డగుడు ♦ మ్రొగ్గెను వానరబృంద మష్టదృ
గ్గోచరమైన సేనఁ గని ♦ కోయని భీతి నదిచి వార్ధి వే
లాచల సీమఁ జేరె హాల ♦ హాలము గన్న సురాళికై వడిన్. ౮౯౮

తే॥ చక్రవాళ మెల్లగఁ గల♦జలధి తీర, భూమి వదిగాఁగ దుష్కర్మ♦ములును విధియుఁ
గాలుఁడును వేఁటరులుగ దై♦త్యాలి మృగమ,యుంబుగా నొకవేఁట య♦య్యెవని జరిగె.

ఉ॥ వీరుల సింహనాదములు ♦ వీరణముల్ రథనేమి రావముల్
వారణ ఘీంకృతుల్ తురగ ♦ వారము హేషలు విండ్ల ఘోషలున్
భేరుల భాంకృతుల్ చెలఁగి ♦ భీకరలీల జగ ల్లయంబు వే
ళారవమట్లు పెంపెసఁగెఁ ♦ బ్రాణులు తల్లడమంది కుందఁగన్. ౯౦౦

ఉ॥ ఆయుధ మత్స్యముల్ మద గ ♦ జాయత నక్రము లశ్వవీచికల్
వ్రేయఁగ నూఁదఁగా నఱవ ♦ వెల్వడు ఘోషము కోప దృష్టులన్
బ్రాయపుఁ జొఱ్ఱమీలు రథ ♦ రాజి నగంబులు సొరుమీఱ దై
తేయ గభీర మూల బల ♦ తీవ్ర మహాంబుధి లోక భీతిగన్. ౯౦౧

చ॥ అసురబలంబు పచ్చిక బ ♦ యళ్లను త్రొక్కుటచేత వారణ
ప్రసర మదాంబుపూరమున ♦ బంకగఁ బంకము గాఁగ లంక ఫా
ల్గునముగ బ్రుంగుఁగాని తొన ♦ కంబునఁ బల్వురు నింగిమీఁద నొ
ప్పనఁగఁ జరించుచేఁత నెల ♦ యింపక క్రుంగక నిల్చె నత్తఱిన్. ౯౦౨

—: వేలుపు లసురబలముఁ గాంచి శంకించుట :—

ఉ॥ కాంచిరి వేలుపుల్ ధరణిఁ ♦ గాంచిరి వారిధి మింటి యుచ్చియుం
గాంచిరి దిక్కులెన్మిదియుఁ ♦ గాంచిరి పెల్లుగ నిండు టెక్కెముల్
గాంచిరి యొల్లచోటులను ♦ గాంచరు బీడుగ నున్న కందువన్
గొంచెమయేని భీతిలిరి ♦ కుందిరి కంపము నొంది రుక్కఱన్. ౯౦౩

చ॥ జగములనున్న యెల్లరు ని ♦ శాచర రూపములంది కైదువుల్
మిగులఁగఁ దాల్చి సంగరము ♦ మేకొని వచ్చిరొ ? సాగరంబులే

యగణిత రూపధారణము ♦ నంది పితామహు నాజ్ఞచేత నీ
వగిది గదించెనో యని ను ♦ పర్వులు భావనసేసి జంకుచున్. ౯౦౪

ఉ॥ భర్గునిచేరి మేమెదుగఁ ♦ బాఱుచు నిల్వఁగఁ జోటులేదయో
నిర్గమనంబుసేయుటకు ♦ నేరము ప్రాణము లింక నుండునే ?
స్వర్గమునున్న ? యీభువన ♦ జాలము నిల్వఁగలేదు మాకు నీ
దుర్గతి వీడదేమి ? కన ♦ దుర్భరమయ్యెడి నోర్చు టెట్టులో ? ౯౦౫

ఉ॥ వేవురు రాము లొక్కటయి ♦ వేయి సమల్ సమరంబుసేసినన్
రావణసేన చావ దొక ♦ రాముఁ డనిం బొనరింప నేనుగున్ ?
వావిరిఁ గాంచినంతఁ దమ ♦ ప్రాణము లిక్కఁగఁ బట్టికొంచుఁ గీ
శావలి పాఱఁగాఁదొడఁగె ♦ నక్కట ! తండ్రి ! యిఁకేది త్రోవయో ?

తే॥ అనుచు శర్వుండు మీఁ రించు♦కైన శంక, నొందఁబనిలేదు వీరల♦నిందఱ విధి
యిటకుఁ దెచ్చె నాశంబు సే♦యించుకొఱకు, నని సమాధానపఱచె న♦య్యమర వరుల.

—: వానరులు మూలబలముఁ గాంచి పాఱుట :—

ఉ॥ పుట్టలనుండి ప్రాఁచుల స ♦ మూహము వెల్వడఁగాంచి భీతిమైఁ
దిట్టలు తిట్టలై పరువు ♦ దేఱెడి మూషికరాజికైవడిన్
మిట్టి బలీముఖంబులు త ♦ మిన్ నృపవర్యుల లెక్కసేయ కె
ట్టెటులు దోఁచె నట్టటు ల ♦ హీన భయంబునఁ బాఱె నవ్వడిన్. ౯౦౭

ఉ॥ కొన్ని పయోధిలోఁ బడియెఁ ♦ గొన్ని ప్లవంబుల రోసి సేతువున్
గొన్ని తరించెఁ గందరలఁ ♦ గొన్ని యడంగెను కొన్ని యీఁదెఁ ది
మ్మన్నలు కొన్ని ప్రాఁకులకు ♦ పోవడి దాఁటెను కొన్ని నింగిపైఁ
బన్నుగ నేగెఁ గొన్ని వెసఁ ♦ బాఱఁగలేక యులంగి చేడ్పడెన్. ౯౦౯

ఉ॥ కట్టినసేతువే మనకు ♦ గండము దెచ్చును వెంబడింతు రి
క్కట్టుగ యామినీచరులు ♦ గావున దీనిని ద్రెంచిపోద మి
ప్పట్టున నంచుఁ గొన్నియుడె ♦ వారలు మింటను కూడ వత్తు రిం
కెట్టని కొన్నివల్కెఁ గొని ♦ యుల్లెడ నిండిరి సోఁకులే యనన్. ౯౧౦

తే॥ అర్కసుతుఁ డాంజనేయుండు♦నంగదుఁడును, రాము వీడకుండిరి తక్కు♦రాణువెల్ల
పఱవసాగెఁ బయోధియుఁ♦బల్లటిల్లె, నరసె నంతయు రామభూ♦వరుఁడు కనుల.

సీ॥ ఈగొప్ప కూటువ♦లింతకాలం బెట, నుండె నెవ్వాడు వచ్చె♦నో దుఁగుబడిగ
వినిపింపుమని రామ♦విభుఁడు ప్రశ్నింప వి, భీషణుఁ డిట్లను♦వెరవుతోడ
నన్నిదిక్కులయందు♦నన్నిదీవులయందుఁ, గ్రిందిలోకములందుఁ♦గిక్కిఱించి
నెలకొన్న దానవా♦నీకంబు దూతలు, ఛని తోడితెచ్చిరి♦సైన్యమందు

తే॥ ముందువచ్చెడు మూఁకయే♦మూలబలము, వెనుక రాక్షసబృంద మ♦వ్వీటలేదు
దుష్కృతము ముందరికిఁద్రోవఁ♦ద్రొడరివచ్చె,విధియుఁగాలంబునొనరించు♦ప్రేరణమున.

మ॥ అని నాచిత్తము తెల్పుచున్న దన న ♦ జ్ఞాతుండు చిర్నవ్వుతో
గనలుం గన్నుల కెంపు దోఁపఁ బ్రుకుటిలోఁ ♦ గ్రవ్యాద సందోహముల్
కను నప్పాటులఁ జూచుచుండుఁడు మత్తే ♦ కార్యంబు చింతింపకుం
డని కీశాలికిఁ దెల్పి తోడుకొని ర ♦ మ్మా యంగదా! నావుడున్ ౯౧౩

మ॥ అతఁడున్ వారలఁ జేరి యో గిరనలా ♦ రా! నిల్చి నావల్కులన్
శ్రుతులం జేర్పుఁడు వెండి పొండనినఁ గీ ♦ శుల్ కొంద ఱాలింప న
మ్మతి గాన్పింపక పాఱి రవ్వలకు న ♦ మ్మానించుచుం గొంద ఱే
మతి బోధించెదువాఁడవంచు నిలువన్ ♦ మన్నించుచు నవ్వుచున్

ఉ॥ దేనికి జంకిపాఱెదరు ♦ తేఁకువ మీరలు దెల్పుఁడన్న న
మ్మానితుఁ గాంచి వారలును ♦ మన్నఁడ! చూడవా? సోఁకుమూఁకలన్
బూనికఁ బోరి చచ్చి మఱి ♦ పొందెడి దెయ్యది? యింద్రజిత్తుచే
నైన యవాంత్రముల్ తలఁప ♦ నైనను చాలుదుమేమి చెప్పుమా?

ఉ॥ వెన్నుఁడు గట్టువిల్తుఁడును ♦ వేల్పులు నోడిరి సోఁకుఱేని యు
ప్పిన్ననిచేత నాతనికి ♦ వీఁగినవారలె వీరు! వీరలన్
మన్నియ లిద్దఱేఁచి యని ♦ మార్కొని గెల్చెదువార లౌదు రే?
తిన్నగఁ జూడుమీ యనుఁ ♦ లీపని మున్వినవేమి? యంగదా! ౯౧౬

తే॥ చిలువతాలుపుతోఁ బచ్చ♦వలువతాల్పు, నలువతో నింతికాపుంజ♦గలిసి దురము
నలిపి పెక్కువేలేండ్లొక్క♦పొలనుదిండి, గెలువలేరైరి వీరలా♦గెలుచువారు? ౯౧౭

తే॥ కోఁతిగుంపు లన్నిటి నొక్క♦కూళ యొఱచి, దిండి మ్రింగుటకుం జాల♦కుండు వీరి
కూటువుల నొకప్రొద్దల్లఁ♦గూడియేని, పలుకువెలఁది మగండేని♦ తెలుపఁగలఁడె?

తే॥ తలలు పది చేతు లిరువది♦కలవు పొలను, దిండికొఱకిమీనికని వెట♦తిప్పుచుండె
నిచటఁ గల మన మగవారి♦కేమి వేయి, తలలు రెండు చేల్చేతులు♦గలవె చెప్పుమ?

తే॥ కుంభకర్ణుని చేవిల్లు♦కూడియెత్తఁ, జేవ లేకుంటి మాతని♦చేత లీవు
నెఱుఁగుదువుకద పసివాఁడ♦విట్లువచ్చి, యుంటి విను బ్రమ్మరులకంటె♦నోపఁగలమె?

తే॥ హనుమ బలిమియు సుగ్రీవు♦నలవు రామ, లక్ష్మణుల వింటినేర్పు త♦లంచి చూడఁ
దమ్ము తము♦గాచుకొనునంత♦తరముగావు, మనలఁగాచుటెక్కడిమాట?మఱవెదగును

ఉ॥ రాముఁడె యేలనేమి? మఱి ♦ రావణుఁడేలిననేమి లోకముల్
తాము నశింపకున్నఁగద♦తక్కినవెల్లఁ; భుజించి డాఁగఁగా
భూమిధరంబులందు ఫల ♦ ముల్ జలముల్ గుహాలుండె మమ్ము నీ
వేమిటి కింకఁ బిల్చెద వ ♦ హీనగుణాకర! యన్న యంగదా! ౯౨౨

చ॥ విరవిరవోయి వార లిటు ♦ వేఁడఁగ నంగదుఁ డాలకించి యు
చ్చ్వరువున జాంబవంతుఁగని ♦ చెల్వుఁగ నిట్లను సూర్యునొద్ద వ్యా
కరణము నేర్చినట్టిఁడగు ♦ గాడుప్పుపట్టికి నుద్దియైన నీ
వరయఁగ నిట్టులైన మతి ♦ యజ్ఞుల సంగతి చెప్పనేటికిన్ ? ౯౩

ఉ॥ పన్నగతల్పుఁడే భువన ♦ పావనుఁడౌ రఘురాముఁడంచు మా
కన్నఁగ బోధసేసి వెల ♦ యించితి మున్నిపు డిట్టి మూర్ఖులన్
దిన్నఁగఁ దెల్పి పోఁడిమిని ♦ దేర్పక భీతిలి తేని కీర్తియున్
విన్నను వేమగున్ ? గుదిసి ♦ బీరము మానుట వీరధర్మమే ? ౯౪

చ॥ అదరునఁ గీర్తి వోవిడిచి ♦ యాఁటిడిపాలయి యెందువోయినన్
బ్రదుకఁగనౌనె ! కాలుఁ డెదు ♦ ర న్నిలువన్ ? సుధయంచు నంజుడున్
విదితముగాఁగ నిచ్చినగ్ర ♦ వీణుల మాదుము నమ్మియున్న న
ద్విదులను మానవుచ్చి యని ♦ వీడిన నింతకుఁ జావుమేలుగా ! ౯౫

తే॥ దేవదానవుల్ చేరి మ ♦ థింపలేని, పాలవెల్లిని చిలికిన ♦ వాలి నొక్క-
కోలనేసిన బలము ల ♦ కోరివలనఁ, గడలిఁ గాల్పుట మఱచితో ? ♦ కానవొక్కొ ?

చ॥ దనుజ బలంబు లెన్నయిన ♦ ధర్మములేదట ధర్మ మున్న చెం
తనె జయముండు నిశ్చయ మ ♦ ధర్మము ధర్మము నెందుగెల్వ లే
దనుట వినంగలేదొ ? యిది ♦ యా మతిమంతునిరీతి ? పిచ్చినా
నినిబలెఁ బందలం గలిసి ♦ నీవును పాఱుట యుక్తకార్యమే ? ౯౬

చ॥ అనుటయు సిగ్గుచే నవన ♦ తాననుఁడై యను జాంబవంతుఁ డీ
వను టుచితంబదైన నిపు ♦ డచ్చటఁ జేరిన సోఁకుమూఁకలం
గనుటకునేని యాత్మ ధృతి ♦ గాంచుటకేని పినాకికేనియున్
జనునొకో ? యల్ప వానరుల ♦ సంగతి నెంచఁగ దోసమున్నదే !

ఉ॥ కాంచితి దేవదానవుల ♦ కయ్యము మాలిని మాల్యవంతు మున్
గాంచితిఁ గాలనేమి మధు ♦ కైటభులన్ గనకాక్షు సోదరుం
గాంచితి హాలహాలమును ♦ కాంచఁగలే దిటువంటివారలన్
మించి యముండునే నధిగ ♦ మించి విరోధము గొన్న వీరితో ? ౯౭

సీ॥ బలముకంటెను వర ♦ బలము గల్గినవారు, మాయల గడిదేఱి ♦ మలయువారు
కడలి యిసుకకంటెఁ ♦ గడులెక్క గలవారు, కలికంటె నెద చెడ్డ ♦ గలుగువారు
కృతహాస్తులతిరా ♦ కృతులు వీరలఁగన్న, యమరవర్గము భయ ♦ మందుచుండ
మనకు దిట్టతనంబు ♦ మఱివచ్చునేమి ? యి, ట్లున్న నెట్లున్నఁ జా ♦ వున్ననైన

తే॥ పోరునకు జంకిపాఱుట ♦ మేరగాదు, యశము తొలఁగును గౌరవ ♦ మబ్బు నిక్క-
మైన నొకమాట శ్రీరాము ♦ నాననంబు, నెదుట నిల్చుట యెట్లు? మా ♦ కెత్తు టెట్లు !

తే॥ భల్లుకేంద్రుఁ డిట్లాడంగ ♦ వజ్రభిన్న, శైలవక్షుండు శ్వేతాద్రి ♦ స్రావినట్టి
కారుమబ్బునాఁ దెల్లని ♦ గౌరు మీఁద, వెలయువజ్రికి మనుమండు ♦ పలికెనిట్లు.

తే॥ జయము నోటమి యెదిరించు ♦ టయును చంపు, టరయ వీరుల కెన్నండు ♦ జరుగునదియ
నిలిచినార లిచ్చటనాదు ♦ పలుకుల విని, కాన మీరలును విమృశ్య ♦ కారులెచుమి.

చ॥ వదరకుఁడీ భయంబు మదిఁ ♦ బాయుఁడి యెల్లర మొక్కటయ్యు నె
య్యదియు నొనర్పలేము మన ♦ యజ్ఞతలెల్ల క్షమించు రాముఁడే
యెదిరిచి గెల్చునేని జయ ♦ మేర్పడఁ గాంతము కాదయేని పా
యుద మసువుల్ రణంబున ర ♦ ఘూద్వహు తోడనె రండు లెండనన్.

ఉ॥ పాఱినవారమైతిమి య ♦ సత్రపథమొంచి జగంబు దూఱఁగాఁ
బాఱిన వారలెల్లరు ని ♦ వర్తిలనిండని భల్లుకేశ్వరుం
దూఱటలాడ నెల్ల కపు ♦ లొయ్యన వచ్చిరి రామచంద్రుఁడున్
దారిన గొప్పసేనఁగని ♦ తమ్ముని మోమును గాంచి యిట్లనున్. ౯౩౪

చ॥ అసురబలంబు లెన్నయిన ♦ నంజిక లేదవి మచ్ఛరాగ్నులన్
దున తునఁ గాలిపోవునవి ♦ దూదివలెం బనిచేటులేదు నీ
వసమునఁ గాచుచుండుము వ ♦ నాటులనెల్లర నెచ్చరంబునన్
దెసలకుఁ బాఱినారు గద ♦ దిక్కొకయింతయు లేని దీనతన్. ౯౩౫

శా॥ ఈసేనన్ మనమీఁదికంపి యసురా ♦ ధీశుండు వెన్పాటునన్
మోసల్ సేసి ప్లవంగులం దొడరి యే ♦ పుంజూపి వేఁటాడుచో
నీసామర్థ్యము చూపి నానిబలము ♦ న్నిర్చేసి యీసేనలన్
గాసిం బొందఁగనీక కావఁదగు నా ♦ కర్ణింపు మీ ప్రార్థనన్. ౯౩౬

ఉ॥ వీరలఁ గూర్చి నామది త ♦ పించుచునున్నది యొచ్చరింతతో
మారుతితోడఁ గీశకుల ♦ మాన్యునితో సిటనుండుఁ డందు నా
కేరును తోడు లేరనుచు ♦ నెంచి తపించిన మోసమబ్బు నా
శ్వేరము నోటముం గలుగు ♦ వెక్కసమౌ నన లక్ష్మణుండనున్. ౯౩౭

మ॥ అదియే యుక్తముగాక నీకడన మే ♦ మర్థించి నిల్చున్నచో
నిది రక్షోబల మిద్ది కార్ముకబలం ♦ బిట్లుండెనంచున్ వియ
త్పదులంబోలెను చూచుచుం దమ ధను ♦ ప్పాండిత్యమున్ మెచ్చి మే
లదిరా యంటలు దక్క నీకగు సహా ♦ యత్వంబు వేఱుండునే? ౯౩౮

సీ॥ అనిపల్కి సౌమిత్రి ♦ యటనుండిలేవ మా, రుతివచ్చి జానకీ ♦ పతికి మ్రొక్కి
యీనీచవానరు ♦ నెగ్గాడ కీభుజ, ములమీఁదఁ గూర్చుండి ♦ కలను సేఁత
యుక్తంబు; కాఁ జేసి ♦ యొగివెన్క నిల్చిన, నా సేవ ఫలియించు ♦ వాసి ననుడు
నీకసాధ్యంబయి ♦ లోకసాధ్యంబైన, పనియొండు గలుగునే ♦ పవనపుత్ర!

తే॥ రావణుఁడు దాపునకు వచ్చి♦రణముచేసె, నేని యూర్మిళావిభునకు♦నీవుతోడు
పడకయున్న విజయమెట్లు♦పడయఁగలము? వనచరుల నెట్లు దక్కించు♦కొనఁగఁగలము
తే॥ ఇంద్రజిత్తుపైకి లక్ష్మణు♦నెచ్చరించి, పంపినదియు నీతోడనే♦ వాని నతఁడు
గెలిచినదియుఁ నీవల్లనే♦గెలువవలసి, యున్నదింకను తోడు నీ♦వున్నకతన. ౯౪౧
మ॥ అతులోత్సాహముతో స్వధర్మముగ సౌ ♦ ఖ్యంబుల్ విసర్జించి స
మ్మతి నాతోడనవచ్చు లక్ష్మణుని ప్రే ♦ మంగాచి సుగ్రీవు సం
గతి నీవుండి చరాచరప్రతతి దుగ ♦ ఖంబుల్ తొలంగించి స
న్మతి ధర్మంబును నిల్పుమా యని రఘు ♦ శ్రేష్ఠుం డవ్వేలన్. ౯౪౨
మ॥ నీవును తమ్ముతో నిలిచి ♦ నిర్జరవైరు లొనర్చు నీచ మా
యావిధులెల్ల నారసి ర ♦ యంబునఁ దెల్పకయున్న సాగునే?
రావణమర్దనంబు సమ ♦ రంబున నీవలదా విభీషణా!
భావి శుభప్రవృత్తి కిల ♦ బంధుర శక్తియు జీవగఱ్ఱయున్. ౯౪౩
తే॥ అనిన రాముని వాక్యంబు♦లాదరించి, పావనియు విభీషణుఁడు సు♦గ్రీవుఁ డధిక
మోదమంది వానరసైన్య♦ములను కావ, సమ్మతించిరి చనిరి ల♦క్ష్మణునితోడ.
మ॥ దనుజధ్వంసి నమస్క్రియల్ సలిపి కో ♦ దండమ్ము చేనంది శిం
జిని నెక్కించి విశాల వక్షమున ర ♦ క్షీభూతమౌ కంకటం
బును లీలన్ ధరియించి యక్షయ శర ♦ ప్రోద్దీప్త తూణీరమున్
వెనుకం దాల్చి రణాగ్రమందు నిలిచెన్ ♦ విక్రాంతి గంభీరుఁడై. ౯౪౪
ఆ॥ నూఱుయోజనముల♦దూరంబు నిండిన, సేన ముందు నిలుచు♦మానిమీఁద
నసురసేనవైచు♦నాయుధ వితతు లా, కసముగప్ప సురలు ♦ కాంచి భీతి. ౯౪౫
శా॥ రామా! భక్తభయాపహారక తను ♦ త్రాణంబ! నీలాంబుద
శ్యామా! రాక్షసభీమ! ధార్మిక జగ ♦ త్సంస్థాపనా! నీవు గా
కీమానంబగు దైత్యసేన కెదురై ♦ యెవ్వాఁడు నిల్వంగ ని
చ్ఛామోదంబున నోపు? మాహృదయ వాం ♦ ఛాపూర్తి గావింపవే!
మ॥ అని ప్రార్థింపఁగ మానులున్ సకల ధ ♦ ర్మాచార సంపన్నులున్
దనుజాధిక్యము రాము నొంటియు మహా♦దైన్యంబుతోఁ గాంచుచున్
గనులన్ బాష్పము లొద్చుచున్ మనము వై♦క్లబ్యంబు నొందంగ రా
మునకున్ మంగళ మబ్బుఁగాతమని ప్రా ♦ ర్థించి దీవింపఁగన్. ౯౪౬
తే॥ తక్కు సిద్ధసాధ్యాదులు♦దాశరథికి, విజయమగుఁగాత దైత్యాళి♦విఱుగుఁగాత
నేఁటితోడఁ బాపమ్ములు♦నీఁగుఁగాత, మనిరి దనుజవీరులు కాంచి♦యుచ్ఛ్రయమున
చ॥ నిలుకడ తప్పి వానరులు ♦ నిల్వక పాఱిన శత్రుసేనలో
నిలిచి శరాననంబుగొని ♦ నిశ్చలుఁడై మనమీఁది కక్కటిన్

గెలువఁగ నెంచిరాక తన ♦ గెల్పునకంటెను దొడ్డకాదె? యి
ట్టలముగ మాల్యవంతుఁడు వి♦డంబన సేయునె? బొంకులాడునే? ౯౪౯

మ॥ మును దేవాలి పురారితో రథికులై ♦ మున్నాడిరాఁ దార్క్ష్యుపై
మన సద్వంశవినాశకుండయిన యు ♦ మ్మాయావి వైకుంఠుఁడున్
ఘనుఁడై వచ్చి యెదిర్చె; వీఁడొక ధను ♦ ష్కాండంబుతోఁ గాల్నడన్
మనపై నెత్తెఁ జలంబు సాహసము సా ♦ మర్థ్యంబు మెచ్చొఁగదా!

మ॥ హరులున్ దేరులు గొరులున్ శరభ సిం ♦ హవ్రాతముల్ క్షుబ్ధ సా
గర సంకాశములై యెలర్పఁ గనుచున్ ♦ గౌతూహల స్వాంతుఁడై
త్వరితోత్కంఠత రండురండనుచు నా ♦ హ్వానించుచున్నాఁడుగా!
ధర నిల్లెవ్వఁడు నిల్చి పిల్చి మరలెన్ ♦ దర్పించి ప్రాణాలతో. ౯౫౧

—: శ్రీరాముఁడు రాక్షస బలముల నుఱుమాడుట :—

మ॥ అనిగర్జించు చఖర్వ గర్వమునఁ గు ♦ వ్యద్ఘోర సింహంబు వా
రణ యూథంబులు చుట్టినట్లు బలద ♦ ర్పభ్రాంతులై రాక్షసుల్
తను ముట్టంగని మేలుమేలనుచుఁ గో ♦ దండంబునన్ శింజినీ
నినదంబుం బరఁగించె రాముఁడు లస ♦ న్నిర్ఘాత ఘోరక్రియన్. ౯౫౨

శా॥ మాటెన్ సాగర ఘోరలొక్క మొగి న ♦ మ్మాతంగ యూథంబులన్
దాటెన్ వేగము వారువంబులకుఁ గ్రో ♦ ధంబుల్ దిగంబాఱఁగాఁ
దీటెన్ వీరుల శౌర్యధైర్యములు భీ ♦ తిం భ్రాంతి నిండారుటన్
మీటెన్ దాహము నోళులెండె మనముల్ ♦ మేండ్రించె దైత్యాళికిన్.

చ॥ తురగ పిశాచ సింహములు ♦ దుర్భ్రమచే నడ తారుమాఱుగాఁ
బరుగులువాఱె తేరులను ♦ పాడుగఁ గూల్చె మతంగజంబులున్
వెఱగొని మావటీంద్రఁ దమ ♦ భీకర హస్తముతోడ నీడ్చి యు
ర్వరఁ గొని మోఁది యిచ్చవడిఁ ♦ బాటెను క్షోభము పుట్టె సేనలో.

చ॥ ఖచరులు దుర్నిమిత్తములఁ ♦ గాంచి నిశాచర నాశ సూచక
ప్రచరములంచు సంతసిలి ♦ పాడిరి యాడిరి క్రూరరాక్షసుల్
విచలితులయ్యు రోషమున ♦ వీఁగక పైకొన రామభద్రుఁడున్
గుచరులమీఁద బాణముల ♦ గుప్పెను లెక్కకు మిక్కుటంబుగన్. ౯౫౫

సీ॥ హరులపైఁ గరులపై ♦ శరభ సింహములపై, వీరులపై వారి ♦ తేరులపయి
శరములపై శరా ♦ సనములపై భట, శిరములపై వారి ♦ యురములపయిఁ
గరములపైఁ బరం♦పరలుగా శరములు, గురియింప నురలెను♦కుంజరములు
దొరలెను వీరుల ♦ శిరముల కరణిని, తురగోత్కరంబులు ♦ దురములనందు

తే॥ విఱిగి యఱిముఱిఁగ్రిందుపడు ♦ విండ్లవలెను, సిడములును పొడిపొడి యయి ♦ పుడమిఁబడియె
చంద్రరేఖలవలె నిశా ♦ చరుల కోఱ, దంతములు పలపలరాలి ♦ ధరణిఁగూలె.
సీ॥ సుడిగాలితోఁ జడి ♦ వడిగ్రైన చందాన, రామ నిశాత మా ♦ ర్గణము లొలయఁ
దుంగ మాతంగ తు ♦ రంగ శతాంగ భ, టాంగ సంఘంబులు ♦ ద్రుంగి పడియె
నోష్ఠంబు గొఱుకుచు ♦ నుండు దంతంబులు, కోపంపుఁ జూపులఁ ♦ గొఱలు కనులు
కరవాలు వీడని ♦ కరములు గర్జిల్లు, మూర్ధముల్ పరుగిడు ♦ మొండెములును
తే॥ పాఱు రక్తప్రవాహముల్ ♦ మీఱితునిఁగి, పడెడి యవయవంబులతోడఁ ♦ బ్రధనభూమి
చూడ బీభత్సమయ్యె ర ♦ క్షోగణముల, యాయుధము లొక పనిసేని ♦ చేయవయ్యె.
సీ॥ అమ్ములతోఁ గార్ము ♦ కమ్ములు తెగుచున్న, కత్తులూనిన కేలు ♦ కత్తిరిల్లఁ
గేలకు మున్నుగాఁ ♦ గాళులు తెగుచుండ, నొకటిపై నూఱు సా ♦ యకము లరుగఁ
దురగంబులకు మున్న ♦ ఖురములు తెగుచుండు, ఖురములతోడఁ జ ♦ త్రువులు పోవుఁ
జత్రువులకు మున్న ♦ వక్షముల్ ప్రీలును, వక్షాలతోఁ జీలు ♦ వదనములును
తే॥ తప్పిపాఱినదొక్క ప ♦ త్తడియు లేదు, శ్వాసమూర్ఛుటకేని రా ♦ క్షసుల కెడము
లేమిఁదబ్బిబ్బులై వారు ♦ రాము నొంచు, వెరవు దొరకక యూరక ♦ యొరలుచుండ్రి.
సీ॥ చనఁ దలఁపకమున్న ♦ చచ్చి పడుచునున్న, శవ నివహము దాఁటి ♦ చనఁగలేక
చన్న వేలకువేలు ♦ శరములు తాఁక నొ, క్కరథంబు నూఱు ము ♦ క్కలుగ విఱుగు
నంబకంబులు పంచి ♦ యునరు లంటఁగ మున్న, చచ్చినపోల్కి గ ♦ జంబు లురలు
ననిమిది దిక్కుల ♦ ననసి యెుక్కమ్మడిఁ, బమ్మిన వీరులా ♦ వలికిఁ బోరు
తే॥ అరదములు బార దూరంబు ♦ నరుగలేదు, వారణంబు లూరక ప్రమాలి ♦ వసుధఁగూలె
తురగసంఘంబులును పని ♦ తోఁచ కుడిగె, భటులు బలిశ్లైరి యుత్తిక ♦ బరువు తగ్గి.
మ॥ జలజాక్షుం డొకయుగ్రమేయ శతమై ♦ సాహస్రమై నూఱు కో
టుల ప్రాణంబులఁ దీయుచున్న నుడి నాఁ ♦ డు న్నేఁడు సత్యంబుగాఁ
గలనం జచ్చినవారి నెంచి విధి లె ♦ క్కల్ తప్పు గావించెఁ బ్రా
ణులఁ గొంపోయెడి కాలుఁడెంతపడెనో! ♦ నోపెంత దానొందెనో! ౧౭౦
శా॥ నీరంధ్రక్రియ వారిదౌఘు విగళ ♦ న్నిర్ఘాత సందోహముల్
జాఱం గాలు నరణ్యలీల శర సం ♦ జాతానల జ్వాలలన్
సారంగంబులపై శతాంగములపై ♦ జాల్వారు టెక్కెంబు లే
దారింబోయెనొ? బూదిశ్లై శ్వసనుఁ డు ♦ ద్దండించి కొంపోవఁగన్.
చ॥ తునిఁగిన శూల కుంత శర ♦ తోమర సంఘము తూపుత్రోపుచే
వననిధిఁ జొచ్చి చుట్టను ధ ♦ వంబునఁ ద్రావఁగ నీరు వట్టి జీ
వనచరరాశి చచ్చె నట ♦ ఫండలిగట్టె పయోధి యుండఁగన్
వనజ హితాన్వయప్రభు న ♦ వారణ బాణ జవంబు నేమనన్! ౧౭౧

చ॥ అరి మద భంజనుం డయిన ♦ యర్కకులేశు నిశాత సాయకో
త్కరము పురత్రయంబు వడి ♦ దాహ మొనర్చిన వైష్ణవాస్త్రమున్
కరణిని పోయి దానవ ని ♦ కాయ శిరోగి పద హస్త సంఘముల్
జఱచుటఁ జూడఁజేసినది ♦ సుందర హేమ శతాంగపాళితో. ౯౬౩

చ॥ ద్విరదచయంబుమీఁది భట ♦ తీవ్రతరాయుధ శస్త్ర హస్తముల్
ధరణిని ద్రొంచుఁబాముల వి ♦ ధంబునఁ గూలుచుఁ ద్రుస్సె నోష్ఠముం
గఱచిన శీర్షవర్షము ల ♦ కాండ పయోద వహుతాశనాశనుల్
పఱచిన తీరుగాఁ బడియె ♦ భాస్కరవంశ్యు శరాసనోద్ధతిన్. ౯౬౪

చ॥ విలయ పయోదముల్ గురియఁ♦బేర్చిన వారిధియట్లు సంగర
స్థలము రహింప రక్తమునఁ ♦ దాఱెను తేరులు మావటీంద్రతోఁ
బొలుచు మతంగజంబులును ♦ పూఁడెఁ బదాతిచయంబు పూఁడెఁ దే
జులు పడి పూఁడెఁ గొన్నినుడి ♦ చుట్టి భ్రమించెను దిక్కుదోఁపమిన్.

క॥ తెగి పైకెగిరిన శిరములు, తగులు ననెడి భీతి సురలు ♦ తలఁగిరి ధరకున్
దిగుతలలు శిలలపోలికిఁ, దగులుననుచు భూజనములు ♦ తాఱిరి దెసలన్. ౯౬౬

చ॥ ప్రళయ పయోదధారల తె ♦ ఱంగున రామ శరాళి పర్వ నా
కలఁకునఁ ద్రెవ్వ మస్తములు ♦ క్రొఁగిన కన్నులతోడ ఖేచరా
వళిఁగని మేఘమాలికల ♦ భంగిని నింగిని నిండుచున్ మహా
నిల హతిచే విమానములు ♦ నేలను కూలు విధంబునం బడున్. ౯౬౭

సీ॥ కొందఱు దివ్యాస్త్ర ♦ బృందంబుఁ గొందఱు, గదలను గొందఱు ♦ ఖడ్గములను
గొందఱు ప్రాసముల్ ♦ కొందఱు తోమరాల్, కొందఱు ముద్గరాల్ ♦ కూడిపైవఁ
గొందఱు తాఁకిరి ♦ కొందఱు దుమికిరి, కొందఱు తిట్టిరి ♦ కొట్టినారు
కొందఱు పొడిచిరి ♦ కొందఱు విడిచిరి, కొందఱు విసరిరి ♦ కొంద ఱుగ్ర

తే॥ దృష్టిఁ జూచిరి కొందఱు ♦ తెరలినారు, కొంద ఱార్చిరి డాఁగిరి ♦ కొంద ఱుక్కఁ
గ్రమ్ము కారుమబ్బులవలెఁ ♦ గ్రమ్మి తుదకుఁ, బడిరి సమరస్థలము బట్ట ♦ బయలుగాఁగ.

సీ॥ ఏసిన వేసిన ♦ యెత్తిన పట్టిన, యాయుధముల రామ ♦ సాయకములు
విఱుచుచుఁ బైపయి ♦ బెరసి గజావలి, నురలఁ ద్రోచు గుఱ్ఱాల ♦ దొరలఁ దాఁచు
శిరములగోయును ♦ శరములఁ ద్రోయును, విండ్లువిఱుచు మేలు ♦ గండ్లు పఱుచుఁ
గవచముల్ భేదించుఁ ♦ గరముల ఛేదించు, స్థైర్యంబుఁ పోకార్చు ♦ శ్రమముఁ గూర్చు

తే॥ బలముఁ దోలఁగించు శిలలను ♦ నలఁగ దంచుఁ, దరువులం ద్రుంచు పైచిన ♦ గిరులఁ ద్రెంచు
అహహ! యేమందు రాఘవు ♦ నస్త్రలీల, బట్టబయలయ్యె రాక్షస ♦ ప్రధనభూమి.

లయగ్రాహి॥
కాలు తెగి కేలు తెగి♦వ్రేలు తెగి వాలు తెగి♦మేలు తెగి రాక్షస శ♦రాలి తెగిపోవన్
గూలెఁ గరితండములు♦మ్రాలె ఖరు సంఘములు♦తూలె భటబృందములు♦ప్రీలె
రథపాళుల్
వేలకొలఁదిన్ విశిఖ♦జాలములు తక్కుఁగల♦కీల లెగఁజిమ్మెడి క♦రాళ పరిఘాదుల్
లీల నొక కేల ఘన♦ఖేల గొనునోలి బల♦శాలి వనమాలి తన♦కోలలఁ గవించెన్.

తే॥ లెక్కలేని దోషాచరు♦లొక్కపెట్ట, నొక్క నరుపైన శరవృష్టి♦మిక్కటముగఁ
గురిసి రామబాణములచేఁ♦గొండలట్లు, దొరలి పొరలిరి దురమున♦శిరములూడ.

తే॥ వేయిశరుల చేవగలదై♦తేయుల కొక, శరమువంతున శ్రీరామ♦చంద్రుఁడేసె
రక్తవాహినిఁ గూలి తి♦రములఁజేర, లేక పెక్కనుఁగులు వార్ధి♦లీనమయ్యె.

తే॥ తెగునుకొండలు వలయముల్♦తెగును గదలు, విఱుగుఁ గుంతముల్ దంతముల్♦
విఱుగుఁ గరులు
హారులఁ దేరులు విఱుగు క్ష♦ణార్ధమందు, రామబాణ మొకొంటిచే♦రణమునందు.

తే॥ జగము లేక కాలంబునఁ♦జంపఁజాలు, జముఁడు మంత్రులు దూతలు♦చరణయుగము
గలుగువాకాటఁ బరుగిడి♦యలసినారు, పోలియు నసురుల యుసుఱుల♦మోవలేక.

ఉ॥ కుప్పలు కుప్పలై కలనఁ ♦ గూలిన దంతులు తేరు లశ్వముల్
తిప్పలు తిప్పలై పెరిఁగి ♦ దివ్యులమార్గము నంటుచుండినన్
దప్పిఱినట్టు లట్టలొగిఁ ♦ దేలి నటింపఁగఁ జచ్చుపీనుఁగుల్
తెప్పునఁ బ్రాణ మొందదనని ♦ దిగ్భ్రమఁబాఱెను జీవసంఘముల్. ౯౮౭

ఉ॥ నల్లనిభానుఁబోలి కిర ♦ ణంబులు చిందెడు రాఘవుండు పైఁ
జల్లినయట్లు రక్తకణ ♦ జాలము పర్వ యుగాంతవేళ భా
సిల్లెడు భానుమూర్తియనఁ ♦ జెందిన శాత్రవరక్తమందు రం
జిల్ల మునింగి లేచు ముని ♦ సేవ్యుని భార్గవుఁబోలె శోభిలెన్. ౯౮౮

ఉ॥ చిచ్చుఱ పిడుగులట్టి రఘు ♦ శేఖరు తూపులు క్రమ్మ మస్తముల్
వ్రచ్చి నశించుచుండఁ దమ ♦ వారలు చచ్చుట చూడలేక వి
వ్వచ్చము నోర్చి యుత్సుకత ♦ వ్రాల్పక మూఁగిన పోఁకుమూఁకలున్
గ్రచ్చఱ నీఁగలట్లయిరి ♦ రాముఁడు కల్లునుపోలె నయ్యెడన్. ౯౮౯

ఉ॥ క్రమ్మిన దానవావళుల ♦ కంఠమూలం దెగనేసి వ్యోమ మం
గమ్ముల యాటలాడెఁ దగ ♦ నచ్చనగండ్లను గ్రచ్చకాయలన్
జిమ్మెడిలీల శీర్షములఁ ♦ జిమ్ముచు నస్త్ర విధాన నైపుణిన్
బమ్మిన తేరులం గరుల ♦ భగ్నము నర్చెను నుగ్గు నుగ్గుగన్. ౯౯౦

చ॥ పలువురుప్రాణముల్ విడిరి ♦ పల్వురు పాఱిరి నూటి తప్పఁగాఁ
బలువురు దాఁటుచుం బొరలి ♦ బన్నము నొందిరి కుంది కంది లోఁ
గలఁగిరి మండి మాఁడిరి పొ♦కాలిరి నిక్కిరి ప్రక్క రాంత్రముల్
వలనుగఁ జెక్కి రేడిచిరి ♦ వంది రెదిర్చిరి పోరి చచ్చిరిన్. ౯౯

తే॥ కవచ కుండల కేయూర♦కటక మకుట, కంఠికా హారవితతులు♦కలనఁ దునిఁగి
దొరలు వారిమేనులనుండి♦త్రుంగి యురలి, మొగులు గములందు మించుల♦పగిది మెఱసె.

సీ॥ వెనుకనున్నాఁడు ముం♦దున నున్నవాఁడొగి, వదనమందున్నాఁడు♦హృదినిగలఁడు
తలలపై నున్నాఁడు♦మలలపై నున్నాఁడు, కెలఁకుల నున్నాఁడు♦క్రిందఁగలఁడు
మింటిపై నున్నాఁడు♦మంటిపై నున్నాఁడు, కత్తుల నున్నాఁడు♦కరులమీఁద
ఖురువులమీఁదను♦తరువుల మీఁద స్యం, దనములమీఁద నం♦తటను గలఁడు
తే॥ నాయెదుట నాయెదుట నిల్చి♦నాఁడు నీదు, కనులనున్నాఁడు కోదండ♦కరుఁడటంచు
కఱకుసోఁకులె భ్రమసి వా♦చఱచునట్లు, మించి యెల్లయెడల సంచ♦రించె నతఁడు.

చ॥ జలధులయందు లోకముల ♦ శత్రు సమూహములందు పెక్కు మా
యలఁగొని కామరూపముల ♦ నందు నిశాచరరాజ చింతనం
బుల నెదలందు వెల్పలను ♦ పొల్పుగ నిల్చినవాఁడు మెల్పునన్
బళిబళియంచుఁ బల్కఁదగు ♦ పద్ధతినొప్పెను రాముఁ డెల్లెడన్. ౧౦౧

శా॥ నానానూన విధాన చారముల వి ♦ న్నాణంబుతో నుండె నీ
భూనాథుండను బుద్ధిలేక మఱుఁగై ♦ పోయెంగదాయంచు వి
జ్ఞానానంద మయాత్ముఁడై మఱచెఁ గ ♦ ర్జంబంచు గీర్వాణు ల
జ్ఞానావస్థ భజించి దిగ్భ్రమల నా ♦ శంకించి రప్పట్టునన్. ౧౦౩

క॥ చండానిల వేగంబున, ఖండిత తరుకాండమట్లు ♦ కర్బుర గణముల్
తుండములై దెసలం బడ, భండనమునఁ దిరిగె రామ ♦ భద్రుఁడు పెలుచన్.

క॥ హరులు కరులు వీరభటులు, నరదంబులు గిరులఁబోలె ♦ నవనిం బెరుఁగన్
గిరినుండి గిరికి దాఁటెడు, కరణిం దిరుగంగవలసెఁ ♦ గాకుత్స్థుఁ డటన్ ౧౦౫

క॥ అంబరమంటెడు ధ్వజ చీ, నాంబరములతోడ గొప్ప ♦ యంబారులతో
డం బూఁడి మునిఁగె గురు ర, క్తాంబుధిలోఁ గరి ఘటలు ప్ల ♦ వావలి కరణిన్.

క॥ తెగిన సురారుల శిరములు, నెగసి మరలఁ బుడమిఁ బడెడి ♦ నియతిం జూడన్
దగ విజయలక్ష్మి చేకొని, యెగురవయుచు జలజ వితతి♦కెనయై యుండెన్. ౧౦౭

క॥ వాలమ్ములఁ గరములతో, వాలమ్ములు గరము విఱిగె ♦ వాలెమ్ముగ జీ
వా లమ్ములుకుల కెరయై, వాలమ్ములఁ బోలు ♦ దైత్యవర్గము నమసెన్. ౧౦౮

క॥ ఖేటకములు తునిఁగిపడెన్, ఘోటకముల తలలతోడఁ ♦ గూటువ లగుచున్
ఘోటకముల కిమ్మయి చను, హాటక కోటీర మస్త ♦ కావళితోడన్. ౧౦౯

క॥ క్రూరుల దంష్ట్రిలు తెగి తమ, గారుల మేనులను చొచ్చి ♦ కారు మొగులునం
దూఱి లసద్భాల శశిం, గేరు లలిని తోఁచెఁ జూచు ♦ గీర్వాణులకున్. ౯౯౦
క॥ అక్కుటిలుల పెనుకోఱలు, మిక్కుటమగు కరి రదములు ♦ మేదిని నిండన్
జెక్కురు కల్పంబులఁ గల, పెక్కురు నెల లోకటఁ జేరు♦పేరిమినొప్పెన్. ౯౯౧
క॥ అసురుల తనుగిరులందున, విసరముగాఁ బొడమి డెసల ♦ విరిసిన రక్త
ప్రసరమున నచటి జనములు, పసరములును చనియె నెక్క ♦ పర్వతములకున్.
క॥ నిండె దివి జీవతతిచే, నిండెం భువి దానవ శవ ♦ నివహముచేతన్
నిండె శరధి రక్తముచే, నిండె సురల కనులు రామ ♦ నిపుణత్వముచే. ౯౯౩
క॥ కయిదువులు రక్త నదముల, పయి వడివడిఁబోయి బహుళ ♦ వనచర వితతిన్
బయి దవిలి నరగఁ ద్రుంపఁగఁ, జెయిదంబులు తఱుఁగ విఱిగి♦చేడ్పడి చచ్చెన్.

మ॥ బలహీనుండగు నొక్కమానవుఁడు పై ♦ పైఁ జేర్చి దోషాచరా
వలి కావించిన వ్యూహముం జెఱచి త ♦ త్పాండిత్యముం జూపి దై
త్యుల ఖండింపఁగఁ బండ్లు గీటుచును వ్య ♦ ర్థంబోలె నిట్లుండుటా?
యలుచుం జంపెదనంచు వహ్ని కడు రో ♦ షాయత్తుఁడై లేచుచున్.

—: వహ్ని దానవసేనలఁ బ్రోత్సహించుట :—

చ॥ ములుకులు వచ్చి పైఁబడక ♦ మున్నె నిశాచరు లంద ఱొక్కటై
యులుగులపాటు నొంద కొగి ♦ నాతనిపైఁ బడ నల్గి చావఁడే?
జలధులపోల్కిఁ గానఁబడి ♦ చప్పిడి చేతలఁ జేయుచుందురే?
మలకలు మాని పైఁబడుఁడు ♦ మ్రాల్పుఁడు లెండని ప్రోత్సహింపఁగన్.
పంచచా॥ చలంబుతోడఁ గర్బురుల్ వి ♦ చారదూరులై వెసన్
బలంబు చూపి యొక్కటొండ ♦ పైని పెక్కు మేఘముల్
జలంబు చిందు భాతి నైక ♦ సాయకంబు లేసి తా
వలంబు తూలఁ దర్జనంబు ♦ భర్జనంబు సేయఁగన్ ౯౯౭
ఉ॥ జివ్వున రామబాణములు ♦ రేఁగుచు శీర్షము లెన్నొ చెందుచున్
ద్రెవ్వఁగఁజేయ రాక్షసులు ♦ తీఱిరి కూలిరి చాఁపకట్టుగా
నువ్వన నాడిపాడెను మ ♦ హోద్ధతి నార్చెఁ బిశాచ సంఘముల్
కవ్వన నోటిలోఁ గొఱవి ♦ కత్తులు నావల దివ్వెలట్లుగాన్. ౯౯౮
తే॥ రక్తపంకిల వార్ధి వ ♦ స్త్రముగఁ దాల్చి, రక్తచందన మలఁది ధ♦రా పురంధ్రి
పెద్దపెండ్లిఁ జూడఁగ వచ్చు♦పేరఁటాలి, కరణి నొప్పార నారణ♦స్థానస్థలమున.
తే॥ ఘృత సురాక్షీర దధిలవ ♦ ణేక్షు శుద్ధ, వననిధులు రక్తమయమయి♦పరఁగు కతన
సప్తవారిధులను పేరు♦జాఱవిడి, యొక్క రక్త తోయధి యన ♦ నొప్పె నపుడు.

క॥ తొడుగుట యొకపరియైనను, వెడలు శిలీముఖము లెన్న♦వేలకు వేలె
ప్పుడు వధము పూర్తియగు న, ప్పుడు లేనెలఁబోలు విల్లు♦పొడవయి నిలుచుఁ
సీ॥ ఎత్తినవారలు♦నేసిన వారు గ, ర్జించిన వా రెది ♦ రించువారు
వడిగొను వా రోడి♦పాఱినవారు కో, పించినవారు మ♦దించు వారు
తొడరిరి యడరిరి♦తొడఁకిరి వడఁకిరి, మడఁగిరి బెడిసిరి♦మడిసినారు
చూడ్కులు మనసులు♦చూడ నూహింపఁగఁ, దగిన యంతటి సమ♦ర్థములు కావు
తే॥తొడిగినవి వేయిఁసులుగులు♦వడిగఁబోయి, చంపుటయొనహస్రము కాదు♦శతసహస్ర
మట్టిదే వడి యుద్దేశ♦మట్టిదె యగు, దానవ శరాళి తము గావ♦లేనివయ్యె.
సీ॥ ముందుభాగమ్మున♦ మొగమును రెండు ప, క్షములును పృష్ఠమ♦ధ్యములు గలుగు
ఘనశరవ్యూహమ్ము♦కాకుత్స్థకులజుండు, నూదియుఁ జొరలేని♦చొప్పు పన్న
నాయమ్ము లొగినేగి♦యాయమ్ములం గ్రుచ్చు, వలఁకుల దుస్సి య♦వ్వలికి నేగు
నాయమ్ములకుగుఱి♦యైనరక్కసులు చ, చ్చుటగాక యెదిరి గె♦ల్చుటయుఁగలదె?
తే॥ విలయకాలానలముఁబోలి♦యలుఁగు లడర, నెండుటడవులఁ బోలిరి♦యొడ్డె యసుర
వరులు; రామబాణములు వా♦గురనుపోల, దనుజగణములు తగులు మ♦త్స్యములఁబోలె.
తే॥ చండ మారుత మట్లు దా♦శరథి యొప్పఁ, జెదరు మలలైకవడి శుక్ర♦శిష్యులుండ్రి
విలయ కాలసాగరమట్లు♦వీర రామ, భద్రుఁడుండఁ బ్రాణులఁ బోలి♦వారలుండ్రి

మ॥ మొదలై సృష్టియొనర్చి మధ్యమగుచుఁ ♦ బోషించి యంతంబునై
తుది గావించు పరాత్పరుండు దనుజ ♦ స్తోమంబుకై కల్పమై
పొదలన్ దారు చరాచరంబుల విధం ♦ బుం బొంది రా రాఘవుం
డుదధి ప్రోత్థ విషంబు గాఁ జనిరి మ♦త్స్యౌఘంబుగా రాక్షసుల్ ౧౦౦౭

ఉ॥ వంచనఁ గూటసాక్ష్యము స ♦ భం బలుకాడి ధనంబు గూర్చు నా
కుంచిత నీతివర్తనుని ♦ కుంఠిత వంశముఁ బోల రాక్షసుల్
ప్రాంచిత ధర్మముం జెనసె ♦ రాముఁడు; తాను విషాంబువై చనన్
గ్రంచర దాని త్రామమునఁ ♦ ద్రావిన బీదలైయిరి దానవుల్. ౧౦౦౮

చ॥ ఒక శతవాహినుల్ మునిగి ♦ యున్నతఱిన్ జలరాశి లంకయున్
సకలము నొక్కటై సమ ర ♦ స్థంబుగఁ గన్పడ దానవాంగనల్
శకవికనొంది యేదియును ♦ కానక చిత్త కలంకమొంది గా
ల్లు కుదియ నెట్లుపోక దిగు♦లుం గొని కూలిరి ముగ్గి రందులన్. ౧౦౦౯

తే॥ డాసిన సురారు లసువులఁ♦బాసినారు, కుప్పలై నింగి నంటెను♦కుణప చయము
ఎదిరి నెత్తురు పోలేక♦యెదురు తిరిగె, వెనుకనున్న సైన్యంబు ముం♦దునకువచ్చె.
క॥ రేఁచిరి కరి శరభాదుల, వీచిరి తోమర గదాది ♦వివిధాయుధముల్
త్రోచిరి సేనల ముందున, కేచిరి ప్రాణంబు తీసి♦యెఱ్ఱఁగక వారల్

ఆ॥ రండిరండి మీరు వా•రంబుల బలములఁ, దెండితెండి తెచ్చి • యుండియుండి
నాళరముల కనుచు•దాశరథి వచించి, పేర్చి శితశరంబు•లేర్చి వేసె. ౧౧౧

చ॥ తమతమ సేన లవ్వలికిఁ • దారఁగనీయక సైన్యనాథులే
తమకముతోడ నడ్డుపడి • తార్చుచుఁ జచ్చినవారి దాఁటుచుం
దుముల రణంబుకై యటమి • త్రోయుట డాయుట గాంచి నిర్జరుల్
కమలి త్రినేత్రుఁ గాంచి యెద • కూరిమితో వచియించి రివ్విధిన్. ౧౧౧

ఉ॥ రాణువలోన నొక్కొకరు • రావణుకంటెను మున్మదుంగు వి
న్నాణులు వారిలెక్క గణ • నంబునకందదు వంచి మించుచుం
జాణతనాన డాసి రిఁక • జానకినాథుఁ డొకొ క్కరుండు మా
ప్రాణిమి మాల్చినట్టి బల • పూర్ణులు దానవు లేమి మూఁడునో? ౧౧౨

ఉ॥ రాఘవుఁ డేయునట్టి ప్రద • రమ్ములనంతరమంద త్రుంచుచుం
మేఘము లట్లు క్రమ్ముకొని • మించిరి ముంచిరి వీరలం మహా
మోఘముగా శపించి యను • పుంజము తీసినఁ దీయవచ్చు బా
ణౌఘముచే జయింపఁ దర • మా మనుబోఁటికి మీకుఁ దక్కఁగన్?

చ॥ అని వచియింప శూలి భయ • మందకుఁడయ్య సురారు లెందఱై
న నగిని దూదిఁగాల్చు వయి • నంబున రామ శరాగ్ని కాల్చు నే
మనుచు వచింపనే? యమృత • ముం గరళం బవపాడి చక్కటిం
గొనకొని గెల్చునేనియును • క్రూరులు రాఘవు గెల్వనేర్తురే? ౧౧౪

చ॥ తలఁచినచో విభీషణుఁడు • తక్క జగంబున జీవయుక్తుఁడై
యలుచు నిశాటుఁ డున్న యెడఁ • జూడట నత్కృపగల్గ ధర్మముం
బొలుచును మీరు దాఁగుటకు • భూధర కందర లింక రోయఁగా
వలవదు నేటితో దనుజ • వంశము మూయు నిబద్ధి నాసురుల్. ౧౧౫

చ॥ అని హరుఁడాడ బ్రహ్మయు య • థార్థము యంచు వచింప వేల్పుల్
మనమున నెమ్మదిం గొనిరి • మానవనాథుఁడు మండలీకృత
స్వనిత ధనుర్విమోదమున • శాత శిలీముఖ వృష్టిఁ గూర్చి వా
లిన దనుజోత్తమాంగక శి•లీంధ్ర సమూహము సృష్టిచేయఁగన్. ౧౧౬

చ॥ అనఘుని చుట్టుకొన్న దను • జావలి స్వర్గముచేరి యచ్చటం
మనుటకుఁ జోటులే కలయ • ప్రూలిన మేనులు తత్తళింపఁగన్
దునిఁగిన యాశ్విక ప్రతతి • తోడన దివ్య శరీరమంది మే
దినిఁ దమ గుఱ్ఱముల్ పొరలి • తెల్లట గాంతురు మింట నిల్చుచున్.

ఉ॥ అంబుధులందు శైలముల • యందు వనంబుల యందు దాఁగురుల్
బంబిన నాకమందు కను • పాఱెదు మేరకుఁ దేఱిచూచినన్

డంబుగ నట్టలన్ దలల ♦ డాఁచుచుఁ దేల్చుచుఁ గొంచుఁబోవు ర
క్తాంబు నదీనదంబు లుర ♦ వై కనుపట్టెను తోల్కరిం బలెన్. ౧౦౧౭

చ॥ ఎదిరిచినట్టి యోధవరు ♦ లేడ్తెఱ మాలి నశింప వాహినుల్
నదమదమంద వెన్కఁగల ♦ సైన్యము పాఱెడు త్రోవఁజూడ సం
గదగొని వారినాయకులు ♦ కాంచి వివేక విహీనులార! పా
ఱెదరె? బిడెంబులేదె? యని ♦ రేఁపఁగ ఱేఁచులపోల్కి వారలున్.

చ॥ చెవుడు పడంగ లోకము వి ♦ శీర్ణతనొంద మొయిళ్లు దేవతా
నివహ శిరంబు లూఁగ నవ ♦ నీధరముల్ చలియింప వైచు కై
దువులు మెఱుంగుపిడ్గు లను ♦ తోయముఁగొల్పఁ దమస్సమూహముల్
దవిలి యెదిర్చినాఁగ బల ♦ దర్పములన్ దనుజాలి క్రమ్మెఱన్. ౧౦౨౦

ఉ॥ రాముఁడు రండురండని స ♦ రాగముతో నతిథి ప్రకాండమున్
ధామమునం దెదుర్కొను వి ♦ ధంబున నేగి పృషత్క వృష్టి గా
రాములు చూపఁ డెక్కములు ♦ రాలె దిశాంతములందు వార్యముల్
భూమిని గ్రొమ్గెఁ గూలె రథ ♦ ముల్ పవి భిన్న మహాద్రులోయనన్.

సీ॥ శకలంబులై పడు♦స్యందనాంతరములఁ, దనియక కంకగృ♦ధ్రములు తూఱి
బలితంబులగు కళే ♦ బరముల లాగంగ, భానుబింబము మాఱు ♦ పాటునొంద
గ్రహగతుల్ దప్పంగఁ♦గడలియు సుడియంగ, సార్కై వడి భూమి♦సరగఁ దిరుగ
ధర్మంబు సమవర్తి ♦ ధనువు పిశాచము, లట్టలు గదిసి నా♦ట్యంబు సేయ

తే॥ భవుడు నింద్రుండు పద్మసం ♦ భవుఁడు మునులు, విబుధులును దిక్పతులు మోద♦ వివశులగుచుఁ
బిల్లగంతులువైచి యా ♦ వింటి నేర్పు, దిట్టతనము సాహసము నుతించినారు.

తే॥ నమసి చతురంగ బలములు♦సాగరములఁ, జెదరుచుండ దుగ్ధాంబుధిఁ♦జిలుకు దేవ
దానవుల చేతులంబలెఁ దఱిమిపాఱు, కఱకు స్రోఁకుల శాఖలు ♦ గతులు దప్ప

తే॥ రథగజాశ్వ భటాది వ♦ర్గములయందు, గాయములఁ గలిగించు రా♦ఘువ కఠోర
సాయకంబు లానేన సెం♦చంగఁజుక్క, లుంచు కగణినిచొచ్చె న♦త్యుత్కటముగ.

తే॥ నమసె రాణువల్ మిగిలిన♦స్వల్పబలము, గ్రుక్కి ప్రక్కకొదుఁగుడాఁగుఁ♦దక్కనుచు
వారి నవలికిఁ బోనీక♦బాణచయము, వలన నొకకోట గట్టె మై♦థిలి విభుండు.

తే॥ బలియురైన మాలిని మాల్య♦వంతునిమధు, కైటభులఁబోలి జగములఁ♦గలఁచినట్టి
కవచధారులు రాముఁడు♦కట్టిన శర, దుర్గమును దాఁటఁ జాలక♦త్రొక్కువడిరి.

తే॥ చచ్చినట్టివార లెదుటఁ ♦ జచ్చుచుండ, రేఁపఁబడిన వాఁడింబలె ♦ రేఁగి బడబ
క్రాఁచఁదెరలిన శరనిధి ♦ కరణినొక్క, ప్రక్కకేతెంచి వహ్నితోఁ ♦ బలికిరిట్లు.

తే॥ త్రిపురవైరి జనార్దన ♦ త్రిదశవిభులు, మనబలము త్రుంచలేకయే ♦ మరలినారు
ఒక్కమానవుఁ డీవేళ ♦ నుక్కుమీఱి, కలఁచుచున్నాఁడు రాక్షస ♦ గణమునెల్ల.
తే॥ ఒక్కఁడే జగముల గెల్వ♦నోపువాఁడు, వేయివెల్వల తటుమొక్క♦వ్రేలుమిడిని
గెలిచె నేమనఁగలదింకఁ♦జెలఁగి యీఁగ, గరుడ వితతి జయించిన♦కరణియయ్యె
తే॥ బ్రహ్మతోడ భవుండు గీ♦ర్వాణచయము, వచ్చి నింగిని కనఁబడు♦వారుగాని
కానరాఁడు వెన్నుండందు♦గానఁజూడ, నతఁడె యితఁడగు నను సంశ♦యంబు పుట్టె
తే॥ పద్మసంఖ్య బలంబిప్డు ♦ పాడుపడియె, నొక్కవెల్లువ శేషించి ♦ యున్నదింక
నేమి చింతించి రాఁగల♦దేమిఫలము ?,తలపుఁడన్న వహ్నియు నిట్లు♦పలుకఁదొడఁగె

చ॥ మృతికిఁ గలంగి క్రమ్మఱుదు♦మేని దశాననునాన్యపద్మమే
గతిఁ దిలకించువారము ? జ♦గంబున నెట్లపకీర్తి మోచి జీ
వితమును త్రోచువారమది ♦ వీడి యశస్కర మార్గమందు న
ద్గతి యొదవంగ నీభవము ♦ ధన్యముగా విడువంగ మేలగున్. ౧౦౩౭

ఉ॥ సంకటపాటునం దవల ♦ జాఁగి మెలంకువతో మెలంగఁగా
లంకను వీడిపోఁదగఁ ద ♦ లంచినఁ గోటలకోట దాఁటలే
ముంకున నెల్ల రేకమతి ♦ నొక్కట రాముని చుట్టు ముట్టుచున్
జంకెనతోడఁ జంపుదము ♦ చత్తము యోగ్యత యయ్యెదేయనన్.

తే॥ అన్నినదులు సముద్రంబు♦నందు లీల, శలభములు దీపమునఁబడు♦చందమునను
విధియె సిగఁబట్టి యీడ్వ వి♦ద్విడ్గణంబు, డాసి రాముని చుట్టెఁ గ♦దంకతోడ
తే॥ గోగణంబు నడుమనున్న♦క్రోలుపులిని, పోలు రాఘువుపై పోఁకు♦మూఁకలపుడు
పరశు తోమర కుంత ము♦ద్గర ముసుండి, వాల శస్త్ర్యాదులను పట్టి♦వైచినారు.

—: రాముండు గాంధర్వాస్త్రము సంధించి విడుచుట :—

క॥ గాంధర్వాస్త్రము రాముఁడు సంధించెఁ దదీయ దివ్య♦శరము ఫణీంద్రున్
గంధిని గరుడుని పావకు, గంధవహుని పోలి యదరి ♦ కదువడి నరిగెన్. ౧౦౩౮

ఉ॥ అక్షులుమూఁడు మోము లయి ♦ దగ్ని శరీరము గల్గు కోల ఫా
లాక్షుని మేనిఁబోలి యొక ♦ నైదయి యేఁబది నూఱు వేలునై
లక్షలు కోటులై పర బ ♦ లంబున నొక్కని కొక్క రాము రూ
పక్షిగతంబుగా నదరి ♦ యంతటఁ గూలిచె నొక్కవ్రేల్మిడిన్. ౧౦౩౯

సీ॥ ఏడుదీవులయందు♦నెనిమిది దిక్కులఁ, బాతాళమందును♦పర్వతములఁ
బంక్తికంధరునకుఁ♦బ్రతినిధులై ప్రేమ, పాత్రులై దిన నిశా♦పతులఁ గూర్చి
హారంబుగాఁ జేసి♦యక్కున ధరియింపఁ, జాలు సమర్థు ల♦చ్చటికి వచ్చి
మనలోన నొకని నీ♦మనుజుండు గెలిచిన, రావణునైన తా♦ర్వంగఁగలఁడు

ఆ॥ కాన నొక్కఁడొకఁడె♦కాకుత్స్థుతోడఁ గ, య్యంబు సేఁత మేలొ? యందఱొక్క
మొగినిఁ గ్రమ్మి వాని♦ముంచుకొనుట మేలొ? యనుచు వహ్ని నడుగ♦నాతఁడనియె.
ఉ॥ ఒక్కఁడొకండుగాఁ జని ర ♦ ణోత్కటు రాముని గెల్వలేము మీ
రెక్కడి వార్తలాడెదరొ? యిప్పటి సంస్థితిఁజూడరొ? యనన్
రక్కసులెల్లఁ గూడి బవ ♦ రం బొనరించుటె యుక్తమంచు విం
డ్లెక్కిడి సంకులొత్తి దెస ♦ లెల్లను బీఁటలువాఱ నార్చుచున్. ౧౦౩౯
చ॥ భుజములు దట్టుచు న్నిలువ ♦ భూరి భయంకర లీల రాక్షస
వ్రజములఁ జంపియున్ దనివి ♦ వారని రాముఁడు వారిఁగాంచి యు
క్కుజముగ శింజినీధ్వని జ ♦ గద్భయదంబుగఁ జేసె లోకముల్
నిజపదిఁ గొల్చు సూర్యశశి ♦ నేత్రుని శంఖవిరావమో యనన్. ౧౦౪౦
ఉ॥ పెక్కురు శాస్త్రవిద్వరులు ♦ భీకర సక్రమ యుద్ధ కోవిదుల్
వెక్కురులై దివాకసుల ♦ వెంటఁ జరించిన దైత్యబంధులన్
ముక్కులఁ గోసినారలు ప్ర ♦ మోద మనస్కులు కాలకాలునే
లెక్కఁ గొనర్పనట్టి మద ♦ లీలలఁ దేలెడివారు రాక్షసుల్. ౧౦౪౧
చ॥ పిడుగులు రేఁగినట్లు మద ♦ భీషణ వారణరాజి యేచిన
ట్లడరి సమీరణసైపుణి బ ♦ యల్పడఁ బెక్కువిధాల నడ్యోడన్
నడచిరి వారి యాయుధ గ ♦ ణంబుల నేత్రములందు పెల్లుగా
మిడుఁగుఱు లుప్పతిల్లి గిలి ♦ మిక్కిలి కూర్చెను ఖేచరాలికిన్. ౧౦౪౨
తే॥ నేమిరావంబు కింకిణీ♦నినదములును, సింహనాదంబు ఘీంకృతి♦శింజిని రుతి
హేషలును భుజాస్ఫాలన♦హేల లాయు, ధముల రవము లేచెను బెడి♦దంబుగాఁగ.
తే॥ వారు రావణుఁబోలిన♦వారు తాము, లీల గెలువని లోకంబు♦లేదు తత బ
లిష్ఠు లాదైత్యులను రణ♦నిష్ఠతోడ, జానకీజాని యెదిరించె♦సంగరమున. ౧౦౪౪
సీ॥ వారలు పెల్లేచి ♦ వైచు చక్రాది సా, ధనముల నడుమనే ♦ తునియఁజేసి
వారి తొమ్ముల గల్చి ♦ తేరులతోడఁ బ, రిధి బింబములు నాథ♦రిక్తిఁగూల్చెఁ
గైదువుల్ పట్టిన ♦ కరములు మేనులు, మెఱుఁగులతోఁ బొల్చు ♦ మేఘములన
భువిఁ వ్రాలెఁ దెగి శర♦ములతోడఁ బడుకేలు, ఫణులు కొమ్మలతోడఁ♦బడుటఁబోలె
తే॥ వార్ధిఁజేర నెత్తుటియేటి♦వారణములు, కొఱదలంబలె గుఱ్ఱముల్♦కొఱలుచుండె
నాయుధంబులు చోఱమీల♦నఁ జలించె, ఖేటకంబులు కాఁబేళ్ల♦క్రియను పారలె.
తే॥ వాతహతిచేతఁ దెరల కం♦బములతోడఁ, గూలు పడవలవలె సేనఁ♦గులు సిడంపుఁ
గంబములతోడ రుధిరాప♦గాప్రవాహ, మందు మునిఁగె హాహాకార మతిశయింప.
తే॥తునిఁగి రక్తవాహినియందు♦దొరలుచున్న, కరములందుశరముల్తెఁ♦కవ్వియుండఁ
గమలనాళంబులను నోటఁ♦గవ్వికొన్న, పావురంబు కూటంబుల♦పగిదిఁ దోఁచె.

తే॥ పటికరాలతోఁ జేయంగఁ♦బడి విఱిగిన, తేరిచక్రంబులు పయోధి♦తెరల నడుమ
నురలఁబడు పూర్ణచంద్రబిం♦బోత్కరంబు, నాఁగ నలరారెఁ గనులకు♦నాశ్చర్యముగుచు.

శా॥ మాయలచే జయంబుగొను ♦ మార్తురధర్మ నియుక్తిఁ జంపఁగా
నాయితపడ్డ రాఘవు శ ♦ రాసన మొక్కట వంగునంత దై
తేయ శిరోమహీధ్రములు ♦ తెట్టువలై గొనయమ్ము వంగఁగా
నీయక వచ్చివచ్చి పడి ♦ యిట్టటు లాడఁగనీయ వింతయుఁ౯. ౧౦౪౯

తే॥ వక్షములఁజొచ్చి రుధిరంబు♦వట్టఁ ద్రావు,పక్షయుతశిలీముఖములు♦ప్రసవములను
పక్షములు వెలినుండంగఁ♦గుక్షి నిండ, మధువుగొను శిలీముఖముల♦మాడ్కి నొప్పె.

తే॥ యోజనాయతమగు సమ♦రాంగణమున,రమణ లోకైకవీరుఁడౌ♦రాముఁడొంటి
మొయిని పాదచారి యగుచు♦మృధము సేయు,చొక్కజాములోఁదిరుగంగ♦నోపనతఁడు.

చ॥ నిలిచినవారి యెట్టెదుట ♦ నిల్చుచుఁ బోయెడు వారి ముంగలం
బొలుచుచు నెందుచొచ్చినను ♦ పొందుగ నడ్డమువోయి రాక్షసుల్
బెలుకుఱి నిల్చుచు౯ విసుగు♦వేసట లేక వధించుచుండ దై
త్యులు వెఱఁగంది కంబమునఁ♦దోఁచు నృసింహుఁడె యంచు నెంచుచు౯.

ఉ॥ ఇచ్చటనుండె నిందుగలఁ ♦ డిచ్చటఁ దోఁచె మలంగె నాకడ౯
వచ్చెను వీఁడెయంచు భ్రమ ♦ వాఱి శరంబులు కూర్చి యేరిపై
నెచ్చటనేని వైచి మఱి ♦ యొద్దుచు దైత్యులు తమ్ముదామె పె
న్మచ్చరమూని చంపుకొని ♦ మాఁదిరి పెక్కుతు రద్రణస్థలి౯. ౧౦౫౩

ఉ॥ ఒక్కఁడు రాముఁడంట యది ♦ యొప్పునె? నూర్గురు కల్ల వేవురు౯
నిక్కముకాదు లక్షయన ♦ నేరము కోటియనంగ దబ్బఱో
పెక్కురు పెక్కుకోట్లు రఘు ♦ వీరులు గల్గుదురంట సత్యమా
నిక్కడనంచు నేలయన? ♦ నెల్లెడ దానయి నిండెఁ జెల్లరే! ౧౦౫౪

ఉ॥ అంతట వీరరామమయ ♦ మై కనుపట్టె నిశాచరాలి ది
గ్భ్రాంతి వహించి యొక్కొకరు ♦ రాముఁడు నాకడఁ జిక్కెనంచు దా
వంతము లేఁగె నంచెదురు ♦ పడ్డ సురారులఁ జంపుకొంటచేఁ
గొంత యలంత తగ్గెను క ♦ కుత్స్థకులాబ్ధి సుధాంశుమూర్తికి౯.

చ॥ అరదములం గుఱాలపయి ♦ హస్తులపై వనరాశిమీఁద నం
బరమున నున్నవాఁడనుచు ♦ భ్రాంతిని యొందును పోవలేక ని
ర్వైరగొని నిల్చి చుట్టుచును ♦ ద్రేయుచు మించి పరాక్రమించు కం
ధర నిభ దేహు వేగ బల ♦ దర్పములం గనుచుండ్రి రక్కసుల్.

ఉ॥ నిండిన భండనస్థలిని ♦ నీరజనేత్రు బలిష్ఠ చండ కో
దండ విలగ్న ఘంటికలు ♦ దంధణ మ్రోఁగిన యప్పుడెల్ల వే

దండ తురంగ సంఘములు ♦ ధారుణిఁ గుప్పలు కూలుచుండు బ్ర
హ్మాండము దద్దఱిల్లు దను ♦ జాంగన పాలికి రాలు న(శువుల్. ౧౦౫౨

ఉ॥ వచ్చినవారి తేరులను ♦ చావక పోరెడి వారి తేరులం
దచ్చుగలాగి వంచిన శ ♦ రాసముతో వడిఁగానవచ్చుటల్
గ్రచ్చుఱఁ బోరు సేయ నోడి ♦ కంబున రాఘవుఁ డొక్క తేరిపై
వచ్చిన చందమొంది కను ♦ వారికిఁ దోఁచె రణాంగణంబునన్. ౧౦౫౮

మ॥ ఒకకోదండము యున్నఁ దూణమొకఁడై ♦ యున్నన్ శరస్తోమమా?
తుకమున్ మీఱుచు వర్షబిందువుల సం ♦ దోహాంబుకంటెన్ విశే
షకమయ్యెం దన కేలు వేయికరముల్ ♦ సాగించు కార్యంబు త
క్కక కావించె సహస్రహస్తములు పేఁ♦కన్ రెండుగా నయ్యెనో? ౧౦౫౯

మ॥ ఒకమోమై మనుజాకృతిం బోలుచు నీ ♦ యుగ్రంపు దృశ్యం బన
త్యకమా నిక్కడ నిక్కమేర్పడె నసం ♦ ఖ్యాకంబులౌ దైత్యసై
నిక సంఘాతము చేసినట్టి దురమున్ ♦ నేర్పార సంపూర్తిగా
నోకమో మేవిధి గాంచఁగల్గుఁ? దలతె ♦ న్నో పద్మ సంఖ్యేయముల్!

మ॥ నిటలాక్షుండు చతుర్ముఖుండు శరముల్ ♦ నిర్ణీతి లెక్కించి యు
త్కటమాటన్ గణియింపలేక యిది శ ♦ క్యంబౌనె? యంచున్ విశం
కట మోదాత్మకులై నిశాచరుల సం ♦ ఖ్యంగాంచి యీలెక్క వే
యుటయుం బోలద యంచు మానుకొని రా ♦ యుద్దేశ మప్పట్టునన్.

ఉ॥ సేనలు వేయి వెల్లువలు ♦ చెందిన దొక్కని కొక్క బాణ మం
చూని వచింప నైతియగు ♦ నో? యొకటొక్కటి నూఱు తునకలై
మేనులు కూలియుంట గన ♦ మిక్కిలి పెక్కులు వాని జానకీ
జానియె యేసెనే? యని ప్ర♦శంస యొనర్చిరి వాసవామరుల్. ౧౦౬౨

చ॥ గొడుగులు నాయుధమ్ములును ♦ గుఱ్ఱము లేనుగు లాతుసావళుల్
సిడములు తేరులుం దెగి న♦శింపఁగ వైచిన బాణరాజి లె
క్కిడఁ దరమౌనె? యేటిపని? యీతని లాఘవలీల గాంచుటల్
విడిచి మఱొక్కచేత తగ♦వే? యని పల్కిరి తాపసోత్తముల్. ౧౦౬౩

తే॥ కదనతలమెల్ల నవయవ♦ఖండసమితి, చెదరిపడియుంట యొప్పెను♦సృష్టికర్త
జగములను సృష్టిసేయఁగా♦జతనుపఱచి, వేఱువేఱ యుంచిన యంగ♦బృందమనఁగ.

తే॥ వీరవర్యులు పదికోట్లు♦ఘోరరీతి, నిధనమొంద సాధారణా♦యుధము లేసి
చావనేల దివ్యాస్త్రసం♦చయము విడిచి, కూల్తమని తక్కు రక్కసుల్♦కూడినారు.

తే॥ మొనసినా రాయణాస్త్రంబు♦మొదలుచేసి, యజుని యస్త్రంబుదనుకఁ గ♦లట్టిదివ్య
శరములేసిరి వారు దా♦శరథిమీఁద, నతఁడు వానిలోడన వాని♦నణఁచివైచె.

మ॥ కొని దివ్యాస్త్రము లేయుచో జగము సం ♦ క్షోభించి పుష్పంబు ల
గ్నిని పడ్డట్టులు నాశమై చనును వా ♦ నిం ద్రిప్పలే రీఖలుల్
కనుకన్ శాత శిలీముఖంబులన యీ ♦ క్రవ్యాదులం గూల్తుఁ గా
కని సీతాపతి యట్టులే పఱపి మా ♦ యం జేసె నాదైత్యులన్. ౧౦౬౭

తే॥ వేయివెల్లువలైన వి♦ద్వేషిసేన, మొత్తముగ రణమున జీవ♦ములను పాసె
బరువు తొలఁగ వసుంధర♦శరధినుండి, నరగఁ బైకుబ్బి లేచెను♦చాలవఱకు. ౧౦౬౮

సీ॥ వారణంబులు వేయి♦తేరులు పదివేలు, వారువంబులు కోటి♦వాహినీశు
లొకవేవురు నశింప♦నొక కబంధము లేచి, రణరంగమందు న♦ర్తనము సేయు
వేయికోట్ల కబంధ♦వితతి యాడిన రామ, కార్ముకమున నున్న♦గంట మొరయు
నాగంట యొక యేడు♦నఱగడియలసేపు, మ్రుగియక గణగణ♦మ్రోఁగుచుండె

తే॥ తలఁపు నెఱవేఱెనని సురల్♦కలఁక విడిరి, నిశ్చలత నందె ధర్మంబు♦నిశ్వసించెఁ
దలలు పైకెత్తె శేషుండు♦తాపసులును, మఘువుఁడును గుండెబరువును♦మాన్చికొనిరి.

ఉ॥ పొందిన కల్మి తమ్మునకుఁ ♦ బొల్పుగ నిమ్మన నిచ్చి వేలుపుల్
చెందిన పూర్వపుణ్యమునఁ ♦ జెచ్చెరఁ గానకు వచ్చి యందు వి
ల్లంది సమస్తజీవులకు ♦ నబ్బిన యాపద దీర్చినట్టి రా
జేందుని గాంచి నోరుగల ♦ యెల్లరు మ్రొక్కిరి జేజె యొనర్చుచున్.

తే॥ వేలుపులు పూలు సల్లుచు♦వినుతిసేయ, రాముఁ డొప్పారె నారణ♦రంగమందు
భూతములు నిండినక్కలు♦పొలయుచుండు, మసనమందొంటినిల్చు త్ర్యం♦బకునిపోల్కి.

మ॥ కదనక్షోణి విరించనాండముగ ర♦క్తశ్రేణి జీవాళిగాఁ
దుదికాలంబున నెల్లజీవులను సం ♦ తుష్టిం బునస్సృష్టికై
యుదరంబందున నుంచుకొన్న తన పూ♦ర్వోదార రూపంబునే
మదనాకారుఁడు పోలెనంచు వినుతిం♦పం బూని రింద్రామరుల్. ౧౦౭౨

మ॥ కలఁకన్ వీడి సురాలి చల్లిన దళత్ ♦ కల్ప ప్రసూనంబులన్
గలతావుల్ తన సేదదీర్పఁ బ్రబల ♦ క్రవ్యాద సంఘంబులన్
బొలియంజేసిన రామభద్రుఁడు సమి ♦ ద్భూభాగమున్ వీడి ని
ర్మలుఁడా ప్రేముడి తమ్ముఁజూచు తమి యా ♦ త్మం దన్ను ప్రేరేఁపఁగన్

తే॥ ఇచటనిట్లయ్యె నచటనా♦యనుజుతోడఁ, గపులతో రావణుఁడు వచ్చి♦కదఁకరణము
సేసెనేమొ? లక్ష్మణుఁడేమి♦చేయఁగలిగె?, ననుచుఁదొందరగా రాముఁ♦డరిగెనటకు.

ఉ॥ మర్కటనాయకుల్ రణము ♦ మానరు మిన్నక తక్కువారలా
యర్కజు నాజ్ఞమీఱి యిటు ♦ లాఱడి నొందుట భావ్యమే? సమి
త్కర్కశులై విరోధితతిఁ ♦ ద్రత్తము చత్తముగాక యూరకే
తర్కములేల యంచు వడిఁ ♦ దార్కొని వచ్చిరి పోరొనర్పఁగన్. ౧౦౭౫

౩౧ రావణ శక్తి పటలము (౯౦)

తే॥ వేయి తురగంబులం బూన్చి♦వేవెలుంగు, మండలముఁగేరు తేరెక్కి♦భండనమున
సురలగెల్చిన విల్లును♦శరధిఁదాల్చి, రావణుఁడు చేరె వడి సమ♦రస్థలంబు. ౧౦౭౬
తే॥ మనుజులం జుట్టి వధియింపుఁ♦డనుచు వేయి, వెల్లువల నాజ్ఞయిడి కపి♦మల్లురవయిఁ
దాన పోవ నిచ్ఛించి యా♦సేననంపి, వేఱ ప్రేవకు నరిగె న♦వ్వీరవరుఁడు ౧౦౭౭
తే॥ నూఱుకోట్ల రథంబు లి♦న్నూఱుకోట్ల, తురగములు పదికోటుల♦కరులఘటలు
నంత కినుమడియగు సుభ♦టాలితోడ, నాఁడు రావణుఁడేగె ర♦ణంబుసేయ
తే॥ త్రిజగములయందు నవలి ప్ర♦దేశములను, కలఁకునకు రండురండని♦పిలుచునట్టి
భేరి కాహళ శంఖాది♦భీమణరుతి, మాఱుమ్రోఁగఁగ జెలరేఁగె ♦ మహితరీతి.
తే॥ వంచితామర విధి పరి♦పాక రూపుఁ, డసురనాథుఁడు దశకంఠుఁ♦డమిత చమువు
తోడ ధాత్రి యుదర సమి♦ద్ధోహాలుఁడయి, వచ్చుచుండుట గాంచెను♦వానరాళి.
ఉ॥ కాంచి దురంబులోఁ దను ని ♦ కాయము వీడుటె వీరధర్మమా
నంచుఁ గృతాంతుఁడుఙ వడఁకు ♦ నట్లు భుజంబుల నప్పళించి గ
ర్జించుచు ప్రాఁకులఙ గిరులఁ ♦ జేకొని వ్యూహము తీర్చిపేర్చి లం
ఘించుచు రండు రండనుచుఁ ♦ గేరుచుఁ గేకలు వైచె నుద్ధతిఙ. ౧౦౮౧
తే॥ ఉనుఱు లీయఁ గాఁబోలు న♦య్యసురసేన, వడివడిగ వచ్చి తాఁకెను♦వానరులను
ఉభయులకు మధ్య నిప్పుక♦లుప్పతిల్లె, వాని నడుమనె రక్తప్ర♦వాహ మడరె.
తే॥ తుండులైన మొండెంబుల♦నుండిలేచి, తలలు నింగికి నెగసె నా♦తలలనుండి
నెగయు నెత్తురు చుక్కలా♦నింగిఁ బరవ, నంబరంబెల్ల రణరంగ♦మట్లు తోఁచె.
చ॥ అదవదమైన రాక్షస బ ♦ లాంబుధి నంబుల నెత్తు చేతులఙ
మదజల మానవచ్చిన ప్ర ♦ మత్త శిలీముఖ కోటి క్రమ్మఁగఙ
నదమదమంది భద్రగజ ♦ సంహననంబులు వ్రస్సివ్రస్సి పె
ల్లిదమగు నెత్తుటేళ్లఁ బడి ♦ లియ్యము లయ్యె మునింగి తేలుచుఙ.
చ॥ మగువలు తొల్లి నవ్వులను ♦ మన్ననలఙ సురతంపుఁ జెన్నలఙ
దెగువయు దుశ్శకముం దొడరఁ ♦ దేఱక యున్నవ చేసి పాడుచుఙ
దగవుగఁ గంకణ ధ్వనులు ♦ తాళము వైవఁగ నేడ్చియేడ్చి యా
వగ వలదంచుఁ బ్రాణములఁ ♦ బాసిరి భర్తలఁజేరి రయ్యెడఙ. ౧౦౮౫
క॥ నాశము నొందెడు తుది తఱి, నాశిల్లు జగంబులట్లు ♦ నారక్షణచే
నాశము నందని సేనకు, నాశమొదవె ననుచు దైత్య♦నాయకుఁ డడలెఙ
క॥ తరువులు శిలలే యసి ము, ద్గర శూలాదికము విఱిచి♦దనుజుల తలలఙ
దొరలించె దాళ ఫలముల, కరణిని రావణుఁడు కాంచి♦కళవళమొందఙ. ౧౦౮౭

క॥ పావనియును సౌమిత్రియుఁ, గ్రోవియుఁ గండెయునుపోలెఁ♦గొఱలుచుఁ దనుమర్
ద్రేవుల ప్రోవులు వెలువడ, మావులు రథపాళితోడ♦మ్రగ్గుచుఁ బడియెన్. ౧౦౮౮

క॥ విలుదాల్చిన కాలునివలె, విలసిల్లుచు లక్ష్మణుండు♦విరివిగఁ జదిపెన్
బలయుత బలిముఖ నఖ రద, ముల వాఁడిమి దనుజసేన♦పోఁడిమి పీడన్. ౧౦౮౯

క॥ ఇఁక నొక క్షణ మిట్లే యూ, రక చూచుచు నుంటినేని♦రాక్షస తతి నం
తకుఁడెల్లఁ గొల్లగొని పో, వక యుండునె యనుచుఁ బంక్తి♦వదనుఁడు కినుకన్.

చ॥ శ్వసనుని వేగముం బిడుగు ♦ వంటి బలంబును పర్వతంబులన్
బసయుఱఁ ద్రొల్చు శక్తియును ♦ పద్మభవాండము దాఁటు చేవయున్
దెసలను గొల్చు నేర్పు గడి ♦ దేఱిన యంతక కింకరత్వమున్
బొసఁగిన శాత సాయక స ♦ మూహ పరంపర లేసె గ్రక్కునన్. ౧౦౯౧

ఆ॥ కినుక రేఁగి పోరు♦దనుజవిభుఁడు నడు, రేయి యడరు కాళి♦రీతినుండె
నెగచి వీచు గాలి♦కెగసిన దూది పిం, జల విధానఁ బ్లవగ♦చయము లయ్యె.

ఆ॥ పాఱుచున్న కపుల♦భయమును సౌమిత్రి, తెలిసి భీతి నొంద♦వలదు వలదు
నిలువుఁ డనుచు నాంజ♦నేయుని భుజముల, నెక్కి పంక్తివదను♦నెదుటికేగె.

ఆ॥ ఎదిరి నిలువ దాన♦వేంద్రుండు వందలు, వేలుగాఁగ వాఁడి♦కోలలేసెఁ
బ్రతిశరంబు లేసి♦రామానుజుఁడు వాని, నడుమఁ బొడిగఁ జేసి♦పుడమిరాల్చె.

తే॥ రాల్చు సౌమిత్రి భుజము లు♦రంబు నాటు, నట్లు దశవదనుండు పెం♦పక్కముగ్గలేసె
కొన్ని డాసి మేనిని గ్రుచ్చెఁ♦గొన్ని దూసె, లక్ష్మణుండు కినిసి శర♦లాఘవమున.

ఆ॥ వానిఁ గలఁత పఱుప♦వైశ్రవసుండును, వీని గెలువ నరిది♦వింటిచేత
వీని విడిచి చూపు♦వీరత్వ మదియేది, వీడరాదు వీని వీడరాదు. ౧౦౯౬

శా॥ దివ్యాస్త్రంబుల నేయ వ్రాల్చి సమవ ♦ ర్తిం బిల్చి చూపించుఁ గ
ర్తవ్యం బేది? తదగ్రజుంబలె జగ ♦ త్సర్వంబు బాణాగ్నికిన్
హవ్యప్రాయముగా నొనర్పఁ గలవాఁ ♦ డర్ధక్షణంబందె ని
ష్క్రవ్యాదంబుగ భూమిఁ జేయఁ దలఁచెన్ ♦ సాధించు టెచందమో?

ఆ॥ మున్ను బ్రహ్మ వడయు♦మోహనాస్త్రం బొందు, కలదు భవునినేని♦గెలువఁగలది
దానివైచి సమర♦ధాత్రిని వీనిని, కూలఁ ద్రోతు ననుచుఁ♦గోరి తొడిగె. ౧౦౯౮

మ॥ విడువం గాంచి విభీషణుండు రణహాం ♦ వీరా! మహాస్త్రంబుచే
నడుఁకం జేసెడి లోకమెల్ల నిది నీ ♦ నారాయణాస్త్రంబుచే
నడఁపం జొప్పడు నన్న లక్ష్మణుఁడు త ♦ ద్వ్యాళవృత్తిఁ దద్రీతిగా
నడఁపం గాంచి దశాననుం డనుజు వి ♦ న్నాణంబుకై మండుచున్.

మ॥ ఒగి వీఁడుండి నిశాచరావళుల మా ♦ యోపాయముల్ దెల్పుచున్
దగురీతి న్నడపింపఁగా మనకు నే ♦ తన్నాశ మిట్లబ్బె దు

ర్భగు దుష్టాత్ముఁ గులాపకారకుఁ గుల ♦ భ్రష్టున్ విశంసించి యిం
బుగ మద్వంశ కలంకముం దుడిచెదం ♦ బో యంచుఁ గోపాత్ముఁడై.

చ॥ మయుఁడు కుమార్తె నిచ్చుతఱి ♦ మాన్యత నిచ్చిన శక్తిఁ గిన్కతో
రయమున వైచె నద్దియొక ♦ ప్రాణి నెదిర్చిన ఘాతనేని చం
పియె మరలంగఁ జాలినది ♦ భీకరమై యరుదేరఁ గాంచి దు
ర్భయమునఁ దప్పికో నొక యు♦పాయము లేదను నవ్విభీషణున్. ౧౧౦౧

చ॥ వెఱవకు మంచు లక్ష్మణుఁడు ♦ వేగమ యడ్డమువచ్చి వాఁడి యం
పఱ పఱపన్ మునీంద్రునకుఁ ♦ బాపి యొనంగిన శాపమట్లు వీ
సరవడ వేలుపుల్ మునులు ♦ చచ్చెను చచ్చె విభీషణుండు దు
ర్భరమని పల్కుచుండ విని ♦ రాముని తమ్ముఁ డుదగ్ర వేగుఁడై.

చ॥ మరణము నొందినన్ యశము ♦ మాఁడదు ధర్మము నిల్చు నుత్తముల్
గురుసుఖ మందువారు తన ♦ కున్ శరణంబని వచ్చువాని డె
ప్పరమున వీడరాదనుచు ♦ వక్షముఁ జూపుచు వచ్చె నడ్డుగన్
వెఱగొని వానరుల్ విబుధ ♦ బృందము హా! యని విచ్చలింపఁగన్.

మ॥ అతనిం దాఁటి విభీషణుండు చనఁగా ♦ నయ్యుర్వరన్ మీఱి వా
లి తనూజుండు దృఢాత్ముఁడై యెదుట ని ♦ ల్చెన్ వానిఁద్రోపాడి స
న్మతి సుగ్రీవుఁడు పోయె నాతనికి ము ♦ న్వాతాత్మజుం డేగె నీ
యతిశాయిత్వ మహత్త్వముం దెలుప శ ♦ క్యంబౌనె యెవ్వారికిన్ ?

—: రావణ శక్తిచే లక్ష్మణుఁడు మూర్ఛిల్లుట :—

ఉ॥ అండఱికంటె ముందునకు ♦ నార్యుఁడు లక్ష్మణుఁ డేగి దీని నేఁ
గొండెద నుండుఁ డుండుఁ డని ♦ కూరిమి మిత్రుల మాన్చి శక్తియున్
దెందము గ్రుచ్చి దూయ గురు ♦ ధీరత వక్షము చూపి నిల్చె నా
చందము గాంచి వేల్పులును ♦ చయ్యనఁ గన్నులు మూసి రయ్యెడన్.

తే॥ పదరి యెచటి కేగెదవని ♦ పట్టరాని, చండ కోపాన మండుచు ♦ దండము గొని
రావణుని రథ రథ్య సా ♦ రథులఁ జదియ, భీషణంబుగ మోఁదె వి ♦ భీషణుండు.

క॥ రోషమున రావణుండు వి, భీషణుపై మారుతిపయి ♦ వేఁడి యలుఁగు లా
ఘోషగతి నేసి బహు సం, తోషముతో మరలె విజయ ♦ ఘూర్వామతియై.

క॥ నే శరణొందిన యీ జగ. దీశుని తమ్ముండు పోల ♦ నీవెటకు ముదా
వేశమునఁ బోయెదని యా, క్రోశించి విభీషణుండు ♦ కోపమునఁ జనన్. ౧౧౦౪

మ॥ వశమయ్యెన్ జయలక్ష్మి మోద భరిత ♦ స్వాంతుండనై మీఁద నీ
పశువుం జంపిన నేమిలాభమని సం ♦ భావించి పౌలస్త్యుఁ డ

ద్రిశ కన్నెత్తియుఁ జూడ కయ్యనుజు వి ♦ ద్వేషంబు లెక్కించి క
ర్కశతం జూపక వ్యోమ మార్గమున లం ♦ కం జొచ్చె సంరంభియై.

తే॥ పట్టరాని దుఃఖంబున ♦ వాయివిడిచి, పనవి లక్ష్మణు పదములఁ ♦ పైని వ్రాలి
ఘోషణం బొనరించె వి ♦ భీషణుండు, వనచరులు దుఃఖ జలనిధి ♦ మునిఁగినారు.

తే॥ ఇతఁడు మరణింప జీవించి ♦ యేమిఫలము? విభుఁడు రాఘవుఁ డింక జీ ♦ వింపలేఁడు
అనుచు నెద నుడివడ నేడ్చు ♦ దనుజరాజుఁ, గాంచి భల్లూకనాథుఁ డీ ♦ కరణిఁ బలికె.

చ॥ తలఁచిన యంతలో సకల ♦ తామరసాండము చుట్టి యోషధుల్
సొలవక తెచ్చి యియ్యఁదగు ♦ శుద్ధమనస్కుఁడు మారుతాత్మజుం
డిల మనపాలనుండ నిటు ♦ లేడువ నేటికి? చూడు లక్ష్మణుం
డిలుగఁడు వంతయేటికి వ ♦ హింపుఁడు స్థైర్యము మేలుగల్గెడున్. ౧౧౧౨

చ॥ అని యనిలాత్మజాతు నర ♦ మందలి తూపుల నూడ్చివైచి యీ
యనుజుఁడు మూర్ఛ మున్గినఁ ద ♦ దగ్రజుఁ డోర్చునె? కాంచికాంచి స
మ్మనమున మ్రాని మ్రిమ్మగులు ♦ మ్రగ్గుచునుండుట చూచిచూచి యీ
యనువున నూరకుంట తగు ♦ నా? సకలంబును మాకు నీవెకా? ౧౧౧౩

చ॥ అని వచియింప వాయుసుతుఁ ♦ డాతని యిచ్చ యెఱింగి యాక్షణం
బున గగనస్థలి న్నగసి ♦ పోయెను వారల చూపుదాఁటి యా
పనియును పోవు మార్గమును ♦ బ్రాఁతవియోటఁ జనంగ నోషధుల్
గొని చనుదేర నాతనికిఁ ♦ గూరునె తామసముల్ శ్రమంబులున్. ౧౧౧౪

చ॥ హనుమయు మందుదెచ్చె నొక ♦ యాటగ నోషధియందు వాయువుల్
పనుపడఁ బొఱునంత స్మృతి ♦ వచ్చెను చచ్చినవారి జీవముల్
నునుపుగ నిచ్చుమందునకు ♦ నొచ్చిన వారల నొప్పి తీర్చుటల్
ఘనమగు కార్యమా? ప్లవ ♦ గ వ్రజమెల్లను లేచె నెమ్మదిన్. ౧౧౧౫

చ॥ అమరులు వానరుల్ ముదము ♦ నందఁగ లక్ష్మణమూర్తి లేచి వే
గమున సమీరపుత్త్రకుని ♦ కౌఁగిలిఁ జేర్చి విభీషణుండు నే
మము భజియించునే యనుచు ♦ మన్నన నాతనిఁ గాంచి మోద బా
ష్పము లురలంగ రావణుఁడు ♦ చచ్చె వధూనిక కబ్బె ముక్తియున్.

చ॥ బ్రదికితి మెల్లవారమును ♦ పాడిరొ యాచరణీయమంచు నొ
ప్పిదమగు తారకాణఁ గపి ♦ వీరుఁడు మారుతి చూపె నన్న క
య్యది యిఁక దుర్ఘటంబగు? ని ♦ హంబు పరంబును కూర్చు కర్మలం
దెదఁ దలపంగ ధర్మమె సు ♦ మీ జయముల్ సకలంబు నిచ్చెడిన్. ౧౧౧౬

మ॥ అని భాషించుచు నందఱుం గలిసి నం ♦ దుద్భాగముం దాఁటి రా
ముని చేరం జని తత్పవిత్ర చరణాం ♦ భోజాతముల్ సోఁక మ్రొక్కు

క్కిన నాతండును సంతసించి యటనా ♦ కృత్యంబుఁ బ్రశ్నింపఁగా
వినిచెం బూర్తిగ జాంబవంతుఁడు విన♦వీరుండు చోద్యంబుగన్. ౧౧౧౭

ఉ॥ పావనిఁ జేరి గాటముగ ♦ బ్రీతిఁ గవుంగిలిఁ జేర్చి నాయనా!
యీవొకఁ డుండఁ గానిపని ♦ యేదియు మేదిని లేదు పోలో
రావణుఁడున్ గృతాంతుని పు ♦ రంబును చేరినవాఁడె నీకు మా
దాహవ జీవితంబును ద ♦ రాయు రదంచిత కీర్తు లబ్బెడున్. ౧౧౧౮

శా॥ మోదముతోడ బాష్ప జల ♦ ముల్ ప్రవహింపఁగ జీవుఁ జేరు నై
నైదముతోడ దుఃఖము నొ ♦ సంగి దివింగను తండ్రిరాఁగ ను
త్పాదిలునంత సంతసము ♦ భావము చెందఁగ బ్రొక్కితమ్ముని
త్యాదర మారఁగా వలను ♦ యంగము దువ్వుచు రాముఁ డిట్లనున్.

చ॥ శరణమునొందు ప్రాణికగు ♦ చావును మాసిచి కాచుపొంబు నం
గరమున నీదు ప్రాణములఁ ♦ గాంతు రొయొనర్పక యిచ్చినందుచేఁ
బరమ పవిత్రమైన రవి ♦ వంశ గురుత్వము నిల్పితయ్య! యా
తరుణమునందు నీకదియ ♦ తప్పని కర్జము వత్స! లక్ష్మణా! ౧౧౨౦

చ॥ కలఁగక పావురంబుకయి ♦ కాయము కోసి రొయొసంగినట్టి ని
ర్మలగుణి తాతయా శిబిఁ గ ♦ రం బుపమింపఁగ నొప్పితయ్య! యు
ర్వరఁ గరుణామయాత్మకులు ♦ స్వాశ్రితపాలికిఁ జెట్ట యుబ్బుచోఁ
గరఁగుదు రార్తి క్రేపునకుఁ ♦ గల్గిన ధేను వలంగున్నై వడిన్. ౧౧౨౨

చ॥ అని వినుతించి సమ్ముదము ♦ నంది రణంబునకై ధరించి యుం
డిన కవచాదు లొక్కటొక ♦ టిం గడుమెల్లనఁ దీసి యాంజనే
యుని కరమందు పెట్టి రొయొ ♦ యున్నత శైలమునందు విశ్రమం
బును తొలఁగించు కొంచుబును ♦ పోకకు ముచ్చట లాడుచుండఁగన్.

## —: ౩౨ వానర రణరంగ దర్శన పటలము :— (౩౩)

ఉ॥ సేనలతోఁ గపీంద్రుఁడును ♦ చేరిక నిల్చి భజించుచుండఁగా
వానరు లాదటన్ సమర ♦ భాగముఁ దక్కక కాంచి దిగ్భ్రమం
బూని వడంకఁచున్ బెడను ♦ నొందిరి కీశ కులేశుఁ డీవ యీ
దానవ సైన్య మంతయు వి ♦ దారణ చేసితె యంచుఁ బల్కఁగన్.

ఉ॥ రాఘవుఁడున్ విభీషణుని ♦ బ్రీతిఁగఁ గాంచి దురంబునందు నై
త్యౌఘముఁ జూపుమన్నఁ గడు ♦ నుత్సుకుఁడై ప్లవగాధ్యులెల్ల లెం
డో ఘనులార! చూతమని ♦ యుబ్బుచు లేచిరి రాముశౌర్య ధీ
లాఘవ లక్ష్మణుద్ధుల కొలంది గనుంగొను వేడ్క నందిలన్. ౧౧౨౫

ఉ॥ కాంచిరి బెగ్గడిల్లిరి వ♦గర్చిరి తూలిరి బెగ్గలించి రా
కుంచితులైరి గుండియలు ♦ కొట్టుకొనన్ దడియాడె నోష్ఠముల్
మించిన భీతి మెల్లనన ♦ మేను లధీనములయ్యె నంత మో
దించిరి పొంగి రుబ్బిరి మ ♦ దించిరి తత్ స్థితిఁ దెల్ప శక్యమే ? ౧౧౨౬

ఉ॥ వీరశవ స్థితుల్ గనఁగ ♦ భీతికి సంఖ్యకుఁ జూచు సీతకున్
మేరకు మీఱి యున్న దిట ♦ కూఁద విభీషణ! యగ్రగామివై
వీరల పుట్టు పూర్వములు ♦ విస్తరరీతి వచింపు మేము పెం
పారఁగ విన్పఁ గాంచు చర♦ణుంగలవారము నా నతండనున్. ౧౧౨౭

తే॥ శాకములు పందిరింబోలెఁ♦గ్రమ్మియున్న, రక్తపంకమహా రణమున♦రామ బాణ
నిహతిఁ గుప్పలు తిప్పలై♦నీల్గియున్న, వారణంబులఁ జూడుఁ డ♦వారణగతి.

క॥ వడిగల రామశరంబుల, జెడిదులు ప్రాణముల వీడి♦పెంటలఁ గునుకం
బడిన వడువయ్యెఁ గనుఁడీ, పుడమిధరము మీఁది నాగ♦పుంజములక్రియన్.

క॥ కూలిన దనుజుల ముఖములు, వేలా పులినమ్ములందు♦విరిసిన రాజీ
వాలిం బోలుం గన్గుఁడీ, యేలా వర్ణింప రాఘు♦వేష్వాన విధుల్ ? ౧౧౩౦

క॥ శరసంఘాతముచేఁ బె, న్నరదంబులు విఱిగి శోణి♦తాపగలబడిన్
శరనిధుల కలములం బలె, జరగుచు నుండుటలు గనుఁడి♦సంతన మెసఁగన్. ౧౧౩౧

క॥ వారణములు ప్రాణంబుల, తో రుధిరాపగలఁ జిక్కి♦పొరలుచుఁ బారా
వారమునఁ దిమింగిలముల, తీరునఁ దేలాడుచుంట♦తేటగఁ గనుఁడీ ౧౧౩౨

క॥ నయగతుల నట్టలాడఁగ, లయగతులం దాళముల నె ♦ లర్చు పిశాచో
చ్చయగతులఁ జూడ నటనో, భయగతులం జెనయఁబోలు♦భరతాచార్యుల్.

క॥ అరివీర సముదయంబుల, నరములు యంత్రములఁ బోలె♦నడచెడు శాఖ్రం
బిరిగొని తగులం ద్రోచుచు, తిరుగు పిశాచములఁ గనులు♦తెఱచి కనుండీ. ౧౧౩౪

తే॥నగము తెగిన మేనులతోడ♦సామజమ్ము, లొఱవలై పడియుండొంటి♦నొంటికొనఁగఁ
గొన్ని పెనుగుండ్లవలెఁదోఁచెఁ♦గొన్ని యెన్న, నిరుదలలగొరులం బలె♦మెఱసెఁగనుడిఁ.

తే॥చండకోపము వికటహా♦సమునఁ జూపు, మొగము లెల్లనుపొగలతో♦సెగలు నెగయు
హోమకుండంబులం బోలి♦యొప్పుచుంట, కాంచినారలె శాఖామృ♦గంబులార !

తే॥ సమదగజములపై నుండి♦జాఱిపడిన, చామరంబులు వీరాస్య♦సరసిజముల
నొఱగి నిద్రనొందెడు మరా♦ళోత్కరంబు, చెలువు చెన్నారు వానిఁ గాం♦చితిరె చెప్పుఁడ

క॥ దంతంబులు రుధిరోద, న్వంతంబులఁ దడిసి సాంధ్య♦నభమునఁ దేజో
వంతములగు బాల కళా, వంతుని రేఖాచయంబు♦వడువునఁ దోఁచెన్. ౧౧౩౮

చ॥ శర ధనురాది సాధన వి ♦ శాలములైన రథోత్కరంబుపై
ద్విరదచయంబుపై నిలిగి ♦ ౘెల్లిన వీరుల కన్నుదోయి యం
దురలిన నిప్పుచే నుడికి ♦ యున్న పలాలము మెక్కి భూతముల్
పారువుగఁ ద్రేన్పుచున్ మురిసి ♦ యాడుచునుండుట తేటి కాంచుఁడీ!

చ॥ దిగఁబడి పాటి సంద్రమునఁ ♦ దేర్లిన యాశ్వతజ స్రవంతిలో
నెగఁబడి చొట్టమీలు తమ ♦ యిచ్ఛకొలందిని వచ్చి యాజి సే
నఁగులను గాంచి యెందును గ ♦ నుంగొన లేదివి శ్రోత్రయమ్యో సే
మృగములొ యంచుఁ గమ్మఁటి గ♦మించుచు నుండుట కాంచినారలే!

క॥ మింటం జచ్చిన శవములు, మంటం జరియించు వారి♦మస్తకములపై
నొంటించి పడఁగ సోలుచు, నింటరపడు సతులఁ గంటి♦రే కపులారా! ౧౧౪౧

తే॥ నింగియందు సారంగ తు♦రంగచయ శ, తాంగములయందు చచ్చిన♦యసురవరుల
యొడలి నల్లచుక్కలుపడ♦నడిమిమింట, భానుఁడున్నను లేఁ బ్రొద్దు♦పగిదిఁదోచె.

తే॥ వాయు జవమునఁ జనిన దైత్యే ♦ తేయులు తెగు, కతన మింటనంటిన రక్త♦కణములెల్ల
వెల్లువంబోలెఁ దోఁపంగఁ♦దెల్లనైన, విధుఁడు సూర్యునిఁబోలెఁగ♦న్పించుఁగనుఁడి!

క॥ దివి భువి జలనిధి దిక్కులు, పువులును మధుపములు కర్ణ♦ములు మూఁగఁగ భూ
జ వితతి దళంబు లన్నియుఁ, జివుళులవలెఁ దోఁచుచున్న♦చిత్రము గనుఁడీ! ౧౧౪౨

మ॥ కెరటంబుల్ గజదంత మౌక్తికములన్ ♦ గేఁదొట్టి ద్రోవంగఁ బెం
దరువుల్ గూలఁగఁ బక్షిసంఘములు సం ♦ తాపించి కూయంగఁ జా
మరముల్ టెక్కెము లాతపత్త్రములు ద్ర ♦ వ్యమ్మన్ ఫేన బృందంబుగా
దరులై పీనుఁగు లొప్పఁగాఁ బఱచు ర ♦ క్తప్రోడినుల్ గాంచుఁడీ!

మ॥ కరి యూథంబులు తీరభూములు భుజా ♦ స్కంధాలు సర్పాలుగాఁ
దురగశ్రేణి తరంగపాళి కర సం ♦ దోహంబు నక్రాలిగా
నరి వీరాస్యము లంబుజాతములుగా ♦ నాంత్రంబులే నాచుగాఁ
బెరనుల్ వండలిమైన నల్లమడువుల్ ♦ వీక్షింపుఁ డిప్పట్టునన్. ౧౧౪౩

తరువోజ॥

కరవాలములను నాఁ♦గళ్లుగాదున్ని, కరమొప్పఁ బలల పం♦కమ్మున నల్ల
విరవారు నీడను♦వేదండ మహిష, వితతి పొరలుచుండ♦వీరులన్ కృషిక
వరులు హస్తములను♦పద్మముల్ మొలవ, వరుసఁ గలువు దీసి♦పైచిన పగిదిఁ
గరలిన యూరణ♦క్షేత్రంబు గనుఁడి, కీశవర్గములార! క్రేఁగంటనైన. ౧౧౪౪

తే॥ రాక్షసుల పెనుమేనులు♦రాలుచుండ, రామ కోదండ శింజినీ♦రావ మొప్పు
నవనిఁ బీటలు వాఱఁగా♦నందు చొచ్చు, శోణితాపగలం బుట్టు♦సుడులఁ గనుఁడు!

మ॥ భుజముల్ గ్రీవ లురంబులుఁ గవునులుఁ ♦ ముంగాళ్లు ముంజేతులుఁ
గిఱుఁ సజ్జగ దంచి త్రుంచి యట దిగ్వీథుల్ విదారించి య
క్కుజమై చొచ్చి రసాతలంబనుచుఁ బల్కంగ వచ్చు గాకీ మతం
గజ వాహాదుల రామ మార్గణము నొక్కండేని వీక్షింతురే! ౧౧౪౯

సీ॥ అమృతంబుతో నుదయంబందు గజములు, పదికోట్లు మేఘముల్ ♦ వారినిధులు
వట్టినను మదంబువట్టని వజహోమ, కుండజ కరులు పం♦ డ్రెండుకోట్లు
ప్రాణముల్ పోయిన ♦ రక్తంబు వట్టినఁ, బొగరు మానవివియుఁ ♦ బూర్వదంతి
వంశంబు గలయవి ♦ పదునాల్గు కోట్లును, బ్రహ్మ కకుబ్భార ♦ వహనకార్య

తే॥ మునువకండుటచే నూరకున్న యవియు, నవర దిక్కరి వంశంబు♦నందు పొడము
పద్మసంఖ్య యింద్రుండిచ్చు♦వాసితోడ, వేయికోట్లు లెక్కకురావు♦పెరల యీవి.

సీ॥ కలశ వారాశిలోఁ ♦ గలిగిన వేలకొ, లందు లీగుఱ్ఱంబు ♦ లందు గలవి
వరుణుని గెల్చిన ♦ తరుణమ్ముందునఁ గొన్న, యవి నిధీశుఁడు పోవు♦నపుడు విడిచి
పోయిన యవి కోటి♦పొనర విద్యాధర, ప్రభుఁ డొసంగిన యవి♦పద్మ సంఖ్య
తక్కువార లొసంగు ♦ తత్తదులకు లెక్క, లేవు సైంధవముల♦ప్రోవు లివ్వి

తే॥ యెల్లలోకంబులందుండి ♦ యెల్ల దీవు, లందునుండి వచ్చినయది ♦ యసురసేన
మూలబలము వచ్చినయది♦ముగిసినదియు, నని విభీషణుఁ డనఁ ప్లవ♦గాలిచూచి.

ఉ॥ మిత్రవరేణ్య! యిట్టు లని ♦ మేమవిరోధి బలంబు చూపినఁ
జిత్రముగాఁగఁ జూచినను ♦ చెందదు దీనికి నంతమెన్నఁడుఁ
గోత్రవిభుం గనుంగొనడి ♦ కోపుననున్నది చాలునిష్ఠ సౌ
మిత్రి ధరాత్మజావిభు న ♦ మీవము చేరఁగఁ బోదమా యనఁ.

చ॥ సరియున నందఱుం గలిసి ♦ సారసనేత్రుని చెంతఁ జేరి య
త్యురుతరభక్తి మ్రొక్కి సమ ♦ రోర్విని రాముఁడు చూపు సాహస
స్ఫురదతి విక్రమంబులను ♦ చోద్యముగాఁ బలుమాఱు లెంచుచుఁ
జరుగగనున్న కారియము♦చక్కటి యూరయుచుండి రచ్చటఁ. ౧౧౫౩

## ౩౩. రావణ రణరంగ దర్శన పటలము. (౨)

తే॥ సురలుకష్టంబులొందవా♦నరులబలము, క్రుంగఁదటిమిల తమ్ముఁగూల్చి♦పొంగివచ్చు
మోదమున రావణుఁడు తన♦పురము చేరి, యుత్సవముచేయ మదిలోన♦నుత్సహించె.

క॥ తనమీఁది ప్రేమచేతం, జనుదెంచి దురంబు సేయు ♦ సంగడికాండ్రం
దనుపఁగ వివిధ పదార్థము, లనువొందఁగ వండుఁడనుచు♦నాజ్ఞాపించెఁ. ౧౧౫౫

క॥ వేలుపుల పడిగ రండని, మీలోకమునందు గలుగు ♦ మేలి సుఖములఁ
గీలింపుం డీ లంకను, జాలము వలదనుచుఁ జండ ♦ శాసన మొసఁగెఁ. ౧౧౫౬

ఆ॥ మంచి కల్లు మంచి ♦ మాంసంబులును వ, స్త్రములును చందనంబు ♦ పుష్ప వితతి
తానమునకు నీరు♦తల్పంబులును దశ, వదను నగరు చేర♦వచ్చి నిండె.

తే॥ తావి సంపెఁగ తైలంబు♦తలలకంటి, తావినీట బోర్కాడించి♦తనియ భోజ్య
వస్తువులనిడి తల్పముల్ ♦ వలసినట్లు, నవరణలు సేయ వచ్చి ర ♦ ప్సరస లటకు.

క॥ పాడిరి కొందఱు పొలుపుగ, నాడిరి కొందఱు వలంతు ♦ లరుదని పొగడన్
గూడిరి కొందఱు సెజ్జల, వేఁడిన సిద్ధులకుఁ బోలె ♦ వెలసిన వెల్లన్. ౧౧౫౯

ఆ॥ రాజసుతులు మొదలు♦రాక్షసావళిదాఁకఁ, గొలువు సేయుచున్న♦కోడెకాంద్ర
కింద్రభోగ మప్పు ♦ డింపారఁ గలుగుట, వలనఁ గలుగు గెలివి ♦ కలవిలేదు.

తే॥ ఇట్టు లుల్లాసమున నున్న♦యింద్రవైరి, విభుని యెదుటికి వచ్చిన♦వేగులప్పుడు
కేలుమోడిచి చెవిడాసి♦మూలబలము, సమసిన విధంబు వాక్రువ్వ♦సాగినారు.

ఆ॥ వడఁకుచున్న మేలు♦వరటిన నాల్కలు, బెదరు చూపులెడఁద♦పిదపిదమనఁ
దక్కి తాఱి నత్తిఁ♦దడఁబడు పలుకులు, తోలఁక ఘాతలిట్లు♦పలికినారు. ౧౧౬౦

ఆ॥ విజయశీల! చనిన♦వేయి వెల్లువలును, రణమునందు నిలిచి♦రాము నేక
కార్ముకమున నేడు♦గడియలలో మ్రగ్గె, నిందు కుడుచు విందు♦లెవ్వరింక?

చ॥ బలిమిని దేవభోగముల ♦ బ్రాఁతిగ దైత్యుల కిందు కూర్పఁగాఁ
దలఁచితి సీతలంపులు వృ ♦ థాచనె లంకను గల్గువారె యి
య్యిలఁ గల వార తొందుర మ ♦ టెందును లేరెవరింక వీన నీ
బలముల కంతిమక్రియలు ♦ పాయక యీయెడఁ జేయఁగాఁ దగున్.

చ॥ మితి యొనరింపరాక యను ♦ మేయ ముదంబును పొందియున్న యా
దితిజవరేణ్యుఁ డా చరులు ♦ తెల్పిన పల్కులు విన్నయంతనే
యతిభయ దుఃఖ కోపముల ♦ సంది ప్రచండ తరోగ్ర దృష్టులన్
బ్రతిమనుపోలి నిల్చి వెఱ ♦ పాఱఁగఁ గాంచుచు నుండె యవ్వలన్.

క॥ బలవంతులు నాకంటెను, పలువురు నరు నొకని ధనువు♦వలన నొకండున్
గలికమునకైన మిగులక, నలఁగిరె యిది వమ్మఁజాల♦నమ్మంజాలన్. ౧౧౬౧

చ॥ అనవిని మాల్యవంతుఁడను ♦ నయ్యది సంశయమందఁ దగ్గదే?
పనిచిన దూతలే తనకు ♦ పల్కుదురే? నరుఁడొక్కఁ డిందఱన్
దనుజుల నేలఁగూల్చు టది ♦ దబ్బఱగాదు సమస్త జీవులన్
బనిగొని కల్పవేళ బలి ♦ వారెడు రుద్రుఁడు నొక్కఁడే కదా? ౧౧౬౨

శా॥ సంకల్పంబున సృష్టిచేసి జగముల్ ♦ సంరక్షయున్ నాశమున్
బొంకం బారఁగఁ జేయువాఁడు గుణ సం ♦ పూర్ణుండు సర్వేశ్వరుం
డింకన్ సందియమేల యాతఁడగుఁ జూ ♦ మ్మీ యంచు సీతమ్మఁ దా
శంకం బేమియు లేక పల్కిన దన ♦ త్యంబౌనె? లంకేశ్వరా! ౧౧౬౪

ఉ॥ ప్రాణులు భోజ్యమైన యొక • వస్తువు గైకొను నైజరీతి ; ని
ర్వాణము గూర్చి యన్నిటిని • వహ్ని భుజించును మీఱుచో జగ
త్ప్రాణుఁడు కొండలం దృణము•ప్రమాఁకులఁ బ్రాణులఁ గూలఁద్రోచు నా
ప్రాణికి నొక్క మేరగల • దా వచియింపఁగ ? రాక్షసేశ్వరా ! ౧౧౬౯

చ॥ చెలఁగుచు నింద్రభోగములఁ • జెందిన కాలము కద్దు తత్ప్రితుల్
తొలఁగినదంట నిక్కమున • దూరముగాదు ప్రతిక్రియా విధుల్
గలుగవు నీకునై లయము • గాంచిరి బంధులు శిష్టవర్గముల్
మొలఁగెడి త్రోవఁ బొమ్మనుడు • మిక్కిలి కిన్క నిశాటరాజనున్. ౧౧౭౦

శా॥ సౌమిత్రిం దెగటార్చితిం గలన నా • శక్తిం బ్రయోగించి దు
ర్వ్యాకీమోహంబున మగ్నుఁడై నమసెడున్ • రాముండు శాఖామృగ
స్తోమంబుల్ నశియించు మూలబలముల్ • శుష్కింపనీ యీడనీ
యేమైనం బనియేమి ? గెల్పు తుది నా • దే యయ్యె నిన్నాళ్లకున్.

ఉ॥ శోషితదైత్య హృచ్ఛశి వి•ధుంతుడు నట్టులు చారుఁడొక్కఁడు
ద్ఘోషముతోడ మోఁకరిలి • కొంకుచు వాయు కుమారకుండు ది
వ్యౌషధులొలిఁ దెచ్చి పోలు • పొందఁగ నీయఁగ లక్ష్మణుండు త
ద్భేషజ శక్తి లేచెఁ దెలి • విం గొనినారలు వానరోత్తముల్ ౧౧౭౨

తే॥ అనుడు నమ్మక పెనునంది•యంబు కలఁప, గోపురము మీఁదికిం జని•దాపురించు
సైన్యనాశంబు సత్యంబు•నరగఁ గాంచె, వాడు కన్నులతో మది•నూఁడుచుండ.

క॥ పోరున మరణించిన యా, వీరుల వనితలు సబాష్ప•వీక్షణ లగుచున్
బోరున విలపించెదు దీ, నా రావము శ్రవము లగల•నాతఁడు వినియెన్. ౧౧౭౪

తే॥ ద్విరదముల నీడ్పుకొని పెను•దరుల నొరసి, యేగు రక్తనదులలోన•నీఁదులాడు
చుండు శాకినీ డాకినీ•మండలులను, గుండె లగలంగ దశకంధ•రుండు గాంచె.

తే॥ జంబుకంబుల రవము రా•గంబుగాఁగ, ఘాత కరతలధ్వని తాళ•ములుగ రామ
బాణ నిహత కబంధముల్•ప్రాణమున్న, నటుల పోల్కి నటించుచుం•డుటను గాంచె.

చ॥ కవిసి పిశాచముల్ పతుల • గాయములం దమకేలు చొన్పి క్రొం
గవుచును వెల్కి నీడ్చుటను • గాంచి రుషాభర చిత్తలై సతుల్
దివిభువి దిక్కులం దటిమి • దైత్యుల ప్రుల్లను తీయుచుంట దా
నవకుల సార్వభౌముఁడు మ • నంబు దిగాలనఁ గాంచెఁగన్నులన్.

శా॥ జాతీయంబులఁ బోలి తెక్కుకును హే • తైర్చి యొప్పా రామాస్త్ర నం
జాత ప్రస్ఫుట దైత్యరక్తముఁ బిశా • చశ్రేణి యుప్పొంగి యా
బూతిం ద్రావుచుఁ గ్రక్కుపోల్కిఁ దనకున్ • ద్రుగ్గిన వీచీముఖ
స్ఫీతిన్ ముందుగఁ ద్రోచు నాజలధిఁ గాం • చెన్ రావణుం డయ్యెడన్.

సీ॥ దెసలు బీటలు వాఱ♦దివిరి మహోగ్రనా, దము సేయు కపి సము♦దయము గాంచెం
గువలయ మడఁగఁద్రొ♦క్కుచున ర్తనము సేయు, దైత్య కబంధ బృం♦దంబుఁ జూచెం
దనభీతి పొలివోవఁ ♦ గనులు పెద్దవి చేసి, కొన్న నిలింపుల ♦ గుంపు గనియె
గుండెలు పగుల నా ♦ క్రోశించి గోపుర, మందుండి వివశుఁడై ♦క్రిందఁ బడియెఁ
తే॥ బిదప నట్టహాసంబుతోఁ బెదవులెండఁ, గినుకతో మిఱుంగుఱు లేచు♦కనులతోడ
కలుష హృదయంబుతో వచ్చి♦కొలువుచేరె, రావణుండు సంగర జితై♦రావణుండు.

## ३४. రావణ రథారోహణ పటలము. (३౫)

తే॥ చేరి లంకయందిఁక నున్న♦సేనయెంత,యంత మొత్త మాయితము సే♦యుంగఁ బనుపు
వేగ మ్రోయింపు ప్రస్థాన♦భేరి యిపుడ, యని మహోదరు వీక్షించి♦యాజ్ఞయిడియె.
తే॥ భేరి విన్న వెంటనె రణ♦శూరులైన, సేన పదునాల్గు కోటులు♦చేరె నొకట
విజనమై కళా శూన్యమై♦ పేదవడియెఁ, గాఁపురము లేని పగిది లం♦కాపురమ్ము.
తే॥ ఐహికాముష్మిక ఫలంబు ♦ లందఁజేయు, పూజనము పరమేశున♦కొజఁ జేసి
కోరువారల కర్థముల్ ♦ కోరినంత, యిచ్చి రావణు డనికి నా ♦ యిత్తపడియె.
చ॥ యుగములతోడి నీలగిరి ♦ సంగతి వేవురు భాస్వరుల్ వెలుం
గు రహిని దాల్చె బ్రహ్మ మును ♦ కోరిన యింద్రున కీయఁ దాను సం
గరమునఁ దన్ను కట్టుతఱిఁ ♦ గాన్కఁగఁ బుత్రున కిచ్చినట్టి వ
జ్ర రుచిరమై యభేద్యమయి ♦ రాజిలు కత్తళ మూర్ధగంబుగన్. ౧౧౮౨
తే॥ మందరమ్మున వాసుకి♦మలసినట్లు, పొలుచు దట్టిపై నడిదంబు♦వెలయఁ జెరివి
కనకగిరిఁ జుట్టి వచ్చెడు♦గ్రహములట్లు, పొనరు రతనాల కటిసూత్ర♦మును ధరించి.
తే॥ గరుడి ఱెక్కలు విరిసిన ♦ కరణినొప్పు, గులుకుఁ గుచ్చెళ్లు నవరించి♦మెలికవడిన
పట్టువస్త్రంబు విచ్చిన♦పగిదిఁ దనరు, రజత ఫణినాఁగఁ జను కాసె♦రమణఁజుట్టి.
తే॥ మెఱుపులంబట్టి కూర్చిన♦ తెఱఁగు సింహ, సముదయంబులు గర్జించు♦చందమునను
రవళిసేయుచు శత్రుల♦చెవులు వ్రచ్చు, గజ్జెలం గూర్చు నందెలఁ♦గాళ్లఁ దాల్చి.
ఆ॥ పిడుగు నులివు విన్న♦బెదరు సర్పంబుల, కరణి విన్నయంత♦నరులు సురలు
వెఱచి పాఱునట్టి♦భీమణ రవమొప్పు, వీరమద్దియలను♦వెలయఁ దాల్చి. ౧౧౮४
తే॥ నాలుకలు చాఁచు పాములఁ♦బోలియున్న, చేతు లిరువదింటికి నఱ♦చేతులకును
వ్రేళులకును గోధాచర్మ♦విస్ఫుటంబు, లైన కవచంబులను పొలు♦పందఁ దొడిగి.
తే॥ పాఁపరాజును పోలిన♦పాశములను, భుజములం దాల్చి కరసాన♦పొనరఁ బట్టు
తఱిని రవినుండి రాలిన♦కిరణరాశి, లలిని కాంతు లొలుకు కుండ♦లములఁదాల్చి.
తే॥ బాలభానుని కిరణముల్♦ప్రాగ్గిరిపయి, వ్రాలు తెఱఁగున నొప్పారు♦రక్తగంధ
ములఁదినట్టి బాహులమీఁద♦నర్కుఁబోలు, కుండలంబుల కాంతులు♦నిండి పరవ.

సీ॥ చంద్రునితోఁడి బుట్టువుల చందంబునఁ, దారహారంబు కం♦ధరను గ్రాల
ద్వాదశాదిత్యులు♦వనధిపైఁ దోఁచిన, పగిది రత్నకిరీట ♦ పంక్తి తనరఁ
జెక్కుచంద్రుల పోల్కి♦విలసిల్లు ముత్యాల, గొడుగులు తలలపై♦బెడఁగునూప
సంజ పాలికలందు♦శశుల నుంచినలీల, గుహవంటి నోళులఁ♦గోఱలొప్ప [లొలుకు
తే॥ ముత్తెములు కూర్చుటం జేసి♦మురువు తెలుపు, నుదుటి వీరపట్టంబులు♦మదము
దిగ్గజమ్ములపట్టంబు♦ తెఱఁగు దాల్చి,ముందఱికిఁ బ్రక్కలకుఁ గాంతి♦మొనయుచుండ.
తే॥ పొలయలుకవహియించిన♦పూవుఁబోండ్ల,పదములకు మ్రొక్కని కిరీట♦పంక్తి కాంతి
భాస్కరుని గెల్చి మించిన♦పగిది నిరుల, తోరపుం గుంపులను వెలి♦దోలుచుండ.
తే॥ స్వర్గ మర్త్య పాతాళముల్♦నరవి గెలిచి, లీలఁదాల్చిన విజయమా♦లికలతోడ
చెలుల దృష్టులచేఁ జాల♦చెలువుగులుకు, తుమ్మి పూమాల యురమున♦నెమ్మిఁదాల్చి.
తే॥ పురికి నగడితగా నున్న♦శరధి యినుక,కాలమును మానములు విద్య♦కలిమి యుపమ
పడవు పంచభూతమ్ములు♦చెడినఁ జెడని, యశముఁ బోలిన తూణీర♦మమరఁదాల్చి.
తే॥ఒక్క మొగిమూఁడులోకంబు♦లెక్కసనువ, హింపఁగలయదితురగరా♦హిత్యమయ్యు
తలఁపు మాత్రానఁ బోనంగఁ♦దగిన తేరు, రమ్మనిన యంతవచ్చి య♦గ్రమున నిలిచె.

చ॥ అమృతముతోడఁ బుట్టినవి ♦ యర్క జవాశ్వ కులంబులోని వం
గముగ మరుత్తుచే బడబ ♦ గర్భమునం జనియించినట్టి వ
భ్రమున జలంబునం దనల ♦ వాయు పథంబులఁ బోవునట్టి వా
చ్చెము గనరాని యశ్వములు ♦ చెల్వుగవేయి రథంబు లాగఁగన్.

సీ॥ కనక దిగ్గజ కంఠ♦ఘంటికా నిభములౌ, గంటలు వేకోట్లు♦గలిగినయది
అండంబులను విక్ర♦యమునకుఁ గొనఁజాలు, వెలలేని మణులచే♦వెలసినయది
మునులు సురలు యుద్ధ♦మున నోడువార లౌ, నంగు కైదువుల నె♦సంగినయది
శూలి శూలంబు వి♦ష్ణుని చుట్టుకైదువు, విఱిగిన విఱుగని♦దొఱపుగలది
తే॥ విబుధు లేనియు నూహించి♦విస్తరింప, లేని శిల్ప నైపుణిచే వి♦లింగినయది
సత్యముంబోలె మహిమకుఁ♦జాలినయది, విజయలక్ష్మికి నిలయ మా♦విభుని తేరు
తే॥ అట్టి తేరిని వలగొని♦యసుర విభుఁడు, శాస్త్రరీతి నర్చించి యా♦చక కదంబ
మునకుఁ దృప్తి యాత్రాదాన♦మొనరఁజేసి, వంది మాగధుల్ సేవింప♦నందుచేరె.
తే॥ ఎదల దార్ఢ్యంబుగొనియున్న♦యింద్రముఖ్యు, లప్పు డదిగని చాంచల్య♦మందినారు
ఇంద్రియముల గెల్చిన తాప♦సేంద్రులును స, మస్త జీవులు భీతిల్లి♦మలఁగినారు.

చ॥ సమరము సేయఁబూనితిని ♦ సర్వజగంబులు మెచ్చ నేటి కు
త్క్రమణము తప్పదింక రఘు ♦ రాముననో మఱి నానొ ? ధారుణిన్
కుమిలి నశించుచెల్వ బుధి ♦ కూఁతురొ ? యమ్మయకూఁతురో ? యటం
చమలిన మేఘభీషణ మ ♦ హాధ్వని రావణుఁ డాడె సత్తుఱన్. ౧౨౦౦

సీ॥ పదికుత్తుకల మీఁదఁ♦బదితలల్ బొమిడికి, ములతోడ రవుల చొ♦ప్పున వెలుంగ
నిరువది హస్తంబు♦లిరువది కైదువు, లలరంగఁ దాల్చి ని♦శ్చలత నెసఁగ
భూజనంబులు స్వర్గ♦మునవారు భీతిలఁ, బెకలి నభంబు చీ♦లికలుగాఁగ
శైలముల్ వగులంగ♦నేల బీఁటలు వాఱ, సూర్యుండు తన గతి♦నూటిదప్పఁ
తే॥ జంద్రుఁడమృతంబు చిందించి♦స్రగ్గి కుంద, వేలుపుల విమానంబులు♦వ్రీలి కూల
సింహనాదంబు గావించె♦సిద్ధ సాధ్య, గణము బెదరంగ నా జగ♦త్కంటకుండు.
క॥ ఘోర రణము గలిగినదను, ధీరతతో శింజినీ రు♦తిం గావించెన్
మీఱిన భయమున ఖేచర, దారలు దమ సూత్రములను♦తడవికొనంగన్.
సీ॥ ఇన శశాంకులు చలి♦యించెడు తెఱఁగు చూ, పించు పాథోరాశి♦మించిపొంగఁ
గల చరాచరములు♦గందరగోళంబు, నొంద ననంతుండు♦కుంది కుమిలి
శిరములు వే విది♦ర్చికొని భూమికి లేచి, వచ్చెనా నసురాడి♦వచ్చె ననిఁ
గన్నులు బడబాగ్ని♦కంటె మిక్కిలి గ్రాల, వచ్చిన రావణు♦వైనమునకు
తే॥ ప్రాణివర్గంబు కలఁత ని♦ర్జరుల చింత, పర్వతావనీ గగన వి♦భ్రమణ రీతి
జలధి చలనంబు రవి సుతా♦దులు గ్రహించి, యేమి కారణమని శంక♦నెనసినారు.
తే॥ అండగోళమే పగిలిన♦దనఁగఁ దోఁచు, గొప్పశబ్దంబు తడఁబాటు♦గొంప లెరియు
కాలమునఁబుట్టు కలఁతయుఁ♦గలిగెననుచుఁ, గతము నెఱుఁగక లేచె న♦క్కపిచయంబు.
తే॥ సాగరములును శైలముల్♦జలదములును, స్వర్ణగిరియును నభమున♦జరుగు కరణిఁ
దోఁపఁ దేరెక్కి బంతి కు♦త్తుకల వాఁడు, బలముతో వచ్చు నాకల♦కలము గనిరి.

మ॥ కని భూనాయక లెమ్ము లెమ్ము దనుజ ♦ క్ష్మాపాలవర్యుండు తా
ననిసేయం దమకించి వచ్చెఁ దన సై ♦ న్యాగ్రియ భాగంబు కా
సెను శాఖామృగముల్ భయంబునఁ జలిం ♦ చెన్ వేలుపుల్ తెల్వి మా
లిన వారైరని యవ్విభీషణుఁడు తె ♦ ల్పెన్ రామ భూజానికిన్.

౩౫. రామ రథారోహణ పటలము. (౨౭)

మ॥ కరముల్ మోడిచి నోళ్లు లెండఁ దనువుల్ ♦ కంపింప బెగ్గిల్లుచున్
వెరఁ దబ్బిబ్బును పొందు కీశచయమున్ ♦ వీక్షించి రాముండికన్
వెరఁగుం బొందకుఁడంచు లేచె విబుధుల్ ♦ వేఁడంగ దుగ్ధాబ్ధిపై
నురగేశాసుని సెజ్జ వీడు తఱి ను ♦ ద్యోతించు చందంబునన్. ౧౨౦౭
ఉ॥ లేచి కృతాంతు వాలమును ♦ లిక్కగఁ దెల్పు నరాజిఁ జెక్క నా
ఖేచరపాళికిన్ భువన ♦ కీర్తిత పూతకు సీతకున్ సదా
తోఁచు మహార్తియున్ జలధి ♦ నీఁదఁగఁ దెప్ప లభించె నేఁటికిన్
జూచుచు నుండుఁడీ రణము ♦ శోభిలు పద్ధతి యంచుఁ బల్కుచున్.

ఉ॥ రాముని దేహముం గవచ ♦ రాజము గప్పినదంచుఁ జెప్పఁగా
నేమిఫలంబు? భావమున ♦ నెంచిన మాత్ర సమస్త వస్తువుల్
రామునిచేరు వేఱొకటి ♦ రాముఁడు లేనిది లేదు సర్వముం
రాముఁడె కాఁగఁ గంకటము ♦ రాముఁడు కాదొకొ మాటలేటికిం?

తే॥ హస్తములకు నంగుళులకు♦నమరఁ గవచ, ములను తొడిగి జగమ్ములఁ♦గలుగు ద్రవ్య
ముల విధంబున మితిలేని♦యలుఁగులు గల, శరధి వీఁపునఁ దాల్చె దా♦శరథి యపుడు.

ఉ॥ నిర్జరులార! సంగరము♦నేఁటికిఁ బూర్తిని జెందు మీకు నా
దుర్జనుచే భయంబు నిఁక♦దీరెను రాక్షసు నోర్వఁ గయ్యపుం
గర్జమునందు రాముఁ డెస ♦ కంబున నుండఁగ మీరథంబు నిం
దూర్జిత సత్త్వుఁ డాతనికి♦నొప్పుగ నంచు భవుండు తెల్పఁగన్. ౧౨౧

చ॥ సురలును సమ్మతింప బల ♦ సూదనుఁ డయ్యెడ నారథంబు శ్రీ
వరునకు నాలయంబుగను ♦ భక్తి నొసర్చెదనంచు మాతలిం
బరఁగ నలంకృతుల్ సలిపి ♦ వైళమ తెమ్మనఁ దెచ్చె నాతఁడుం
బరమ శివుండు బ్రహ్మయును ♦ భావములం బ్రమదంబు నొందఁగన్.

సీ॥ చందురు బింబంబు♦క్రింది పఱపుగాఁగ, సున్న చందంబున♦నుల్లసిల్లి
కులపర్వతముల యు♦క్కును గల శిఖరంబు, తక్క నంగంబులు♦ద్రఢిమగలిగి
వర్షర్తు మాస ది♦వారాత్ర భూత భ, విష్య త్కృతాంగ సం♦వితతినొప్పి
తారకాహార య♦న్త్రంబయి యష్ట మహా నాగ పాశ సం♦దానితమయి

తే॥ దెసలె ప్రక్కలుగా మేఘ♦వినరమే వ, తాకలుగఁ బంచభూత స♦త్త్వంబు నమరి
ప్రళయ జలధి ఘోషమె నేమి♦రవముగాఁగ, నడరు నింద్రుని తేరు పు♦ణ్యములసొగు.

సీ॥ నలువ పుట్టిన విష్ణు♦నాభి పద్మంబును, పోలిన నాణెంపు♦ముగ్గ లమరి
జగదుదరుని శేష♦శయ్య యంతటి పఱ, పంది వేదంబులు♦యజ్ఞములును
సాగరంబులు కుల♦శైలముల్ భువనముల్, త్రేతాగ్నులును పంచ♦భూతములును
తపము లింద్రియములు♦దశదిశల్ రేయియుఁ, బగలు గుఱ్ఱాలుగాఁ♦బరిఢవిల్లి

తే॥ నిలుచు తేరిని కని మ్రొక్కి♦నిర్జరాలి, ప్రభుని యాజ్ఞను వచ్చితి♦రామ విభున
కని జయము గూర్చి మమ్మను♦మనుపు మనుచుఁ, బ్రనవములు చల్లి పూజించి♦పంపిరంత.

చ॥ మాతలి చోదితంబయి వి♦మాన పథంబున నుండి కర్మ సం
ఘాత విరోధి జ్ఞానమనఁ ♦ గ్రాలుచుఁ జిత్తముఁబోలి వేగ వి
ఖ్యాతి యొసంగు తేరు పడి ♦ నాఁ బఱతెంచి మహీజ చిత్త కం
జాత దినేశు సన్నిధిని ♦ చయ్యన వ్రాలె ఖగేంద్రు కైవడిన్.

ఉ॥ అర్యము తేరుగాదు విల ♦ యానల కాంతియుఁగాదు భూమిభృ
ద్వర్యము గాదజాదుల న ♦ వారణ ఘోషయు విమానమేమొ? యే

కార్యముపొంటె నేరు కడఁ♦కం దగ నంపి రెవండవీవు? ప్రా
చుర్యము గాఁగఁ జెల్పుమనఁ ♦ జోదకుఁ డార్యున కంత నిట్లనున్.

ఉ॥ ఓమహనీయ భాస్కర కు ♦ లోదధి సోమ! గుణాభిరామ! శ్రీ
రామ! నిశాచరాన్వయ వి ♦ రామ! పురారియు ధాత తొల్లి సు
త్రాముని కిచ్చి రీ రథము ♦ దార్ఢ్యముచే జగమెల్ల మెచ్చ ను
ద్దామ జవంబు నొందినది ♦ దాశరథీ! విహరింపు దీనిపై. ౧౨౧౭

సీ॥ కామ రూపంబును♦కామ సంచారంబు, గలయది వెన్నుని♦కడుపువంటి
పఱపయి సీతూపు♦పడిగల్గి యొద గాలి, కనులను బ్రమింగఁ జా♦లినది దివియు
భువియును భేదంబు♦పొరయని దగ్నిని, జలమునందును పోవఁ ♦ జాలినయది
సాగరంబులు భూమి♦జగములు స్థితులలో, మార్పొందు నట్టిది♦మాఱకుండు
తే॥ నలువ చిలువతాలుపు వేలు ♦ పులును మునులు, శ్రద్ధమెయిఁ జెల్ప మఘవుండు ♦ సాంద్రభక్తిఁ
బంపె నిందెక్కి నీ పగ♦వాని గెలువు, మనుచు నశ్వహృదయ చణుఁ♦డానరఁ బలుక.

మ॥ దనుజాధీశ్వరు మాయయో యనుచుఁ జి♦త్తంబందు సీతేశ్వరుం
డనుమానింపఁగ రథ్యముల్ నిగమ వా ♦ క్యశ్రేణిఁ బ్రార్థించి యీ
తని వాక్యంబుల నమ్ముఁడీ యితఁడు వృ♦త్రద్వేషి వోథ్యుండు నీ
యనుజన్మంబలె నుండు మాతలిచుమీ ♦ యంచుం బ్రశంసింపఁగన్.

మ॥ అనుజుండున్ హనుమ ద్విభీషణులు న ♦ త్యంబిద్ది నిశ్శంకమా
నన దుష్కర్మము లెండ సత్కృతులు న ♦ వ్యగ్రీతి మిట్టాడఁ బొ
ల్పున నవ్వేల్పుల కేలుమోడ్పు లెసఁగన్ ♦ భూదారుఁ డా తేరు మె
ల్పున నారోహణ మాచరించె జగముల్ ♦ మోదంబునం బొందఁగన్.

## ౩౬. రావణ వధ పటలము. (౨౫౩)

భుజంగప్రయాతము॥
జగద్వీరుఁడౌ రామ♦చంద్రుండు ప్రీతిన్, నగరాతి తేరెక్కి♦నం గాంచి దివ్యుల్
ఖగాధీశ్వరు న్మాని♦కాకుత్స్థుపై నా, శుగాత్మాంశు పైనిం బ్ర♦సూనాలి చల్లన్.

ఆ॥ తేరు నడచుఁగాక ♦ దివ్యుల బలములు, రాముఁ జెందుఁగాక ♦ రావణుండు
చచ్చుఁగాక దనుజ ♦ జాయ లేడ్తురుగాక, యనుచు నమరవర్యు ♦ లాడుచుండ.

ఉ॥ రాముఁడు తేరిపైఁ గదలె ♦ రావణుఁ డయ్యది గాంచి మండి సు
త్రాముని మీఁది కిన్కను ర ♦ దంబులు గీటుచుఁ దేరు సంగరో
ద్దాముని మీఁదికిం జన న ♦ దల్పుచు సారథి రేపి ఘోర సం
గ్రామము సేయు కోర్కి తన ♦ రన్ బలిపించెను గాలిపై వడిన్. ౧౨౨౩

ఉ॥ ఇచ్చిరి తేరు వేల్పులు ది ♦ నేశ కులేశున కింక రాముఁడే
వ్రచ్చు దశాస్యునంచు ముని♦పాటిన కీశులు ధీరచిత్తులై
వచ్చి గిరీంద్రముల్ శిలలు ♦ వైచిరి రావణుమీఁద నాతఁడున్
జెచ్చెర వానిఁద్రుంచి యొక ♦ సింహరవం బొనరించు నంతటన్.

చ॥ చెవులను చిల్లు లేర్పడఁగ ♦ శింజిని రావము సింహానాదముల్
దవులఁగ శంఖ దుందుభి మృ ♦ దంగ రవంబులు కాహళ ధ్వనుల్
వివిధములైన గర్జనలు ♦ వెల్వడ దిక్కులతో నజాండమే
పవిలిన చందమై స్వనము♦పర్వె జగంబులు చేష్ట దక్కఁగన్. ౧౨౨౫

తే॥ మాతలిం గాంచి రాముండు♦మహిత చరిత! యుత్సహించిన శాత్రవో♦ద్యోగవిధము
నదను నాయభిప్రాయంబు♦నల్ల నెఱిఁగి, తేరు నడపుము గాకని♦తెలుప నతఁడు.

ఉ॥ నీతలఁపున్ దురంగముల ♦ నేర్పును శత్రుల చిత్తమున్ రణ
స్ఫాతియుఁ దారతమ్యమును ♦ సంకటపా టనుకూలపాటు మీ
నీతియుఁ బట్టుపట్టు గమ ♦ నించి చరించినఁగాక నాదు వి
ద్యాతిశయంబు సార్థమగు ♦ నా? యని తృప్తుని చేసె రాఘవున్.

తే॥ ఇంద్ర రథముపై రాఘవుఁ♦డేగుదెంచె, నిరువురకు మీకు ఘోరసం♦గరము జరగు
నేను సాక్షినై యుండంగ♦నేల? యేమి, యాజ్ఞయని మహోదరుఁడు ద♦శాస్యు నడిగె.

ఉ॥ సింగము దంతిపై కుఱుకు ♦ చెల్వున దూఁకెద రాము మీఁదికిన్
బొంగడఁగించెదన్ సురల ♦ పొంగును క్రుంగఁగ నీవు లక్ష్మణుం
సంగరమం దెదిర్చిన ని ♦ జంబుగ నాకు జయం బొసంగు దా
యంగునఁ జెంగనీక తెగ♦టార్చుము వాని ననంగ నాతఁడున్. ౧౨౨౯

—: రామునిచే మహోదరుండు కూలుట :—

చ॥ మరలి మహోదరుండు చను ♦ మార్గమునం దెదురైన రామ భూ
వరుఁగని యీనృపాలకుని ♦ పైకి రథంబును పోవనిమ్మనన్
వెరవరియైన సారథియు ♦ వీఱిఁడివైయి చననేల? పంక్తి కం
ధరు లొక వేవురైరి చనిన ♦ దాశరథిం జెనకంగ నేర్తురే! ౧౨౩౦

ఉ॥ వాని గభీర ధైర్యమును ♦ వాసి ముఖస్థితి నుంత కాంచుచో
వానిఁ దొలంగిపోవుటయె ♦ వారని క్షేమ పథంబు నావుడున్
వాని మహోదరుండు గని ♦ ప్రల్లద మాడెద వోరి నాదు కో
పానకుఁ బాత్రమై బ్రదికి ♦ బట్టయుఁ గట్టెదవే దురాత్మకా! ౧౨౩౧

ఉ॥ నీదగు కుత్తుకం గోటికి ♦ నెత్తురు ద్రావిన దోసమున్నదే?
పైదలిఁ బోలువాఁడవని ♦ పల్కిన వాఁడుఁ గిచుక్కు నాకసీ

తా దయితుం గుఱించి యర ♦ దంబును తోలెను వారికయ్యెడన్
మోదన ఖేదనమ్ములుగ ♦ ముమ్మరమైన దురంబు సంధిలెన్. ౧౨౩౨

తే॥ వారువంబులు తేరులు♦వారణములు, వీరభటులును గలసైన్య♦వారిరాశి
రామశర బడబావహ్ని♦ద్రావివైచె,(దుటి మహోదరుఁ డొంటియై♦దొరయ నిలిచె.

తే॥ ధ్వజముపైఁ దేరిపై వాఁగె♦పట్టియున్న, యోధపై వాఁడు సాయక♦పూరమొదవఁ
జేసి దిక్కులు వ్రీల గ♦ర్జించె రామ, విభుఁడు మందహాసంబు గా♦వించె సరవి.

చ॥ భవ నముఁడొక్క బాణమున ♦ వాని శరాసముఁ ద్రుంచి రెంటిచేఁ
గవచముఁ జించి వెంట భుజ♦గంబులఁ బోలిన కేలుఁ ద్రెంచి దా
దవులఁ బడంగఁ దచ్ఛిరము ♦ దారుణరీతిగ నుత్తరించె దా
నవుని తలంపు లొండయిన ♦ నాశిల వేఱొకటయ్యె నయ్యెడన్. ౧౨౩౫

పంచచా॥ మహోదరుండు ద్రెవ్వఁ గాంచి ♦ మానవాదుఁ డుగ్రుఁడై
యహోయటంచుఁ దేరు దోల ♦ నాజ్ఞచేయ రాఘవుం
డోహో సమస్తసేన చావ ♦ కున్న వాఁడు లొంగడం
చుహూంకృతిం భజించునంత ♦ నుత్తరించె వారలన్. ౧౨౩౬

సీ॥ అత్తఱిఁ గలిగె లం♦కాధినాథునకు దు, శ్శకునముల్ గొన్నియు♦త్సాహమడఁగ
నండంబులను ముంచు♦నట్టు లుప్పొంగెడు, వననిధు లెల్లను♦వట్టిపోవఁ
జండవాయువు వీవఁ♦జలియించు పర్వత, సరణి నా నెడనుభు♦జంబు లదరెఁ
బిడుగులు రాలెను♦భీకరంబుగ రక్త, వర్షంబు గురిసె వా♦ర్వములు వడఁకె

తే॥ ప్రభలు దక్కిన సూర్యుని♦పరిధి చుట్టె, నాల్క లెండెను వింటికో♦సలును విఱిగెఁ
బుష్పమాలిక లందుండి♦పొలచు వీచె, గృధ్రములు వ్రాలె వీణె టె♦క్కెయముమీఁద.

తే॥ తురగముల కన్నులందుండి♦తొఱఁగె నీరు, కరులు బురదలో దిగఁబడు♦కరణి నొందె
మనుజులా గెల్వ వారని♦దనుజ విభుఁడు, వాని లెక్కింపఁడయ్యె గ♦ర్వంబు కలిమి.

తే॥ విలయ వాయువుచే జగ♦ద్వీథియందు, గలుగు వస్తువుల్ చెదరిన♦కరణి దనుజ
వరుని రథవేగమునకు వా♦నరులు చెదరి, విమతులై భీతిగొని త్రోవ♦విడిచినారు.

సీ॥ కర్మంబు జ్ఞానంబు♦కరణి నవిద్యయు, విద్యయు శేషుండు ♦ విహగరాజు
రాత్రియుఁ బవలు హి♦రణ్యకశిపు నృసిం, హులఁబోలె దిగ్గజ♦యుగళి యట్లు
ఎవఁ డాదిదేవుఁ డం♦చెదిరించి పోరిన, రుద్రాచ్యుతుల కేన♦రోషమడర
దశకంధరుండును♦దశరథసూనుండు, రణరంగమున మహా♦రంభులైరి

తే॥ కాంచుచున్నట్టి రుద్ర వి♦రించులకును, కరతలంబులు మిక్కిలి♦కంపమొంద
రావణుఁడు శంఖమొత్తె ని♦ర్జరులు బెగడ, రాముఁడును పాంచజన్యంబు♦రమణనూఁదె.

తే॥ శ్రీశు పంచాయుధంబులు♦సేవసేయఁ, గోరి రాముని సన్నిధిఁ♦గొలిచి నిలిచె
వేదములు తన్నెఱుంగని♦విధిని రామ, చంద్రవిభుఁడును వానిఁ గాం♦చకయ యుండె.

తే॥ దిక్కులునుజలధులుధరి♦త్రియునభంబు, కులమహీధ్రములు బ్రహ్మాండ♦గోళమునర
దాశరథికి సారథియయి♦తనరుచున్న, మాతలియు నింద్రు చింద మిం♦న్మాడిగనె.

తే॥ రావణుఁడు వడిసేయు నా♦రాచ వితతి, సోకుటకు మున్నె ఖేచర♦శ్రీకటాక్ష
చయ మనంతమై శ్రీరామ♦చంద్ర విభుని, భుజయుగళి సోఁకె నేమి కాఁ♦బోవు ననుచు.

క॥ ఇరు రథములందు పూన్చిన, తురగములు పరస్పరంబు♦తూఁకొని లోకో
త్కరముల భ్రమింగం జాలిన, సరభస కోపమునఁ జూచె♦నకిలింతలతోన్. ౧౪౪౪

క॥ దానవ నాథుని వీణా, గాన చణతఁ దెలుపు క్రమ♦కలిత ధ్వజముల్
మానవనాథుని తేరునఁ, బూనుచు నింద్రధ్వజంబుఁ♦బొరిపొరి మోఁదెన్.

క॥ దనుజవిభు శింజినీధ్వని, వననిధి సప్తకముఁ గలఁచి♦వైచినయది య
మ్మనుజ విభుని జ్యానినదము, వనజభవాండములఁ గలఁచి♦వైచెను తోడ్తోన్.

క॥ హనుమంతుఁ డాదిగాఁ గల, వనచరు లెది సేయుటకును♦పాల్పోవక న
ల్కొని యూరక నిశ్చేష్టత, గొని చూచుచునుండి వారి♦ ఘోర రణంబుల్.

క॥ వెరఁగంది విబుధ వరులె, వ్వరు గెల్తురో యనుచు నెఱుఁగ ♦ వలను పడక ని
బ్బరము చెడి యుందు నందుం, దిరుగుచు మీఁదెఱుఁగలేక ♦ తెరలిరి భీతిన్.

తే॥ రామ శరము లంబరమున♦రాణనిండ, వేలుపులు చల్లుచుండిన♦విరులచే న
లంకృతంబులై రాజిల్లు ♦ లలినితోఁచె, దుష్టులకుఁ దోడుపడునట్టి♦తుచ్ఛు లెవరు!

తే॥ వీరశేఖరుఁడగు రామ♦విభుని ధనువు, పరులు తాఁకఁగ లేని రా♦వణుని ధనువు
మింట నింద్ర చాపద్వయి♦మెఱసి యెదిరి, నిలుచు చందాన మిఱుమిట్లు♦గొలుపుచుండె.

తే॥ నాఁడు లంకాధినాథుం డొ♦నర్చినట్టి, శింజినీ రావమును గొప్ప♦సింహరవము
నేఁటికిం దెల్పుఁ బో యను♦నియతినొంది, జలదములు జలధులును ఘూ♦ర్ణిలను నించు.

తే॥ దనుజనాథుని తీక్ష్ణంపుఁ♦గనులనుండి, చెదరి వెలువడి మిణుఁగురుల్ ♦చిటపటమని
నింగి కెగయుంగ నందుండు♦నీరదములు, కరఁగి వలవల రాలెను♦ధరణిమీఁద.

తే॥ కలఁగె దిక్కులు జలధులు♦కలఁగె నురల, గాలు గేలును కలఁగె లం♦కయుఁ గలంగె
కలఁగ దయ్యెను రాముని♦కడఁక నుంత, రావణుని యట్టిహీన దు♦ర్గలితచేష్ట.

తే॥ ధరణియందును మెఱపులు♦పరవునట్లు, జలదములనుండి పిడుగులు♦జాఱునట్లు
కదనమున వైచు కైదువుల్ ♦కాంతి చయము, ప్రక్కలం జోరఁ బలపల♦రాలుచుండె.

—: రామ రావణ సమరము :—

తే॥ విల్లుగొని చంపఁ గోరక♦తల్లడిల్ల, రాము రథములతోఁ బైకె త్తి♦భ్రమయఁద్రిప్పి
భూమిపై మోఁది మోఁది చం♦పుదునటంచు, దలఁచుఁబదరు నిదానించు♦దశముఖుండు.

క॥ మెఱపులవలె దశ దిశలన్, మెఱయుచు వడిసేగు సెలల♦మెలపునఁ దేరిం
బరియలుగఁ జేసి వీనిం, జెఱగొందున యని తలంచుఁ♦జిత్తములోనన్. ౧౪౫౯

తే॥ పదరుచున్న మనస్సును♦గొదరుచున్న, కనలు మిడుఁగుఱు ల్లీచెదు♦కనుల చూపు
లొలయ దనుజనాథుఁడు విల్లు♦వెలయ వంచి, పెక్కు మార్గణముల నేసి♦విన్ను గప్పె.

క॥ ఉఱుముల నిప్పులవలె జము, నెఱఁకుల నాటినవి సురల♦నియమంబులఁ జెం
పఱఁ జేసినవి ఫణీంద్రుని, రొయిఱపుం బోలిన శరమ్ము♦లుక్కఱ నేసెన్.

క॥ మేరువును తొలిచి యంతన్, వారక యండములఁ జీల్చి♦పైకొను నంచా
ధోరణి సుర లనుకొన్నవి, శ్రీరాముఁడు చెంగనీక♦చెలగె న్నడుమన్.

తే॥ బలయుతుని పని దుష్కర్మ♦ఫలముచేత, నడుమఁ జెడినట్లు లంకాధి♦నాథు విశిఖ
వితతి నడుమన విఱుగంగ♦విసుగు లేక, విలయ జలదంబు లలి శర♦వృష్టి గురిసె.

తే॥ కప్పె మింటిని దిక్కులఁ♦గప్పె గిరులఁ, గప్పెఁ గన్నులఁ గప్పెను♦కడలిఁ గప్పెఁ
బుడమిఁ గప్పె విజ్ఞానుల♦బుద్ధిఁ గప్పె, నిరులు గప్పె ఖేచరులకు♦మరులు గప్పె.

తే॥ కాలగళుఁడు దక్కఁగఁ జెరల్♦కనులు మూసి, కొనిరి వజ్రభిన్నములగు♦కుధర సమితి
ప్రీలి చెదరుకై వడి వాన♦రాలి చెదరె, నవని విభుఁడు వారల భీతి♦నడఁపనెంచె.

క॥ రామ ధనుర్ముక్త శర, స్తోమమ్ములు పరఁగు టీవి♦తోయము పెరిఁగెన్
గామి దనుజు శరములు దు, ష్కామ కృతఫలంబు వోలెఁ♦గడవడి సమసెన్.

క॥ త్రుటిలో లక్షల కొలఁదిగ, బటుతర శరములను విడిచెఁ♦బలలాశి యటం
దటుకున నడుమన విఱిచెను, చటులోద్ధత విశిఖ తతుల♦జలజాక్షుండున్. ౧౨౬౪

క॥ చండ సమర దక్షుండగు, గండఁడు రావణుఁడు ముసల♦ఖడ్గ ఘనగదా
దండ పరశు శూలాదులఁ, దండంబులు గాఁగఁ బఱపె♦దాశరథిపయిన్. ౧౨౬౫

క॥ మేఘ శ్యామల దేహు న, మోఘ శరము లొక్కటొకటి ♦ మొన వేయింటన్
బ్రాఘొమ మొనర విఱిచెను, శ్లాఘించుచు సురలు కరత♦లంబులఁ జఱవన్. ౧౨౬౬

ఆ॥ ఇట్లు పోరు సమత♦నెనయుచుండఁగ రేఁగి, యీఁటె పోటు గొన్న♦యేన్గు భంగిఁ
బంక్తిముఖుఁడు పట్టి♦పది కేలఁ బది విండ్లు, పదులు పదులుగాఁగఁ♦బఱపె సెలలు.

ఆ॥ రామ విశిఖ తతులు♦రావణ సాయక, తండ మెల్ల రొదల♦నిండుకతనఁ
బోరుగాంచు పంచ♦భూతంబు లాదిగాఁ, బ్రమదపాటు గగురు♦పాటు మూనె

తే॥ అత్తఱిని దశకంఠుని♦స్యందనంబు, మందరమ్మొ మారుతి తెచ్చు♦మందు మలయొ
మొగిఁ ద్రిపురములో గంధర్వ♦నగరమొక్కొ, యనఁగ వ్యోమ పథంబున♦నలరి నిలిచె

తే॥ తేర్పై మింట దనుజుండు♦తెఱపి లేని, బాణవర్షము గురియింపఁ♦బద్మమిత్ర
కులుఁడు చూచుచుండఁగ నే♦కోఁతిమూఁక, చచ్చి చావక తెరలు ద♦శం భజించె

తే॥ రాముఁ డదిగని మననేన♦మ్రాలుచుండె, నింక నాలసించినఁ గార్య♦మిమ్ముదప్పు
వాని మకుట మస్తకముల♦వసుధఁ గూల్తుఁ, దేరు మింటి కరుగనిమ్ము♦సారథి! యన.

తే॥ చిత్రమని మాతలియు నట్లు♦చేయునంత, నలఘు రథమును చంద్ర మం♦డలముపైకి
వచ్చు నినమండలము వోలె♦వచ్చినిలిచెఁ, దేరు తేరెదురై చుట్టె♦దిక్కులందు.

తే॥ వారిదంబులు దెసలకుఁ♦బాఱిపోయె, రిక్కలును పలవల మని♦యుక్కిరాలె
శైలశిఖరము ల్వ్రీలెఁగ దా♦శరథి రథము, రావణ రథంబుఁ జుట్టు నా♦రభసమందు.

తే॥ తిరుగు నిలుచుఁబై కెక్కును♦దిగును తగ్గు, డాపలించి వలపలించి♦దాఁటుచుండ
నద్రి కూటముల్ జలధులు♦సండతండ, ములును కుమ్మరిసారె చో♦వ్వునను దిరిగె.

తే॥ క్షణములో నెటకేనియు♦జరుగుచున్న, రథములం గాంచి సుర లది♦రాము నరద
మిద్ది రావణు రథమని♦యెఱుఁగలేక, యొనరఁ దిరుగుచున్నవి తాఁకు♦చున్న వనిరి.

తే॥ చక్రములు తాఁకఁ, బడని ఋ♦క్షములు నిప్పు, చిందఁ గాలని శైలముల్♦చీలకుండు
దిశలు నెత్తురు గ్రక్కని♦దేహిచయము, కానరాకుండె నాయుద్ధ♦కాలమందు.

సీ॥ చూచుచునున్నట్టి♦ఖేచరులును వారు, నాకలోకమున ను♦న్నార లంద్రు
చంద్రలోకంబునఁ ♦జరియించు వారంద్రు, మందర శైలంబు♦నంది రంద్రు
పాలసంద్రము మీఁదఁ♦బరఁగు వారందురు, జలధుల కవ్వల♦జరగి రంద్రు
ఉత్తర వనరాశి ♦ నున్నవా రందురు, ప్రాగ్దిశఁ జేరిన ♦ వార లంద్రు

తే॥ వారిదంబులయందున్న♦వారలంద్రు, నేఁడు లోక సంహారంబె♦నెగడునంద్రు
బ్రమ్మతెనె తేరు లంద్రు తు♦రంగ తతులు, కావు నిక్కంబు కడనాఁటి♦గాడ్పులంద్రు.

క॥ సప్త ద్వీపములందును, సప్తగిరులయందు సప్త♦జలధులయందుఁ
సప్త జగంబులయందును, తృప్తి గొనక యనిలుఁబోలె♦దిరిగెం దేరుల్. ౧౭౭౮

క॥ పుడమికి వలువగ నొప్పిన, కడలులలో దీవులఁ జ♦గముల గిరుల ని
ల్లడ సొత్తులవలెఁ గైదువు, లడరిపడియె వానపోల్కి♦ననురుండేయఁ. ౧౭౭౯

తే॥ అవియు జగముల నలయించు♦నలవుగలిగి, మలసి రామసాయకముల♦వలననడుమఁ
దునిఁగి తునియలై ధరణిపై♦దొరలెఁ గాక, వేఱుకార్యంబు గావింప♦నేరవయ్యె.

క॥ గిరులవయి శరనిధులవయి, శరదంబులవయిని సకల♦జగములలోనన్
దిరిగిన యరదంబులు వడిఁ, దిరిగి యరిగె లంకపైకి♦దితిజులు బెగడన్. ౧౭౮౧

క॥ సారథులు రేఁచి నడపిన, వారువములు నేదగొనవు♦వాడవు శ్రాంతిం
గూరవు నిలువవు మేఁతయు, గోరవు చెమరింప వడఁగి♦క్రుంగవు త్రుటియున్.

తే॥ భిదురకరుఁ డంపు తేరి న♦భేద్యగరిమ, వఱలు నశని కేతనమును♦పంక్తిముఖుఁడు
నిప్పు లురలెడి కన్నుల♦నెగడఁ జూచి, యర్ధ చంద్ర భల్లంబున♦నవనిఁ గూల్చె.

తే॥ ఆధ్వజంబు పిడుగువోలె♦నంబుధిఁ బడి, మునుఁగఁ గాంచిన యినువక♦డ్డని జలమున
నద్ద నుడికిన వడువున♦నంబురాశి, యుడికి యింకి వట్టినయది♦యుత్కటముగ.

శా॥ నాద బ్రహ్మము కై వడిన్ సతతమున్ నాశంబు లేకుండు శ్రీ
వైదేహీ విభుతేరి సారథిఁ దద శ్వ వ్రాతమున్ గ్రవ్యభు
గ్వ్యాదారుండు నిశాత సాయకములన్ గుప్పించి నొప్పింపఁగా
నాదిత్యాన్వయ వార్ధి సోముఁ డెడ న త్యంతాగ్రహోదగ్రుఁడై.

ఉ॥ తమ్ముని వక్షమందు నిశి తమ్మగు నమ్ములు నాటునాఁటి కం
ఠమ్మదిఁ దాపమొందెను ప్రతిష్ఠత దైత్యుఁడు విల్లు వంచి క్రూ
రమ్ముగ నారసమ్ములను క్రమ్మఁగ నేయఁగ రామచంద్రుడు చం
దమ్మును గానలేమిఁ బ్రమ దమ్మును వీడిరి వేల్పులయ్యెడన్ ౧౨౮౬

ఉ॥ క్రుంచెను కొంతు లగ్నులును కుంభిని నంచలనంబునందె స్తం
భించెను గాలి యొండినవి మేఘసమూహము లార్చిరెల్ల రా
త్రించరు లర్కచంద్రులకుఁ దెర్వులు దప్పెను దిగ్గజంబులున్
వంచెను శీర్షముల్ జగము వాడెను ఘోషము మానె నంబుధుల్.

ఉ॥ మేరువు నంచలించెను † ని మిత్తము దెల్ప విశాఖరిక్ష నం
గారకు డాక్రమించెఁ బ్లవ గ ప్రభు చంద్రుఁడు లక్ష్మణుండు సీ
తారమణున్ రహించి కను దమ్ములఁ గానమి దొడ్డ యూథపుల్
జేరని దంతులట్లు వెతఁ జెందిరి కందిరి యుమ్మలించుచున్. ౧౨౮౮

చ॥ వనచర వర్గముం దలరి వారధి వారిధిఁ గూర్చి కట్టుచో
వనచర బృందముల్ కలఁగు దైనము నొందిరి రాముఁడంత హె
చ్చిన కినుకన్ నిశాత శర చిత్ర మహోత్కట వృష్టిఁ జేసి యా
దనుజుని సాయకంబుల వి దారణ చేసి వెలింగి యయ్యెడన్. ౧౨౮౯

చ॥ అమరులు నుల్లసిల్లఁ బ్లవ గావలి మోదిల జ్ఞానతత్త్వ వి
త్తమగు ధరాత్మజా విభుఁడు దానవనాథుని కేలనున్న చా
పములఁ బదింటిఁ దున్కలు న భంబున కెగఁగఁ ద్రుంచె శాత ఛ
ల్లములు పదింబదిం బఱపి లస్తకముల్ మిగులంగఁ జేతులన్. ౧౨౯౦

తే॥ కడలిపోల్కి గంభీరుఁడౌ గరుడుఁడపుడు దనుజవిభుని కార్ముకములు తునుఁగుచుండ
నిర్జరుల దుశిఖ నికరముల్ నీఁగవచ్చి, తనరె సినవంశ్యు తేరి కేతనముగాఁగ.

చ॥ క్షణమున లోకముల్ దిరుగఁ జాలిన తార్క్ష్యుఁడు రాము తేరిపైఁ
గణఁక వహించి కేతనము గా వెలయంగ నిఁకేల చింత లా

---

† కోసలానాంచ నక్షత్రం వ్యక్త మింద్రాగ్ని దైవతం
ఆక్రమ్యాంగారక స్తస్థౌ విశాఖామపి చాంబరే.
కోసలుల నక్షత్రము ఇంద్రాగ్ని దైవతము అగు విశాఖను అంగారకుఁ డాక్రమించెను అది కోసలుల కరిష్ట దాయకము. (వాల్మీ. యుద్ధ. ౧౦౩ సర్గము 33 శ్లో.)

చణుఁడె యుపేక్షుఁడై నిలుచు ♦ చందమె చాలదె? యంచు నిర్జరుల్
ప్రణుతి యొనర్చి సూనములు ♦ వర్షముగాఁ గురియించి రొప్పుగన్.

క॥ పటుశరముల సీతాహృ, త్పుటవాసి సురారి కవచ ♦ మున నచటచటం
జిటచిటఁ జిటులఁగ రక్తము, జొటజొట వెలువడఁగఁ గొట్టె ♦ సూటి శరములన్.

తే॥ దిశలఁ దాఁకుచు మేఘపం ♦ క్తిని చెదర్చు, శిఖర ముప్పు దైత్యుని పీఁ ♦ సిడము రెండు
సాయకంబుల జానకీ ♦ జాని ద్రేసి, నేల గూల్చెను నిర్జరుల్ ♦ నెగడి పొగడ. ౧౫౯౪

ఉ॥ రావణుఁ డత్తఱిం గదిసి ♦ రాముఁడు తచ్ఛరరాజి నొవ్వమిన్
భావన సేసి యారసిన ♦ భావ్యము గాదని యెంచి యంధకా
రావహమైన దివ్యశర ♦ మాత్మఁ దలంచి భజించి యెత్తి ధా
త్రీవరుపై వడిం బరపె ♦ దివ్యులు కాంచి వెఱం గలంగఁగన్. ౧౫౯౫

సీ॥ అందుండి వెలువడి ♦ నట్టి కొన్నిటి మొగం, బులు తీండ్ర చంద్ర ని ♦ ప్పులను క్రక్కఁ
గొన్నిటి మోములు ♦ క్రొన్నెత్తురు వెలార్చ, సురముఖములు మహా ♦ సుర ముఖములు
భూత ముఖంబులు ♦ భుజగ ముఖంబులు, విషముఖు నించు ది ♦ గ్విభులందు
తరణి చంద్రులఁ గప్పఁ ♦ దమమును కల్పించు, నొకచోట నెండయు ♦ నొసరఁ గూర్చుఁ

తే॥ జండమారుత మొక్కచో ♦ నరగ వీచు, వర్ష మొక్కచోఁ గురియించు ♦ వఱదలొక్క
చోసను గల్పించుఁ బిడుగులఁ ♦ దివిరి రాల్చు, భ్రాంతి గలిగించి ముంచు సం ♦ గ్రామభూమి.

చ॥ ఇరులు సమస్తముం బొదువ ♦ నెల్లరు పాపఫలంబుఁ బొందు పై
ఖరిని కలంకనొంద జన ♦ కాంతుఁడు పాశుపతంబు సేయ నా
యిరులు తొలంగ లోకముల ♦ కెల్లను స్వప్నమువో మెలంకువల్
పొరసిన చందమై వెలసెఁ ♦ బుణ్యఫలం బనుభూతియౌ గతిన్. ౧౫౯౬

ఉ॥ సత్యము సన్నిధిం జెడు న ♦ సత్యము కైవడి నమ్మహాస్త్ర మా
దిత్య కులేశుచేఁ జెడఁ బ్ర ♦ దీప్త రుషార్తిని పండ్లు గీఁటుచున్
దైత్యవిభుండు రాముపయి ♦ దారుణ బాణము లేసి చేసె నా
దిత్యులు బెగ్గడిల్ల జల ♦ ధి ప్రతిమాన మృగేంద్ర నాదమున్. ౧౫౯౭

తే॥ నింగి వారల కీర్తుల ♦ మ్రింగినదియు, జముని కడుపు నింపినది వా ♦ సవుని కడలు
గూర్చినదియు విద్విడ్భృశా ♦ ఘోరతరము, నైన యాసురాస్త్రము సేసె ♦ దానవుండు.

శా॥ ఆయస్త్రంబు మహోగ్ర రూపమునఁ ద ♦ న్నంటించు బాణౌఘముం
బాయం ద్రోచుచు రామసన్నిధికిఁ బో ♦ వం జూచి గీర్వాణు లె
ట్లో యంచుం దపియింప రాఘవుఁడు సం ♦ యోజించి నిర్భీతి నా
గ్నేయాస్త్రంబున నాసురాస్త్రమును క్రుం ♦ గించెం గవుల్ హాయనన్.

చ॥ శమనుఁడు జంకినన్ గడిమి ♦ జంకక వార్ధులఁ గ్రోలఁజాలి భూ
ధ్రములను నుగ్గు సేయుచు న ♦ దాగతి గల్పఁగఁ జాలు సత్త్రు బ్బం

దములను దైత్యవల్లభుఁడు ♦ దాశరథిన్ వడిఁ గప్పివైచె నా
క్రమమును గాంచి వేల్పులు భ ♦ రమ్మగు భీతి భజించి రొక్కటన్.

ఉ॥ కొందఱు హస్తలాఘవముఁ ♦ గొందఱు మాయబలంబు స్థైర్యమున్
గొందఱు దైత్యకోపమును ♦ గోరి నుతింపఁగఁ గొందఱింక మా
యం దులకింప పీలు గల ♦ దా యని కొందఱు పూర్వమున్నఁడున్
గ్రందగు నిట్టి కయ్యమును ♦ గానమ యంచు వచించుచుండఁగన్.

క॥ ఇన కులజుఁడు గగనము గ, ప్పిన క్రూరాస్త్రంబులెల్ల ♦ భేదిల్ల వెసన్
ఘన శరములఁ దునిమి వెలిం, గెను తమ మడఁచిన ప్రచండ ♦ కిరణునిపోలెన్.

క॥ అధిక తపో బలయుత సుర, మథనుఁడు బహుసంగరముల ♦ మలసిన యమర
ప్రధనమున గెలుపు నొనఁగిన, క్రథనాద్భుత శీలమయ శ ♦ రంబును పఱపెన్.

క॥ స్రుక్కిరి త్రిదశులు లోకము, లుక్కఱెనని చచ్చితిమని ♦ యార్చుచుఁ బ్లవగుల్
మక్కి దెసలకుం బరుగిడి, రక్కకుత్థ్సుఁడును దాని ♦ యంతర మెఱిఁగెన్. ౧౩౦౫

క॥ భూమిని రాముని జీవిత, మే మునిఁగిన దన్న వగిది ♦ నెనఁగిన శరమున్
రాముఁడు గాంధర్వాస్త్రము, చే మాలిచి నడుమ ఁజీల్చి ♦ చిందఱచేసెన్. ౧౩౦౬

క॥ వికటించిన మధుఁడు హిర, ణ్యకశిపుఁడు జగత్త్రయం బ ♦ ణంచినయది పూ
నిక నలువ రొనఁగినది యగు, ప్రకృష్ట దండంబు నస్త్రి ♦ రావణుఁ డేసెన్. ౧౩౦౭

తే॥ మును పుతారకాసురుఁడు వేల్పుల మొగములఁ, గుతిలపడదాని చేతనే ♦ చితుకఁ గొట్టెఁ
గల్పకాలంబు దనుక జ ♦ గంబులెల్లఁ, జేరి దొరలింప దొరలని ♦ చేవగలది. ౧౩౦౮

క॥ అండము జలఘటముం బలె, ఖండములై కూలునని జ ♦ గంబులు కలఁగన్
దండము చండగతిని కో, దండధరుని సన్నిధికిని ♦ దాయఁగవచ్చెన్. ౧౩౦౯

క॥ కమలాక్షుఁడు కని యా దం, డము నింద్రుని వే గనుల క ♦ డంగక శత ప
త్త్రము మొగ్గను పోలిన య, స్త్రము వైచి తొనర్చె వేయి ♦ శకలంబులుగన్.

క॥ చండతరంబుగఁ గార్ముక, పాండిత్యముఁ జూపు రాముఁ ♦ బరిమార్పని యీ
దండాట లేల యని పొల, దిండియు మాయాస్త్రమున వ ♦ ధింపఁ దలంచెన్.

దండకము॥

పూజించి యుగ్రాక్షుఁ గీర్తించి చందంబు న్యాసంబు విధ్యుక్త ధర్మంబుతో సేవ గా
వించి మాయాస్త్రమున్ వింట సంధించి శ్రీరాముపై నేయ నాయస్త్ర మాయా
విధిం జేసి పూర్వంబు శ్రీరామ సౌమిత్రి బాణంబులన్ ధారణిం గూలియున్నట్టి
దైతేయులున్ లేచి హార్యత్తు నాదంబు గావించి రాయింద్ర జిత్తు న్నికుంభుండు
కుంభుండు సేనానులున్ మిన్నుమన్నున్ వెసంగప్పి రా కుంభకర్ణుండు గాన్పించి
బిట్టార్చె సంగ్రామ రంగంబునందుం దురంగ ప్రజంబున్ శతాంగోచ్చయ శ్రేణి

సారంగ సంఘంబులుం జేరి పేపెల్లువల్ శంభుచేతన్ వరంబంది ప్రాణంబులం బొంది యింపారఁగా లేచు చందంబునన్ లేచి బృందారక వ్రాతముల్ చూడ దిగ్భ్రాంతి గల్గించి మున్ గెల్చు నవ్వీరులం బిల్చి మాశక్తిఁ జూడుండు మమ్మోడ మోడించి నారంచుఁ జేరెత్తి రారండు ఖండాలుగాఁ గోసి పిండాలుగాఁ జేసి వేభ్రమింగకే పోదుమే యంచు నిట్టార్చటింపంగ నాగంబులా భోగి లోకంబు నందుండి ధాత్రిన్ విదారించు కొంచిట్టు లేతెంచె నా నొప్పి భూతంబులున్ శాకినీ డాకినీ ప్రేతరాసుల్ జనించెన్ దమంబందు జన్మించి ధర్మంబులన్ మ్రాల్చు సత్త్వాఢ్యులున్ ధామసత్త్రంబుతో నాయుధస్తోమముం బట్టి చిత్రంబుగాఁ గ్రాల దంష్ట్రారుచుల్ బాలచంద్రాకృతిన్ వ్రాల దిగ్దేశముల్ నిండి సింగంబులం బోలి గర్జించి చోగంటులం బోలి వావిప్పి నానావిధాభీల జాజ్వల్య మానానల జ్వాలలం జింద వీక్షించుచున్ దూషణ ద్వేషణోద్భీషణ స్ఫార దుర్భాషణంబుల్ ప్రపంచించుచుండన్ రఘుస్వామి వీక్షించి యేమాయయో నీకు భావంబునం దోఁచునే నిన్ విచారించి వాక్రుత్తువే యన్న నవ్వోఢయున్ దేవదేవేశ! యీదేవ విద్వేషి కర్మారు వేశ్మంబునన్ నూదు లమ్మంగ నేతెంచు వానిం బలెం బూని నీమీఁద మాయాస్త్ర మిట్లేసి క్షోభింపఁగాఁ జేయ భావించియున్నాఁడు నీపేరు విన్నంత నీనామ మన్నంత భావించి నంతం బటాపంచలై పోవుఁ బాపంబు లెల్లన్ జగన్నాయకా! నిన్ను నీమాయ యేమేని కావింపఁగాఁ జాలునే? నీదుమాయం దరింపంగ మౌనీంద్రులున్ నేరరన్నన్ విదేహాత్మజానాథుఁ డాఁగాక యీమాయ యేదేని యౌఁగాక యంచున్ విచారించి జ్ఞానాస్త్రమున్ వింట సంధించి యేయంగ ధర్మంబు ద్రోవన్ జనన్ జ్ఞాన సంపత్తి నజ్ఞాన బంధంబుల న్నీఁగు లాగై జగంబెల్ల విభ్రాంతిఁ బోనాడి స్వాస్థ్యంబు నొందెన్. ౧౩౧.౨

మ॥ గర కంఠుండు చతుర్ముఖుండును మదిం • గాలుష్యముల్ తీఱ సం
గర మందియ్యెడ లోక కంటకులకుం • గార్శ్యంబు నాశంబు చే
కుఱఁ గాంక్షించుచు నుండ దైత్యుఁడు మహా • క్రూర ప్రభావ స్ఫుర
ద్వర శూలంబును నూటిగా విసరె సీ • తానాథుపై గ్రక్కునన్.

తే॥ విబుధులకు నాకులత గూర్చి • వేయిగంట, లొరసి మొరయు వీరుల బల • యోగ్యతలను
వితరయొనర్చు శూలము లోక • భీకరముగఁ, దొడరి వచ్చుట రామభ • ద్రుండు గాంచె.

తే॥ నెఱసి త్రేతాగ్నులనుమించి • మెఱసి గాడ్పు, దెసలకొదుఁ గంగ జగములు • దిగ్భ్రమింపఁ
గనులు మిఱుమిట్లు గొనవచ్చు • కఠిన శూల, సాధనము గని సురలును • సంచలించి.

తే॥ నీ వినాశంబు మదిగోరి • రావణుండు, వైచె శూలంబు దీనిని • వ్రేఁచి త్రోచు
శక్తి నీకుఁ గా కొరులకు • జగతిలేదు, గెలుము గెలుమని తడఁబడఁ • బలికినారు.

తే॥ పిడుగులును వచ్చుపడిఁ గాంచి • బిడియ పడఁగఁ, దన్ను మఱవక ధ్యానించు • తత్పరులకు
నాస్తికులు సేయుచుండు వి • ఘ్నంబులట్లు, రామశరములు వితయయి • రాలుచుండ.

తే॥ అరసిరాముఁడుదివ్యసా♦యకము లేయ, నవియుడాసిడాయక ముస్న♦యడఁగుచుండఁ
బుణ్యు శాపముం బోలె న♦మోఘగరిమ, శూల మరు దేర నాతఁడు♦చూచె నురక.
తే॥ వేలుపులు దిక్కుతోఁ పక♦వెనవపడిరి, ధర్మదేవత కాళ్లులు♦తడఁబడంగఁ
దన్ను మఱచె రాముఁడు భయ♦దంబుగాఁగ, నడరె శూలమనుచు లోన♦నాకులించె.

శా॥ సంహారోద్యమ మొప్ప శూలము జగ ♦ చ్చాంచల్యముం జేయుచున్
రంహోదగ్రత రామచంద్రు పయికిన్ ♦ రాఁజూచి కాద్రస్థితిన్
సింహ ప్రక్రియ హుంకరింప నది వి ♦ చ్ఛిన్నంబుగాఁ దూలె దు
ర్వ్యాంహో దూషితు యత్నముం బలె సురల్ ♦ బ్రహ్మాదులున్ మోదిలన్.

తే॥ పోయినట్టి ప్రాణంబులఁ♦బొందినక్రియ, నొంది రగచరుల్ ఖేచరు♦లుత్సవంబు
విడిచి యాడిరి పాడిరి♦విరులవాన, గురిసి వేఁడిరి రావణుఁ♦గూల్చు మనుచు.

మ॥ అనివార్యంబగు శూలమున్ దన మహా ♦ హంకార హుంకార భీ
షణ నాదంబున బీఱువో నడఁచె నీ ♦ సంగ్రామ భీమున్ దురం
బున సాధించుట దుష్కరంబను తలం ♦ పుం బొంది దేవారి త
మ్ముని వాక్యంబుఁ దలంచె; దుర్మదమికా ♦ పోకార్చు విజ్ఞానమున్?

మ॥ వరశక్తిన్ శరశక్తి నెల్ల నిచటన్ ♦ వ్యర్థంబు గావించె వీఁ
డరయన్ భర్గుఁడుకాఁడు విష్ణువును కాఁ ♦ డంభోజ సంభూతికాఁ
డిరవారంగఁ దపస్వి కాఁడు జనలో ♦ కేశానుఁడుం గాఁడు దు
స్తర సంసార భవాబ్ధి తారక మహా ♦ తత్త్వంబుగా నెంచెదన్. ౧౩౭౩

మ॥ పరమాత్ముండగుఁగాక వేఱు మఱి యె ♦ వ్వాఁడైన నౌఁగాక ని
ర్భర శౌర్యంబున గెల్చితిన్ జగములన్ ♦ బ్రాంచద్యశం బందితిన్
బిఱుదీయం బనియేమి? గెల్చిన జగ ♦ ద్విఖ్యాతి సిద్ధించు సం
గర రంగంబున నీల్గినం దుదకు మో ♦ క్షంబబ్బు నేలా కాతల్? ౧౩౭౪

మ॥ అని చింతించి కడంకతో నిర్బృతి ది ♦ వ్యాస్త్రంబు ధ్యానించి దా
నిని వింటం దొడఁగీసి రామునిపయిన్ ♦ వీడంగ దుర్వార ని
స్వన హాలాహల భీకర జ్వలిత జి ♦ హ్వా దంష్ట్రి కోగ స్ఫటల్
పొనరన్ వెల్వడె సర్పజాలము నభో ♦ భూభాగముల్ గప్పుచున్.

ఉ॥ శేషునికంటె దొడ్డవియుఁ ♦ జేఁదఱ గొన్నవి లోకజాలమున్
శేషము లేక మ్రింగునవి ♦ చిల్మ ముఖంబులఁ గక్కుచున్ మహా
భీషణ లీలఁ బర్వ నరి ♦ వీర భయంకరమూర్తి దానవ
ద్వేషి ఖగేంద్రసాయకము♦దీఁడుచు నేసి ఫణుల్ నశింపఁగన్. ౧౩౭౫

ఉ॥ రావణు నస్త్రమాయ బవ ♦ రంబునఁ బర్విన యంతమాత్రకుం
జేవఁ దనర్చు పక్షములు ♦ చిన్నిదవుం బట్టువన్న మేనులున్

లావగు చంచువుల్ నఖ బ ♦ లంబును శోభిలుచుండు వైనతే
యావలి నిండిపోయె నట ♦ నారయఁ దార్క్ష్యమయంబుగా నటన్.

ఆ॥ లెక్కలేని గరుడి♦పక్కులు నోట ని, ప్పులు వెలుంగఁ బరవ♦మొనసి సురలు
పక్షులగుచు నోట ♦ వహ్నులఁ గొని లంకఁ, గాల్ప వచ్చినట్టి♦కరణి దోఁచె.

తే॥ ఫణి ఫణావళుల్ నిప్పుల♦పగిది వెలుఁగఁ, గమల నాళంబులను నోటఁ♦గవ్వికొన్న
కరణి నాగకులంబులఁ♦గాళ్లఁ బట్టి, చంచు ఖర నఖరముల దా♦రించి వైచె.

ఆ॥ అట్టి తటిని వినత♦పట్టి ఱెక్కలగాలి, వలస భవుని మేన ♦ నలరుచున్న
మండనంబులెల్ల ♦ మఱిమఱి చలియించెఁ, దక్కు వానిఁ గూర్చి♦తడవనేల ?

ఆ॥ గండఁడైన రావ ♦ ణుండు మనంబున, మండి యూర్పుపుచ్చి♦భండనమునఁ
జండ విశిఖ తతుల ♦ దండిగాఁ గురిసి కో, దండి కూపిరాడ ♦ కుండఁ జేసె.

ఆ॥ రామ మార్గణములు ♦ రావణు శరముల, రాల్చి మీఱి యేగి ♦ రాక్షసేంద్రు
పృష్ఠ వక్షమందు ♦ పుంఖముల్ గనఁబడఁ, జొచ్చి పొడిచి యాని♦శోణితంబు.

చ॥ ఇరువురు హెచ్చుతక్కువ లొ ♦ కింతయుఁ గన్పడనీక ఘోర సం
గర మొనరించుచుండ శితి ♦ కంఠ శిలోచ్చయ మెత్తినట్టి క
ర్బురపతి నేర్చియున్న రణ ♦ వృక్కల విద్యలు తోఁపవయ్యె భూ
వరునకు నంతకంతకును ♦ వర్ధిలె లాఘవ సత్త్వ సంపదల్, ౧౩౩౩

—: రాముఁడు రావణుని తలలఁ దెగనేయుట :—

తే॥ నిర్జరవిరోధి బలము క్షీ♦ణించు నదను, గాంచి యొక యర్ధచంద్రాశు♦గంబుచేత
రావణునియొక్కతలద్రెంచె♦రామవిభుఁడు, బాపవంక్తినొక్కటిఁగూల్చు♦పగిదిదోఁప.

తే॥ వాయు వేగముల పందెంపు♦బవరమందు, శ్వసనుచే మేరు శిఖరంబు♦జలధిఁగూలు
చందమున రావణుశిరంబు♦శరధిఁగూలె, రామచంద్రు నమోఘ శ♦రంబుచేత.

తే॥ అమరసంఘంబులు త్రికూట♦మడఁగునట్లు, దుమికిగంతులు వైచుచుఁ♦ద్రొక్కి రాడి
పాడి వినుతించి తలపాగ♦లూడఁదీసి, వినరి యొకరిపై నొక్కరు ♦ వేసికొనిరి.

తే॥ ప్రాణి చచ్చియుఁ దనకర్మ♦బలముచేత, మరలఁ బుట్టిన చందాన♦మడువునోటి
తోడఁ దల యుదయించె న♦ద్భుతము గాఁగఁ, దపముచేఁ గాక యిట్టిది♦తనరు టరిది.

క॥ తెగినవి తెగలేదని వగ, వఁగఁ దగి త్రుటిలోన మొలచి♦పార్థివ తిలకున్
దెగనాడుచుఁ బగ మూఁడుచు, వగఁ జూచుచుఁ బదరి వదరెఁ ♦ బండ్లం గొఱికెన్.

క॥ విషముం గ్రక్కుచుఁ జెచ్చెర, విషధిం బడి శీర్షమపుడు ♦ విషధర శయనుం
డిషణమున నెత్తు మేదిని, మిష లేచి తదీయ విషము♦మేకొని త్రావెన్. ౧౩౩౯

క॥ అశని వశమగు పనం గొని, దశముఖముల హుంకరించి♦దశముఖుఁడు వెసన్
దశరథ సూనునిపై దశ, విశిఖమ్ములు చొరఁగఁ గ్రోధ♦వివశత నేసెన్. ౧౩౪౦

ఆ॥ అక్షరముల కాద్య ♦ మైన యకారంబ, యైన రామవిభుఁడు ♦ వీని శిరము
తెగిన మొలచు ననుచు ♦ వగచి కరంబును, ద్రుంచివైచె నధిక ♦ దోర్బలమున.

తే॥ బాణమునఁదునిఁగినచేయి♦పట్టియున్న, యాయుధములవేఱొకచేయి♦యందుకొన్న
పగిది మొలచిన హస్తంబు♦వట్టుకొనియెఁ, దెగుట మొలచుట గాంచిన♦ధీరులెవరు?

క॥ మాతలి బలమును ద్రుంచం, జేతమునఁ దలంచి యమర♦జేత తెగిన యా
చేతిని మొలచిన చేఁగొని, భీతిని ఖేచరులు పఱవ ♦ బిట్టుగ విసరెన్. ౧౩౪౩.

ఆ॥ పంక్తివదను తెగిన ♦ బలితంపు బాహువు, బాధముగ నురంబు♦వగులఁదాఁక
నొచ్చి శోణితంబు ♦ నోరఁ గ్రక్కుచు రాము, తేరి చోదకుండు ♦ తెరలి సొలసె

క॥ సొలసిన మాతలి యనువులఁ, దొలఁగింపఁ దలంచి యసుర ♦ తోమరమును డా
పలికేలఁ ద్రిప్పి వైవఁగ, జలజాక్షుఁడు నడుమ దానిఁ ♦ జదియఁగ నఱికెన్.

క॥ వెండియుఁ గరలాఘవ శర, చండతఁ జాపంగఁ దలఁచి ♦ చండాంశు కులీ
నుం డొక్కొక్క శిరంబును, ఖండించెను నూటుమార్గ ♦ ఖండిత లీలన్.

క॥ శిరములు దిశాంతరంబుల, శరధుల ధరయందు గిరుల♦సానువులందున్
దొరలి దొరలి పిడుగుల క్రియ, గురు రవమునఁ బడియె లక్ష♦కోట్లుగఁదోఁచెన్.

క॥ గోత్రంబుల వ్రీల్చెను న, క్షత్రంబుల మోఁదెఁ గడలి♦జలచరములకున్
జిత్రమగు చావు గలుగ, శ, రత్రుటిత శిరంబు లా శ♦రంబులఁ ద్రావెన్. ౧౩౪౮

తే॥ ధరణిఁ బుణ్య ఫలానుభూ♦తంబులైన, పిదప నాత్కృష్ట్య మెల్లను♦పిదులుగాదె?
శవములం దినఁ దిరుగు పి♦శాచసమితి, తనయొడురఁ దనకన్నులఁ♦ద్రవ్వి తినియె.

క॥ ఇరువది కరములఁ బట్టిన, పరశు ముసల ఖడ్గ కుంత♦పట్టిన ఘన తో
మర దండాదుల రావణుఁ, డురవడిమై నేసె రాఘు♦వోర్వీశు వయిన్. ౧౩౫౦

క॥ పురుషోత్తముఁడగు రాముఁ డ, సురవర్యు దురాన గెలువఁ♦జొప్పడు వెరవే
కరణి యని యరసి వానిన్, శరరాజి నలంకరింపఁ♦జను నను బుద్ధిన్. ౧౩౫౧

క॥ తోమ్మన భుజములపై నే, త్రమ్ముల జిహ్వాలను తగ నా♦ళంకులలో ద
ట్టమ్ముగ నమ్ముల గ్రుచ్చి శ, రమ్ముల నిలయ మనఁజేసి♦రావణు మేనిన్. ౧౩౫౨

క॥ వదనములఁ గనుల భుజముల, నెదనాఁటిన శరము లచట ♦ నిష్టంబుగఁ జొ
ల్లిదమగు రక్తము ద్రావక, వదరి యవల దూసి నెఱసె ♦ బ్రహ్మాండమునన్.

తే॥ రోమ కూపంబులందు శి♦రోధులందు, జీవములఁ గ్రుంగఁదీసి దూ♦సిన శరాళి
వలనఁ జలమును వగయును♦వట్రపడఁగ, విహ్వలించెను మిక్కిలి♦విబుధవైరి.

## —: రావణుఁడు మూర్ఛిల్లుట :—

తే॥ అమరనగరి నూరేగిన♦యసురవిభుఁడు, వనధిలోనుండి యెదురేఁగి♦వచ్చి నట్టి
మత్స్యములు రక్తమున గ్రోల♦ద్రిమ్మపడుచుఁ, దేరిపై సొలిపడియెను♦తెలివిదప్పి.

తే॥ దుష్టకర్మము భువినుండి♦దొలఁగెననుచుఁ, బొంగి గంతిరి కపులు వే♦ల్పులును నిగులఁ
బ్రభుఁడు మూర్ఛిల్లె ననుచు సా♦రథి రథంబు, నవ్వలికిఁ గొనిపోయె ర♦థ్యములఁద్రిప్పి.

తే॥ స్వర్గవాసుల నొప్పించు♦పద్ధతులను, నిశ్చయించి చేసెడు రజ♦నీచరాలిఁ
గూల్ప దీక్ష వహించు కా♦కుత్స్థ విభుఁడు, తెలివి దప్పిన రావణుఁ♦ద్రెంపఁడయ్యె.

తే॥ అరిదియగు తపోబలమున్న♦యసురవిభుని, తెలివి వచ్చిన పిమ్మటఁ♦ద్రెంప వలను
గాదు గావున నిప్పుడే♦కసిమసంగు, మనుచు మాతలి ప్రేరేఁప♦ననఘుఁడనియె.

తే॥ ఆయుధంబులు చే జాఱ♦నలసి సొలసి, యున్న శత్రుని రణధర్మ♦ముజ్జగించి
చిక్కెనని చంపరా దది♦శిష్టపథము, గాదు నాయెడఁదకు నిచ్చ♦కంబుఁ గాదు.

తే॥ అనిన యతని సత్పద్ధతి♦కాత్మ నలరి, మెచ్చి పొగడెను మాతలి♦మెచ్చకుండు
విబుధు లెవ్వరు ? పదపడి♦వేల్పు లడల, సొమ్మ దేఱి లేచెను దశా♦స్యుండు కడిమి.

క॥ అలుక తొలఁకు చూపులతో, సొలపు దెలిసి లేచి రాక్ష♦సుండు సకల ది
క్కులఁజూచి రాముఁ డెచటం, దెలియమి సారథిని చండ ♦ దృష్టిం జూచెన్.

శా॥ ఓరీ! వంచక! నీకు రక్షకుఁడనై ♦ యుత్కృష్టుఁగాఁ జేసి నిన్
గారామారఁగఁ జూచుచుండ నను లో ♦ కంబెల్ల భీతాత్ముగా
దూఱంజేసితి వాలి గొంచు మన శ ♦ త్రుల్ నవ్వ దుష్కీర్తియుం
గూరంజేసితి నిన్ను ద్రుంతునని య♦ల్గుం దూయ నుంకింపఁగన్. ౧౩౬౨

ఉ॥ సారథి దైత్యనాథు పద ♦ సన్నిధి వ్రాలి నమస్కరించి లం
కా రమణా! మదీయ పథ ♦ కంబిది చెడ్డది గాదు దొడ్డగా
నారసి నీ యమర్ష హృద ♦ యంబున శాంతి వహింతు గాక నా
సారథి ధర్మముం దెలిసి ♦ సత్ప్రీతి దీన దోసంగు గల్గునే ? ౧౩౬౩

ఉ॥ విక్రమ కార్యముల్ నెఱపి ♦ పీఁగితి సోలితి వండె నిల్చుచో
నక్రమ మొందు నాతగవు ♦ ప్రాణములుండవు నీకు నిక్కమీ
నక్రమపద్ధతుల్ జగతి ♦ సారథిజాతికి నిత్య ధర్మముల్
ప్రక్రమ భంగమేల యొక ♦ పాటి జయింపుము శత్రు నాజిలో. ౧౩౬౪

ఉ॥ స్వామి ససత్త్వుఁడో విగత ♦ సత్త్వుఁడో యారయుచుండి దొడ్డ కా
రామి ఘటించుచోఁ బ్రభుని ♦ ప్రాణ చయంబున కొక్కసేగి రా
రామి దలంచి కంచరముఁ ♦ గ్రించరఁ గొంచుఁ దొలంగిపోక పో
రామియె? నాదు దోసమన ♦ రాదు మదిం బరికించి చూడుమా?

ఆ॥ అనుచుఁ బలుక దాన♦వాధ్యుండు కరుణించి, తేరుద్రిప్పు మనఁగ♦సారథియును
రాము నెదుట నిల్పె♦ రావణుఁ డంతట, రణము సేయ సాగి♦రాముమీఁద. ౧౩౬౫

ఉ॥ వందలు వేలుగా విశిఖ ♦ వర్షము గూర్పఁగఁ జూచి తీచ్చమై
నందఱు పీఁడు గ్రొత్త దను ♦ జాధిపుఁడే యని పిచ్చలింప మే

ల్చందము లాఘవంబు గురు ♦ సత్త్వము సాహసముల్ వెలార్చి సం
క్రందన సన్నుతుండు రఘు ♦ రాముఁడు నొవ్వ దురంబు సేయుడుల్.

చ॥ అనలము రాఁజుచుండఁ బొగ ♦ నార్చుట శక్యము గాని కై వడిన్
ధనువు కరంబునం దనర ♦ దానవనాథుని గెల్వ దుర్ఘటం
బని తలపోసి భాస్కర కు ♦ లాధ్యుఁడు రాముఁడు ఘోరసాయకం
బున దనుజేంద్రు విల్లు పరి ♦ భగ్నముగా నొనరించె గ్రక్కునన్ ౧౩౬౮

చ॥ నలువరయొనంగు కార్ముకము ♦ నాశముగా దశకంఠుఁ డుగ్రుఁడై
బలువిడి వింధు లోకొకటి ♦ పట్టుచునుండఁగఁ ద్రుంగుచుండఁగా
నలిగి జయేందిరా రమణి ♦ యవ్వలికేగ మునుండి ముద్గరం
బులు గద తోమరాదులను ♦ భూరి బలంబున వైచె నొక్కటన్. ౧౩౬౯

శా॥ వానిం ద్రుంచి నభోంతరంబునన దు ♦ ర్వార స్ఫుర ద్బాహు న
ర్త్వానూనుండగు పీఁడలంతుల జనం ♦ డగ్గంబు గాఁడంచు వి
జ్ఞానశ్రేష్ఠుల కంటిపాపలను వి ♦ న్నాణంబుగాఁ దూటి శా
నానారీతులఁ జిత్తమందు నురజి ♦ న్నాశంబు చర్చించుచున్. ౧౩౭౦

—: రాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుం గూల్చుట :—

మ॥ తుది బ్రహ్మాస్త్రముచేత వీని యసువుల్ ♦ ద్రుంగింతుఁ గాకంచు దా
మదిఁ దీర్మానము చేసి రాఘవుఁడు న ♦ మ్మానించి తన్మంత్రముల్
ప్రబదరంబుం దరు భంజకంబు కపిరా ♦ డ్వత్సో మహీధ్ర చ్ఛిదా
భిదురంబుం గొని బిట్టుగాఁ దిగిచి యు ♦ ద్భీమంబుగా నేసినన్. ౧౩౭౧

క॥ ఎరవలియును కరువలియును, దరి యరయఁగరాని శరము ♦ ధాతృ నభీజా
త్పురమై నలు మొగములతోఁ, బఱచె దరుల బెరయు నిరులు♦పఱవ వెలుఁగుచున్.

సీ॥ విలయ కాలంబున♦విలుసిల్లు భానుండు, మిడుగుఱుఁ బురువను♦వడువు దోఁప
ధరణియు దిశలు నం♦బరమును జగములు, దిట దప్పి దిర్దిరఁ♦దిరుగుచుండ
సర్వ లోకేశ్వరు♦చక్రంబుతోఁ జేరి, నలువ యస్త్రమధిక♦బలమునొంది
మూఁడు కోట్లాయువు♦మొనసి చేయు తపంబు, వనజాననుం డిచ్చు♦వరదయంబు

తే॥ దిశల గెలిచిన తద్భుజో♦దీర్ణ బలము, శిథిల మొందంగ వక్షంబుఁ♦జించి చొచ్చి
ప్రాణవాయువులం గ్రోలి♦పరఁగ నవల, దుందుభిని పెను వే♦పున♦దుస్సి పోవు

ఉ॥ ఆహవమందు దానవుఁ డ ♦ హంకృతి దూలఁగఁ గూలఁ గాంచి కో
లాహలముం బొనర్చి చద ♦ లం గల వేల్పులు చల్లు పూలతో
భూహితముల్ వచించి యటఁ ♦ బోయి పయోజలరాశిఁ దేలి వై
దేహి హృదీశు తూణమునఁ ♦ దేఁకువఁ జొచ్చెఁ బదంబకం బొగిన్.

శా॥ శ్రీరామాస్త్ర విభిన్న వక్షుఁడయి య ♦ క్షీణ ప్రతాపుండు ర
క్షోరాజన్యుఁడు శీర్ణ భూషణ తతుల్ ♦ క్షోణిం బ్రకీర్ణంబుగాఁ
గ్రూరోగ్రాక్షుల మిణ్గురుల్ చెదరఁ బి ♦ ద్గుం బోలు ఘోషంబుతోఁ
దేరం జాఱి యధోముఖుండగుచు ధా ♦ త్రిం గూలె దుష్కర్మచే.

ఉ॥ కోప మడంగ మానసము ♦ క్రుంగఁగ మాయ తొలంగ కామభృ
త్తాపము ప్రమంగ సత్త్వ నము ♦ దగ్రత చెంగ యశం బొదుంగ నా
లాసిత దుర్వచస్సులు క ♦ లంగ దశాస్య ముఖంబు లత్తఱిన్
దాపసులం గలంచు బెడి ♦ దంబునకంటె వెలింగె ముమ్మడిన్. ౧౩౭౬

చ॥ అరదము ధాత్రికిం దిగుడు ♦ నంబుద దేహుఁడు డిగ్గి క్రవ్యభు
గ్వరుని శరీరమున్ దనివి ♦ పాఱఁగఁ గాంచఁ దలంచి డాసి శా
వరుని సుహృద్వరుం బలెన ♦ భావనసేయుచుఁ జూచె; లోక భీ
కరుఁడగు శత్రువైన మృతి ♦ గాంచిన పిమ్మట మిత్రుఁడే కదా! ౧౩౭౭

—: రాముఁడు రావణుని వీఁపునందలి గాయములఁగాంచి శంకించుట :—

చ॥ మరలి దివంబు చేరుమని ♦ మాతలి నంపి సుమిత్రసూతియున్
దరణిసుతుండు మారుతియుఁ ♦ దక్కటి వీరులు చుట్టిరా వెనన్
బరులకు వీఁపు చూపని సు ♦ పర్వవిరోధి గురు స్వరూపమున్
బొరిపొరిఁ జూడసాగె సుర ♦ పుణ్య ఫలోదిత మూర్తి యింబుగన్.

ఆ॥ రామ సాయకమున ♦ రణధాత్రిఁ గూలిన, రావణుని పది శి ♦ రంబులవయిఁ
బృష్ఠభుజములందు ♦ పీకున నాడిరి, కపులు గిరులమీఁద ♦ గంతినట్లు

తే॥ వాని మొగులుఁ బోలిన పృష్ఠ♦భాగమందు, ద్విరద రదన ఖండంబులు♦విధుని లేఖ
లట్లు తోడవులై యొప్ప వ్ర♦ణాంకములు క, లంకముం బోలి గాన్పించు♦లలినిగాంచి.

ఉ॥ జానకికై జనించిన రు ♦ షా భరణంబు దురాత్ముఁడైన యీ
దానవురూపుతోఁ దఱిగి ♦ తాఱఁగ రాముఁడు శత్రు పృష్ఠ భా
గాన స్ఫుటంబుగాఁ దెలియు ♦ గాయము కాయను గాంచి నా మహా
నూన పరాక్రమంబు వెలుఁ♦గొందదుగా! యనెఁ బిన్నవృత్తితో. ౧౩౮౧

చ॥ జగముల గెల్చి యేనరినఁ ♦ జచ్చు కతంబున రావణుండు తాఁ
బగతుర మున్నుదిర్చి పోల ♦ వంబుగఁ జేసిన పోర వీఁపునన్
దగిలిన పుంటికాయలు వి ♦ తావిత చేసెను మద్బలిష్ఠ దో
ర్యుగళ పరాక్రమంబు నని♦ రోధ కలంకముఁ గూర్చి చెల్లరే! ౧౩౮౨

తే॥ కార్తవీర్యునిచే వీఁడు ♦ కట్టువడిన, చరిత విని వీనితోడి మ ♦ చ్చరము నాకు
నొదవెఁగా యని లజ్జించు♦చుండ నిపుడు, వీని వీఁపు గాయంబులు♦కానఁబడియెఁ,

తే॥ మచ్చరుల గెలి యశమును ♦ మలినపఱుప, వెన్ను పగఱకుఁ జూపిన ♦ వీనివలన
గలుగు గెలుపుమెచ్చందగు♦గెలుపుగాదు, దీనివలనఁగీ_ర్తియురాదు♦తెగడు దక్క.
తే॥ అనినవినివిభీషణుఁడుదగ♦ఖా(ర్ముకణము,లొలుకఁబరిత_ప్తహృదయుఁడై♦పలికెనిట్లు
ప్రభువరా! యసమంజస ♦ వాక్యములను, నీవ వలుకంగ నేమన ♦ నేర్తునయ్య!
చ॥ భుజములు వేయిగల్గిన నృ ♦ పుండును వాలియు నొందినట్టి యా
విజయము నిక్కమైనదియె? వేల్పుల శాపముచేతఁ గల్గె నం
బుజదళనేత్ర! లోక వరి ♦ పూత పయింగల శాపబాధచే
గజిబిజి చెంది దీల్పడిరొ ♦ గాక యలంతులఁ బోవువాఁడొకో? ౧౩౭౬
చ॥ కడిమి నిర_స్త శాత్రవము ♦ గా భువనంబు లొనర్చి పేర్చి యె
య్యెడ నెదురేది లేక చరి ♦ యించుచు దిగ్గజ దంత సంఘముల్
తొడఁబడి యీడ్వఁ గ్రుచ్చికొని ♦ తోఁచు కిణంబులుగాక శత్రు లె
క్కడ? యితనిం జయించి వెను ♦ గాయము సేయుట యేడ? భూవరా!
క॥ ఆయువి వక్షంబునకుం, జేయని తొడవులుగ యమునిచేతి మహా దం
డాయుధము మానుమ ముష్టియు, నీయనువున శౌరిమద్రోవ♦నిటు గన్పడిరో.
చ॥ చెలసిన శాలకాల మొగిఁ ♦ జచ్చుటకంటిని (ద్రుంగిన మహా
బలయుత సర్పజాలములు ♦ పక్షులరాయని గెల్చినట్ జగం
బులఁ గల వీరవర్యుల ప్ర ♦ పుష్ట భుజాంతర సీమఁ జేర్చి యు
గ్గలికను నాటు కైదువులు ♦ గాఁడఁగజాలవు వీని ఱొమ్మునన్. ౧౩౭౮
మ॥ చతురంభోధి పరీత భూతలము దం ♦ ష్ట్రం గ్రుచ్చి క్రోడంబు స
మ్మతితో నిల్పిన మీఁద లోకములు మా ♦ మంత్రాటలున్ ద్రిమ్మటల్
పెత లేనాఁటికిఁ దీఱునంచు మది నొ ♦ వ్వం బొంది నీచేత నీ
గతి లంకేశుఁడు పొంద వీని మృతి నిం♦క న్నమ్మకుండెం గదా! ౧౩౮౦
మ॥ అన నాఁగాకని రాఘవుండు మది న ♦ త్యంతంబు విశ్వాసముం
గొని నీయన్నకు సాంపరాయిక విధుల్ ♦ గూడంగఁ జేయించి ర
మ్మనుమానంబును వీడుమా ధరణి సై ♦ రాదుల్ గనుమ్యుండు చే
తనుఁడై యుండెడు నంతదాఁకనె చుమీ ♦ ధర్మజ్ఞ! చింతింపుమీ!
ఆ॥ అనుచు నతని నంపి♦యడలు దీఱఁగ వచ్చి, మోదమంది తనకు♦మ్రొక్కుచున్న
నిఖల నిర్జరాది♦నిచయంబుఁ గనువేడ్క, నెదురుగాఁగ నడచె♦నినకులుండు. ౧౩౮౨

## —: విభీషణుని చింత :—

ఆ॥ అన్న దోసఁగులెల్ల♦మన్నింపఁదగినవి, పొమ్మనంగ నతఁడు♦పోయి యగ్ర
జన్ముఁగాంచి పట్టఁ♦జాలని పెనుచింత, లోన మునిఁగిపడియె♦వాని మీఁద. ౧౩౮౩

ఆ॥ జగతి జీవులెల్ల♦జాలినొందఁగ శోచ, రులును మానులును క♦రుణ వహింప
రాలుఁ గరఁగ నేడ్చి♦రావణు పైఁబడి, పలవరించె నిట్లు♦బహువిధముల. ౧౩౯౪

సీ॥ హా లోకభీకర! హా మేరునిభ ధీర! అద్వంద్వ శూర! మా♦యా ప్రకార!
ఉండుచోఁ ద్రిదశ కు♦లోన్మూలి వైతివి, చచ్చుచో నసుర వం♦శముఁ జెఱిచితి
ద్రుంగిన గరళంబు♦మేకొని చెఱచు జా, నకి యను విసము కా♦నఁగనె చంపు
వలదని యానాఁడె♦పలుకంగ వినవైతి, విఁక నేటికి వినంగ♦నిచ్చగింతె?

తే॥ పరకళత్రంబుఁగొంట య♦భావ్యమంటిఁ, దొలఁగరాని యపఖ్యాతి♦దొరయునంటిఁ
గోరవలదంటి వైరంబు♦కూడదంటి, వంశము నశించునంటి నా♦పలుకువింటె?

శా॥ నాఁడగ్నిం బడినట్టి వేదవతి యీ ♦ నాఁ దుర్వారా జాతయై
యీడంబోవక దైత్యనాశమునకై ♦ యిచ్చోటికిం జేరె నీ
జాడ ల్వల్దని యెంత చెప్పినను రో ♦ షస్ఫూర్తి మన్నింపక
క్రీడాగోడము చేసికొంటి కుల శౌ ♦ ర్యప్రా విభూత్యున్నతుల్. ౧౩౯౫

ఉ॥ కారుణికుండు రాముఁడని ♦ కామిని నిమ్మని సంధిమేలనం
గా రణ మీడకుంటి వర ♦ గౌరవముల్ పది శీర్షముల్ వృథా
ధారుణిఁ బొర్లుచున్నయవి ♦ తప్పక నాపలుకిప్పుడైన సీ
తా రమణుం డనాది పర ♦ తత్త్వము సుమ్మని నమ్మితే దివిన్. ౧౩౯౬

శా॥ వీరస్వర్గము చేరితో? నలువ మే ♦ ల్పీటం బ్రవేశించితో?
తారాద్రిం దగఁ జొచ్చితో? యెవఁడు నిన్ ♦ దాకొంచు నీజీవ సం
చారంబుం గొనిపోయె? కాలుఁడో? లన ♦ చ్చంద్రాంశువుల్ నేఁడు చ
ల్లారం గల్గెనె? మారనాటకము నేఁ ♦ డైనం దుదిం బొందెనే? ౧౩౯౭

చ॥ మగనిని చంపుచేఁత తన ♦ మానసమందిడి చుప్పనాక యీ
పగ గొని తెచ్చి యిచ్చి తన ♦ పంతము సగ్గఁగఁ జేసికొన్న దీ
పగిదిగ నారకానఁ గల ♦ పాపులు స్వస్సుఖమొందు పుణ్యులన్
బగఱుగ నైరి యొల్లిదపుఁ ♦ బాటున నేరి మొగంబు గాంతువో?

మహాస్రగ్ధర.

విజయశ్రీ పంకజాక్షిన్ ♦ విమలగుణయుతన్ ♦ విశ్వ సాహిత్య లక్ష్మిన్
భుజమేధా శక్తి యుక్తిన్ ♦ భువన విజయ వి♦స్ఫూర్తి నాసించు చేతుల్
త్రిజగన్మాతన్ ప్రపూతన్ ♦ త్రిదశగణనుతన్ ♦ పృథ్వి సంజాత సీతన్
బొజఁగై స్పర్శించు నిచ్చన్♦భువిని తడవఁగాఁ♦పూర్ణ సంసిద్ధి గంటే! ౧౪౦౦

తే॥ అనుచుఁ బనవు విభీషణు♦నవలికేడ్చి, విధి నెఱింగియు మతిచెడ♦వెగవనేల?
లెమ్ము కాఁగల పనుల నా♦లింపు మనుచు, భల్లుకేశుండు లేపి సాం♦త్వనము పలికె.

—: మండోదరి విలాపము :—

మ॥ విరియం బాఱిన కేశపాశములతో • వ్రేలాడు హారాలితో
సురుఁగం బాఱిన ఘూర్ణ చిత్తములతో • జొబ్బిల్లు కన్నీటితోఁ
గరముల్ ద్రొమ్మున మోఁదికొంచు వడి లం • కానాథు కాంతల్ పరా
మరిసల్ లేని విధంబునన్ జరగిరా • మందోదరీ యుక్తలై. ౧౪౦౨

తే॥ పొలుచు సత్యంబు ధర్మంబు • భూతదయయుఁ, గలుగుకులమునఁ బుట్టిన • ఘనుఁడు సిగ్గు
వదలి చేయు కార్యమువలె • వాయి విడిచి, యేడ్చు కాంతల రవ మెల్ల • యెడలఁ బరవె

తే॥ కాలియందెలు మొఱవెట్ట • గజ్జెలేడ్వఁ, గొంద ఱేగుదెంచిరి రణ • క్షోణి కపుడు
కొందఱు పురందరుని పగఁ • గూలె ననుచు, నచటనే జీవముల వీడి • రవని దొరలి

తే॥ ఘోర శోకంబు గందర • గోళపఱుప, నందమును జెడఁ దొడవులు • చిందుచుండఁ
గనుల నశ్రుజాలము మబ్బు • కరణిఁ గురియ, వనరి విన్నఁబోవఁ గొందఱు • వచ్చినారు.

తే॥ తలలు మోఁదుకొనెడువారు • తడవువారు, కనుల నీరూర నా దశ • కంఠు కావు
వీరముల మీఁదఁబడి నూత్న • విగత భర్తృ, శోకమున నేమి యెఱుఁగక • స్రుక్కినారు.

తే॥ పదములును దొమ్ము భుజములు • వదనములును, తోడఁబడఁగఁ బలుమాఱులు • తడవి తడవి
యేడ్చి యేడిచి నాలుక • లెండఁ బాఱ, తెలివి దప్పి ధారుణిపయిఁ • దొరలినారు.

ఉ॥ పొందరు మున్ను దుఃఖములఁ • బొందిన నెప్పుడొ పొల్లయల్కయేఁ
బొందుదు రద్దియుం దుదిని • పూర్ణ సుఖప్రద మంచు నెమ్మదిం
గొందురు దైత్యకాంత లిటు • గూరిన యార్తి భరింపలేక యా
డెందముపైని వ్రాలి రట • డిందిన ప్రాణము లోయుఁ గైపడన్. ౧౪౦౭

తే॥ జక్కినులు రక్కసులు నాగ • చంద్రముఖులు, సిద్ధ సఖులు విద్యాధర • స్త్రీలభేద
మోహముంచుటచే శోక • మున మునింగి, తడవి తనివి పసల చాలఁ • దల్లడిలిరి.

తే॥ ధర్మము నశింప నెదఁ జేర్చు • ధరణిజాత, మీఁది మరులున మద్యుగ్రవే • దింపవైతి
దానిచేఁగాదె యీగతి • తనరె నీకు? దాని వదలి మమ్మేలుదైనఁ • దనువరాదె!

తే॥ అనుచు బోల మండోదరి • యలమటించి, కడలిపై మించు వ్రాలిన • కరణి విభుని
వక్షమున వ్రాలి శిలలును • వృక్షములును, కరఁగి తోడన వలవింపఁ • గనికరించె.

చ॥ అసుర విభుండ వా మరణ • మందిన విన్నట నేను నందుటల్
దొసఁ గతి దుర్భరం బమిత • దుర్భర మక్కట! నాదు సన్నిధిన్
బొసఁగిన యిన్ని సీమకుట • భూషిత శీర్షములే! కదించి నా
వ్యసనము మాన్పవో? వదన • పద్మ వికాసము చూపవో యికన్!

చ॥ ఎలగించి కొండకొండ భరి ♦ యించిన నీ పెనుమేని లోపలన్
నెలుపల నావుగింజ మొడ ♦ పీడక తోల్చి యసృగ్జజంబు ని
ట్టలముగ రోయుతీరొ? వద ♦ టంబున జానకిమీఁది ప్రేమ లో
పలఁ గలదంచు నారసిన ♦ పద్ధతిరో? యిది రామబాణముల్ !

చ॥ అలయక రాము తూపులు గు ♦ హాముఖముంబలె తొమ్మొఁదొల్చి య
వ్వలఁ జనియున్న వక్కట! త ♦ పంబును దార్ఢ్యము వీర్యముం జెడన్
బొలిసితివే? యిఁకేది గతి? భూరితరోగ్ర శరంబొకండు ని
మ్మళముగఁ గ్రోలె జీవముల ♦ మానుష శక్తియు నింత యొప్పునే?

మ॥ వనితాజాతికి భూషణంబయిన యా ♦ వైదేహి యందంబు త
ద్ఘన పత్నీత్వము దైత్య నాశకయు లం ♦ కారాజు కామంబు రా
ముని కాంతార నివాస నిర్ణయ విధం ♦ బుం గూడి జంభారి చే
సిన పుణ్యంబుగఁ బూర్తియై పరిణమిం ♦ చె న్నాకు నేఁడీగతిన్.

చ॥ అమరుల దిగ్గజంబుల ను ♦ మాపతి ధాత్రు ముకుంద జిష్ణులన్
సమరమునందు మించిన య ♦ సాధ్య బలాఢ్యున కిచ్చటన్ వినా
శము గలదే యటంచు నెల ♦ నంబున నుండితి నీ మహాతపః
క్రమ ఫల జీవితంబునకు ♦ రాముఁడు పుట్టెఁ గృతాంతుఁడై భువిన్.

చ॥ కొమరుగ నొందు మూఁడు నఱ ♦ కోటికి మేర వచింపరాని స
త్త్వమునకు జీవితానకుఁ ద ♦ పఃఫలరాశికి నింక నాశ మే
క్రమమున వచ్చునంచు మది ♦ గాఢ తరంబుగ నమ్మియుంటి నీ
తమ యను ఘోర హాలహల ♦ మక్కట యన్నిటి మింగె ద్రెళ్ళిడిన్!

చ॥ జగము స్వభావ మిట్టిదని ♦ సత్య మెఱుంగు సమర్థు లెవ్వ రీ
జగముల నెల్ల గెల్చిన ప్ర ♦ శస్త బలిష్ఠులు నిల్చి రేరు? యిం
చగు విలు కేటి నారి పువు ♦ టమ్ములు గల్గిన శంబరారికే
యగడుపడంగఁ జిక్కిన బలాఢ్యుని నాశము చేయరే నగుగ! ౧౪౮౫

తే॥ రాము నెంచితి నాది నా♦రాయణునిగఁ, దెలియ కిట్టు లుత్తముని పత్ని నిచెఱగొని
వచ్చితివి తత్ఫలం బనుభావ్యమయ్యె, నిప్పుడైన నియ్యది నీకు♦నెఱుఁగరాదొ!

మ॥ అని చింతాకులి తాత్ముడై పనవి యత్యంతంబు దుష్ప్రాపవ వే
దన నిండారఁగ శీర్ణ హారముగు త ♦ ద్వక్షంబు హస్తంబుతోఁ
దనియం జేరిచి తృప్తిమై సతిని నా ♦ థా! యంచుఁ జేద్వాడి యం
తన నిశ్వాసము నిల్పి జీవములు వం ♦ తర్లీనమై పోవఁగన్. ౧౪౮౦

తే॥ అమరకాంతలు విద్యాధ♦రాంగనలును, మునిసతులు నాగ తరుణులు♦మనుజ సఖులు
పెక్కుగతుల మందోదరి♦పెద్దతనము, వేయి నోళ్ల శ్లాఘించి ర♦వ్వేళయందు.

సీ॥ అంత విభీషణుఁ♦డంతరంగంబునఁ, జింతించి క్రమరీతిఁ♦జిచ్చుకొలిపి
సంస్కారముల నెల్ల♦శాస్త్రోక్తముగఁ జల్పి, శవముల నుంచెఁ గా♦ష్ఠములమీఁద
వాద్య స్వనము లెల్ల♦వారి రవంబుల, వినసీక మిక్కిలి♦విస్తరించె
సిడమును తెల్లని♦గొడుగును తోడరా, నతని పత్నులును వె♦న్నంటి నడవఁ
తే॥ జుట్టివచ్చి యిర్వురకుఁ జి♦చ్చును రగిల్చి, చేయఁదగు క్రియలెల్లను♦చేసి యవలఁ
దక్కువారికిఁ గూడ నా♦తండె యుక్త, కర్మము లొనర్చి బడి నుద♦కంబుతోడ.
ఆ॥ అవల వచ్చి రాము♦నంఘ్రి పద్మములకు, మ్రొక్క నతఁడు నతని♦పొనఁగు గాంచి
లోక సహజ మిద్ది♦నీకు నుమ్మలిక మి, ట్లొందు టుచిత మనుచు♦నూఱడించె.

## 32 శ్రీరామ నివర్తన పటలము. (30గ)

తే॥ బహుళ శాస్త్ర మర్మంబులఁ♦బ్రకృతి నైజ, ధర్మముల నెఱిఁగించి యా♦దైత్యరాజు
నూఱడించి లక్ష్మణుఁ గని♦యొప్పమీఱ, నిట్టులనియె రాముఁడు ప్రేమ♦మెసఁగ నెనఁగ.
ఆ॥ అర్కసుతుఁడు మారు♦తాత్మజుఁడును తక్క, కపివరులును వెంటఁ♦గదల నేగి
నీతియుతుఁడు యామి♦నీచర విభునకుఁ, బట్టమొనర నీవు♦కట్టుమయ్య. ౧౪౨౭
క॥ అని యాజ్ఞచేసి పంపఁగ, ననిమిషులు దిగీశు లప్పు♦డగునంతకుఁ బ్రే
మను శక్తి కొలఁదిఁ దోడ్పడి, పనులొనరించిరి విశేష♦పరతంత్రులుగన్. ౧౪౨౮
ఆ॥ పుణ్య తీర్థములను♦మొగులు జలంబుల, జలధి జలము హార♦నమిత సింహ
పీఠి బొమిడికమ్ము♦ప్రీతితో వేల్పులు, తెచ్చి కొఱఁతలేక♦యిచ్చినారు. ౧౪౨౯
ఆ॥ అజుని యాజ్ఞవలన♦హరిణముఖుండు మ, యుండు వచ్చి హరిహ♦యుఁడు భవుండు
పొగడఁదగిన పగిదిఁ♦బూజ్య విధంబుల, మంటపంబు గూర్చె♦మండనముల.
తే॥ విధియుతంబుగా బ్రహ్మాది♦విబుధవరులు, పుణ్యతీర్థాభిషేకంబు♦పొనఁగఁ జేయ
నన్న యాజ్ఞానుసారి రా♦మానుజుండు, ప్రీతి మకుటంబు పెట్టె వి♦భీషణునకు.

ఉ॥ నీలగిరీంద్ర శృంగమున ♦ నీరజ మిత్రుఁడు తోఁచు చందమై
నీలమణీ విభాసిత వి ♦ నిర్మల పీఠి విభీషణుండు పే
రాలసుఁడై కిరీటయుతుఁ ♦ డై తగు బంధువులైన పూర్వదే
వాలి భజింప వాసవుని ♦ యందమునన్ వెలుఁగొందె నత్తఱిన్. ౧౪౩౦

తే॥ సురలు కల్పక సుమములఁ♦గురిసినారు, తావి పూవుల సిద్ధ సా♦ధ్యావలులును
చిందఁజేయఁ ద్రిమూర్తులు♦శిష్టమౌని, జనము లాశీస్సుమంబులఁ♦జల్లినారు.
తే॥ నవ్యమకుట భూషణుఁడు దా♦నవవిభుండు, భక్తితోడను సౌమిత్రి♦పాదసరసి
జాతములకుఁ బ్రణామంబు♦నరవిఁజేసి, పలికె విశదఫణితి నెల్ల♦వారు వినఁగ.
తే॥ ఏను శ్రీరాము సన్నిధి♦కేగి మరలి, వచ్చునందాఁక నీలంకఁ♦బ్రాభవమున
గొఱఁతలేక పాలింపఁగఁ♦గోరినాఁడ, ననుచుఁ బ్రార్థించి యొప్పించి♦యచటి కరిగె.

తే॥ కపికులేంద్రునితోడ నం♦గదునితోడ, వచ్చి పదముల కెఱఁగిన♦వాని దైత్య
విభుని రామచంద్రుండు సం♦ప్రీతితోడ, నలమి మృదు భాషణంబుల♦నల్లననియె.

చ॥ వనిగొని మూఁడు లోకముల ♦ వారు నుతింపఁగ దేవతాలికిన్
జనులకు నీతిపద్ధతికిఁ ♦ జక్కటికిం దగురీతి నిల్చి శ్రీ
యును సుకృతంబు కీర్తియు న ♦ మున్నతి నొందఁగ రాజ్యభారమున్
గొని సుఖమందుమా యనుచుఁ ♦ గొన్ని హితోక్తులు పల్కి పిమ్మటన్.

—: హనుమంతుఁడు సీతకు రామ విజయము తెల్పుట :—

చ॥ హనుమనిఁ గాంచి నీవు జన ♦ కాత్మజ యున్న వనంబు చేరి యిం
దొనరిన యెల్ల సంగతుల ♦ నొప్పుగఁ దెల్పుము యన్న నాతఁడున్
బనివిని వాయువేగమునఁ ♦ బావని జానకి యున్నచోటికిన్
జని వసి వాడియున్న విర ♦ జాజికి వర్షమువోలెఁ గన్పడెన్.

చ॥ కనఁబడి మ్రొక్కి భానుకుల ♦ కాంతుని నామము నుచ్చరించుచున్
దనియక గంతులేయుచును ♦ తాళము వైచుచుఁ బాటపాడుచున్
జనకజ తన్ను గాంచియు ని ♦ జంబు గనుంగొనఁ జెక్కిరింతలన్
గునియుచు నెట్టకేని సుమ ♦ కోమలి పాదము డాసి యిట్లనున్. ౧౪౩౭

చ॥ శుభము శుభమ్ము మంగళము ♦ శోభనదేవతకున్ జయమ్ము మే
ల్శుభములు తల్లికిన్ దనుజ ♦ సూదనజాయకు భద్రముల్ సుర
ప్రభృతులు సంతసింప రఘు ♦ రాము మదేభము యామినీచర
వ్యభిజన సారసాకరము ♦ సంకిలి వీడి కలంచెఁ దల్లిరో! ౧౪౩౮

ఉ॥ రావణ మత్త నాగమును ♦ రామ మృగేంద్రము చించిచెండె ర
క్షోవిభు మస్తకంబులు వ ♦ సుంధర దొర్లెను వాని బాహువుల్
ప్రేవులు నక్కలీడ్చెను క ♦ రిరముమీఁద నెఱంగి గ్రద్దలున్
గావరు కన్నులం బొడిచి ♦ కాకులు దిన్నవి సంగరస్థలిన్. ౧౪౩౯

క॥ లోపమతి రామునాజ్ఞ వి, భీషణు నియమమున లంక ♦ వీథుల సుర వి
ద్వేషుల కాంతలు దక్కఁగఁ, బాషింపఁగ నొక్క యసుర ♦ బ్రతుకండమ్మా.

క॥ అమృతము మించిన యీవా, క్యములన్ విని యొక్క కళను ♦ గల రేక క్రమ
క్రమమున వర్ధిలి యంకము, సమసిన విధుఁబోలి జనక ♦ జాత వెలింగెన్

ఆ॥ రాహు గళితమైన ♦ రాజ బింబమువలె, ధరణిజాత ముఖము ♦ తనరఁ గాలుఁ
గేలు తొమ్మి మనము ♦ లీలఁ బూరించెను, సురలోక ముదము♦మీఱుకతన.

ఆ॥ కార్శ్యమొందియున్న♦కాంతయంగములెల్లఁ, బెద్దవగుచుమిగులఁ♦బెరుఁగఁ జొచ్చె
వాడియున్న వల్లి♦వర్షంబుచేత నా, నా ముఖముల వెలసి నసుచు భంగి. ౧౪౪౩

చ॥ భ్రుకుటియు వంగెఁ జెల్వముగ ♦ తోమ్మొ చెమర్చెఁ దలం పొకండుగా
నొకటి వచించునట్టిదిగ ♦ నొప్ప సముత్కముచేతఁ బక్వమై
రకమగు ప్రేమ కల్గువలె ♦ భ్రాంతిని గొల్పున? యేమివింత ? జా
నకి కెది పల్కఁ దోఁచక మ♦నంబున నూరక యుండె నివ్వెరన్. ౧౪౪౪

ఉ॥ నీతియుతుండు సద్గుణి మ ♦ నీషి మరుత్సుతుఁ డద్దిగాంచి త
ల్లీ! తరమెంచరాని యొన ♦ లేని కుతూహలమొంది యుత్తరం
బీతని కేమి యిత్తునని ♦ యెంచఁగ లేకిటు లూరకుంటివో ?
కోఁతి యసత్యమాడె నను ♦ కొంటివొ? యన్న వచించు నామెయున్.

చ॥ అసదృశమైన యుత్కలిక ♦ యాదట యన్నియు రేఁగి నన్ను నా
వనమున నుండనీకిటులు ♦ వల్లటనేసెను వక్కణింప నే
దెనయును తోఁపనీయమిని ♦ తెప్పిలికుంటిని నిబ్బరంపు నం
తన మది చిత్తవిభ్రమము ♦ దార్కొనఁ జేయదె? మారుతాత్మజా!

ఉ॥ నీ వలనాఁడు నాచెలిను ♦ నీఁగెద నంచభయం బొనంగి యా
కైవడి మన్మనో నిలయుఁ ♦ గ్రచ్చలఁదెచ్చి దురాన దైత్యులన్
వావిరిఁ గూల్చి తద్విజయ ♦ వార్తను తెల్పిన పుణ్యమూర్తి ని
న్నేవిధి సత్కరింతునని ♦ యేమియుఁ దోఁచకయుంటిఁ బావనీ! ౧౪౪౭

మ॥ ఇన వంశోత్తముఁ దోడితెచ్చితివి నా ♦ హీనస్థితిం దెల్పి మ
ద్ఘన దుఃఖంబులఁ బాపినాఁడవు త్రిలో ♦ కంబుల్ ప్రసాదించినన్
తనయా! యస్థిర లక్ష్ములవ్వి సత మ ♦ స్త ప్రాంజలుల్ దక్క నే
యనువుం దోఁచదు వాంఛయున్నను ప్రియం ♦ బారంగఁ దెల్పంగదే!

చ॥ అనవుడు వాయుజుండు హృద ♦ యంబున నుబ్బి నమస్కరించి మ
జ్జనని వి నీముదంబె యగు ♦ జానగు నా యభివాంఛ లెల్ల ని
న్మనుకులచంద్రు సన్నిధి న ♦ మర్పణసేయ మనంబుగోరు నే
వనమున కంటె మేలయిన ♦ భాగ్యము నాకొకటుని లేదిఁకన్. ౧౪౪౯

మ॥ త్రిజగ త్సన్నుత జాతిరత్నము ప్రియున్ ♦ దీపించు స్త్రీరత్నమున్
ద్రిజటం దక్కఁగ నిన్నలంచి బహుళా ♦ ర్తిం గూర్చు సీతాక్షసీ
వ్రజము న్నా కసిదీఱ దండుటకు సం ♦ రంభించె డెందంబు శో
రజము ల్వల్కిన వీరి నాలుకల పై ♦ రంబూడఁగా నూడ్చెదన్. ౧౪౫౦

చ॥ పలుకఁగరాని ప్రల్లదము ♦ పల్కుచుఁ బైఁబడి ప్రింగువార మం
పలుకఁగఁ జేసి చీల్తుమని ♦ యుత్తలపెట్టుచు నొంచుచుండు ని
పలువల జాతి చెల్వలను ♦ పాద నఖంబుల ఛిన్న భిన్నముల్
నలిపెద నీవరం బొసఁగు ♦ చాలు రహించెద నంతఁ జేదఁగన్. ౧౪౫౧

చ॥ చెలువలు భీతినొందఁ జెదరి ♦ సీతపదంబుల వ్రాలి తల్లి! నీ
యలఘుపదంబులే శరణ ♦ మంచు విధేయత వేఁడ నంజలుల్
వలదని మాటయిచ్చి కపి ♦ వర్యుని గాంచి విశుద్ధ మానసా!
తలఁపకు వీరిఁ జంపుటకుఁ ♦ దప్పులు వీరలయందు గల్గనే? ౧౪౫౨

ఉ॥ రావణు బోధచే నటులు ♦ రాయిడి చేసిరి కాని వీరికిన్
భావములందు నాయెడల ♦ వైరము గల్గద యస్వతంత్రలున్
నావిధి యిట్లు నన్నకరు ♦ ణంబుగ నేఁచుచు నుండెఁగాక యో
పావని! వీరు కుబ్జవలెఁ ♦ బాపులు గారు సహింపఁగాఁ దగున్. ౧౪౫౩

ఉ॥ పాప కులంబునం బొడమి ♦ పాపములం దలవాటుపడ్డ దు
ష్టేపులె తైన నావలని ♦ ప్రేమను వీరి మనంబులందు నం
తాపము గూర్పఁ జూడకుము ♦ ధర్మగుణాలయ! పుణ్యమూర్తి! నా
ప్రాపును గోరి రియ్యది వ ♦ రంబుగ నాకొలఁ గియ వేఁడెదన్. ౧౪౫౪

చ॥ అనవుడు వేఁడుకోల? యిది ♦ యాజ్ఞయ కాదె? కృపాసముద్ర వా
జనని! తల్లి పల్కు లెద ♦ జార్చు సుతుండు సుతుండె? మేలు! నీ
ఘనమతి నెంచి నట్ల యగుఁ ♦ గాకని పావని మేలుమాన్పు గై
కొని యటనిల్చి జానకి క♦కుంఠిత మోదముఁ గూర్చుచుండఁగన్. ౧౪౫౫

చ॥ అచట విభీషణుం బిలిచి ♦ యార్యుఁడు సీత నలంకరించి నీ
వచటికిఁ దోడితెమ్మన న ♦ భీష్టము నందివళంగిఁ బొంగి యు
బ్బుచు దనుజప్రభుం డరిగి ♦ భూనుత సన్నిధి కేగ్ర క ప్రభల్
రుచిరముగా ధరం బరవ ♦ ప్రొక్కి నయంబు భయంబు పెంపునన్.

శా॥ తల్లీ! కోరిన శత్రుం వీర జయ మూ ♦ త్రుంబయ్యె రాముండు నీ
వాల్లభ్యంబునఁ జూడఁగోర దరిసిం ♦ పన్ వచ్చి రంగస్థలం
బెల్ల న్నిండిరి తెల్పు లచ్చటికి నే ♦ యింపారఁ దోడ్తేర న
న్నుల్లాసంబునఁ బంపె తెమ్ము లలి ను ♦ ద్యోగింపు మై సీతకున్. ౧౪౫౭

ఉ॥ నావుడు సీత యిట్టులను ♦ నాయిట నున్న విధంబు లెన్నగా
దేవతలున్ దినేంద్ర కుల ♦ దీపుఁడు మానులు నాకలోక రా
జీవ దళాక్షులుం గనుట ♦ సెబ్బులె గాదది యింతలింత లే
నీవిధి నొందియుం దుదకు♦నెట్లు రహింతు నలంకృతుల్ గొనన్. ౧౪౫౮

తే॥ అనుచు జానకి వచియింప♦నసురవిభుఁడు, తల్లిరో! రామునాజ్ఞ చం♦దంబు నిట్లు
విన్నవించితి నన నాడు♦విభునియాజ్ఞ, యిట్టిదైన నరియని♦యియ్యకొనియె.

—: అప్సరసలు సీత నలంకరించుట :—

తే॥ జనకజ నలంకరింప న♦ప్సరస లేగు, దెంచి తిరుమంజనము సేయఁ♦దివిరి తగిన
పునుఁగు కస్తురి గంధ చం♦దనము తావి, తైల జలములఁ జేకూర్చి♦దాసినారు.

ఉ॥ స్త్రీల సులక్షణంబులకు ♦ క్షేత్రము శ్రోత్రడి జాతి సొమ్ము మే
ల్లీలల కెల్ల మచ్చు కడ ♦ లిన్ వెలిదేఱిన వెన్నలోడు ధ
ర్మాలికిఁ దల్లియైన జన ♦ కాత్మజ యొంటి జడన్ వదల్చి రం
భా లలితాంగి వేదముల ♦ వ్యాసుఁడు నేర్పున విచ్చుకై వడిన్. ౧౪౭౧

చ॥ తరమగు దొండఁబోలుచు ను ♦ ధామధురోక్తుల నొయ్యనొయ్య వె
ల్వాఱిచెడు నోట ముత్తెముల ♦ వంటి రదంబులఁ దోమి నత్తిన్
బరిమళ తైలమంటి మను ♦ వట్టిన రత్నము సానపట్టు న
ప్సరసున గీత మంగళ ర ♦ వంబులతో జలమార్చి రచ్చెలుల్. ౧౪౭౨

చ॥ పవడపుఁ దీవ నారజపుఁ ♦ బాల నురుంగున మూసియుంచు న
వ్వువిదిని చందనం బలఁది ♦ వక్షముపైఁ దగఁ జెందిరంబు సాం
కవమును మెత్తి మేల్కుసుమ ♦ కన్నియ వన్నియ పట్టుచీరయున్
నవరణచేసి మేఖలను ♦ సొరుగఁ దాల్చిరి నన్నకౌనుపై. ౧౪౭౩

సీ॥ ఇంద్రాణి తాల్పంగ♦నిమ్మగు రిక్కల, రహినొప్పు తారహా♦రంబుగూర్చి
విద్రుమోష్ఠమునకు♦విమలమౌ కుంకుమ, రసముఁబో ల్తాంబూల♦రసము దడవి
సంతసగాఁగ వ♦సంతంబు చుట్టి వా, రతి మెత్తి దేవతా♦రక్షచేసి
యబ్జమండలము నం♦దంకమృగంబన, హైమ విమానంబు♦నందు జేర్చి
తే॥ విబుధకాంతలుతనుచుట్టి♦వెలసియుండఁ, గపులుదైత్యులు గుంపులై♦క్రందుకొనఁగ
వెడలఁ బాఱి నల్లల్ల వి♦భీషణుండు, నీరద శ్యామ గాత్రు స♦న్నిధికి వచ్చె.
తే॥ ఇవల మునులు సురలు వారి♦యింతులును ప్ర, మోదమున గుంపులై చేరి ♦ మురియుచుండఁ
దక్కువార లానంద వా♦ర్తలు వచించు, చింపుగాఁ జూచు వేడ్క వ♦హించి క్రమ్మ.

ఉ॥ ఉత్తమవంశ దీపిక య ♦ యోనిజ సాధ్వి పవిత్ర సద్గుణో
దాత్త చరిత్ర సీతను ము ♦ దంబునఁ జూడఁగఁ గోరి గుంపులై
యొత్తుగఁ గూడి త్రోవ యిడ ♦ కుండఁగ దైత్యులు దండపాణులై
మొత్తి యదల్చి త్రోచిరి ప్ర ♦ మోదుల మోములు నల్లఁ బాఱఁగన్.

క॥ అత్తఱి రాముఁడు సందియ, మొత్తిన చిత్తంబుతోడ♦నుదాస్ఫ్రీంతంబున్
దత్తఱయగు జలన ముని, సత్తము లట జరుగు తీరు ♦ చయ్యనఁ దెలుపన్.

క॥ అది వినియు వినక మున్నే, పెదవులు చలియింప దైత్య ♦ విభుఁగని యాఁగా
ఖేదముల నీవుండఁగఁ జే, యుదురే? తగునయ్య ప్రేమ ♦ యుతుల నలంపన్ ?

క॥ కదనంబుఁ జూచు వేడుకఁ, బదువులుగా వచ్చియున్న ♦ వారి నురక యి
ట్లదలించుచు దండింపం, బదరి యనుమతించు నతఁడు♦ప్రాజ్ఞుండగునే? ౧౪౧౯
ఉ॥ శూలియుఁ జక్రియు న్నలువ ♦ సుందరులౌ విడనాడి వచ్చుటల్
పోలునె; తక్కు వేలుపుల ♦ పొల్పులఁ దెల్పఁగనేల? రావణ
స్త్రీలును పూరుషుల్ ముదము ♦ చే నిటురా నదలించి మోఁదుచుం
బోలఁట క్రూరకృత్యమగు♦దోసము సుమ్మిటు సేయఁగూడునే? ౧౪౨౦
ఆ॥ సాధు జనుల నిట్లు ♦ నడ్డసేయక యడఁ, గించి తలుమఁగొట్టు ♦ టించుగాదు
వలదటంచుఁ గినిసి ♦ పలుక విభీషణుఁ, డడలుతోడ నొడలు ♦ వడఁక నిలిచె.
శా॥ సీతాదేవి రణాంగణంబును సమీ ♦ చీనంబుగాఁ జూచి త
ద్భూతక్షోణిని కంకగృధ్ర ఖలి భు ♦ గ్భూతాలికిం బందువుల్
ప్రీతించేసిన రామభద్రు విలస ♦ ద్వీరాంక వేషంబు నెం
తో తృప్తింగనఁ దత్తఱించు హృదయాం ♦ దోళంబుతో వచ్చుచున్.
శా॥ నా పాతివ్రత్యము తేటగాఁ దెలిపి పై ♦ నా నాథు వీర్యంబు న
ద్దీపింపం బొనరించి నాకులము కీ ♦ ర్తి న్నిల్పి యీలోకమున్
బాపం బూనిన మారుతాత్మజున కీ ♦ చొప్పె నా నతిత్వంబు సు
శ్రీ పెంపొందఁగ నిశ్చలంబగు చిరం ♦ జీవిత్వ మీఁ జాలునే? ౧౪౨౩
శా॥ నాపైనిప్పు దశుద్ధమయ్యె నసువుల్ ♦ నాశిల్లి నట్లయగున్
క్షేమంబొక్కటి చూడ నానగొని యు ♦ ర్వీన్నిల్చె; నేటొందు చే
తో మోదంబును కూర్ప లేదనుచు సం ♦ తోషించి సౌదామినీ
జీమూతం బననొప్పు చాపయుత రా♦జీవాక్షు వీక్షించెఁదాన్. ౧౪౨౪
చ॥ తొడరి సురాంగనామణులు ♦ తోడనురాఁగ విమానమందు వ
చ్చెడి జనకాత్మజాత తన ♦ జీవములన్ మరలన్ వహించు న
వ్వడువున డిగ్గెఁ దన్ముఖము♦భాస్కర వంశ పయోధి సోముఁ డ
య్యెడ హృదయాంబుజం బలర ♦ నిమ్మగు సొమ్ముగఁ గాంచునట్లుగన్.
మ॥ ప్రతిజన్మంబున జీవితేశుఁడయి తో ♦ డ్పాటొంది దుర్జన్మ దుష్
కృతతుల్ ద్రోచి ముదంబుగూర్పు నిజ హృ♦త్కాంతున్ మనోమోదన
స్థితి వీక్షించి భజింపఁగంటి నిఁక నే ♦ జీవించియున్నన్ నరే
గతియింపన్ సరె యంచు వీడినది యా ♦ కంజాక్షి హృత్తాపమున్.
క॥ ప్రేమస్వరూపుఁడగు శ్రీ, రాముఁడు వీక్షించె జనక ♦ రాజ కుమారిన్
రామాజన తిలకము సా, ధ్వీమణి సద్ధర్మకీర్తి ♦ దేవతను రహిన్. ౧౪౨౭
క॥ గ్రీష్మలత పోల్కినున్న వ, పుష్మతి తనపాదములకు ♦ మ్రొక్కినఁ గని యా
యుష్మంతుఁడు గనెఁ గన్నుల, నుష్మ మురలఁ జూచు దండ♦శూకము పోలెన్.

—: శ్రీరాముఁడు సీతను కఠినోక్తు లాడుట :—

మ॥ నియతిం దప్పిన దైత్యునింటఁ గుల హా ♦ నిం గూర్చి నీచాన్నముల్
బ్రియమారన్ భుజియించి శీలమును బా ♦ విం ద్రోచి యున్నాళ్లు దు
ష్క్రియలన్ లజ్జను వీడి చావక యిటుల్ ♦ జీవంబుతో నుండి యే
భయముల్ లేకిట కేల వచ్చితివి? సం ♦ భావింతు నంచెంచితో? ౧౪౭౯

చ॥ నిను చెఱ వీడ్చి చేకొనఁగ ♦ నీరధి గట్టి నిశాచరాన్వయం
బును మొదలంటఁ గూల్చి రణ ♦ భూమిని రావణు సంహరింపలే
దినకుల గౌరవంబు మఱి ♦ యేను వహించిన ఱట్టుచేఁ గలం
కను వహియించు నంచుఁ గడఁ ♦ కం జనుదెంచితి వైరిఁ గూల్చితిన్.

చ॥ అమృతమువంటిదికంటె నధి ♦ కానను బ్రాణుల మేని మాంసముల్
నమలుచు నాసవంబు వ్యస ♦ నంబుగ నానుచునుండి మాయెడన్
సుముఖత చూపుచుండు టికఁ ♦ జొప్పడునే మరణించుదాఁక? శ్రే
మమున నొనర్చు విందులవి ♦ మావది కెంత రుచించునో కదా! ౧౪౮౧

తే॥ పావన కులంబునం జనిం ♦ పక ధరిత్రిఁ, గీటకము వలె జన్మించి ♦ కీడుపడఁగ
సత్ప్రవర్తన మడుగంట ♦ జార్చి జన్మ, సంపదకుఁ దగువని పూర్తి ♦ నలిపినావు.

చ॥ ఇలువడి సత్ప్రవర్తన మ ♦ నీర్ష్య యనీచత శ్రీకరత్వముల్
లలిత విచక్షణత్వము క ♦ లంకములేని మనంబు కీర్తియున్
గులసతి లక్షణంబు లవి ♦ కూల్చితి పట్టుగ నీదు పుట్టుచే
విలస దుదారతం గనని ♦ పృథ్వివు కీర్తిని బోలె దుర్మతి! ౧౪౮౩

ఉ॥ ఉత్తమ వంశజాతలు వి ♦ యోగము గల్గినవేళ నింద్రియ
స్వృత్తి నడంచి శీలమున ♦ భంగము కాని దిటంబు గల్గి సం
పత్తను భోగహీనతఁ ద ♦ పం బొనరింతురు మాన రక్షకై
చత్తురు గాని నీకరణి ♦ సౌఖ్యము లందరు శీల నాశినీ! ౧౪౮౪

చ॥ నిలువక పొమ్ము నామదిని ♦ నీదగు చేష్టలు ఱంపములై గం
డ్రలుగను కోయుచుండె నెద ♦ వ్రయ్యఁగఁ జావుము కాదయేని నీ
వలచిన చోటికేగి సుఖ ♦ వర్తన నుండుము నిన్ను నైకొనం
గొలువదు బుద్ధి యంచుఁ గొఱుఁ ♦ గ్రుచ్చిన భంగి వదల్చి పల్కఁగన్.

చ॥ ఇనకులు పల్కులన్ విని య ♦ హీన గుణాత్మకులైన వేలుపుల్
మునులును వానరుల్ దనుజ ♦ ముఖ్యులుఁ దక్క నతి జనంబులున్
మనము కలంగఁబాఱి మఱు ♦ మాట వచింపఁగలేక ఘోరుసన్
బనవిరి విహ్వలించిరి ప్ర ♦ పాతము నొందిరి సోలి ధాత్రిపై. ౧౪౮౬

ఉ॥ నాయన! పుణ్యరూప! రఘు ♦ నాథుఁడు పల్కిన పల్కువింటె? నా
కీ యవశిష్టకార్యము ర ♦ హిం బయిలోటము మాని క్రచ్ఛలం
జేయుమ యన్న నాతఁడును ♦ చేడ్పడి దున్నహా వేపమాన చిం
తాయత నాంతరంగుఁడయి ♦ యన్న మొగంబును గాంచె నర్తితోన్.

మ॥ జలజాతేక్షణు సమ్మతిం దెలుపు సం ♦ జ్ఞం గాంచి స్వప్రాణముల్
వలవంజాలని లక్ష్మణుండు వగతో ♦ వాపోవుచున్ వెక్కుచున్
బెలుచం గట్టెలు తెచ్చి పేర్చి యనలున్ ♦ బ్రేరేఁచె నై దేహి ని
శ్చల చిత్తంబునఁ జేరవచ్చె జనముల్ ♦ సంతాపముం బొందఁగన్.

—: సీత యగ్నిం జొచ్చుట :—

సీ॥ లోకజనని వహ్ని ♦ లో డిగ డాయంగ, వేదంబులెల్ల వా♦విడిచి యేడ్చె
ధర్మదేవత యెదఁ♦దల్లడిల్లెను వ్రద, క్షిణము సేయఁగఁ బ్రాణి♦గణములేడ్చె
నమరకాంతలు బోరు♦మని విలపించిరి, బ్రహ్మయుఁ గూడని♦వగిది యనిరొ
హారుఁ డక్రమంబనె♦హరిరాజు బెగ్గిలె, భల్లుకేంద్రుఁడు పార♦వశ్యమొందె

తే॥ విన్నఁదనమొందె వెగచి వి♦భీషణుండు, స్రుక్కి స్రుక్కి సౌమిత్రియు♦సామ్మసోయె
చెడితిరా యంచుహనుమప్ర♦న్పడియె రామ, విభుఁడునిర్విణ్ణుఁడై చాల♦వెగడుగుడిచె.

సీ॥ అనుచితంబని సుర♦లన్యాయమని సాధ్యు, లాగడంబని యక్షు♦లనుచునుండ
ఎడకడయని సిద్ధు♦లెగ్గని యురగులు, తగని పాడియని గం♦ధర్వు లనఁగ
గరుడు లాక్రందింప♦ఖగములు విలపింపఁ, బంచభూతంబులు♦పరితపింప
దనుజులు మిడుకంగ♦మనుజులు నడుకంగ, స్థావర జంగమ♦తతి గలంగ

తే॥ శేషుఁడోడుఁగంగలోకముల్♦శోషిలంగ, గ్రహచయంబులు తమతమ♦గతులుదప్ప
సాగరంబులు రోదన♦స్వనము నింప, ధారణీజాత యగ్నిం బ్ర♦దక్షిణించె. ౧౮౯౯

చ॥ వలగొని నిల్చి రామ పద ♦ వారిజముల్ మదినుంచి యో హుతా
నల! సకల క్రియాధికర ♦ ణా! వినివారిత లోక కల్మషా!
చలమతినై మనంబున వ ♦ చస్సునఁ గర్మల నెన్నఁడేనియున్
గలఁక వహింతునేని నను ♦ గాల్పుము బూది యొనర్పు పావకా! ౧౯౦౦

తే॥ నియతి నిట్లు ప్రార్థించి యా♦నీరజాక్షి, తనదు గాఁగాచికైన చం♦దమ్మ్యయందు
చొచ్చునది పోలెఁ జిచ్చునఁ♦జొచ్చి నిలిచె, సర్వ జీవులు మనముల♦సంతపింప.

చ॥ అవనిని సర్వభక్షకుఁడ ♦ నై యపవిత్రుఁడనైన యేను నీ
యువనిజ సోఁకుచేత విమ ♦ లాత్ముఁడ నయ్యెదనంచు నుబ్బు నా
పవన సఖుండు నగ్గరిత ♦ పావన పావక కీల మాఁడి రా
ఘవు కడ కేగుదెంచెఁ గర ♦ కంజములన్ వహియించి జానకిన్. ౧౯౦౧

మ॥ పతి వీక్షించిన శిఖిచే నయిన తా ♦ పస్వేద బిందు వ్రజ
స్థితి యొక్కింతయు మాఱలేదు జడలోఁ ♦ జెల్వారు నవ్వాబ్జ సం
తతి సుంతేనియు వాడలేదు కనుమా ♦ తాత్పర్య యుక్తుండనై
దితి వంశాంతక! నిష్ఫలం బెడలు ధా ♦ త్రిం దాఁకునే యెన్నఁడేఁ?

శా॥ నా దౌర్బల్యము నుంతయేని మది నె ♦ న్నం బోక కోపంబుతో
వైదేహిం గన నామె స్వీయ మహిమా ♦ వహ్నిం దగుల్వడ్డ నా
డా దౌర్భాగ్యము నేమియందు? మఱి నా ♦ యత్యాహితం బేదియుం
లేదే? నావయిఁ గిన్క యేలొకో? జగ♦ల్లీలా మహానాటకా! ౧౫౦౩

మ॥ అని ప్రార్థింపఁగఁ గాంచి లోకములు స్వా ♦ స్థ్యం బొందె బిగ్గిల్లి పో
లిన ప్రాణంబులు నెమ్మదిం గొనియె వి ♦ క్లేశంబు సంధిల్లఁగా
ముని పత్నుల్ సురదైత్య కాంతలును స ♦ మ్మోదాత్మలై యేచి ల
జ్జను పాటింపక గంతులేసి రవరా ♦ సంతోషముం బొందరో? ౧౫౦౪

మ॥ గురు మోదంబున వానరావళు లొగిం ♦ గోలాహల ధ్వానముల్
వరఁగం జేసెను రాముఁ డయ్యెదను నా ♦ వైశ్వానరుం గాంచి దు
శ్చరితం దీని దహింపకిట్లు కరుణం ♦ శాంతుడవై కాచు టె
వ్వరి యాదేశము? నీవెవండ? వన భా ♦ స్వద్వహ్ని తా నిట్లనున్.

సీ॥ నే నగ్నిదేవుండ ♦ నీదేవి వైదేహి, తనదు పాతివ్రత్య ♦ దహనుచేత
దహియింప సహియింప ♦ దలఁచు గాకిటు నిను, శరణంబు వేఁడితి ♦ నంతయింతొ
వేలోకో యెఱిఁగియు ♦ నెఱుఁగనివై వడి, జగములయందున ♦ పతులు పతుల
నెడసియుండిన సంశ ♦ యించుట సందేహ, ములఁ బలువిధములఁ♦గలఁకలేని

తే॥ కరణిఁ దొలఁగించుకొనుట నా♦కడన జరుగు, చుండుటయు లోక సహజమై ♦ యుండుఁగాని
యామెచే నేను శుద్ధుండ నగుచునుండ, నామె పరిశుద్ధురాలని♦యనఁగనేల?

సీ॥ సత్యశీలుండగు ♦ సామీరి పలుకుల, మన్నించి చేపట్ట ♦ కున్న నీవు
శంకానివృత్తి ని♦శ్చయకీర్తిఁ జూపు నా, వయ వాక్యముల నెంత♦నమ్మఁగఁగలవొ?
అమరులు మునులు లో♦కములు హాహాకార, మొనరించుచుండుట♦వినఁగ రావొ!
ధర్మంబు వీడి య♦ధర్మంబుపై బుద్ధిఁ, గూర్చు విధం బెందు♦నేర్చికొంటి?

తే॥ పూతచారిత్ర కోపంబె♦పూనునేని♦మొగులు కురియునే! మేదిని♦వగులకున్నె?
తగవు నిలుచునె? జగములు♦తలరకున్నె?, అంబుజభవుండు గడగడ♦లాడకున్నె?

తే॥ అనుచు వచియించి తపియించు♦నగ్ని విబుధ, వరులు గొనియాడ జీవులు♦వనటనీఁగ
సీతఁ గొనితెచ్చి రాముని♦చెంత నిలుప, నతఁడు కారుణ్య సహితుండై♦యనియె నిట్లు.

ఉ॥ నీవు సమస్త జీవులకు ♦ నీతి తొలంగని సాక్షివాటచేఁ
బావని లోకనిందలకుఁ ♦ బాత్రముగానిది సీత యంచు సం
భావనసేసి పల్కితివి ♦ బంధురరీతిఁ బరిగ్రహింపవా
దేవిని వానరావళియు ♦ దేవతలుం బరితోషమందఁగన్. ౧౫౯

మ॥ అని వాక్రువ్వ సమస్తలోకము లపా ♦ రానందముం బొందె బ్ర
హ్మాను గీర్వాణులు గాంచి రాను తన మా ♦ యన్నిల్పి సామాన్యుఁడా
జనునిం బోలెను తన్నుఁ దా నెఱుఁగకే ♦ చందాన నున్నట్టి రా
ముని పూర్వస్థితిఁ దెల్పవే యనుడు వే ♦ ల్పుంబెద్ద రానిట్లనున్. ౧౬౦

—: రాముని పురుషోత్తమత్వమును నలువ వెల్లడించుట :—

శా॥ శ్రీరామా! పురుషోత్తమా! రవికుల ♦ శ్రేష్ఠుండవే నీవు? నా
మేర న్నిల్చిన యల్పబుద్ధి నగు న ♦ న్నిష్టోక్తి సైరింపు నీ
తీరుం దెల్పఁగ శక్తిలే దుపనిష ♦ త్సిద్ధాంత తత్త్వంబ వా
ధారాధేయము లీవ సర్వమును నీ ♦ తత్త్వంబ లోకేశ్వరా! ౧౬౧

మ॥ తొలి తత్త్వంబగు మాయయున్ మరల నం ♦ దుంబుట్టు తత్త్వంబు ల
వ్వలఁ బైనుండెడు జీవుఁడున్ దనకుఁ బై ♦ భావ్యత్వభారాళికిన్
తలఁపం దెల్ప వచింపరాని పరమా ♦ ర్థం బీవ నీమాయచేఁ
గలుగు న్నిల్చు నశించు లోకములు నం ♦ కల్ప ప్రభావంబునన్.

చ॥ తొలిస్థితియైన సృష్టియును ♦ తుట్టతుదిం గల నాశమున్ సదా
చెలఁగని నీస్థితి న్నిగమ ♦ శీర్షములే పరమార్థమంచు ని
న్నొలసి వచించుఁగాని మఱి ♦ యొక్కరి నిక్కడ నీగుడెంచు వా
రలఁ గలవానిఁ దెల్పవు ప ♦ రాత్పర! సర్వ జగన్నియామకా! ౧౬౩

చ॥ శివునకు నాకు నింద్రునకు ♦ శిష్ట జనాళికి జీవరాశికిన్
దవిలియుఁ దాలకుండు పర ♦ తత్త్వము నీవని శాంతచేసి ని
క్కువము నెఱుంగు పుణ్యజన ♦ కోటి భవాంబుధి దాఁటి జేరు ని
స్తవన విశేష పాత్రుఁడగు ♦ సత్యపదంబును గొంద్రు రాఘవా! ౧౬౪

మ॥ తలిదండ్రుల్ తమ జన్మకారకులుగాఁ ♦ దర్కించు నజ్ఞుల్ ధరా
స్థలిలో సంసృతి పాశ బద్ధులయి సం ♦ తాపించి తత్త్వార్థమున్
దెలియంజాలక చావు పుట్టువుల యా ♦ త్రిం గుందుచున్నారు వి
జ్ఞులు నీతత్త్వ మెఱింగి ముక్తులయి సం ♦ శోభింతు రెల్లప్పుడున్. ౧౬౫

చ॥ ఇరువది యైదు తత్త్వముల ♦ కీవలి తత్త్వము నీవుగాక వే
ఱొరుఁడొకఁ డుండఁడంచు శ్రుతు ♦ లొక్కటఁ జాటుచునుండె నుత్తముల్

కరులగు వారు దీని కిఁకఁ • గావలెనే వ్యవహార ధర్మమం
దారిమిక సాక్షి నమ్ముటకు • నుత్తర సాక్షిని పోలె నిద్ధరన్ ౧౫౧౬
మ॥ అనుమానాదిక సప్రమాణగతి నూ • హాపోహముల్ సేఁత నిన్
గన సాహాయ్యపడంగ లేవు వనజా • క్షా! వేద శీర్షంబులున్
నిను నీ డావతికంబు పూర్తిగఁ గనన్ • లేకున్న విజ్ఞాన వీ
క్షణచే జాడగ నిర్ణయించి తెలుపున్ • సర్వేశ! సర్వాత్మకా! ౧౫౧౭
ఉ॥ నీ కరుణా విశేషమును • నెమ్మి వహింపని వారి కింద్రియో
ద్రేకము విఘ్న కారకము • దివ్య భవద్గుణ రూపలక్ష్మ్మ న
స్తోకముగా నెఱుంగుటకుఁ • దూకొని యింద్రియ శక్తిఁ గ్రుంచ నీ
శ్రీ కమనీయ పాద వర • నీరుహ చింతన దక్షు నున్నదే? ౧౫౧౮
శా॥ నీకుం బుట్టువు లేదు మాయయుఁ దొలి • న్నీనుండియే పుట్టె నీ
యాకాశాదిక పంచభూతములు త • త్త్వాదుల్ ప్రపంచంబు మా
యాకార్యంబులు కల్పకాలమున మా • యన్ డిందు సమ్మాయ నీ
యాకారంబున డిందు నీకు విలయం • బా లేదు విశ్వాత్మకా! ౧౫౧౯
మ॥ మించుం బోలె క్షణంబులో నడఁగు ని • మ్మిథ్యా ప్రపంచంబు సృ
ష్టించం బెంచఁగ ధర్మము న్నిలుప ను • శ్రీసంప నేకాకృతిన్
ప్రాంచద్రీతిని నన్ను పెల్వఱుచు వం • శ్యంబందు నాశంబు గ
ల్పించం బూనదు హాఁగియుండవును తృ • ప్తిం గానరా విన్నఁడున్.
శా॥ నాయూపంబున సృష్టిచేసి జగముల్ • నారాయ ణాఖ్యుండవై
యారం బోషణ చేసి శూలివయి సం • హారంబు గావింతు వీ
వారా! రే పవళుల్ దినేశ్వరుఁడు ప్ర • త్యక్షంబుగాఁ జేసి లో
కారాధ్యుండును లోకబంధుఁడగు చా • యం బొంది సర్వేశ్వరా!
శా॥ సంపన్నాంధత నొందు మూ మదము నా • శంబంద సత్కృంచరుల్
చంపన్ యత్నముచేసి పాఱఁదఱుమన్ • సంరక్షులై నిన్ను ప్రా
ర్థింపన్ మాకయి పెక్కుజన్మములు ప్రీ • తిం బొందుచున్నారు నీ
కింపుం గూర్చెడి యాటలో విధులొకో • యీకార్యముల్? రాఘవా!
మ॥ ప్రణవార్థంబు నెఱుంగువారె పరమార్థంబైన నీతత్త్వమున్
గణనీయంబుగఁ గాంచువారలును ము • క్తద్వేషులున్ ముక్త బం
ధనులున్; దక్కినవారు సంచలిత త • త్త్వజ్ఞానులై జన్మ కా
రణ మాయంబడి ముక్తి మార్గమును చే • రం బోవ రెన్నాళ్లకున్.
క॥ నీయావ మిట్టిదయ్యును, గారాముగ జగములెల్లఁ • గాంచి పెనిచి ధ
ర్మాయాధీఁ జూపు జననిని, కారాని వచస్సులాడి • కలఁపకు తండ్రీ. ౧౫౨౪

—: శంకరుఁడు దశరథు నటకుఁ బిలిపించుట :—

క॥ అని నలువ పలుకఁ బశుపతి, యను నీవు జగంబులకు న ♦ నాదివి త్రిజగ
జ్జననియగు సీత లక్ష్మిమె, యనఘా! నీచరిత నీవ ♦ యరయఁగలేవో! ౧౯౨౫

మ॥ జనలోకేశ్వర! సీత వీడఁదగు దు ♦ శ్చారిత్రయే? లోక పా
వన చారిత్రను శంకచేసి విడువన్ ♦ భావింతువే నిన్ జగ
జ్జని సందోహము తల్లడిల్లి తుది నా ♦ శంబందు నట్లాట దే
విని నిందించుట మాని చేకొనుము మా ♦ వేఁడోల్కులునన్ రాఘవా!

చ॥ పశుపతి యిట్లు పల్కి సుత ♦ బాధ వియోగ మహోగ్ర వేదనా
వశమున జీవము ల్విడిచి ♦ వైష్ణవలోకము నొందియున్న యా
దశరథుఁ జేరి సీతనయు ♦ దండకు వచ్చి తదీయ చిత్త క
ర్కశతను మాన్పి మోదము జ♦గంబులకుం గలిగింపవే యనన్. ౧౯౨౭

మ॥ భవు నాజ్ఞం గొని ప్రేమపాత్రమగు క్ర ♦ వ్యాదాన్వయధ్వంసి రా
ఘవు వీక్షించు కుతూహలంబు మది నూఁ ♦ గంజేయ నుత్కంఠయుం
దవులం బంక్తిరథుండు భూమికి దిగన్ ♦ దండ్రిన్ సమీక్షించి దా
నవభీముండగు రామభద్రుఁ డెరఁగెన్♦దత్పాద పద్మద్వయిన్. ౧౯౨౮

చ॥ తెలచిన సూను బాహువులఁ ♦ దియ్యముతోఁ దగ గ్రుచ్చి యెత్తి శాఁ
గిలిగొని బాష్పవారిఁ జిలి ♦ కించుచుఁ జక్కఁగఁ జేర్చి నా భవం
బిలఁ గడు ధన్యమయ్యెనని ♦ యింద్రియవారము తృప్తి సెందఁగాఁ
దొలఁగ వియోగవేదనయు♦దుర్భర మోదముతోడ నిట్లనున్. ౧౯౨౯

ఉ॥ కేకయరాజపుత్రి మది ♦ గీడ్పడఁ గోరు వరంబు శూలమై
యాఁకున నామదిం దొలుచు ♦ చుండెఁ గుమారక! నేఁటిదాఁక నీ
లోకహితంబు పేర్మి నత ♦ లోక జయేందిర చేరి మించు ను
శ్రీకనునీయ వక్షమిటు ♦ చేరఁ దొలంగెను నేఁడు నాయనా! ౧౯౩౦

ఉ॥ ఉత్తమ పుత్త్రులం గని మ ♦ హోన్నతి నొందిన వారు మత్పదా
యత్త రజంబునేని సమ ♦ మందని యుద్ధుర గౌరవంబు నా
కిత్తఱిఁ గూర్చినాఁడవు మ ♦ హేచ్ఛను నీవలనన్ గడించితిన్
సత్తమలోక సౌఖ్యమును ♦ శాశ్వతకీర్తి జగత్త్రయంబునన్. ౧౯౩౧

మ॥ మును నాచేత నమస్కృతుల్ గొనిన వే ♦ ల్పుల్ శాపనశ్రేష్ఠులున్
నను సంస్తోత్రము సేయ నిప్పటి జగ ♦ న్మాన్యాంగముం జూడుమా
వనజాతాసను నుద్దిగా వినత భా ♦ వస్ఫూర్తిఁ గల్పించి తీ
వని సంతోషము మీఱఁ బల్కి మిథిలా ♦ ధ్యక్షాత్మజం జూడఁగన్,

చ॥ జనకజయుఁ గాఁ మహా వినయ ♦ సంగతయై పద పంకజాత వం
దన మొనరింప నామెను ము ♦ దంబున లేవఁగనెత్తి ప్రేమముఁ గాఁ
దనుక శిరంబు మూరుకొని ♦ తల్లిరో ! నీవలనఁ గాఁ నిజంబుగా
వినకుల ముజ్జ్వలించె లభియించెను నాకును నిత్య సౌఖ్యముల్. ౧౫౩౩

శా॥ పాతివ్రత్యబలంబు లోకులకుఁ దె ♦ ల్పంబూని నీభర్త యీ
రీతిఁ గాఁ ఖ్యాతియుతో గ్రవహ్ని దుముకం ♦ బ్రేరేచు నవ్వార్త నీ
చేతంబందున నిల్పకమ్మ! జనముల్ ♦ చిత్తంబు శంకించుచో
హేతిన్నిల్పి పరీక్ష సేయుటలు బ్రాఁ ♦ తే ? కోపము న్మానుమా !

ఉ॥ బంగరు నిప్పునం దిడుట ♦ వన్నియ పెచ్చొనరింపఁ జుమ్మ ! సా
రంగ విలోచనా ! సుగుణ ♦ రాజిత చిత్తుఁడు నీమగండు మీఁ
దం గొనరాదు ఱట్టు వసు ♦ ధాస్థలి నంచుఁ దలంచి యిప్డు డీ
యంగమునఁ గాఁ విధించి పెల ♦ యంగ నొనర్చె భవన్మహత్త్వముఁ గాఁ.

చ॥ పరమ పతివ్రతా మణుల ♦ పాలి విభూషణమా ! ధరిత్రి యో
వరతర జన్మభూమి యగు ♦ వైష్ణవ లోకమునుండి ధారణీ
భరమును మాన్పఁ బొంటె ఖగ ♦ వాహనుతోడ జనించి తీవు నీ
యురు గుణరాశిఁ గలఁగ ♦ రెయుంటు నెయుంక్కటి ! లోకపావనీ ! ౧౫౩౪

చ॥ అని వచియించి యించుకయు ♦ నల్కవహింపని శాంతచిత్తయీ
జనకజ యందు డెందమున ♦ సంతసమంది యనంతరంబు నె
మ్మనమును బ్రేమ కట్టుటయు ♦ మచ్చికతోడ విభుండు తన్నుదా
ఘనముగఁ గౌఁగిలించుకొను ♦ దైవదినక్కనఁ జేర్చె లక్ష్మణుఁ గాఁ.

మ॥ కనుల న్నీరు జటాభరంబుఁ దడుపఁ గాఁ ♦ గాటంబుగాఁ జేర్చి రా
ఘవయా ! యన్నను వెంటనంటి సుఖ ని ♦ ద్రాభుక్తులం ద్రోచి యా
తనిఁ గాపాడుచు లెక్కలేని భవ బం ♦ ధంబుల్ వెసం ద్రోచి నా
ఘన చిత్తాధుల నీఁగినాఁడవు కదా ♦ కారుణ్య వారాన్నిధీ ! ౧౫౩౫

మ॥ బలు మాయావిని మేఘనాదు ననిలో ♦ భంజించి గెల్పొందు నీ
బల చాతుర్యము లెల్ల వేళలను గీ ♦ ర్వాణుల్ ప్రశంసించు చా
రలు లోకంబుల గాసిపెట్టు దనుజ ♦ వ్రాతంబుఁ జెండాడి ని
ర్మల ధర్మంబును నిల్పినాఁడవు జగ ♦ న్మాన్యుండవై పుత్రకా ! ౧౫౩౬

చ॥ అని వచియించి రాము విభు ♦ నర్మిలిఁ గాంచి గుణప్రపూర్ణ ! నీ
కొనరఁగ నీయ సాధ్యమగు ♦ నొండు వరంబును లేదు మున్న న
య్యనఘుఁడు పల్కు మిమ్ము విడుగి ♦ నవ్వలి లోకమునందు గాంచి యు
న్నన దగ వేఁడనుంటి నది ♦ నాకు లభించె నిఁకేమి కోరుదుఁ గాఁ ?

చ॥ అయినను కోర్కె యొండు గల ♦ దయ్య! మనంబున దుష్టశీలఁగాఁ
గయికొని చూడఁ దోఁతువడు ♦ కైకయుఁ దత్తనుజుండు నాకుఁ ద
ల్లియు ననుజుండుగా నవఘు ♦ శింప వరంబు నను(గహింపుమీ
మొయికొని యన్న నెల్లరును ♦ మేలని మెచ్చిరి రాము చిత్తమున్.

మ॥ అకలంకుండగు తమ్ముఁ డట్టి యతఁడే ♦ యాఁ బట్టభంగంబు త
క్కక కావించి తపస్విరూపమును పైఁ ♦ గాంతారవాసంబు గొం
కక నీకిచ్చిన (క్రూరదైత్యయగు నా ♦ కైకేయిపైఁ గోప మిం
చుకయుం దగ్గద యంచుఁ దం(డి యన ర ♦ క్షోమర్దనుం డిట్లనున్.

మ॥ పొరపొచ్చంబులు లేక యుండఁగఁ (బజల్ ♦ బోషింపఁగాఁ బూను నా
ధరణీభారము సర్వపాపములకున్ ♦ స్థానంబయో నంచు వి
ద్వరులెల్లన్ వివరింపఁగా నెఱిఁగి త ♦ త్కార్యంబు నీకొంట నా
నెరసై యున్నది గాక తల్లియెడ మ ♦ న్నింపన్ దోసంగున్నదే ? ౧౫౪౩

చ॥ వర బల మానముం గడచి ♦ వర్తిలు రాఘవుఁ డిట్లు నల్కఁ బం
క్తిరథుఁడు కిన్కమానెఁ బరి ♦ కించిన విన్న మునీం(ద్ర నిర్జరుల్
వరములు రెండు కోరె మును ♦ వారక కైకయు రాముఁ డిప్పుడున్
వరములు రెండె కోరెనని ♦ వందుల పోల్కి నుతించి రయ్యెడన్. ౧౫౪౪

మ॥ సకలామోదక సత్య రత్నణమునై ♦ శస్తంబుగాఁ గీర్తి వ
ర్ధక దేహంబును గొన్న భూ విభుఁడు నీ ♦ తారామ సౌమి(త్రులన్
(బకట(ప్రేమను భూమిపై నిలువ నా ♦ జ్ఞాపించి యా రెండు కో
రికలన్ వారల కిచ్చి తా మరలెఁ గీ ♦ ర్తింపంగ బృందారకుల్. ౧౫౪౫

—: వేలుపులు రాముని కోరిక లొసంగుట :—

ఉ॥ కూటువలైన ఖేచరులు ♦ కూర్మిని రాముని గాంచుచున్ నిరా
ఘాటముగాఁగ నీవలచు ♦ కార్యము కూర్తుము కోరుమన్న నీ
పోటునఁ గూలినట్టి కపి ♦ ముఖ్యులు (ప్రాణములొంద వార లే
చోటునఁ జేరినన్ వలయు ♦ చొక్కపు టోగిర మొందఁ గోరుదున్.

చ॥ వరదులు (బహ్మరుద్రులు త ♦ వస్వులు నిర్జరులున్ గకుప్పతుల్
వరము ననంతు నవ్యయు భ ♦ వ(ప్రకరంబులఁ (దుంచు నచ్యుతున్
పరిపరి రీతులం దనియఁ ♦ (బార్థనముల్ పొనరించి నీకృపా
నిరతిని పొందుఁగావుత వ ♦ నేచరవర్గము కోరినట్లనన్. ౧౫౪౬

చ॥ కడనము పూను నాటఁగొలె ♦ గండఱి నీల్గిన వానరావళుల్
మునుమున జీవముల్ గొని (ప ♦ పూర్ణబలంబున లేచి పోర్మై

పొదలుచు హుంకృతుల్ సలిపి ♦ మోములు కన్నులు తృప్తినొంద శ్రీ
సదనుని గాంచి జే యనుచు ♦ నందడి సేయుచు డాయు నంతటన్. ౧౫౮౭

సీ॥ వేల్పులు రాముని ♦ వేడ్కతోఁ గాంచి యి, ట్లనిరి వివేచించి ♦ యాదిదేవ!
వనచరసేనతో ♦ వచ్చి కృష్ణాష్టమి, వేళ సువేలపై ♦ విడిసి నాఁడె
పోరు ప్రారంభించి ♦ పోలనుదిండులఁ గూల్చి, పౌలస్త్యు నని నమా ♦ వాస్యఁ ద్రుంచి
లోకంబులకు మేలు ♦ శోకతోఁ జేసితి, విట్టులే పదునాలు ♦ గేండ్లు కడచె
తే॥ నేఁడు పంచమి నీ వేగి ♦ నియతు భరతుఁ, జేరవేని యాతఁడు గూలుఁ ♦ జిచ్చునందు
పరగ నడువుము యని పల్కి ♦ సన్నుతించి, తమ నివాసంబులకు నాఱ్ఱఁ ♦ దరలినారు.

—: సీతా రామ లక్ష్మణులు పుష్పకము నధిరోహించుట :—

తే॥ గడువు నేఁటితోఁ దీఱెఁ ♦ దమ్ముఁడు గతింప, మా కులంబును నశియించు ♦ మాఱులేదు
కాన నేఁడె చేరఁగఁదగు ♦ కర్జమునకు, వలయు సాధన మున్నదే ♦ తెలుపవయ్య!
సీ॥ రాముఁ డిట్లని తత్త ♦ ఱంపడఁగని విభీ, షణుఁడను దేవ పు ♦ ష్పకము కలదు
పౌలస్త్యుఁడు కుబేరు ♦ భంగించి కొన్నది, వానికిఁ బరమేష్ఠి ♦ దీని నొసఁగె
నుత్తమ జనముల ♦ చిత్తంబులఁబలెఁ, బరిశుద్ధమైనది ♦ వనచరాళు
లెల్ల నెక్కినఁ జగి ♦ యింప దందేగినఁ, గోరి నేఁడె యయోధ్యఁ ♦ జేరవచ్చు
తే॥ ననుచు వడిగఁ దెప్పింపుమా ♦ యనుచు రామ
చంద్రుఁ డానతి యిడలోక ♦ చయ ముఁబోలు
పలువు వేయి సూర్యులఁబోలు ♦ మెఱుపు గలుగు
పుష్పకంబు నైర్ఋత్యేంద్రుఁడు ♦ పొసఁగఁ దెచ్చె.
తే॥ పుష్పకము ధారణీ డిగ్గ ♦ భూవరుండు, నేఁడు నిజముగ నాకోర్కి ♦ నెగ్గెననుచుఁ
దలఁచి దాని నధిష్ఠించెఁ ♦ దత్క్షణమున, విరులు విచ్చల విడిగ ఖే ♦ చరులు చల్ల.
తే॥ త్రిజట కేలొసఁగ్గంగాంచి వై ♦ దేహి సీత, లంక కధిదేవతంబోలి ♦ లలితరీతి
శుభము లొందుము గాకని ♦ సుభగు పజ్జఁ, జేరె నూర్మిళేశుఁడు నధి ♦ ష్ఠించెనంత.
ఆ॥ విలయ వేళ నాఁటి ♦ వెన్నుని యుదరంబుఁ, బోలి గగనమందు ♦ పొలుపు గొలుపు
పుష్పకమున నున్న ♦ భూపాలచంద్రుండు, హితులఁ గాంచి ప్రేమ ♦ నిట్టులనియె.
తే॥ నలువ వంశంబు నీచాట ♦ తలఁపుమయ్య, నిన్ను చేరువారికి మేలె ♦ నింపుమయ్య
పెంపు సొంపార లంకఁ బా ♦ లింపుమయ్య, యనుచు నవ్విభీషణునకు ♦ నాజ్ఞయొసఁగె.
తే॥ పంక్తికంధరు నీభుజ ♦ బలమువలనఁ, గూల్చితి మరమునఁ గ్లాంతి ♦ గూరియున్న
వానరులఁ గొని నీపుర ♦ వరముఁ జేరి, సుఖుని గమ్మని సుగ్రీవుఁ ♦ జూచి యనియె.
తే॥ మామనోబలోత్సాహ సం ♦ తుష్టికరమునఁ, గాక యేనింత పని సేయఁ ♦ గలనె! వాలి
తనయ! భల్లూకేశ్వర! నీల! పనస! యనుచు, ముదితుఁడై పల్కి సావిూరి ♦ ముదలయడిగె.

ఆ॥ వారు దిగులుతోడఁ ప్రాణంబులు నొడళ్లు, వడఁకఁ గనుల నీరు పుడమిఁ దడువ
నిన్ను వీడి జీవనిచయంబు భరియింపఁ, జాలమనుచు మఱియు జాలినొంది.

ఆ॥ కోసలంబు చేరి గురుతర పట్టాభి, షేక వేవమందు స్మితముఁగాంచి
పరమ మోదమంది మరలునట్లుగఁ గృప, సేయవయ్య వేడ్క చెలఁగు ననుచు.

మ॥ విమలప్రేమ విభీషణాదులు కపుల్ వేఁడంగ శ్రీరాముఁ డ
ర్యమవంశాంబుధిసోముఁ డా హితుల చి త్తావేగముం గాంచి సం
భ్రమ మేపారఁ గలంగకుం డిదియె నా భావంబు మిమ్మిట్లు దుః
ఖమునం ద్రోచి గడించు భాగ్యమది యే కల్గుండేని నాకుండునే?

మ॥ భరతత్రాణము వేగిరింప నిటులే భాషించితిన్ మిమ్ములం
బరిశోధింపఁగఁ గాదనం గపులు భా స్వత్పుత్త్రుఁడున్ దైత్య భూ
వరుఁడున్ మారుతి బొందితో సురపురిం బ్రాపించు చందాన సం
బరమున్ మోదము నొంది పుష్పకిలంబుం బాటించి భూజానితోన్.

తే॥ కపులతోడ సుగ్రీవుని గాడ్పుకొడుకు, నల విభీషణుఁ దక్కువారలను వడిగ
నెక్కఁడీ విమానం బని యెలమి రాఘు, చంద్రముఁడు సెలవిచ్చెను సంభ్రమమున.

తే॥ పలుకువార్తయే వినుబడు పగిది నేడు, పదుల వెల్వాలు వానర పతి విభీష
ణుండు నంగదుఁ డాంజనేయుండు నెక్కి, యెుక్క ప్రక్కఁ జేరిరి చాల నుత్సహించి.

తే॥ పదియునాలుగుజగముల ప్రాణులొక్క, మొగినికూర్చున్న నున్నలంబు మిగిలియుండు
దద్విమానమహిమ కర్తృ తతి దహించు, జ్ఞానులకెగాక తెలుప భూజనుల కరిది.

క॥ వనచరులు వనచరేంద్రుఁడు, దనుజులు దనుజేంద్రుఁడును ము దంబునఁ గొలువన్
జనకజతోఁ దమ్మునితో, మనుజేంద్రుఁడు వెలసె వేల్పు మన్నిని క్రియన్. ౧౫౯౨

తే॥ పుష్పకమ్ము గొప్ప జగమ్ముఁ బోలి వెలయ, రాముఁడయ్యెడ లోకకారకుఁడు నిర్వి
కారుఁడు నిరంజనుఁడు స్వప్రకాశ పుంజ, మగు పరంజ్యోతి పరమాత్ముఁ డనఁగ నొప్పు.

క॥ వానరనాథుండును లం, కానాథుఁడు దైత్యచయము కపి బృందంబుల్
మానవనాథుని యాజ్ఞను, మానవ రూపములఁ గొనిరి మక్కువతోడన్.

తే॥ తూర్పు పడమరలకు నేగు తోయజహితుఁ, డప్పు డుత్తరమున కేగు నటువలెనె యీ
వెడల నవ్విమానము రామ విభుఁడు జనక, జాతఁ గని యిట్లు పల్కె సం ప్రీతుఁ డగుచు.

—: రాముఁడు సీతకు త్రోవలోని చిత్రములఁ జూపుట :—

ఉ॥ మనము కళంకమాని కను మా యిది నే మది నెంచినట్లు లం
కను వలగొంచుఁ బోయెడిది కాంచుము తూరుపు వాకిలిన్ బ్రహ
స్తుని మన నీలుఁ డిచ్చటనె దోర్బల యుక్తి నడంచి కూల్చె ద
క్కిణమున ద్వారమిద్ది పరి కింపు సుపార్శ్వుఁడు చచ్చె నిచ్చటన్.

చ॥ ఇది పయిదిక్కు వాకిలిట • నింద్రజితుఁ మన లక్ష్మణుండు పెం
పొదవ వధించె నియ్యదియె • యుత్తర మార్గము రావణుండు బె
ట్టిదముగ పోరు సల్పి యిట • డించె శిరంబులు కేలు లెక్క లే
కదుఁగఁగఁ దున్మి తున్మి మడి•యించితిఁ దుష్టుతుదిఁ వరాంగిసీ! ౧౫౨౦

సీ॥ కపులు వారిధిఁ దాఁటఁ•గడఁగి చిత్రంబుగాఁ, గట్టిన సేతువు • గాంచు మబల!
తలిదండ్రులకు గురు•వులకు బంధులకుఁ జే, సిన కీడు దీని ద•ర్శింపఁ దొలఁగుఁ
దొల్లి యింద్రుని కంటి • శోయధిం జొచ్చిన, గంధమాదన మహే•కంబు సుదతి!
తత్పర్వతంబుతోఁ • దనిలి యీ వారధి, పొలుచుటచేఁ బరి • పూతమయ్యె

తే॥ జాహ్నవీ గౌతమీ సర•స్వతుల సింధు, యమున నర్మద కావేరు•లందు మునుఁగు
వారి పాపముల్ తొలఁగు న•ప్పగిది నిందు,మునిఁగి దీనిఁ జూచినఁ బాప•ములు తొలంగు.

సీ॥ పశుహంతకులు పిత్రు • పంచక హంతలు, పసిబిడ్డలం జంపు • పాప గుణులు
పడఁతుల నణఁకిన • పొడువలు తపసులఁ, దొడఁగి హింసించిన • దుండగీండ్రు
శరణార్థులం ద్రుంచు • నణఁజాతి పలువలు, వచ్చి భక్తిని సేతు• వారి మునుఁగఁ
బాపంబులను వీడి • పరిశుద్ధులై వేల్పు, లగుదురు పడవ లిం • దరుగుకొఱకు

తే॥ వింటికొనచేత వంతెన • విఱుచు చోటఁ, దానమాడిన పంచ పా•తకము లీఁగి
యిరువదొక్క జన్మంబుల • నింద్రభోగ, ములను పొంది సుఖింతురు • జలజనేత్రి!

తే॥ నిటలనేత్రుని జటయందు•నిలుచు గంగ, సేతువగు భాగ్యమును నేను•చెందనైతి
నంచు గొప్ప తపంబు గా•వించుచున్న, దనిన దీని గౌరవమున•కలవియున్న!

క॥ వరుణుం డిట నా పావక, శర వహ్నికి నోర్వలేక • శరణము చొచ్చెఁ
వరవర్ణిని! కాంచితె క్ర, మ్మఱ దీని నగస్త్యుఁ డుండు • మలయాచలముఁ.

చ॥ సురుచిరగాత్రి! చూడుమిది • సుందరశైలము విష్ణువాసముఁ
వరమతి వేంకటాచలము • భక్తిని గాంచుము నీ మనంబు నే
నరసితి వాయుపుత్త్రుఁడు ప్రి • యంబున నఁ దొలుదొల్తఁ జూచు చో
టరయుము ఋశ్యమూక మిది•యన్నులమిన్న! మనోహరంబుగఁ. ౧౫౨౧

తే॥ అమిత బలశాలి శత్రు భ•యంకరుండు, శూలిభక్తుండు నగు వాలి•కూలినట్టి
సీమ యిది యది చూడు కి•ష్కింధ సూర్య, సుతుఁడు పాలించు నగరంబు•శోభనాంగి.

చ॥ అనుటయు సీత సంతసిలి • యార్య! కపీంద్రులు పెక్కు పెల్లువల్
మన మలరంగ గొప్ప బహు • మానముతోఁ గొలువంగ నుందు ని
న్ననుసృతి సేయు నే నొకతె • నై యరుదెంచుట లెస్సగాదు నీ
యనుఁగులు వారివారి లలి • తాంగులతో నరుదేరఁ గోరదఁ. ౧౫౨౨

చ॥ పిలువుఁడి యన్న జానకి య•భీష్టము రాముఁడు సూర్యసూతితోఁ
దెలుపఁగ నాతఁడుం బిలిచి • తెమ్మని మారుతిఁ గాంచి పల్క నా

బలియుఁడు వ్రాతమానసుఁడు ♦ భావ్యను యంచరుదెంచి వానరీ
కులములఁ దోడితెచ్చె రఘు ♦ కుంజరు పత్ని మనంబు పొంగఁగన్.

ఉ॥ పావని వెంట వచ్చిన ప్ల ♦ వంగసతుల్ తమతేనికిన్ ధరి
త్రీ వరపుత్త్రికిన్ రఘు వ ♦ రేణ్యులకుం దగ మ్రొక్కి తాము సం
భావన సేయఁ దెచ్చు శుభ ♦ వస్తువులెల్లను మ్రోలనుంచి సీ
తా వనితా లలామను ము♦దంబునఁ గొల్చుచు నిల్చిరయ్యెడన్ ౧౫౯

చ॥ నడచె విమాన మర్కకుల ♦ నాథుఁడు పిమ్మట సీత కిట్లనన్
మడఁతిరో! కాంచితే భువన ♦ మాన్య జలాన్విత గౌతమీ నదిన్
జడిముడినొంద వంచకపు ♦ జింక కనంబడె నిందె యందు నీ
వొడయిక దాపురింపఁ గృశి♦యించితి మత్తగజేంద్ర గామినీ! ౧౫౨౦

చ॥ ఇది తపసుల్ వసించి తపి ♦ యించెడు దండక చిత్రకూట మి
య్యది భరతుఁడు వచ్చి నను ♦ ప్రార్థన సేసిన దింద ప్రేముడిం
బొదలఁగ నీవు పెంచినవి ♦ పూ లత కూనలు మంద మాన నం
పద చెలువొంద శాఖ లను ♦ బాహులతో నిను పిల్చెఁ జూడుమా.

ఉ॥ ఓ జనకేంద్ర పుత్త్రి! కను ♦ ముగ్ర తపోబల శాలియౌ భర
ద్వాజుఁడు శిష్యవర్గము ము ♦ దంబునఁ గొల్వఁ దపంబె రూప ము
త్తేజిత రీతి నొందె ననఁ♦ దేఁకువఁ గేలను దండ కుండికల్
భ్రాజిల వచ్చుచుండె మన ♦ రాక యెఱింగి యెదుర్కొనన్ వడిన్.

—: భరద్వాజుఁడు శ్రీరామాదులకు విందువెట్టుట :—

తే॥ అనుచుఁ దమ విమానము దిగ ♦ నాజ్ఞయిడఁగ, దేవలోకమె భూమి♦దిగినవగిది
నిలువ రామచంద్రుఁడు ముని♦నేత కెదురు, చని తదీయాంఘ్రియుగము మ ♦
స్తమునఁ దడసె.

తే॥ వత్సలత తోఁకఁగ భర♦ద్వాజమౌని, దీవన లొసంగి రాముని♦తివిరి యెత్తి
యలమిశిరము మూర్కొనియశ్రు♦జలముచేతఁ, దోయజాక్షుని జటలలో♦ధూళిఁ గడిగె.

తే॥ సీతయును లక్ష్మణుండును♦చేరి కేలు, మోడ్చ నాతండు దీవించి♦ముదము వలన
మనను కరఁగంగ నమృతంబు♦తనకుదొరకు, చందమున నుబ్బి కా వివ♦శత్వమందె.

తే॥ దనుజపతి వనచరపతి♦తక్కువారు, చేరి చేమోడ్ప వారి నా♦శీర్వదించి
వేద ఘోషంబుతో శిష్య♦వితతితోడఁ, బర్ణశాలకుఁ గొనిపోయె♦వారి నతఁడు.

తే॥ శాస్త్రయుతముగ నతిథి పూ♦జలను సలిపి, శ్రమము పోకార్చి పదపడి♦ప్రవిమలార్క
వంశదీపకు శ్రీరామ♦భద్రుఁ దనివి, సనక మటిమటి కని యిట్టు♦లనియెఁ దుదకు.

క॥ మునులు నరులు సుమనసులును, ఘనముగ భీతిల్లఁ గ్రూర•కర్మంబులు నె
ట్టన సేయు దనుజ కులములఁ, గునిమితి లోకముల మేలు•తోట్టఁగ రామా!

మ॥ ఖర మారీచ విరాధులన్ వనమునన్ • ఖండించి సాలంబులన్
శర మొక్కంటను ద్రోల్చి యింద్రతనుజుం • జక్కాడి వారాశి దు
ర్భర కోపంబున మాడ్చి రావణుని త • ద్వంశంబు నిర్వంశమై
పరఁగం గూల్చితి వెల్ల లోకములకున్ • బ్రాపింపఁగా శ్రేయముల్.

తే॥ చిత్రకూటంబు వీడి ద•క్షిణమునందు, గలుగు చెదుగుల నన్నిటిఁ•దోలఁగఁ జేసి
మరలి వచ్చెడు దనుక ని•న్మఱవలేదు, వచ్చితివి నేఁడు విందవై •వఱలుమయ్య!

చ॥ కరమున విల్లు దాల్చి జ • గంబుల గాసిలఁజేయు దుష్టులన్
దెఱచితి వెల్ల జీవులకు • నేమము నేకుడె నర్వదా తపో
నిరతియు నిల్చె మాకుఁ గరు • ణించితి నీకపథంబు చిత్తమా
భరతుని మీఁది వత్సలతఁ•బర్విడుచున్నది నీకు రాఘవా! ౧౫౧

చ॥ అతఁడును మైచెమర్పఁ గను • లందున నశ్రులు రాల వంది ని
శ్చితమతి లేక వేగుటయుఁ • జింతను దక్షిణ దిక్కు చూచుచున్
వితమతి దుఃఖమే తనువు • వీఁక భజించిన చందమొంది నీ
కతమె తలంచుచున్ గడ యు • గంబుగఁ ద్రోచెడు నేఁడు రాఘవా!

చ॥ వినుగుచు నింద్రియావళుల • వీఁక నడంచి దినంబుఁ గాయలన్
గనరులఁ దిన్చు సౌఖ్యములఁ • గాంచక కత్తృణ తల్పమందు దా
నినులఁ దోలంచుచున్ సతము • నిన్నె జపించుచు రాజధానికిన్
వసిగొని పోక పల్లియను • వానము చేయుచునుండు రాఘవా! ౧౫౩

క॥ పదితల లిరువది కరములు, విదితంబుగ నేలఁగూల • వింశతి బాహుం
గదనమునఁ గసిమసంగుచుఁ, జదిపిన రఘువీర! నిన్నె • జపియింతు సదా.

క॥ అలీల మాని పలుకఁగ, శూలియు వనమాలి తమ్మి • చూలి నుతింపం
జాలిన మీఁదయచే నేఁ, బోలఁగ ధన్యుండనైతిఁ • బుణ్యచరిత్రా! ౧౫౫

మ॥ అని సీతాపతి తెల్ప మానియును రా • మా! నీయభీష్టంబు దీ
ర్చను నాచిత్తము తత్తఱించె నన శ్రీ • రాముండు కేశ్రమం
బునకున్ మీఁవనమందు కాయ గనరుల్ • పుష్పాసవంబుల్ జలం
బును నిండారఁగ నుండుఁగాక యన నా • ఋణ్యుండు సంతుష్టుఁడై.

శా॥ కాకుత్స్థాన్వయ! నీకు నీహితులకుం • గావింతు సేవిందు నేఁ
డీ కాంతారము దేవలోకమగు నా • యిష్టంబు సంధిల్ల న
స్తోకప్రేమను పొందుఁ డంచొక హవి•స్సున్ జేల్వఁగాఁ గన్నదన్
నాకం బచ్చటి కేగుదెంచెఁ గవులా • నందంబునం బొందఁగన్. ౧౫౭

శా॥ సుగ్రీవాదులకుఁ మహేంద్ర విభవ ♦ స్తోమంబు నిండార సూ
ర్యాగ్రీయాన్వయ మండనాకృతికి రా ♦ జాన్నంబు చేకూర్ప న
వ్యగ్రుండై రఘురామ భూపుఁడు జగ ♦ త్ప్రాణాత్మజుంగాంచి నం
దిగ్రామంబున కీవు మున్నచని మ ♦ ద్వృత్తాంతముం దెల్పుచుఁ.

చ॥ భరతుని శీలముఁ దలఁచు ♦ భావములెల్లను పోలఁగాంచి చె
చ్చెరఁ జనుదెంచు మన్నఁగ వి ♦ శిష్ట పథంబగుఁ బోయి రమ్మనఁ
నరియని మారుతాత్మజుఁడు ♦ చయ్యన వాయుపథంబునందు తం
డిరి వడి చిత్తవేగమును ♦ డిందుపడం జని పోవు గ్రోవలో. ౧౫౯౯

తే॥ గుహుని గని రాము సేమమ్ము♦కోర్కిఁ దెల్పి, యవలి కేగెను రాఘవుఁ♦డసురవధము
సేయుపద్ధతిఁగంటిమి♦చిత్తమలర, భరతు వర్తనఁ గందమీ♦పట్టునందు. ౧౬౦౦

—: భరతుఁడు రాముని రాకకై పరితపించుట :—

సీ॥ ప్రతిదినంబును రామ♦పాదుక లర్చించి, యింద్రియంబు లడంచి♦యొరఁగువాఁడు
అన్నిచోటులఁ గల♦యనుకంప యొకచోటఁ, బూర్ణరూపము గొన్న♦పోల్కివాఁడు
కలిగియు నొల్లక ♦ కాంతార వాసుల, యోగరీతి భుజియించు♦చుండువాఁడు
చూచిన వెతతోడఁ♦జూచు దక్షిణదిక్కు, గాక వేఱొక దెస ♦ గననివాఁడు

తే॥ అన్న వాక్కు లెన్నటికస♦త్యములుగావు, వచ్చునని జీవముల నిల్పి♦వలచువాఁడు
కుడుచు నీటికి జీవాత్మ♦కును నిజంబు, జీవ మా రాముఁడని చింత♦సేయువాఁడు.

తే॥ రామ పట్టాభిషేక నీ♦రంబు గాంచి, శోక బాష్పవాహిని దరి♦గాంచలేని
భరతుఁ డానాఁడు జానకీ♦వరుఁడు వచ్చు, దినముఁగూర్చి యాలోచింపఁ♦దివిరినాఁడు

తే॥ తాను లెక్కించు లెక్కలోఁ♦దప్పుగలదొ, యనుచు గణకులఁబిలిపించి♦యడుగ వారు
తీఱు నేఁటితో వనవాస♦దీక్ష యనుచుఁ, బలుక భరతుఁడు మనమున♦భయము చెంది.

క॥ సంపద్భోగంబుల మది, నుంపని పుణ్యుండు నొచ్చి ♦ యుమ్మలికముతోఁ
గంపముతో ననుకంప జ, నింపఁగ నిట్టూర్చి తుదకు ♦ నేలఁ బ్రాలెఁ.

శా॥ నామీఁదం గృపగల్గునో కలుగదో ♦ నాయార్తి లెక్కింపవో
నామాటల్ మదినుంతువో యనుపవో ♦ నాకీడు మన్నింపవో
నామోహముం దిలకింపఁగాఁ దలఁపవో ♦ నాచిత్తముం గావవో
ప్రేమం దల్లులనైనఁ గాంచుటకు రా♦వే సత్కృపం జూపవే! ౧౬౦౧

శా॥ నాదౌర్భాగ్యము చేత నీకు నటవిఁ ♦ దాపించిరే శాత్రవుల్ ?
నీదాయల్ హరి శంభులైన ననిలో ♦ నిల్వంగనే నోర్తురే ?
కాదే నింకను కొన్నియేండ్లు భరత ♦ క్ష్మాపాలుఁడే రాజ్యముఁ
మోదంబారఁగ నేలనిమ్మనుచు నా ♦ మోదించితే ? యగ్రజా!

చ॥ అడవిని యుండుగాక మరి ♦ యాద నయోధ్యకు వత్తుగాక నీ
వొడయఁడ వట్టులుండెనటు ♦ లే జరపింతువుగాక యేదియున్
దడవక నా ప్రతిజ్ఞ ఫల ♦ దంబు నొనర్పుమటు నాకుఁ గర్జమా
విడిచెద నగ్నిలోనఁ బరి ♦ వేదన దీఱ మదీయ జీవముల్. ౧౩౦౯

మ॥ అనుజన్మా! యిటురమ్ము చేరువకు ని ♦ న్నర్థింతు నొక్కండు నీ
వనుకంపంగొని యీ వరంబు దయచే ♦ యన్ వేఁడెదన్ రామచం
ద్రుని యేవార్తయు వీనులం బడదు నా ♦ దుష్కర్మ సంప్రాప్తి న
గ్నిని నేఁజొచ్చెద నన్న వచ్చెదనుకన్ ♦ వీక్షింపు మీరాజ్యమున్.

మ॥ అన శత్రుఘ్నుఁడు విహ్వలించుచు హలా ♦ హాలంబు భక్షించు వి
న్నను వుం దోఁప వడంకి నేలఁబడి యు ♦ న్నా! యేమి దోసంబు నీ
కొనరింపం దలపెట్టినాఁడ? మది ని ♦ ట్లూహింపఁగాఁ బోలునే?
నను శిక్షింపఁ దలంచితేల? యిదియున్ ♦ నాచేయు దుష్కర్మమా?

చ॥ జనకుని సత్యవాక్యనిగఁ ♦ జల్పఁగ నన్న వనిం జొరంగ నే
వన మొనరింపఁ గానలకు ♦ బ్రాఁతిగఁ దమ్ముఁడొకండు పోవ రా
ముని పునరాగమావధియుఁ ♦ బోవఁగఁ దమ్ముఁ డొకండు జీవముల్
తనుకఁగ వీడుచుండఁ గడ ♦ తమ్ముఁడు రాజ్యము నేయుఁ జెల్లునే? ౧౩౧౦

చ॥ అడవుల నన్నయుండఁ బుర ♦ మందలి భోగములందఁ దమ్ముఁడన్
నుడి జగమాడునంచు మది ♦ నొచ్చి తపించుచునుండి యగ్నిలోఁ
బడుచును విన్న తమ్ముఁ డొద ♦ వంగలఁడంచుఁ దలంతుగాక యీ
యొడరు సహించి యేబ్రదికి ♦ యేలఁగఁ బోలును యీ ధరాస్థలిన్? ౧౩౧౧

శా॥ శత్రుఘ్నుం డిటు పల్కఁగా భరతుఁ డి ♦ ట్లు నొచ్చి యున్నెనసే
ధాత్రిం బాలన సేయుచుంటి నని తా ♦ దా రామభద్రుండు కా
నీ త్రోక్కాటము గూర్చుచుం దద్దెస వ ♦ హ్నిం జొచ్చి యే నిల్చుచోఁ
బుత్రప్రేమను కావవచ్చు జనమున్ ♦ బుణ్యాత్మ! నిష్పంపవే. ౧౩౧౨

—: కౌసల్య భరతు సమాధానపఱచుట :—

మ॥ భరతుం డిట్లు వచించు వార్త వినిగాఁ ♦ బ్రాఁకన్ జనంబెల్లఁ ద
త్తఱపాటొందెఁ బతివ్రతామణి కృపా ♦ ధారేయ కౌసల్య దు
స్తర కోపంబున సాహసంబు వలదో ♦ తండ్రీ! జగంబెల్ల ని
ర్భర దుఃఖంబునఁ గ్రుంగి కూలు ననుచున్ ♦ వచ్చెన్ విచారంబునన్.

చ॥ తలముడి వీడ మున్నడఁకఁ ♦ దత్తఱపాటున వచ్చు తల్లి న
య్యలఘుఁడు కాంచి యామె చర ♦ ణాంబుజముల్ తలసోఁక మ్రొక్కఁగాఁ

దలియుఁ గుమారు శీర్షమును ♦ తక్కక యక్కునఁ జేర్చి నాయనా!
వలదిటు సాహసంబు మము ♦ వారక కాచు సుతుండ వీవెగా! ౧౬౧౭

ఉ॥ నీ జనకుం డొనర్చినది ♦ నీ పెదయన్న వనంబు చేగుటల్
నాజగజంపు దుష్కృత గ ♦ ణంబు ఫలంబగుఁ గ్రమ్మఱిల్లరిన్
నాజనన ప్రభావమగు ♦ నాయన! నీదొనఁగేది యిందు? నీ
వీ జగ మీ విధాన నశి ♦ యింపఁగఁ జేయుట యుక్త కార్యమే? ౧౬౧౮

ఉ॥ నీవగినిం జొరం దలరి ♦ నీ ప్రజయుం బడు సేనయుం బడున్
జావక మేము నిల్తుమొకొ? చానలు మమ్ముల వెంబడింపరే?
చావదె ధర్మమున్? జగము ♦ సర్వము కూలదె వీటకాటనై?
యీవిధి పాపకర్మమని ♦ యెంచవొ? యేమి తలంచి తిట్టొదన్? ౧౬౧౯

చ॥ ధర్మయుతంబులై తనరు ♦ దద్దయు నీవను వెల్ల కాలమున్
ధర్మ విహీనపద్ధతిని ♦ తారుట గానమ యెన్నఁడేని నీ
ధర్మ గురుత్వ సంపదలఁ ♦ దక్కక నీవెఱుఁగంగ లేదు నీ
కర్మద నత్త్వధర్మములు ♦ శాశ్వతముల్ యుగ పాళి మాటినన్. ౧౬౨౦

ఉ॥ ఉత్తమ పుత్త్ర! రామవిభు ♦ లోకమునం కెక్కగు కోట్లు కూడినన్
బొత్తిగ నిన్ను ప్రేమమయుఁ ♦ బోలఁగఁ జాలుదు రేమి? పుణ్యమే
యిత్తెగ రూపమొందిన ర ♦ హిన్ వహియించిన నీవు చోవఁగా
రుత్తమె కాదె ప్రాణి నికు ♦ రుంబములోడ నజాండ మిట్టొదన్. ౧౬౨౧

ఆ॥ మాపు రాకయున్న ♦ రేపె రాఁగలఁడు నా, తలఁపు పొల్లుగాదు ♦ తప్పనేని
రామవిభున కేదొ ♦ రారాని యెడరు ప్రా, ప్తించె నంచు నెడఁద ♦ నెంచవచ్చు. ౧౬౨౨

తే॥ నీవె శాస్త్రధర్మంబులు ♦ నీవుతక్క, శాస్త్రధర్మంబు లోకమందైన ♦ గతి లేదు
ఒకఁడు మరణించెననియెంచి ♦ యుర్వినున్న, ప్రాణికోటులఁ జంపఁ బో ♦ ల్పడఁగఁదగునె? ౧౬౨౩

ఉ॥ ఉర్విని చావు పుట్టుకలు ♦ యోగ వియోగములున్ సుఖాదులున్
సర్వము కర్మజాల ఫల ♦ సంభవమౌటఁ దలంచి సాత్త్వికుల్
గర్వము మోహమున్ వదలి ♦ కాంతురు నిశ్చల సౌఖ్యమంచుఁ దా
నిర్వృతి గూర్చు రామ జన ♦ నిం గని కైక కుమారుఁ డిట్లనున్. ౧౬౨౪

తే॥ రాము సత్య వాక్యము దిన ♦ రాజవంశ, శీలమును చెడ జీవింపఁ ♦ జాల నాడు
ప్రతిన నెఱవేర్చుకొందు నీ ♦ పలుకువినని, దొనఁగుతుమియింపు మమ్మరో! వినుగుగొనక. ౧౬౨౫

ఉ॥ ఏనును సత్యపాలనకు ♦ నిమ్ముగ జీవము వీడు జేసినన్
మానుఁడనే కదా! జనకు ♦ మాత్తుల నొదలఁ దాల్చు చెన్నఁగా
జానకిజానికే విధియొ? ♦ జానుగఁ దక్కినవారి కుర్వరన్
బ్లానిక నగ్గఁ జేసికొనఁ ♦ బోలదొ? యొక్కడి పాడి? తల్లిరో! ౧౬౨౬

ఉ॥ తల్లి వచస్సు మీఱమియుఁ • దండ్రి నుడుల్ జవదాటకుండుటల్
పెల్లుగ నింపఁ బాత్రమగు • ప్రేమ నమూలముగాఁగఁ ద్రుంచుటల్
చెల్లిన ద్రొక్కి రామునకె • చెల్లదు నాకది చచ్చి నామదిన్
దెల్లడి చేసెదన్ గలువ • బృందముఁ బోసెదఁ బోదుఁ డిందఱున్.

—: హనుమంతుఁడు భరతుని చేరుట :—

చ॥ అని భరతుండు చేరఁజని • యగ్నిఁ బ్రదక్షిణ మాచరింపఁగా
జనముల గోడు క్రందుకొని • చయ్యన వ్యోమము ముట్ట నా ఘన
స్వనముల నాలకించి రఘు • నందనుఁ గార్యము మించెనంచు న
య్యనిల సుతుండు తత్క్షణము • నందుచు దాసి మహోగ్ర వేగుఁడై.

ఉ॥ డాయుచు రామచంద్రుఁడు క • డంకను వచ్చుచు నున్నవాఁడు న
న్నాయతనంబ దైన భవ • దాయువు పోయెనయేని రాఘవుం
డీయిల నవ్వలం బ్రదుక • నేర్చునె ? యని వల్కి తూఱి యం
దాయితమైన యగ్గి నతఁ • డాఱిచి బొగ్గులు చేసి వేల్చెదిన్. ౧౬౨

చ॥ పదపడి వచ్చి యాభరతు • పాద సరోజయుగంబు భక్తి న
న్నుదురు స్పృశింప మ్రొక్కుచు న • నుం బరిపూత చరిత్ర ! దాసుఁగా
మదిఁ దలఁపందగున్ సుజన • మాన్యుని రాముని రాక కన్న న
ల్పది గడె లింక నున్నయవి • వారక మీరు గణించి చూడుఁడీ.

శా॥ నా వాక్యంబుల యందసత్య మది యు • న్నన్ మీకు నే ముందుగా
నీ వహ్నింబడి కూలువాఁడ భరతా • శ్రేష్ఠుం డిదో వచ్చెఁ బ్రో
ద్దావర్తించి జనించుదాఁక నిలుమా • యామీఁద రాఁడేని నీ
వీ వైశ్వానరులోనఁ జేరుము మనో • భీష్ట ప్రకారంబునన్. ౧౬౩

తే॥ వచ్చుచో ప్రేమమున భర • ద్వాజమౌని, నిలిపి విందుపెట్టఁగ వేఁడ • నిలిచినాఁడు
శాసింపఁడు నీమీఁది • తత్పరతను, నీరజాక్షుండు నంశీల • నిరత ! భరత ! ౧౬౪

—: భరతుఁడు రాముని రాక విని యానందించుట :— [హావఁ

తే॥ అతఁడు ప్రేమతోఁ బంపిన • యానవాలు, కలదు చూడుమా యనుచు నుం • గరముఁ
గాంచినంత నయ్యది వారి • కనులఁ జొచ్చి, ప్రాణముల నిల్పె నమృతంబు • పగిదినొప్పి.

తే॥ రోదనము పోయి యానంద • రుదము చెలఁగ, కేఁడి కన్నీరు చల్లనై • వెడలసాఁగ
వ్రాలియుండిన తలలెల్లఁ • బైకిలేచెఁ, జేతులెల్లను హనుమ నా • శీర్వదించె. ౧౬౫

క॥ పలుమాఱు హనుమకు మ్రొక్కుచుఁ, జెలఁగి నటన సేయు సుగుణ • శీలుఁడు భరతుం
డలఘుని ముద్రిక నక్కున, నలరెం గనుల నద్దికొని యా • నానందించెన్. ౧౬౬

తే॥ వేఱుదుగిఖంబు లేనట్టి•విమలగుణుఁడు, భరతుఁడప్పుడునిక్కముగ్రొత్త•భరతుఁడయ్యె
భుజము లుప్పొంగ మేనును•బూరటిల్లె, నతని యానంద మదిచెప్ప•నలవియగునె?

తే॥ నలువుగాఁ బ్రేమ మధికమై•నవ్వు నేడ్పు, నిక్క గంతులు వైచును•నేలఁబడును
చేష్టదక్కఁ బూరించును•చెమ్మరించు, మలసి తిరుగు మారుతికి న•మస్కరించు.

క॥ ఆడుం బాడుఁడు రాముని, గూడుఁడు కూడుండి యతని•గొమరగు కీర్తిం
బాడుఁడు పాడుఁడు వెతలను, వీడుఁడు వీడుండి యితని•వినుతింపుఁడనుఙ్. ౧౬౩౫

తే॥ కఠినమానస యగుకైక•కడుపునొచ్చు, ననుచుఁ బెద్దలకుఙ్ మ్రొక్కు•నవనిపులకు
మ్రొక్కుఁ జెలువలకును మ్రొక్కు•మ్రొక్కికొనును, పృథివిఁ గల్గువంటిది
నుమా • ప్రేమగుణము. ౧౬౩౬

తే॥ పిదప భరతుండు హనుమంతుఁ•బ్రీతిఁగాంచి, యెవ్వఁడవు తెల్పుమా విన•నిచ్చగింతు
విప్రవేషంబుతో వచ్చు•విబుధపతివొ?, ముగురు మూర్తుల నొకఁడవై•తగుదువనిన.

చ॥ అతనికి నాంజనేయుఁ డను • నంజనిపుత్త్రుఁడ వానరుండ మా
రుతిని దినేంద్రనందనుని • రూఢిగఁ గొల్చుచునుందు జానకీ
పతికి హితంబు జేతమును • బత్తెము గోరక కూర్చు దానుఁడఙ్
నుతగుణపూర్ణ! నీకడ క • నుంగున వచ్చితిఁ గామరూపినై. ౧౬౩౭

క॥ నాయల్పరూపమును నీ, వీయెడఁ గన నిచ్చగింతు • వే యని మార్చెఙ్
గాయని నిర్జరు లార్వఙ్, భీయును మోదంబు నెడఁద•వికవిక నేయఙ్. ౧౬౩౮

తే॥ పవనసూనుని దొడ్డరూ•పంబుగాంచి, భరత శత్రుఘ్నులతి మాత్ర•బద్ధమనిరి
సకల జనములు నుడివడి•చావకున్న, దిగ్భ్రమం బొంది పెల్లు భీ•తిల్లినారు. ౧౬౪౦

తే॥ వాయుపుత్త్రక! మేమాడు•వాక్కులెల్ల, నీచెవుల కందునంతటి•నిస్వనంబు
కలవి కావు కావునఁ దొల్లి•కరణి నిలిచి, నీ మహా రూప మడఁపుము•నియతచరిత!

తే॥ అనుచుఁ బ్రార్థింపఁ దనవేడ్క•ననుసరించి, చిన్నరూపంబు గై కొన్న•విబుధనుతుని
కమిత సంపదలను భూమ•కాంబరముల, నుపదగాఁ గైకపుత్త్రుఁడు•డొసఁగెఁ బ్రీతి.

తే॥ మత్త గజము లుత్తమజాతి•మణులు తురగ, చయములును పాఁడి గోవులు •
స్యందనములు
మంచి కేదారములను స•మ్మాన పూర్వ, కముగ నొసఁగెను హనుమకుఁ•గైకసుతుఁడు.

తే॥ తమ్ము వీక్షించి మన పౌర•తతికి నెల్ల, రామవిభు నెదుర్కొన బంధు•రాజితోడ
బయలు వెడలుఁడియనియన్ని•వాడలందు, తెలియఁజాటింపఁ జేయుము•తెలఁగుఁగాఁగ.

తే॥ తోరణములు గట్టించి వీ•థుల నలంక, రింప రథగజాశ్వంబుల•రీతిగాఁ గఁ
బొలుపు నేయింప మంగళ•పూర్ణకుంభ, ములను పెట్టింప వలయు ద్వా•రములను పసుపు.

తే॥ క్రమముగా భరద్వాజునా◆శ్రమము వెడలి, ముత్తెముల పందిరుల మర్చి◆పురము నెల్లఁ
గ్రొత్తదగునట్లు సేయించి◆కొమరు మీఱ, మంగళారావములను చె◆లంగఁ జేయ.
తే॥ అనుచు శత్రుఘ్నుఁ డప్పుడ ◆ యరుగుదెంచి, శుద్ధగుణయుతుఁడును బహు ◆ శ్రుతుఁడు హితుఁడు
మంత్రియును ప్రాజ్ఞుఁడైనను◆సుమంత్రుఁ గాంచి, భరతునాజ్ఞను వివరించె◆బంధురముగ.
సీ॥ ఆవార్త చెవిఁజొచ్చి◆నంత సుమంత్రుఁ డ, త్యానందమునఁ దన్ను◆తాన మఱచి
భేరులు మ్రోగించి ◆ వీథివీథికిఁ జని, కకుబంత విశ్రాంత◆కలిత కీర్తి
రావణ సమవర్తి◆రామమూర్తికి నెదు, రేగులు సేయఁగ రాచ◆కొమరులు బల
వితతులు పురజనుల్◆వేడ్కతోఁ గైసేసి, పోసి రండనుచు మీరు◆ఘోషణంబు
తే॥ సేసి రండని కింకర◆శ్రేణి నంప, వారు చాటించి రంత న◆వ్వార్తకు విన్న
ప్రజలు కోలాహలము సేయఁ◆బత్తనంబు, పూర్ణ చంద్రోదయాంబుధి◆పోలుపునొందె.
సీ॥ రాము నెదుర్కొన◆రండను చాటింపు, పేదకుఁ బెన్నిధి◆విధమ యయ్యె
రాము పెండ్లికి మున్ను◆రండని చాటించు, కరణి నొప్పారెను◆మురజ రవము
అఱువదివేల యక్షౌహిణుల బలంబుఁ, బౌరకాంతామణుల్◆పౌరవరులు
రాజకుమారులు◆ప్రార్థించు సంపద, తొమ్మనైన చందాన◆ముదమునొందె
తే॥ పొదలి నడచిరి తల్లులు◆ముగురు వసుఁడి, శిబికలం దెక్కి వెడలిరి◆శిష్టజనులు
బంధువులు పరివేష్టింప◆భరతరాజు, లీలగా హనుమంతుని◆కేలుపట్టి.　౧౬౪౯
తే॥ రామభద్రు పాదుకలు శి◆ర్షకములుగాఁగ, నిరుగెలంకులఁ జైఁడిచా◆మరలు వీవ
గజఘటలు మున్నుగా నేగఁ◆గలితపాండు, రాతపత్త్రంబు నీడలో◆నరుగుదెంచె.
మ॥ కృప మమ్మేలిన రామచంద్రు నెదురం ◆ గేల్వట్టి హామీరి గో
న్నృప సంపూజ్యుఁడు పాదచారియయి తా ◆ నేతెంచుచున్నాఁడు వ
చ్చు పథంబందున రాలు కేఁడిగొని కా◆ల్బుం గోమలాంఘ్రి ద్వయం
బవధారంబని చాఁటెనో యన నిసుం◆డస్త్రాదిఁ జేరెన్ వెసన్.　౧౬౫౦

—: భరతున కాంజనేయుఁడు రాము నుదంతంబు దెల్పుట :—

తే॥ భరతుఁ డయ్యెడ మారుతి◆వదనము గని, రామచంద్రుఁ డిన్నాళ్లు గా◆రవముతోడ
నెచ్చ టెచ్చట నుండె? నే◆మేమిచేసె? వివరముగఁ దెల్పవే యన◆వినిచె నతఁడు.
తే॥ పురమునందుండుటయుఁ దల్లి◆వరమువలన, వనుల కేగుటయును నీవు◆వచ్చి యతని
వేఁడి పాదుకలం గొని◆వెడలుటయును, తెలుప నేటికి కవ్వలి కథ◆దెలుపువాఁడ.
ఉ॥ దండకయందు చేర ముని ◆ తండము రాక్షస హింసఁ దెల్పి నీ
యండను చేరినార మిఁక ◆ నాపద దీరిచి కావుమన్నఁ గో

దండధరుండు రాక్షస వ ♦ ధం బొనరించె దశాస్యుఁగూల్చె ను
ద్దండ పరాక్రమంబున య ♦ థావిధిఁ దెల్పెద నాలకింపుమా. ౧౭౭౪

చ॥ తన యునికిన్ గ్రహించి రిపు ♦ దప్పక పౌరులు మాటిమాటికిం
బనుపడ వచ్చివచ్చి తన ♦ భావము మార్చెదరంచు దండకా
వనమును చేరుచోఁ జెనక ♦ వచ్చు విరాధుని గూల్చి యవ్వలన్
దనుజులఁ గూల్చ మానులకుఁ ♦ దా నభయం బొనఁగెన్ మహాత్మకా!

మ॥ పదియేం డ్లచ్చటనుండి రాఘవుఁడు త ♦ ద్వాక్యప్రకారంబుగా
నుదధిం ద్రావు నగస్త్యుఁ జూడఁ జని యా ♦ యుత్కృష్ట దేవర్షి కాం
తు దలిర్పంగ ముకుందు కార్ముకము న ♦ త్యయ్యంపుఁ దూణీరముం
బ్రదరంబుల్ తరవారి బొందడము గా♦రంబార నీయం గొనెన్. ౧౭౭౫

తు॥ అవలన్ వారు జటాయువుం గలిసి నె ♦ య్యంబార సేవించి పం
చవటిం జేరి కుటీరమందు దినము ♦ ల్సాగించుచుండంగ దా
నవి యొక్కర్తుక చుప్పనాక యెదురై ♦ నారీమణిన్ జానకిన్
దవదాహంబును పోలె ముట్టి కొని పోఁ ♦ దర్కింప సౌమిత్రియున్.

మ॥ కని యా రక్కసి కర్ణనాసిక లొగిన్ ♦ ఖండింప నాదైత్యయుం
గినుకం బోయి ఖరాదులం గలిసి యా ♦ కీడ్పాటు దెల్పంగఁ ద
ద్దనుజుల్ కోప సమేతులై బలముతో ♦ దర్పించి శ్రీరామచం
ద్రునితోఁ గయ్యముసేసి మాఁడి రగినిం ♦ దూదింబలెం గ్రచ్చుఱన్.

శా॥ లంకాద్వీపము చేరి శూర్పణఖ పొల ♦ స్త్యున్ సమీపించి శా
నంకెం బొందిన పద్ధతిం దెలిపి మీ ♦ నాంకధ్వజంబో యనం
బొంకం బారు విదేహకన్య చెలువం ♦ బుం దెల్పి ప్రేరేఁపఁగా
లంకేశుండును వచ్చె సీతఁ గొని పో ♦ లంకించి మారీచుతో. ౧౭౭౯

శా॥ మారీచున్ హరిణంబుగాఁ బనిచి తా ♦ మౌనీంద్ర వేషంబుతో
శ్రీరామాంగన యున్న భూమిని పెక ♦ ల్చెం జేరిపైఁ బెట్టె నా
దారిం బోవఁగనీక యడ్డు విహగేం ♦ ద్రస్వామిఁ జక్కాడె లం
కారాజ్యంబునఁ గార నుంచె జనక ♦ క్ష్మాపాల కన్యామణిన్. ౧౭౮౦

ఖు॥ ఎలయింపం గమకించి దవ్వులకుఁ ద ♦ న్నీడ్చించు మారీచు రా
ట్కుల సింహుండగు రాఘవుండు విశిఖ ♦ క్రూరాహతిం గూల్చి య
వ్వల వైదేహిని రోయుచున్ జనకుఁడౌ ♦ పక్షీంద్రు వీక్షించి కొం
దలపాటొంది సమాచరించె వడి నా♦ర్ధ్వ ప్రక్రియల్ భక్తితో. ౧౭౮౧

సీ॥ వదపడి సీతను♦వెదకుచు దక్షిణ, దిశ కేగుదెంచుచుఁ♦దివిరి పట్టు
వికృత రూపుఁ గబంధు♦వికటశాపము మాన్పి, శబరి చేసిన యుప♦చారములను

[ప్రేమను గైకొని•యీమె తెల్పిన త్రోవ, నిన సుతుఁ జేరి స్నే•హించి వాలి
వలనఁ గల్గిన దుఃఖ•ములఁ దీర్తునని యభ, యము దయచేసి సా•లములఁ గూల్చి

తే॥ వాలి వక్షంబు భేదించి•ప్లవగ రాజ్య, మును దినేంద్రసూతికిఁ బ్రేమ•మున నొసంగి
వానకాలంబు కడచు న•వ్వాలనుండు, వడఁగ రమ్మనివంపె న•య్యానుసుతుని.

సీ॥ గజుఁడును గవయుండు•గంధమాదనుఁడును, పనసుండు నీలుండు•వాలిసుతుఁడు
శరభుండు ఋషభుండు•శతబలి మైందుండు, ద్వివిద జాంబవదాది•వీరవరులు
డెబ్బది కొల్లుపల్•బ్రబ్బిన సేనతో, వానకాలము దాఁటఁ•బ్లవగ విభుఁడు
వచ్చి యచ్చట నన్ని•వలఁకుల సీతను, వెదకు పద్ధతులను•విశదపఱచి

తే॥ నాల్గుభాగము ల్గాఁగ సై•న్యంబుచేసి, యొక్కొక విభాగ మొక్కొక•దిక్కు వెదక
వడిగ నెలలోనఁ గ్రమ్మఱి•వచ్చునట్లు, కఠిన శాసన మొసరించి•కదఁక నంపె.

ఉ॥ అంగద జాంబవంతులు ర • యంబున దక్షిణదిక్కు చేరి స
న్నంగనఁ గాంచి రమ్మనఁగ • నంబుధి దాఁటితి లంకఁ జేరితిన్
రంగుగ సీతఁ గాంచి రఘు • రాముని వార్తల విన్నవించి యా
సంగతి రామచంద్రునకుఁ • జక్కఁగఁ దెల్పితి నంత సందఱున్. ౧౬౪

ఉ॥ దక్షిణవార్ధిఁ జేరుతఱిఁ • దక్కక రాముని శౌర్యసంపదల్
రాక్షసరాజుతోఁ దెలిపి • రాముని కాంతను విడకున్న నీ
యక్షయ లక్ష్మి నాశమగు • నన్న విభీషణుఁ డిట్టి దానవా
ధ్యక్షుఁడు వెళ్లఁగొట్ట నతఁ • డార్యుని జేరఁగ వచ్చెఁ బ్రీతిమై. ౧౬౫

శా॥ కాకుత్స్థుం డభయం బొసంగి వెన లం • కారాజ్య మున్వేశనీ
పీఠం బట్టము గట్టి శాంతియుతుఁడై • వీరుండు ప్రార్థింపఁగా
నాకర్ణింపమి రోషభీషణ ముఖుం • డై చూడ సప్తాంబుధుల్
చీకాకై జలమింక మాఁడెను సుర • శ్రేష్ఠుల్ విశోకింపఁగన్. ౧౬౬

ఆ॥ శరణు శరణమంచు•వరుణుండు ప్రార్థించెఁ, దరులు గిరులు ప్లవగ•వరులు దెచ్చి
వనధిఁ బూడ్చి దనుజ•వరుని లంకను జుట్టి, చేసినారు వీర•సింహరవము. ౧౬౭

శా॥ శైలానంబుఁ జెకల్చు బాహువులు ది • క్సారంగ శృంగంబు లా
భీల ప్రక్రియ నాటినట్టి యురముల్ • భీకైన శీర్షంబులున్
లీల న్నేలకు వ్రాల్చి వాని యనుజున్ • వేఁటాడి రాముండు ని
ర్మూలించెన్ దనుజాన్వయంబు ప్రముదం • బుం బొంద బృందారకుల్.

ఆ॥ దనుజ యువక వరులు•దనుజేంద్ర సుతులును, లక్ష్మణాస్త్రములకు•లక్ష్యమైరి
సంగరాంగణంబు•శవమయమయ్యెను, సురలు మునులు ముదము•చోద్యమంద.

ఆ॥ అసుర సిద్ధ సాధ్య•యక్ష గంధర్వాదు, లెలమి సతులతోడ•నిలకు వచ్చి
వినతి నిలిచి బహుళ•వినుతులు చేసిరి, తొలఁగె లోకములకు•దొసఁగు లనుచు,

చ॥ అమరఁగ రావణాదులకు ♦ నంతిమకార్యము లెల్ల సద్విధి
క్రమమునఁ జల్పుమం చనుర ♦ కాంతు విభీషణు నంపి జానకీ
రమణిని కోపగించి యెదు ♦ రన్ శుచినిల్పి పరీక్షచేసి శాం
తము వహియించె రాఘవుఁడు ♦ ధాతృమహేంద్రులు సంస్తుతింపఁగన్.

చ॥ అనఘుఁడు సత్యవాక్యుఁడగు ♦ నాజి విమానమునందు వచ్చి సం
తసమున మ్రొక్కు సూనులను ♦ తత్పరతన్ బిగి కౌఁగిలించి మె
చ్చి నడలు మోదవారి నభి ♦ షేకము చేసి విదేహకన్యకన్
గొనరని ప్రేమతోడఁ గయి ♦ కొమ్మన రాముఁడు సమ్మతించుచున్.

ఉ॥ పెంచిన తల్లి కైకవయిఁ ♦ జేరిమి నాఁడు కుమారుపైని ము
న్నుంచిన నిష్కళంక లస ♦ దుత్కట భావము నుంచ వేఁడెదన్
గాంచక యీవరమ్ము నొసఁ ♦ గూర్పుమ యన్న నొసంగి సత్యస
త్త్వాంచితమూర్తి యీజనకుఁ ♦ డాదటఁ జేరె సుకుందలోకమున్. ౧౬౨౩

చ॥ పదపడి వేల్పులున్ మనసు ♦ పాటిస పెక్కువరంబులీయ డె
బ్బదియగు వెల్లువల్ దనుజ ♦ బంధులు రాఘన వీరనాథు ల
ర్వది యగు నేడుకోటు లల ♦ రంగ విభీషణుఁ డిచ్చెఁ బుష్పకం
బదియుచు మీ వియత్పథము ♦ నందు జవంబున వచ్చుచుండెడిన్. ౧౬౨౪

ఆ॥ నెమ్మి రాఘవుండు ♦ నిన్ను దలంచుచుఁ, దమ్ముతోడ జనక ♦ తనయతోడ
సకల హితులతోడఁ ♦ జని భరద్వాజుని, యాశ్రమ స్థలంబు ♦ నందు చేర.

తే॥ అతఁ డాతిథ్య మీయంగ ♦ ననువుపఱుప, నిన్ను గాంచి యీముద్రిక ♦ నీకుఁ జూపి
యాఱడింపంగ నన్నంపె ♦ నురవడి మెయి, రామచరిత మిద్యాది మహా ♦ రాజ తిలక!

మ॥ భరతుండంతయు సావధానమతియై ♦ పాటించి యాలించి ని
ర్భర మోదాద్భుత సంభ్రమంబు లెద నా ♦ రం గూరి యుల్లాద నా
దర పాత్రుండయి యొక్కతమ్ముఁడు నను ♦ ద్ధాత్రిన్ సహాయుండుగా
వరసాహ్యంబు వినంగనోచితిని దా ♦ ర్భాగ్యుండ నేనిట్టుడన్. ౧౬౨౫

ఆ॥ అనుచుఁ బలికి భరతుఁ ♦ డధిక నిర్వేదంబు, తోడఁ గాలిసడక ♦ తోడ హనుమ
తోడ నడచి చేరెఁ ♦ దోయజాక్షుఁడు తొలి, గట్టు నెక్కుచున్న ♦ గంగ కడకు.

శా॥ ఘోరాకారుల రావణాదులను క్రే ♦ ణ్కోల్చెసి యుద్ధక్షయ
శ్రీ రాజిల్లఁగ రాఘవుండు నగరిన్ ♦ శ్రీదేవి భూదేవి త
న్నారాధింప మహాభిషిక్తుఁడగు నం ♦ చానందుఁడై పూర్వ ది
గ్వీరుం డంపిన కాన్కయౌ యను లలిన్ ♦ విభ్రాజిలెన్ భానుఁడున్.

మ॥ అకలంకుం డటఁ గాలకృత్యములు నా ♦ ప్పారంగఁ గావించి పా
దుకలన్ భక్తిని పూజచేసి మఱి వా ♦ యూలాత్మజుం గాంచి యై

త్యకులాహిప్రజ పక్షిరాజ! రవితే • జా! నీవు వాక్యావళుల్
వికటార్థంబును పొందఁగానగునె యీ • విశ్వంభరన్? మారుతీ!

మ॥ కపిసైన్యంబులు దైత్యవాహినులనం • ఖ్యాకంబులై వచ్చుచో
విపులక్షోణి భరింపలేక వెగడున్ • వేపొంద ధూళి వ్రజం
బుపరి వ్యోమముఁ గప్పదే? యలబలం•బుద్వేలమై లేచి స
ప్త పయోరాశుల ఘోషణంబు పగిదిన్ • వర్తిల్లదే? పావనీ! ౧౬౮౧

మ॥ పరివారంబులు నిండియుండెను ధర • ద్వ్యాజాశ్రమం బింక ద
వ్వరయన్ లేదు ప్రశాంతమై యమరునే • యావీడుపట్టింతగా
బరుపై నామది సంశయించెను జగ • త్ప్రాణాత్మజా! జానకీ
శ్వరుఁ డెందుండెనొ తెల్పరాదె? యనుచున్ • సామీరి తానిట్లనున్.

మ॥ వ్రతసంపన్న! మునీశ్వరుండు సురలన్ • బ్రార్థించి కల్పింప స
న్మతిఁ బుష్పాసవ కందమూల ఫల సం • పత్తిం బ్రసేవించి నో
ర్లతిమాత్రంబుగ నార్పలేని గతిచే • నట్లుండెఁ గాదేని సి
ద్రితమై యుండఁగఁబోలు నిక్కముది చిం • తింపంగ నీకేటికిన్? ౧౬౮౩

—: గుహుఁడు రాముం గానవచ్చుట :—

ఉ॥ కన్నులపండువై తనరఁ • గాంచెదు రాముని రాక నిప్పుడే
పన్నుగ నందు సాంత్వనము • పల్కఁగ నచ్చట మానివిందు నా
పన్నజన ప్రసన్నమతి • ప్రాఁతిగ మిత్రులఁ గోడఁ దృప్తిమైఁ
గొన్నతరిన్ గుహుండు కను•గోఁ జనుదెంచెను గొప్పసేనతో. ౧౬౮౪

ఉ॥ వచ్చి మనంబు కన్నులును • వాఁచిన పోల్కిని గాంచి కాంచి పై
నిచ్చఁ బ్రదక్షిణించి రహి • యించి పదంబుల వ్రాలి రాముఁడున్
గ్రుచ్చి కవుంగిలించుకొని • కూరిమి మీఱఁగ క్షేమవార్తలన్
మెచ్చుగఁ బ్రశ్న సేయ రఘు•వీరుని జూచి గుహుండు ప్రీతిమై. ౧౬౮౫

ఉ॥ వారక దానుపై భవద • పార కృపారస దృష్టి గల్గుచో
దార సుతాదు లాదుకొ యు • దార హితుల్? వెనువెంటనంటి సే
వారతి నున్న లక్ష్మణుని • భాగ్యము నోచని దుర్భగుండ నా
కారయ క్షేమసంపదల • కంతముగల్గునె? రాజసాంతకా! ౧౬౮౬

మ॥ అని చింతించు గుహుం గనుంగొని ఘన • శ్యాముండు రాముండు తో
ట్టిన ప్రేమంబున నీవు నా భరతుకం • టెన్ జూడ వేఱయ్యెదే?
ఘన సౌఖ్యంబులు గల్గుగాత మన నా • శైవర్తకస్వామి భ
క్తిని భూజాతకు లక్ష్మణాఖ్యునకు బ్రే • క్కన్ వారు దీవింపఁగన్.

తే॥ గుహుని రవిసుతాదులకుఁ బె♦న్గూర్మిఁ జూపి, యితఁడు మన స్నేహితుఁడు జీవ♦హితుఁడు గాంగ
హాములకు జేఁడు గుహుఁడను♦పుణ్యచరితుఁ, డనుచుఁ దెలుప నెల్లరుఁగొని♦యాడిరతని.

క॥ ఎల్లరు నిష్టాగోష్ఠిగ, నుల్లాసంబునను కలిసి♦యుండఁగ రవి రం
జిల్లెను పడమటికొండన్, ఫుల్లాబ్జాక్షుఁడు స్వకృత్య♦ములఁ దీర్చికొనెన్. ౧౯౬౯

తే॥ సీతతో రామచంద్రుఁడు♦సెజ్జఁ జేరె, గుహుఁడు సౌమిత్రియును కపి♦కోటి దనుజ
నికరమును పరివేష్టించి♦నియతినుండఁ, బెల్లు మాటల ఘల్లునఁ♦దెల్లవారె. ౧౯౭౦

శా॥ పంకేజాక్షుఁడు కాల్యకృత్యముల ని♦ర్వర్తించి మౌనీంద్రు మో
దాంకంబైన యనుజ్ఞగైకొని విమా♦నారూఢుఁడై యోగి ని
శ్శంకప్రేమమయాంతరంగుఁడగుచున్♦సాగింప వెన్నంట నా
తంకంబేమియు లేక వెళ్ళెడియె మి♦త్రవ్రాతముల్ గొల్వఁగన్. ౧౯౭౧

తే॥ పుష్పకంబు శీఘ్రంబుగఁ♦బోవుచుండఁ, జందమైన శిల్పంబుల♦నందమొంది
యింద్రపురి ధిక్కరించుచు♦నెసఁగు స్వపుర, దుర్గ కుడ్యముల్ కనులకుఁ♦దోఁచెఁదనియు.

తే॥ అనఁగులంగని వర్ణింప♦నలవికాని, యశమునొందిన సూర్యాన్వ♦యాధిపతుల
రాజధాని కానఁగవచ్చె♦రాజిలంగఁ, గాంచుఁడన లేచి కేల్మోడ్చి♦కాంచినారు.

—: భరతుఁడు శ్రీరామాదులం గాంచుట :—

తే॥ గగనమందు పెక్కురు దివా♦కరులకాంతి, గలిగి వెలుఁగు విమానంబు♦కానఁబడఁగ
నదిగొ వచ్చె రాఘవుఁడని♦యాంజనేయుఁ, డలరి కేకలువైచి ప్రజ♦కెల్లలకుఁ జూపె.

గీ॥ కమలాక్షుఁడు కపిసేనయుఁ, గమలవదన లక్ష్మణుండు♦కన్నులు తనియన్
బ్రమదమున నేగుదెంచిరి, తమిఁ గనుమని చూపె భరత♦ధాత్రీశునకున్. ౧౯౭౨

ఆ॥ ఎల్లలోక వాసు♦లెక్కనఁ జోటింత, యొనరునదియు సాటి♦యొనరనిదియు
జిగి దిశాంతములకుఁ♦జిమ్మునదియునైన, పుష్పకంబు గాంచె♦భూరియశుఁడు.

తే॥ మేరు గుహను మెఱుముతోడి♦మేఘు భాతి, పుష్పకమున జానకితోడ♦భూవరుండు
కానరాఁ గాంచె భరతుండు♦కన్నవారి, కలకలము లేచి లంగను♦కడచిచనిరి.

ఉ॥ స్నాయు వసా వికార మలి♦నమ్మగు దేహము వీడి సత్యమున్
బాయక కోరి విష్ణుభువ♦నంబు భజించిన తండ్రిఁ గాంచు నా
తోయమునొంది కానలకుఁ♦దూలిన ప్రాణమువంటి యుల్లస
త్తోయజనేత్రుఁ గాంచె భర♦తుండు కుతూహలియై గహించుచున్.

తే॥ దోవుపోయిన వస్తువు♦దొరకినట్లు, పెతలు దొలఁగంగ సమ్మోద♦వివశుఁడగుచు
భువనవంద్యునకుం గేలు♦మోడ్పఁదలఁచి, భరతుఁడప్పుడు పావని♦కరము వీడె.

క॥ హనుమంతుఁ డప్పుడు గగన, మ్మున వచ్చి విమానమునకు ◆ మున్నుగఁ జని రా
మునకుఁ బ్రియమ్ముగ వందన, మొనరిచి యిట్లనియెఁ బ్రేమ◆ నొదిఁగి నిలుచుచున్.
ఆ॥ వచ్చెఁ బడఁగనున్న ◆ భరతుని జేరి నా, జాడ దెలిపి సాహ◆సంబు మాన్పి
మెల్లరకును మోద ◆ మొనఁగించితిని వారు, వచ్చి రనుడు ధాత్రీ ◆ వరుఁడు నలరి.
ఉ॥ మారుతి! దుర్భరంబులగు ◆ మాయెడరుల్ బహుళంబులయ్యు నీ
వారని సత్కృపామతి ని ◆ వారణచేసిను మాతపఃఫలం
బీ రహిఁ నీస్వరూపమున ◆ నేడ్తెఱవచ్చి తొలంగఁడోలె నీ
పారము లేని మేలునకుఁ ◆ బ్రత్యుపకార మొకండు గల్గునే! ౧౭౦౨
చ॥ నిరతము తోడునీడయగు ◆ నిన్నును నాతలిదండ్రులం గృపా
కరధిని లక్ష్మణున్ భరతుఁ ◆ జయ్యన నొక్కొకమాటలోనఁ ద
ద్గురుగుణ సంపదల్ దెలుపఁ ◆ గూడున? సన్నుతశీల! దానవ
ద్విరద మృగేంద్ర! మేరు సమ ◆ ధీర! మనీషి తపఃఫలాకృతీ! ౧౭౦౩
తే॥ ప్రథితగుణుఁడు రాఘవుఁ డిట్లు ◆ పలుకుచుండఁ, గొడుగులఁ దలఁదాల్చిన ◆ పావనుండు
వ్రతములం గృశియించిన ◆ వాఁడు శీలు, మోద్పుగలవాఁడు భరతుఁడు ◆ మొనసి దాసె.
తే॥ తల్లి గుణములకుం బగ ◆ దాయ కోస, లమ్మునేలిన యేలిక ◆ తమ్ముగుట్ట
వచ్చెఁ గనుమని చూపె శ్రీ ◆ వల్లభునకు, ధర్మములకెల్ల సాక్షిగాఁ ◆ దనరు వాని
క॥ కాంచిన రాముఁడు దశరథుఁ, గాంచిన తటినొందు కౌతు◆కంబును పొందెన్
మించి తనమేను పులకల, నించెన్ గనుదోయి జలము◆నించెను తోడ్తోన్. ౧౭౦౪
క॥ కాంచెద జనులఁ బౌరుల, సంచితులన్ గురుల బాంధ ◆ వావళినెల్లన్
గాంచెదఁ గాకని మనమున, నెంచిన యంతన విమాన ◆ మిలకుం దిగెనోన్.
క॥ క్రిందికి దిగిన విమానం, బందఱుకును పుణ్యఫలము ◆ లందింపంగా
బృందారక లోకమునకు, నొందం గొని చను విమాన◆మో యన నొప్పెన్.
సీ॥ ఎడపడియున్న ప్రే◆మెనయ గోవును దాయు, వలనుగాఁ గన్నతే◆ల్లులకు నొప్పు
మాయ నీఁగిన వారి◆మనము లయించు జ్యో, తియావమునఁ దప◆స్వితుల కొప్పు
వ్యాధిచే నీఁగిన ◆ ప్రాణముల్ మరల వ, చ్చినపోల్కి గోసల◆జనుల కొప్పెఁ
గన్నవారలకెల్లఁ ◆ గన్నతల్లిగ నొప్పె, మగువలకు మధువు◆వగిది నొప్పె
తే॥ భరత శత్రుఘ్నులకుఁ గను◆పాపలట్లు, ప్రేమగలవారలకు సురా◆మృతము కరణి
నొప్పె నప్పుడు తముఁబాసి◆యున్న రామ, భద్ర నాగమనము కను◆వందు వగుచు.
ఉ॥ రాముఁడె జీవనైజ తనరు ◆ రాజ్యమునందు నయోధ్యయందు రా
మామణులున్ జనంబులును ◆ మానిత శుద్ధ మనోజ్ఞ భావ సు
స్థేమము బొందినారు నర ◆ సేవ్యుని రాకను హేమవృత్తి కా
ప్రేమము జీవ మొందు క్రియ ◆ శోభిలినారు ముదంబు పెంపునన్. ౧౭౦౫

తే॥ చందనముగందవాఁడియుఁబు-ష్పములువెన్న,తురగఫేనంబుగజమద-తోయములును
మోద బాష్పముల్ గలిసి స♦ముద్రజలము, పగిది నుప్పొంగఁ బ్రవహించె♦వసధిఁ జేరె.

చ॥ ధరణిజ డిగ్గఁ బుష్పకము ♦ తల్లులు తమ్ము లరుంధతీవిభుం
డురవుగ నెక్కినంతఁ బురు ♦ షోత్తముఁ డష్ట వసిష్ఠు పాద పం
కరుహము లంటఁ బ్రొక్కఁ దమ ♦ కంబున నాతఁడు లేవనెత్తి యా
దరమునఁ బెక్కుమార్లు తన ♦ దప్పి యెడంగఁ గవుంగిలింగొనెన్.

చ॥ పదపడి లక్ష్మణుండు పద ♦ వందనముం బొనరింప దీవనల్
ముదమునఁ జేయుచున్ శిరము ♦ మూర్కొన జానకి వచ్చి మ్రొక్కఁగా
సదయుఁడు సర్వసౌఖ్యము లె ♦ సంగుతమంచు వచించెఁ బ్రీతి గ
ద్గదిక రవంబుతోడఁ బుల ♦ కమ్ములకుం గులకమ్ముగా నొసల్. ౧౭౧౩

మ॥ తొలుతన్ రాముఁడు కైకయంఘ్రులకు సం ♦ తోషంబుతోఁ బ్రొక్కి య
వ్వలఁ దక్కంగల తల్లులం దెలవ న ♦ వ్వారల్ మహోత్కంఠతోఁ
బలుమాఱుల్ తల మూరుకొంచుఁ దనువుల్ ♦ గాఢంబుగా దువ్వుచున్
జెలఁగన్ మోద జలాభిషేచనము తు ♦ ష్టిం జేసి రప్పట్టునన్. ౧౭౧౪

మ॥ పొలుపొందన్ ధరణీతనూజయు యథా ♦ పూర్వంబుగా వారికిం
దెలవన్ మా కులదీపమంచుఁ బొదువన్ ♦ దీవించి రావెన్కఁ ద
ల్లులకున్ లక్ష్మణుఁ డర్థిఁ బ్రొక్కఁ దనువుల్ ♦ పూరింప నొక్కండవే
జలజాతేక్షణు తమ్ముఁడైతివని రా ♦ శంసించి దీవించుచున్. ౧౭౧౫

సీ॥ పాదుకలను తన ♦ భక్తిని గానుక, గా సమర్పించి త ♦ ద్ఘన పదముల
వ్రాలిన భరతుని ♦ పోలంగఁ గని రాము, విభుఁడు మిక్కుటమగు ♦ వెత గదించి
నాల్కయెండఁగ నొక్క ♦ పల్కని వచియింప, నేరక నిశ్చేష్టు ♦ నిలిచి తనువు
ప్రాణంబు లొకటగు ♦ పగిది బిగ్గఁ గవుంగి, లించి మిక్కిలి పల ♦ వించి సోలి

తే॥ యశ్రుధారల చేత సో♦రడఁగఁ దిరులు, గట్టి దూసి శ్రమ్మిన జడల్ ♦ వట్టితడవి
శిరము మూర్కొని వీపును ♦ చేరు పొదవు, చందముననుండెఁ దనియక ♦ చాలతడవు.

చ॥ వినుత మహేంద్ర భోగ పద ♦ విం దృణకల్పముగాఁ ద్యజించి వ
న్మునివరవేష చర్యలను ♦ పూని యశంబు గడించు తత్పవి
త్రుని చరణాంబుజంబులకు ♦ మ్రొక్కెను భక్తిని లక్ష్మణుండు త
ద్ఘన పదరేణువుల్ శిరముఁ ♦ దాఁకి పవిత్రత గూర్ప నొయ్యనన్.

చ॥ వనముల నగ్రజన్ము పద ♦ వారిజముల్ భజియింపఁ దోడుగాఁ
జని శ్రమకోర్చి నిద్రయును ♦ చక్కియుఁ జేరఁగ నీక త్రోచి జీ
వనముల నప్పగించి వసి ♦ వాడిన మేనిని దీర్ఘబాహులం
దనువుగఁ గౌఁగిలించె భర♦తాఖ్యుఁడు దేహము పావనంబుగాన్. ౧౭౧౬

మ॥ దురితధ్వంసియుఁ జిన్నతమ్ముఁడగు శ ♦ త్రుఘ్నుండు సీతాపతీ
శ్వర సౌమిత్రుల పాదపద్మములు శీ ♦ ఘ్రంబంటఁగా మ్రొక్క వా
రనుజాఁ బ్రేమను కౌఁగిలించికొని ♦ మి త్రాస్రంబులం జార్చి ని
ర్భర మోదంబున నల్వురుం బొదలి రా ♦ ర్ద్రీభూతమైన చిత్తంబులన్.

మ॥ జనకక్ష్మావిభు పుత్త్రికిన్ ♦ భరతుఁడున్ శత్రుఘ్నుఁడున్ మ్రొక్కఁగాఁ
దనుఁ దావచ్చిన శీర్షకంబు తోలఁగం ♦ దాటించు శీర్షంబు న
ట్టన ముల్లోకములం జయించు దనుజా ♦ ధ్య క్షాపార్థనంద్రోచు తా
ల్గు నొక్కొండొండు స్పృశించి పావనత పొ ♦ ల్పుం బొందె ధన్యంబులై.

చ॥ విమలుల మార్యపుత్త్రక వి ♦ భీషణ జాంబవ దంగదాదులన్
క్రమముగఁ జూప వారలు భ ♦ రంబగు భక్తి నమస్కరించి రా
సుమహితచిత్తులన్ దనుజ ♦ సూదను తమ్ములు ప్రేమ మీరఁగా
సముచిత రీతులం దనియ ♦ సత్కృతులం బొనరించి రర్థిలన్.　౧౭-౨౧

చ॥ సచివులు దండనాథులును ♦ సంగడికాండ్రు రా సుమంత్రకుం
డచటికి వచ్చి సమ్మదము ♦ నంగద పౌరోనరింప మ్రొక్క యీ
యచలకు భారమై తోడరు ♦ నావద శోధిక నంచుఁ బల్కఁగా
నుచిత విధమ్మున న్నరవ♦రోత్తముఁ డాదృతిఁ గాంచె వారలన్.　౧౭-౨౨

ఆ॥ సేనలెల్ల వచ్చి♦సేవింప నందఱుఁ, బుష్పకంబులోనఁ♦బొలుపుమీఱ
నిలువుఁడనఁగ వచ్చి♦నిలిచి లక్ష్మణునకు, భూమిదేవి సుతకు♦మ్రొక్కినారు.

చ॥ విరుల నరంబు లెల్లెడలఁ ♦ బ్రేలు విమానము దూఁడఁ బంకజో
దరు నుదరంబొ వార్ధి యమృ ♦ తంబులఁ గ్రోలు నగస్త్యు దొడ్డయౌ
కరతలమో సమానమగుఁ ♦ గాదని ఖేచరు లబ్రమందుచున్
విరులను చల్లినారు రఘు ♦ వీరుని కీర్తి నుగ్గడించుచున్.　౧౭-౨౪

సీ॥ భేరి రావములు శం♦ఖారావములు ప్రబోవ్వాగ, గాహళరవంబు గ♦జాశ్వరవము
కాహళధ్వనులు మం♦గళ నినాదంబులు, భూనభోంతరములు♦బోరు కలఁగ
నంబుధి ఘోషంబు♦డంబు విడంబించి, శేఖుల రవముతో♦లీనమయ్యె
మహిత విమానంబు♦రహిఁ జెచి యటనుండి, సాకేతపథమున♦సాగుచుండె

తే॥ యవనితోడను భూజను♦లమరపురికిఁ, గదలు పగిది శక్రుండు స్వ♦ర్గంబుతోడ
నిలకు వచ్చుచందంబున♦నెనసి వెలసి, పౌలుపుతోడ నందిగ్రామ♦మునకు వచ్చె.

—: ఇట శ్రీరామ పట్టాభిషేక పటలము :— (౪-౨)

మ॥ స్థిరశీలుండగు రామచంద్రముఁడు నం ♦ దిగ్రామమునం జేరి ము
న్నురమై యున్న జటాభరంబు లట నా ♦ యుమ్మక్కర్నచే నూడ్చి భూ

వర వేషోచిత మండనంబు లిరవా ♦ ప్పం దాల్చి రత్నద్యుతిన్
బురుహూతుంబలెఁ బొల్చెఁ దమ్ములు లస ♦ ద్భూషాలిచే శోభిలన్.

శా॥ ఆకాశస్థలి నంటి నిక్కి ధ్వజ వ ♦ స్త్రాంచ త్కరాబ్జంబులన్
సాకేతంబున కేగు దెండనుచు నా ♦ నం బిల్చు చందాన న
స్తోక ప్రాభవ మండిత ప్రభలతో ♦ శోభిల్లు స్వారోహ్యకున్
శ్రీకంజాక్షుఁడు చేర నెక్కె రథమున్ ♦ శ్వేతాశ్వ సంయుక్తమున్.

తే॥ తామరుగాలక్ష్మణుఁడు తెల్ల♦గొడుగుఁ బూనఁ, జామరంబుశత్రుఘ్నుండు♦చాఁచివీవ
దివిరి భరతుఁడు బంగారు♦ తేరు దోల, నుత్సుకుండయి రాముఁ డ♦యోధ్య కేగె.

ఉ॥ వానరనాథుఁడున్ దనుజ ♦ వర్యుఁడు భద్ర గజాలమీఁద స
మ్మానిత రీతి నెక్కి యిరు ♦ దైసఁ జనుదేరఁగ నంగదుం డనం
తానత జనంబు నందదుల ♦ నారఁగఁ బాపుచు ముందుపో హనూ
మానుఁడు వెంబడించెను న♦మంచితభక్తి భజించి కొల్వఁగన్. ౧౭౨౯

చ॥ సముచిత గౌరవంబులకు ♦ స్థానములైన మనుష్య రూపముల్
ప్రమదముతోడఁ దాగొని ♦ సు ♦ వాసిత చందన గంధ ఘుమఘుమల్
గమియఁగ వానరుల్ హరుల ♦ గంధగజంబుల మీఁద నెక్కి స
క్రమముగ ముందు వెన్కలను ♦ ప్రక్కల నేగుచునుండి రొయ్యనన్.

చ॥ ద్విరదములన్ బసిండి మణి ♦ తేరులఁ దేజుల నెక్కి ఛత్ర చా
మర విభవంబుతోడ నృప ♦ మాన్య కిరీటములోడ నొప్పి భూ
వరు లెనమండ్రు మంత్రులును ♦ భక్తిని మూకల నిల్చి కొల్చుచున్
నరస మృదూక్తులన్ హిత య ♦ శస్కర వార్తలఁ బల్కుచుండఁగన్.

చ॥ కపికుల కామినుల్ విబుధ ♦ కాంతల రూపము లొంది నిల్చుల
చ్చపలలభంగి హస్తినులఁ ♦ జక్కని గోడిగ లెక్కి చుట్టి రా
విపులకుమారి రిక్కగమి ♦ వెల్గు నిశాకర బింబమో యనన్
దిశురులు గట్టు కాంతులను ♦ దేజరి యేగె విమానమందునన్. ౧౭౩౨

చ॥ ఖచరులు మానులుం బరమ ♦ కౌతుకమందఁ బ్రసూన వర్షమున్
బ్రచురము గాఁగఁ జింద ధర ♦ స్వర్ణ లతాంత మయంబ యౌట నా
యచల వసుంధరాఖ్య యట ♦ సార్థకమై తనరారె రాట్కృపా
విచలిత దృష్టి హేమమయ ♦ వృష్టిఁ బ్రవాతమునర్చ నిల్లునన్. ౧౭౩౩

ఉ॥ వెన్నెల కాలమందొనరు ♦ పీత జలంబగు వారిదంబు నా
వెన్నఁగ నిన్నినాళ్లు మద ♦ మింతయుఁ గార్పని వారణావళుల్

మున్నని రాకఁగాంచి తమ ♦ మక్కువ లోపల నిల్పఁజాలమిన్
బ్రన్ననఁ బ్రోచికొంచు వెలి ♦ వచ్చెనొకో యనఁ గాన్చె నర్తితిన్.

ఉ॥ మూఁగలు మాటలాడు క్రియఁ ♦ బోఁడిమి హేమలొనర్చె వార్వముల్
బాగుగఁ బుష్పవాటికలు ♦ పల్లవితంబులు పుష్పితంబులై
మేఁగెను పువ్వుఁబోండ్ల యెల ♦ మేనులు బంగరు రంగుమీఱె నా
మాగమ మొప్ప ధాత్రిని చ ♦ రాచర కోటికి మోద దాయిదై.

ఉ॥ రాజ్యము నేలఁగాఁ దగిన ♦ రాముఁ దయోధ్యను జేరి తల్లులన్
బూజ్యుల మ్రొక్కి వేల్పులకుఁ ♦ బూజ లొనర్చి వసిష్ఠు నాజ్ఞనుఁ
బ్రాజ్య ధరాధిదేవియును ♦ పద్మ నివాసిని యుల్లసిల్లఁగా
భోజ్య పదాన్పదంబయిన ♦ భూపతి పార్శ్వముఁ గాంచె నయ్యెడన్.

చ॥ వలువలు వీడఁ జూడకయు ♦ భామలు ధీరులు జాఱుచున్న దు
వ్వలువల మాటిమాటికిని ♦ వారక వీడక చెక్కుకొంచు మే
నులు గమనింపనైరి తమి ♦ నూల్కొన నానవమాని చొక్కుచున్
వలువలు జాఱఁగా జరగు ♦ బాగున నొప్పిరి చూచువేడుకన్.　౧౭౩౭

ఉ॥ తొందరచే భుజిమ్యకల ♦ దువ్వలువల్ నృపతుల్ ధరించుచున్
జందనగంధు లుద్భు తెలి ♦ చల్వలు పూరుషరాజి కాల్చుచున్
గ్రందుగనున్న గుంపునఁ జొ ♦ రం గలపంబు లలందకున్న నం
దందొరయుంగ నిమ్నడిగ ♦ నండె శరీరము లా జనావలిన్.　౧౭౩౮

ఉ॥ రామ వియోగమైన తఱి ♦ రాములు మోద విహీనలై సదా
నోములు నోచుచుం బతి వి ♦ నోదము లొందకయుండు వారలున్
రాముని రాకతో శుభ క ♦ రంబగు భామలచేత మేనులన్
భామలు దాఁచినారు తమ ♦ భర్తల చిత్తము పల్లవింపఁగన్.　౧౭౩౯

తే॥ సుర కలాపంబుతో మను♦జుల కలాప, మొరసికొనుటచే నర జీవ♦తరుణులకును
పతులు దాసిన తటినొక♦కతము కనని, యలుక పొడమె భర్తలమీఁది♦యరమరికను.

చ॥ భరతుని గాంచి రాఘవుఁడు ♦ పావన శీలుని సూర్యపుత్త్రుఁ గ
ద్భురపతిఁ దక్కువారలను ♦ మోదముతోఁ గొనిపోయి యిందు చి
త్త్రరువులఁ జిత్రదృశ్యములఁ ♦ దన్పుగఁ జూపు మనంగ నాతఁ డ
త్యుయుతర గౌరవంబున మ ♦ హోత్సుకతన్ గొనిపోయె లోనికిన్.　౧౭౪౧

—: సుగ్రీవాదులు నగరునందలి చిత్రదృశ్యములఁ గాంచుట :—

తే॥ మిత్రవర్గంబు వెంటరా♦మిహిరకులుఁడు, పెక్కు కక్ష్యలు దాఁటి గం♦భీరముగుచు
మేరువుంబోలె విలసిల్లి♦శ్రీరహించు, సద్మమైన శుద్ధాంతంబు♦నరగఁ జొచ్చె.

చ॥ రవిజ విభీషణాదులు సు • రత్న మయూఖచయంబు లెల్లెడన్
బ్రవిమలకాంతులన్ వివిధ • భంగులఁ జిమ్ముటచే భయంబునం
దవిలి మనంబు భావములు • తత్తతిలం దడఁబాటు నివ్వెరన్
దివ్వెల భజించి మొదుపడి • మొగలి తెవ్వఁ నార్పరెరటన్. ౧౭౪౩

చ॥ హరియురమందు రాజిలు మ • హామణియట్లు వెలుంగు సౌధమున్
వరగొని కాంచి యుర్వ రిది • వేడ్క సృజించిరొ గెల్పునే యనన్
భరతుఁడు కుక్షితంద్రికిఁ ద • పఃఫలమై చను మున్ను దింపునన్
సరసిజ సంభవుం డొసఁగు • సౌధ వరం బిది నాఁగ వారలున్. ౧౭౪౪

తే॥ కమలవాసిని కిది మేటి • కాణయాచి, వర్ణనము సేయు మాహేఁటి • వారు వలఁతు
లగుదురే ? యని శిల్పోద్భ • యవలనున్న, మండపము చూడఁ బోయిరి • మందగతుల.

తే॥ రావణానుజాదులు సౌధ • రాజ మహిమ, వినుతి సేయుచు నుండఁగ • వినయుతుండు
శ్రీరఘూత్తము పట్టాభి • షేక దినము, నరయుకుండు లేలోకొ యని • భరతుఁ డడిగె.

తే॥ వార్ధుల జలంబు బహుపుణ్య • తీర్థజలము, వచ్చి చేరుట నీనాఁటి • పగిదె యనుచు
భరతుఁ డాడఁ గపీంద్రుండు • వాయుపుత్త్రు, డేమి గాంచుగంగ నతండు • భూమి దాఁటె.

తే॥ కులగురుని తక్క ఋషులను • పిలువుమనుచు, భరతుఁ డనఁగ సుమంత్రుండు • వరగ వేగి
శిష్య మిత్రబృందముతో వ • సిష్ఠుఁ డోడఁ, బిలుచుకొనివచ్చెఁ దత్సభా • సలయమునకు.

శా॥ భక్తిం గైకనుతుండు మౌనికి నమో • వాకంబు లర్పించి న
న్ముక్తుం దమ్ముని ప్రేమమైఁ దిరముగా • భూదేవి శ్రీదేవియున్
రక్తిం జెంద మహేంద్రుచందమున శ్రీ • రాముండు పట్టంబు నం
నక్తిం బొందఁగ రేపె గల్గు శుభమూ • సాదించు లగ్నంబనన్. ౧౭౪౯

కం॥ సురగురు నమునా తాపస, వరులును రామాభిషేక • భావ్యలగ్నం
బిరవుగ స్వర్ణాక్షరముల, విరచించిరి లేఖ లవని • విభులకు నంపన్. ౧౭౫౦

కం॥ దూతలు త్రిలోకవాసుల, కాతతమతిఁ జెప్ప వినియ • యందఱు నిలువం
జేతము లొల్లమి వచ్చిరి, ప్రీతిన్ వారలను లెక్క • పెట్టఁగ వశమే ? ౧౭౫౧

తే॥ అల వసిష్ఠుతో భరతుఁడు • నర్కసుతుఁడు, రావణానుజుఁ డంగద • ప్రముఖ నిఖిల
దనుజ భల్లూక వానర • మనుజవరులు, కలిసి శ్రీరాము సౌధకుఁ • గడఁకఁ జనిరి.

కం॥ పట్టాభిషేకమునకున్, నట్టన శుభదినము రేపె • నియమిత విధులన్
బట్టుగఁ జేయుము దశరథు, పట్టీ ! యని గురుఁడు తనదు • భవనము చేరెన్.

కం॥ నలువ పనుప మయుఁడు శుభా, కలనమునకు రాఘవేంద్రు • గౌరవమునకున్
వలసినలలి లోకోత్తర, లలితచతుర మండపం బ • లంకృతి చేసెన్. ౧౭౫౪

తే॥ హరి నిశాచర సామంత♦వరులు బలసి, రామకృత విక్రమములు కీ♦ర్తనము సలిపి
గొలువ రాముఁడు సకల స♦ద్గుణ గణాఢి, రాముఁ డప్పోళఁ బట్టాభి♦రాముఁడయ్యె.

ఉ॥ శ్రీయును భూమియుం జెలఁగు ♦ శ్రేష్ఠ భుజాండగు రాఘవుండు నం
. శ్రేయము లుల్లసిల్లఁగ † వ ♦ సిష్ఠుఁడు దీవనతోడ నుంచు శో
భాయుత రత్న శీర్షకము ♦ భవ్య ముహూర్తమునందు భద్ర సం
ధాయి ధరించె లోకము లు♦దార ముదంబునఁ దేలియాడఁగన్. ౧౭౬౩

ఉ॥ శ్రీమకుట మ్మయోధ్యను వ ♦ సిష్ఠుఁడు మిక్కిలుచుండు మక్కువన్
రాము శిరమ్మునం దునుప ♦ రంజిలి మూఁడు జగంబులందు ని
ద్రా మది నెల్ల జీవులకుఁ ♦ దత్సరతం దమ నెత్తిమీఁద ను
ద్దామముగాఁగ నుంచిన వి ♦ ధమ్మునఁ బొంగె ముదమ్ము సొమ్ముగన్.

ఉ॥ నోములు చాలకాలముగ ♦ నోచి వదంపడి కోరి యుండు ను
ద్దామ నిడన్ వియోగపడి ♦ తాపము చెంది కృశించి పిమ్మటన్
సేమము నొందు ధారణి వి ♦ శిష్టుని రాముని డాసినంతనే
ప్రేమను దీర్ఘబాహువుల ♦ బిగ్గఁ గవుంగిలిఁ జేర్చె వేడ్కన్. ౧౭౬౪

తే॥ శాస్త్రఘని వసిష్ఠుఁడు తెల్పు♦సరణి రామ, విభుఁడు భరతుని శిరమున♦నిమలమకుట
మూరనిడి పాలనవిధంబు♦లప్పుఁజెప్పి, లీల నిత్య సుఖములఁ దా♦ దేలుచుండె.

౩౯. వీడుకోలు పటలము (౩౮)

తే॥ భూమిదేవికిఁ దొడవగు♦భూరి రత్న, ఖచిత హేమ మండపమున♦నుచిత పీఠ
మందు మెఱుపును మేఘుంబు♦చెందినట్లు, జానకీ రామచంద్రు లా♦సీనులైరి.

తే॥ పూర్వగిరిమీఁది రవివలె♦ముకుటమలర, మెఱుపుకరణిముక్తాహార♦ముఱిది వెలుఁగ,
భువన జీవనదాయి జీ♦మూత భాతి, సింహపీఠిపై వెలసెను♦శ్రీకరుండు.

తే॥ మరకతాద్రిపై వెన్నెల♦మాడ్కి చెలుల, కరములందలి వెల్ల చా♦మరలు కదల
నమర నాగ విద్యాధర♦యక్ష సిద్ధ, సాధ్య గంధర్వ గణములు♦సన్నుతింప.

చ॥ తిలకము గల్గు నెన్నుదురు ♦ తియ్యని జాబిలి తేట వెన్నెలల్
జిలుకఁగ మింటనున్న చలి ♦ చీఁకటి గొంగ దినక్రమంబునన్
బొలుపఱు రావణాద్యసుర ♦ ముఖ్య వినాశక కీర్తి రూపమున్
చెలువున వెల్లవెల్లి విల ♦ సిల్లి శిరంబువయిన్ రహింపఁగన్. ౧౭౭౦

† తిరువెణ్ణెయ్ నల్లూరి జటప్ప వంశీయులగు పూర్వు లందియిఁ గైకొని వసిష్ఠుఁడు రత్న కిరీటము శ్రీరాముని శిరమున నుంచెనని యూలము.

ఉ॥ మంగళ గీతముల్ చెలఁగ ♦ మాన్యుల దీవన లెచ్చరిల్లఁ ద
న్వంగులు పాటపాడుచు ర ♦ సానుగుణంబుగ నర్తిలంగ ని
స్సంగులు నుల్లసిల్ల గుణ ♦ సంగులు మోదమునొంద వాద్యముల్
రంగుగ మ్రోఁగఁ గాహళ వి ♦ రావము పైపయి మిన్నుముట్టఁగన్.

చ॥ రవియును సిగ్గిలన్ వెలుఁగు ♦ రత్న కిరీట విభాసులైన మా
నవపతులెల్ల వచ్చి తమ ♦ నవ్య కిరీట చిరత్న రత్న ప
ల్లవ రుచు లంఘ్రి పంకజ వి ♦ లాస వికాసము వన్నె చిన్నెలం
దవిలి విలక్షణంబగు వి ♦ ధంబున మార్పడ మ్రొక్కుచుండఁగన్. ౧౭౭౨

చ॥ సచివులు చేరికం గొలువ ♦ సైన్యపతుల్ జయశబ్దముల్ సచిం
చుచు వినుతింపఁ దమ్ములును ♦ నూరెల నుండఁగ వంది మాగధుల్
రుచిరముగా యశోబ్ధి లహ ♦ రుల్ విజయాంక వినూత్న గీతికా
ప్రచయముతో నుతింపఁ జెలు ♦ వల్ పఠియింపఁగ మంగళ స్తుతుల్.

క॥ నృపవరులు దనుజవరులుం, గపివరులును పౌరవరులు ♦ కై వారంబుల్
నిపుణత నొనరింపఁగ రహి, విపంచికల వైణికులు ప్ర ♦ వీణత నూపన్. ౧౭౭౪

తే॥ దినకర సుతుండు దానవా ♦ ధీశ్వరుండు, డాసి సేవించి వహి సుచి ♦ తాసనములఁ
గూరుచుండ రాముఁడు నిండు ♦ కొలువు సేయు, చుండు తఱివచ్చి గుహుఁడును ♦
నొక్కమతిని.

తే॥ పులి కళాసంబు దట్టిగాఁ ♦ బూని కత్తి, నడుమునం జెక్కి నావిక ♦ నాయకుండు
పరిజనంబుతో వచ్చి శ్రీ ♦ వరుఁ బ్రదక్షి, ణించి సేవించి యొకవంక ♦ నిలిచె నొదిఁగి.

క॥ కరుణామయుఁడగు శ్రీరఘు, వరుఁడు తనదిటంపుఁ బ్రేమ ♦ వారలపై నుం
దర నుస్మితవిధిఁ జూపుచు, నురవుగఁ బలుకాడి యొసఁగె ♦ నుచితాసనముల్.

తే॥ సత్ప్రవర్తనమున గుణ ♦ జ్ఞానులైన, వార లుచిత వాక్యజ్ఞులు ♦ ధీరవరులు
నిఖిల నీతిఁ బ్రవీణులు ♦ నీరజాక్షుఁ, గొలిచి తమతమ నేర్పుల ♦ వెలువరింప.

క॥ నరపతులును రక్కస పస, చరపతులును దనుజపతులు ♦ సరసిజనేత్రున్
స్థిరభక్తిఁ గొలిచి తొలఁగక, జరపిరి తేరిగ వేడ్కఁ ♦ జన రెండు నెలల్. ౧౭౭౬

ఉ॥ కారణజన్ముఁడైన రఘు ♦ కాంతుఁడు లోకము సంతసింప నీ
తీరున గద్దెపైఁ గొలువు ♦ తీరి ప్రియంబున వచ్చియున్న య
వ్వారల గౌరవించి పను ♦ పం దలపోసి పశుప్రజంబు బం
గారము క్షేత్రముల్ మణి ని ♦ కాయము మొసంగెను విప్రకోటికిన్. ౧౭౮౦

క॥ వలసినవి వలసినంతగ, వలచిన యాచకజనంబు♦పరిమోదమునం
దేలఁగ నొసఁగి పదపడి భూ, పుల రమ్మనికోరె రాఘు♦వుఁడు ప్రియమారన్.

క॥ హరులును శిబికలు తేరులు, కరులును మాన్యములు రత్న♦కాంచన భూషాం
బరము లవారిగఁ గానుకఁ, బెరిమను మన్నించి పిదప♦వీడ్కొలొసఁగెన్.

క॥ శంబర మర్దనునకుఁ దా, నింబుగ జనియించు వేళ♦నింద్రుఁ డొసఁగు ర
త్నంబుల కడెములతోఁ జీ, నాంబర తురగాదు లొసఁగె♦నర్క సుతునకున్.

క॥ మును కమలాసనుఁ డిత్వా, కున కొసఁగిన యంగదములఁ♦గొమరుగఁ దన పే
రును సార్థపఱుప నెంచెనొ, యనఁగ నొసఁగె నంగదునకు♦నధికప్రేమన్. ౧౭౭౪

క॥ మఱియును ముక్తాహారము, కరి తురగ స్యందనములు♦కనకాంబరముల్
కరుణించి పిన్నతండ్రికి, నిరవుగఁ దోడగుమ యెల్ల♦యిమ్ముల ననియెన్. ౧౭౭౫

మ॥ ప్రియమారంగఁ గటాక్ష వీక్షణములన్ ♦ వీక్షించి సామీరి స
వ్యయ సాహాయ్య మొనర్చినట్టి ఘను లె♦వ్వారయ్య నీకేవ? నే
దియుఁ గన్పింపదు నీకుఁ బ్రత్యుపకృతిం ♦ దిట్టంబుగాఁ జేయ న
క్షయకీర్తీ! నను గాఁగిలించికొనుమా ♦ గాటంబుగా మారుతీ! ౧౭౭౬

శా॥ మా దేహంబులు నీయవే యనుడు ♦ క్రై మాటించి వాయూసి నీ
యాదేశంబె యుపాయనంబు మఱి యా ♦ లా! బిడ్డలా! నాకు నీ
పాద ద్వంద్వమె చాలునన్న రఘు భూ♦పాలుండు కేయూర హా
రాదుల్ దువ్వలువల్ మతంగజ తురం♦గాఢ్యంబు లర్పించుచున్.

మ॥ తలిరుంబోణి కనర్ఘమైన యొక ము ♦ క్తాదామ మిర్పించి యిం
దుల నెవ్వాని కొసంగ నీమనము సం♦తోషించు నవ్వానికే
లలి నీయం దగు దీవనన్ దన మనకి ♦ న్గాంతిం బ్రమార్జించు క
ర్వలి పట్టింగని యిచ్చె జానకి దయా♦ర్ద్రి స్వాంతయై ప్రక్కసన్.

క॥ రిక్కల కాంతులఁ బైకొని, రిక్కల రాయనికి నుపమ ♦ రీతిఁ జెలఁగుచున్
వాక్కాంత యొసఁగు నాసర, మొక్కఁడు గాకెక్కఁ డొసఁగె♦నురు భూషణముల్.

క॥ కటకములు హారములు దు, ప్పటములు కేయూరములును♦పటు తురగ మదో
త్కట కరుల నరదముల ను, ద్భట వీరుని నలుని బిలిచి ♦ పార్థివుఁ డొసఁగెన్.

క॥ అతులిత భూషల నొసఁగెను, శతబలికి సమూల్యరత్న♦జవనాశ్వములన్
దతమతి కేసరి కొసఁగెను, ప్రతిలేని సువస్తువులను♦వారని కరుణన్.

ఆ॥ ద్వివిద తార నీల♦గవయ జాంబవదాది, వీరవరులఁ బిలిచి♦ప్రియములాడి
వలసినంత కనక♦వస్త్ర వాహనముల, నిచ్చెనిడి కటాక్ష♦దృష్టిఁ జూచె. ౧౭౮౨

తే॥ గుణ గణాంచిత ఖని వి♦భీషణునిగాంచి, కలుషదూర ! నీసములు నీ♦కంటె లేరు
పసిఁడి కినుము సమంబగు♦పట్టునందు, నేని నీకు సమానులు♦గానరారు. ౧౭౯౩

తే॥ అనుచువినుతించిప్రియమున♦సమరులిచ్చు, కటకములుభద్రజాత్యనే♦కపచయంబు
కనక చేలముల్ కాంభోజ♦ఘనతురంగ, ములను కడు సుగంధ ద్రవ్య♦ముల నొసంగె.

తే॥ శృంగిబేర పురీశు నా♦రంగఁ గాంచి, నీకుఁ దెలుపంగ వలసిన♦నియతు లెవ్వి
యనుచు శ్వేతాశ్వ నికరముల్♦కనక రథ చ,యంబు పీతాంబరము లిచ్చి♦నింబుమీఱ

మ॥ హనుమ జ్జాంబవ దంగద ద్వివిద తా ♦ రాది ప్లవంగేశులన్
దినరాజాత్మజుఁ గాంచి పీడుఁడనుచుం ♦ దెల్పం దలఁపంగనై
నను కారానిదె నైన కిష్కపురములన్ ♦ నాగెంబుతో మేలు నం
తనగాఁ గాచుట నాకు ధర్మమగుఁ గా ♦ నన్ వేఁడెదన్ గాపుఁడీ.

మ॥ దనుజాధ్యక్షున కాదటన్ విడలుటే ♦ ధర్మంబుగాఁ దెల్పి మీ
మనముల్ దూరము కావ యంచుఁ బలుకన్ ♦ మన్నించి నైకేయ శ్రీ
శ నిషాదాధిపు లెంతయున్ విడువ ని ♦ చ్ఛన్ లేనివారయ్యు రా
ముని వాక్యంబులు మస్తమం దిడుటయే ♦ ముఖ్యంబుగా నెంచుచున్.

తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్న ♦ ధరణిజాత, లను వసిష్ఠు ముగ్గురు తల్లు♦లను గుణాఢ్యు
రాము రాముని వలగొని♦ప్రణుతిచేసి, సెలవుగొని మరలిరి తమ♦నెలవు సేర.

తే॥ గుహుని శృంగిబేరమ్మునఁ♦గూర్మి విడిచి, యగచరేంద్రుని కిష్కింధ♦యందు వదలి
కర్బురులు పరివేష్టింప♦గగనవీథి, దైత్యపాలుండు తనరాజ♦ధానిఁ జేరె. ౧౭౯౯

సీ॥ మిత్రులఁ బంపి య♦మ్మిహిర కులేశుండు, తక్కు సుహృజ్జన♦తతులతోడ
నీతిమంతుండై య♦నీతిని నద్ధర్మ, హితుఁడయ్యె ధర్మంబు♦నెత్తకుండ
వర్ణాశ్రమాచార♦పరిపాలకుం డయ్యెఁ, దల్లి కూతుఁల నొక్క♦తమిని చూచి
తమ్ములు తన కను♦దమ్ములై వర్తిల్ల, జనులు తండ్రి యటంచు♦జనవుచూప

తే॥ క్షీరసాగరమందున ♦ శేషతల్ప, మందు యోగనిద్రను వీడి ♦ యవతరించి
చెడుగులం ద్రోచి మేలు ర♦క్షించు రామ, చంద్రుఁడేలె జగంబులు♦ చలువనొంద.

మ॥ జగదారాధ్యుఁడు రాముఁడై పుడమిలో ♦ జన్మించి దుష్టాత్ములన్
దగ ఖండించి ధరాతలంబున లన ♦ ద్ధర్మంబు నెక్కొల్పి పూ
జ్యగతిం బొల్చిన జానకీ విభుని స ♦ చ్చారిత్రమున్ భక్తి రాయిం
డఁగఁ బల్కన్ వినినన్ సుఖించి యట మోఁ♦దం గాంత్రుం కైవల్యమున్.

మంగళ మహాశ్రీ

మంగళము రామునకు ♦ మంగళము తమ్ములకు
మంగళము సంతతము ♦ మైథిలికి వేడ్కన్

మంగళము మారుతికి ♦ మంగళము భారతికి
మంగళము నీతికిని ♦ మానమున కెల్లన్

మంగళము భక్తికిని ♦ మంగళము ధాత్రికిని
మంగళము దీని విను ♦ మాన్యులకుఁ బేర్మిన్

మంగళము పాడికిని ♦ మంగళము ప్రేమకును
మంగళము మంగళము ♦ మంగళమహాశ్రీ.

క॥ శ్రీరామచంద్రు చరితము
శ్రీరాము కృపా కటాక్ష ♦ సేవధి బలిమిన్
శ్రీరామ సుకవి వర్యుఁడు
శ్రీరామార్పణముగా ర ♦ చించెను భక్తిన్.

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ విక్టోరియా జూబ్లి ముద్రాక్షరశాల, చిత్తూరు, 20-7-58, ప్ర. 1000.